# ఆధునిక నాటకరంగం
# ఈ దశాబ్ది ప్రయోగాలు
## (1980-90)

(పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుండి
డాక్టరేట్ పొందిన సిద్ధాంత గ్రంథం)

**డాక్టర్ బోయిన వెంకటేశ్వరరావు**

ప్రచురణ
**ఆంధ్ర సారస్వత సమితి**
23-247-12, బచ్చుపేట
మచిలీపట్నం - 521 001

**EE DASABDI NATAKA PRAYOGALU**
By **Dr. BOYINA VENKATESWARA RAO**

Published by
**ANDHRA SARASWATHA SAMITHI,**
Bachupeta
Machilipatnam - 521 001

FIRST EDITION
September, 1998
Copies 1000
Price Rs 150/-

For Copies
**VISALANDHRA**
**PUBLISHING HOUSE,**
Bank Street
HYDERABAD & BRANCHES

**NAVODAYA**
**BOOK HOUSE**
Opp Arya Samaj
Kachiguda
HYDERABAD

Printed at
Sri Kali Printing Works
Main Road, Rajahmundry - 533 101

Cover design
SEELA VEERRAJU

## గ్రంథ స్వీకర్త



## శ్రీ యనమల రామకృష్ణుడు

# విషయ సూచిక

# హార్దిక అభినందనలు



**డా॥ సి. నారాయణ రెడ్డి**
ఎం ఏ , పి హెచ్ డి , డి లిట్ ,
జ్ఞానపీఠ పురస్కార గ్రహీత
రాజ్యసభ సభ్యులు
ఛైర్మన్, ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక మండలి

స్వాభిమానాన్ని కాస్త పక్కకు పెడితే ఆధునిక తెలుగు సాహితీ ప్రక్రియల్లో నాటకరంగం ఆశించిన ప్రగతి అంచును అందుకోలేదనే చెప్పవలసి వస్తుంది ఇది నేను తులనాత్మకంగా అంటున్న మాట నాటకరచన, ప్రదర్శన మిగతాకొన్ని రాష్ట్రాలతో దీటుగా మన రాష్ట్రంలో వికాసం పొందవలసిన అవసరముంది ఐతే ఈ పరిశోధన గ్రంథ రచయిత అభిప్రాయపడ్డట్టుగా గత దశాబ్దంలో ఆధునిక నాటకరంగం తెలుగు నేలపైన అభివృద్ధి పుంజుకోవడం హర్షదాయకం

డా॥ వెంకటేశ్వర రావు గారు తమ పరిశోధన కాలపరిధిని 1980-90ల వరకే సీమితం చేసుకున్నా, వారే అన్నట్టుగా పూర్వాపరాలను కూడా అవసరమైన మేరకు, స్పృశించి చూపారు ఆధునిక నాటకం సోదాహరణంగా విశ్లేషిస్తూ ఆవిష్కరించారు ఆధునిక నాటక రంగంలోని స్త్రీవాద, దళిత వాద ప్రతినిధి రచనలను గురించి, అసంబద్ధ నాటక ప్రక్రియను గురించి నిష్పాక్షిక రీతిలో వివరించారు.

ఎన్నెన్ని విదేశీ నాటకాలకు తెలుగు అనువాదాలు వెలువడ్డాయో ఒక పట్టికగా అందించడం, గత దశాబ్దిలో వెలువడిన నాటికా నాటకాల, నాటక సమాజాల జాబితా పొందుపరచడం తరువాత తరం నాటక రంగ పరిశోధకులకు విలువైన సామగ్రిని సమకూర్చడంగా భావిస్తున్నాను ఈ పరిశోధన గ్రంథం కడదాకా చదివితే తెలుస్తుంది మన ఇటీవలి నాటకరంగం సాధించిన గణనీయ పురోగతి.

ఆధునిక నాటక రంగానికి ఒక అమూల్య పరిశోధన గ్రంథం అందించిన డా॥ బోయిన వెంకటేశ్వరరావుగారికి నా హార్దిక అభినందన

# గణనీయ కృషి



ఆచార్య ఎన్. గోపి

సమకాలీన విషయంపై పరిశోధన చేసి మెప్పించడం చాలా కష్టం ప్రవహిస్తున్న అంశంపై చెప్పే తీర్పులు మార్పులకు లోనయ్యే ప్రమాదంవుంది అయితే ఆ వ్యాసంగంలో తలమునకలైవున్న డా॥ బోయిన వేంకటేశ్వరరావు గారి లాంటి insiders కి ఇది అవలీలగా సాధ్యమయ్యిందని ఈ గ్రంథం చెప్తున్నది

స్వీకృతాంశం లేటెస్టు దశాబ్దానికి సంబంధించింది (1980-90) 'ఆధునిక నాటకరంగం-ఈ దశాబ్ది ప్రయోగాలు' అన్నది శీర్షిక వందేళ్లకుపైగా చరిత్రవున్న తెలుగునాటక రంగానికి ఈ దశాబ్ది కీలకమైంది కాదుగాని భిన్నమైంది, ప్రత్యేకమైందికూడా సినిమాలు తల్లిని ప్రక్కన పెట్టాయి టీవీ ఛానల్స్ మరింత నిర్వీర్య పరిచాయి ఇట్లాంటి సందర్భంలో నటులు, నాటకాభిమానులు ఊపిరినే వేదికగా చేసుకొని ఈ అపురూపమైన కళను కాపాడుతున్నారు సాంకేతికాభివృద్ధిని అనుగుణంగా మలుచుకొని ఆధునిక నాటకానికి ఒక వినూత్నమైన స్ఫూర్తినీ, విలక్షణతనీ సంతరిస్తున్నారు

ఇంతవరకు నాటక విమర్శ గ్రంథాల్లో రెండురకాలవి వున్నాయి నాటకాన్ని సాహిత్యపరంగా వివేచించినవీ, ప్రదర్శనపరంగా విశ్లేషించినవీ రెండోరకం వాటి సంఖ్య తక్కువ ఆ అల్పసంఖ్యాకుల్లో ఈ గ్రంథం గణనీయంగా చేరుతుంది

ఈమధ్య రచయితలు నాటకాలను అచ్చువేసుకోవటంగానీ, ప్రచురణ సంస్థలు అచ్చువేయటంగానీ బాగాతగ్గిపోయింది ఈ పరిస్థితుల్లో వీటిపై వ్యాసంగం చెయ్యాలనుకునేవారికి అముద్రితాలే శరణ్యమవుతున్నాయి వీటిని సేకరించటం ఎంతకష్టమో దిగినవారికే తెలుస్తుంది ఈ సందర్భంగా ఒక సంగతిని

నాటకాభిమానుల దృష్టికి తెస్తాను పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఏటా ఉత్తమనాటకానికి (ఇతర ప్రక్రియల్తోపాటు) పురస్కారాలందజేస్తుంది పురస్కార నిర్ణయం కోసం ముద్రితాలను మాత్రమే పంపాలి కాబట్టి ఉన్నవాటిలో మెరుగైన దానికి అది రావొచ్చు అయితే ఆ మెరుగైనది సాధారణ ప్రమాణాలకు దిగువన కూడా ఉండొచ్చు ఒకటి రెండుసార్లు అలాంటి వాటికి వచ్చాయని నాటకాభిమానులు చెప్పుకోగా విన్నాను తెలుగు విశ్వవిద్యాలయం పాలకమండలి సభ్యుడుగా ఉన్న ప్రముఖ నాటక రచయిత, చలనచిత్ర మాటల రచయిత శ్రీ పరుచూరి గోపాలకృష్ణ (నేనూ ఆ పాలక మండలిలో సభ్యుడిగా ఉన్నాను) అముద్రితాలనుకూడా పురస్కారార్థం పరిశీలనకు స్వీకరించాలని సూచించారు పరుచూరి, నేనూ, మణిలతో కూడిన ఉపసంఘం ఈ మేరకు సిఫారసు చేసింది ఈ సంవత్సరం నుంచి అది అమల్లోకి వస్తుంది ఇదొక మంచి పరిణామం

డా॥ బోయిన ఎనిమిదవ దశాబ్దిలో వెలువడిన 246 కి పైగా నాటికలు, నాటకాలను పరిశీలించి వాటిలోని ప్రయోగ వైశిష్ట్యాన్ని విపులంగా సమీక్షించారు పరిశోధకుడు స్వయంగా నటులవడం, ఔత్సాహిక నాటక సమాజాల్తో సన్నిహిత సంబంధాలుండటం వంటి advantages వల్ల ఈ కృషి మంచి అభినివేశంతో రూపొందింది

స్త్రీవాద, దళితవాద దృక్పథాల్తో వెలువడిన నాటకాలనుకూడా సమకాలీన దృష్టితో పరిశీలించారు రచయిత

I A S ఆఫీసర్‌గా పాలనా సంబంధ వ్యవహారాల్లో తీరికలేకుండా ఉంటూనే తన First Love అయిన తెలుగు నాటకరంగం పైన పిహెచ్ డి చేసి డాక్టరేట్ పొంది నాటక విమర్శ గ్రంథ సంచయానికి మరో పరామర్శ గ్రంధాన్ని జతచేసిన డా॥ బోయిన వేంకటేశ్వరరావు గారిని మరోసారి అభినందిస్తున్నాను

**ఆచార్య యన్. గోపి**

వైస్ చాన్సలర్, తెలుగు విశ్వవిద్యాలయం

# మంగళాశీస్సులు



## శ్రీ ధూళిపాళ సీతారామ శాస్త్రి
స్టేజ్ అండ్ సినీ అర్టిస్టు

సకల కళాకారుల సహృదయ మిత్రులు, కళాభిజ్ఞులు, శ్రీ బోయిన వెంకటేశ్వరావు గారు వ్రాసిన "ఈ దశాబ్ది నాటక ప్రయోగాలు" (1980-1990) అన్న సిద్ధాంత గ్రంథం అమూలాగ్రంగా చదివాను పరమానందభరితుడనయ్యాను

ఒక్క 'కవితాధార' ప్రవహిస్తే చాలు, ఒక మంచి పద్య గ్రంథం వ్రాయవచ్చు. కాని సిద్ధాంత గ్రంథం వ్రాయడం సులభ సాధ్యం కాదు అందుకు బహుముఖ ప్రజ్ఞావంతులై ఉండాలి రచయిత ఒక్కొక్క విషయం సిద్ధాంతీకరించి, నిర్ణయించాలంటే అనేక గ్రంధాల అవగాహన కావాలి పరిశీలన కావాలి తులనాత్మక శల్య పరీక్ష చేయాలి ధారణాశక్తి, ప్రయోగ శక్తి అన్నిటి కన్నా ముఖ్యం

ఎంతో శ్రమించి, ఎన్నెన్నో అవరోధాల నధిగమించి, ఒక దశాబ్ధ నాటక రంగం మీద పరిశోధనాత్మక సిద్ధాంత గ్రంధాన్ని సృష్టించారు మా మిత్రులు డా॥ బోయిన వెంకటేశ్వరరావు గారు, ఐ ఎ యస్

ఇది భావితరం కళాకారులకు బహుళ ప్రయోజనకరం యీ దశాబ్ది (1980-90)లో చోటుచేసుకున్న రచనా రీతి, ప్రదర్శనా శిల్పం, నటనా వైదుష్యం, వాచక విధానం- ఇత్యాది అనేక అంశాలపై చర్చించారు

పాఠకులకు, భావి నటులకు ఉపయోగకరంగా ఉండాలని (1) తెలుగు నాటకం (2) నాటక వస్తు మార్పులు (3) కుటుంబ వ్యవస్థ (4) మహిళా సమస్యలు (5) దళిత వాదం (6) విదేశీ ప్రభావం (7) దర్శకత్వంలో ప్రయోగాలు (8) వీథి నాటకాలు - ప్రయోగాలు (9) నాటక పరిషత్తులు ఇలా నవ ప్రయోగ ప్రకరణాలుగా విభజించి చర్చించారు కథా వస్తువులో తొంగి చూచిన మార్పులను, రచయితల కలాల భావావేశాలను, బాధా తప్త హృదయాలలో పొంగి పొరలిన అలోచనా పరంపరలను, మహిళాలోకపు మహత్తర మానసిక యోచనలను, అతి సునిశితంగా చర్చించారు

అంతేగాదు, పోటీ నాటకాలు, న్యాయనిర్ణేతల నిర్ణయాలు, న్యాయ తీర్పుకు కావలసిన యోగ్యతలు, అర్హతలు, బాధ్యతలు దర్శకుడి పటిమ- అనుభవం, కథా గమనం, రంగాలంకరణ, ఆహార్యం -- అబ్బో! ఒకటా,రెండా? సమస్త విషయాలు సమగ్రంగా చర్చించారు చక్కగా సిద్ధాంతీకరించారు

యీ గ్రంథం ఆధునిక నాటకరంగానికి ఒక పునాది రాయి వంటిది దీనిపైన ఎన్నెన్నో కళాభవనాలను నిర్మించవచ్చును - ఇలాంటి అనర్ఘ సిద్ధాంత గ్రంథం పూర్తి కావడానికి బోయిన వారెంత శ్రమించారో యోచిస్తే భయమేస్తుంది అయన ఒక తపస్సు చేశారు

డా॥ బోయిన వెంకటేశ్వరరావు గారూ! అందుకోండి నా అభినందన పరంపర

కాని ఒక్క సందేహం

బోయినగారూ!

ముక్కంటికి మూడు నేత్రాలు
మానవునకు రెండు నేత్రాలు

యీ కండ్లలో ఏ కన్ను, ఎవరికి ఎక్కువ? అంటే ఇది అని చెప్పడం సాధ్యమా!

ఆంధ్రనాట్య కళామ తల్లికి రెండు నేత్రాలైన, గద్య పద్య నాటకాలలో ఒక నేత్రాన్ని సిద్ధాంతీకరించి రెండవ నేత్రాన్ని విస్మరించడం భావ్యమా?

కడు సమర్థులు మీరు పౌరాణిక నాటక రంగాన్ని కూడా సిద్ధాంతీకరించండి భావితరాలకు తుష్టిని, పుష్టిని కలిగించండి చిరకీర్తినార్జించండి

అందుకు కావలసిన, దీర్ఘాయురారోగ్య ఐశ్వర్య భావ సంపదను నాట్యాధి దేవుడైన శ్రీ నటరాజ స్వామి మీకు తప్పక ప్రసాదిస్తాడు

శుభమస్తు - దీర్ఘాయురస్తు

సమస్త సన్మంగళానిభవంతు

# సాదర శుభాకాంక్షలు

డా॥ ప్రసాదరాయ కులపతి
ఎం ఎ పిహెచ్ డి ,
ప్రిన్సిపాల్ (రిటైర్డు) హిందూ కాలేజి, గుంటూరు
శ్రీనాథపీఠ నిర్వహణాధ్యక్షులు
గుంటూరు

ప్రభుత్వోద్యోగులలో తమ తమ శాఖల పరిపాలనలో దక్షులు, అదక్షులు ఉండుట లోక సామాన్యము కాని సాంస్కృతిక రంగ కృషీవలులు అరుదు వారిలో పి హెచ్ డి పట్టము కొరకై కృషి చేసి సాధించిన వారు మరింత అరుదు శ్రీయుతులు రామేశన్, వేదవ్యాస ప్రభృతుల పట్టికలో ఇప్పుడు బోయిన వెంకటేశ్వరరావు గారు చేరినారు

వీరి తండ్రిగారిని ఆధ్యాత్మిక విద్యా సంపన్నునిగా నేనెరుగుదును వారి సుకృతము వీరి యందు కూడా ప్రసరించు చున్నదని నా విశ్వాసము

ఇంతకును వీరు మంచి నటులు తనఅభిరుచికి తగిన అంశమును పరిశోధన కెన్నుకొన గలుగుట వీరికి గల పదవి - పరిచయముల వలన అయి ఉండును - ఎక్కువగా ప్రొఫెసర్ల ఇష్టములే విద్యార్థులకు పరిశోధనాంశములుగా ఇవ్వబడి - వాటిలో తిప్పలబడుపరిశోధకులధిక సంఖ్యాకులు మొత్తము మీద ఆధునిక నాటక రంగములో 1980 నుండి 90 వరకు జరిగిన నాటక ప్రయోగములను పరిశీలించి అనేక విషయములను వెలికి తెచ్చినందుకు వీరు ఎంతో అభినందనీయులు

పరిశోధనలో ఎన్ని చెప్పినా కొన్ని మిగిలిపోవటం సహజం సమయం, స్థలం ప్రాధాన్యం ఇటువంటి వెన్నో రచనలో పనిచేస్తుంటవి ఉదాహరణకు బోయినవారు సాహితీ రూపకాలెన్నో ప్రదర్శించారు భువన విజయాలు, ఇంద్రసభలు, మొదలైన వానిలో కృష్ణదేవరాయలుగా, ఇంద్రునిగా పాత్ర ధరించారు పాత్రారోపణం ఉన్నది కనుక అవీ నాటకాలే కాని వాటి ప్రస్తావన ఈ పరిశోధనలో చేయబడలేదు బహుశా ఆధునిక నాటక రంగంలో వాటికి స్థానం లేదనుకొన్నారేమో !

ఏదైనా కష్టపడి అనేక విషయాలు సేకరించి చేసిన పరిశోధన యిది నన్నయ నారాయణ భట్టును స్మరించిన విధంగా తనకు సహాయం చేసిన వారిని వెంకటేశ్వరరావుగారు కృతజ్ఞతతో ప్రస్తావించారు ఈ రోజుల్లో అది కూడా ఒక విశేషమే ఇంత చక్కని అనుశీలన చేసినందుకు ఆదరాభిమానాలతో అభినందిస్తున్నాను భద్రమస్తు !



# అథాతో గ్రంథ జిజ్ఞాసా

మాన్యమిత్రులు శ్రీ బోయిన వేంకటేశ్వరరావు గారు చాలా విచిత్రమైన వ్యక్తి అందరూ ఐ ఏ యస్ కోసం అంగలూరుస్తూంటే వీరు పి హెచ్ డి కోసం పరితపించారు సాహిత్యంలో డాక్టరేట్ పొందడం ఐ ఏ యస్ కన్నా గొప్ప అని వీరి అభిప్రాయం ఇది సాహితీరంగంలో వారికి ఆనందదాయకమూ అభినందనీయమూను

ఆరేడు సంవత్సరాలు కృషి చేసి, మధ్యలో వచ్చిన-రావింపబడిన అడ్డంకుల్ని అతిగమించి వీరు ఈ సిద్ధాంత గ్రంథాన్ని రూపొందించారు ఎట్టకేలకు మా తెలుగు విశ్వవిద్యాలయంనుంచి డాక్టరేట్ పొందారు ఇది ఆధునిక నాటకరంగంమీద వీరి కృషి ఆ రంగం ఇటీవలికాలంలో చాలా పరిణతి చెందింది ప్రయోగశీలం మరింతగా బలపడింది విస్తృతీ వైవిధ్యమూ పెరిగాయి నాటకాలంటే వీరికి మొదటినుంచీ అదొక పిచ్చి అంచేత ఆ రంగాన్నే ఎంచుకుని కృషి చేశారు లక్ష్యాన్ని సాధించారు

ఇప్పటికి మూడు దశాబ్దాలుగా బందరులో సాహితీ సమితిని మూడు సభలూ ఆరు సమావేశాలుగా నడుపుతూ విశేష సంచికలు విభిన్న రచనలు ప్రచురిస్తూ తెలుగు సాహిత్యం పట్ల తనకున్న "వ్యసనాన్ని" చల్లార్చుకుంటున్న వ్యక్తిగా శ్రీ బోయిన జగత్ప్రసిద్ధులు ఇప్పుడు అందిస్తున్న ఈ సిద్ధాంతగ్రంథం మరొక స్థిరమైన కృషిగా వీరి కీర్తి కిరీటంలో కలికితురాయి అవుతుందని ఆశిస్తున్నాను

ఈ గ్రంథాన్ని సహృదయ సమ్రాట్ శ్రీ యనమల రామకృష్ణుడు గారికి అంకితం చెయ్యడం భూష్యభూషణ భావానికి తాజా ఉదాహరణ ఈ మంచిపనులు రెండింటిలోనూ నేను నిర్వహించిన బుల్లిపాత్రను బోయినవారు చెబితేనే బాగుంటుంది చెప్పకపోతే ఇంకా బాగుంటుంది సరే

ఇంతకీ ఈ గ్రంధానికి మనం సహపాఠులం అందుకని ముందుగా గ్రంధకర్తను అభినందించి ఆరంభిద్దాం అవసరమైతే అమీతుమీ తేల్చుకుందాం మొగమాటమి దేనికి! అథాతో గ్రంధజిజ్ఞాసా

మీ

**బేతవోలు రామబ్రహ్మం**

15-9-98

# మానవత నిండిన మూర్తిమత్వం



నాటకానికి పూర్వరంగం జీవితం అయితే జీవితానికి అంతరంగం నాటకం! డా బోయిన వెంకటేశ్వరరావు గారి జీవితం నవరస భరితమయి, బహురమ్యమైన నాటకంగా భాసిల్లుతోంది

డా॥ బోయిన 27 నాటకాలు, నాటికలు వ్రాసారు దాదాపు అన్నీ AIR లో ప్రసారమయ్యాయి కొన్ని Simultaneous గా ఆంధ్రప్రదేశ్‌లో విజయవాడ, విశాఖపట్నం, కడప, హైదరాబాదు కేంద్రాల నుండి ప్రసారమయ్యాయి ఇందులో కొన్ని పునఃప్రసారాలుగా కూడా వచ్చాయి చాలా నాటకాల్లో ఆయనే ప్రధాన పాత్రధారి

శ్రీకృష్ణదేవరాయల 'భువన విజయం' సాహిత్య రూపకాన్ని ఆంధ్రప్రదేశ్‌లో ప్రాచుర్యంలోకి తెచ్చిన ఘనత డా॥ బోయినగారికే దక్కుతుంది భువన విజయంలో డా॥ బోయిన శ్రీకృష్ణదేవరాయలుగానూ దిగ్దంతులయిన మహాకవులు అష్టదిగ్గజాలుగానూ ప్రదర్శనలిచ్చారు వీరు డా దివాకర్ల వెంకటావధాని, డా S V జోగారావు, డా ప్రసాదరాయకులపతి, ప్రభాకర శ్రీకృష్ణ భగవాన్, డా ధారా రామనాథశాస్త్రి, కరుణశ్రీ, రాజన్నకవి, మొవ్వ వృషాద్రిపతి ఈ ప్రదర్శనలు, విజయవాడ, గుంటూరు, విశాఖపట్నం, హైదరాబాదు ఇత్యాది ప్రదేశాల్లో జరిగేయి ఈ ప్రదర్శనలతో డా బోయిన అభినవ శ్రీకృష్ణదేవరాయలుగా వినుతికెక్కారు ఇదే సాహితీమూర్తుల బృందంతో డా॥ బోయిన 'ఇంద్రసభ'లో ఇంద్రుడిగా, 'కైలాససభ'లో శివుడుగా, 'భారతంపై తుది తీర్పు' లో న్యాయధీశుడిగా అనేక ప్రదర్శనలిచ్చేరు ప్రదర్శనలు ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక రంగంలో వినూత్న విప్లవాన్ని తెచ్చేయి

"ఆధునిక నాటకరంగం - ఈ దశాబ్ది (1980-90) ప్రయోగాలు" అనే ఈ సిద్ధాంతగ్రంధాన్ని రూపొందించే సాధికారత శ్రీ వెంకటేశ్వరరావుగారి కుందని తెల్పడమే పై పేరాల్లోని సారాంశం!

నాకు పుత్రభిక్ష పెట్టండి నా కొడుకు ప్రాణానికే ముప్పు ఏర్పడింది" అంటూ కన్నీళ్లతో ఒక మిత్రుడు డా బోయినను వేడుకున్నాడు శ్రీబోయిన కుటుంబంతో సహా షిర్డీసాయి దర్శనానికి బయలుదేరారు కుటుంబ సభ్యులు అప్పటికే రైల్వే స్టేషనుకు చేరారు రైలు బయలుదేరడానికి అరగంటే వ్యవధి ఈలోగా ఆఫీసులోని మరో Urgent పనిచేసి వెళ్లడానికీయన ఉండిపోయారు ఈ లోపలే ఈ ఉత్పాతం మిత్రుడ్ని తీసికుని సెకన్లలో 'Concerned' దగ్గరకు వెళ్లడం - ఫోన్లమీద ఫోన్లుచేసి - 150 KM దూరంలో మిత్రుడి కొడుకు ను గురించిన ఆవేదన తప్పించడం - నిముషాలమీద జరిగిపోయింది ఆ వెంటనే కదిలే రైలులో కాలు మోపడం డా బోయినలోని మానవత్వానికి సాక్షీభూతంగా నిలిచే విలక్షణ ఉదంతంమిది

అబద్ధాల కేసులకూ, హత్యాప్రయత్నాలకూ లోనయిన మరోమిత్రుడ్నీ, అతని కుటుంబాన్నీ ఎన్నిసార్లు ఆదుకున్నారో! డా బోయిన సహాయమే లేకపోతే ఆ మిత్రుడు కటకటాలు లెక్కిస్తూనో, పరలోకంలోనో ఉండేవాడు 'Gulliver's Travels' "Jonathan Swift చెబుతాడు "అధికారిగ్గా తెలివి తక్కువ వాడయినా ఫరవాలేదు, Sincerity ఉంటే దుర్మార్గుడైన శత్రువుకన్నా కృతఘ్నుడు అత్యంత ప్రమాదకారి" అని సరిగ్గా ఈ కృతఘ్నుల చేతుల్లోనూ, అసూయ ద్వేషాలకులోనయిన సహచరుల దుర్మార్గానికీ లోనయి, క్షణక్షణం ప్రమాదాలనూ, కష్టాలనూ ఎదుర్కొనే క్షణాల్లో కూడ ఆపన్నుల నాదుకోవడం డా బోయిన సహజ లక్షణం అవకాశాన్ని బట్టి ఇతరులకు సహాయం చేసేవాళ్లుండవచ్చుకాని, తాను కష్టాల్లో ఉన్నప్పుడు కూడ వాటిని ప్రక్కనబెట్టి సహాయమర్థించిన బంధుమిత్రులనాదుకోవడం అనేది బహుశా కోటికొక్కరిలో కూడ మనం చూడలేమేమో!

ఉద్యోగాలకోసం, ట్రాన్స్‌ఫర్లు, ప్రమోషన్లకు, కేసుల్లోనుండి బయటపడటానికి, ఆర్థిక సహాయం - ఒకటేమిటి, లోకంలోని ఈతి బాధలనన్నిటిని అధిగమించడానికి డా బోయినను అర్థించేవారూ, ప్రార్థించేవారు కోకొల్లలు ఇంతకుముందే చెప్పినట్టు తనకుటుంబ సమస్యలనూ, ఇక్కట్లనూ ప్రక్కనబెట్టి అమూల్యమైన తన సమయాన్నీ, పలుకుబడినీ వెచ్చించి ఆపదల్లోనుండి తప్పించడంలో - డా బోయినను కలియుగ దైవం శ్రీ వెంకటేశ్వర స్వామితో పోల్చ వచ్చు తేడా అల్లా ఆ వెంకటేశ్వరుడికి మొక్కుబడి చెల్లించాలి, ఈ వెంకటేశ్వరుడి స్నేహితుని అభ్యర్థనే మొక్కుబడి! కార్యసఫలతే డా బోయినకు భగవదాశీర్వాదం ॥

శ్రీ బోయిన వెంకటేశ్వరరావుగారి జననం - శ్రీ వీరరాఘవయ్య వీరమ్మ దంపతులకు, ఆగస్టు 14, 1943 న మచిలీపట్నంలో 19వ ఏటనే బందరు హిందూకళాశాలలో డిగ్రీ, 1970లో M A (Litt), 1980 లో B L, 1997 లో తెలుగు యూనివర్శిటీ నుండి ఈ Ph D ,

పువ్వు పుట్టగానే పరిమళిస్తుందన్న నానుడి కనుగుణంగా శ్రీ బోయిన చిన్నతనం నుండి సాహిత్యోపాసకులు, ఉపన్యాస కేసరి వక్తృత్వంలో బోయిన ఆంధ్రాయూనివర్శిటీకి ప్రతి సంవత్సరం తానే ఫస్ట్ ! 'కనకదుర్గ' అనే కలం పేరుతో అన్ని వార, మాస పత్రికల్లోనూ, కాలేజీ సావనీర్లలోనూ అనేక కథలూ వ్యాసాలూ - విద్యార్థి దశలోనే వ్రాశారు డా కుప్పా వెంకట్రామ శాస్త్రి గారి మేడ మీద జరిగే సాహిత్య చర్చలకు ఈయనే కన్వీనర్ కాలేజీ చదువయిన వెంటనే నాటి తమిళనాడు గవర్నమెంటు సర్వీస్ కమీషన్‌లో D S P కి సెలక్టయ్యారు పోస్టింగివ్వకుండా 'రాజకీయం' జరగడంతో దేశం ఒక గొప్ప పోలీసాఫీసర్ని కోల్పోయింది 1976లో Group I లో సెలక్టయి గుంటూరు మునిసిపల్ డిప్యూటీ కమిషనర్ గా పనిచేశారు దీనితో సంతృప్తి పడక Group I కి మరల కూర్చుని 27,000 మంది లో No I గా సెలక్టయి డెప్యూటీ కలెక్టరుగా సర్వీసు ప్రారంభించేరు R D O గా డెప్యూటీ కలెక్టరుగా, సబ్ కలెక్టరుగా తెనాలి, మార్కాపురం, ఏలూరు కావలి మొదలయిన చోట్ల పనిచేశారు Spl Grade Deputy Collector గా ఏలూరు, గుంటూరులోనూ, డెప్యూటీ కమిషనర్, స్మాల్

సేవింగ్స్ గానూ, DRDA ప్రాజక్టు డైరెక్టరుగా గుంటూరులోనూ, GAD (OL) హైదరాబాదులోనూ పనిచేసి సీనియర్ IAS హోదాలో ప్రస్తుతం డెప్యూటీ కమీషనర్, (కమర్షియల్ టాక్సెస్) గా కాకినాడలో పనిచేస్తున్నారు ఏ హోదాలో పనిచేసినా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మొత్తంలో తన పొజిషన్‌లో No I గానే ఉండటం డా బోయిన ప్రత్యేకత ! దాదాపు 20 సం॥లు రెవెన్యూ డిపార్టుమెంటులో ఉండి తనకు పూర్తిగా కొత్తయినాకూడా కమ్మర్షియల్ టాక్సెస్‌కు వచ్చిన మొదటి సంవత్సరంలోనే రాష్ట్ర మొత్తంలోనే టాక్స్ కలెక్షన్‌లో నూరుశాతం మించి టార్గెట్ సాధించి రికార్డు సృష్టించిన ఘనత డా బోయినకే దక్కింది !

డా॥ బోయిన తనవంతు (ఉద్యోగ) ధర్మాన్ని 100% Sincere గా చేస్తూనే తన ప్రవృత్తి పరమైన సాంస్కృతిక రంగంలో అనేక కీర్తి శిఖరాల నధిరోహించేరు ఆంధ్రప్రదేశ్‌లోనే అగ్రగామిగా పేరెన్నికగన్న ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నంకు రెండు దశాబ్దాలకు పైగా అధ్యక్షులుగా, గత రెండు సం॥ల గా గౌరవాధ్యక్షులుగా అద్వితీయ సేవలందించి సంస్థ యశస్సును సమున్నతశిఖరాలపైకి అధిరోహింపజేశారు మార్కాపురంలో RDO గా ఉన్నప్పుడు అక్కడున్న వెంకట కృష్ణరాయ కళానిలయంకు శాశ్వత నిధిని, ఆడిటోరియంను నిర్మింపజేసి అనేక సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలకు రూపకల్పన, నిర్వహణలో ఆంధ్రప్రదేశ్‌లోనే దాని కొక విశిష్టస్థానం కల్పించేరు ఈ కాలంలోనే తన స్క్రీన్‌ప్లే, డైరక్షన్‌తో అనేక డాక్యుమెంటరీలను (ప్రభుత్వానికి) నిర్మించేరు అవి రాష్ట్రమంతటా ప్రదర్శింపబడి ప్రస్తుతించబడ్డాయి

సినీ రంగంలోని గొప్ప డైరెక్టర్లు, రచయితలతో డా బోయినకు సాన్నిహిత్యం ఉంది ప్రసిద్ధ సినీదర్శకులు కె విశ్వనాధ్ అపూర్వ సృష్టి 'శంకరాభరణం' నుండి 'శ్రుతిలయలు' వరకూ - అన్నింటిలోనూ కధాచర్చల్లోనూ, రూపకల్పనలోనూ పాల్గొన్న ఘనత డా బోయినగారిది

శ్రీ బోయిన అనేక ప్రభుత్వ ఉన్నత పదవులనధిష్టించి వాటికి వన్నెతెచ్చిన మాన్యమహోదయులు బహుభాషా ప్రవీణులు, బహుముఖ ప్రజ్ఞాధురీణులు,

సాహిత్య విమర్శకులు, కవి, రచయిత, ప్రయోక్త, నాటక రచయిత అంతేగాక స్నేహశీలి, నిస్వార్థ సేవాతత్పరులు మానవతావాది, నియమపాలనా దక్షులు, నిరంతర సాహిత్యోపాసనానురక్తులు !

డా॥ బోయినకు మచిలీపట్నం, ఏలూరు, గుంటూరు, విజయవాడ, విశాఖపట్నం, మార్కాపురం, తెనాలి, హైదరాబాదు, కాకినాడ, రాజమండ్రి మొదలయిన చోట్ల ఘన సన్మానాలు జరిగాయి గత డిసెంబరులో డా సినారె ఆంధ్ర ప్రదేశ్ శాసనసభ సభాపతి శ్రీరామకృష్ణుడు గార్ల సమక్షంలో ఆంధ్ర సారస్వత సమితి, మచిలీపట్నం డా బోయినను అపూర్వంగా సన్మానించింది

"ఆధునిక నాటకరంగం - ఈ దశాబ్ది (1980-90) ప్రయోగాలు" అనే డా బోయిన వెంకటేశ్వరరావుగారి ఈ సైద్ధాంతిక వ్యాసం ఆంధ్ర సారస్వత సమితి ప్రచురిస్తున్న అమూల్య గ్రంథం ఇది మా 22వ ప్రచురణ దీనిని ప్రచురించడానికి అనుమతినిచ్చిన డా బోయినకు మా ఆంధ్ర సారస్వత సమితి తన కృతజ్ఞతలను తెలియజేస్తున్నది

భవదీయుడు

**కొట్టి రామారావు**

కార్యదర్శి, ఆంధ్రసారస్వత సమితి

మచిలీపట్నం

# పీఠిక
# మరో శ్రీకారం



ప్రతి సాహితీ ప్రక్రియమీదా పరిశీలన జరగటం సహజం, జనాన్ని చైతన్యవంతం చేసి మానవ ప్రగతికి పాదులు తీసే సాహిత్య విభాగం మీద మరింత విస్తృతంగా వివేచన జరుగుతుంది ఇందుకనుగుణంగానే నవల, కవిత, కథా స్వరూప స్వభావాల గూర్చి, పుట్టు పూర్వోత్తరాల గూర్చి, పరిణామ వికాసాల గూర్చి తెలుగునాట విలువైన, విపులమైన పరిశోధనలు జరిగినై, జరుగుతున్నై అయితే సాహితీ ప్రక్రియల్లోనే అత్యంత శక్తిమంత స్వరూపమైన నాటకం మీద మాత్రం నామమాత్రమైన వివేచనే ఇంత దనుక జరగటం బాధాకరమే అయినా ఇది సత్యం కోలాచలం శ్రీనివాసరావు, పురాణం సూరిశాస్త్రి, డాక్టర్ పి యస్ ఆర్ అప్పారావు, డాక్టర్ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, డాక్టర్ జయప్రభ, డా కందిమళ్ళ సాంబశివరావు, శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు, శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి, శ్రీ నేతిపరమేశ్వరశర్మ వంటివారు తమ స్థాయి కొలదీ తెలుగు నాటక విమర్శను ప్రకాశవంతం చేశారు కోలాచలం వారు ప్రపంచ నాటక చరిత్రకే ప్రాణ ప్రతిష్ఠ చేశారు ఈ విమర్శక పరంపరలోనే నూతనంగా వచ్చి చేరినవారు డా బోయిన వెంకటేశ్వరరావు "తెలుగు నాటకరంగం-ఈ దశాబ్ది ప్రయోగాలు" అన్న అంశాలపై వారు పరిశోధన చేశారు డాక్టరేట్ పొందారు ఆ పరిశోధిత గ్రంధాన్ని నాకందించి నాలుగు మాటలు వ్రాయమని కోరారు తెలుగు నాటకం గూర్చి పర్యాలోకన చేసిన గ్రంధం కదా! సంతోషంతో నా సమ్మతిని తెలిపాను గ్రంధాన్ని ఏక దీక్షతో అధ్యయనం చేశాను డాక్టర్ బోయిన వెంకటేశ్వరరావు లోని నిరంతర పరిశోధకుడు, నిత్య పరిశీలకుడు, అవిశ్రాంత అధ్యయనపరుడు ఎంతటి శక్తిమంతుడో ఈ గ్రంధం నిరూపణం చేసింది తన పరిశోధితాంశాన్ని డా॥ బోయిన తొమ్మిది

ప్రకరణాలుగా విభాగితం చేసుకొన్నారు "తెలుగు నాటకం - పుట్టుపూర్వోత్తరాలు' ', "ఈ దశాబ్ది నాటకాలు - వస్తు వైవిధ్యం" "ఆధునిక నాటకం - కుటుంబ వ్యవస్థ" "ఆధునిక నాటకం - స్త్రీ వాదం" "దర్శకత్వంలో - ప్రయోగాలు" "దళితవాదం" "వీథి నాటికలు - ప్రయోగాలు" "నాటక పరిషత్తులు - ప్రయోగాలు' ' వంటి ప్రకరణాలతో ఈ దశాబ్ది నాటికా - నాటకాలపై బహుముఖ విశ్లేషణ చేశారు డా॥ బోయిన

"తెలుగు నాటకం - పుట్టుపూర్వోత్తరాలు" ప్రకరణంలో క్రీ॥ పూ 5-6 శ॥ నాటికే తెలుగు నాట సంస్కృత నాటకాల ఉనికినీ, దక్షిణాంధ్ర యుగంలో వర్ధిల్లిన యక్షగానాలనూ, ధార్వాడ, ధర్మవరం, గురజాడల ప్రాముఖ్యతనూ తలస్పర్శగా ప్రస్తావించటం జరిగింది 1990 వరకూ సాగిన నాటక వికాసాన్ని స్థూలంగా పరిచయం చేశారు ఈ ప్రకరణంలోనే "ఆధునిక నాటకం - వస్తు వైవిధ్యం" ప్రకరణం ఈ గ్రంధానికి మూర్ధన్యం వంటిది ఎనభై, తొంభై దశకంలో వచ్చిన నాటికలపై లోతైన సమాలోచనం చేశారు పరిశోధకుడు ఈ సమాలోచనమంతా నిష్పక్షపాతంగా, నిర్మొహమాటంగా, రాగద్వేషాల కతీతంగా కొనసాగించారు డా॥బోయిన విభిన్న వస్తువుతో రూపం దిద్దుకొన్న నాటికల స్వరూప స్వభావాలను అర్థం చేసికోవటానికీ, మంచి చెడులను బేరీజు వేయటానికీ దక్షత ఒక్కటే చాలదు అద్దం వంటి అంతఃకరణ కూడా ఉండాలి విమర్శకునికి అప్పుడే ఆయా నాటికల్లోని భిన్న దృక్పధాలను సమన్వయం చేసి, వివేచన చేసే సామర్థ్యం, విశాల దృష్టి పరిశీలకునికేర్పడుతుంది "He must be an adept in experiencing without eccentricities, the State of mind relevant to the work of art he is Judging He must be sound of Values " అంటూ విమర్శకునికుండవలసిన లక్షణాలను వివరిస్తున్నాడు ఐ ఎ రిచర్డ్స్ ఎటువంటి వికారాలూ మనసులోనికి రానీయక, విలువల ఆధారంగా, సంయమనంతో చేసే, సమన్వయాత్మక సాహిత్య విమర్శ విశిష్టమైనదన్న భావననే 'రిచర్డ్స్' వ్యక్తీకరిస్తున్నాడు డా॥ బోయిన విమర్శనా ప్రవృత్తి ఈ కోవలోనిదే "ఆధునిక నాటకం - స్త్రీ వాదం" ప్రకరణం కూడా ఈ గ్రంధంలో ప్రాధాన్యాన్ని సంతరించుకొంది

స్త్రీ వ్యక్తిత్వం, అస్తిత్వాలకు అండగా నిలచిన నాటికలతో పాటు, ఆమె నిస్సహాయ దయనీయ స్థితిని వెలికితెచ్చే నాటికా నాటకాలు పెక్కింటిని చర్చకు తెచ్చారు బోయిన కందుకూరి, గురజాడల నుండి - ఇసుకపల్లి మోహనరావు వ్రాసిన "ఓ బూతు నాటకం" వరకూ స్త్రీ పరాధీన పరివేదనా బ్రతుకుపై విస్తారమైన వివేచన జరిగింది ప్రకరణంలో "ట్రెడిషన్స్ మీద రివోల్ట్ చేసి స్త్రీని అతి ప్రధానమైన శక్తిగా ఇబ్సన్ చిత్రించాడు" అంటూ "మేజర్ క్రిటికల్ ఎస్సేస్" అనే గ్రంథంలో 'బెర్నార్డ్‌షా' పేర్కొంటాడు చలం, రాజమన్నార్‌లు "ఇబ్సన్" భావ ప్రసార సందేశకులుగా తెలుగు నాటకానికి పూర్ణత్వం కల్గించారు

"రచయితలు ఆ సమస్యల పట్ల తమకున్న ఆసక్తినీ ఆర్ద్రతా భావాన్నీ నిజాయితీగా ద్యోతకం చేయడానికీ ముందంజ వేసినట్లు ఆ రచయితల రచనా వైఖరి వల్ల స్పష్టమవుతుంది "(పుట 148) అన్న డా॥ బోయిన వ్యాఖ్యానంలో వాస్తవముంది 'Drama is not art, it is a part of life' అంటాడు బ్రెఫ్ట్, జీవితం నుండే నాటకం రూపుదిద్దుకొంటుంది, అయినప్పుడు నేటి నాటకాల్లో స్త్రీ ప్రస్తావనను తేవటమే కాదు, ఆమె ప్రాధాన్యాన్ని, శక్తిసామర్థ్యాల్నీ విడమర్చి చెప్పటం నాటక రచయితలకు అనివార్యం సాంఘిక చైతన్యానికీ, నవనాగరిక పోకడకూ ఆంగ్లదేశం పెట్టింది పేరని చెప్పుకొంటారు కదా! ఆ దేశ రంగస్థలంపై అభినయించటానికి "స్త్రీ"కి వందల సంవత్సరాలే పట్టింది 8-12-1660 "మిసెస్ హెచ్ హూస్" అనే ఆవిడ 'డెస్టిమోనా' గా ఆంగ్ల రంగస్థలంపై అభినయించిన తొలి మహిళ, ఈ రీత్యా చూస్తే మనమే ఎంతో నయం, "మిసెస్ చరణ్ హోర్టు'

"శారాసిడ్డన్స్" అనే నటీమణులు తమ నటనానుభవాలను తెలియ చేస్తూ గ్రంధాలే వ్రాశారు భరతుని నాట్య శాస్త్రంలో 'స్త్రీ' ప్రధాన క్షేత్రమే కదా! రేగ్‌నాండ్ (P REGNAND) ఫ్రెంచి భాషలోకి, బి బ్రియోలర్ (B Breoler ) జర్మన్ భాషలోకి, 36 అధ్యాయాలతో 6 వేల శ్లోకాలతో ఉన్న బృహత్ గ్రంధం "నాట్య శాస్త్రాన్ని" అనువాదం చేశారు క్రీ॥పూ 3వ శతాబ్దిలో ('కీత్' పరిశోధన) భరతుడు వ్రాసిన "నాట్యశాస్త్రం" అభినయ నృత్య కళలపై తొలి అలంకార గ్రంధం

ఇప్పుడు డా బోయిన వరకూ ఈ నాటక వివేచన అవిచ్ఛిన్నంగా సాగుతూ రావటం ఆ కళ ప్రాధాన్యమెంతటిదో అవగాహన చేసికోగలం

దంపతుల మధ్య ఉండవలసిన ప్రేమానురాగాలు, గౌరవ విశ్వాసాలను గూర్చి తెలిపిన నాటికల చర్చ కూడా ఈ ప్రకరణంలోనే చూస్తాం కవిత్వంలో వచ్చిన ప్రతి పరిణామం మిగిలిన అన్ని సాహితీ ప్రక్రియల్లోనూ వెనుకా ముందుగా జరిగింది కాల్పనిక, అభ్యుదయ, విప్లవవాద పోకడలు తెలుగు నాటక రచనల్లోనూ గమనిస్తాం నాటకం జనంలోకి ప్రత్యక్షంగా వెళ్ళేది కనుక ఈ ప్రక్రియ ప్రయోగంలో కళాత్మకతతో పాటు కొంత జనాకర్షకఅభివ్యక్తి కూడా అవసరమవుతుంది "విమర్శనాత్మక వివరణ సుప్రసన్నంగా, సరళంగా ఉండాలి పాఠక జనానికి అవగాహనమయ్యే రీతిలో ఉండాలి" అంటాడు 'విల్సన్'

'ఆర్ట్ ఆఫ్ రెహటోరిక్' (Art of Rhetoric) అనే గ్రంథంలో డా॥ బోయిన నాటికల గుండె లోతుల్ని అన్వేషించి అభివ్యక్తం చేస్తున్న విషయం గాఢమైనదైనా, సరళమైన భాషలో, చక్కని శైలిలో, పౌర్వాపర్య విషయాలతో సహా విశ్లేషించి చూపారు నాటికాంతఃకరణల దర్శన నిర్దేశం కావించటంలో డా॥ బోయిన చేసిన ప్రతిపాదనలు ప్రతిభతో నిండిఉన్నాయి విలువైన సిద్ధాంతాలతో చేసిన ఫలవంతమైన విమర్శనా దృష్టి ఈ గ్రంథమంతా నిండి ఉంది "Though by no means a very good critic, he is useful as an interesting and a representative one—' 'ఆడిసన్' విమర్శనా శక్తిని ప్రశంసిస్తూ 'శైన్ట్స్‌బరీ' పలికిన మాటిది నాటికల ప్రయోగ ఆంతర్యాలను పరిశీలన చేస్తూనే డా॥ బోయిన మరిన్ని ప్రతిపాదనలను చేస్తారు ఇది ఆ నాటికల ఆంతరిక తత్వాన్నీ, బహిర్ప్రయోజనాన్నీ మరింతగా వికాసవంతం చేసింది 'శైన్ట్స్‌బరీ' పలుకులు బోయిన పరిశీలనకు నిర్వచనాలుగా నిలుస్తాయి

ఐదవ ప్రకరణం "ఆధునిక నాటకాలు - దళిత వాదం' లో విస్తారమైన చర్చ జరిగింది విభిన్న ప్రాంతాలలో దళితులెదుర్కొన్న విషమ సమస్యలెన్నింటినో ప్రస్తావించటం జరిగింది "ఆర్థికపర, సామాజికపర, రాజకీయపర" సమస్యలుగా వీటిని వర్గీకరించి ఆ ప్రభావంతో రూపం దిద్దుకొన్న పెక్కు నాటికల గూర్చిన

సమగ్ర వివేచన చేశారు బోయిన "కళాత్మకత నీరుగారిపోకుండా ఏ విషయాన్నయినా అభివ్యక్తీకరించినప్పుడే ఆ కావ్య సృష్టికి అందం వస్తుంది, అదే వాంఛిత గమ్యాన్ని చేరగలుగుతుంది " అన్న (పుట 182) డా॥ బోయిన వివేచన విలువైనది "The critic is aware of the music in the soul of Artist" అని ప్రకటిస్తాడు" ముల్కరాజ్ ఆనంద్ నటుడికే కాదు, కావ్యానికైనా, నాటకానికైనా కళాత్మక అంతరాత్మ ఉంటుంది దాన్ని నినాద రూపంలో గాక, సౌందర్యాత్మకంగా, కళాత్మకంగా అభివ్యక్తీకరించినపుడే, ఆ నాటక స్వభావ ప్రవృత్తి సముజ్వలంగా సామాజికులకు చేరుతుంది డా॥ బోయిన చేసిన వివేచన పరిణత వ్యక్తిత్వాన్నీ, ప్రమాణ గౌరవాన్నీ చేకూర్చుకొంది ఇందువల్లనే

ఆరో ప్రకరణంలో విదేశీ ప్రభావాన్ని చర్చించటం జరిగింది, "స్వదేశీ ప్రభావం కన్నా సాహిత్యం మీద విదేశీ ప్రభావమే గాఢముద్ర వేస్తుంది" అంటాడు 'అలెన్ డౌనర్' ఆధునిక తెలుగు నాటకంపై విదేశీ నాటక ప్రభావం ఎన్ని విధాల ప్రసరించిందో డా॥బోయిన ఈ ప్రకరణంలో బహుళంగా చర్చించారు పాశ్చాత్య నాటకరంగంలో ప్రభవించిన పెక్కువాదాలు, తెలుగు నాటికలపై అవి ఏ విధంగా కమ్ముకొన్నాయో వివేచన చేశారు తెలుగు నాటికా రచయితల ఆలోచనల్లోనే ఈ 'వాదాలు' పెను మార్పుల్ని తీసుకువచ్చాయి, "ఆకృతి మీద పడ్డ ప్రభావం కన్నా ఆలోచనలమీద పడ్డ ప్రభావం అధికం" అంటాడు "ఆస్టిన్ వారెన్," "విదేశీ నాటకాలకు తెలుగు అనువాదాలు" అనే శీర్షికలో 1880 నుండి ఇప్పటి వరకూ జరిగిన విదేశీ నాటక అనువాదాల గూర్చిన లిస్టు ఉంది ఇది పరిశోధకుని పరిశ్రమ ఎంత అవిరామంగా జరిగిందో తెలియజేస్తుంది

ఏడవ ప్రకరణంలో "దర్శకత్వంలో ప్రయోగాలు" లో గూర్చి సవివరమైన చర్చ చేశారు డా॥ బోయిన పరిశోధకుని పరిశీలన ఎంత నిశితమైనదో, అధ్యయనం ఎంత లోతైనదో ఈ ప్రకరణం తేటతెల్లం చేస్తుంది "నాటక ప్రయోగానికి అవసరమైన అన్ని అంశాలను సమ్యక్ దృష్టితో పరిశీలించి రూపొందించేవాడు దర్శకుడు" అన్న "బోయిన" నిర్వచనం సర్వాంగీకరమైనదే "1980-90 దశాబ్ది దర్శకులు" శీర్షికలో ఆ దశాబ్దంలోని దర్శకుల వివరాలు

ఇచ్చారు బోయిన నాటకరంగంలోని విభిన్న విభాగాలలో పరిశోధకునికున్న గాఢ పరిచయాన్ని, ప్రజ్ఞాపాటవాల్ని ఈ ప్రకరణం విశదం చేస్తుంది

ఎనిమిదవ ప్రకరణంలో "వీధి నాటికలు - ప్రయోగాలు" పై కూలంకష చర్చ చేశారు డా॥ బోయిన 12వ శ॥లో పరిఢవిల్లిన "యక్షగానం" నుండి ఇటీవలి "కైలాసంలో కోర్టు" వీధినాటిక వరకూ విపులమైన వివేచన జరిగింది తొమ్మిదవ ప్రకరణం "నాటక పరిషత్తులు-ప్రయోగాలు", పరిశోధకుని బృహత్ కృషికి ఫలశృతిగా ఉంది ఈ ప్రకరణం గుణ విర్ణేతల పాత్రలను విశదం చేస్తూ, వారి పట్టికను కూడా ఇచ్చారు డా॥ బోయిన నాటక పోటీలు నిర్వహించే కళా సంస్థల వివరాలు అందచేశారు "కృషితోను, కమిట్‌మెంట్‌తోనూ నాలుగు కాలాల పాటు కళను అభ్యసించి, ప్రయోగించే త్యాగమూర్తుల వల్లనే నాటకానికి ఉపయోగం" అని సూత్రీకరించారు డా॥ బోయిన ఆయన పరిధులు లేని కృషికీ, పార మెరిగిన పరిశోధనకూ ఈ సూత్రీకరణ అక్షర నీరాజనంగా భావించతగింది 1698 సం॥లో "Short view of the English stage" అనే విమర్శనా గ్రంథాన్ని వెలువరిస్తాడు జెర్మీకోలియర్ (Jermy Collier) ఆనాటి నుండీ నాటక రంగంపై ముఖ్యంగా తెలుగు నాటకరంగంపై వచ్చిన వివేచనాగ్రంథాల శిఖరశ్రేణిలో "ఈ దశాబ్ది నాటక ప్రయోగాలు - తెలుగు నాటకరంగం" అనేది కూడా చేరిపోతుంది

అభినందనలతో

మీ

**డాక్టర్ పి.వి. రమణ**

ప్రొఫెసర్
రంగస్థల కళలశాఖ, తెలుగు విశ్వవిద్యాలయం
హైద్రాబాద్ - 4

103, Lumbini Apts
Dharamkaran Road
Ameerpet
Hyderabad 16

# కృతజ్ఞతాంజలి

ఆధునికాంధ్ర సాహిత్యంలో ఒక విషయం మీద సమగ్రమైన పరిశోధన చేయడం అనుకున్నంత తేలిక కాదు అది ఒక బృహత్‌ప్రయత్నమే పరిశోధనకు కావలసిన విషయ సేకరణలో, తగిన సూచనలు ఇవ్వడంలో ఎందరో నాకు తమ సహాయ, సహకారాలనందించారు వారికి మనఃపూర్వక కృతజ్ఞతలు చెప్పడం నా విధి, ధర్మం

నాకు మొదటినుండీ నాటక రంగంపైన మక్కువ ఎక్కువ దానికి తగినట్లేనా యీ పరిశోధనకు "ఈ దశాబ్దినాటక ప్రయోగాలు" అనే పరిశోధనాంశం సూచించి, వెన్ను తట్టి ప్రోత్సహించిన, పద్మభూషణ్, జ్ఞానపీఠ పురస్కార గ్రహీత, మహాకవి, పూజ్యులు, ఆచార్య సి నారాయణరెడ్డి గారికి మున్ముందుగా నా హృదయ పూర్వక ప్రమాణాలు సమర్పిస్తున్నాను

పరిశోధన ప్రారంభించాను గాని, అది ముందుకు సాగలేదు ఎన్నో ఆటంకాలు, అనుకోని అవరోధాలు ఎదురయ్యాయి వాటిని అధిగమించి, ముందుకు నడవడం తలకుమించిన భారమైంది ఆనిర్వేదంలో యీ బృహత్సధకానికి నీళ్లొదులు కుందామనే నిరాశ, నిస్పృహలకు లోనైన బలహీన క్షణాలు కూడా ఉన్నాయి అటువంటి తరుణంలో నన్ను ప్రోత్సహించి, ద్విగుణీకృతోత్సాహంతో ముందుకు సాగడానికి తగిన ఆత్మ విశ్వాసాన్ని, మనఃస్థయిర్యాన్ని కలిగించిన, పీఠాధిపతులైన డాక్టర్ సి రమణయ్య గారికి సర్వదా కృతజ్ఞుణ్ణి

ఈ పరిశోధనా వ్యాసం వ్రాయడంలో నా జాప్యాన్ని, ఓర్పుతో మన్నించి, ప్రతి ప్రకరణాన్ని ఆమూలాగ్రం చదివి, ఎప్పటికప్పుడు నిర్మాణాత్మకమైన సలహాలను సూచనలిచ్చి నాప్రయత్నం ఒక సమగ్రరూపం ధరించడానికి పర్యవేక్షకులుగా తమ సంపూర్ణ సహకారాన్నందించి, తోడ్పడిన విదుషీమణి డా॥శ్రీమతి జయా సలోమి గారికి నా కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను

నా పరిశోధన ముందుకు సాగడానికి, పూర్తికావడానికి ముఖ్యులు

నాఆప్తమిత్రుడు (రిటైర్డ్ అసిస్టెంట్ సెక్రటరీ, ఎ పి పి ఎస్ సి) శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డిగారు ఆయన సహకారం లభించి ఉండకపోతే, నా యీ ప్రయత్నం సఫలీకృతమయ్యేది కాదు ఆయన రేడియో, టి వీ నాటక రచయిత ఆయన అమూల్యమైన అనుభవాలను, వార్తాపత్రికల్లో పడిన ఎన్నో వ్యాసాలను, గ్రంథాలయాల నుండి కావలసిన పుస్తకాలను, శ్రమకోర్చి సేకరించి, నా కృషికి విజయ సారధిగా నిలచిన శ్రీ సుబ్బరామిరెడ్డి గారి ప్రోత్సాహాన్ని వర్ణించడానికి నాభాషచాలదు వారికి శిరస్సువంచి నమోవాకశతాలనర్పిస్తున్నాను గుంటూరు నుండి హైదరాబాదు బదిలీ అయి వచ్చినప్పటి నుండి గత 18 మాసాలుగా ఆయన నా వెన్నంటి వుండి, సిద్ధాంత వ్యాసం పూర్తి అయ్యేవరకు విశ్రమించని ఆత్మీయుడు శ్రీ సుబ్బరామిరెడ్డి గారు

ఆయనతో పాటు నాటకరంగంలో విస్తృతపరిచయం వున్న శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుగారు, శ్రీ తాళ్ళూరి శివరామ కృష్ణారావుగారు, ఆధునిక నాటకరంగంలో వచ్చిన వివిధ పరిణామ దశలను గూర్చి ఎన్నెన్నో అంశాలపై నాతో చర్చించి, పరిశీలించిన గ్రంధాలను సమకూర్చి, నాకు తోడుగా నిలచారు వారికి నా కృతజ్ఞతలు అర్పిస్తున్నాను

ఆధునిక వీధినాటకాలను గురించి నాకెంతో సమాచారాన్ని అందించి, ఎథ్నిక్ థియేటర్ గురించి నాకు సమగ్రమైన అవగాహన కలిగించిన శ్రీ పసుపులేటి పూర్ణచంద్రరావు గారికి నా ప్రత్యేకాభినందనలు తెలుపుకుంటున్నాను

ఆధునిక వీధినాటకాలను ప్రదర్శించి, ప్రజానాట్యమండలిలో ఎంతో కృషి చేసి, వారి సంపూర్ణానుభవాలను నాకందించిన ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్యమండలి కార్యదర్శి, నటుడు శ్రీ శాంతారాం గారికి, శ్రీమతి దేవి గారికి నా కృతజ్ఞతా పూర్వక నమస్సులు

ఆధునిక వీధినాటకాలను గురించి, సఫ్దర్ హాష్మీ గురించిన, విలువైన ఎన్నో వివరాలను నా కందించిన డా॥ సోనియా గుప్తా గారికి కృతజ్ఞతలర్పిస్తున్నాను

విద్యార్థి దశ నుండి కళాశాల స్థాయి వరకు నా సహాధ్యాయిని, సహోదరి అయిన డా॥ శ్రీమతి బి సుశీలా జయంత్ (ప్రిన్సిపాల్, కస్తూరిబాగాంధీ ఉమెన్స్ కాలేజి, సికింద్రాబాదు) నాయీ వ్యాసరచన పూర్తి అయ్యేంతవరకూ ప్రోత్సాహించి, పట్టుదల సడలకూడదని, త్వరగా పూర్తి చేయమని, హెచ్చరించినందులకు ఆమెకు నా నమస్కృతులు "ఒక ఊరి వాళ్ళం, ఇద్దరం ఒకే సారి పి హెచ్ డి కోసం రిజిస్ట్రేషన్ చేసాం ఒకేసారి సిద్ధాంత వ్యాసాన్ని విశ్వవిద్యాలయానికి సమర్పిస్తున్నాం" అంటూ నా వ్యాసభాగాలను చదివి, తగిన సూచన లిచ్చిన శ్రీఅద్దేపల్లి రామమోహనరావు గారికి(సుప్రసిద్ధ కవి, ఉపన్యాసకులు, విమర్శకులు) నా ప్రత్యేకాభినందనలు

నాకు అత్యంత ఆత్మీయులు, ఆప్తమిత్రులు, మచిలిపట్నంలో ఆంధ్ర సారస్వతసమితి కార్యదర్శి అయిన శ్రీ కొట్టిరామారావుగారు 1993 నుండి నేను కనిపించినపుడల్లా "మీ థీసెస్ ఎంత వరకు వచ్చింది? మీరు డాక్టరేట్ ఎప్పుడు తీసుకుంటారు? ఆంధ్ర సారస్వత సమితి గౌరవాధ్యక్షులైన మీకు డాక్టరేట్ వస్తే, అది మాకు గర్వకారణం" అంటూ నన్ను ఉత్సాహపరుస్తూ, ఆలస్యమవుతున్నందుకు సున్నితంగామందలిస్తూ, తాను దగ్గరుండి టైప్ చేయించేంతవరకూ నిద్రపోకుండా ఎంతగానో తోడ్పడినందుకు నా హార్దిక కృతజ్ఞతలు

పరిశోధనా ప్రణాళికను గూర్చి చర్చించినప్పుడు "మీకిది పెద్దపనేం కాదు నాటక రచయితగా, నటుడిగా, మీకున్న విశేషానుభవంతో ఆధునిక సాహిత్యంలో నాటక రంగాన్ని గురించి మంచి గ్రంధాన్ని రచించి సుస్థిర స్థానాన్ని పొందగల దక్షత మీకుంది" అంటూ కొంగ్రొత్త స్ఫూర్తిని కలిగించిన మిత్రులు ఆంధ్ర సారస్వత సమితి అధ్యక్షులు శ్రీ జి సత్యనారాయణ గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు

సిద్ధాంత వ్యాసప్రతులను నీట్‌గా టైపు చేయడంలో తోడ్పడిన మిత్రులు, స్క్రిప్ట్ ఇవ్వడం ఆలస్యమైతే చిరుకోపాన్ని ప్రదర్శిస్తూ, నిజమైన స్నేహితుడిగా

నాకు సంపూర్ణ సహాయ సహకారాలనందించిన శ్రీ బందెల సత్యనారాయణ (పరిశోధన సహాయకులు, తెలుగు పరిశోధనా విభాగం, ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం) వారి అభిమానానికీ, ఆప్యాయతకూ నిండు మనసుతో అంజలి ఘటిస్తున్నాను

సిద్ధాంత వ్యాస ప్రతులను దగ్గరుండి జిరాక్స్ కాపీలు తీయించిన మా బందరు మిత్రులు డాక్టర్ జి రాధాకృష్ణ (డైరక్టర్ బి సి స్టడీ సర్కిల్, గుంటూరు) గారికి నా మనఃపూర్వక నమస్సులు తెలియజేసుకుంటున్నాను నా పరిశోధనకు ఉపయుక్తంగా వుండే కొన్ని అరుదైన అపురూపమైన గ్రంధాలను, ప్రత్యేక సంచికలను నాకు అందించి, నా ప్రయత్నానికి పరోక్షంగా సహకారమందించిన మిత్రులు శ్రీ డి వి రమణమూర్తి, శ్రీ యస్ కె అంజనేయులు గార్లకు కృతజ్ఞతలు

ఎప్పుడూ తెల్లని దుస్తులతో, చెరగని చిరునవ్వుతో, ఆప్యాయంగా పలుకరిస్తూ, ఆంధ్ర సారస్వత సమితి మాజీ కార్యదర్శిగా ఎన్నో సాహిత్య సభల నిర్వహణలో నాకు నిరంతర సహాయ సహకారాలందించిన మిత్రుడు శ్రీ బాలస్వామి (ఎల్ ఐ సి, మచిలీపట్టణం) నా పి హెచ్ డి పరిశోధనా ప్రగతి గురించి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, నాకు తగు సూచన లిచ్చి ప్రోత్సహించినందుకు ఆయనకు కృతజ్ఞతా నమస్సులనందిస్తున్నాను నేను కోరగానే ఎంతో ఆప్యాయంగా, యీ గ్రంధాన్ని పరిచయం చేస్తూ, వివరణాత్మకమైన, విలువైన పీఠిక వ్రాసి యిచ్చిన మిత్రులు, ప్రసిద్ధ నాటక విమర్శకులు డా॥ పి వి రమణగారికి నా కృతజ్ఞతాభివందనాలు

అప్పుడప్పుడూ నేను కొంత అసౌకర్యం కలిగించినా, సహృదయంతో నాతో సహకరించి యీ సిద్ధాంత గ్రంధాన్ని అందంగా ముద్రించి యిచ్చిన శ్రీ కాళీ ప్రింటింగ్ వర్క్స్ (రాజమండ్రి) మేనేజింగ్ పార్టనర్ శ్రీ సి హెచ్ బాబూరావు గారికి, ప్రెస్ సిబ్బందికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు

**డా॥ బోయిన వెంకటేశ్వరరావు**

# ఉపక్రమణిక

దశ రూపకాల్లో ఒకటైన నాటకానికి అగ్రతాంబూలం యిచ్చారు పెద్దలు నాటకం సమాహారకళ కవిత్వం, సంగీతం, నాట్యం, చిత్రలేఖనం, శిల్పం - వీటి సమ్మేళనమే నాటకం కాలగమనంలో అనేక దశల్ని దాటుకొంటూ వచ్చి, నేడు మనకళ్ల ముందు నాటకంగా సుప్రతిష్ఠితమైంది

కావ్యపరంపరలో దేనివిలువ దానికి ఉన్నా, దృశ్యకావ్యం పండిత పామరులిద్దర్నీ సమంగా సమాదరించి అలరించగలశక్తిమంతమైన సమ్మోహనాస్త్రం కొండను అద్దంలో పెట్టి చూపించినట్టు సమకాలీన సమాజాన్ని, దాని స్థితిగతులను, మనుషుల తత్వాలను, లోకం పోకడను స్ఫటిక సదృశంగా దృగ్గోచరం చేస్తుంది నాటకం

నాటకం మూడు ముఖ్యాంశాల తోడ్పాటుతో ఊపిరి పోసుకొంటుంది నాటకరచన, ప్రదర్శన, ప్రేక్షకాదరణ, వీటిలో ఏది లోపించినా, బలహీనంగా ఉన్నా ఆ నాటకం బతకదు ఆ సృష్టికి సార్థకతలేదు కేవలం సాహిత్య విలువలున్న నాటకం, ప్రదర్శన యోగ్యంగా లేకపోతే అది రంగస్థలాన్ని తాకలేదు గ్రంథాలయాల్లో తలదాచుకుంటుంది అలాగే ప్రదర్శనా శిల్పం వల్ల ఒక నాటకం రంగస్థలంమీద రాణించగలిగినా ఆ వైభవం తాత్కాలికమే అవుతుంది దీనివల్ల రచయిత, దర్శకుడు, ప్రేక్షకుడు - ఈ ముగ్గురి మధ్య అవినాభావ సంబంధం ఉందనేది స్పష్టమౌతుంది

ఈ కారణంచేత ఒక నాటకాన్ని రచనాదృష్టితోనో, ప్రదర్శనా దృష్టితోనో లేదా ప్రేక్షకుని దృక్కోణంనుంచో విడివిడిగా పరిశీలించి విలువకట్టడం సాధ్యమే అయినా, అది సమగ్రమైన అవగాహనకు దారిచూపలేదు నాటకానికి సంబంధించినంతవరకు అలాంటి ప్రయత్నం అశాస్త్రీయమౌతుంది కూడా

ఆంగ్లంలో థియేటర్' అన్న మాటకు సమానార్థకంగా నాటకరంగం' అనే పదం సర్వేసర్వత్రా వాడుకలో ఉంది 'నాటకం' అన్న పదం రచనా పరమైన విశేషాలను ద్యోతకం చేస్తుంది అలాగే 'ప్రయోగం' అన్న మాట కూడా

పరిత్రలోకాన్ని తికమక పెడుతుంది' ప్రయోగం' అనే పదానికి నానార్థాలున్నాయి - ఒకటి ప్రదర్శన, రెండోది ఎక్స్‌పెరిమెంట్ నాటకాన్ని ప్రయోగించారు అంటే ప్రదర్శించారని అర్థం ఆ నాటకంలో దర్శకుడు కొత్త ప్రయోగం చేశాడు అంటే, ప్రదర్శనలో ఏదో కొత్త అంశాన్ని జోడించి ఎక్స్‌పెరిమెంట్ చేశాడు అని అర్థం చేసుకోవడం కష్టం కాదు

ప్రస్తుత పరిశోధనాంశంలో ఆధునిక నాటకరంగం - ఈ దశాబ్ది ప్రయోగాలు' కనుక 1980 - 90 మధ్యకాలంలో వెలుగుచూసిన నాటక, నాటికలు, ప్రదర్శనలు, తత్సంబంధిత అంశాలు పరిశీలనలోకి వస్తాయి విషయవిస్తృతినీ, నాటక గమనాన్నీ, పాఠకుల సౌలభ్యాన్నీ దృష్టిలో వుంచుకొని 1980 సంవత్సరానికి కొంచెం అటూ 1990 సంవత్సరానికి కొంచెం యిటుగా కొన్ని నాటకాలను కూడా పరిశీలించడం అనివార్యమైంది అయితే, ఇక్కడ కొన్ని ప్రశ్నలు తలెత్తడానికి తావుంది ఒక దశాబ్ది కాలాన్ని ప్రమాణంగా తీసుకుని నాటకరంగ ప్రగతిని గురించి అధ్యయనం చేయటం, అంచనా కట్టడం, వినూత్న ప్రయోగాలను వెలికి తీసి విశ్లేషించటం సాధ్యమా ? ఒక దశాబ్దికాలం నాటక రంగంలో ఏమైనా మార్పు తెస్తుందా, దాని గమనాన్ని ఎంతోకొంత ప్రభావితం చెయ్యగలదా ? - అనే ప్రశ్నలు రావడం సహజం

నిజానికి ఒక దశాబ్ది కాలపరిమితి చిన్నదేమీకాదు కాలమూ, తరంగమూ ఎవరికోసమూ ఆగవు అన్నట్టుగా, కాలం శరవేగంతో పరుగుతీస్తున్నది కాలంతోపాటు రాజకీయంగా, సాంఘికంగా, నైతికంగా సమాజం ఎన్నో మార్పులకు లోనవుతున్నప్పుడు వాటి ప్రభావం కళా, సాహిత్య రంగాలమీద తప్పకుండా వుంటుంది ఆ దృష్టితో ఆలోచించినప్పుడు పదేళ్ల కాలంలో నాటక రంగంలో ఎన్నో మార్పులు రావడం సహజ పరిణామమే !

కడచిన దశాబ్దితో పోల్చుకుంటే 1980-90 మధ్యకాలంలో రచనారీతిలోను, ప్రదర్శన శిల్పంలోను అపూర్వమైన మార్పులు, చేర్పులు జరిగాయి 1970-80 దశకంలో నాటకరంగం ముందుకు వెళ్లలేకపోయింది చెప్పుకోదగిన అభివృద్ధిని సాధించలేకపోయింది నిరాశానిస్పృహల్ని మిగిల్చింది దానికి భిన్నంగా ఈ దశాబ్ది

(1980-90) గణనీయమైన అభివృద్ధిని సాధించి నాటకరంగంలో కొంగ్రొత్త కాంతులను ప్రసరింపజేసింది ఈ సందర్భంగా మరొక విషయం గుర్తుచేయడం మంచిది 1977లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన ఆధునిక సాహిత్య ప్రక్రియలైన ఆధునిక కవిత, నవల, కథానిక, సాహిత్యవిమర్శ, నాటకం-నాటికలపై ఉపన్యాసాలు ఏర్పాటు చేశారు 1966-76 సంవత్సరాల మధ్య అంటే ఒక దశాబ్ది కాలంలో ఆ సాహిత్యప్రక్రియల్లో సాధించిన ప్రగతిని గూర్చిన ప్రసంగాలు జరిగాయి దీనినిబట్టి కళా సాహిత్యాల ప్రగతిని సమీక్షించడానికి ఒక దశాబ్ది కాలపరిమితిని ఎంచుకోవడంలో విప్రతిపత్తి ఏమీ లేదని ధ్రువపడుతున్నది

'ఆధునిక నాటకరంగం - ఈ దశాబ్ది ప్రయోగాలు' అనే పరిశోధనాత్మక సిద్ధాంత వ్యాసాన్ని తొమ్మిది ప్రకరణలుగా వింగడించడమైంది

మొదటి ప్రకరణంలో తెలుగు నాటకం-పుట్టుపూర్వోత్తరాలు' గురించి 1980 సం కి పూర్వం జరిగిన నాటకరంగ అభివృద్ధిని గురించి వివరించబడింది

రెండవ ప్రకరణంలో తెలుగు నాటకాల్లో ముఖ్యంగా 1980-90 సంవత్సరాల మధ్య వస్తువులో వచ్చిన మార్పులు, వైవిధ్యాన్నిగురించి వ్యక్తీకరించబడింది

మూడవ ప్రకరణంలో కుటుంబవ్యవస్థ'పై వచ్చిన నాటకాలను పరిశీలించడం జరిగింది 1945 నుంచి 1980 వరకు వచ్చిన నాటకాలలో అధికశాతం భూస్వామ్య వ్యవస్థ, రాజకీయ వ్యవస్థను నిరసించేనాటకాలు కావడం గుర్తించదగిన అంశం అప్పుడప్పుడూ కుటుంబజీవితం, కుటుంబ సమస్యలతో కూడిన నాటకాలు వచ్చినప్పటికీ గణింపదగిన సంఖ్యలో రాలేదు 1980 నుంచీ కుటుంబ వ్యవస్థపై నాటకరచయితలు దృష్టి నిలిపినట్లు ఈ దశాబ్దిలో వచ్చిన రచనలు నిరూపించాయి

నాల్గవ ప్రకరణంలో స్త్రీల సమస్యలకు ముఖ్యంగా స్త్రీవాదం ప్రతిబింబించే నాటకాలకు ప్రాధాన్యం యివ్వబడింది కవిగా, విమర్శకురాలిగా స్త్రీవాదదృక్పథంతో సాహిత్యరంగంలో కృషిచేస్తున్న శ్రీమతి జయప్రభ' నాలుగో గోడ' అనే తమ సిద్ధాంత వ్యాసంలో 'నాటకరంగం పూర్తిగా మగవాళ్ల ఆధీనంలో ఉంది గత

యాభై ఏళ్ల నాటకరంగ చరిత్రని చూస్తే నాటక రచయితలు, ప్రయోక్తలు, విమర్శకులూ, అధ్యాపకులు అందరూ మగవాళ్లే కన్పిస్తారు ఇంత నిరాఘాటంగా పురుషాధికారం కింద రూపొందిన నాటక రంగంలో నాటకానుభవమూ, నాటకపు విలువలు, ప్రమాణాలు, అన్నీ సంపూర్తిగా పురుషస్వామ్యపు భావజాలం తయారుచేసిన చట్రంలోనే ఇమిడివుండటం ఆశ్చర్యం కాదు మిగతా నాటకరంగాల మాట అటుంచి సామాజిక, రాజకీయ సమస్యల్ని నాటకరంగంలోకి తీసుకొచ్చిన పురోగామి ప్రయోక్తలు కూడ స్త్రీల విషయం వచ్చేసరికి పురుషస్వామ్యపు దృష్టితోనే ప్రవర్తిస్తారు స్త్రీవాద దృక్పథం కాదుగద, అసలు స్త్రీదృక్పథానికీ, ఆ మాటకొస్తే స్త్రీల భాగస్వామ్యానికి ఏమాత్రం జాగాయివ్వని నాటకరంగమే ప్రస్తుతందాకా కొనసాగుతోంది అని వ్యాఖ్యానించారు అంతేకాదు "మధురవాణిని మినహాయిస్తే, తెలుగు నాటకాలలో ఆడపాత్రలేవీ ఒక వ్యక్తిత్వంతో కనిపించవు స్త్రీ సమస్యలకు సంబంధించిన నాటకాలుకూడా పురుషుల ఆలోచనా రీతులకు అనుగుణంగా రూపొందుతున్నాయి స్త్రీల సమస్యలన్నీ నాటకాలలో ఇంకా పురుషదృక్పథంతోనే పరిష్కరించబడుతున్నాయి " అని అభిప్రాయపడ్డారు

పై ఆరోపణలలో కొంత నిజంవున్నా పూర్తిగా నిజంకాదు స్త్రీల సమస్యలపై 1920 ప్రాంతాలలోనే నాటికలు వచ్చాయి గుడిపాటి వెంకటచలం సాగించింది నారీ సమస్యలమీద పోరాటమేకదా ! స్త్రీల సమస్యల తీవ్రతను, ఆసమస్యల సత్వర పరిష్కార ఆవశ్యకతను సూచించే 'స్త్రీవాదం' అన్న పేరు ఇటీవలే వ్యాప్తిలోకి వచ్చింది అంతే 1980-1990 సంవత్సరాల మధ్య స్త్రీవాదాన్ని ప్రతిబింబించే నాటక నాటికలు చాలా వచ్చాయి ఎటొచ్చీ ఆ నాటకాలను స్త్రీలు రాశారా పురుషులు రాశారా అన్నది ప్రధానం కాదు సామాజిక స్పృహతో సమకాలీన సమస్యలన్నింటినీ ఆవిష్కరిస్తూ రచనలు చేస్తున్నారని ప్రస్ఫుటం చెయ్యడానికే నాల్గో ప్రకరణం కేటాయించబడింది. కొందరు చేస్తున్న ఆరోపణలకు ఆధునిక నాటకం-స్త్రీవాదం' అన్న శీర్షికతో ఉన్న ప్రకరణంలో సమాధానం లభించగలదని భావించడమైంది

ఐదో ప్రకరణంలో 'దళితవాద' స్పృహతో వచ్చిన నాటకాలను పరిశీలించడం

జరిగింది 1947 నుంచి దళితుల సమస్యలపై నాటకకర్తలు కలాలు సాగిస్తున్న వివరాలు ఈ ప్రకరణంలో పొందుపరచబడినాయి

తెలుగు నాటకాలపైవిదేశీప్రభావం ఏమేరకు ఉందో, ఏఏ పాశ్చాత్య నాటకవిధానాలు తెలుగులోకి ప్రవేశించాయో, తెలుగు ప్రేక్షకులు ఎంతవరకు ఆ నాటకవిధానాలను, ఇజమ్సును అంగీకరించారో లేదా తృణీకరించారో, విదేశీనాటకాలకు అనువాదాలుగా, అనుకరణలుగా వచ్చిన రచనలు తెలుగు రంగస్థలిమీద ఎంతవరకు నిలదొక్కుకోగలిగాయో, ఎపిక్ థియేటర్, అబ్సర్డ్ థియేటర్, ఎక్స్‌ప్రెషనిజమ్ వంటి థియేటర్ స్టయిల్స్ నిజంగా తెలుగు నాటక రంగంపై తమప్రభావాన్ని చూపగలిగాయా అనే విషయాలను పరిశీలిస్తుంది ఆరోప్రకరణం

ప్రదర్శనాపరంగా దర్శకులు నాటకరంగంలో తెచ్చిన మార్పులు, దర్శకత్వంలో చూపిన నవ్యతను, ప్రయోగ వైదుష్యాన్ని అభివ్యక్తం చేస్తుంది ఏడవప్రకరణం

1980 నుంచీ ఆధునిక వీథినాటక ప్రక్రియకు ప్రాచుర్యం లభించింది ఇది ఆహ్వానించదగిన పరిణామం వీథినాటకాల స్వరూపస్వభావాలను తెలియజేస్తుంది ఎనిమిదోప్రకరణం

నాటక కళపట్ల నానాటికీ నిరాదరణ పెరిగిపోతూ, కళాపోషకులు కరువైపోతున్న ఈ రోజుల్లో నాటకకళా వికాసానికై రాష్ట్రంలో వివిధప్రాంతాలలో నాటక కళాపరిషత్తులు అందిస్తున్న సేవలు, పరిషత్తులు యిస్తున్న ప్రేరణతో రచనలో, ప్రదర్శనలో జరుగుతున్న వినూత్న ప్రయోగాల ప్రాముఖ్యాన్ని గురించి విశదీకరిస్తుంది తొమ్మిదో ప్రకరణం

టి వీ ఛానల్స్, సినిమాలు నాటకాలకు గట్టి పోటీయిచ్చి నిర్వీర్యపరుస్తున్నా నిరుత్సాహపడకుండా, అంకితభావంతో నాటక రంగాభివృద్ధి కోసం అనవరతం కళాసేవచేస్తున్న కళామూర్తుల ఔత్సాహిక నాటక సమాజాల కృషివృథాపోదనీ, తెలుగు నాటకరంగం తిరిగి తన పూర్వ ఔన్నత్యాన్ని పునస్థాపించుకొంటుందనీ ఆశాభావంతో ముగుస్తుంది ఆఖరి ప్రకరణం

తరతరాల తెలుగు నాటకప్రగతిని వివరిస్తూ గతంలో కొన్నిగ్రంధాలు వెలువడినాయి ఆచార్య పోణంగి శ్రీరామ అప్పారావు గారి 'తెలుగు నాటక వికాసం' 'నాట్యశాస్త్రం', కళాప్రపూర్ణ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారి 'ఆంధ్ర నాటకరంగ చరిత్ర నటరత్నాలు' ప్రామాణిక గ్రంధాలు అంతకుపూర్వం వెలువడిన గ్రంధాలలో శ్రీ పురాణం సూరిశాస్త్రిగారి 'నాట్యాంబుజం' శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రిగారి 'ఆంధ్రనటప్రకాశిక' నాటకరంగ విజ్ఞానాన్ని అందిస్తున్నాయి కానీ పైన పేర్కొన్న గ్రంధాలలో సంప్రదాయ నాటకాలు, ఆనాటినటీనటుల జీవిత విశేషాలు, నటనావైదుష్యం - యిటువంటి వివరాలనే పొందు పరచటం జరిగింది, 1929 నుంచి ప్రారంభమైందని విజ్ఞులు అంగీకరించిన ఆధునిక నాటకం (మోడరన్ డ్రామా) గురించి సమగ్రమైన చరిత్ర, రచన, ప్రదర్శనలపై విశ్లేషణ సంతృప్తికరంగా జరగటంలేదు

ఆధునిక సాంఘిక నాటకం గురించి విశేష పరిశ్రమచేసి మౌలికమైనపరిశోధనా వ్యాసాలు ప్రచురించిన వారిలో కీ శే శ్రీనివాస చక్రవర్తిగారు ప్రాత స్మరణీయులు వారు తయారు చేసిన ఆంధ్రనాటకదర్శిని' తెలుగులో నాటక పరిశోధకులకు భగవద్గీత' వంటిది

నాటకరంగాన్ని విభిన్న కోణాలనుంచి దర్శిస్తూ పలువురు మేధావులు విలువైన వ్యాసాలు, వ్యాససంకలనాలు ప్రచురించారు - అటువంటి వారిలో ఆచార్య మొదలి నాగభూషణశర్మ, డా గంగప్ప, డా పి వి రమణ, శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు ముఖ్యులు

ఆధునిక నాటక చరిత్రను 1930 నుండి 1990 వరకు నాటకరంగపరిణామదశలను వివరిస్తూ శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి 'ఆధునిక తెలుగు నాటకం' (రెండు భాగాలు) 1991లో వెలువరించారు సాంఘిక నాటక చరిత్రపైవచ్చిన మొదటి పుస్తకం ఇదే వీరు ఆంగ్లంలో రచించిన 'ద గ్లింప్సెస్ ఆఫ్ తెలుగు డ్రామా' అనే పుస్తకం కూడా 1995లో ప్రచురించబడింది డాక్టర్ కందిమళ్ల సాంబశివరావు రాసిన 'తెలుగునాటకరంగం - నూతన ధోరణులు,

ప్రయోగాలు' అన్న సిద్ధాంత గ్రంథం 1996లో ప్రచురించబడింది

ఇంతవరకు తెలుగులో వచ్చిన నాటక విమర్శన గ్రంథాలలో సాహిత్యపరమైన విశ్లేషణే కన్పిస్తున్నదిగాని, ప్రదర్శన పరంగా విమర్శలుచాల అరుదుగా వస్తున్నాయి ప్రదర్శనల గురించి సమీక్షిస్తున్నవారిలో డా యస్ గంగప్ప, డా పి వి రమణ, సుబ్బరామిరెడ్డి, కప్పగంతుల మల్లికార్జునరావు ప్రభృతులు గణనీయులు

ఇతర సాహిత్య ప్రక్రియల మీద పరిశోధన చేసేవారికి కావలసిన పుస్తకాలు పుష్కలంగా దొరికితే చాలు, వారి పని నల్లేరుపై బండిలా సాగిపోతుంది కాని, నాటకాలపై పరిశోధన అలాంటిది కాదు పుస్తకాలతోపాటు ప్రదర్శనలు కూడా చూడగలిగినప్పుడే సిద్ధాంత వ్యాసంరాయడం సుళువు అవుతుంది లేనప్పుడు తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదం అవుతుంది

చిన్ననాటినుంచి వస్తున్న అలవాట్లలో విస్తృత గ్రంధపరనం నాటక ప్రదర్శనలు విరివిగా చూడటం, స్వయంగా నటుణ్ణి కావటం, ఔత్సాహిక నాటక సమాజాలతో నాకున్న సన్నిహిత సంబంధాలు యివన్నీ నేటి నా పరిశోధనకు ఎంతగానో తోడ్పడ్డాయి

1980 ప్రాంతాల నుంచీ ప్రచురణ సంస్థలు నాటకాలను ప్రచురించక పోవడంచేత 1980-90 మధ్య కాలంలో ప్రదర్శితమైన నాటక నాటికలను పరిశీలించటం కష్టసాధ్యమైంది మిత్రుల ద్వారాను, నాటక సమాజాల ద్వారాను రాత ప్రతులను తెప్పించుకొని అధ్యయనం చేయటం జరిగింది ఎంత ప్రయత్నించినా కొన్ని రచనలు లభ్యం కాలేదు అలాంటి నాటక, నాటికల విషయంలో, నేను చూసిన ప్రదర్శనలే ఈ పరిశోధనకు అలంబన అయ్యాయి ఉద్దేశపూర్వకంగా ఏ రచననూ అలక్ష్యం చేయటంగాని, చిన్నచూపు చూడటంగానీ జరగలేదు ఏ నాటకం గురించైనా ఇందులో ప్రస్తావించబడకపోతే, ఆ రచన నాకు అలభ్యం కావడమో లేదా నా దృష్టికి రాకపోవడమో తప్ప మరే కారణమూ కాదని మనవి చేసుకొంటున్నాను ఈ విషయంలో రచయితలు, కళాకారులు, సాంకేతిక నిపుణులు సహృదయంతో నన్ను మన్నిస్తారనీ, నాకృషిని ప్రోత్సహిస్తారనీ ఆశిస్తున్నాను

# మొదటి ప్రకరణం

# తెలుగు నాటకం - పుట్టుపూర్వోత్తరాలు

ఆంధ్రనాటక రంగానికి మహోజ్వలమైన చరిత్ర ఉంది ఎందరో మహారచయితలు కమనీయ దృశ్యకావ్యాలను సృష్టించి ముందు తరాల వారికి మార్గదర్శకులయ్యారు అలాగే, ఎందరో మహానటులు, నటీమణులు తమ నటనా వైదుష్యంతో కళాజగత్తును రసవాహినిలో ఉర్రూతలూగించారు అలా వారు నిర్మించిన పటిష్ఠమైన పునాదులమీదనే నేటి మన నాటక సౌధం నిలబడి ఉంది

ప్రతి తరంలోను నాటకకర్తలు విశిష్ట రచనలు చేశారు, చేస్తున్నారు అయితే ఒక తరంలో కళాఖండాలుగా గుర్తింపు పొందిన నాటకాలు మరొక తరానికి నచ్చని సందర్భాలు అనేకం ఉన్నాయి. ఇందులో వింతేమీ లేదు దీనికి కారణం - కాలపరిస్థితులు, మారుతున్న సమాజం, వివిధరంగాలలో వస్తున్న మార్పులు, అభిరుచుల్లో తేడాలని మనం గుర్తించవచ్చు నిజానికి ఈ దృష్టితోనే సమకాలీన నాటక సాహిత్యాన్ని, నాటక రంగ పరిస్థితులను అధ్యయనం చేయవలసి ఉంది

తెలుగులో మొట్టమొదటి రూపకం మంజరీమధుకరీయం' వచ్చినతర్వాత ఇప్పటివరకు సుమారు పదివేల నాటకాలు, నాటికలు, ప్రహసనాలు రూపకవాఙ్మయంలో చోటుచేసుకొన్నాయి వీటిలో ప్రదర్శనా సౌలభ్యంగల నాటకాలు, నాటికలు ఆరువేలకు పైగా ఉన్నాయనటం అతిశయోక్తి కాదు

వస్తు స్వీకరణలోను, దాన్ని సుందరంగా అభివ్యక్తంచేసే నాటక శిల్పంలోను వైవిధ్యాన్ని చూపుతూ, నాటకకర్తలు తెలుగు ప్రజలు గర్వించదగిన మంచి నాటకాలను, నాటికలను రచించి నాటక సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు

ఈ దశాబ్దిలో వెలువడిన నాటకాలను, వాటి ప్రదర్శన రీతులను, నూతన ప్రయోగాల స్వరూప స్వభావాలను గూర్చి అంచనావేసేముందు, ఇంతవరకు జరిగిన నాటకాభివృద్ధిని గురించి, నాటక ప్రస్థానంలో కొన్ని ముఖ్య ఘట్టాలను

గురించి రేఖాప్రాయంగా ఈ సందర్భంలో మననం చేసుకోవలసిన అవసరం ఉంది

క్రీస్తు పూర్వం 5 - 6 శతాబ్దాల నాటికే ఆంధ్రదేశంలో సంస్కృత నాటకాలు వ్యాప్తిలో ఉన్నప్పటికీ, పందొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థం వరకూ తెలుగు భాషలో నాటక ప్రక్రియ అవతరించక పోవటం ఆశ్చర్యం కలిగిస్తుంది "కావ్యేషు నాటకం రమ్యమ్" అనే మాటలోని యధార్థాన్ని గుర్తించికూడ, మనపూర్వులు ఎందుచేతనో స్వతంత్ర నాటక రచనకుకాని, సంస్కృ త నాటకాంధ్రీకరణకుగాని ప్రయత్నించలేదు ఈ విషయంలో దివాకర్ల వెంకటావధానిగారు ఇలా ఊహించారు "సంస్కృత నాటక రచన సన్నగిల్లినను గొందరాంధ్ర పండితులు సంస్కృతములోనే నాటకములు వ్రాసియుండుటను జూచినపుడు తెలుగున నాటకములు రచించుటకేవో కొన్ని యాటంకములుండినట్లు కానిపించును సంస్కృత నాటకములలో గానవచ్చు పాత్రానుగుణ భాషా ప్రయోగము తెలుగున అప్పుడు సాధ్యము కాకపోవుటయు, లాక్షణికులెవ్వరును రూపక లక్షణములను వివరింపకపోవుటయు, నాటక ప్రదర్శనమునకు దగిన రంగపరికరాదులు లేకపోవుటయు, నటులు సంఘబాహ్యులుగా బరిగణింపబడుటయు, నందుకు గారణములై యుండునని యూహింపవచ్చును [1]

అయితే తెలుగు కావ్యాలలో 'నాటకము అనే పదాన్ని అక్కడక్కడా ప్రయోగించడాన్నిబట్టి చూస్తే అసలు ఆంధ్రదేశంలో నాటకమే లేదని కొట్టి పారెయ్యడానికి కూడా వీల్లేదు "ఇటీవల నాగార్జున కొండ త్రవ్వకాలలో దొరికిన ఆరుబయట రంగస్థలం వేలాది ప్రేక్షకులకు సరిపోయే వైశాల్యం కల్గియున్నదనియు, శబ్ద సంయమ సౌకర్యాదులు కల్గియున్నదనియు తెలియుచున్నది ఈ రంగస్థలం క్రీస్తు పూర్వం 560 -480 నాటిదని పురావస్తు శాఖవారు నిర్ణయించుటచే 2500 సంవత్సరాలకు పూర్వమే ఆంధ్రలో రంగస్థలాలున్నట్లు ఇది సాక్ష్యమిస్తున్నది ఉత్సవయాత్రా సందర్భములో

నాటకములు ప్రదర్శింపబడుచుండెనని పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోని వర్ణనలనబట్టి విశదమగుచున్నది అనగా 13వ శతాబ్ది ఉత్తరార్థమునుండి ఈప్రదర్శనములు జరుగుచున్నట్లు కనబడుతున్నది బహుశ ఇవి సంస్కృత నాటకములుగాని, దేశిరచనలైన యక్షగానములుగాని కావచ్చును"[2] అని అభిప్రాయపడ్డారు డా పి వి అచార్

అల్లసాని పెద్దన మనుచరిత్రలో స్వరోచి పుర ప్రవేశ సందర్భంలో "చిలుకల కొల్కి కల్కి యొక చేడియ నాటకశాల మేడపై నిలువుననిల్చి"

అని నాటకశాలా పదము వాడటం వల్ల ఆ రోజుల్లో నాటకశాలలు వుండేవేమో అని అభిప్రాయం కలుగుతుంది మరి ఆ నాటకశాలల్లో సంస్కృత నాటకాలు ప్రదర్శింపబడేవో, తెలుగు నాటకాలో, నృత్య ప్రదర్శనాలో లేదా యక్షగానం వంటి దేశీ రూపక ప్రదర్శనాలో స్పష్టంగా తెలియలేదు

వినుకొండ వల్లభరాయుని క్రీడాభిరామం' అనే వీధినాటకంలోను, కొన్ని పూర్వకవుల చాటువుల్లోను, పూర్వం ఉండిన నటీనటులప్రశంస, ప్రస్తావన కానవస్తుంది

దీనినిబట్టి అర్థమయ్యేది ఏమిటంటే, ఆంధ్రదేశంలో నాటకం అనే పేరుతో కొన్ని ప్రదర్శనలు జరిగేవి కాని అవి నేడు మనం చూస్తున్న నాటకాలవంటివి కాకపోవచ్చు

దక్షిణాంధ్రయుగంలో మధుర, తంజావూరు నాయకుల పోషణక్రింద అనేక యక్షగానాలు రచించబడినట్టు తెలుస్తోంది అవి సంస్కృత రూపక లక్షణానుసారంగా రచించబడకపోయినా, దేశీరచనలతో కూడిన 'దేశీ నాటక భేదములు' గా పండిపామరుల ఆదరణను పొందగలిగాయి ఎలకూచి బాలసరస్వతి, కుందుర్తి వెంకటాచలపతి మున్నగువారు కొన్ని నాటకాలు రాసినట్లు తెలుస్తున్నది గాని అవి లభ్యం కాకపోవటంచేత వాటి స్వరూపము నిర్ణయించటానికి వీల్లేదు

ఏది ఏమైనా, అతిప్రాచీన కాలంనుంచీ కొరవంజి, యక్షగానం, వీదినాటకం, ఏలలు, దరువులు, బొమ్మలాటలు వంటి జానపద కళారూపాలు ప్రజాజివన స్రవంతిలో అంతర్భాగమై, వారికి వినోద, విజ్ఞాన వికాసాలను ప్రసాదించి వారిని అలరించేవనేది పండితులు అంగీకరించిన చారిత్రక సత్యం అటువంటి జానపద కళారూపాలలో నాటక ప్రక్రియ బీజప్రాయంగా ఉన్నా, నాటకం ఒక సమగ్ర రూపాన్ని సంతరించుకున్నది పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధంలోనే

అమలాపురంలో సంస్కృత పండితులైన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారు (1816 - 1900) 'మంజరీ మధుకరీయం' అనే పేరుతో ఒక స్వతంత్ర నాటికను రచించి, తెలుగులో నాటకరచనకు శ్రీకారం చుట్టారు ఆ తొలిదీపం వెలిగిన సంవత్సరం 1860 మంజరీ మధుకరుల ప్రణయ వృత్తాంతమే ఈ నాటకం నాటకం వ్రాయడానికి తెలుగులో అప్పటికి మార్గదర్శక సూత్రాలుగాని, లక్షణ గ్రంథాలుగాని లేవు భరతముని వ్రాసిన నాట్యశాస్త్రం' లోని సంస్కృత నాటక లక్షణాలను, సంప్రదాయాలను స్వీకరించి మంజరీమధుకరీయం' రచించారు ఆ నాటకం ప్రదర్శన యోగ్యం కాకపోవడంవల్లనూ, అప్పటికి నాటక సమాజాలేవీ ఏర్పడకపోవడం వల్లనూ ఆనాటకం ప్రదర్శింపబడలేదు

అయితే, తెలుగులో నాటకరచన విరివిగా సాగటానికి మంజరీమధుకరీయం' తొలిమెట్టుగా మారి స్ఫూర్తినిచ్చింది

అప్పటినుంచి నాటకరచన మూడు పాయలుగా సాగింది

1 సంస్కృత నాటకానువాదాలు, 2 ఆంగ్ల నాటకానువాదాలు, 3 స్వతంత్ర నాటకాలు

1871 సం లో శ్రీ కొక్కొండ వెంకటరత్నంగారు (1842 - 1915) రచించిన నరకాసుర విజయ వ్యాయోగం' వెలువడింది ఇది సంస్కృత నాటకానికి తొలి అనువాదం కొక్కొండవారు ఏర్పరచిన బాటలో మరికొందరు పయనించారు 1872 లో అనువాదం మరొక మలుపు తిరిగింది శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు

(1851 –1897) మొదటిసారిగ షేక్స్పియర్ 'జూలియస్ సీజర్' ఇంగ్లీషు నాటకాన్ని 'సీజరు చరిత్ర' అనే పేరుతో ఆంధ్రీకరించారు ఇది పూర్తిగా పద్య నాటకమే వీరే 'నందకరాజ్యం, అనే పేరుతో ఒక స్వతంత్ర సాంఘిక నాటకాన్ని కూడా రచించారు ఇదే తెలుగులో మొదటి సాంఘిక నాటకం అయితే అప్పటికీ నాటక సమాజాలు ఏర్పడకపోవటం చేత ఈ నాటకాలేవీ ప్రదర్శితం కాలేదు

1880లో తెలుగు నాటకరంగంలో రెండవ దశ ప్రారంభమైంది ప్రప్రథమంగా తెలుగు నాటకానికి ప్రదర్శన భాగ్యం లభించింది శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848 – 1919) 'వ్యవహార ధర్మబోధిని' అనే ప్రహసనాన్ని రచించి, విజయనగరం మహారాజావారి బాలికల పాఠశాలలో విద్యార్థులచేత ప్రదర్శింపజేశారు ఆ విధంగా నాటక సమాజస్థాపనకు, నాటక ప్రదర్శనకు వీరేశలింగంగారు ప్రధములయ్యారు

అలా నాటకరచన, ప్రయోగం ప్రారంభ దశలో ఒంటికాలిమీద కుంటినడక సాగిస్తున్న తరుణంలో 1880వ సంవత్సరంలో ధార్వాడ నాటక సమాజం వారు ఆంధ్రప్రాంతంలోని అన్ని ప్రధాన పట్టణాలలో పర్యటించి, హిందీ, మరాఠీ నాటకాలను విస్తృతంగా ప్రదర్శించారు ఆకర్షణీయమైన ఆ ప్రదర్శనలను చూసి కవులు, కళాకారులు ఆకర్షితులయ్యారు అలాంటి నాటకాలను తాముకూడా ప్రదర్శించాలని కళాకారులలో గాఢమైన కళాతృష్ణ బయలుదేరింది ఆ విధంగా కళాప్రపంచంలో తీవ్ర సంచలనం కలగడానికి, తద్వారా తెలుగులో నూతన సృష్టి జరగటానికి ధార్వాడ నాటకాలు పరోక్షంగా చైతన్యస్ఫూర్తినిచ్చాయి ఆనాటినుంచి తెలుగులో ప్రయోగదశ ప్రారంభమైంది

శ్రీ కందుకూరి 16 నాటకాలను, 50 పైగా ప్రహసనాలను రచించారు బ్రాహ్మవివాహం, వ్యవహార ధర్మబోధిని, - అభిజ్ఞాన శాకుంతలం వీరికి పేరు తెచ్చిన రూపకాలు అభిజ్ఞాన శాకుంతలం ఈనాటికీ ఉత్తమ అనువాద నాటకంగా రసజ్ఞులచేత కీర్తింపబడుతూవుంది సంఘంలోని దురాచారాలను, గుడ్డి నమ్మకాలను, ఏహ్యమైన సంప్రదాయాలను హాస్యధోరణిలో విమర్శించి

ప్రజలలో మార్పులు తెచ్చేందుకు ప్రహసనాలు రచించి మార్గదర్శకులయ్యారు శ్రీ కందుకూరి

ధార్వాడ కంపెనీ ప్రభావంతో, గుంటూరులో కొండుభొట్ల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అధ్యక్షతన గుంటూరు హిందూనాటక సమాజం స్థాపించబడింది శాస్త్రిగారు 31 వచన నాటకాలను రచించారు శ్రీరామ జననము, సీతాకళ్యాణము, ప్రహ్లాదనాటకము, కీచకవధ, యుగంధర విజయము మొదలైన నాటకాలు కొండుభొట్ల వారికి అఖండకీర్తిని తెచ్చిపెట్టాయి అన్నినాటకాలను ఆ సమాజం వారే ప్రదర్శించేవారు ఈ సమాజం 1912 వరకు మహోజ్వలంగా సాగింది

రాజమహేంద్రవరంలో నాటకోద్యమానికి ప్రాణప్రతిష్ఠచేసిన వారిలో వడ్డాది సుబ్బారాయుడుగారు (1859-1938) ముఖ్యులు వీరి 'వేణీసంహారం' నాటకం మూడు దశాబ్దాలు నాటకరంగం మీద రాజ్యం చేసింది రంగస్థలం మీద పద్యాలు పఠించడం అనే పద్ధతిని ప్రవేశపెట్టినవారు సుబ్బారాయుడుగారే రచయిత పాత్రధారణ చేయటం దర్శకత్వం వహించటం అనే సంప్రదాయానికి మూలపురుషులు వడ్డాదివారే

సర్కారు జిల్లాలలో ప్రారంభదశలో నాటక రచన, ప్రదర్శనల పరిస్థితి ఇలావుండగా బళ్లారిప్రాంతంలో శ్రీ ధర్మవరం రామకృష్ణమాచార్యులు (1853-1912) గారి కృషి మరింత ప్రోత్సాహకరంగా ఉంది బళ్లారిలో సరసవినోదినీ సభను స్థాపించి, దాని ద్వారా ఎన్నో నాటకాలను ప్రదర్శింపజేశారు వీరు రచించిన నాటకాలలో చిత్రనళీయం, రసజ్ఞుల మెప్పుపొందింది విషాదసారంగధర, చిరకారి, పాదుకాపట్టాభిషేకము ఆచార్యుల వారికి ఎనలేని కీర్తిని ఆర్జించి పెట్టాయి వీరి కళాసేవను గుర్తించి గద్వాల మహారాజావారు ఆంధ్రనాటక పితామహ' అనే బిరుదునిచ్చి సత్కరించారు

ధర్మవరంవారు తమ నాటకాలలో ఎన్నోకొత్తప్రయోగాలు చేశారు గద్యపద్యాలతోపాటు నాటకాలలో పాటలు, డ్యుయెట్లు ప్రవేశపెట్టారు ఆత్మసంభాషణలద్వారా మానసికసంఘర్షణను వెల్లడించే పద్ధతిని రూపొందించారు

పాత్రచిత్రణకంటే మనస్తత్వ చిత్రణకు, భావ సంఘర్షణకు ప్రాధాన్యమిచ్చారు ఆధునిక సమస్యలను జాతీయభావాలను తమనాటకాలలో ప్రవేశపెట్టిన ప్రజ్ఞావంతుడు తెలుగులో విషాదాంతనాటకానికి ఆద్యులు వీరే ధర్మవరం వారు సుమారు 30 నాటకాలను రచించారు రెండు నాటకాలను కన్నడంలోను, హరిశ్చంద్రనాటకం ఇంగ్లీషులోనూ రచించారు తెలుగు నాటకరంగానికి ధర్మవరం వారి సేవలు చిరస్మరణీయమైనవి

బళ్లారి సీమలో నాటక కళకు అత్యంత సేవచేసిన వారిలో శ్రీకోలాచలం శ్రీనివాసరావు (1854-1919) గారొకరు వీరు సుమారు 30 నాటకాలు రచించారు వాటిలో అత్యధిక భాగం చారిత్రక నాటకాలే 'చారిత్రక నాటకపితామహుడు' అనే బిరుదు వీరిపట్ల సార్థకం మహానటుడు శ్రీ బళ్లారి రాఘవ (1880-1946) వీరి నాటకాలలోనే ప్రముఖ పాత్రలు ధరించి తెలుగు నాటకానికి ఇతర రాష్ట్రాలలో సయితం పేరు ప్రఖ్యాతులు ఆర్జించిపెట్టారు ప్రపంచనాటక చరిత్ర' గ్రంధకర్తగాకూడా కోలాచలంవారు చిరయశస్సును ఆర్జించారు

తెలుగు నాటకరంగం తొలిదశలో కళారంగానికి సేవచేసిన వారిలో శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు (1868-1946) ముఖ్యులు వీరు రచించిన పది నాటకాలలో అత్యున్నత శిఖరాలను చేరుకున్న నాటకం గయోపాఖ్యానం కీచకవధ పారిజాతాపహరణం ప్రసన్నయాదవము, ప్రహ్లాద చరితము వీరియితర నాటకాలు గయ్యాళి గంగమ్మ, బధిర చతుష్టయం బలవంత బ్రాహ్మణార్థం వంటి కొన్ని ప్రహసనాలనుకూడా రచించారు భాసచక్రంలోని 13 నాటకాలను ఆంధ్రీకరించారు వీరు ఆంధ్రామిల్టన్‌గా ప్రసిద్ధులు "భరతఖండంబు చక్కనిపాడియావు" అనే పద్యం రాసి సంచలనాన్ని సృష్టించిన జాతీయకవి దేశభక్తుడు

శ్రీపానుగంటి లక్ష్మీనరసింహారావుగారు (1865-1940) పద్యకావ్యకర్తగా, నాటక రచయితగా, వ్యాసకర్తగా బహుముఖ ప్రజ్ఞానిధులు వీరు 30 నాటకాలు రచించారు వాటిలో పాదుకాపట్టాభిషేకం, రాధాకృష్ణ, విప్రనారాయణ కంఠాభరణం

వీరికి పేరు తెచ్చిన నాటకాలు

ధర్మవరం వారి గద్యపద్యాత్మక నాటకాలు వ్యాప్తిలోకి వచ్చిన తర్వాత, ఇదివరకు వచననాటకాలుగా వున్నవాటిలో చిలకమర్తి, పానుగంటి మొదలైన వాళ్లు పద్యాలను కూడా జోడించారు వారిననుసరించి ఆతరంలో పౌరాణిక నాటకాలు రాసిన కవులందరూ తమ నాటకాలలో విధిగా పద్యాలను ఉంచడం అలవాటు చేసుకున్నారు ఇది నాటక రచయితలకు మంచి ప్రోత్సాహాన్నిచ్చింది నాటకం వ్రాయడం ప్రదర్శించడానికే అన్నభావం రచయితలలో పాతుకుపోయింది అందువల్ల ప్రదర్శన సౌలభ్యాన్ని దృష్టిలో వుంచుకొని నాటక రచన చేసేవారు

శ్రీ గురజాడ అప్పారావు(1865-1915) గారి కలంనుంచి కన్యాశుల్కం' అనే సాంఘిక నాటకం వెలువడింది 1897లో వచ్చిన ఈనాటకం తెలుగు సాహిత్యరంగంలో ఒక నూతన శకానికి నాంది పలికింది కన్యాశుల్కం అనే దుష్ట సాంప్రదాయాన్ని నిశితంగా ఖండించటం ఈ నాటక ప్రధాన లక్ష్యం సున్నితహాస్యం ఈ నాటకానికి ఊపిరి గిరీశం, అగ్నిహోత్రావధానులు, లుబ్ధావధానులు, రామప్పపంతులు, మధురవాణి, బుచ్చమ్మ, వెంకటేశం నేటికీ సజీవ పాత్రలుగా మనకు సాక్షాత్కరిస్తారు వాడుక భాషలో రాయడం పండితపామరులను ఆహ్లాదపరచింది ఇది నూరేళ్లు బ్రతికిన కళాఖండం

1897 లో వెలువడిన మరొక మహానాటకం వేదం వెంకటరాయశాస్త్రి (1853-1929) గారు రచించిన ప్రతాపరుద్రీయం' ఇదేమొట్ట మొదటి చారిత్రక నాటకం ఇందులో యుగంధరపాత్రను మరపురాని విధంగా చిత్రించారు వేదంవారు పాత్రోచిత భాషవాడటం ఈ నాటకంలో ఒక ప్రత్యేకత పేరిగాడు పాత్రలో పలికించిన హాస్యం ఆంధ్రప్రేక్షకులు, రసజ్ఞులు మరచిపోలేనట్టిది ఈ నాటకాన్ని 'నెల్లూరు ఆంధ్రభాషాభిమాని సమాజం' వారు రాష్ట్రవ్యాప్తంగా ప్రదర్శించారు

1920-1925 మధ్యకాలాన్ని పౌరాణిక నాటకయుగంగా' అభివర్ణించవచ్చు ఎందుకంటే ఆ కాలంలో వచ్చిన నాటకాలలో అత్యధిక భాగం పౌరాణిక గాథలే మహాభారత, భాగవత, రామాయణ పురాణాల నుంచి వస్తువును గ్రహించి

వందలాది నాటకాలు రచించారు నాటకకర్తలు రాజులు, జమీందారుల కళాపోషణలో అనేక వృత్తి సమాజాలు వెలిశాయి ఈ వృత్తి సమాజాలు నాటక కళా వికాసానికి అపారమైన సెవచేశాయనడం అత్యుక్తికాదు

కపిలవాయి రామనాథ శాస్త్రి, అద్దంకి శ్రీ రామమూర్తి, సూరిబాబు, స్థానం నరసింహారావు, బందా కనకలింగేశ్వరరావు, బెల్లంకొండ సుబ్బారావు, హరిప్రసాదరావు, మాధవపెద్ది వెంకట్రామయ్య, వేమూరి గగ్గయ్య, సి యస్ ఆర్ ఆంజనేయులు, యడవల్లి సూర్యనారాయణ, దైతాగోపాలం, కందాడై శ్రీనివాసన్, నెల్లూరి నగరాజారావు, ఈలపాట రఘురామయ్య, చిత్తూరు వి నాగయ్య, గోవిందరాజుల సుబ్బారావు వంటి మహానటులు ఈవృత్తి సమాజాలద్వారా పేరు ప్రతిష్ఠలు గడించినవారే

శ్రీ కాళ్లకూరి నారాయణరావుగారు (1871-1927) నవీన భావాలను, సంస్కరణవాదాన్ని జోడించి సంప్రదాయరీతిలో నాటకాలు రచించి ఒక కొత్త ప్రయోగాన్ని చేశారు వీరు రచించిన 'వరవిక్రయం' 'చింతామణి' 'మధుసేవ' నాటకాలు ప్రదర్శనపరంగా అఖండ విజయాన్ని, ఖ్యాతిని సాధించాయి ప్రేక్షకలోకాన్ని వుర్రూతలూగించాయి

తిరుపతి వెంకటకవులు రచించిన పాండవోద్యోగం' 'పాండవ విజయం' నాటకాలు ఉద్యోగవిజయాలు' అనే పేరుతో అసంఖ్యాక ప్రదర్శనలతో రికార్డు స్థాపించాయి పాండవోద్యోగం ఇప్పటికీ ప్రదర్శింపబడుతూనే వుంది భారతీయ నాటకరంగ చరిత్రలో ఇది అపూర్వ సంఘటనేగాక, తెలుగువారు గర్వించదగిన విషయం

శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రి బొబ్బిలియుద్ధం' బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి హరిశ్చంద్ర' ముత్తరాజు సుబ్బారావుగారి 'తులాభారం' ధర్మవరం గోపాలాచార్యులుగారి 'రామదాసు' కొప్పరపు సుబ్బారావుగారి 'రోషనార' సోమరాజు రామానుజరావుగారి 'రంగూన్‌రౌడి' మున్నగు నాటకాలు విరివిగా ప్రదర్శించబడి బహుళ ప్రజాదరణ పొందాయి

దేశభక్తి జాతీయ భావాలను ప్రోదిచేసే నాటకాలు, రాజకీయ నాటకాలు ఆరంభమైనవి శ్రీపాదకామేశ్వరరావుగారి 'చంద్రగుప్త' గుండిమెడ వెంకట సుబ్బారావు గారి రాణాప్రతాప్' దామరాజు పుండరీకాక్షుడుగారి గాంధీవిజయం' కృష్ణమూర్తి శాస్త్రిగారి 'గాంధీ విజయధ్వజం' ఈ కోవకి చెందిన నాటకాలు ఇటువంటి నాటకాలు, పౌరాణిక నాటకాలు విరివిగా రావటంతో పద్యనాటకాల ప్రాబల్యం పెరిగింది కొందరికి నాటకమే జీవనోపాధి అయింది పద్యాలకు ఆదరణపెరిగి, క్రమంగా పద్యాలు కమ్మగా పాడగలనటులే రంగస్థలంమీద రాణించే పరిస్థితి ఏర్పడింది అభినయానికి రంగస్థలంమీద రెండవ స్థానం అయింది పురుషులే స్త్రీ పాత్రలు ధరించేవారు

శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు (1887-1943) నాటక రచనారీతిలో కొత్తదారి ఏర్పరిచారు హేతువాదదృక్పధంతో కురుక్షేత్రసంగ్రామం' 'శంబుక వధ' వంటి నాటకాలను రచించి నాటకరంగంలో విప్లవంలేవదీశారు పురాణ గాధలకు కొత్త భాష్యం చెప్పే ఈ ధోరణి సనాతనాదులకు మింగుడుపడలేదు రామస్వామి చౌదరిగారి మార్గాన్ని అనుసరించి తరువాతి తరంలో చలం 'శశాంక' 'సావిత్రి' 'పురూరవ' వంటి నాటకాలను, ముద్దుకృష్ణ 'అశోకం' ఆమంచర్ల గోపాలరావు 'హిరణ్యాకశిపుడు' మొదలైన నాటకాలను రచించి ఆనాటి సాంప్రదాయవాదుల ఆగ్రహానికి గురి అయ్యారు ఈ ప్రతిఘటనాత్మక నాటకాలు ఏవీ రంగస్థలంమీద రాణించలేక పోయినప్పటికీ, వారి భావాలతో కొందరు ఏకీభవించక పోయినప్పటికీ, ఆ రచయితల కృషి మాత్రం వృథా కాలేదు ఒకే మూసలో, ఒకే ధోరణిలో రాసే రచయితల ఆలోచనా పద్ధతి మారింది నూతనత్వం కోసం అన్వేషణ ప్రారంభమైంది ఈ మేరకు ఆ నాటకకర్తల లక్ష్యం నెరవేరినట్లేననవచ్చు

1930 - 1947 మధ్యకాలంలో నాటక రంగంలో అనేక మార్పులు వచ్చాయి ప్రపంచయుద్ధం ఫలితంగా ఏర్పడిన ఆర్థిక మాంద్యం అన్ని రంగాలమీద తన ప్రభావాన్ని చూపింది నాటక కళాపై జమీందారుల ఆదరణ సన్నగిల్లింది వృత్తి

సమాజాలు నిలదొక్కుకోలేక పోయాయి 1930 నాటికి కాంట్రాక్టర్లు రంగప్రవేశం చేశారు నటులలో అనైక్యత, పోటీ పెరిగాయి పోరాటంలో ఎవరిదారి వారిదైంది ఈ కాలంలోనే చలనచిత్రాలు మొదలయ్యాయి క్రమంగా మూకీ చిత్రాలు, టాకీ చిత్రాలుగా పరివర్తన చెందటంతో ప్రసిద్ధ రంగస్థలనటులు సినిమారంగం వైపు ఆకర్షితులయ్యారు మహోజ్వలంగా వెలిగిన నాటకరంగం క్షీణదశవైపు సాగిపోతోంది వ్యాపారదృష్టితో నాటకాలు వేయించే కాంట్రాక్టర్ల దోపిడీ విధానానికి నాటకరంగం, కళాకారులు బలి అయ్యారు

కాంట్రాక్టు నాటకాల మీద ప్రజలలో అనాదరణ పెరిగింది ఆ పరిణామం సాంఘిక నాటకం వృద్ధి చెందడానికి పరోక్షంగా వీలు కల్పించిదనవచ్చు 1930 లో శ్రీ బళ్ళారి రాఘవ దర్శకత్వంలో మద్రాసులో ప్రదర్శించబడిన శ్రీ రాజమన్నార్ నాటకం 'తప్పెవరిది ?' సాంఘిక నాటకోద్యమానికి నాంది పలికింది ఆనాటి ప్రదర్శనలో స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించడం ఓ అపూర్వ సంఘటన అప్పటినుంచీ సాంఘిక నాటకాలకు అనువైన వాతావరణం ఏర్పడింది

శ్రీ పి వి రంగారామ్ రచించిన 'దంపతులు' శ్రీ కాళ్లకూరి హనుమంతరావు, "లేడీ డాక్టర్', సబ్నవీసు రామారావు గారి రైతుబిడ్డ', శ్రీ మల్లాది అవధాని గాలివాన', భమిడిపాటి కామేశ్వరరావుగారి వద్దంటే పెళ్ళి', 'తప్పనిసరి', ముద్దు కృష్ణగారి 'టీ కప్పులో తుఫాన్', 'అడయిక్కప్ప పిళ్లై' మొదలైన నాటకాలు జనరంజకంగా ప్రదర్శించబడినాయి సాంఘిక నాటకాలపట్ల ప్రజలలో ఆదరణ పెరిగింది

ముప్ఫయవ దశకం ఏకాంకికలకు స్వాగతం పలికింది శ్రీయుతులు భమిడిపాటి కామేశ్వరరావు, రాజమన్నార్, నార్ల వెంకటేశ్వరరావు, విశ్వనాధ కవిరాజు తదితరులు నాటికలను విరివిగా రచించి ప్రాచుర్యంలోకి తెచ్చారు ఇంతవరకు పౌరాణిక నాటకాలు ప్రదర్శించే ఔత్సాహిక నాటక సమాజాలు కూడా క్రమక్రమంగా వెలుగులోకి రాసాగాయి హైస్కూళ్ళు, కళాశాలలు నాటికలను ప్రదర్శించి రచనా విస్తృతికి దోహదం చేశాయి

1940 నుంచే నాటకరంగంలో నిర్మాణాత్మకమైన కృషి జరిగింది 1943 లో

ఆంధ్రనాటక కళాపరిషత్తు పునర్వ్యవస్థీకరించటంతో ఔత్సాహిక నాటకరంగంలో విప్లవాత్మకమైన మార్పులొచ్చాయి పరిషత్తు ఆధ్వర్యంలో ప్రతి ఏటా నాటక పోటీలు నిర్వహించబడటంతో అనేకమంది కొత్త రచయితలు, నటినటులు సాంకేతిక నిపుణులు వెలుగులోకి వచ్చారు సాహిత్యపువిలువలు, ప్రదర్శనార్హత, సామాజిక స్పృహగల నాటకాలు, నాటికలు సృష్టించబడినాయి

అదే సంవత్సరంలో, శ్రీ కె వి గోపాలస్వామి నేతృత్వంలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రయోగాత్మక నాటకసమితి స్థాపించబడింది వందలాది నాటకాలను, నాటికలను రంగస్థలంపై ప్రదర్శింపజేసి ఆంధ్రదేశంలో 'కాలేజీ నాటకరంగానికి' ఆద్యులయ్యారు గోపాలస్వామిగారు ప్రయోగ సౌలభ్యం లేని నాటకాలను కూడా ఎన్నుకొని వాటిని ఆ రంగస్థలంపై అద్భుతంగా ప్రదర్శింపజేసి ఆ రచనలకు ప్రాణంపోశారు సాంకేతిక విలువలతో కూడిన నాటకాలను కొత్త తరహాలో, ప్రదర్శన రీతుల్లో మార్పులు చేసి, ఒక కొత్త వరవడికి మార్గదర్శకు లయ్యారు గోపాలస్వామిగారు

1945 లో స్థాపించబడిన ఆంధ్ర ప్రజా నాట్య మండలి సాంఘిక నాటకోద్యమాన్ని ఉధృతంగా నడిపింది నాటకరంగంలో విప్లవాత్మకమైన మార్పులు తెచ్చింది ముఖ్యంగా అడుగంటిపోతున్న జానపద కళారూపాలను ప్రోత్సాహించి అభివృద్ధిపరిచింది నాటకాన్ని ప్రజలమధ్యకు తీసుకువెళ్ళిన ఘనత ప్రజానాట్యమండలికే దక్కుతుంది సుంకర - వాసిరెడ్డి రచించిన ముందడుగు' 'మాభూమి' నాటకాలను చేపట్టి వేలకొలది ప్రదర్శనలిచ్చింది ప్రజానాట్యమండలి శ్రీ గరికపాటి రాజారావు, శ్రీ కోడూరి అచ్చయ్యగార్ల సారధ్యంలో ప్రజానాట్యమండలి ఆంధ్ర సాంస్కృతికోద్యమానికి అనుపమానమైన సేవచేసింది

శ్రీ కొప్పరపు సుబ్బారావు స్థాపించిన లిటిల్ థియేటర్ ఉద్యమం, నాటకరంగంలో నటులకు శిక్షణయివ్వడానికి, సాంకేతిక విలువల పరిరక్షణకు అవిరళ కృషిచేసింది సుబ్బారావుగారు తారాశశాంకం' వంటి పౌరాణిక నాటకాన్ని, 'రోషనార' వంటి చారిత్రకనాటకాన్ని, 'ఇనుపతెరలు' వంటి సాంఘిక నాటకాన్ని సాంప్రదాయ

పద్ధతిలోను, ఆధునిక పద్ధతిలోనూ వ్రాసి ప్రజామన్నన పొందిన ప్రతిభాశాలి అల్లీమురా' పేరుతో ప్రప్రథమంగా సంగీత నాటికను రాసి వేయి ప్రదర్శనలిచ్చి సంగీత నాటికలకు ఆద్యులయ్యారు

1940 ప్రాంతాలలో ఆచార్య ఆత్రేయ నాటకరంగ ప్రవేశంతో వాస్తవికతావాదం రూపురేఖలు దిద్దుకుంది మధ్యతరగతి మనిషిని కథానాయకుణ్ణి చేసి, ఆకాశంలో విహరించే నాటకాన్ని నేలమీదికి తెచ్చి నిత్యజీవితానికి దగ్గరగా చూపించాడు రచనలోను, ప్రదర్శనా విధానంలోను కొత్తపుంతలుతొక్కి వాస్తవికతావాదాన్ని సుప్రతిష్ఠితం చేశారు నాటకరంగంలో 1940 నుంచి 1954 వరకు ఆత్రేయ చేసిన కృషి అపారము వైవిధ్యంతోకూడిన 10 నాటకాలను 15 నాటికలను నాటకరంగానికి అందించారు ఎన్ జి ఓ (గుమస్తా), పరివర్తన, విశ్వశాంతి, కప్పలు, భయం, ఈనాడు మొదలైన నాటకాలు, ప్రగతి, ఎవరు దొంగ, అంత్యార్పణ, చావకూడదు, వరప్రసాదం మొదలైన నాటికలు ఆత్రేయగారిని ఆధునిక నాటకానికి మూలపురుషుడుగా నిలబెట్టాయి

1950 - 59 ఆంధ్రనాటక రంగంలో స్వర్ణయుగం, వస్తు వైవిధ్యంగల నాటకాలకు, నాటికలకు కాణాచి ఈ దశాబ్ది ,

గ్రామీణ జీవితాన్ని నేపథ్యంగా తీసుకుని శ్రీ కొడాలి గోపాలరావు పేదరైతు, లంకెబిందెలు, దొంగవీరడు, చైర్‌మెన్ వంటి నాటకాలు రచించారు శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి రచించిన కులంలేని పిల్ల, అన్నాచెల్లెలు, పల్లెపడుచు నాటకాలు ఔత్సాహిక నాటక సంఘాలచే అమితంగా ఆదరించబడ్డాయి స్త్రీ సమస్యలపై వచ్చిన నాటకాలలో బెల్లంకొండ రామదాసుగారి పునర్జన్మ', రాచకొండవారి 'తిరస్కృతి' పేర్కొనదగినవి ప్రేమతత్వంపై బుచ్చిబాబుగారి 'ఆత్మవంచన', కె యల్ నరసింహారావుగారి 'క్రీనీడలు' ఆలోచింపజేసే నాటకాలు

తెలుగు నాటకరంగంలో డాక్టర్ కొర్రపాటి గంగాధరరావుగారు శతాధిక నాటకాలు, నాటికలు రచించిన ఏకైక నాటకకర్త గుడ్డిలోకం, కమల, యథాప్రజా తథారాజా, నాటకాలు - తెలుగుకోపం, బంగారు సంకెళ్ళు, పెండింగ్‌ఫైల్, వంటి నాటికలు గంగాధరరావుగారి రచనా చమత్కృతిని, ప్రయోజన దృష్టిని ఆవిష్కరించే

చక్కటి రచనలు కొర్రపాటివారి నాటక, నాటికలు ప్రదర్శించబడని రంగస్థలం ఆంధ్రదేశంలో ఉండదు స్త్రీ పాత్రలేని నాటికలను బహుళ ప్రచారంలోకి తెచ్చిన నాటక రచయిత కొర్రపాటి

శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ రచించిన కీర్తిశేషులు' 'ఇదేమిటి?' నాటకాలు, మనస్తత్వాలు, దంతవేదాంతం మొదలైన నాటికలు ఆంధ్ర ప్రేక్షకుల్ని అలరించాయి

ఈ దశాబ్దిలో అనువాద నాటకాలు కూడా ప్రముఖ స్థానాన్ని సంపాదించాయి కొప్పరపు సుబ్బారావుగారి 'ఇనుపతెరలు', డి వి నరసరాజుగారి 'నాటకం', 'వీలునామా', రెంటాల గోపాలకృష్ణగారి 'ఇనస్పెక్టర్ జనరల్' ప్రఖ్య శ్రీరామమూర్తిగారి 'ఫణి', 'కాళరాత్రి' నాటకాలు ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు

అలాగే ఈ దశాబ్దంలో ఉన్నత ప్రమాణాలుగల నాటికలు ఎన్నో వచ్చాయి కావ్యశ్రీగారి మానవుడు', స్వీకారం', పి వేణు - రమణారెడ్డి గార్ల రాజీవం', యన్ ఆర్ నందిగారి పుణ్యస్థలి', అంగర సూర్యారావుగారి కళోద్ధారకులు', శ్రీ ముది గొండ లింగమూర్తి రచన వెంకన్న కాపురం', శ్రీ కారెపు అప్పలస్వామి ఈ రోజు బ్రాకెట్ గొల్లపూడి మారుతీరావుగారి అనంతం', అశేష ప్రజాదరణ పొందిన నాటికలలో కొన్ని ఈ దశాబ్దిలో వెలువడిన నాటకాలలో మెలోడ్రామాకు ప్రాధాన్యం హెచ్చింది ఒకే సెట్టుమీద జరిగిపోయేలా నాటకరచన చేయటంవల్ల ప్రదర్శనలో కృత్రిమత్వం చోటు చేసుకుంది

1960 –70 మధ్యకాలాన్ని నాటకరంగానికి ఆటవిడుపుగా భావించవచ్చు ఈ కాలంలో నాటకరచన మందకొడిగా సాగింది అయితే ఉత్తమ శ్రేణికి చెందిన నాటక, నాటికలు కొన్ని రాకపోలేదు

రాచకొండ విశ్వనాధశాస్త్రిగారి నిజం', దాసం గోపాలకృష్ణ రచించిన చిల్లరకొట్టు చిట్టెమ్మ', గొల్లపూడిమారుతీరావుగారి 'రాగరాగిణి', శ్రీ మోదుకూరి జాన్సన్ 'నటనాలయం' ఆర్ వి యస్ రామస్వామి 'గాలివాన', డా పి వి రమణగారి 'చలిచీమలు' విజయవంతంగా ప్రదర్శించబడి జనాదరణ పొందిన నాటకాలు

శ్రీయన్ ఆర్, నంది రచించిన మరో మొహెంజోదారో' సంచలనాత్మకమైన

ప్రసిద్ధ నాటకం ఐతిహాసికత (ఎపిక్ థియేటర్)తో వ్రాయబడిన మొదటి నాటకం ఇది తాదాత్మ్య విచ్ఛేదనం (ఎలియనేషన్)ప్రదర్శనలో అడుగడుగునా కన్పిస్తుంది తెలుగు నాటకాల్లో ఫ్రీజ్ అనే పద్ధతిని ప్రవేశపెట్టినవారు నందిగారే! ఈ పద్ధతి అనేక నాటకాలకు వరవడి అయింది మరో మెహెంజోదారో' అనేక భాషల్లోకి అనువదింపబడి మేధావి వర్గాన్ని విశేషంగా ఆకర్షించింది

అరవయ్యవ దశకంలో కొన్ని మంచి నాటికలు కూడా వచ్చాయి వాటిలో వేలూరి శివరామశాస్త్రిగారి 'సుల్తానీ', ఆవుల శ్రీనివాసరావుగారి 'ఉలిపికట్టె', శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు 'సాలెగూడు', 'పరిష్కృతి', ఆదివిష్ణుగారి 'అతిధి' దేవుళ్లొస్తున్నారు', గణేష్‌పాత్రోగారి కొడుకు పుట్టాల', 'ఆగండి కొంచం ఆలోచించండి' , తారక రామారావుగారి 'పరుడుకావాలి', 'ఇదీలోకం', యండమూరి వీరేంద్రనాధ్‌గారి 'కుక్క', సముద్రాల అప్పలాచార్యులుగారి 'తులసితీర్థం', చింతపల్లి హనుమంతరావుగారి జ్వలితజ్వాల' ఆంధ్ర రంగస్థలాన్ని అలరించిన నాటికలు

1970 - 80 మధ్యకాలంలో వెలువడిన నాటకాలలో కుటుంబ వ్యవస్థను చిత్రించే నాటకాల సంఖ్య తగ్గిపోయింది నాటకాలపై రాజకీయాలప్రభావం హెచ్చింది పరుచూరి వెంకటేశ్వరరావుగారి రచన 'సమాధి కడుతున్నాం చందాలివ్వండి' , కాశీ విశ్వనాధ్‌గారి 'మీరైతే ఏం చేస్తారు?' దీనికి చక్కని ఉదాహరణలు

ప్రదర్శనాదృష్టితోనే నాటకాలు రాయడం, దానిమీదే దృష్టి కేంద్రీకరించటంవల్ల సాహిత్యవిలువలు దిగజారిపోయాయి రచయితలకు హాస్యరచనలపై చిన్నచూపు ఏర్పడింది నాటకపోటీలను దృష్టిలో ఉంచుకొని నాటకాలు రాస్తుండటంవల్ల పరిషత్ మసాలాతో కూడిన మూసనాటకాలు తయారవుతున్నాయి నాలుగు కాలాలపాటు నిలిచే ఉత్తమ ప్రమాణాలుగల నాటక సృష్టికి నేటి రచయితలు కంకణబద్ధులు కావలసి ఉంది

1980 నాటికి తెలుగు నాటకరంగంలో నెలకొని ఉన్న పరిస్థితులివి వీటిని దృష్టిలో పెట్టుకొని 1980-90 దశాబ్దిలో వచ్చిన నాటకనాటికలను ఇక్కడ పరిశీలించడమైంది

# ఆధునిక నాటకం - వస్తువైవిధ్యం

ఒక వస్తువులాగే మరొక వస్తువు ఉంటే, ఆరెండో వస్తువుకు అంత ప్రాముఖ్యం ఉండదు భిన్నత్వం ఉండాలి ఏ వస్తువుకావస్తువు విడివిడిగా ప్రత్యేకత కలిగివుంటే అటువంటి వస్తువులన్నీ ఆకర్షణీయంగా కనబడతాయి అంటే, మనస్సు ఎప్పుడూ వైవిధ్యంవైపు మొగ్గుచూపుతుంది ఈ సూత్రం సాహిత్యానికీ, కళలకు కూడా వర్తిస్తుంది

కథా వస్తువులో నాటకాలన్నీ ఒకే తీరులోవుంటే అటువంటి నాటకాలు ఆదరణ పాత్రం కాలేవు ఏ నాటకానికి ఆ నాటకం విభిన్నంగా కనిపించకపోతే ఆ రచనకు విలువుండదు నూరు కాకుల్లో ఒకటి అవుతుంది, కాని హంసకాలేదు అందువల్లనే ప్రతి రచయితా, ప్రతి కళాకారుడూ నిత్యనూతనత్వం కోసం, వైవిధ్యం కోసం అన్వేషణ సాగిస్తూనే ఉంటాడు ఈ అన్వేషణ కళా సాహిత్య సృష్టికి ఊపిరి

నాటకాల విషయానికొస్తే – వస్తువులో మార్పు ఉన్నంత మాత్రాన సరిపోదు రూపం కూడా మారుతూ ఉండాలి వస్తువు (కన్‌టెంటు) సాహిత్యసంబంధి, రూపం (ఫామ్) ప్రదర్శన సంబంధి ఈ రెండింటి సమ్మేళనంతోనే ఉత్తమ కళాఖండం ఆవిర్భవిస్తుంది

వస్తువు బాగున్నా, దానికి సరియైన రూపం లేకపోతే రాణించలేదు ఉదాహరణకు ' యన్ ఆర్ నందిగారు రచించిన మరోమొహెంజదారో' నాటకంలో కథావస్తువులో నూతనత్వం ఉన్నా, ఆనాటకంలో ఎపిక్ థియేటర్లో అంతర్భాగమైన ఎలైనేషన్ (తాదాత్మ్య విచ్ఛేదనం) అనే వినూత్న ప్రక్రియను ప్రవేశపెట్టి ప్రదర్శనకు కొత్తరూపాన్ని అందించడంచేత ఆ నాటకం నాటక రంగంలో ఒక మైలురాయి అయింది

ఈ దశాబ్దంలో (1980-90 మధ్యకాలంలో) తెలుగులో వైవిధ్యంతో కూడిన నాటక నాటికలు వచ్చాయి అవన్నీ వస్తువులోను, రూపంలోను వైవిధ్యం

కలిగినవి సమకాలీన సమాజాన్ని నిశితంగా పరిశీలించి, అన్ని రంగాలలోను సముచితమైన మార్పులు తేవాలని, సామాజికుల్లో చైతన్య స్ఫూర్తిని కలిగించాలన్న సత్సంకల్పంతో ఈ రచనలు వెలువడ్డాయని చెప్పవచ్చు

ఆధునిక నాటకాలలోని వస్తువైవిధ్యాన్ని 1 మతసామరస్యం 2 విద్యావ్యవస్థ 3 పోలీసు వ్యవస్థ 4 వైద్యవ్యవస్థ 5 హాస్యం 6 మనస్తత్వం అనే అంశాలుగా వింగడించి పరిశీలించడమైంది

## మతసామరస్యం

సృష్టిలో మనుషులంతా ఒక్కటే, అందరూ సమానులే కులమతాలు మానవనిర్మితాలు మతం అనేది మనిషి చేసినదే అయినా, అది మనిషి అదుపుతప్పిపోతోంది మతం అనే ముసుగులో ఎంత అరాచకాన్ని సృష్టించినా మనుషులు విచక్షణ కోల్పోయి దానికి ఆమోదముద్ర వేస్తున్నారు ఏ మతమూ హింసనూ, అన్యాయాన్ని, అరాచకత్వాన్ని ప్రోత్సహించదు మానవత్వాన్నే ప్రబోధిస్తుంది కాని నేటి సమాజంలో, మతంతో మానవత్వం కలసి సహజీవనం చేయడం కష్టసాధ్యమవుతున్నది ఈ పరిస్థితిని మార్చి ప్రపంచాన్ని వసుధైక కుటుంబం అనే మార్గంలో పయనింపచేయడానికి ప్రతితరంలోనూ మహాపురుషులు ఎందరో అకుంఠిత కృషి చేశారు తమ ప్రాణాలను సయితం అర్పించారు ఈ లక్ష్య సాధనకు సంఘసేవకులతోపాటు కవులు, కళాకారులు కూడా తమవంతు సహకారాన్ని అందిస్తూనే ఉన్నారు మతసామరస్యం కోసం మేధావులు ఉపన్యాసాలిస్తే, గ్రంధాలు రాస్తే, వ్యాసాలు ప్రకటిస్తే, నవలారచయితలు నవలలతోను, కథకులు కథలతోను, కళాకారులు అనేక కళారూపాలతోను, నాటకకర్తలు నాటకాలతోను మతసామరస్యాన్ని సాధించటానికి ప్రయత్నిస్తున్నారు

మతసామరస్యాన్ని బోధించే నాటికలు కొన్ని గతంలో వచ్చాయి శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు రాసిన రామదాసు' (1920) నాటకంలో కబీరు పాత్రద్వారా

హిందూ – ముస్లిమ్ సఖ్యతను గురించి ప్రబోధించటం జరిగింది కబీరు పాత్రను అందుకోసమే ఉద్దేశించినట్లు స్పష్టమౌతుంది శ్రీ కొప్పరపు సుబ్బారావు రచించిన రోషనార' (1921) నాటకంలో రోషనార పాత్ర చిత్రణలో ముఖ్యోద్దేశం హిందూ – ముస్లిమ్ సహజీవన భావమే అయినా, ముస్లిమ్ మతస్థులు కొన్ని అభ్యంతరాలు చెప్పిన కారణంగా బ్రిటిష్‌వారిచే ఈనాటకం నిషేధించబడింది [1]

సుంకర – వాసిరెడ్డిగార్ల మాభూమి' ముందడుగు' నాటకాలు, ఆచార్య ఆత్రేయగారి ఎవరుదొంగ' నాటిక ప్రభుత్వ నిషేధానికి గురి అయ్యాయి ఆచార్య ఆత్రేయగారి ఈనాడు' (1947) నాటకం మతసామరస్యాన్ని ప్రతిపాదించిన పూర్తిస్థాయి నాటకం దీనిపేరు ఇటీవలి కాలంలో 'రాం-రహీమ్'గా వ్యవహరించబడుతోంది. 'హజరాబేగం రాసిన కథను చదివి ద్రవీభూతుడై ఆత్రేయ ఈనాడు' నాటకం వ్రాశారు దీని ఇతివృత్తం – ఒక ఇంట్లో, అన్నదమ్ముల్లా జీవిస్తున్న హిందూ – ముస్లిమ్ కుటుంబాలలో, బ్రిటీష్‌వారు మతం పేరుమీద కలహాలు రేకెత్తించి, ఒకర్నొకరు చంపుకొనే హత్యలకు దారి తీయించడమే ఒకే సెట్టులో తెరలేచి తెరపడేలోపల ఏకబిగిని సాగిపోయే నాటకం 'ఈనాడు' ఈ నాటకంలో హిందువు ఇంట్లో గాంధీ పటం వుంటుంది ముస్లిం యువకుడు రహీం, హిందూయువకుడైన రామ్ మీద కత్తివిసరుతాడు రామ్ తప్పుకుంటాడు కత్తి గాంధీ పటానికి తగిలి అద్దం బద్దలై పటం క్రిందపడుతుంది అంటే గాంధీజీ హత్యకు ముందే, ఆత్రేయ ఊహించి వ్రాసిన సన్నివేశమిది"[2] అనవచ్చు

## మనుషులంతా ఒక్కటే

ఆత్రేయ తర్వాత 1980 వరకు మతసామరస్యం మీద నాటకాలు రాలేదు ఈ దశాబ్దంలో (1980–90) మతసామరస్యం మీద వచ్చిన నాటికలలో శ్రీ బి సూర్యారావు రచించిన మనుషులంతా ఒక్కటే' మొదటిది అన్ని మతాలవారు సామరస్యంతో జీవించినప్పుడే దేశం శాంతి, సౌభాగ్యాలతో వర్ధిల్లుతుందనీ సందేశం ఋచ్చారు ఆనాటికలో, కాని చర్చి ఫాదర్‌ని ఒక హాస్యపాత్రగా సృష్టించడం ఈ నాటికలో అంతసబబుగాలేదు

# గాలిగోపురం

శ్రీ జలదంకి సుధాకర్ రచించిన 'గాలిగోపురం' మత సామరస్యాన్ని మానవత్వాన్ని ప్రబోధించే నాటిక

'మనిషికీ మనిషికీ మధ్య మతం, చెట్టునీడకావాలేగాని, అడ్డుగోడ కాకూడదు' [3] అన్న పూజారి పరమేశ్వరశాస్త్రి మాటల ద్వారా మానవత్వానికి పట్టం కట్టారు నాటకకర్త "గుడి, మసీదు రెండూ ఆలయాలే ఆదేవుడికి నిలయాలే రెండింటికీ గోపుర నిర్మాణంలో తేడాలున్నా మొనదేలిన శిఖరాగ్రంలో పోలికలున్నాయి గాలి గోపురంలో పడున్నమీరు అహంకారాన్ని కోరికల్ని చంపుకుని శిఖరాగ్రం చేరి పరమాత్మలో లీనం కాలేక, తరతమ బేధాల్ని, స్వార్ధాన్ని త్యజించి ఇటు మనుషుల్లో మమైకం కాలేక, మతాలపేరుతో గోపురంమొదటి మెట్టులోనే కొట్టు మిట్టాడుతున్నారు" [4] అని ఖాశిం అనే ముస్లిమ్ పాత్రచేత పలికించడంలో కావ్యార్ధం మరింత స్పష్టంగా బోధపడుతుంది

అయితే, మనిషికీ మనిషికీ మధ్య మత సంఘర్షణహేతువు కావడం అనేది ఈ నాటికేతివృత్తంకాదు ఒక వ్యక్తి స్వార్ధప్రయోజనాన్ని సాధించడం కోసం, మతాన్ని ఒక ఆయుధంగా వాడుకోవడం మాత్రమే ఉంది ఈ నాటికలో నిష్ఠాగరిష్ఠుడైన పూజారిని తొలగిస్తే తన రాబడి పెరుగుతుందనే స్వార్ధబుద్ధితో, సమయంకోసం ఎదురుచూసే ధర్మకర్త వీరాస్వామికి, ఖాశిం అనే ముస్లిమ్ వ్యక్తికి పూజారి ఆశ్రయంయిచ్చి ఆలయాన్ని అపవిత్రం చేశాడనే సాకు దొరుకుతుంది పక్షవాతంవచ్చి పూజావిధులు నిర్వర్తించలేని అసహాయస్థితికి చేరుకుంటాడు పూజారి ఉన్నవీలేనివీ కల్పించి పూజారిని రెచ్చగొట్టి, మానసికంగా హింసించి, కుటుంబంతో సహా ఊరువిడిచి పోయేట్టు చేయడంలో కృతకృత్యుడౌతాడు వీరాస్వామి

అతని వెనుక మతంలేదు ప్రజలులేరు మానవత్వానికి తిలోదకాలిచ్చిన స్వార్ధం ఒక్కటే ఉంది కష్టాలకడలిలో పయనించే పరమేశ్వర శాస్త్రి కుటుంబానికి అండగా ఖాశిం ప్రయాణమవుతూ "వేం హిందువులంకాము

ముసల్మానులంకాము మానవుడి సంతతి మేము - మనుషులమే అవుతాం' 5' అన్న మాటల్లో బరువైన సందేశం, బలమైన తర్కం, చేదు నిజం ఉంది నాటికలో అక్కడక్కడా చమత్కారపు జల్లులు బహిర్గతమవుతాయి ఈ నాటికలో పరమేశ్వరశాస్త్రి, ఖాశిం పాసివ్ సఫరర్స్‌గా ఉండిపోతారు ప్రతిఘటనకు పూనుకోరు ఇది కొంత వెలితి అనిపిస్తుంది రచనారీత్యా

అన్ని సిద్ధాంతాలు విడమర్చి చెప్పగలిగినవారు చివరకి నిస్సహాయంగా ఊరు విడిచి పోవడానికి ఉద్యుక్తులు కావడం అనే సంఘటన, నాటకకర్త తీసుకున్న సమస్యను బలహీనపరుస్తుందేతప్ప బలపరచదు నిరాశావాదానికి పలాయనవాదానికి దగ్గరవుతుందనవచ్చు

## అ యో (వ) ధ్య

శ్రీ సంజీవి రచించిన 'అయో(వ)ధ్య' (1990) నాటికలో ఇతివృత్తంకూడా మతసామరస్యమే అయినా, సమస్యవేరొక దృక్కోణంనుంచి పరిశీలించబడింది

మతసహనం, సామరస్యం, సహజీవనం అనేవి మాటల్లో వుంటాయేగాని, మనసుల్లో ఉండటంలేదు పైకి ఎంత విశాల హృదయం వున్నట్టు మాట్లాడినా సంకుచితంగా ఆలోచిస్తుంది మనస్సు మతం పేరిట జరిగే అల్లర్లకు ఊపిరి సిద్ధాంతపరమైన, మతపరమైన తేడాలుకావు ఏదోవిధంగా మంటలు రేపి లబ్ధి పొందాలన్న దుర్బుద్ధితో చిన్న చిన్న వైయక్తిక కారణాలతో ఏర్పడే సమస్యను భయంకరంగా మార్చి, దాన్ని రాజకీయం చేసి పబ్బం గడుపుకోవాలనుకుంటారు కొందరు స్వార్థపరులు మతకల్లోలాలలో ఎక్కువ నష్టపోయేది పేదవాళ్లు, అమాయకులే మతోన్మాదానికి కారణం మనిషిని మనిషి సరిగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించకపోవడమేనని అయో(వ)ధ్య' నాటికలో వివరించారు శ్రీ సంజీవి

ఈ నాటికలో శాస్త్రి కొడుకు రామకృష్ణను ముల్లా కూతురు ఫాతిమాప్రేమిస్తుంది వారి వివాహానికి మతం అడ్డొస్తుంది రామకృష్ణను ముస్లింలు నిలువునాకాల్చేస్తారు

శాస్త్రి ఫాతిమాను ఇంట్లో పెట్టి దహనంచేస్తాడు మతద్వేషం కార్చిచ్చులా వ్యాపిస్తుంది

మతమౌఢ్యం మీద విమర్శనాస్త్రాలు సంధించారు రచయిత అతి సున్నితమైన 'మతం' అనే అంశం మీద నిర్భయంగా వ్యాఖ్యానించటం జరిగింది అయితే మతసామరస్యం స్థానంలో మతద్వేషం ప్రధానంగా నిలిచినట్టు కన్పిస్తోంది నాటకకర్త అనుకున్న లక్ష్యం ప్రతీపధోరణిలో సాగింది

ఇటువంటి రచనాతత్వాన్ని దృష్టిలోపెట్టుకుని ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు శ్రీ సంజీవదేవ్, 'సత్యం-శివం-సుందరం' అనే నాటికకు పీఠిక రాస్తూ' నాటకాల్లో సమాజంలోని మంచితనాన్ని చిత్రిస్తూ మంచిని ప్రబోధించటం ఒక విధానం చెడును చిత్రిస్తూ మంచిని ప్రబోధించటం ఇంకో మార్గం మంచిని చిత్రించటం అనేది ఆ మంచిని గ్రహించమనీ, చెడును చిత్రించటం ఆ చెడును విసర్జించమనీ అయితే ఒక్కసారి ఆ రెండో విధానంతో ఒక్క ప్రమాదం జరిగే అవకాశంకూడా వుంటుంది అదే చెడును గ్రహించటం మంచి కంటే చెడు మనిషిని సులభంగా ఆకర్షిస్తుంది ఏదిచెడు, ఏదిమంచి అనే ప్రశ్న వేరే విషయం అదంతా దేశకాల పరిస్థితులమీద ఆధారపడి వుంటుంది అందు కని చెడును ప్రదర్శించాల్సి వచ్చినపుడు ఆచెడుమీద ప్రేక్షకులకు ద్వేషం కలిగే పద్ధతిలో ప్రదర్శించాల్సిందేకాని, ఆకర్షణ కలిగే పద్ధతిలో కాదు''[6] అని పేర్కొన్నారు

శ్రీ సంజీవదేవ్ చెప్పిన రెండవ విధానం, సంజీవిగారి అయో(వ)ధ్య' నాటికకు అన్వయించే ప్రమాదం లేకపోలేదు

పరమతద్వేషాన్ని విసర్జించి మాతృభూమికి కృతజ్ఞులై వుండటం ప్రతిఒక్కరి ధర్మమనే సందేశాన్నిచ్చే నాటిక హలాల్ రచయిత శ్రీ జలదంకి సుధాకర్ అవగాహన లోపం వల్ల పరమత ద్వేషానికిలోనై యువత ఉగ్రవాదాన్ని చేపట్టడం అనే అంశానికి కూడా ఇందులో ప్రాధాన్యమిచ్చారు రచయిత

మత సామరస్యంతో, ఎంతో స్నేహంతో కొన్ని దశాబ్దాలుగా ప్రక్కప్రక్కనే

కాపురం ఉంటున్న హిందూ - ముస్లిమ్ కుటుంబాలమధ్య చిచ్చురేగుతుంది ముస్లిమ్ కుటుంబంలో కొడుకు అజాద్ పాకిస్తాన్‌ను తన మాతృదేశంగా పరిగణిస్తూ, భారతదేశాన్ని పరాయిదేశంగా, శత్రు దేశంగా భావిస్తూ మతద్వేషాన్ని పెంచుకుంటాడు ఉగ్రవాదుల్లో కలసిపోతాడు బాంబులు పేల్చి విధ్వంసానికి, అరాచకత్వానికి పూనుకుంటాడు పోలీసులు అతని కోసం నిఘావేసివుంటారు

అజాద్ ఇంటికొస్తాడు అతని ఉగ్రవాదతత్వాన్ని నిరసిస్తూ కన్నతండ్రే కొడుకును హత్యచేస్తాడు మతం ఏదైనా, పుట్టిపెరిగిన ఈ నేలే మన మాతృభూమి అని చనిపోయేటప్పుడు పశ్చాత్తాపపడతాడు అజాద్

ఇతివృత్తంలో విశిష్టతవున్నా, అసంపూర్ణ శిల్పంలా కనిపిస్తుంది ఈనాటిక దీని ద్వారా చెప్పదలచుకున్న సందేశం వాచ్యంగానే సాగింది నాటకీయతలోపించింది ఒకటి రెండు సంఘటనలువున్నా మనసును హత్తుకునేలాలేవు అసలు అజాద్‌లో మతద్వేషం అంకురించటానికి ఆధారభూతమైన సంఘటన ఏదీ ధ్వని మాత్రంగానైనా నాటికలో సూచించబడలేదు అజాద్ మతద్వేషాన్ని పెంచుకోవడానికిగల నేపథ్యాన్ని వివరించనట్టే, చివర్లో అతనిలో పశ్చాత్తాపం కలగడానికి గల కారణాలను కూడా హేతుబద్ధంగా చెప్పలేదు నాటకకర్త సుధాకర్ మతద్వేషానికి ప్రాధాన్యమిచ్చినంతగా మతసామరస్యాన్ని ఉద్బోధించే సన్నివేశంగాని, ప్రయత్నంగాని హలాల్ నాటికలో కనబడదు ఇందులో హాస్యపాత్ర ఖాసిమ్‌ను కేవలం వినోదాన్ని అందించడానికే కాకుండా మరికొంత ప్రయోజనాత్మకమైన పాత్రగా రూపొందించివుంటే బాగుండేదేమో అనిపిస్తుంది ఈనాటికలో సన్నివేశాలు ఆరోహణ క్రమంగా సాగకపోవడంవల్ల పాత్రోన్మీలనంలో వెలితి కనిపిస్తుంది కథ పతాక స్థాయికి చేరుకోకముందే హఠాత్తుగా పతాక సన్నివేశాన్ని కల్పించి నాటికను ముగించినట్లు అనుభూతి కలుగుతుంది పతాక సన్నివేశానికి సామాజికులను కూడా సిద్ధం చేయాల్సిన అవసరం ఉంది

## చిచ్చు

శ్రీ శిష్ట్లా చంద్రశేఖర్ రచించిన 'చిచ్చు' అనేది, మత సహనం లేని వ్యక్తుల

మనస్తత్వంలో నిద్రాణమైవున్న మతద్వేషం, అవకాశవాదులు తమ స్వార్థ ప్రయోజనాలకోసం మతాల మధ్య చిచ్చురేపినపుడు విచక్షణ కోల్పోయి విలయతాండవం చేసే సత్యాన్ని వెల్లడించే నాటిక ఇందులో రాజకీయం పాత్ర, కామానికి, ద్వేషానికి, మత్తుకి, అబద్ధానికి, అవినీతికి, లంచగొండితనానికి, మత మౌఢ్యానికి, యుద్ధానికి, రక్తపాతానికి, శతకోటి మానవ మస్తిష్కాలలో మెదిలే అనంతకోటి అన్యాయ అక్రమ అధర్మపుటాలోచనలకి ఒక సజీవరూపం, ఒక ప్రతీక

"ప్రజలు తెలివైనవారు ఒక్కొక్కరుగా ఎవరికి వారుగా కానీ అందరూ కలసినప్పుడుమాత్రం వాళ్లు గొర్రెల మందలు . అందుకే వాళ్లు నాకుట్రను కుతంత్రాన్ని మాయాజాలాన్ని ఎన్నటికీ అర్థం చేసుకోలేరు అసలిదంతా ఎందుకు జరుగుతుందో తెలియకుండానే జరిగిపోతుంది పొడిచే వాడికి తెలియదు తానెందుకు పొడుస్తున్నాడో చచ్చేవాడికి తెలియదు తానెందుకు చస్తున్నాడో అప్రయత్నంగా, అనాహూతంగా హత్యలు, లూటీలు, గృహదహనాలు మానభంగాలు అన్నీ జరిగిపోతున్నాయి క్రియకు ప్రతిక్రియతప్ప ఆలోచనకు అవకాశంలేని ఒకస్థితి ఆ ఆలోచనవుంటే, ఒక ఆలోచన వుంటే ఒక పంజాబ్, ఒక కాశ్మీర్, ఒక హైదరాబాద్ ఈ సంఘర్షణకు తావేలేదు " అనే రాజకీయం పాత్ర పలుకులే 'చిచ్చు' నాటికలోని అంతరార్థాన్ని, ఆత్మను, ఆర్ద్రతనూ అందిస్తాయి చిక్కని గాంభీర్యాన్ని పులుముకున్న ఈ 'చిచ్చు' నాటిక చక్కటి ఆలోచనలకు ఒక వాటిక

మత సామరస్యం మీద ఈ దశాబ్దిలో వెలువడిన నాటికలన్నీ ప్రదర్శనాపరంగా విజయం సాధించి గుర్తింపు పొందినప్పటికీ, మతమౌఢ్యం, పరమతద్వేషం, అసహనం, హింసాప్రవృత్తి వంటి ప్రధానాంశాలమీద సామాజికులకు ప్రాముఖ్యం కలిగే రీతిలో ప్రతిపాదితాంశం ఈ నాటికలలో ఆవిష్కృతం కాలేదనే చెప్పాల్సి వుంటుంది ఒక్క 'గాలిగోపురం' మినహా మిగిలిన నాటికలలో సాహితీమూల్యం లుప్తం 'మనుషులంతా ఒక్కటే' నాటికలో హాస్యం చాటున సందేశ గౌరవం

సన్నగిల్లిపోయింది 'గాలిగోపురం' నాటికలో వస్తువు వైయుక్తిక పరిధిని అధిగమించని కారణంగా వస్తు నిరూపణలో ఆశించిన గమ్యాన్ని చేరలేకపోయింది 'అయో(వ)ధ్య' నాటిక ప్రదర్శనే పరమావధిగా నిలిచింది సంఘర్షణ ఉన్నతంగా సంయమనం కనబడదు నిప్పులాంటి నిజాలను నిర్భయంగా చెప్పడమొక్కటే నాటక లక్ష్యం కాకూడదు 'ఐ ఫర్ ఏన్ ఐ' అనే ఆటవిక న్యాయం నాటికలో ప్రతిపాద్య వస్తువు కాగలదా? కాగా, 'చిచ్చు' నాటిక ప్రతీకాత్మక ధోరణిలో సాగటంవల్ల సగటు ప్రేక్షకుని అవగాహన స్థాయికి అందటం లేదు 'మతం' వంటి సున్నితమైన అంశం మీద నాటక రచన చేయడం అసిధారావ్రతం వంటిది కనుక వస్తువును శక్తిమంతంగా ఆవిష్కరించడానికి ఎన్నో జాగ్రత్తలు తీసుకోవడం ఆవశ్యకం, అభిలషణీయము

## విద్యావ్యవస్థ

నానాటికీ దిగజారిపోతున్న విద్యావ్యవస్థ దీనస్థితిని చూసి స్పందించి, అడుగంటిపోతున్న విద్యాప్రమాణాలను చక్కదిద్దమని విద్యావేత్తలకు, ప్రభుత్వానికి విన్నవించుకుంటూ, వారికి కనువిప్పు కలిగించే మహోద్యమంలో ఒకభాగంగా ఈ దశాబ్దంలో (1980-90) నాటకకర్తలు శక్తివంతమైన నాటకాలు, నాటికలు రాశారు ఆ వరుసలో శ్రీ ఆకెళ్ల సత్యనారాయణమూర్తి రాసిన పెద్ద బాలశిక్ష' మొదటి నాటిక ఇది వీథినాటిక రూపంలో రాసిన నాటికే అయినా ఎక్కువసార్లు రంగస్థలం మీదనే ప్రదర్శితమైంది

## పెద్దబాలశిక్ష

పురాణ కాలంలో గురుకులావాసం అనే విద్యావ్యవస్థ ఉండేది రాజవంశీయులైనా తమ కుమారులను గురువువద్దకు పంపించి విద్యాబుద్ధులు నేర్పించేవారు అంతేకాని గురువులను ఆస్థానానికి పిలిపించుకొని రాజసం ప్రదర్శించేవారు కాదు 'గురుదేవోభవ' అన్నసూక్తికి అంతగౌరవం ఇచ్చేవారు అలాగే ఆనాటి గురువులు నిష్ఠాగరిష్ఠులై త్రికరణశుద్ధిగా వ్యవహరిస్తూ ఉండేవారు

గురుశిష్యుల మధ్య పవిత్రబంధం విలసిల్లేది స్వార్థచింతన లేకుండా, పరోపకారబుద్ధితో విద్యాదానం చేసే నిష్కామయోగులు ఆనాటి గురువులు విజ్ఞానార్జనయే ఆనాటి శిష్యుల పరమావధి గురుధిక్కారమన్నది ఆనాటి నిఘంటువులో లేనిమాట

ఆకాలం గతించింది వీధిబడులు వచ్చాయి 'అయ్యవారు' తాను విద్యనేర్పినందుకు తల్లిదండ్రులనుంచి తృణమోపణమో కొద్దిగా తీసుకున్నా శిష్యులను క్రమశిక్షణలోపెట్టి పరిపూర్ణులుగా తీర్చిదిద్దేవాడు నిత్యజీవితావసరాలకు, మనోవికాసానికి అప్పటి విద్య సరిపోయేది క్రమక్రమంగా కాలపరిస్థితులు అనూహ్యంగా మారిపోయాయి జనాభా పెరిగింది ఆంగ్ల విద్యావ్యాప్తితో నాగరికతలో మార్పులు వచ్చాయి అవసరాలు పెరిగాయి అభిరుచులు మార్పు చెందాయి తత్ఫలితంగా విద్య జ్ఞానప్రదాయిని కాకుండా జీవ సంజీవిని అయ్యింది విద్యార్జన మనుగడ సాగించటం కోసమే అన్న భావం ప్రజల్లో దృఢంగా నాటుకుపోయింది

విద్యార్థులు పెరిగారు విద్యాసంస్థలు పెరిగాయి గురుశిష్య బాంధవ్యం ఛిన్నాభిన్నమైంది విద్యార్థుల్లో క్రమశిక్షణారాహిత్యం హెచ్చింది ఏదోవిధంగా సర్టిఫికెట్టో, డిగ్రీయో, డిప్లమాయో సంపాదించటమే విద్యార్థుల గమ్యస్థానం అయ్యింది దానితో అవిధేయత, అవినీతి, అక్రమాలు పెరిగాయి విద్య విపణివీధిలో విక్రయించబడే సరుకైంది గురువుచెప్పిన మాట శిష్యుడు వినేరోజులుపోయి, శిష్యుడు శాసించేవాడు గురువు శిరసావహించేవాడవుతున్నాడు సర్కారు విద్యా సంస్థలతోపాటు ఇబ్బడి ముబ్బడిగా ప్రయివేటు విద్యా సంస్థలు పుట్టగొడుగుల్లాగా పుట్టుకొచ్చాయి ప్రాథమిక విద్యనుంచి కళాశాల స్థాయివరకు వర్ధిల్లుతున్న ఈ సంస్థలలో విద్య వ్యాపార సరళిలో సాగుతూంది ఎల్ కె జి సీటు కావాలన్నా, చదువు మాట దేవుడెరుగు, బల్లమీద బరువు పెట్టకపోతే ప్రవేశం దొరకని పరిస్థితి సర్వవ్యాప్తంగా ఉంది

సరిగ్గా ఇక్కడే ప్రారంభమవుతుంది శ్రీ ఆకెళ్ల 'పెద్దబాలశిక్ష' విరాళం

యివ్వందే స్కూల్లో సీటు దొరకని పరిస్థితితో ప్రారంభమై, కంప్యూటర్‌లో దొర్లిన పొరపాటువల్ల తెలివైన విద్యార్థి పరీక్ష తప్పినట్లు పరీక్షా ఫలితాలు రావడం, తత్ఫలితంగా అతను ప్రాణాలు పోగొట్టుకున్న విషాద సంఘటన సంభవించేవరకు విద్యావ్యవస్థలో నేడు విస్తరించివున్న అస్తవ్యస్త పరిస్థితులన్నింటినీ సాకల్యంగా వివరించారు నాటకకర్త పాఠ్యగ్రంథాలు సకాలంలో విద్యార్థుల చేతికి రాకపోవడం, అధ్యాపకులు తూతూ మంత్రంగా సిలబస్ అయిపోయింది అనిపించడం, డబ్బుపిండుకోవడంలోనే దృష్టి కేంద్రీకరించి, విద్యార్థుల, అధ్యాపకుల ప్రవర్తన, సాధకబాధకాలు పట్టించుకోని ప్రిన్సిపాల్ బాధ్యతా రాహిత్యం వంటి అంశాలెన్నింటినో ఆసక్తికరంగా, హాస్యరసస్ఫోరకంగా వెల్లడిస్తుందీ నాటిక

ప్రతిసంఘటనలోను ఉన్నపాత్రలే మళ్లీమళ్లీకొత్త పాత్రలు ధరించటం ఈ నాటికలోవున్న సౌలభ్యం మూకాభినయం ఈ నాటికలో ప్రయుక్తమైంది కుర్చీ, టేబులు, స్ప్రింగ్ డోరు వంటి పరికరాలను హ్యూమన్ ప్రాప్స్ (మానవ పరికరాల) తోనే నడిపించడం విశేషం। ఈ విధానంయిప్పుడు అన్ని ప్రదర్శనాలలో, ముఖ్యంగా వీథినాటకాల్లో, విస్తృతంగా అమలుపరచబడుతోంది

## శ్వేతపత్రం

అలాగే, లోపభూయిష్ఠమైన విద్యావ్యవస్థపై శ్రీ కావూరి సత్యనారాయణ సంధించిన బాణం 'శ్వేతపత్రం' నాటిక 'పెద్ద బాలశిక్ష' ప్రాథమిక విద్య, హైస్కూలు విద్యల్లో ఉన్న లోటుపాట్లను వెలుగులోకి తెస్తే, 'శ్వేతపత్రం' కళాశాలస్థాయిలో జరుగుతున్న అవకతవకల్ని బట్టబయలు చేస్తుంది పరీక్షా పత్రాలను విపణవీథిలో కొనుగోలు చేసే తల్లిదండ్రులు, వారి చర్యలవల్ల ప్రతిభావంతులైన విద్యార్థులు నష్టపోవడం వంటి దారుణాలకు అద్దంపట్టిన నాటిక 'శ్వేతపత్రం' పండితపామరుల అభిమానాన్ని దోచుకున్న నాటిక ఇది శ్రీ నాయుడు గోపి నేతృత్వంలో గంగోత్రి, పెదకాకాని వారిచే ఈనాటిక ఆంధ్రప్రదేశ్‌లోని అనేక నాటక పరిషత్తు పోటీలలో ప్రేక్షకజనరంజకంగా ప్రదర్శించబడి బహుళ ప్రశంసలందుకున్నది

విద్యావ్యవస్థపై శ్రీ గోళ్లపాటి నాగేశ్వరరావు రచించిన సరస్వతీ నమస్తుభ్యం' శ్రీకంఠా హనుమంతరావు రాసిన 'ధర్మాగ్రహం' ఈ దశాబ్దిలో విరివిగా ప్రదర్శించబడిన నాటికలు

## సరస్వతీ నమస్తుభ్యం

శ్రీ గోళ్లపాటి నాగేశ్వరరావు రచించిన 'సరస్వతీ నమస్తుభ్యం' అనే నాటికలో నేటి విద్యావ్యవస్థలో ఉన్న లొసుగులను ఎత్తిచూపడమేగాక, లోపభూయిష్ఠమైన విద్యావిధానం వల్ల సంఘానికి కలిగే కీడును కూడ వివరించడం జరిగింది ఈ నాటికలో ద్యోతకంచేసిన ముఖ్యాంశాలివి

1 ప్రాధమిక విద్యాదశనుండి విద్యార్థుల్లో జ్ఞానతృష్ణ పెంపొందాలి అంతేకాని విద్య ప్రయోజనం ధనార్జనేగాని జ్ఞానసముపార్జన కాదనే నమ్మకం విద్యార్థుల్లో బలపడకూడదు జ్ఞానబోధ చేయవలసిన ఉపాధ్యాయులు స్వార్థ ప్రయోజనాలకోసం విద్యార్థులకు పాఠశాలల్లో చదువు చెప్పక కబుర్లు చెప్పుకొంటూ కాలక్షేపం చేయడం, ప్రయివేట్లు చెప్పించుకోమని ప్రోత్సహించడం గురుపీఠానికే అవమానం

2 నూరు మార్కులు రావలసినచోట రిజర్వేషన్ పేరుతో 35 మార్కులొస్తే చాలనే మినహాయింపు వల్ల విద్యార్థుల విద్యా ప్రమాణాలు రోజురోజుకి దిగజారిపోతున్నాయి

3 డొనేషన్లు, రిజర్వేషన్లు మూలంగా ఆర్థికంగా స్తోమతలేని విద్యార్థులు ఉద్యోగాలు సంపాదించడంలో వెనకబడిపోవటం, వారి తెలివితేటలు కొరగాకుండాపోవటమూ జరుగుతోంది

4 డొనేషన్లిచ్చి చదువు కొనుక్కోవడం వల్ల, రిజర్వేషన్ అనే రాయితీల నీడలో చదువుకోవటంవల్ల వృత్తినైపుణ్యం వెనుకంజవేస్తుంది దీనిని తీవ్రంగా ఆలోచించవలసిన తరుణం ఆసన్నమైంది

5 విద్యాగంధంలేక కేవలం ఓట్లబలంతో రాజకీయంగా ఎదిగిపోయిన

నాయకులు, ప్రజలను తృప్తిపరచాలనే ధ్యేయంతో, స్వార్థంతో, ప్రభుత్వపరంగా రాయితీలను కల్పించి ప్రతిభను అణగద్రొక్కుతూ, దిగజారుతున్న విద్యా ప్రమాణాలతో రాజీపడి విద్యావ్యవస్థను అంధకారమయం చేస్తున్నారు

పై అంశాలను ప్రజలదృష్టికి, ప్రభుత్వం దృష్టికి తెస్తూ రచయిత ఈ నాటికను రచించారు

కాంపౌండర్ చెప్తేగాని రోగనిర్ధారణ చెయ్యలేని యం బి బి యస్ డాక్టరుగారు, శస్త్ర చికిత్సలో ఓనమాలు తెలియని ఒక మాస్టర్ ఆఫ్ సర్జరీ ఉన్న హాస్పిటల్లో ఆపరేషన్ థియేటర్‌ను ప్రారంభించడానికి మంత్రిగారొస్తారు అయన చలవతో నియమితుడైన యం యస్సే హాస్పిటల్లో డాక్టరు మాటలమధ్య, మంత్రిగారికి ఎపెండిసైటిస్ అని వెంటనే ఆపరేషన్ చేయించుకోకపోతే ప్రాణానికి హాని జరుగుతుందని కాంపౌండర్ చెప్పిన మాటవిని కంగారుపడతాడు మంత్రిమహాశయుడు అగమేఘాలమీద హైదరాబాద్ ప్రయాణం కడతాడు ఆపరేషన్ చేయించుకోవాలని! ఇక్కడ యం ఎస్ ఉండగా హైదరాబాదు ఎందుకు వెళ్లాలి, మీరు నియమించిన సర్జన్ పనితనంమీద మీకే నమ్మకం లేదా? అని ప్రజలు మంత్రిని నిలదీస్తారు దిక్కు తోచక తన పదవికి రాజీనామా చేస్తాడు మంత్రి అతనికి అపెండిసైటిస్ లేదనీ తానే కల్పించి అబద్ధం చెప్పినట్టు రహస్యం వెల్లడిస్తాడు కాంపౌండర్

లోపభూయిష్ఠమైన విద్యావ్యవస్థ అన్ని రంగాలమీద తన ప్రభావాన్ని చూపుతుందనీ, సమాజ వికాసాన్ని నిరోధిస్తుందనీ, నిర్వీర్యపరుస్తుందనీ, కనుక విద్యారంగాన్ని బాగువరుచుకోకపోతే సమాజం ప్రమాదంలో పడుతుందనీ,మానవాళికి నైతికపతనం తప్పదనీ రచయిత ఈ నాటిక ద్వారా శక్తివంతంగా ఉద్బోధించారు

'సరస్వతీ నమస్తుభ్యం' నాటికను సగంవరకు వీథినాటిక పద్ధతిలోను, మిగతా సగం ప్రొసీనియం థియేటర్ (మూడు వైపుల తెరలు, అభిముఖంగా ప్రేక్షకులు ఉండే రంగస్థల నాటక) పద్ధతిలో రాశారు నాటకకర్త మూకాభినయ పద్ధతినికూడ

ప్రయుక్తం చేశారు నాటకాన్ని ఒకే పద్ధతిలో కాక శైలీ మిశ్రమం (మిక్చర్ ఆఫ్ థియేటర్ స్టయిల్స్) తో రూపొందించడం ఈ నాటికలో ఒక భిన్నస్వరం

ఈ నాటకంలో మరొక విశేషం ఉంది స్వీకరించిన కథావస్తువుకు దూరంగా జరిగిపోయి విద్యారంగంతో సంబంధంలేని అంశాలను ప్రస్తావించి వ్యాఖ్యానించడం అక్కడక్కడా జరిగింది దీనికి ఉదాహరణలు

"మన స్వతంత్ర భారతావనిలో రాచరికాలు, రాజభరణాలు, ప్రత్యేకించి వంశ పారంపర్యాలు రద్దుజేసాము అన్నారు రాచరికపు వ్యవస్థలో రాజుగారు రిటైర్ అయితే యువరాజు రాజవటమేమిటి, ఇది వంశ పారంపర్యపు హక్కు అమానుషం దీన్ని రద్దు చేసాము అన్నారు మరి మన ప్రజాస్వామ్య వ్యవస్థలో మనం చేస్తున్నదేమిటి సార్? ప్రధానమంత్రి పోతే ఆయన కొడుకును ప్రధాన మంత్రిని చేస్తున్నాము మంత్రిగారుపోతే ఆయన బావమర్దిని మంత్రిని చేస్తున్నాము ఎం ఎల్ ఎ గారు పోతే ఆయనగారి భార్యను ఎం ఎల్ ఎ ని చేస్తున్నాము మరి ఉద్యోగస్థుడు వాలంటరీ రిటైర్‌మెంట్ ఇస్తే ఆయన కొడుక్కి ఆ ఉద్యోగమిప్పి స్తున్నాము మరి రాచరికపు వ్యవస్థలోని వంశపారంపర్యపు హక్కు అమానుషమైతే మరి మన ప్రజాస్వామ్య వ్యవస్థలోని ఈ వంశ పారంపర్యపు హక్కును ఏమనాలి సార్ నేను దీన్ని హిపోక్రసీ అని అంటే మీరేమంటారు "[7]

వస్తువుకు సంబంధంలేని వ్యాఖ్యానాలకు ఇది ఒక ఉదాహరణ మాత్రమే ఇటీవల వస్తున్న అనేక నాటక నాటికలలో ఇటువంటి వ్యాఖ్యలు విసరడం సర్వసాధారణమైపోయింది నిజానికి తీసుకున్న వస్తువుకు సంబంధంలేని విషయాలను ప్రస్తావించడం 'కన్యాశుల్కం' నాటకంనుంచీ వస్తున్న సంప్రదాయమే! గిరీశం కన్యాశుల్కం మీద మాట్లాడిన మాటలకంటే లోకం తీరుమీద, రకరకాల మనుషులమీద, సంఘటనలమీద ఎక్కువ మాట్లాడటం కన్పిస్తుంది అది అసందర్భ ప్రలాపమనీ, అనౌచిత్యమని అనుకోలేదు ప్రజలు అతని మాటలకు ఆనందించారు పదేపదే స్మరించుకొంటున్నారు వస్తు ఐక్యత లోపాన్ని ఒక ఆకర్షణగా పరిగణించిన సంప్రదాయం 'సరస్వతీ నమస్తుభ్యం' నాటికకూ వర్తిస్తుందేమో!

# ధర్మాగ్రహం

శ్రీకంఠా హనుమంతరావు రచించిన 'ధర్మాగ్రహం' నాటికలో కూడా విద్యాసంస్థలు సక్రమ మార్గంలో నడవాలనీ, అవి విద్యకు ఆలయాలుగానే వృద్ధి చెందాలి తప్ప వ్యాపార సంస్థలు కాకూడదనే ఆర్తి ఉంది

ప్రయివేటు సంస్థలవల్ల విద్యా ప్రమాణాలు పడిపోతున్నాయనీ, విద్య కేవలం విపణివీధిలో దొరికే సరుకైపోయిందనీ ఈ పరిస్థితులు మారాలంటే ప్రభుత్వం విద్యా సంస్థలు ఆదర్శప్రాయంగా నడిచేటట్లు చర్యలు తీసుకోవాలనీ, డొనేషన్లను అరికట్టాలంటే అదే రాజ మార్గమని సూచించారు నాటక కర్త

ప్రభుత్వపు పాఠశాలలో విద్యాబోధనకు తగిన వసతులు, సౌకర్యాలులేవని గట్టిగా వాదించిన ఫలితంగా వేదవ్యాస్ అనే ఉపాధ్యాయుడు సస్పెండ్ అవుతాడు తన ఆశయం సాధించలేకపోగా ఆర్థికంగా ఎన్నో బాధలకు, అవమానాలకు గురి అవుతాడు చివరికి తన కన్నకొడుకుకు కూడా విద్య చెప్పించలేకపోతాడు విద్యపై ఎక్కువ ఆసక్తి చూపే అతని కొడుకు గాంధీ ఇల్లు విడిచి ఎక్కడికో దూరంగా వెళ్లిపోతాడు

గాంధీ ఎంతో కష్టపడి చదువుకొని, స్వశక్తితో వృద్ధిలోకి వస్తాడు ఒక పాఠశాలను పెట్టి ఆదర్శప్రాయంగా నడుపుతూ వుంటాడు ప్రభుత్వం ఆ ఆశ్రమ పాఠశాలకు పది లక్షలు గ్రాంటు ఇస్తుంది కొడుకు సాధించిన ఘన విజయానికి వేదవ్యాస్ ఎంతో ఉప్పొంగిపోతాడు ఇదీ కథ

ప్రయివేటు విద్యా సంస్థలు డొనేషన్లు వసూలుచేసి పేద విద్యార్థులకు చదువు అందకుండా చేస్తున్నది కనుక ప్రభుత్వ పాఠశాలలను మెరుగుపరచి అందరికీ విద్య అందుబాటులోకి తేవాలన్న సందేశాన్నిచ్చే ఈ నాటికలో ప్రయివేటు పాఠశాలకు ప్రభుత్వం పది లక్షలు గ్రాంటు ఇవ్వదలచుకున్న ఉదంతం, సందేశానికి ప్రతీప ధోరణిలో ఉంది రచయిత ఆలోచనలో అస్పష్టత ఉన్నట్టు గోచరిస్తుంది

ఈ నాటికలో కొన్ని సంభాషణలు ప్రేక్షకులను ఆలోచింపచేస్తాయి -

వేదవ్యాస్ పిచ్చిదానా! ఒకసారి కోర్టుమెట్లు ఎక్కింతర్వాత మనం ఆలోచించవలసింది గెలుస్తామా – ఓడుతామా అనికాదు తీర్పు వచ్చేంతవరకు బ్రతికుంటామా లేదా అని (పుట 2)[8]

వేదవ్యాస్ వివేకం నేర్పవలసినచోట విప్లవ భావాలకు పునాది వేయమంటావా? (పుట 2)

వేదవ్యాస్ సరస్వతీ! మన కళ్లు సకల వస్తువులను చూడగలిగినా, తమని తాము చూసుకోలేవు అలా చూడగలగాలీ అంటే ఒక అద్దం కావాలి ఆ అద్దమే గురువు (పుట 6)[9]

ఈ నాటికలో ఒక వైయక్తికసమస్యనుసాధారణీకరించే ప్రయత్నం చేయడంవల్ల రచయితో ధర్మాగ్రహం' ద్వారా తాను చెప్పదలచుకున్న విషయాన్ని స్పష్టంగా అభివ్యక్తం చేయలేకపోయారేమో అనిపిస్తుంది

1960 ప్రాంతాలలో వచ్చిన నాటకాలలో 'మెలోడ్రామా' పాలు ఎక్కువగా ఉండేది ఆ సాంప్రదాయం 70 దశకంలో తారస్థాయికి చేరుకుంది మెలోడ్రామా ఉక్కు సంకెళ్లనుండి నాటకరచయితలు ఇప్పుడిప్పుడే బయటపడి వాస్తవిక ధోరణికి దగ్గరగా పయనిస్తున్నారు కాని అప్పుడప్పుడు కొందరు మెలోడ్రామాను ఆశ్రయించి విషాద సన్నివేశాలను పండించుకోవాలని తాపత్రయపడుతున్నారు ఈ ధోరణిని తలపింపచేస్తుందో ధర్మాగ్రహం' నాటిక

## రివర్స్‌మార్చ్

శ్రీ కావూరి సత్యనారాయణ రచించిన 'రివర్స్‌మార్చ్' ఈ దశాబ్దిలో సంచలనం కలిగించిన రంగస్థల నాటికలలో పేర్కొనదగింది

ఒక ప్రైవేటు కళాశాలలో విశృంఖలంగా విహరించే మదన్, గోపాల్ అనే యిద్దరు విద్యార్థులు – కాదు – విద్యార్థి గూండాలు కాలేజీలో కొత్తగా చేరిన పద్మ అనే ఒక పేద అమ్మాయిని వెంటబడి వేధిస్తారు ఆ అమ్మాయిపట్ల అసభ్యంగా ప్రవర్తిస్తూ, మానసికంగా ఆమెను చిత్రవధ చేస్తుంటారు పద్మ ప్రిన్సిపాల్‌గారికి

రిపోర్టు చేసింది మదన్ కాలేజి ప్రెసిడెంటు కొడుకు కావడంచేత, తన ఉద్యోగ భద్రత అతని చేతుల్లో ఉండటంచేత ఆరౌడి విద్యార్థుల్ని కనీసం మందలించలేకపోతాడు ప్రిన్సిపాల్ అటెండర్ వీరయ్య ఎంతప్రోత్సహించినా ధైర్యాన్ని కూడగట్టుకోలేక లోలోపల మధనపడుతుంటాడు పిరికి ప్రిన్సిపాల్

ఒకరోజు మదన్, గోపాల్ పద్మను కాలేజి ఆవరణలో వివస్త్రను చేసి అవమానించాలని ఆమె వెంటబడి తరుముకొస్తారు పద్మ పరుగెత్తి పరుగెత్తి దిక్కుతోచక తన మానసంరక్షణ కోసం కాలేజి బిల్డింగ్ పైనుంచి క్రిందికి దూకి ఆత్మహత్యతో తన సమస్యను పరిష్కరించుకొంటుంది ఇంత ఘోరం జరిగినా చలించని ఆ దుర్మార్గులు ప్రిన్సిపాల్ గదిలో ధీమాగా కూర్చొని తండ్రి ప్రజాహితుడు గారిని అక్కడికి పిలిపిస్తారు ఎందుకీ పాడు పనిచేశావ్ అని ఒక్కమాట కొడుకుని అడగకపోగా, ప్రిన్సిపాల్‌ని, అటెండర్‌ని కేకలేస్తాడా పెద్ద మనిషి పద్మ బిల్డింగ్ మీదినుంచి ప్రమాదవశాత్తున జారిపడ్డట్టు కధను మార్చి కట్టుకధ అల్లడానికి రంగం సిద్ధంచేస్తుంటాడు ప్రజాహితుడు

"అక్షరజ్ఞానం కోసం ఆరాటపడే పసిహృదయం నా నిర్లక్ష్యానికి, నా నిస్సహాయతను హేళన చేస్తూ వెళ్లిపోయిందని" అప్పటికే లోలోపలకుమిలిపోతున్న ప్రిన్సిపాల్ ప్రజాహితుడికి అప్పుడు ఎదురు తిరుగుతాడు

"బెదిరిస్తున్నారా ? ఇలాంటి బెదిరింపులకు భయపడి యిన్నాళ్లు నోరుమూసుకున్నాను స్త్రీని పవిత్రమూర్తిగా ఆరాధించి పూజించే ఈ దేశంలో సౌజన్యమూర్తుల యెడల మనకుగల అవ్యాజానురాగాలకు చిహ్నంగా దేశమాతను- భరతమాత అన్న స్త్రీ నామంతో సంబోధించి గౌరవించే ఈ సాంప్రదాయిక దేశంలో నేటి స్త్రీ స్థానం ఏమిటి? ఎక్కడ చూసినా అత్యాచారాలు, కదిలే రైలుబండిలో' బాలికల హాస్టళ్లలో, గర్భిణీ స్త్రీలపై, క్రైస్తవ సన్యాసినులపై అత్యాచారాలు-చివరకు ముక్కుపచ్చలారని పసిపాపలపై అత్యాచారాలు ఇది ఈనాడు సమాజంలో మన స్త్రీ గౌరవం వీటికి బాధ్యులెవరు? మనకెందుకులే అని తప్పించుకొనే నాలాంటి స్వార్థపరులు పిల్లల్ని విచ్చలవిడిగా పెంచే

నీలాంటి తండ్రులు (పేజీ 169) అని తనలో పెల్లుబికే ఆగ్రహాన్ని వెళ్లగక్కాడు ప్రిన్సిపాల్

అటెండర్ వీరయ్య ఈలోపల ఈభయంకర వార్తను ప్రజలకు చేరవేసి ప్రజాబలాన్ని సమీకరించాడు ఊరంతా అక్కడికి వచ్చివాలింది దోషులు ముగ్గురూ శవాన్ని మోసుకుంటూ స్మశానవాటికకు తీసుకుపోవాలనీ, మేం దోషులం - హంతకులం అని ప్రకటిస్తూ ఊరంతా తిరిగి చట్టానికి లొంగిపోవాలని శాసిస్తారు ప్రజలు అంతేకాదు దగ్గరుండి అమలుపరుస్తారు సుదీర్ఘ సంభాషణలు దీర్ఘోపన్యాసాలు తాకిడి లేకుండా, చిన్న చిన్న వాక్యాలతో రచయిత ఈ నాటికను నడిపించిన తీరు శ్లాఘనీయం సాంకేతిక విలువలను కూడా నిక్షిప్తం చేశారు ఈ నాటికలో

మానవతా కళామందిర్, జాలాది (గుంటూరు జిల్లా) వారిచే ఈనాటిక విరివిగా ప్రదర్శించబడి విజయకేతనాన్ని ఎగురవేసి ప్రశంసలు అందుకొంది జరుగుల రామారావు, కావూరి సత్యనారాయణ, సాంబశివరావు, పురుషోత్తం, పి ఏ పి ఆచార్య, కుమారి జయశ్రీ ఈనాటికను మనోజ్ఞంగా ప్రదర్శించిన కళాకారులు

## పోలీసు వ్యవస్థ

సంఘంలో శాంతిభద్రతలు కాపాడే బాధ్యత పోలీసు వ్యవస్థపై ఉంది ఏదైనా నేరం జరిగినపుడు పోలీసులు నేరస్థులపై చర్య తీసుకోలేదనీ, నేరపరిశోధన సవ్యంగా లేదనీ, దోషులను సమర్థిస్తున్నారనీ లేదా నిర్దోషులను వేధిస్తున్నారనీ, అతిగా ప్రవర్తిస్తున్నారని రకరకాల నేరారోపణలు ప్రజల నుంచి వినవస్తుంటాయి అలాంటి విమర్శలు నిరాధారమైనవని పూర్తిగా కొట్టివెయ్యడానికి వీల్లేదు మంచీ చెడూ అన్ని చోట్లా ఉంటాయి ఇందుకు పోలీసు వ్యవస్థ అతీతంకాదు నిజాయితీపరులైన అధికారులుసయితం ఒకొక్కసారి తమకర్తవ్యపాలన సక్రమంగా నిర్వహించలేని పరిస్థితుల్ని ఎదుర్కొంటూ ఉంటారు పై అధికారుల ఆదేశాలు, రాజకియ నాయకుల జోక్యం సంబంధిత వ్యక్తుల సహాయనిరాకరణ ప్రజల సహకారం లేకపోవడం వంటి ఆటంకాలు సమస్యల సత్వర సరిష్కారానికి

అడ్డుగోడలుగా నిలుస్తుంటాయి

నాటకకర్తలు పోలీసుల దురుసుతనాన్ని ఎండగట్టడమే కాదు, కర్తవ్య నిర్వహణలో నిజాయితీగా వ్యవహరించిన పోలీసు అధికారులను ప్రశంసిస్తూకూడా నాటకాలు వ్రాశారు శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు రచించిన మాటపదహారు' నాటికను అందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు పోలీసుశాఖలో పనిచేసే ఒక కానిస్టేబుల్ నీతికి నిలబడి తన ధర్మాన్ని తు చ తప్పకుండా పాటిస్తాడు పై అధికారికి భయపడకుండా, తనపై ఎంతవత్తిడి వచ్చినా లెక్కచెయ్యకుండా నేరస్థులను న్యాయస్థానానికి తరలిస్తాడు

## ఆశయా బద్ధతే లోకే ...

అలాగే, మల్లికార్జునరావుగారి ఆశయా బద్ధతే లోకే నాటికలో పోలీసుల అవినీతి చర్యలు తీవ్రంగా నిరసించబడినాయి

'ఆశయా బద్ధతే లోకే 'ఒక విలక్షణమైన నాటిక సాంకేతిక విలువలతో రూపొందించబడింది ఇది నటీనటుల నటనా సామర్థ్యానికి పదునుపెడుతుంది

జీవితాన్ని నడిపించేది ఆశ ఆశకు పట్టుగొమ్మస్వార్థం మనిషి చేసే అకృత్యాలన్నిటికీ కేంద్రబిందువు స్వార్థమే అయినా, దానికీ ఒక హద్దుంటుంది ఆ హద్దుల్ని కూడా ఉల్లంఘించిన నాడు తన స్వార్థమే భస్మాసుర హస్తమై అంతులేని విషాదాన్ని కుమ్మరిస్తుంది ఆ మనిషికి ఆశయా బద్ధతే లోకే ' నాటికలో నిక్షిప్తమైన కావ్యార్థం ఇదే

లారీ ప్రమాదంలో ఏడుగురు మరణిస్తే, లారీ యజమానితో లాలూచీపడి, ఆరు శవాలను అదృశ్యం చేసి ఒక్క శవంతోనే కేసు నడిపించి వాస్తవాన్ని తప్పుదోవ పట్టించాలని సిద్ధపడతాడు హెడ్కానిస్టేబుల్ హెడ్డుకొక కొడుకున్నాడు ఇతనిక్కడ గడ్డితినడం కాలేజీలో చదువుతున్న ఆ కొడుకు కోసమే భార్యతో "పిచ్చితండ్రి వాడికేంతెల్సే ? యిన్నాళ్లు వీడు గడ్డి తిన్నది గడ్డిమీద ప్రేమతోకాదు నాకొడుకు వెన్నముద్దలు మింగడానికి రక్తం కోసం అనుక్షణం అర్రులుచాచే క్రూర మృగాలున్న

కీకారణ్యంలాంటి ఈ భయంకర లోకంలో, అన్నివైపులా బుసలుకొట్టే విషసర్పాలున్న యీ విషసమాజంలో - మనిషి నిజాయితీగా బ్రతకలేడని, బ్రతకదల్చుకొంటే భూస్థాపితమై పోతాడని నా తండ్రికెం తెల్సు ? యీ సత్యాన్ని తెలుసుకొన్న నేను - నా అంతరాత్మను అనుక్షణం అమ్ముకొంటూ, నా అవసరాలను అహర్నిశం చంపుకుంటూనే యిన్నేళ్లు బ్రతికేనని, ఎన్నో చేయకూడని పనులు చేసేనని ఎలా చెప్పను వాడికి ? ఒరెయ్ బాబూ ఒరేయ్‌నాన్నా నీకోసమేరా నిన్ను నాలాగా కాకుండా చేయడానికి, నువ్వు నా మార్గంలో నడవకురా నాన్నా న్యాయాన్ని, ధర్మాన్ని పరిరక్షించే మహావ్యక్తిగా నిన్ను చేయాలన్నదే నా ఆశయం నా ఆశయం ఇవాళ నెరవేరింది నా గమ్యం చేరుకున్నాను ఈవేళ యిక నువ్వు చెప్పినమాట వింటారా ఈ పోలీసు ఉద్యోగం వదిలేస్తా"[10] అంటాడు

అవసరం అతనిని అవినీతిపరుడుగా మార్చిందని అంతరాత్మకు అతను సమాధానం చెప్పుకుంటాడు

"ఏడుగుర్ని చంపిన హంతకుల్రా మీరుయిద్దరూ అయినా పోలీసు స్టేషన్‌లోనే పడుకొని నిద్రపోతున్నారంటే అది మీగొప్ప కాదురా మీడబ్బుగొప్ప మీకు లొంగిపోయి గులాములమైనామంటే అదిమా చేతకానితనం కాదు అవసరం బతకాల్సిన అవసరం"[11]

శవాలను మాయంచేసి ఒక్క శవంతో కేసునడిపించాలని అనుకున్న హెడ్డు - ఆశవం ఎవరిదోకాదు తన కుమారునిదే అనే చేదునిజం తెలుసుకున్నప్పుడు అతడు అనుభవించిన మానసికక్షోభ వర్ణనాతీతం విధి క్రూరంగా వెక్కిరించిన సంఘటన అతని జీవిత చరమాంకంలో ఒక విషాద భరితమైన మలుపు - అతని అనైతిక ప్రవర్తనకు కనువిప్పుగా మిగిలిన ఒక అగ్నిసారం

ఈ నాటికలో ఎవరూ ఊహించని కొసమెరుపు ప్రతి ఒక్కర్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది రెండు మూడుచోట్ల ప్రవేశపెట్టిన ఊహాచిత్రాలు ఈ నాటికకు ఎంతో పుష్టినీ, పరిపక్వతను చేకూర్చాయి ఈ రచనలో ప్రదర్శించిన నాటకశిల్పం మల్లికార్జునరావుగారి అనల్ప కల్పనానైపుణికి పరాకాష్ఠ అని చెప్పవచ్చు

అడ్డుగోడలుగా నిలుస్తుంటాయి

నాటకకర్తలు పోలీసుల దురుసుతనాన్ని ఎండగట్టడమే కాదు, కర్తవ్య నిర్వహణలో నిజాయితీగా వ్యవహరించిన పోలీసు అధికారులను ప్రశంసిస్తూకూడా నాటకాలు వ్రాశారు శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు రచించిన నూటపదహారు' నాటికను అందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు పోలీసుశాఖలో పనిచేసే ఒక కానిస్టేబుల్ నీతికి నిలబడి తన ధర్మాన్ని తు చ తప్పకుండా పాటిస్తాడు పై అధికారికి భయపడకుండా, తనపై ఎంతవత్తిడి వచ్చినా లెక్కచెయ్యకుండా నేరస్థులను న్యాయస్థానానికి తరలిస్తాడు

## ఆశయా బద్ధతే లోకే ...

అలాగే, మల్లికార్జునరావుగారి ఆశయా బద్ధతే లోకే నాటికలో పోలీసుల అవినీతి చర్యలు తీవ్రంగా నిరసించబడినాయి

'ఆశయా బద్ధతే లోకే 'ఒక విలక్షణమైన నాటిక సాంకేతిక విలువలతో రూపొందించబడింది ఇది నటీనటుల నటనా సామర్థ్యానికి పదును పెడుతుంది

జీవితాన్ని నడిపించేది ఆశ ఆశకు పట్టుగొమ్మస్వార్థం మనిషి చేసే అకృత్యాలన్నిటికీ కేంద్రబిందువు స్వార్థమే అయినా, దానికీ ఒక హద్దుంటుంది ఆ హద్దుల్ని కూడా ఉల్లంఘించిన నాడు తన స్వార్థమే భస్మాసుర హస్తమై అంతులేని విషాదాన్ని కుమ్మరిస్తుంది ఆ మనిషికి ఆశయా బద్ధతే లోకే ' నాటికలో నిక్షిప్తమైన కావ్యార్థం ఇదే

లారీ ప్రమాదంలో ఏడుగురు మరణిస్తే, లారీ యజమానితో లాలూచీపడి, ఆరు శవాలను అదృశ్యం చేసి ఒక్క శవంతోనే కేసు నడిపించి వాస్తవాన్ని తప్పుదోవ పట్టించాలని సిద్ధపడతాడు హెడ్‌కానిస్టేబుల్ హెడ్డుకొక కొడుకున్నాడు ఇతనిక్కడ గడ్డితినడం కాలేజీలో చదువుతున్న ఆ కొడుకు కోసమే భార్యతో "పిచ్చితండ్రి వాడికేంతెల్సే ? యిన్నాళ్లు వీడు గడ్డి తిన్నది గడ్డిమీద ప్రేమతోకాదు నాకొడుకు వెన్నముద్దలు మింగడానికి రక్తం కోసం అనుక్షణం అర్రులుచాచే క్రూర మృగాలున్న

కికారణ్యంలాంటి ఈ భయంకర లోకంలో, అన్నివైపులా బుసలుకొట్టే విషసర్పాలున్న యీ విషసమాజంలో - మనిషి నిజాయితీగా బ్రతకలేడని, బ్రతకదల్చుకొంటే భూస్థాపితమై పోతాడని నా తండ్రికేం తెల్సు ? యీ సత్యాన్ని తెలుసుకొన్న నేను - నా అంతరాత్మను అనుక్షణం అమ్ముకొంటూ, నా అవసరాలను అహర్నిశం చంపుకుంటూనే యిన్నేళ్లు బ్రతికేనని, ఎన్నో చేయకూడని పనులు చేసేనని ఎలా చెప్పను వాడికి ? ఒరెయ్ బాబూ ఒరేయ్‌నాన్నా నీకోసమేరా నిన్ను నాలాగా కాకుండా చేయడానికి, నువ్వు నా మార్గంలో నడవకురా నాన్నా న్యాయాన్ని, ధర్మాన్ని పరిరక్షించే మహావ్యక్తిగా నిన్ను చేయాలన్నదే నా ఆశయం నా ఆశయం ఇవాళ నెరవేరింది నా గమ్యం చేరుకున్నాను ఈవేళ యిక నువ్వు చెప్పినమాట వింటారా ఈ పోలీసు ఉద్యోగం వదిలేస్తా"[10] అంటాడు

అవసరం అతనిని అవినీతిపరుడుగా మార్చిందని అంతరాత్మకు అతను సమాధానం చెప్పుకుంటాడు

"ఏడుగుర్ని చంపిన హంతకుల్రా మీరుయిద్దరూ అయినా పోలీసు స్టేషన్‌లోనే పడుకొని నిద్రపోతున్నారంటే అది మీగొప్ప కాదురా మీడబ్బుగొప్ప మీకు లొంగిపోయి గులాములమైనామంటే అదిమా చేతకానితనం కాదు అవసరం బతకాల్సిన అవసరం"[11]

శవాలను మాయంచేసి ఒక్క శవంతో కేసునడిపించాలని అనుకున్న హెడ్డు - ఆశవం ఎవరిదోకాదు తన కుమారునిదే అనే చేదునిజం తెలుసుకున్నప్పుడు అతడు అనుభవించిన మానసికక్షోభ వర్ణనాతీతం విధి క్రూరంగా వెక్కిరించిన సంఘటన అతని జీవిత చరమాంకంలో ఒక విషాద భరితమైన మలుపు - అతని అనైతిక ప్రవర్తనకు కనువిప్పుగా మిగిలిన ఒక అగ్నిసారం

ఈ నాటికలో ఎవరూ ఊహించని కొసమెరుపు ప్రతి ఒక్కర్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తుంది రెండు మూడుచోట్ల ప్రవేశపెట్టిన ఊహాచిత్రాలు ఈ నాటికకు ఎంతో పుష్టినీ, పరిపక్వతను చేకూర్చాయి ఈ రచనలో ప్రదర్శించిన నాటకశిల్పం మల్లికార్జునరావుగారి అనల్ప కల్పనానైపుణికి పరాకాష్ఠ అని చెప్పవచ్చు

# ప్రార్థన

పోలీసు వ్యవస్థలోని లొసుగుల ముసుగులు తీసే మరో నాటిక ప్రార్థన' రచయిత శ్రీ యస్వీ సుబ్బారెడ్డి

నేటి నవనాగరిక సమాజాన్ని పట్టి పీడిస్తున్న భయంకర సమస్యల్లో 'రేప్' ఒకటి మానభంగం వంటి దౌష్ట్యానికి పాల్పడుతున్న వారు రోడ్ సైడ్ రోమియోలు, రౌడీలేకాదు-రాజకీయ నాయకులుకూడా సంఘంలో అంతస్థు, పలుకుబడి, పరపతి లేనివాళ్లు తప్పు చేస్తే చట్టానికి సులభంగా దొరికిపోతారు, శిక్ష అనుభవిస్తారు కాని, బడా రాజకీయనేతలు మాత్రం చట్టానికి ఒక పట్టాన దొరకరు వాళ్ల వంటిమీద ఈగవాలదు అందుకు పోలీసు యంత్రాంగం కూడా కొన్ని వేళల నిర్లిప్తంగా ఉంటుంది ఈ వ్యవస్థ వికృతరూపాన్ని భూతద్దంలోపెట్టి చూపిస్తుందీ ప్రార్థన'

పదహారేళ్ల మూగపిల్లపై అత్యాచారం చేస్తాడు పరశురామయ్య అనే ఓ ప్రజానాయకుడు ఈవార్త ఊర్లో పొక్కి పోలీసు స్టేషన్ దాకా రాకముందే, ఆ నిజాన్ని సమాధి చెయ్యడానికి తానే హుటాహుటిగా పోలీసు స్టేషన్‌కి వస్తాడు ఆ పెద్దమనిషి పోలీసు హెడ్డుతో లాలూచీ పడతాడు

ఇంతలో అక్కడికి వచ్చిన మూగపిల్ల మొర అరణ్యరోదన అవుతుంది ఆ సమయంలో అక్కడున్న వారికి ఆ పిల్లపైన సానుభూతివుంది కాని, ఆమెను రక్షించగల ధైర్యం, చొరవ ఎవరికీ లేవు అలాంటి సమయంలో బృహన్నల వంటి ఓవ్యక్తి (కనకం) అక్కడికి వస్తుంది పరశురామయ్యను, హెడ్డును నిలదీస్తుంది అన్యాయం జరిగిందని తెలిసికూడా ఎదిరించలేని అక్కడున్న మగవారిని నపుంసకులని హేళన చేస్తుంది రెచ్చగొడుతుంది వారిలో మగసిరిని ప్రశ్నిస్తుంది హెడ్‌కానిస్టేబుల్‌లో చలనం వస్తుంది పరశురామయ్యను చొక్కాపట్టుకుని ఈడ్చి లాకప్‌లో పడేయటంతో నాటిక అంతమవుతుంది మొదట్లో హెడ్‌కానిస్టేబుల్ పరశురామయ్యపై చర్యతీసుకునే విషయంలో డోలాయమానంగావున్నా మనసుమార్చుకుని కార్యోన్ముఖుడై తన వృత్తి ధర్మానికి కట్టుబడి ప్రవర్తించడం

సముచితమైన ముగింపు

హాస్యప్రధానంగా వున్న ఈ నాటికలో హాస్య, కరుణ, రౌద్ర, అద్భుతరసాల సమ్మేళనం అభివ్యక్తమౌతుంది సాధారణంగా అన్ని నాటకాలలో కొజ్ఞాపాత్ర హాస్యం కోసమే ఉద్దిష్టమవుతుంది కాని ప్రార్ధన' నాటికలో కనకం పాత్ర కేవలం హాస్యం కోసమే కాక ఒకప్రయోజనాన్ని సాధించటంకోసం సుప్రతిష్ఠితంకావడం ఇందులోని ప్రత్యేకత

పోలీసు వ్యవస్థపై మరోరెండు నాటికలు కూడా వచ్చాయి చెయ్యని నేరానికి తప్పుడు కేసులో యిరికించి, అమాయక స్త్రీలను వేధించే స్థితిని, స్త్రీలకు పోలీస్ స్టేషన్‌లో కూడా రక్షణ లేని పరిస్థితిని, కంచే చేను మేసే దారుణ పరిస్థితుల్ని సహజంగా చిత్రించారు "నాగులు తిరిగే కోనలో" అనే నాటికలో రచయిత శ్రీ పెందుర్తి యువరాజ్

## శవోహం

శ్రీ కె శరత్ చంద్రారెడ్డి రచించిన 'శవోహం' నాటికలోకూడా పోలీసు యంత్రాంగపు పనితీరుపై నిశిత పరిశీలన కనిపిస్తున్నది

ఈ సమాజంలో మనిషిని మనిషి దోచుకోవడం సర్వసాధారణంగా జరిగేసంఘటన చచ్చిపోయిన వ్యక్తిని దోచుకోవడం సాధ్యమా అంటే కలికాలంలో అది కూడా సాధ్యమేనని నిరూపించే నాటిక 'శవోహం'

పట్టణం నడిబొడ్డున ఒక హత్య జరిగింది గుర్తుపట్టడానికి వీల్లేకుండా వుంది ఆ శవం ఆ వర్తమానం పోలీస్ స్టేషన్‌కి చేరింది గంగారాం అనే గూండా పోలీసు నిర్బంధంనుండి తప్పించుకొని పారిపోయిన కేసుగురించి తల బాదుకొంటున్న ఎస్ ఐ గిరీశంకు హెడ్‌కానిస్టేబుల్ మర్యాదరావుకి మెరుపులాంటి ఆలోచన తట్టింది ఆ శవం గంగారాందని చెప్పి కేసు క్లోజ్ చేసేయాలని నిర్ణయించుకొంటారు కాని అది వీలు కాలేదు ఆ శవం తప్పిపోయిన తన తండ్రిగారిదని రామారావు స్టేషన్‌కి వచ్చాడు తండ్రి ఉద్యోగం తన కొస్తుందని అతని ఆశ! ఆ హత్య తానే

చేశానని దాసు అనే అతడు వచ్చాడు అలాగైనా అరెస్టు అయితే తనను హత్యచేయబోతున్న వారినుంచి ప్రాణ రక్షణ చేసుకోవాలని దాసు ప్రయత్నం ఇంతలో బోసుబాబు అనే పెద్దమనిషి అక్కడికి తయారై ఆ హత్య చేయించింది పరశురామయ్య అనే రాజకీయ నాయకుడనీ, అతన్ని వెంటనే అరెస్టు చెయ్యాలని యస్ ఐ ని తొందర పెట్టసాగాడు ఆవిధంగా నేరం నెత్తినవేసి తన రాజకీయ ప్రత్యర్థిని రంగంనుంచి శాశ్వతంగా తప్పించెయ్యాలని బోసుబాబు ఎత్తుగడ! ఇలా ఎవరికి వారు ఆ శవాన్ని తమ స్వప్రయోజనం కోసంవాడుకోవడానికి ప్రయత్నిస్తారు

అవన్నీ చూసి ఇనస్పెక్టరుగారి తల తిరిగిపోతుంది దిక్కుతోచక అచేతనుడై వున్న తరుణంలో హెడ్ కానిస్టేబుల్ ముందుకొచ్చి అసలు రహస్యం వెల్లడిస్తాడు ఆ హత్యతానే చేసినట్టు వొప్పుకుంటాడు తన చెల్లెల్ని ప్రేమించినట్టు నటించి దారుణంగా మోసగించి ఆమె ఆత్మహత్యకు కారణమైన గంగారాంపై పగబట్టి తానే చంపానని హెడ్ కానిస్టేబుల్ స్టేట్‌మెంట్ యిచ్చి చట్టానికి లొంగిపోడంతో నాటిక ముగుస్తుంది

రోజురోజుకి మానవులలో స్వార్థం ఏ ప్రమాణంలో విస్తరించి మానవత్వం రూపురేఖలు లేకుండా ధ్వంసం చేస్తున్నదో ద్యోతకం చేస్తుంది శవోహం' నాటిక

నాటిక చివరి దశకు వచ్చేవరకు హంతకుడెవరో, హతుడెవరో అంతు తెలియనివ్వకుండా రచయిత గోప్యార్థగోపనంతో ఆసక్తిజనకంగా నడిపించారు పోలీస్ స్టేషన్‌లో నిజం' ఒక్కొక్కసారి ఎన్ని మలుపులు తిరిగి, కప్పదాట్లువేసి స్వరూపాన్ని మార్చుకొంటుందో ఈ నాటిక నిరూపిస్తుంది

## న్యాయ వ్యవస్థ

మన నాటక కర్తలు న్యాయ వ్యవస్థను కూడా ఉపేక్షించలేదు ధర్మాన్ని, న్యాయాన్ని పరిరక్షించడం కోసం ఉద్దేశించిన చట్టాలు కొన్ని వేళల సామాన్యుడికి ముఖ్యంగా నిరక్షరాస్యుడికి గుదిబండలా తయారై తీరని నష్టాన్ని కలిగించి

కష్టాలపాలు చేసే ఉదంతాలను రచయితలు తమ నాటకాలలో వెలుగులోకి తెచ్చారు

చట్టాలను, న్యాయ శాస్త్రంలోని కొన్ని కీలకాంశాలను అర్థం చేసుకోలేని సామాన్య పౌరులను యిక్కట్లు పాలుచేసే కొన్ని చట్టాలను మానవతా దృష్టితో కాలానుగుణంగా సవరించవలసిన ఆవశ్యకతను గుర్తుచేస్తూ 1960కి పూర్వం కొన్ని నాటకాలొచ్చాయి వాటిలో కందుకూరి వీరేశలింగంగారి 'వ్యవహార ధర్మబోధిని' (1880), రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి నిజం' (1961) నాటకాలు పేర్కొదగినవి

ఎన్నడూ కోర్టు మొహంచూడని యిద్దరు సోదరులు భూమి విషయంలో తగాదాపడి కోర్టుకెక్కుతారు వారి అమాయకత్వం, అజ్ఞానం ఆధారం చేసుకొని ఇద్దరు న్యాయవాదులు వారిని జలగల్లా పీడించి వారికున్న కొంపాగోడూ, గొడ్డూగోదా సర్వస్వం హరించి అన్నదమ్ములిద్దర్నీ నిర్ధనులుగా, రిక్తహస్తులుగా మారుస్తారు న్యాయవాదుల స్వార్థం, రక్షకభటుల దురాశ, మధ్యవర్తుల కుటిలత్వం, న్యాయాధీశుల అవినీతి మొదలైన అంశాలెన్నింటినో వ్యవహార ధర్మబోధిని'లో కందుకూరి నిశితంగా విమర్శించారు

అలాగే 'నిజం' నాటకంలో బలమైన తప్పుడు సాక్ష్యాలతో ఒక నిరపరాధిని హంతకుడుగా చిత్రించి ఉరికంబమెక్కించడం అనే దౌష్ట్యాన్ని కళ్లకు కట్టినట్టు చూపించడం జరిగింది జరిగిన సంఘటనతో ఏమాత్రం సంబంధంలేని నిరపరాధి అయినా, తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకోవడానికి అర్థబలం, అంగబలం లేకపోతే గట్టుకు చేరడం కష్టతరమవుతున్న వాతావరణంలో శిక్షకు గురి అవుతున్నాడు కాని వాతావరణంలో ధనవంతుడు, బలవంతుడు తప్పుడు సాక్ష్యాలను సృష్టించి కోర్టును మెప్పించి చట్టపరిధిలోనే అవలీలగా శిక్ష తప్పించుకుపోగలుగుతున్నాడు కేవలం న్యాయస్థానంలో చెప్పే సాక్ష్యాలనే పరిగణనలోకి తీసుకుని తీర్పు' యిచ్చే విధానంలో మార్పులు రావాలనీ న్యాయశాస్త్రంలో అవసరమైన సవరణలు చెయ్యాలనీ, అంతవరకు నిరపరాధులకు

రక్షణ లేదనే ఆకాంక్ష, ఆర్తి నిజం' నాటకంలో ప్రస్ఫుటమవుతుంది

1980 తర్వాత కూడా న్యాయ వ్యవస్థలో వున్న లొసుగులను వివరించే కొన్ని నాటికలొచ్చాయి వాటిలో శ్రీ పి టి మాధవ్ రచించిన నల్లకోటు నవ్వింది', సమాజానికో ప్రశ్న', యస్ వి సుబ్బారెడ్డి గారు రచించిన 'జాతిస్మరామి' నాటికలు ముఖ్యమైనవి

## నల్లకోటు నవ్వింది

శ్రీ పి టి మాధవ్ రాసిన ఈ నాటికలో వ్యాఖ్యాతచేత ఇలా అనిపించారు చట్టంయొక్క ముఖ్య ఉద్దేశం ధర్మాన్ని రక్షించడం ధర్మాన్ని రక్షించడానికి మాత్రమే చట్టం తయారు చేయబడింది కానీ ప్రస్తుతం చట్టాన్ని రక్షించడానికి ధర్మం మూగబోతోంది ఇది నిజం, నగ్నసత్యం చట్టానికి ధర్మానికీ మధ్యవున్న సరళరేఖను తెలియజేసేదే ఈ నల్లకోటు నవ్వింది' "[12] అంటూ కావ్యార్థాన్ని వివరించారు

ప్రాంసరీనోటు ప్రాముఖ్యాన్ని గూర్చి తెలిసిన వారుంటారు కాని, అది చెల్లుబడి అయ్యేది మూడేళ్ల లోపలేనని (దాని ప్రాణం మూడేళ్ల వరకే వుంటుందనీ) ఆ తర్వాత దానికి కాలదోషంపట్టి చెల్లదనే సంగతి ఎందరికి తెలుసు ? కాలపరిమితి గురించి తెలియని వారు నష్టపోతే చట్టం వారిని కాపాడే స్థితిలో లేదు కనుక ఈ లొసుగును పసిగట్టిన దురాశాపరులు ఉద్దేశపూర్వకంగా తీసుకున్న ఋణాల్ని మూడేళ్లవరకూ తీర్చకుండా, ఎలాంటి చెల్లు వెయ్యకుండా ఋణదాతకు ఎగనామం పెట్టడమేకాక చట్టం పరిధికి చిక్కకుండా తప్పించుకొంటున్నారు అందుచేత ప్రాంసరీ నోటుకు విధించిన మూడేళ్ల గడువు అప్పులిచ్చేవారికి హానికరంగానూ, మోసంచేసేవారికి శ్రీరామరక్షగానూ పరిణమించింది మూడెళ్లకాలపరిమితి విధించడంలో అంతరార్థం ఏమైనప్పటికి మారిపోయిన కాలపరిస్థితుల దృష్ట్యా ఆ నిబంధన ప్రస్తుతకాలానికి అభిలషణీయం కాదు నోటిమాటకు ప్రాణాలిచ్చే మానవనుల కాలం ఎప్పుడో పోయింది లిఖితపూర్వకంగా వున్న సాధికారిక పత్రాలనుకూడా లెక్కచెయ్యని మనస్తత్వంగల

వ్యక్తుల సంఖ్య అధికంగావున్న నేటి సామాజిక వ్యవస్థలో ప్రాంసరీ నోటు మూడేళ్ల వరకే చెల్లుబాటు అన్న నిబంధనను తొలగించి చట్టాన్ని సవరించవలసి ఉంది అనే అంశానికి రూపకల్పన నల్లకోటు నవ్వింది' నాటిక

అయితే ఈ అంశాన్ని రచయిత ప్రచార ధోరణితో కాక నాటికను హాస్యరస స్ఫోరకంగా చిత్రించి, ఆద్యంతం ఆసక్తిదాయకంగా నడిపించారు

ఉద్యోగ విరమణ చేసిన ఓ మధ్య తరగతి మనిషి రామారావు వేన్నీళ్లకు చన్నీళ్లు తోడౌతాయనే ఆశతో తన కష్టార్జితాన్ని అప్పారావు, అప్పాజీ అనే ధూర్తుల చేతిలో పెట్టాడు వడ్డీ వస్తుందని కానీ వడ్డీ రాకపోగా అసలుకే ఎసరుపెట్టారు అప్పారావు ద్వయం వాళ్లు రాసిచ్చిన ప్రామిసరీనోటు గడువు మూడేళ్లు దాటిపోతుందని ఆఖరి క్షణంలో తెలుసుకుని గుండెలుబాదుకున్నాడు వాళ్లను ప్రాధేయపడి భంగపడ్డాడు పుచ్చుకోవడమేగాని ఇచ్చుకునే అలవాటులేని ఆ దుర్మార్గులు రామారావుపై పగబట్టి అతన్ని క్రిమినల్ కేసులో యిరికించి ఒక సంవత్సరం శిక్షపడేలా చేస్తారు తాను వాళ్లకి అప్పు యిచ్చిన పాపానికి అతను నష్టపోయింది డబ్బేకాదు పరువూ, ప్రతిష్ఠల్నికూడా ఈ అరిష్టానికి ముఖ్యకారణం ప్రామిసరీనోటు గడువు సంగతి తెలియకపోవడమే! విద్యావంతుడైన రామారావు పరిస్థితే ఈవిధంగా వుంటే యిక అక్షరజ్ఞానం లేని పామరుల సంగతి మరీ దుర్భరం కదా?

ధర్మాన్ని రక్షించలేని నిస్సహాయ స్థితిలో పడిపోయిన చట్టాన్ని చూసి నల్లకోటు నవ్వింది!ఆలోచనాత్మకమైన ఈ నాటిక రసజ్ఞుల మెప్పుపొందడంలో ఆశ్చర్యంలేదు "ఏ ప్రభుత్వ హయాంలో సామాన్యుడు ధైర్యంగా నిర్భయంగా న్యాయస్థానాలకి రాగల్గుతాడోఆ ప్రభుత్వం రాకకై ఈ ప్రయత్నం అంతవరకూ మా ప్రయాణం నిరంతరం"[13] అనే పబ్లిక్ ప్రాసిక్యూటర్ మాటలతో నాటిక ముగుస్తుంది

## జాతిస్మరామి

యస్వీ సుబ్బారెడ్డి రచించిన ఈ నాటికలో న్యాయవ్యవస్థలోని లోపాలను

ఎత్తిచూపడమే ముఖ్యోద్దేశంగా కనబడినప్పటికీ, కేవలం ఈ సమస్యపైనే నాటకాంశం కేంద్రీకృతం కాలేదు అనేక విషయాలకు సమ ప్రాధాన్యమివ్వడంచేత వస్తువులో ఐక్యత లోపించింది ఈ నాటికలో రచయిత ప్రాధాన్యమిచ్చిన వివిధాంశాలను ఈ విధంగా క్రోడీకరించవచ్చు

1 న్యాయస్థానాల్లో దొంగ సాక్ష్యాల ప్రాబల్యంవల్ల నిజం బలైపోతున్నది న్యాయదేవత నిస్సహాయంగా కళ్లు మూసుకొంటున్నది

2 కొందరు రాజకీయ నాయకులు తమ పలుకుబడితో, అర్ధబలం అంగబలంతో దుర్మార్గులకు రక్షణకవచంగా మారి వాస్తవాలను తారుమారుచేసి అన్యాయానికి పూలదండలు వేస్తున్నారు

3 అన్యాయాన్ని, అక్రమాన్ని ఎదిరించి శాంతిభద్రతలు కాపాడవలసిన పోలీసులు రాజకీయ వొత్తిళ్లకు, రౌడీమూకల బెదిరింపులకు తలొగ్గి తమ కుటుంబాలను రక్షించుకోవడం కోసం వర్తమాన పరిస్థితులతో రాజీపడి వ్యవహరించడం కంచే చేను మేసినట్లు అవుతున్నది

4 ప్రజలలో దేశాభిమానం అడుగంటిపోయింది దేశ సమస్యలపట్ల నిరాసక్తత పెరిగింది

5 మేధావులు పిరికివాళ్లయి బ్రతుకు భయంతో నిజాన్ని నిర్భయంగా చెప్పలేకపోతున్నారు రాజకీయ నాయకులకు, బలవంతులకు, పోలీసులకు దాసోహం అంటున్నారు మేధావుల్లోనే నిజాయితీ, ఆత్మస్థయిర్యం లోపిస్తే యిక సామాన్యుల మాటేమిటి ? ఎక్కడ మేధావులు తమ ధర్మాన్ని, బాధ్యతల్ని మరచి అవ్యవస్థను ఖండించకుండా నిర్లిప్తంగా వుంటారో అక్కడ సమాజం గూండాల చెప్పుచేతల్లో మసలుతుంది

6 ఈ దేశంలో మేధావుల సంఖ్య పెరిగినంతగా నీతిమంతుల సంఖ్య పెరగకపోవడం ఒక విషాద సత్యం రచయిత ఈ అంశాలన్నిటినీ నాటికలో సంఘటనా పూర్వకంగా మలిచి ప్రతిభాన్వితంగా రూపొందించారు

ఇతివృత్తం  యమ్ ఎల్ ఏ  బలభద్రుడు గారి అనుచరుడు పరమశివుడు ఒక అనాధ స్త్రీని మానభంగం చేసి హత్యచేస్తాడు  ఆ సంఘటనను ఫోటో తీసిన ఫొటోగ్రాఫర్ కోసం వెంటాడుతాడు  ఆ ఫోటోలను భారత రాజ్యాంగం అను పుస్తకంలొ భద్రంగా దాచి ఒక చెత్తకుండీలో పారేస్తాడు ఫొటోగ్రాఫర్  అతను కూడా హత్యకు గురి అవుతాడు  అతను రాసిన ఉత్తరం, ఫోటోలున్న పుస్తకం చేతులు మారి ప్రొఫెసర్ రాఘవ దగ్గరికి చేరుతాయి

హత్యకు సంబంధించిన విలువైన సమాచారం ఉంది కనుక ప్రొఫెసర్ ఆ ఉత్తరాన్ని, ఫొటోలను పోలీసు స్టేషన్లో అప్పగించాలని వెళ్తాడు  అప్పటికే ఆ విషయం తెలుసుకున్న బలభద్రుడు, పరమ శివుడు పోలీసు స్టేషన్‌కు చేరుకొంటారు ఫోటోలు, ఉత్తరం తమకు ఇచ్చెయ్యమనీ, లేకపోతే చిక్కుల్లో పడాల్సివస్తుందని బెదిరిస్తారు  ఆ విషయం కోర్టుకెళ్తే పరమశివుడు స్థానంలో ప్రొఫెసరే స్త్రీలోలుడుగా హంతకుడుగా నిరూపించబడతాడనీ, అతని కళ్లముందు ఒక నకిలీ కోర్టు నిర్వహించి భయపెడతాడు బలభద్రుడు  రేపు కోర్టులో కూడా జరగబోయే తతంగం అదేనని భయపడి ప్రొఫెసర్, హత్యతాలూకు ఫోటోలను పోలీసుల స్వాధీనం చేసి చేతులు దులుపుకొంటాడు  మేధావులే నీతి కోసం ధర్మరక్షణకోసం నిలబడకపోతే ఇంక సామాన్యుల గతేమిటని చిత్తు కాగితాలవాడు ఎంత అరచి గోలపెట్టినా అది అరణ్యరోదనే అవుతుంది

ఆ సమయంలో పోలీసు స్టేషన్‌లో ఉన్న ఒక స్వాతంత్ర్య యోధుడు, కళ్లముందు జరుగుతున్న సంఘటనలన్నీ చూసి భరించలేక ఎందరో దేశభక్తుల త్యాగఫలంగా సిద్ధించిన స్వతంత్ర భారతావనిలో అవినీతి, దౌర్జన్యం, బాధ్యతారాహిత్యం రాజ్యమేలుతూ వుందనీ ఆ పరిస్థితిని నేటి యువతరం మార్చాలని కర్తవ్యబోధ చేస్తాడు  అతని మాటలతో చలించిపోయిన సబ్ ఇనస్పెక్టర్ ధైర్యంతో ముందంజవేస్తాడు  బలభద్రుడ్ని, పరమశివుడ్ని కస్టడీలోకి తీసుకోవాలని సమాయత్తం అవడంతో నాటకం ముగుస్తుంది

# కళాప్రాశస్త్యం

నాటకకళ అభివృద్ధి కోసం అంకితభావంతో సేవచేసి తమ సర్వస్వాన్ని కోల్పోయిన త్యాగధనులైన కళాకారులు, కళాపోషకులు తెలుగునాట ఎందరో ఉన్నారు కళారాధనే తమ జీవిత లక్ష్యంగా ఎంచుకొని ఉత్సాహంగా ముందుకు సాగిపోతూ, జీవిత చరమదశలో దుర్భర దారిద్ర్యంతో అష్టకష్టాలు పడి దయనీయస్థితిలో తనువు చాలించిన కళాకారుల విషాద చరిత్రలు ఎన్నో!

నాటక కళారాధనలో ఎన్ని కష్టనష్టాలున్నా, ఎన్ని అడ్డంకులు ఎదురైనా తాము అనుకొన్న గమ్యంవైపు సూటిగా సాగిపోతున్న నిస్వార్థ కళాసేవకులు ఈనాడు కూడా లేకపోలేదు నాటకప్రదర్శన తిలకించడంలో సామాన్య ప్రజలకు మక్కువ వున్నా, ఆ కళను ఆరాధించే వారిపైన చులకన భావం విస్తరించి వుండటం ఒక వైపరీత్యం పనీపాటా లేనివాళ్లు నాటకాలు వేసి కాలాన్ని వృధాచేస్తున్నారనీ, బ్రతుకుబాటను చక్కదిద్దుకోలేని అప్రయోజకులని కొందరి భావన నాటకరంగంమీద ఎవరైనా ఉత్సాహం చూపుతున్నారంటే వాళ్లు చెడిపోవడానికి మెట్లు కట్టుకొంటున్నారని కొందరి దృఢాభిప్రాయం

ఇలాంటి అపోహలను తొలగించడానికై ఈ దశాబ్దిలో కొందరు రచయితలు నాటకకళలోని వైశిష్ట్యాన్ని, కళాకారుల సాధక బాధకాలను వివరిస్తూ నాటకాలు, నాటికలు రాశారు ఎమ్ వి ఎస్ హరనాధరావుగారి 'యక్షగానం', నక్కా వేంకటేశ్వరరావుగారి 'సిరిమువ్వ' నాటికలు, దివాకరబాబుగారి 'రసరాజ్యం' నాటకం వస్తు వైవిధ్యంలో అంతర్భాగంగా చెప్పుకోవచ్చు

# వస్తువులో వైలక్షణ్యం

వస్తు స్వీకరణలో ప్రత్యేకత కనబరచిన నాటక కర్తలున్నారు శ్రీ వి జి కె శర్మ రచించిన 'ది రూట్' అనే నాటిక దీనికి చక్కని ఉదాహరణ

సమాజంలో పెచ్చుపెరిగిపోతున్న దౌర్జన్య చర్యలకు, అశాంతికి, అనేక అక్రమాలకు మనుషుల్లో పెరిగిపోతున్న స్వార్థపరత్వాన్ని మూలకారణంగా

భావించడం జరుగుతోంది నిజానికి ఒక మనిషి మానవత్వం వున్న మనిషిగా మారినా దానవుడుగా రూపుదాల్చినా దానికి అతడు పుట్టిపెరిగిన పరిసరాల ప్రభావం, తల్లిదండ్రుల పెంపకమే ప్రధాన పాత్ర వహిస్తాయని 'ది రూట్' అనే నాటికలో నాటకకర్త వివరించారు బాల్యదశనుంచి క్రమశిక్షణతో, కట్టుబాట్లతో పెంచడమేగాక పెద్దలపట్ల వినయవిధేతలు, సంస్కారంకూడా అతనిలో పాదుకునేలా తల్లిదండ్రులు జాగ్రత్త వహించినపుడే అతడు మానవత్వం వున్న మనిషిగా, ఉత్తమ పౌరుడుగా తయారవుతాడనీ, అలాకాని పక్షంలో విశృంఖలత్వం అతని జీవితాన్ని బలితీసుకొంటుందనీ, అలాంటి వ్యక్తి సంఘానికి కూడా శత్రువుగా తయారై తల్లిదండ్రుల మంచి పేరును కూడా నాశనం చేస్తాడని స్పష్టంచేశారు రచయిత మొక్కగా వుండగానే జాగ్రత్తలు తీసుకోవాలని 'ది రూట్' నాటికలో ఉద్బోధించారు

అలాగే 'పునరపి' అనే నాటికలో ఆ పద సమయంలో ఒక మనిషికి తోటి మనిషి సహాయం చెయ్యకపోతే అలాంటి ఆపద తనకే వచ్చినపుడు ఎవరూ ఆదుకోరని హెచ్చరించారు పునరపి' నాటికలో రచయిత శ్రీ జె యన్ రాజశేఖర్ పాటిబండ్ల ఆనందరావు రచించిన మానస సరోవరం' అనే నాటకంలో జన్యుశాస్త్రం ప్రకారం సంతానానికి సంభవించే అవలక్షణాలను గురించి ఒక అవగాహన ఉండటం అవసరమనే శాస్త్రీయ దృక్పధంతో వివరించడం జరిగింది ఇది నాటక రచనలో ఒక వినూత్న ప్రయోగం

శ్రీ టి శివరామకృష్ణారావు రచించిన 'మార్తోభవ' అనే నాటకంలో మనిషి ప్రవర్తన వేరొక దృక్కోణంనుంచి పరిశీలించబడింది

ఒక చిన్న పొరపాటు జరిగితే చిన్నదేకదా అని వదిలేయడంవల్ల భయంకర పరిణామాలు కలిగే ఆస్కారం వుంటుందనీ, స్వల్పవిషయాలను నిర్లక్ష్యం చేయడం అభిలషణీయం కాదనీ, చిన్న పామునైనా పెద్ద కర్రతో కొట్టితీరాలని హెచ్చరించే నాటకం ఇది

మార్గశీర్ష రచించిన 'అమృతవర్షిణి' నాటకంలో నిరుద్యోగ సమస్యను

కొత్తకోణంనుంచి పరిశీలించడం జరిగింది అందరూ ప్రభుత్వోద్యోగాలకై వెంపర్లాడకుండా దొరికిన ఎంత చిన్న పనైనా చేసి సొంతకాళ్లపై నిలబడి తమ ప్రయోజకత్వాన్ని నిరూపించుకోవాలని, డిగ్నిటీ ఆఫ్ లేబర్ అనే భావనతో, ఆశావాదంతో ముందుకు సాగాలని రచయిత ఉద్బోధించారు

కాగా, నిరుద్యోగం, లంచగొండితనం, వరకట్న దురాచారం, అధికార దుర్వినియోగం, నైతిక విలువలు మొదలైన అంశాలమీద ఈ దశాబ్దిలో నాటక నాటికలు గణింపదగిన స్థాయిలో రాలేదు ప్రేమ కథలను నాటక వస్తువుగా స్వీకరించిన సందర్భాలు కూడా కనబడవు

## 'ఋత్విక్'

శ్రీ విశ్వనాధ గణపతిరాజు రచించిన 'ఋత్విక్' వస్తురీత్యా ఒక విలక్షణమైన నాటకం క్షేత్రము, బీజము రెండూ ఆరోగ్యకరంగా ఉన్నప్పుడు మొక్క మహా వృక్షము అవుతుంది చక్కటి ఫలాల్ని, చల్లని నీడని యిస్తుంది మనంవిచక్షణగల వారమైతే చాలు మనపిల్లలు విజ్ఞులవుతారు మనం మనుషులమైతే చాలు మన పిల్లలు మహాత్ములవుతారు

ఆస్తి, అంతస్థు, ఆరోగ్యం అన్నీ సమృద్ధిగా ఉన్నప్పుడు మనిషి అహంకరిస్తాడు రోగనిరోధకశక్తి తగ్గాక ఎట్లాగైతే లేనిపోని జబ్బులు తమ ప్రభావాన్ని శరీరం మీద చూపిస్తాయో అలాగే పరిసరాలు, పరిస్థితులు పెంపకంలోని లోటు కారణంగా కొన్ని అవలక్షణాలు బాల్యం నుంచే అబ్బుతాయి

మనిషి తన శక్తి సామర్థ్యాల్ని మూడు రకాలుగా నష్టపోతున్నాడు నిన్నటి గురించి అసంతృప్తి, అనిశ్చితమైన రేపటి గురించి భయం, ఇవాల్టి గురించి ఆందోళన బతుకుపట్ల భయం పెరిగినప్పుడు ఎంతటి దుర్మార్గమైనా న్యాయంగానే అనిపిస్తుంది మనిషి ఎన్నటికీ విచక్షణ కోల్పోకూడదు మెదడులో తెరవని అరలెన్నో ఉన్నాయి వాటిని తెరవాలి నిక్షిప్తమైన శక్తుల్ని వెలికి తీసి బతుకును చక్కదిద్దుకోవాలి బంగారు బాట వేసుకోవాలి మన పిల్లలకు మనమే

మార్గదర్శకులం కావాలి - అని ఉద్బోధిస్తుంది "ఋత్విక్" నాటకం

ఈ నాటకంలో ఋత్విక్, జగన్నాటకంలో జరుగుతున్న విశేషాల వివరణకు నిర్దేశించబడిన ఒక ప్రతీకాత్మక వ్యాఖ్యాత

మన్మధరావు రెండుచేతులా ఆర్జిస్తూ కన్నూమిన్నూ కానకుండా వ్యవహరిస్తూ ఉంటాడు భార్యా,పిల్లల్ని కూడా పట్టించుకోడు ఎప్పుడూ తన ఆనందంకోసం, సంతృప్తికోసం, సుఖంకోసం పరుగులు తీస్తుంటాడు ఆరోగ్యం క్షీణించి వైద్యంకోసం విదేశాలకు వెళ్లాలని ప్రయత్నించినపుడు భార్య, కూతురు, కొడుకు, బావమరిది ఎవరికివారు తమ స్వార్ధం కోసం ఆరాటపడతారేతప్ప అతన్ని పట్టించుకోరు - మన్మధరావు ఆలోచనలోపడతాడు గతంలో తన ప్రవర్తనను స్మరించుకొంటూ చింతాక్రాంతుడౌతాడు ఇదే ఇతివృత్తం

సంభాషణలు చెక్కినట్టుగా సూటిగా, క్లుప్తంగా, భావస్ఫోరకంగా ఉన్నాయి

నాటకం చదువుతూవుంటే దృశ్యాలు మనకళ్లముందు కదలాడుతూ ఉంటాయి తండ్రి అనైతిక ప్రవృత్తికి పాల్పడితే భార్యాబిడ్డలు తమ స్వార్ధం, తమ భవిష్యత్తును చూసుకోవడంలో తప్పులేదేమో - ఆ తప్పు అతనిదే - అనే సత్యాన్ని నిరూపించడంలో పాత్రచిత్రణ ఎంతో సహజంగా, హేతుబద్ధంగా, కన్విన్సింగాఉంది పనిగట్టుకుని పాత్రచేత నీతిసూత్రాలు పలికించడంగానీ అసందర్భంగా మాట్లాడించడంగాని ఈ నాటకంలో లేదు సంభాషణల్లో క్లుప్తత, పొందిక, తెలుగుతనం కొట్టివచ్చినట్టు కన్పించే లక్షణాలు పుష్కలం

ప్రదర్శన సౌలభ్యం నిండుగా ఉన్న రచన ఇది అయితే ఈ నాటకంలో కథానాయకుడికి మించిన ప్రాధాన్యం వ్యాఖ్యాతకు లభించడం నాటక తత్వానికి భిన్నమైన లక్షణం అంతేకాదు అడుగడుగునా నాటక సారాంశాన్ని 'స్పూన్ ఫీడింగ్' లాగ వ్యాఖ్యాత ద్వారా చెప్పించడంవల్ల సామాజికులకు నాటకాన్ని గూర్చి ఆలోచించడానికి ఏమీ మిగలదు సంఘటనలు కొరవడటం అటుంచి, పతాకస్థాయి కూడా లేకపోవడం ఈ నాటకంలో స్పష్టంగా కనిపించే పెద్దవెలితి

# దశరూపుడు జూదమాడాడు

శ్రీ యస్ కె అంజనేయులుగారి రచన తనకోపమే తన శత్రువు అన్నట్టుగానే, తనలో రగిలే ద్వేషాన్ని విచ్చలవిడిగా అలాగే వదిలేస్తే ఆ ద్వేషమే భస్మాసురుడి హస్తంలా తనను అంతం చేస్తుందనీ, ఎదుటి వ్యక్తుల అభిప్రాయాలను గౌరవించడము, సంయమనం పాటించడం, పట్టూవిడుపూ ఉండటం అవసరమనీ – అలాకాకుండా తనమాటే నెగ్గాలని తన కత్తికి ఎదురులేదని మూర్ఖంగా ముందుకు దూకితే ఆ వ్యక్తి చిత్తుగా ఓడిపోక తప్పదు తాటిచెట్టు ఎక్కే మనిషిని తలదన్నే వాడుంటాడని గ్రహించాలని ఉద్బోధిస్తుంది ఈ నాటకం ద్వేషం కంటే ప్రేమతో పనులు సాధించుకోవడం సులభం అనే సందేశం ఈ నాటకంలో అంతర్లీనంగా ప్రవహిస్తుంది

చక్రవర్తి నాయుడుగారి కుమార్తెను వల్లో వేసుకున్నాడని నాయుడికి కోపం చక్రవర్తిని అంతం చేస్తేనే తన పగచల్లారుతుందని – ఆ సమయం కోసం ఎదురుచూస్తున్నాడు నాయుడు నాయుడు వేసే ఎత్తులకు పై ఎత్తులు వేస్తూ చక్రవర్తి తప్పించుకొంటూ వుంటాడు చివరికి చక్రవర్తిని చంపడానికి 'బండోడ్ని' ఆయుధంగా ఎన్నుకొన్నాడు బండోడ్ని ఒకరిచేత చంపిస్తే వాడు చనిపోతూ తన్ను చంపింది చక్రవర్తి అని చెప్పాలని (బండోడిచేత అలా చెప్పించాలని) పథకం వేశాడు నాయుడు కాని చక్రవర్తి తెలివిగా ఆ సమయంలో తాను "లాకప్"లో ఉండేటట్లు జాగ్రత్తపడటంతో నాయుడు ప్లాన్ బెడిసికొట్టింది నాయుడు అపరాధిగా నిలబడతాడు న్యాయస్థానంలో

వికృతరూపాన్ని ధరిస్తున్న మానవ ప్రవృత్తులకు, మనిషిని మనిషి అర్థం చేసుకోకుండా ఆవేశానికి ఊపిరిపోస్తూ మంచీ, చెడూ వితర్కించుకోని విచక్షణాశూన్యుల దుష్ట ప్రకృతిని చిత్రించడంలో రచయిత అనుపమానమైన నేర్పు ప్రదర్శించారు కథనంలో కొత్తపోకడలున్నాయి సంభాషణలు సూటిగా, పదునుగా ఉన్నాయి నాటకం ఎక్కడా విసుగు పుట్టదు ప్రదర్శనలో రక్తికట్టే నాటకం

ఎన్నో హత్యలు సునాయాసంగా చెయ్యగలిగిన ప్రతినాయకుడు (విలన్) చక్రవర్తిని చంపడానికి అంతపెద్ద పధకం వెయ్యడం మచ్ ఎ డు ఎబౌట్ నథింగ్ బండోడ్ని చంపడానికి బండోడి కొడుకు బక్కోడ్ని వొప్పించిన వైనం ధనానికి రక్తపాశం కూడా దాసోహం అంటున్న లోకరీతి ఈ నాటకంలో సువ్యక్తం అయ్యింది నానాటికీ విచ్ఛిన్నమై, క్షీణించిపోతున్న మానవ సంబంధాల అనురాగబంధాలను, మనుషుల్లో పెరుగుతున్న స్వార్థచింతను, పాశవిక శక్తుల విజృంభణను గుర్తుచేస్తూ, మంచిని విసర్జించి చెడువైపు పరుగులు తీస్తున్న మనుషులను హెచ్చరిస్తుంది 'దశరూపుడు జూదమాడాడు' నాటకం 40 పాత్రలున్న ఈ నాటకాన్ని 15 మంది నటులతో ప్రదర్శించడానికి అనువుగా ఉంది

## కాంచన మృగం

మానవత్వం అనే స్పర్శ, స్పృహ లేకుండా అనాగరిక మనస్తత్వంతో రాక్షసుల్లా ప్రవర్తించే నాగరిక జాతులకన్నా, చదువూ సంస్కారం లేకపోయినా మానవత్వపు ఛాయల్లో వర్తించే అనాగరిక జాతులు ఎన్నో రెట్లు ఉత్తములని, నిజమైన మనుషులు వాళ్లేనని వివరిస్తుందీ నాటకం వివాహ బంధాన్ని పట్టి నిలిపేది డబ్బే కాని ప్రేమానుబంధం కాదని నేటి యువతరం ఋజువు చేస్తున్నది కట్నం' అనే కాంచన మృగాన్ని వేటాడుతూ కట్టుకున్న భార్యకు నరకాన్ని చూపించే నేటితరం యువకుల్లో (దురాశాపరులైన పెద్దల అడుగుజాడల్లో నడిచే వ్యక్తిత్వం లేని యువకుల్లో) మార్పు రావాలని ప్రబోధిస్తుందీ నాటకం అంతేకాదు పురుషాహంకారానికి భయపడి అడుగులకు మడుగులొత్తే బానిసలుగా కాకుండా నేటి యువతులు దుర్మార్గాన్ని, దౌష్ట్యాన్ని ప్రతిఘటించాలనీ, అవసరమైతే బంధాలు ఛేదించుకుని కొత్త జీవితాన్ని పునర్నిర్మించుకొనే తెగువ చూపాలని ఉద్బోధిస్తుంది 'కాంచన మృగం' నాటకం రచన శ్రీ వి బి కె శర్మ

కథ పాతదేకాని - దీనిలో ఒక చిన్న మలుపుంది అలాంటి ట్విస్టే ఈ నాటకానికి ప్రాణం పోసింది ఇరువురి వేరువేరు జంటల (నాగరిక, అనాగరిక) వైవాహిక జీవితాలను తులనాత్మకంగా పరిశీలించి ప్రేక్షకులముందు ఉంచడమే

ఆ ట్విస్ట్

వరదయ్య మధ్యతరగతి మనిషి తన కుమార్తె పావనిని మేనల్లుడైన విశ్వపతికిచ్చి పెళ్లి జరిపిస్తాడు విశ్వపతి తండ్రి నరసింహం కేవలం డబ్బు మనిషి కట్నం పూర్తిగా యివ్వనందుకు పెళ్లిరోజే గొడవచేసి, కట్నంబాకీకి నోటు రాయించుకోవడం ద్వారా అప్పటికి సమాధానపడతాడు కట్నం తీసుకొచ్చేవరకు కొడుకుని మామయ్య ఇంట్లోనే ఉంచేస్తాడు విశ్వపతి నక్షత్రకుడిలా నిత్యం వేధిస్తూ ఉంటాడు చివరికి గత్యంతరంలేక ఉన్న ఇల్లుకాస్తా అమ్మేసి వరదయ్య డబ్బు ఇంట్లో పెడతాడు గుట్టుచప్పుడు కాకుండా ఆ డబ్బు కాజేసి అల్లుడు అక్కడ్నుంచి ఉడాయించబోతాడు కాని పట్టుబడతాడు భార్యను తనతో తీసికెళ్లే ప్రసక్తేలేదంటాడు వీలుచూసుకొని డబ్బుతో పరారైపోతాడు తన జీవితం రెంటికీ చెడ్డరేవడి అయిందని నిరాశతో పావని ఆత్మహత్యకు పాల్పడుతుంది ఇది మెయిన్ ప్లాట్ అయితే 'కలగడు' అనే యానాది కుటుంబ కధ సబ్ ప్లాట్

కలగడు, కావమ్మా భార్యాభర్తలు ఇద్దరూ కష్టజీవులే కలగడు తాగుడికి బానిసై తన సంపాదనంతా తాగుడికి ఖర్చు చెయ్యడమేగాక కావమ్మ సంపాదనకూడా తనకు కావాలని కావమ్మను తిట్టి, కొట్టి నిత్యం వేధిస్తుంటాడు వరదయ్య ఆ దంపతుల్ని సమాధానపరిచి కలతలు లేకుండా సర్దుబాటు చేస్తుంటాడు కలగడు ప్రవర్తన మితిమీరిపోయి అతనితో కాపురం చెయ్యడం దుర్భరం అనిపిస్తుంది కావమ్మకు అంతే ఒకరోజు తన కొడుకును తీసుకుని కాచిగాడితో లేచిపోతుంది వేరే కాపురం పెడుతుంది వరదయ్య చెప్పినావినదు నా బతుకు నేను చక్కబెట్టుకున్నాను ఇంక కలగడుతో కలిసి కాపురంచేసే ప్రశ్నలేదు పొమ్మంటుంది మారుమనువు మా కులం అంగీకరిస్తుంది అని స్పష్టం చేస్తుంది

చదువూ, సంస్కారం, తెలివితేటలు అన్నీవున్నా పావని సంప్రదాయ సంకెళ్లను తెంచుకోలేక, భర్తను ప్రేమిస్తున్నట్టు ఆత్మవంచన చేసుకోలేక 'చావును' పరిష్కార మార్గంగా ఎంచుకొంటుంది

పతాక సన్నివేశంలో, కూతురుకోసం భోరున ఏడ్చే తండ్రినిచూసి, కలగడు

తనదైన భాషలో ఇలా అంటాడు "ఆడబిడ్డ బతుకు బరిలో భయంగా ఉండాలని పెంచినారేగానీ, ఆడ కూతురు బ్రతుకు పోరులో ధైర్యంగా సాగిపోయేగుండెదిటవు మెండుగా నేర్పివుంటే, ఈనాడీ కడుపుకోత మీకుండేదేనా? కట్టం సాల్లేదు అని పట్టుబట్టే సేతుల్ని అవుసరం అయితే ఇరగదీసి, కరగదీసి, ఇసిరిపారేసిరమ్మనే పెంపకం కావాలయ్యా పెంపకం కావాల అప్పుడే ఇట్టాంటి సావులు ఏడా అగపడవు – అవును అగపడవు ఆ! ' ' కలగడు'మాటల్లోనే నాటక సందేశం ఉంది

ప్రదర్శన సౌలభ్యం ఉన్న ప్రయోజనాత్మక నాటకం

తీసుకున్న వస్తువును డీవియేషన్ లేకుండా నడిపించుకుపోయాడు నాటకకర్త

## మళ్లీ గాంధీ పుట్టాలా?

ప్రవాసాంధ్రులు శ్రీ ఆర్ వి చలంగారి కలం నుండి వెలువడిన నాటకం మళ్లీ గాంధీ పుట్టాలా?'

శంకరయ్యగారిది సాంప్రదాయ కుటుంబం రిటైర్డ్ హెడ్ మాస్టర్ నీతి నిజాయితీలకు విలువయిచ్చే సదాచారసంపన్నుడు సంప్రదాయ కుటుంబంలో పుట్టిపెరిగినా లౌకిక వ్యవహారాల్లో పట్టూవిడుపూ, రాజీధోరణి ఉన్న మనిషి కాలానికి ఎదురీదాలనే తత్వం కాదు అతని తమ్ముడు వేదమూర్తి పూర్తిగా భిన్నమైన మనస్తత్వంగలవాడు రాజకీయవేత్త – మెత్తనికత్తి వాసు శంకరయ్య పెద్ద కొడుకు నిరుద్యోగ యువకుడు జయదేవ్ శంకరయ్య చిన్న కొడుకు ఇంటిపెత్తనం ముఖ్యంగా వంటింటి బాధ్యతలు నెరవేరుస్తుంటాడు కృష్ణప్ప అతని కూతురు సుశీల శంకరయ్యకు చాలా దగ్గర బంధువులు బారికరాముడు హరిజనుడు వేదమూర్తికి నమ్మినబంటు నిర్మల బారికరాము డు కూతురు మెట్రిక్ పాసయింది

కృష్ణప్ప తనకూతురు సుశీలను వాసుకిచ్చి పెళ్లిచేయాలని ప్రయత్నిస్తాడు శంకరయ్యకు అభ్యంతరం లేకపోయినా వాసు అందుకు అంగీకరించడు

సుశీల మనస్సు చివుక్కుమంటుంది ఆమె బావపై పెట్టుకున్న ఆశలు నిరాశలవుతాయి బారికరాముడు కూతురు నిర్మలను పెళ్లి చేసుకుని వాసు ఆ ఇంట్లో ప్రళయం సృష్టిస్తాడు మొదట్లో అందరికీ యిష్టంలేకపోయినా ఎలాగో సమాధానపడతారు నిర్మల ఆ ఇంట్లో అందరికీ తలలో నాలుకలాగా మెలుగుతూ అందరి అభిమానాన్ని చూరగొంటుంది వాసుకి ఉద్యోగం వస్తుంది వర్ణాంతర వివాహం చేసుకోవడంవల్లనే అతనికా ఉద్యోగం యిస్తుంది ప్రభుత్వం (నిజానికి ఉద్యోగం సంపాదించడం కోసమే అతను నిర్మలను వివాహమాడినట్లు ఆ తర్వాత తెలుస్తుంది) వాసుకి ఉద్యోగ భద్రత ఏర్పడగానే అతని మనసు సుశీలపై మొగ్గుచూపుతుంది సుశీల అతని కోర్కెను తిరస్కరిస్తుంది సుశీలతో తన ప్రేమను వ్యక్తం చెయ్యడం విన్న నిర్మల ఖిన్నురాలవుతుంది తనకు విడాకులిచ్చి సుశీలను పెళ్లిచేసుకుని సుఖపడమని భర్తతో చెప్తుంది

సుశీల మీద వేదమూర్తి కన్నుపడింది వావివరసలు మరచి సుశీలను బలాత్కరించి భంగపడతాడు ఆ విషయం తెలిసి అతనికి బుద్ధి చెప్పాలని ఆవేశంతో వెళ్లిన వాసుని రౌడీలచేత కొట్టిస్తాడు వేదమూర్తి అంతేకాదు తన మీద హత్యా ప్రయత్నం చేశాడనే నేరంమోపి వాసూని అరెస్టు చేయిస్తాడు సుశీలను కిడ్నాప్ చేయించి ఆమెను చంపేస్తాడు తమ్ముడి దుర్మార్గాన్ని అసహ్యించు కుంటాడు శంకరయ్య అన్నను చంపమని బారికరాముణ్ణి ఉసిగొలిపి పంపిస్తాడు వేదమూర్తి పరిస్థితుల్ని అర్థం చేసుకొని న్యాయంవైపు నిలబడ్డ బారికరాముణ్ణి వేదమూర్తి కాల్చి చంపేస్తాడు చేజిక్కిన రివాల్వర్‌తో వేదమూర్తిని చంపబోయిన కృష్ణప్పనువారించి, చట్టాన్ని తన చేతుల్లోకి తీసుకోవద్దనీ న్యాయస్థానం ఆ పని చేస్తుందని హితబోధ చేస్తాడు బారిక రాముడు చనిపోతూ హరిజన సమస్యను పరిష్కరించాలంటే "మళ్లీ గాంధీ పుట్టాల"ని అంటూ ప్రాణాలు వదుల్తాడు

నేడు సంఘంలో అంటరానితనం పోలేదు వివిధ స్థాయిలలో, వివిధ దశల్లో యింకా మిగిలే ఉంది మనుషుల అంతరాంతరాల్లో అంటరానితనం తన

ఉనికిని, అస్తిత్వాన్ని చాటుతూనే ఉంది దీనిని నిర్మూలించాలంటే మరో అవతార పురుషుడు జన్మించాలి అనే ఆర్తిని, సందేశాన్ని ప్రతిబింబిస్తుంది ఈ నాటకం

వృత్తిరీత్యా ఏర్పడిన వర్ణవ్యవస్థలో ఉచ్చనీచాల ప్రసక్తి లేదని స్వార్థపరులు కల్పించుకున్న వ్యాఖ్యానాల ఫలితమే కులాల విజృంభణ అనీ పాత్రలద్వారా నాటకంలో అక్కడక్కడా హేతుబద్ధంగా చర్చించారు నాటక రచయిత

సంభాషణలు హుందాగా, సజీవంగా సాగాయి

వ్యక్తుల మధ్య సంఘర్షణ, అంతరంగంలో సంఘర్షణన వ్యక్తీకరించబడిన తీరు సహజంగా ఉంది

కుటుంబం సజావుగా సాగిపోవడానికి సంప్రదాయబద్ధులైనవారు కూడా ఒక్కొక్కసారి ఎలా తమ పట్టుదలవిడిచిపెట్టి కాలంతోబాటు తామూ నడిచిపోవడానికి సంసిద్ధులౌతారో ఈ నాటకంలో వివరంచడం జరిగింది

అయితే వాసు' లాంటి యువకులు మనసులో మాలిన్యం ఉంచుకొని, సంఘ సంస్కరణ అనే పేరుతో నాటకమాడుతూ తమనితాము వంచించుకొంటూ సమస్య' ను ఎలా తూట్లు పొడుస్తున్నారో గమనించాలి అనే హెచ్చరికకూడా ఉంది ఈ నాటకంలో

అంతేకాదు వేదమూర్తివంటి స్వార్థరాజకీయవేత్తలు హరిజన సమస్యను తమ స్వార్థానికి, రాజకీయాల్లో పైకి ప్రాకడానికి ఒక ఆయుధంగా వాడుతున్నారేతప్ప, ఆ సమస్యను పరిష్కరించాలన్న చిత్తశుద్ధి వారిలో లేదు హరిజనుల నిరక్షరాస్యతను ఆధారం చేసుకొని వారిని పావులుగా వాడుకొంటున్నారు ఈ పరిస్థితులు మారాలని హరిజనులు విజ్ఞానవంతులు, చైతన్యవంతులు కావాలని ఉద్బోధిస్తుంది ఈ నాటకం మన సామాజిక వ్యవస్థకు వసుధైక కుటుంబం ఆదర్శం కావాలని ఆకాంక్ష ధ్వనిస్తుంది ఈనాటకంలో

విసుగుపుట్టేసంభాషణలుగాని సన్నివేశాలుకానీ లేవు నాటకారంభంలో

పాత్రల పరిచయం ఆకర్షణీయంగా ఉంది ఆలోచనాత్మకమైన, సందేశాత్మకమైన ఒక మంచి నాటకం ఇది

1 సంప్రదాయబద్ధమైనొక బ్రాహ్మణ కుటుంబంలో హరిజనకన్యను ముడిపెట్టడంతో తొలుత ఇది సమస్యాత్మక నాటకంగా అనిపించినా, రెండవ రంగంనుంచి హరిజన సమస్య పక్కదారిపట్టి, సార్వత్రిక సమస్య (యూనివర్సల్ ప్రాబ్లమ్) సుశీల - వేదమూర్తి పాత్రల ఉపాఖ్యానంతో వైయక్తిక సమస్య (ఇండివిడ్యువల్ ప్రాబ్లమ్) గా రూపాంతరంచెంది అసలు సమస్య బలహీనమైపోయి సబ్ ప్లాట్ (ప్రాసంగికేతివృత్తాని) కే ప్రాధాన్యం లభించింది

దీనివల్ల నాటకంలో వస్త్వైక్యం దెబ్బతిన్నది అంటే ఇది ఒక సమస్యాత్మకమైన నాటకం కాకుండా ఒక బ్రాహ్మణ కుటుంబంలో జరిగిన ఒక సాధారణ కథగా రూపుదాల్చింది

2 నిర్మల పాత్రను, బారికరాముడు పాత్రను హరిజన సమస్యావిష్కరణ కొసం రచయిత ఉద్దేశించినా, ఆ పాత్రల ఉనికి, ప్రాధాన్యం మొదటి రంగానికి చివరి రంగానికి మాత్రమే పరిమితమయ్యాయి చివరి రంగంలో హరిజనులను అగ్రవర్ణాలవారు పావులుగా వాడుకొంటున్నారని బారికరాముడుచేత భరతవాక్యం పలికించడం ద్వారా హరిజన సమస్యను రచయిత గుర్తుచెయ్యడం జరిగింది అంటే హరిజన సమస్యను నాటకంలో లింక్ అప్ చేయడం జరిగింది

3 పతాక సన్నివెశం మరీ సినిమేటిక్‌గా మలచబడింది

4 సుశీలకు ఎక్కువగా ప్రాధాన్యం యివ్వకుండా నిర్మలతో సన్నివేశాలను కల్పించివుంటే తీసుకున్న సమస్యకు బలం వచ్చేది

5 వస్తువులోను, అభివ్యక్తిలోను కొత్తదనం లేదు

కొంత విమర్శకుతావిచ్చినా ప్రదర్శనార్హత సంతరించుకొన్న ఒక మంచి నాటకంగానే దీన్ని పరిగణించవచ్చు

# వైద్య వ్యవస్థ

'ధర్మాసుపత్రి' అనే బోర్డు వ్రేలాడుతున్నా, లోపలికెళ్తే అక్కడ ఎదురయ్యే చేదు అనుభవాలు అందరికీ తెలిసినవే వైద్యరంగంలో అద్భుతమైన ప్రయోగాలు, అభివృద్ధి అంబరాన్ని చుంబిస్తున్నా వాటి ఫలితాలు పేదవారికి ఇంకా గగనకుసుమాలుగానే ఉండిపోతున్నాయి

వైద్యసౌకర్యాలు పేదవాడికి అందుబాటులో ఉంచాలన్న సదాశయంతో ప్రభుత్వం ఎన్ని చట్టాలు చేసినా, ఎన్ని నిబంధనలు విధించినా నడుస్తున్న కథలో చెప్పుకోదగిన మార్పులేదు ఇటువంటి ఉదంతాలకు ఊపిరిపోస్తూ సుఖమంచి కోటేశ్వరరావు, కందిమళ్ల సాంబశివరావు వంటి నాటక రచయితలు నాటికలు వెలువరించారు

# నరకం మరెక్కడో లేదు

ప్రమాదంలో తీవ్రంగా గాయపడి, నెత్తురుమడుగులో గిలగిలా కొట్టుకొంటున్న నిర్భాగ్యుడు వరండాలో బెంచిమీద పడుండగా డాక్టర్లు, నర్సులు అతని గోడు వినకపోగా కన్నెత్తయినా చూడరు వాళ్ల హడావిడంతా పురిటినొప్పులు పడుతున్న మంత్రిగారి కూతురు చల్లగా ప్రసవించడానికి తగిన ఏర్పాట్లు చెయ్యడంకోసమే! శ్రీ యస్ కోటేశ్వరరావు రచించిన 'నరకం మరెక్కడో లేదు' నాటికలో ప్రభుత్వ ఆసుపత్రుల్లో పేదవాళ్లపట్ల డాక్టర్లు, నర్సులు చూపే నిర్లక్ష్యం, కొన్ని సందర్భాలలోవారు ప్రదర్శించే అమానుష వైఖరి ఏ ప్రమాణంలో విస్తరించి ఉందో మనసుకు హత్తుకునే విధంగా వివరించారు సంవాదకౌశలం అంతగా చెప్పుకోతగింది కాకపోయినా, కథనంలో సంఘటనలే అధిక ప్రాధాన్యం వహించిన కారణంగా, ప్రదర్శనాపరంగా ఎక్కువ రక్తికట్టడానికి మెండుగా అవకాశాలున్నాయి ఈ నాటికలో అయితే ఈ నాటికను ప్రదర్శించడానికి హాస్పిటల్‌సెట్టు అనివార్యమౌతుంది రెండు స్త్రీ పాత్రలున్న ఈనాటికను ప్రదర్శించడానికి ఆర్థిక పుష్టిగల ఔత్సాహిక సమాజాలకే సాధ్యమవుతుందేమో!

1984లో ఆంధ్ర లలితకళాసమితి (హైదరాబాద్) 17వ వార్షికోత్సవ నాటిక పోటీలలో 'నరకం మరెక్కడోలేదు' అనే నాటికకు ఉత్తమ ప్రదర్శన బహుమతి లభించింది దరిమిలా ఎన్నో పరిషత్తు పోటీలలో విజయభేరి మ్రోగించి ప్రజాదరణ చూరగొన్నది ఈ నాటిక

వైద్యాలయాల్లో రోగుల కడగళ్లను, డాక్టర్ల నిర్లక్ష్య వైఖరినిగూర్చి శ్రీ కందిమళ్ల సాంబశివరావు 'ముద్రారాక్షసం' అనే పేరుతో ఒక నాటికను రాశారు అప్పాజోస్యుల - విష్ణుభట్ల ఫౌండేషన్ (అమెరికా)వారు నిర్వహించిన రాష్ట్రస్థాయి నాటికారచన పోటీలలో ఈ నాటిక ఉత్తమ రచనగా ఎంపికయింది

శ్రీ ఎస్వీరావు రచించిన 'ట్రీట్‌మెంట్' నాటికకూడా ఆస్పత్రుల్లో డాక్టర్ల నర్సుల అనుచిత అమానుషవైఖరిపై సంధించిన మరొక విమర్శనాస్త్రం ప్రజాదరణపొందిన నాటికలలో పేర్కొనదగింది

## హాస్యం

హాస్యరచన అన్నిటికంటే కష్టతరమైంది అందువల్లనే ఏ భాషలోనైనా హాస్యరచయితల సంఖ్య తక్కువగా ఉంటుంది హాస్యరస ప్రాముఖ్యాన్ని మనప్రాచీనులు గుర్తించినా ఎందువల్లనో పూర్వ కవులు హాస్యరసాన్ని అంతగా ఆదరించలేదు వీర శృంగార కరుణ రసాలకే అధిక ప్రాధాన్యం యిచ్చారు కాని ఆధునిక యుగంలో ముఖ్యంగా కందుకూరి వీరేశలింగం కాలంనుంచి హాస్యరసానికి సాహిత్యంలో చోటుదొరికింది అప్పటినుంచీ ఎందరెందరో మహా రచయితలు హాస్యరసాన్ని పెంచి పోషించుకుంటూవచ్చారు

1980 - 90 మధ్యకాలంలో వెలువడిన హాస్యనాటకాలు, నాటికల విషయానికివస్తే - ఈ దశాబ్దిలో హాస్యరచన విరివిగానే సాగిందని చెప్పవచ్చు ఎటొచ్చీ హాస్యరచనల స్వరూపం చాలా మారిపోయింది ముఖ్యంగా ఈ రోజుల్లో ఉత్పత్తి అవుతున్న నాటకాలలో రాజకీయహాస్యం ఎక్కువగా ఉంటుంది అంటే రాజకీయాలమీద, నాయకులమీద వేసే చెణుకులు, సంధించే విమర్శనాస్త్రాలే

'హాస్యంగా' చెలామణి అవుతున్నాయి అంతేకాని కుటుంబ జీవితానికి, సాంఘికవ్యవస్థకు సంబంధించిన హెల్దీ హ్యూమర్ మృగ్యమైపోతున్నది ప్రభుత్వాన్ని, అధికారులను, అవినీతిని దుయ్యబట్టడమే హాస్యంకాదు అదికేవలం చప్పట్లకే పరిమితమైన క్షణిక హాస్యం రంగస్థలాన్ని విడిచి ఇంటికిపోయిన తర్వాత కూడా ఆ సన్నివేశం, ఆ మాటలు జ్ఞాపకం వచ్చి నవ్వుతెప్పిస్తే అది అసలైన హాస్యం అనుకోవాలి ఇదొక కొండగుర్తు

ఈ దశాబ్దిలో హాస్యరస స్ఫోరకమైన నాటికలు రాసిన వారిలో శ్రీయుతులు కాశీ విశ్వనాధ్, అత్తిలి కృష్ణారావు, శంకరమంచి పార్ధసారధి, డి వి రమణమూర్తి, గండవరం సుబ్బరామిరెడ్డి, పమ్మి వీరభద్రరావు, బాబూరావు, ఎస్ ముని సుందరం కొమ్మనాపల్లి, పి టి మాధవ్, ద్విభాష్యం రాజేశ్వరరావు, ఫణీంద్రప్రసాద్ ప్రభృతులు ముఖ్యులు

కొన్ని హాస్యనాటికలు కేవలం వినోద ప్రధానాలు కాగా, కొన్ని హాస్యంతోపాటు సందేశాన్ని జోడించినవి కొన్ని రచనల్లో సన్నివేశగత హాస్యంవుంటే, కొన్నిట్లో సంభాషణ గత హాస్యం ఉంటుంది మరికొన్ని రచనలలో హాస్యం మొరటుగా వుంటే, మరికొన్నిట్లో సున్నితంగా ఉంటుంది ఒకరకం హాస్యం నిరక్షరాస్యులకు మాత్రమే పరిమితమౌతుంది వేరొక హాస్యం విద్యావంతుల్ని, సంస్కారవంతుల్ని మాత్రమే అలరిస్తుంది పండితపామరులను రంజింపచేసే హాస్యం ప్రధమశ్రేణిలో నిలుస్తుంది మనకున్న హాస్య రచయితలలో పైన పేర్కొన్న అన్ని రకాల హాస్యాన్ని సృష్టించే వారున్నారు

## కాయితం పడవ

"కుచ్చితము, కుళ్లు, పాలిటిక్స్, స్వార్ధానికి అతీతమైన హాస్యం కలకాలం నిలుస్తుంది " అనే నమ్మకంవున్న శ్రీ కె వి బలరామ మూర్తి కలంనుంచి వెలువడిన 'కాయితం పడవ' ఈ దశాబ్దిలో (1980-90 సం మధ్య) వెలువడిన హాస్యనాటికలలో ఒకటి

కొత్తగా పెట్టిన పత్రికను ఆదర్శప్రాయంగా, సమాజానికి ప్రయోజనకారి అయ్యేటట్లు నడపాలని ఎడిటర్ బ్రహ్మంగారి అభీష్టం కాని, ఆదర్శాలువేరు అనుభవాలు వేరు అన్నట్టు అవుతుంది అతని పరిస్థితి తన ఆశయాలను కార్యరూపంలో పెట్టడంలో చిత్తుచిత్తుగా ఓడిపోయి, ఆత్మవంచన చేసుకుని వర్తమానంతో రాజీపడలేక పత్రికకు ఓదండం పెట్టేసి పారిపోతాడు బ్రహ్మం 'కాయితం పడవ' నాటికలో అన్ని హాస్యపాత్రలే

బ్రహ్మంగారి అసిస్టెంటు లింగం, బ్రహ్మంగారంత జిడ్డురకంకాదు ఫ్లెక్సిబుల్ టైపు నొప్పించక తానొవ్వక తప్పించుకు తిరిగేరకం ఆదర్శాలూ కాకరగాయలూ అతనికి పడవు పత్రికాఫీసు తెరచిన మొదటిరోజే, ప్రధమకబళే మక్షి కాపాత అన్నట్టు ఓ గేయరచయిత ప్రత్యక్షమయ్యాడు "కాకి కేకి అవుతుంది - కేకి కాకి అవుతుంది" అంటూ కాకిగోల ప్రారంభించి ఊదరగొట్టేడు ఒక పట్టాన విడిచిపెట్టడు పత్రిక్కి ప్రకటనలిచ్చే ఓ కంపెనీ నుంచి అతగాడికి గట్టి సిఫార్సు ఫోన్ మీద జరుగుతుంది అలా వీల్లేదు పొమ్మంటాడు ఎడిటర్ ఓ బస్తాబరువున్న సీరియల్ నవలను మొగుడు నెత్తిమీదపెట్టి మోయించుకొస్తుంది ఓ సీరియల్ రచయిత్రి ఒద్దంటున్నా వినకుండా పేజీలకు పేజీలు విన్పిస్తూనే ఉంది ఎడిటర్ శోషొచ్చి పడిపోయి కష్టంమీదలేచాడు కాని పరనం ఆగలేదు పత్రికకు ఫైనాన్స్ చేస్తున్న బ్యాంకు నుంచి ఫోనొచ్చింది రచయిత్రి అమ్మాజీగారి సీరియల్ తీసుకుని తీరాల్సిందేనని ఇంతలో వంటల రచయిత ఏకంగా ఓ గిన్నెలో అమెరికా హల్వాపట్టుకొచ్చాడు వంటచేసే విధానం గురించి తన వ్యాసం పత్రికలో వేసుకోవాలని సతాయిస్తాడు అతనికి కూడా గట్టి సిఫారసు ఉంది అందరూ ముక్త కంఠంతో బృందగానం చేస్తుంటే దిక్కుతోచక తలపట్టుకు కూర్చొన్నాడు ఎడిటర్ అంతలో పత్రిక పొప్రైటర్‌గారి నుంచి సందేశం అందింది- ఆ అందరి రచనలూ వెంటనే స్వీకరించి ప్రారంభ సంచికలోనే వేసెయ్యమని!

సంపాదకుని అంతరాత్మ ఎదురు తిరిగింది అతను రాజీనామా గీకేసి వెళ్లిపోయాడు పత్రికలంటే రచయితలకు పాఠకులకు మధ్యనడిచే పడవలు

విజ్ఞానం, వినోదంవంటి నిధినిక్షేపాలు మోసుకొస్తే అవి బంగారు పడవలవుతాయి కాని చెత్తరచనలు మోసుకొస్తే కేవలం కాయితం పడవలుగానే మిగిలిపోతాయి - అనే సందేశానికి ప్రతీక ఈ కాయితం పడవ వర్తమాన రచయితల, పత్రికల అవాంఛనీయ ధోరణులను హాస్యం చాటున శక్తిమంతంగాచిత్రించింది ఈనాటిక

## వంట మనిషి కావాలి

మాటల కూర్పులో పొందిక, సంక్షిప్తత, చమత్కారం విధిగా ఉన్నప్పుడే నాటకంలో హాస్యం రాణిస్తుంది సాంసారిక హాస్యాన్ని పోషించడంలో సిద్ధహస్తులు శ్రీ డి వి రమణమూర్తి వీరి రచనలు రాశిలో స్వల్పమే అయినా వాసిలో అనల్పమైనవి

వీరు రచించిన 'వంట మనిషి కావాలి' పూర్తిగా హాస్యనాటిక భార్యచేతివంటతో మొహం మొత్తిన భర్త వంటమనిషి కావాలని ప్రకటన వేయించాడు పత్రికలో ప్రకటన చూడగానే పుట్టపిగిలినట్లు వచ్చిపడ్డారు పాకశాస్త్ర ప్రవీణులంటూ పాకప్రవీణ పాపయ్య పంతులు తెలుగు వంటలు, చిట్కావైద్యం కూడా చేస్తానంటాడు అతను వంటకూ వైద్యానికి లంకెపెట్టే సరికి గంగాధరం (ఇంటిపెద్ద) దూరాలోచనలోపడ్డాడు చైనా వంటమనిషి చిన్-చాన్-ఛీ చేసే వంటకాల పేర్లువిని డోకొచ్చినంత పనైంది ఇంటివారికి ఇంక, మిస్టర్ ఆరోగ్యం అనే వంటాయనకు అన్నీ కొలతలే కోళ్లమల్లయ్యకు కోళ్లసంగతి తప్ప కూరగాయల మాట తెలియదు అతని కంటే ఘనుడు ఆచంట మల్లయ్య అన్నట్టు - సుకుమార్‌కు పొదుపులో వున్న సులువులు అన్నీ తెలుసుగాని అన్నీ రూల్సే అతనితో వీళ్లతో బాధపడలేక అందర్నీ దయచేయమన్నాడు ఇంటిపెద్ద వంటవాళ్ల ఐక్యత వర్ధిల్లాలంటూ నినాదాలు చేసి తలా యాభైరూపాయలిస్తేగాని వెళ్లమని పట్టుబట్టారు ఆ వచ్చినవాళ్లు గత్యంతరం లేక వాళ్లందరికీ డబ్బు ఇచ్చేసి చెంపలేసుకున్నాడు ఇంటిపెద్ద నాటిక ఆద్యంతమూ నవ్వుల జడివాన కురిపిస్తుంది చిన్నచిన్న మాటలతో హాస్యరసస్ఫోరకంగా రాయడం శ్రీ రమణమూర్తిలో వున్నప్రత్యేకత

# బ్రహ్మచారులకు మాత్రమే

ఆధునిక తెలుగు నాటక సాహిత్యంలో సాహితీమూల్యం, ప్రదర్శనా సౌలభ్యం, సామాజిక దృక్పథం ఉన్న మంచి నాటకాలను నాటికలును రచించిన వారిలో శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు గణనీయులు వీరు ప్రసిద్ధకథారచయిత, నవలారచయిత, సాహితీ విమర్శకులు కూడా

శ్రీ కప్పగంతుల రచించిన హాస్యనాటిక 'బ్రహ్మచారులకు మాత్రమే' ఆడపిల్లలకు పెళ్ళిళ్ళుచేసే బ్రహ్మ ప్రయత్నంలో ఒక భాగంగా, ఇళ్ళు కిరాయికి యిచ్చేటప్పుడు బ్రహ్మచారులకు మాత్రమే కేటాయించటం ఒక సాంబయ్య అనుసరిస్తున్న పద్ధతి ఈ పన్నాగం సాంబయ్యకు అచ్చిరాకపోగా బెడిసికొడుతుంది ప్రతిసారీ చేతికి అందినట్టువుండి జారిపోయేది చివరికి అతని పెద్దకూతురు సురేఖ ఒక ఉత్తరం రాసిపెట్టి ఇల్లువొదిలి వెళ్లిపోతుంది తన భవిష్యత్తును తానే వెతుక్కుంటూ హాస్యం చాటున, వివాహ సమస్య విశ్వరూపాన్ని ప్రదర్శించడం ఈ నాటికలో కొట్టవచ్చినట్టు కనిపించే ఓ ప్రత్యేకత ఈ నాటికలో హాస్యం ఆరోహణ క్రమంలో సాగిపోతూ కరుణార్ద్ర సన్నివేశంతో పతాకస్థాయికి చేరుకొంటుంది ప్రేక్షకులను ఆలోచింపజేసే చక్కని నాటిక

ఔత్సాహిక నాటకరంగానికి ప్రదర్శన యోగ్యమైన చక్కని హాస్యనాటికలు అందించినవారిలో శ్రీ బాబూరావు ("బాబు") పేర్కొనదగినవారు సుమారు 15 నాటికలు వీరి కలంనుంచి వెలువడినాయి 'మారేజ్‌డే' వంటి అషామాషి నాటికనుంచి పేగులు కదిలించే 'మధ్యతరగతి'వంటి కరుణరసాత్మకమైన నాటిక వరకూ రచించారు ప్రముఖ రచయిత డి.వి నరసరాజుగారన్నట్లు "హాస్యం, ప్రదర్శనా యోగ్యత - ఇవి రెండూ వీరి నాటకలకు ఉచ్ఛ్వాసనిశ్వాసాలు!"

శ్రీ బాబూరావు రచనలలో 'సుందరీ-సుబ్బారావు' 'టెలిఫోన్' అన్ని తరగతులవారినీ అలరించే పసందైన హాస్యనాటికలు కొత్తగా అద్దె ఇంట్లోకి ప్రవేశించిన యువదంపతులు తమ 'మారేజ్‌డే' ఆనందంగా జరుపుకోవాలని

వువ్విళ్లూరుతూ వుంటారు కాని పొరుగింటి సుబ్బారావు మావగారు పానకంలో పుడకలా అడ్డు తగిలి యువజంట నరదాలకు పరదాలు వేస్తారు–ఇదే 'మారేజ్‌డే' నాటిక ఇతివృత్తం

## సుందరీ - సుబ్బారావు

నాగరికత పేరుతో ఊహాజగత్తులో విహరిస్తూ లేని కష్టాలను కోరి తెచ్చుకోవడం కంటే, వచ్చే ఆదాయంతో సంసారాన్ని చక్కగా లాక్కువెళ్తూ వున్నంతలోనే తృప్తిపడటం నేర్చుకోవాలి అనే జీవితసత్యాన్ని హాస్యరసంతో మేళవించి కూర్చిన నాటిక 'సుందరీ – సుబ్బారావు' సంప్రదాయ నాటకాలు వేస్తూ తమ సర్వస్వాన్ని ధారబోసి జీవితాన్ని వెచ్చించిన ఒకనాటి మహానటులు తమ అవసాన దశలో అనుభవించే కష్టాలను ఈ నాటికలో 'నాంచారయ్య' పాత్ర ద్వారా నటలోకానికి గుర్తు చేశారు నాటకకర్త సామాజిక జీవితంలో మన కళ్లముందు చూస్తున్న మంచీ–చెడూ, ఎక్కడికక్కడ పాత్రల ద్వారా చెప్పించడం వలన 'సుందరీ–సుబ్బారావు' కేవలం హాస్యనాటికగానే కాక, ప్రయోజనాత్మక నాటికగా కూడా ప్రశంసార్హంగా ఉంది "సుందరీ – సుబ్బారావు ప్రదర్శన ఏర్పాటుచేస్తే టిక్కెట్లు కూడా పెడితే, నేను టిక్కెట్టుకొని చూస్తానని హామీయిస్తున్నాను"[14] అన్నారు ఈ నాటికకు యోగ్యతాపత్రం వ్రాస్తూ ప్రముఖ హాస్యరచయిత శ్రీ ఆదివిష్ణు

బాబురావుగారి 'టెలిఫోన్' అనే హాస్యనాటికలో రాంగ్ నెంబర్ వ్యక్తులతో సంభాషించటంవల్ల వచ్చిపడే చికాకులు, అపార్థాలు విడాకులవరకు దారితీసే దారుణ పరిస్థితులను హాస్యభరితంగా వివరించారు శ్రీ బాబురావు

వాయిదా పద్ధతిమీద వస్తువుల్ని కొనుక్కునే అలవాటువున్న ఓ గృహిణివల్ల ఆ కుటుంబం చిక్కుల్లో పడటం శ్రీ శంకరమంచి పార్థసారధి రాసిన 'హళ్లికి హళ్లి' నాటికలో చమత్కారయుతంగా చిత్రితమైంది వీరు రచించిన 'పూజకు వేళాయెరా' 'సైలెన్స్‌ప్లీజ్' అనే హాస్య నాటికలు కూడా జనరంజకమైన రచనలే

# ఆగండి నేనూ వస్తున్నా!

నాటక కళ విలువను గుర్తించకపోగా చులకనచేసి మాట్లాడే పెద్దలు (ముఖ్యంగా విద్యాధికులు) ఎందరో ఉన్నారు నాటకాలు వేసేవారిని 'అల్లాటప్పా'గా చూసే ప్రబుద్ధులు ఎందరో! అటువంటి వ్యక్తులకు కనువిప్పు కలిగించే ప్రయత్నమే శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి రచించిన 'ఆగండి నేనూ వస్తున్నా!' నాటిక తండ్రికి నాటకాలంటే పడవు తనయుడికి నాటకాలంటే ప్రాణం తండ్రిముందు కొడుకు తన సమాజ సభ్యులచేత ఒక నాటకం ఆడి, నాటక కళలోవున్న విశిష్టతను తెలియచెబుతాడు తన కళ్లముందు జరిగింది నాటకమని తెలుసుకున్న తండ్రి నిర్ఘాంతపోతాడు ఆనాటినుంచి అతనికి నాటక కళమీద గౌరవం ఏర్పడటమే కాక ఆ రాత్రి ప్రదర్శించబోయే నాటకానికి భార్యతోపాటు తానూ వెళ్లడానికి సిద్ధంకావడంతో నాటిక ముగుస్తుంది హాస్యప్రధానమైన ఈ నాటికను అనేక సమాజాలు ప్రదర్శించాయి దూరదర్శన్‌లోను, రేడియోలోను ఈ నాటిక ప్రసారమై ప్రశంసలు అందుకొంది

# నిత్యశంకితుడు

శ్రీ గండవరం రచించిన 'నిత్యశంకితుడు' నాటికలో ప్రతిమనిషినీ అనుమానిస్తూ ఎవర్నీ నమ్మని నిత్యశంకితునివల్ల అతని కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు పడేపాట్లు హాస్యప్రధానంగా దృగ్గోచరం చేయబడినాయి పనిగట్టుకుని ఇతరుల మీద అసంబద్ధమైన వ్యాఖ్యానాలుచేస్తూ గోరంతలు కొండంతలుగా చేసి అభూత కల్పనలతో వారి జీవితాలలో సుడిగుండాలు సృష్టించి, వాళ్లు ఏడుస్తుంటే తాను హాయిగా నవ్వుకునే వింతమనస్తత్వంగల ఓ పెద్దమనిషి కథ 'నోరుజారితే ' నాటికలో వివరించబడింది వీరు రచించిన "అబద్ధాల ఊబిలో" అనే నాటికలో ఆపద్ధర్మంగా ఆడిన ఒక చిన్న అబద్ధం ఎన్ని దారుణ పరిణామాలకు దారి తీస్తుందో అవైనాన్ని హాస్యభరితంగా వివరించారు నాటిక కర్త

## బావాబావా పన్నీరు

ఈ దశాబ్దిలో వెలుగులోనికి వచ్చిన హాస్య రచయితలలో శ్రీ టి ఫణీంద్రప్రసాద్ ఒకరు వీరు రచించిన 'బావా బావా పన్నీరు' అనే హాస్యనాటిక ఔత్సాహిక సమాజాలచే అమితంగా ఆదరించబడింది

పన్నీరు తన బావను ప్రేమిస్తుంది కానీ ఆ బావంటే పన్నీరు తండ్రి కోదండంకు ఇష్టం ఉండదు పులిరాజు, నరసింహం పెళ్లికొడుకులుగా వస్తారు బావ రకరకాల వేషాలు వేసి, చివరకి పన్నీరును ఎలా పెళ్లి చేసుకొన్నదీ చిత్రించే ఈ నాటికలో అడుగడుగునా హాస్యసన్నివేశాలు, వినోదాన్ని కలిగించే సంభాషణలే ఈ నాటికలో పులిరాజు, నరసింహం, పౌరాణిక నాటక పద్యాలు చదివే కపిరాజు, బావ, చివరికి కోదండం-అన్ని పాత్రల సృష్టిలో వైవిధ్యం వుంది నిజానికి పాత్రల సృష్టిలోని ప్రత్యేకత ఈ నాటకంలో హాస్యం పంచడానికి కారణం అని చెప్పవచ్చు

## ఇచ్చట సన్మానాలు చేయబడును

శ్రీ యస్ మునిసుందరంగారి రచన 'ఇచ్చట సన్మానాలు చేయబడును.' డబ్బు తీసుకొని ఎలాంటి మనిషికైనా సన్మానం చేయడానికి సిద్ధపడే సంస్థలమీద, అర్హతలేకపోయినా సన్మానాలు చేయించుకొనే పెద్దల మీద సంధించిన వ్యంగ్యాస్త్రం ఇది అలాగే శ్రీ కాశీ విశ్వనాథ్ రచించిన 'ఓటున్న ప్రజలకు కోటి దండాలు' తెలుగు రంగస్థలాన్ని ఉర్రూతలూగించిన నాటికలలో ఒకటి

## 30184

శ్రీ యు శ్రీనివాసరావు రచించిన '30814' ఈ దశాబ్దంలో వెలువడిన హాస్యనాటికలలో ఒకటి ఒక ప్రేమికుల జంటకు అనుకున్న విధంగా వివాహం చేయించడానికై స్నేహితులు ఆడిన నాటకం ఇది లాయర్ గాంధీ ఫోన్ నెం 30814 "ఈరోజు జనవరి 30 – మిమ్మల్ని ఒకరు హత్య చెయ్యబోతున్నారు ' 'అని పదే పదే ఫోన్ కాల్స్ రావటంతో, లాయరు, అతని గుమాస్తా కంగారు

పడతారు ఆ తర్వాత ఎదురయ్యే ప్రతి సంఘటన అందుకు అనుకూలంగా వుండటంతో భయంతో చలించిపోతారు చివరికి ఆ యింట జరిగేది హత్యకాదు - పెళ్లి! చివరిక్షణం వరకు సస్పెన్సు వుండేలా నేర్పు ప్రదర్శించారు రచయిత శ్రీనివాసరావు ఈ నాటికకు, డావియోట్ 'రిమెంబర్ సీజర్' నాటికకు దగ్గర పోలికలున్నాయి లోగడ 'రిమెంబర్ సీజర్'కు అనుసరణ 'జనవరి30' అనేపేరుతో శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి రాసివున్నారు

## కేటూ డూప్లికేటు

శ్రీ కొమ్మనాపల్లి గణపతిరావు రాసిన 'కేటూ-డూప్లికేటు' నాటికలో హాస్యం మోతాదు మించిందేమో అనిపిస్తుంది

పోలీసు స్టేషన్‌కి ఫిర్యాదు అందింది మంత్రిగారి బావమరిది ఇంట్లో రెండు తులాల బంగారు గొలుసు పోయిందని ఆ క్షణం నుంచీ ఆచూకీ కనుక్కొని దొంగను పట్టుకోవాలని తెగ హైరానపడిపోతున్నాడు హెడ్ కానిస్టేబులు వెంకటాద్రి నిమిష నిమిషానికి పైనుంచి ఫోను వస్తుంటే రారెత్తిపోతున్నాడు పోలీసు చిట్టాలో ఉన్న కిష్టాలును పిలిపించాడు ఆపని నేను చెయ్యలేదు మొర్రో అని హెడ్డుగారికి విన్నవించుకున్నాడు కిష్టాలు గండం గడిచి బయటపడటానికి ఇద్దరూ కలసి ఒక పధకం వేశారు బంగారు గొలుసు కిష్టాలు దొంగిలించి, బంగారు కొట్టు తాతాచారికి అమ్మినట్లు వొప్పుకున్నాడు తాతాచారిని పిలిపించి బెదిరించాడు హెడ్డు తాను ఆ నేరం చెయ్యకపోయినా అరెస్టు అయితే పరువుపోతుందని బంగారు గొలుసు ఖరీదు చెల్లించి ఊపిరి పీల్చుకున్నాడు తాతాచారి రెండు తులాల బంగారానికి పది తులాల ఖరీదు లాక్కున్నాడు హెడ్డు ఇదంతా చూస్తున్న మరో కేటు జేబులోంచి బంగారు గొలుసు చూపించాడు ధీమాగా! - ఇదీ కథ ఇతివృత్తంలో వాస్తవాన్ని ప్రతిబింబించే కొన్ని అంశాలు ఉన్నా, కథనంలో హుందాతనం లోపించింది హాస్యప్రధానమైన ఈ నాటికలో ఉన్నవన్నీ హాస్య పాత్రలే అయినా, దొంగతనం చేయడం, జైలుకెళ్లడం, తిరిగి రావడం, జైలు జీవితంలో ఏదో సరదావున్నట్టు భ్రమ కలిగించడం - ముఖ్యంగా అలాంటి

జులాయి మనుషుల్ని సరదా మనుషులుగా చిత్రించడం ఆరోగ్యకరమైన హాస్యంకాదు

ప్రబోధాత్మకమైన హాస్యనాటిక 'గొయ్యి' రచయిత శ్రీ తనికెళ్ల భరణి మనిషిలో పరవళ్లు తొక్కుతున్న అంతులేని స్వార్థానికి ప్రతీక 'గొయ్యి!' "అందులో ప్రతి మానవుడూ ఎప్పుడూ పడుతూనే వుంటాడు కాని విచక్షణాజ్ఞానం కలిగి దాన్ని రూపుమాపి న్యాయబద్ధమైన, ధర్మబద్ధమైన జీవితాన్ని సాగించడానికి మానవుడు ప్రయత్నించాలి" అన్నది ఈ నాటిక పరమార్థం

ఓ సామాన్యుడు చీకట్లో కన్నుగానక ఓ గోతిలో పడ్డాడు అప్పటినుంచీ గొంతుచించుకొని అరుస్తున్నాడు రక్షించండి బాబో అని ఓ సన్యాసి, క్రీడాకారుడు, యువజననాయకుడు, అతని శిష్యుడు, ఓ తాగుబోతు, గోతిలోపడ్డతని కొడుకు ఒక్కొక్కరూ ఆ దారిన వెళుతూ అతని ఆర్తనాదం విన్నారు అతని గోడు విన్నారు

కానీ ఒక్కరూ అతనికి చేయూతనిచ్చి పైకి లాగడానికి ముందుకు రాకుండా వచ్చిన దారినే వెళ్లిపోయారు

"పూర్వజన్మ ఖర్మఫలం కొద్దీ నువ్వు గోతిలోపడ్డావు అంటే ఏమిటీ ఆ జగన్నాటక సూత్రధారి నిన్ను పరీక్షిస్తున్నాడన్నమాట ఎవడి టైం వచ్చేదాకా వాడు అల్లా నోరు మూసుకుని పడి ఉండాల్సిందే అసలీ ప్రపంచమే పెద్దగొయ్యి అందులో ఎవరు పడాల్సిన గోతిలో వాడు పడుతూ లేస్తూ ఉంటాడు అంతా మాయ " అంటూ ఆసన్యాసి దిక్కుమాలిన వేదాంతం బోధించి వెళ్ళి పోయాడు రన్నింగ్ ప్రాక్టీసు చేస్తూ అక్కడికొచ్చిన ఓ క్రీడాకారుడు అతని గోల పట్టించు కోకుండా చూచి చూడనట్టు తన రన్నింగ్ ధ్యాసలో వెళ్ళి పోయాడు ఇంతలో అప్పుల వాడు ప్రత్యక్షమయ్యాడు గోతిలో పడి చచ్చిపోతే తన డబ్బు గంగలో కలిసిపోతుందని, ఓ తాగుమోతుతో లాలూచిపడి అతగాణ్ని పైకి లాగటానికి ప్రయత్నించాడు పైకము పోయింది తాగుమోతు పత్తాలేకుండా పోయాడు యువనాయకుడు , అతని శిష్యుడూ వచ్చారు యక్ష ప్రశ్నల అనంతరం తను స్థాపించిన 'ఎనకబడ్డ దొంగల సంఘంలొ చేరితే పైకి తీస్తానని భరోసా ఇచ్చాడు

నాయకుడు "దొంగలకి సంఘమేమిటి నీబొంద ?" అని గోతిలో అతను ఈసడించుకొనే సరికి నాయకుడు శిష్యసమేతంగాకాళ్లకు బుద్ధిచెప్పాడు కొడుకొచ్చాడు పైకిలాగరా నాయనా అంటే తన ప్రియురాలితో పెళ్ళికి వొప్పుకుంటే తీస్తానని షరతు పెట్టాడు నిరాకరించే సరికి అతనూ జారుకున్నాడు చివరిలో ఓ దయామయుడు వచ్చి పైకి లాగాడు "ఇంతక్రితం నీలాగే కష్టాల్లో ఉన్నవాడిని నువ్వేనాడైనా ఆదుకోవడానికి ప్రయత్నంచేశావా? " అని ప్రశ్నిస్తే లేదంటాడు గోతిలో పడ్డ వ్యక్తి "ఎప్పుడూ నాగురించి, నా సంసారం గురించి ఆలోచించేవాణ్ణి ఎవరి సంగతి పట్టించు కొనేవాణ్ణి కాదు నాకు జ్ఞానోదయం అయింది " అని పశ్చాత్తాప పడతాడు సామాన్యుడు 'ది మాన్ ఇన్ ది పిట్' అనే ఆంగ్లనాటకం 'గొయ్యి' కి ఆధారమని పేర్కొన్నారు రచయిత

## మనస్తత్వం

మానసిక ప్రవృత్తిని, మనస్తత్వాన్ని వర్ణించే నాటకాలు, నాటికలకు కూడా ఈ దశాబ్ది (1980-90) ఆహ్వానం పలికింది మనస్తత్వాన్ని స్పృశించకుండా పాత్రల సృష్టి జరగదు ప్రతీ నాటకంలోని పాత్రలోను ఆ పాత్ర స్వభావాన్ని తెలియపరిచే సంఘటనలు, సంభాషణలు ఉండి తీరతాయి అంతమాత్రాన అది మనస్తత్వ నాటకంకాదు మానసిక ప్రవృత్తి చిత్రీకరణకే నాటకంలో అధిక ప్రాధాన్యం యిచ్చినప్పుడు మాత్రమే అది మనస్తత్వ నాటకం అవుతుంది

తెలుగు నాటక సాహిత్యంలో మనస్తత్వం ప్రధాన పాత్ర వహించే నాటకాలు చాలా తక్కువ దీనికి ప్రధాన కారణాలు రెండు మనస్తత్వాన్ని చిత్రించే నాటకాలు వ్రాయడం చాలా కష్టం ఎందుకంటే మానసిక ప్రవృత్తులను గురించి ఒకప్రత్యేకమైన అవగాహన, పరిజ్ఞానం, నాటకశిల్పం ఉంటే తప్ప అటువంటి రచనకు ఉద్యమించడం సాధ్యంకాదు సాత్వికాభినయ ప్రధానమైన నాటకాన్ని ప్రదర్శించడమూ కష్టమే అంతేకాక మనస్తత్వ నాటకాలకు గతంలో లభించిన ప్రేక్షకాదరణ కూడా అంతంతమాత్రమే అందువల్ల ఈతరహా నాటకాలు ఎప్పడోగాని రావడంలేదు అంటే మనస్తత్వప్రాధాన్యంగల నాటకాలేవీ గతంలో ప్రేక్షక

మనోరంజకం కాలేక పోయాయని అర్థం కాదు ఔత్సాహిక సమాజాల చేత విస్తృత ప్రదర్శనలకు నోచుకోలేదు

తెలుగు నాటకరంగంలో మనస్తత్త్వంపై వచ్చిన నాటకాలలో అగ్రశ్రేణికి చెందిన నాటకం శ్రీ బుచ్చిబాబు రచించిన 'ఆత్మవంచన'

## ఆత్మవంచన

ఈ నాటకంలో కౌముదీ రాణిలో చెలరేగినబాహ్య, అంతరాల సంఘర్షణ ఆమెలో పాదుకుని పోయిన సుపీరియారిటీ కాంప్లెక్స్ ఆమె పతనానికి ఎలా దారితీశాయో వ్యక్తీకరించబడింది

రిటైర్డ్ కలెక్టర్ గారి పెద్ద కూతురు రాణి కలెక్టర్ గారింట్లో ఉంటూ వారి సహాయంతో చదువుకుని వృద్ధిలోకి వచ్చిన యువకుడు రాజశేఖరం అతడెంత విద్యాధికుడైనా, ఉద్యోగరీత్యా ఎంత ఎదిగినా రాణి దృష్టిలో ఇంకా వారాలబ్బాయే! కాని అతని మీద మనసు పడింది ఆ విషయం వ్యక్తం చేయడానికి అహం అడ్డొస్తుంది అంతస్థులు పరిధి దాటి యివతలకు రావడం ఆమెకు మనస్కరించదు ఆ కుటుంబం పట్ల తన కృతజ్ఞతాభావాన్ని మాటల్లో చేతల్లో రాజశేఖరం ఎంత సున్నితంగా వెల్లడించినా అతని మాటలకు విలువివ్వదు హేళన చేస్తుంది అతన్ని అవమానించడం, చులకన చేయడం, మాటలతో మానసికంగా హింసించడం, ఆమెకు సరదా, సంతృప్తి రాజశేఖరానికి మనసిచ్చిన పూర్ణిమకు కానిమాటలు చెప్పి మనసు విరిచి, వాళ్ళిద్దర్ని విడదీస్తుంది తనకు దక్కని మనిషి మరొకరికి ఎందుకు దక్కాలి అన్న అసూయ, మాత్సర్యం! పూర్ణిమ ఆత్మహత్య చేసుకుంటుంది ఇంత జరిగినా తన ఆధిక్యాన్ని రాజశేఖరం నిర్లక్ష్యం చేస్తున్నాడనే భావన, అహంభావం ఆమెలో చావలేదు తన మనసులో బుసలు కొట్టే కోర్కెను వెలిబుచ్చడానికి అభిమానం- ఎందరెందరో తన క్రీగంటి చూపుకోసం పడిగాపులుకాస్తుండగా రాజశేఖరం తనవెంటబడనందుకు ఉక్రోషం, కసి, ద్వేషం, అసహనం-తన ఓటమిని ఎట్టి పరిస్థితిలోనూ అంగీకరించడం ఆమె ప్రకృతికి విరుద్ధం పతాక సన్నివేశంలో రాణి - రాజశేఖరం మధ్య జరిగే సంవాదంతో వారి

వ్యక్తిత్వాలను అవిష్కరించటం జరిగింది

రాజ : నీక్కావలిసింది పొందలేక పోయావు నేను నీకేమి ఇవ్వలేని స్థితిలో పెట్టావు నన్ను

రాణి : నాడబ్బు నామొహాన పారేసావుగా ?

రాజ : డబ్బా! అదొక్కటే నీకక్కరలేనిది పొగడ్త, స్నేహం, ఆప్యాయత, అంతరంగికం అవి కావాలి - వాటిని నేను యివ్వలేను నా బీదరికం మనిద్దరి మధ్య గోడలా వుంది అది నువ్వు దూకలేవు' నేను పడగొట్టలేను ట్రాజిడి కదూ! నన్ను గురించి సత్యంనీకు తెలుసు కాని దాన్ని ఎదుర్కోలేవు

రాణి : నాకేం కావాలో తెలుసు నారాయణ్ణి ప్రేమించి పెండ్లి చేసుకున్నాను నిన్ను ప్రేమించాననుకుంటే పొరపాటు పడ్డావు

రాజ : రాణీ! ఉద్రేకం తెచ్చుకోకు - నువ్వు ఎవర్ని ప్రేమించానన్నా నేనునమ్మను నువ్వు ప్రేమించేది వొక్క వ్యక్తే - ఆ వ్యక్తి నువ్వే! నువ్వు ఎవర్నీ ప్రేమించలేవు అలా అనుకోడం ఆత్మవంచన

రాణీ ఎదుటనే రాజశేఖరం ఆత్మహత్యచేసుకొని చనిపోతాడు గతంలో తన ప్రవర్తన గురించి పశ్చాత్తాపం వెల్లడించడానికి వచ్చిన రాణికి ఆ సంఘటన అశనిపాతమవుతుంది ఒక్కసారి భోరున ఏడుస్తూ తన మనోవేదనను, వ్యక్తిత్వాన్ని రాజశేఖరం పాదాలముందు పరుస్తుంది

"శేఖరం చచ్చిపోయాడు అతన్ని నేనే చంపేశాను నేనే అతన్ని చంపటానికొచ్చాననుకొన్నాడు నేను చంపివుండను నేను చంపలేను అతనికి తెలీదు నేనా అతన్ని చంపడం ? కాని . నేనే చంపేశాను" అంటూ పిచ్చిగా ఆక్రోశిస్తుంది

రాణి మనః ప్రవృత్తి చిత్రణకు పై మాటలు పరాకాష్ఠ

## క్రీనీడలు

అలాగే, శ్రీ కె ఎల్ నరసింహారావు రాసిన 'క్రీనీడలు' అనే నాటకంలో సరళ అనే పాత్ర వ్యక్తిత్వం కూడా కోర్కెలను అణచుకుని వాటి వికృతరూపాలే తన భావాలనుకుని తాను క్షోభ పడుతూ, తన చుట్టూ వున్న ఇతరుల జీవితాలను కలవరపెట్టే ఒక నవీన విద్యావతి కథ 'క్రీనీడలు' ఈ నాటకంలో సరళ మనస్తత్త్వానికి బుచ్చిబాబు గారి 'ఆత్మవంచన' లో రాణి పాత్రకు దగ్గర పోలికలున్నాయి కాకపోతే ఆత్మవంచనలో రాణి పతాక సన్నివేశంలో కూడా నిన్ను నేను ప్రేమిస్తున్నాను అనుకుంటే – అది పొరపాటు" అంటుంది రాజశేఖరంతో కాని 'క్రీనీడలు'లో సరళ, "నీతో జీవితం కోసం యుగయుగాలుగా కలవరిస్తున్నాను నిన్నే పెళ్లాడదామనుకున్నాను కానీ – ఏం చెయ్యను నీకన్నా ఎక్కువ చదువుకున్నాననే అహంకారం నాలో పెరిగింది నీ కీర్తి చూస్తుంటే నేనెక్కడో పొరపడ్డాననిపించింది " అని పశ్చాత్తాపపడుతుంది కాని ఆమెలో మన పరివర్తన వచ్చేటప్పటికి ఆమె జీవితంలో శూన్యం తప్ప మరేమి మిగలలేదు

మనస్తత్త్వంమీద, వచ్చిన నాటకాలలో శ్రీ గొల్లపూడి 'రాగరాగిణి' రంగస్థలం మీద అఖండ విజయాన్ని సాధించింది అలాగే హితశ్రీగారి 'విముక్తుడు', అంగర సూర్యారావుగారి 'ఎవరో పిలిచారు' వంటి నాటికలు కూడా ప్రజామోదాన్ని పొందగలిగాయి శ్రీ ఆదివిష్ణు రాసిన 'మబ్బుతెర', కప్పగంతుల మల్లికార్జునరావు, పెద్దిభొట్ల సుబ్బరామయ్యగార్ల సంయుక్త రచన 'నయనతార', చింతపల్లి హనుమంతరావుగారి 'జ్వలితజ్వాల' మొదలైన నాటికలు కూడా రంగస్థల విజయాన్ని చవిచూసిననాటికలే

## విరజాజి

ఇక ఈ దశాబ్దిలో వచ్చిన నాటకాల విషయానికి వస్తే శ్రీ రావి వెంకటచలం రాసిన 'విరజాజి' ప్రముఖంగా పేర్కొనదగిన మనస్తత్త్వ నాటకం

డబ్బుతో మనిషి విలువను అంచనా వేసే భర్తతో అనేక బాధలు పడుతున్న యువతి ఒక సినిమా ప్రొడ్యూసర్ సహాయంతో భర్త కబంధహస్తాలనుంచి బయటపడుతుంది వ్యాపారంలో రాణించలేకపోతాడు ప్రొడ్యూసర్ అతని చర్యలు గమనించాక అతనితో కలసి వుండటానికి ఇష్టపడదు అలా అని అతన్ని దూరం చేసుకోలేక మథన పడుతూ వుంటుంది భవిష్యత్తు అంధకారంగా కన్పిస్తుంది నిండు మనసుతో ఆమెను ఆరాధిస్తున్న ఒక ధనిక యువకుణ్ని తన స్వార్థంకోసం ఉపయోగించుకోవడానికి ఆమె మనసు వొప్పుకోదు. ఒక సంఘటన మూలంగా పరిచయమైన ప్రొఫెసర్ కూడా తన ఆశలకు ఆశయాలకు అర్హమైన వ్యక్తికాదని తెలుసుకొని నిరాశపడుతుంది జీవితం మీద విరక్తి చెంది చేజేతులా తన జీవితాన్ని అంతం చేసుకొంటుంది-ఇదే విరజాజిలో ఇతివృత్తం

జీవితాన్ని ఒక రంగుల హరివిల్లులా ఊహించుకొని కలల్లో తేలిపోతూ, నేలమీద దృఢంగా పాదాలు మోపకుండానే, ఆశలు, ఆదర్శాల వెంట పరుగులు తీసే స్త్రీ జీవితగమనం నల్లేరుపై బండిలా మెత్తగా సాగిపోదనీ ఎన్నో గతుకుల్లో పడి మానసికంగా వ్యథలు భరించాల్సి వస్తుందనీ ఈ నాటకంలో సందేశం ధ్వనిస్తుంది

మనిషి ఆశలకు కొన్ని పరిమితులుండాలనీ, అలా కాకుండా అపరిమితమైన కోరికలతో మృగతృష్ణలో నీరు తాగాలని అన్వేషించడం వృథా ప్రయాస అని స్పష్టం చేస్తుందీ నాటకం ఉన్నదానితో తృప్తిపడలేని ఆమె, దగ్గరలో అందుబాటులోవున్న వస్తువుని కాదని, దూరతీరాలలో ఎక్కడో కన్పిస్తుందనే ఆశలేని వస్తువు కోసం ఆరాటపడటం అర్థరహితమని జీవిత చరమాంకందాకా గ్రహించలేకపోతుంది ఆమె మనస్తత్వంలోని ఈ విలక్షణతే ఆమె విషాద మరణానికి కారణమవుతుంది "ఎ బర్డ్ ఇన్ హాండ్ వర్త్ టు ఇన్ ది బుష్" అన్న సామెత ఈ నాటక సారాంశాన్ని ఒక్క మాటలో స్మరింపజేస్తుంది ఈ నాటకాన్ని గూర్చి సమీక్షిస్తూ శ్రీ గండవరం సుబ్బారామిరెడ్డి "according to the playwright, the woman who cannot adjust herself with given circumstances, can hardly realise her dreams This, however, does not mean that a woman should not aspire for higher things

They should - but it should not be an utopia"[15] అని వ్యాఖ్యానించారు

ఈ వాస్తవప్రపంచాన్ని విడిచిపెట్టి ఊహాజగత్తులో విహరించే దుర్బల మనస్తత్త్వంగల స్త్రీకి ఎదురయ్యే మానసిక సమస్యకు తరుణోపాయం మరణమేనా అనే ప్రశ్నకు తావిస్తుంది "విరజాజి" నాటకం ప్రవాసాంధ్రులైన శ్రీ ఆర్ వి చలం తమ సొంత సమాజంతో ఈ నాటకాన్ని ఆంధ్ర ప్రాంతంలో కొన్ని పరిషత్ పోటీలలో ప్రదర్శించి ప్రశంసలు అందుకున్నారు

## నవ్వండి - ఇది విషాదం

మనస్తత్త్వ విశ్లేషణమీద వచ్చిన నాటికలలో శ్రీ పంతం సత్యనాథన్ రచించిన 'నవ్వండి - ఇది విషాదం' ఒకటి బాహ్య సౌందర్యం కంటే అంత సౌందర్యం గొప్పదని చాటిచెబుతుంది ఈ నాటిక కేవలం మూడు పాత్రలతోనే ఉత్సాహజనకంగా నాటికని నడిపించిన తీరు ప్రశంసనీయం

తాను గొప్ప అందగాడననీ, తన అందానికి ఎలాంటి స్త్రీ అయినా లొంగిపోతుందనే అహంభావంతో విర్రవీగే విజయ్, తన మిత్రుని భార్య చేతిలో చిత్తుగా ఓడిపోయి, ఆకాశంనుంచి పాతాళంలోకి జారిపడిన ఉదంతం ఈ నాటకానికి ఊపిరి తన ఆకర్షణకు స్త్రీలు పరవశులైపోతారని భ్రాంతి పడే విజయ్, అతని చేతిలో ఎన్నో అవమానాలు పొంది, అతనిమీద కసి పెంచుకొని లోలోపల దహించుకుపోతున్న మన్మధరావు, కర్తవ్యపాలన కోసం వచ్చిన కిరాయి నటి జానకివంటి విభిన్న మనస్తత్త్వాలుగల పాత్రల కూడలి ఈ నాటిక సంఘటనలు తక్కువై సంభాషణలపాలు ఎక్కువగా ఉన్నా పర్యవసానం ఎలా వుంటుందో అని ప్రేక్షకుణ్ణి వెంటాడే ఉత్కంఠ ఈ నాటకానికి ప్రాణం పోస్తుంది నాటిక చివర్లో మన్మధరావు ఆడింది నాటకమేనని, జానకి అతని భార్యకాదని తెలుసుకున్న ప్రేక్షకులు ఆశ్చర్యంనుంచి తేరుకోకముందే వాళ్లిద్దరూ నిజంగానే భార్యాభర్తలు కావాలని చేసుకున్న నిర్ణయం ప్రేక్షక హృదయాలమీద చెరగని ముద్రవేస్తుంది

తన అందం చూసి తాను మురిసిపోవడంలోనూ, యితరుల నుంచి పొగడ్తలు

ఆశించటంలోనూ తప్పులేదు అదివైయక్తిక ఆనందానికి సంబంధించిన విషయం అంతవరకు ఎవరికీ అభ్యంతరం ఉండదు కానీ అదే వ్యక్తి ఎదుటి మనిషి కురూపి అని హేళన చేసే మనస్తత్వాన్ని మాత్రం ఎవరూ హర్షించరు అదే జరిగింది విజయ్ విషయంలో అందగాడు కాదని మన్మధరావును పదేపదే చిన్నబుచ్చడం అతని ఆత్మాభిమానాన్ని రెచ్చగొట్టింది విజయ్‌లోవున్న సౌందర్య ఆధిక్యతా భావాన్ని పోగొట్టి అతనికి గుణపాఠం చెప్పాలని పథకం వేస్తాడు మన్మధరావు జానకి అనే రంగస్థల నటిని కిరాయికి కుదుర్చుకుని ఆమె తన ప్రేయసిగా, తనభార్యకంటే ఆమె ప్రాణాలు వదిలేట్టుగా విజయ్‌ని భ్రమింపచేస్తాడు మన్మధరావు వజ్రాన్ని వజ్రంతోనే ఖండించాలన్నట్టు అతని అహంకారాన్ని అహంకారంతోనే దెబ్బతీస్తాడు మన్మధరావు జానకిని వశపరచుకోవాలని విజయ్ ప్రయత్నించి అవమానాల పాలవుతాడు ఆ విధంగా అతని అహంకారాన్ని మట్టిగరిపించటంలో సఫలీకృతుడయ్యాడు మన్మధరావు బాహ్య సౌందర్యం ఒక్కటే అందం కాదనీ, మన సౌందర్యంముందు అది దిగదుడుపని గ్రహిస్తాడు విజయ్

అతని మనస్తత్వంమీద విజయం సాధించటమే కాదు ఇక్కడ నాటకకర్త పరస్పర విరుద్ధమైన ప్రకృతులు గల రెండు పాత్రలను ప్రక్కప్రక్కనే వుంచి తులనాత్మకమైన మనస్తత్వ చిత్రణ చేశారు మన్మధరావు అందగాడు కాకపోయినా అతని ప్రవర్తన, మనస్తత్వం, సంస్కారం మొదలైన గుణాలను గుర్తించిన జానకి అతనికి మనస్సిచ్చి అతనితో వైవాహిక బంధం ఏర్పరచుకోవడానికి సంసిద్ధురాలు కావటం అనేది, అందం అంటే ఏమిటో నిర్వచించకనే నిర్వచించే ఒక విశిష్టాంశం మానసిక ప్రవృత్తులమీద ఒక చక్కని వ్యాఖ్యానమే ఈ నాటిక

## సాలెగూడు

'అమృతం కురిసిన రాత్రి' కవితా సంపుటి రచయితగా శ్రీ బాలగంగాధర తిలక్ ఆంధ్ర సాహిత్యలోకానికి సుపరిచితులు వీరు తొలిసారిగా 1958 ప్రాంతంలో 'సుచిత్ర ప్రణయం' అనే నాటిక రాసి నాటకకర్తగాకూడా

పరిచయమయ్యారు ఆ తర్వాత 'సుప్తశిల' అనే నాటికను రాశారు ఈ రెండు నాటికలను నాటక సంఘాలు స్వీకరించి విరివిగా ప్రదర్శించి తిలక్‌గారిని నాటక రచయితగా నిలబెట్టాయి 'సాలెగూడు' తిలక్‌గారి మూడో నాటిక ఒక యువతి విలక్షణమైన మనస్తత్త్వాన్ని చిత్రిస్తుంది 'సాలెగూడు'

పుట్టుకను, తల్లిదండ్రులను, పుట్టిపెరిగిన పరిసరాలను ఆధారం చేసుకొని ఒక వ్యక్తి విలువను అంచనా వెయ్యడం, ఆ వ్యక్తి పవిత్రుడనీ, అపవిత్రుడనీ నిర్ణయించడం సమంజసంకాదనీ, అది నిర్హేతుకవాదమని వివరిస్తుందీ నాటిక

సావిత్రి శ్రీమంతుల బిడ్డ ప్రొఫెసర్ విశ్వనాథం నీడలో ఆమె గారాబంగా పెరిగింది తండ్రిగారి సంస్కారాన్ని పుణికి పుచ్చుకుంది. జీవితంలో నీతి, ధర్మం రుజువర్తన, వీటికి ఆమె ప్రాధాన్యం ఇస్తుంది తన స్నేహితురాలు తప్పుచేసి ఆత్మహత్య చేసుకుంటే ఆవిడపై సావిత్రి జాలిపడకపోగా అసహ్యించుకుంటుంది

"యమున తండ్రి తాగుబోతూ, జూదరి, వ్యభిచారి అవడం వలన అదే ఈ కూతురికి సంక్రమించింది పాపంతనతోనే పోదు తన సంతానానికి వంశానికి దిగుమతి అవుతుంది ఈ రోజునుంచి ఏ పాపపు వూహనీ రానిచ్చేదాన్ని కాదు మంచి వంశం కాదని తెలిస్తే వాళ్లతో మాట్లాడేదాన్నికాదు"[16] – ఇదీ సావిత్రి తత్త్వం ఇది ధర్మం పేరుతో, పవిత్రత పేరుతో ఆమెలో గూడుకట్టుకుపోయిన మూర్ఖత్వం అజ్ఞానం కొన్ని రహస్యాలు సాలెగూడులా అల్లుకుపోయి తన జీవిత మార్గాన్ని కూడా నియంత్రిస్తున్నాయని ఆమెకు తెలీదు తాను మనసారా ప్రేమించే ప్రసాద్ ఒక పతిత కొడుకని తెలుసుకొని సావిత్రి విలవిల లాడిపోయింది అతనిని క్షమించలేక పోయింది నేరం అతనిదే అయినట్టు ప్రసాద్‌ను వెళ్లగొట్టింది కానితాను విన్న రహస్యం తారుమారైంది పతితకు పుట్టిన బిడ్డ ప్రసాద్ కాదనీ, సావిత్రేనని స్వయంగా తండ్రి చెప్పగా విని మ్రాన్పడిపోయింది సావిత్రి

రవీంద్రనాథ్ రాగూర్ 'గోరా' నవలలోను, బుచ్చిబాబు గారి 'చివరకు మిగిలేది' నవలలో ఆత్మన్యూనతా భావంతో బాధపడే దయానిధి పాత్రలోనూ సావిత్రి మనస్తత్త్వంలోని ఛాయలు కనిపిస్తాయి

తిలక్ 'సాలెగూడు'లో సావిత్రి మనస్తత్త్వంలో పైకి కనపడని కర్కశత్వం దాగి ఉంది అలాంటి కాఠిన్యం తనలో ఉన్నట్లు ఆమెకే తెలియదు తన వ్యక్తిత్వంపై ఇతరులెవరూ వేలెత్తి చూపలేనంత పవిత్రురాలని ఆమె అతిశయం ఈ అతిశయం వల్లనే తన అప్తమిత్రురాలు ఆత్మహత్య చేసుకుని చనిపోతే ఒక చుక్క కన్నీటి బొట్టయినా రాల్చకపోగా, ఆమెనుగురించి అసహ్యించుకొంది వంశపారంపర్యంగా గుణాలు సంక్రమిస్తాయనీ ఆమె గట్టి నమ్మకం పతితకూతురు పతితే అవుతుందని, హంతకుని కొడుకు హంతకుడౌతాడని ఆమె నిశ్చితాభిప్రాయం ఈ నిరాధారమైన నమ్మకాలతోనే ఆమె మస్తిష్కం గూడు కట్టుకుని ఉంది ఈ నమ్మకాలు వమ్ముకావడం ఆమె సహించదు ఆమె మనస్తత్త్వంలో సమూలంగా మార్పు రావాలంటే టర్నింగ్ పాయింట్ కావాలి అదే వచ్చింది ఇప్పుడు తన జీవితరహస్యం అనే రూపకంలో, పతితలనీ, భ్రష్టులనీ గతంలో ఎందరెందర్నో తాను నిరసించింది, అసహ్యించుకుంది - కాని ఇప్పుడు సంఘం దృష్టిలో తానెవరు? ఒక పతిత కూతురు!

ఈ అవగాహన ఆమె మనస్తత్వాన్ని సమూలంగా మార్చివేసింది బాహ్యంగా కనబడే అంశాల ఆధారంగామనుషుల్ని తక్కువ అంచనా వేసి హీనంగా చూసే మనస్తత్త్వాన్ని గర్హిస్తుంది 'సాలెగూడు' నాటిక ఇందులో కథలేదు సన్నివేశాలు కూడాలేవు నాటిక మధ్యలో ప్రారంభమై మధ్యలోనే ముగుస్తుంది సావిత్రి మనస్తత్త్వ నిరూపణ ప్రయత్నంలో ఒక భాగంగా చివరివరకు రచయిత నాటికను ఉత్కంఠ సడలిపోకుండా నడపడంలో సఫలీకృతులయ్యారు సాత్త్వికాభినయ ప్రధానమైన 'సాలెగూడు'ను సమర్థులైన నటులు మాత్రమే రక్తి కట్టించగలరు సగటు నటులకు సాధ్యంకాదు

## ఇదేనా పరిష్కారం ?

శ్రీ యస్ మునిసుందరంగారి ఇదేనా పరిష్కారం? - నాటిక మనస్తత్త్వ చిత్రణతోకూడిన నాటికలలో విలక్షణమైంది తమకు ఏంకావాలో తమకే స్పష్టంగా తెలియని స్థితిలో వ్యథ చెందుతూ ఇతరుల జీవితాలను కూడా విషాదభరితాలుగా

మార్చే ఇద్దరు భార్యాభర్తల విచిత్ర మనస్తత్వానికి దర్పణం ఈ నాటిక

ఫలించలేని ప్రేమను ఇతివృత్తంగా చేసుకొని రచించబడిన యీ నాటికలో విచిత్ర వ్యక్తుల, మనస్తత్వాల సమ్మేళనం కన్పిస్తుంది తాను ప్రేమించి, పెళ్లిచేసుకొని రాణి కృపాకటాక్ష వీక్షణాలకోసం మూడేళ్లుగా నిరీక్షిస్తూ, ఆమెను తన హృదయ పీఠంలో ప్రతిష్ఠించుకొని ఆరాధించే భర్తగా, అనంత స్వాప్నికుడుగా ప్రభాకర్-అందిన అందాన్ని అనుభవించడమేకాని అందని వాటి కోసం ఆరాటపడుతూ బ్రతుకుబండలు చేసుకొని క్రుంగిపోవడం అవివేకమని చాటిచెప్పే భౌతికవాదిగా జానకిరాం-త్యాగం అనే ముసుగులో తన బ్రతుకు భయాన్ని కప్పిపుచ్చుకుని దూరంగా పారిపోయిన పిరికి ప్రేమికుడుగా కుమార్-ఏంకావాలో తనకే తెలియని పథవిహీనగా రాణి-తన జీవితంలో అనూహ్యంగా, అప్రయత్నంగా జరిగిన సంఘటన యొక్క ప్రభావం యితరుల జీవితాలను ఛిన్నాభిన్నం చెయ్యకూడదని నిరంతరం కుమిలిపోయే వ్యక్తిగా దాసు-ఇలాంటి విభిన్న మనస్తత్వాల కూడలి 'ఇదేనా పరిష్కారం?'

"నాగరికత మనిషిని మనిషిగా బ్రతకనివ్వడం లేదు కలల వలలలో బంధించి కుంగదీస్తుంది" అని జానకిరాంచేత పలికించిన మాటలు ప్రభాకర్, కుమార్, రాణిపాత్రల స్వభావానికి, ప్రవర్తనకు అద్దంపట్టడమేకాక, కావ్యార్థాన్ని పరోక్షంగా ఆవిష్కరిస్తున్నాయి నాటకంలో ప్రధాన పాత్రలు ప్రేమచుట్టూ తిరగడంపోయి ద్వేషంచుట్టూ పరిభ్రమిస్తుంటాయి రాణి, ప్రభాకర్‌లు ఆకాశంలో విహరించే వ్యక్తులుగాను, కుమార్ నేలా నింగీ నడుమ వేలాడే కుహనా ప్రేమికుడుగాను సాక్షాత్కరిస్తారు ఒక్క జానకిరాం మాత్రమే నేలపైన సవ్యంగా నడిచేవ్యక్తి

దాసుతో సహాఅందరూ తమ స్థాయిని మించి మాట్లాడటం నాటికను వాస్తవికతకు దూరం చేస్తున్నది

పాత్ర చిత్రణలో హేతుబద్ధత కొరవడింది ప్రేమార్పణలో తరగతుల భేధం ఉండదు కాని వైయక్తిక సమస్యా పరిష్కారంలో విధిగా తరగతుల పాత్ర ఇమిడి

వుంటుంది పిడుక్కీ, బియ్యానికి ఒకే మంత్రమా? రాణి మనసావాచాకర్మణా కుమార్‌ని ప్రేమించివుంటే, భర్తకు ఆవిషయం చెప్పి తన దారిన వెళ్లిపోవచ్చు ఆమె స్వేచ్ఛను బంధించే పరిస్థితులు అక్కడలేవు మూడేళ్ల తర్వాత తన కోసం వచ్చిన కుమార్‌ను తిరస్కరిస్తుంది ప్రేమించిన మనిషికోసం అన్నిటినీ వదలుకొని వెళ్లడంలో ఆమె వ్యక్తిత్వానికి అర్థం ఉంటుంది లేదా అతను స్వార్థ పరుడని తనకు విశ్వాసం కుదిరితే, తన పొరపాటును సరిదిద్దుకొని భర్తతో కలసి కాపురం చెయ్యడానికి సంసిద్ధమైతే రాణి పాత్రకు అర్థం, ఔచిత్యం ఉంటాయి ఈ రెండూ ఆమె చెయ్యకపోగా ఆ యిద్దర్నీ కసితీరాతిట్టి ఆత్మహత్యకు పూనుకుంటుంది నిజంగా ఆమె చావకపోయినా ఆ పాత్ర అంతటితో చచ్చిపోయినట్టేలెక్క! పైగా తన పతనానికి పురుషాధిక్య సమాజమే కారణమంటూ స్త్రీవాదాన్ని ఏకరవు పెట్టడం సమస్యను పక్కదారి పట్టించడమే అవుతుంది సాధారణ స్త్రీ సమస్యకూ రాణీ స్వయం కృతాపరాధానికి పొంతనలేదు అందువల్ల రాణి పాత్ర సామాజికుల సానుభూతి పొందలేదు ఆ మాటకొస్తే యీ నాటికలో ఏ పాత్రమీదా ప్రేక్షకులకు జాలికలగదు

"ఈ జ్వాల రగిల్చిన అధముడ్ని నేను" అని అడుగడుగునా కుమిలిపోయే దాసు ఉదంతంవల్ల కథ పెద్ద మలుపు తిరుగుతుందని ఆశించినవారికి నిరాశే మిగులుతుంది ఎందుకంటే దాసు ఉదంతం వల్ల ఎవరికీ ఏ హాని జరగలేదు అంటే - రాణి కుమార్‌లు విడిపోవడానికిగాని, రాణి ప్రభాకర్‌లు ఎడమొగం పెడమొగంగా ఉండిపోవడానికిగాని, రాణి దాసు కూతురన్న రహస్యం ఏవిధంగానూ విఘాతం కాలేదు రహస్యం తెలిసిన తర్వాత కూడా ప్రభాకర్ రాణిని భార్యగా ఆహ్వానించడానికే సిద్ధపడ్డాడు దీనిని బట్టిచూస్తే దాసుపాత్ర ద్వారా రచయిత ఆశించిన టర్నింగ్ పాయింట్ రాలేదని స్పష్టమౌతుంది

ప్రభాకర్ స్వాభావికంగా భార్యమీద అచంచలమైన ప్రేమానురాగాలుగల వ్యక్తిగా కనిపించినప్పటికీ, కుమార్‌మీద అతనికిగల ద్వేషం, అసూయ, పగ అతని మనస్తత్త్వంలో ద్వంద్వ ప్రకృతిని గోచరింపజేస్తున్నాయి అతనిలో నిరాశా నిస్పృహలు మాటల రూపంలో వెలికి వచ్చినప్పుడు భార్యమీద ద్వేషాన్ని,

అసహనాన్ని వెళ్లగక్కుతున్నాయే తప్ప నిర్మలమైన ప్రేమనుకాదు కుమార్ ఆ కని కంటబడితే కోపం, దాసు మాట్లాడితే విసుగు, జానకిరాం మాట్లాడితే అసహ. ం, భార్యమాట్లాడినా అతని కోపం కట్టలు తెంచుకొంటుంది - మరి భార్యపై అతనికి గల ప్రేమానురాగాలకు రుజువేది? అతని నిరీక్షణకు అర్థమేమిటి? ఇవన్నీ జవాబుదొరకని ప్రశ్నలుగా మిగిలిపోతాయి

ఇతివృత్త నిర్మాణంలో కొంతగజిబిజి, అస్పష్టత నెలకొన్నాయి జీవితంలో ఒక నిర్దిష్ట గమ్యంకాని, ఆగమ్యం చేరడానికి చిత్తశుద్ధితో ప్రయత్నించటంగాని లేకుండా వ్యవహరించే ఈ నాటికలోని ప్రధాన వ్యక్తుల వైఖరివల్ల ఒక విషయం స్పష్టమౌతుంది - అర్థరహితమైన ఆదర్శాల భ్రమలోపడి ఎండమావులను వెంటాడే నిష్క్రియాపరత్వానికి నేటి యువతరం దగ్గరౌతూ వుందనీ, ఈ దుష్పరిణామాన్ని నివారించుకోవలసిన సమయం ఆసన్నమైందనే హెచ్చరిక ఈ రచనలో ధ్వనిస్తోంది ఈ అన్వయం నాటక లక్ష్యానికి చేరువై సార్థకతను చేకూరుస్తుంది ఈ నాటికలో సంభాషణలు ఎంతోపసందుగా, హుందాగా ఉండటం ప్రత్యేకంగా చెప్పుకోవలసిన అంశం నగిషీ చెక్కినట్టుగా మెరిసిపోయే మాటల పొందిక భావస్ఫోరకంగా ఉన్నాయనటం అతిశయోక్తి కాదు

"ప్రేమకు స్వార్థంతోడయితే ప్రేమబలహీనతగా మారిపోతుంది ఆ బలహీనత బ్రతికుండగానే మనిషిని కాల్చేస్తుంది "ఆ అలల్ని చూస్తున్నావు కదూ, ఎంత అలజడి, ఆవేదన, అయినా గట్టుదాటి ఒక్క అడుగైనా ముందుకు రావు"

"ప్రేమకూ కామానికి మధ్య దూరం నథింగ్ - వీలు దొరికినప్పుడు కామం అనిపించుకొన్నదే దొరకనపుడు 'ప్రేమ' అనే లేబుల్ తగిలించుకొంటుంది"

ఇటువంటి సంభాషణలు ఆలోచింపజేస్తాయి ఏది ఏమైనా 'ఇదేనా పరిష్కారం' నాటిక మెదడును మేల్కొల్పినంతగా హృదయాన్ని కదిలించలేదని అనుకోవలసి వస్తుంది

# క్షణికం

శ్రీ డి వి రమణమూర్తి రచించిన 'క్షణికం' నాటకంలో సమస్య సమకాలీనమైందే కాక సార్వజనీనమైంది "మానవజాతి మనుగడ సుఖశాంతులతో సుసంపన్నం కావాలంటే, మనిషిలో ఉన్న క్షణికమైన ఆవేశం, ఆగ్రహం, ఉద్రేకం, తొందరపాటు అనే అంతఃశత్రువులను ఆత్మ సంయమనంతో, ఆలోచనతో, విచక్షణతో, నిగ్రహంతో నియంత్రించాలి జయించాలి అప్పుడే మానవాళికి సుఖశాంతులు వరప్రసాదాలవుతాయి" అని నాటకాంతంలో రచయిత వ్యాఖ్యాత చేత చెప్పించిన మాటలు కావ్యార్థాన్ని సూచిస్తాయి

ఈ నాటకంలో కథ చాలా చిన్నది కేవలం ఒక్క సంఘటన మీదే మొత్తం నాటకం కేంద్రీకృతం కావడంవల్ల ఒక దశలో పట్టు సడలిపోయి సాగదీసినట్టు అనిపిస్తుంది ఈ వెలితిని పూరించడానికేమో రమణమూర్తిగారు యీ నాటకాన్ని నాటికగా కుదించి రాయడం జరిగింది నాటిక వేగం పుంజుకొని పుష్టిగా రూపొందింది

శంకరం, ప్రసాద్‌లు ప్రక్క ప్రక్క వాటాలలో కాపురం ఉంటున్నారు శంకరం కొడుకు విశ్వం వస్తుత ఆవేశపరుడు అనేక సందర్భాలలో చిన్నచిన్న విషయాలమీద కూడా ఘర్షణపడి తల్లిదండ్రులకు తీవ్ర మనస్తాపం కలిగిస్తాడు అతన్ని అదుపుచేయడం ఆ తల్లిదండ్రులకు సాధ్యంకాదు ప్రక్కవాటాలో ఉంటున్న ప్రసాద్ పోలీసు ఇన్‌స్పెక్టర్ వృత్తిపరంగా సంక్రమించే ఆవేశం అతనిలో ఉంది ఒకరోజు హెచ్చుస్థాయిలో ట్రాన్సిస్టర్ పెట్టి పాటలు వింటుంటాడు విశ్వం ట్రాన్సిస్టర్ కట్టెయ్యమని హుకుం జారీచేశాడు ఇన్‌స్పెక్టర్ "నీ పోలీసు జులుం నామీద చలాయించకు" అని ఎదురుతిరిగాడు విశ్వం మాటామాటా పెరిగింది క్షణికోద్రేకంలో పిస్టల్ పేలింది విశ్వం అక్కడికక్కడే నేలకొరిగాడు ప్రసాద్‌కు రెండేళ్ళ శిక్ష విధించింది కోర్టు కొడుకును, అతని మృతివల్ల జీవనాధారాన్ని

కోల్పోయిన శంకరం దంపతుల జీవితం అంధకారమయమైంది కేవలం ఒక వ్యక్తిలో పెల్లుబికిన క్షణికావేశం రెండు కుటుంబాలలో ఆరని చిచ్చు రేపింది - ఇదే క్షణికం నాటకంలోని ఇతివృత్తం

కొడుకును పోగొట్టుకున్న తల్లిపడే ఆవేదనతో నాటకం ప్రారంభమై, ఫ్లాష్‌బ్యాక్‌లో జరిగిన కథ వివరించటం జరిగింది

ఈ నాటకంలో సందేశాత్మకమైన సూక్తులు కుప్పతెప్పలుగా కనిపిస్తాయి ఉదా॥ పార్వతి "ఉద్రేకం ఉరకలు వేస్తే ఆవేశం అదుపు తప్పింది పౌరుషం పెల్లుబికితే ఆగ్రహం అంచులుదాటింది కాని ఆలోచన? ఆ ఆలోచనే అడ్డుపడివుంటే ఆనందం దక్కేది" "పిడికెడు మనసులో చిటికెడు ఆలోచన, చేరెడు మెదడులో గోరంత సహనం ఉంటే, ఏ సమస్యలూ ఉండవు"

"చమురులేని దీపం వెలగనట్టే సహనంలేని మనిషి ఎదగడు" - ఇలాంటివి ఎన్నో ఎన్నో!

క్షణికం మొదటి సీన్లో, తల్లిదండ్రులు మందలించారని ఓ అమ్మాయి ఆత్మహత్య చేసుకొన్న ఉదంతం ప్రస్తావించబడుతుంది ఇది coming events cast their shadows before' అనే లోకోక్తిని గుర్తుచేస్తుంది ఈ విధంగా రాబోయే ఉపద్రవం గూర్చి ముందే ధ్వని మాత్రంగా సామాజికులకు సూచించటం రచయితగారి రచనాశిల్పంలో ఒక అంతర్భాగమనిపిస్తుంది పరుచూరి రఘుబాబు స్మారక కళాపరిషత్ పోటీలలో 1997 లో హెచ్ ఏ ఎల్ వెల్‌ఫేర్ మేనేజింగ్ కమిటీ వారిచే శ్రీ భానుప్రకాష్ దర్శకత్వంలో 'క్షణికం' నాటిక జనరంజకంగా ప్రదర్శింపబడి ప్రశంసలందుకొంది

## ఊరికో రుద్రమ్మ

"బలహీనులపై బలవంతుల దౌర్జన్యాలు - ఇంకానా - ఇకపై సాగవు" అని

శ్రీశ్రీ ఎంత గర్జించినా యీనాటికీ గ్రామీణ ప్రాంతాలలో బడుగు వర్గాలపై ధనిక వర్గాల క్రౌర్యం యింకా కొనసాగుతూనే ఉంది చదువురాని వారిని నమ్మించడానికి ఏగ్రామ దేవతనో అడ్డుపెట్టుకొని, "పూనకం" "దేవత ఆగ్రహం" అనే పేరు చెప్పి గ్రామస్థుల్ని నమ్మించి, తమపై కక్షగట్టినవారిని మట్టిగరిపించే ఘనకార్యాలు చేయడం కొందరు భూస్వాములకు వెన్నతో పెట్టిన విద్య కాని గ్రామస్థుల్లో చైతన్యం వస్తేగాని పరిస్థితులు చక్కబడవని హెచ్చరిస్తుంది శ్రీ గొట్టిముక్కల నాగేశ్వరరావు రచించిన 'ఊరికోరుద్రమ్మ' నాటకం కథ మామూలే అయినా కథనంలో కొత్తదనం ఉంది గ్రామంలో రాయుడు అనే దుష్టుడు చేస్తున్న దురాగతాలను సహిస్తూ ఏమీ చెయ్యలేక చేతులు ముడుచుకుని కూచొన్న తరుణంలో, రుద్రమ్మఅనే ఒక సామాన్యస్త్రీ తెగించిముందుకొచ్చి రాయుడుప్రయోగించే పూనకాన్నే అతని మీద అస్త్రంగా సంధించి రాయుడు కోరలు తీస్తుంది ఒక స్త్రీ సమస్యాపరిష్కారానికి ముందంజవేసి విజయం సాధించటం అనేది ఈ నాటక రచనలో ఉన్న ఒక విశిష్టాంశం నిర్మాణాత్మకమైన యీ నాటకం అత్యంత జనాదరణ పొందింది

## స్మృతిప్రతీక

శ్రీ యస్ కె ఆంజనేయులు గారు రచించిన 'స్మృతిప్రతీక' అలౌకిక ప్రేమతత్వాన్ని ప్రతిపాదించే విలక్షణమైన దృశ్యప్రేమకావ్యం శ్రీ కూరెళ్ళ సోమేశ్వరరావు ఆధ్వర్యంలో సాహితీ సేవాసమితి ట్రస్టు (విశాఖపట్నం) వారు 1997 సం॥లో నిర్వహించిన నాటక రచనా పోటీలలో యీ నాటకానికి తృతీయ బహుమతి లభించింది

తొమ్మిది పాత్రలున్న ఈ నాటకంలో ప్రధాన పాత్రలు మూడే కాళిదాసు, శంకరరావు, అమూల్య - ఈ మూడు పాత్రల చుట్టూ నాటకం పరివృతమై ఉంటుంది నిజానికి శంకరరావు పాత్ర అర్ధాంతరంగా మొదట్లోనే ముగిసిపోయినా,

అతని స్మృతి నాటకమంతా అల్లుకుపోయి అందరి జీవితాల్లోనూ అలజడి రూపుతుంది "If ever a dead man won the battle - he is Thomas Becket" అన్నరీతిలో శంకరరావు మృతి చెందినా, అతడే యీ నాటకంలో కేంద్రబిందువుగా భాసిల్లడం "స్మృతి ప్రతీక" లోని విశిష్టత

అతిసాధారణమైన కథను తీసుకొని హేతుబద్ధమైన సంఘటనలతో, సహజమైన సంభాషణలతో, సముచిత పాత్ర చిత్రణతో 'స్మృతిప్రతీక' ను అందంగా మలచడంలో నాటక రచయిత కృతకృత్యులయ్యారు ప్రధానంగా ఈ నాటకంలో అమూల్య, శంకరరావు, కాళిదాసు పాత్రల ఔన్నత్యం ఒక సమ్మోహనాస్త్రంలా సామాజికులను కట్టిపడవేస్తుంది ఈ నాటకంలో అమూల్య-శంకరరావుల మధ్య బంధం Love at first sight లాంటిది కాదనీ, వారిరువురూ చేరువకావడానికి భౌతిక ఆకర్షణ, విషయవాంఛలు హేతువులు కావనీ కేవలం సంగీతకళపై వారికున్న అభిమానం, బలమైన వారి వ్యక్తిత్వాలే వారిని ఒక్కటిగా చేర్చాయనేది అభివ్యక్తమౌతుంది అలాగే కాళిదాసు కూడా అమూల్యతో సాన్నిహిత్యం అభిలషించడం కాముక దృష్టితో కాదనీ, సాధారణ మానవ ప్రవృత్తికి భిన్నమైన అమలిన స్నేహార్ద్రతా భావనే అనీ పాత్ర స్వభావం ప్రస్ఫుటం చేస్తుంది

ఈ నాటక నిర్మాణంలో అడుగడుగునా నూతనత్వపుధోరణులు కన్పిస్తాయి అంతేకాదు యింతవరకు నాటక పరిభాషలో లేని కొత్త సాంకేతిక పదాలు కూడా పరిచయం చేయబడ్డాయి స్మృతి ప్రతీకలో రంగస్థలం రెండు భాగాలుగా విభజించబడింది రెండు గంటలు సాగే యీ నాటకంలో కాలవ్యవధిని సూచించే ఒకటి రెండు Lights off - on లు తప్ప - రెండు పోర్షన్లలోనూ ఒకే సమయంలో (simultaneous ) జరిగే దృశ్యాలను చూపటంలో యీ నాటకంలో కొత్తదనం చోటు చేసుకుంది మరో విషయం - రెండు స్త్రీ పాత్రలున్నప్పటికీ, ఒకే నటీమణి ఆ పాత్ర నిర్వహించటానికి వీలుగా వాచికాభినయంలో ఊతపదం,

శ్రీశ్రీ ఎంత గర్జించినా యీనాటికీ గ్రామీణ ప్రాంతాలలో బడుగు వర్గాలపై ధనిక వర్గాల క్రౌర్యం యింకా కొనసాగుతూనే ఉంది చదువురాని వారిని నమ్మించడానికి ఏగ్రామ దేవతనో అడ్డుపెట్టుకొని, "పూనకం" "దేవత ఆగ్రహం" అనే పేరు చెప్పి గ్రామస్థుల్ని నమ్మించి, తమపై కక్షగట్టినవారిని మట్టిగరిపించే ఘనకార్యాలు చేయడం కొందరు భూస్వాములకు వెన్నతో పెట్టిన విద్య కాని గ్రామస్థుల్లో చైతన్యం వస్తేగాని పరిస్థితులు చక్కబడవని హెచ్చరిస్తుంది శ్రీ గొట్టిముక్కల నాగేశ్వరరావు రచించిన 'ఊరికోరుద్రమ్మ' నాటకం కథ మామూలే అయినా కథనంలో కొత్తదనం ఉంది గ్రామంలో రాయుడు అనే దుష్టుడు చేస్తున్న దురాగతాలను సహిస్తూ ఏమీ చెయ్యలేక చేతులు ముడుచుకుని కూచొన్న తరుణంలో, రుద్రమ్మఅనే ఒక సామాన్యస్త్రీ తెగించిముందుకొచ్చి రాయుడుప్రయోగించే పూనకాన్నే అతని మీద అస్త్రంగా సంధించి రాయుడు కోరలు తీస్తుంది ఒక స్త్రీ సమస్యాపరిష్కారానికి ముందంజవేసి విజయం సాధించటం అనేది ఈ నాటక రచనలో ఉన్న ఒక విశిష్టాంశం నిర్మాణాత్మకమైన యీ నాటకం అత్యంత జనాదరణ పొందింది

## స్మృతిప్రతీక

శ్రీ యస్ కె ఆంజనేయులు గారు రచించిన 'స్మృతిప్రతీక' అలౌకిక ప్రేమతత్వాన్ని ప్రతిపాదించే విలక్షణమైన దృశ్యప్రేమకావ్యం శ్రీ కూరెళ్ళ సోమేశ్వరరావు ఆధ్వర్యంలో సాహితీ సేవాసమితి ట్రస్టు (విశాఖపట్నం) వారు 1997 సం॥లో నిర్వహించిన నాటక రచనా పోటీలలో యీ నాటకానికి తృతీయ బహుమతి లభించింది

తొమ్మిది పాత్రలున్న ఈ నాటకంలో ప్రధాన పాత్రలు మూడే కాళిదాసు, శంకరరావు, అమూల్య - ఈ మూడు పాత్రల చుట్టూ నాటకం పరివృతమై ఉంటుంది నిజానికి శంకరరావు పాత్ర అర్ధాంతరంగా మొదట్లోనే ముగిసిపోయినా,

అతని స్మృతి నాటకమంతా అల్లుకుపోయి అందరి జీవితాల్లోనూ అలజడి రూపుతుంది "If ever a dead man won the battle - he is Thomas Becket" అన్నరీతిలో శంకరరావు మృతి చెందినా, అతడే యీ నాటకంలో కేంద్రబిందువుగా భాసిల్లడం "స్మృతి ప్రతీక" లోని విశిష్టత

అతిసాధారణమైన కధను తీసుకొని హేతుబద్ధమైన సంఘటనలతో, సహజమైన సంభాషణలతో, సముచిత పాత్ర చిత్రణతో 'స్మృతిప్రతీక' ను అందంగా మలచడంలో నాటక రచయిత కృతకృత్యులయ్యారు ప్రధానంగా ఈ నాటకంలో అమూల్య, శంకరరావు, కాళిదాసు పాత్రల ఔన్నత్యం ఒక సమ్మోహనాస్త్రంలా సామాజికులను కట్టిపడవేస్తుంది ఈ నాటకంలో అమూల్య-శంకరరావుల మధ్య బంధం Love at first sight లాంటిది కాదనీ, వారిరువురూ చేరువకావడానికి భౌతిక ఆకర్షణ, విషయవాంఛలు హేతువులు కావనీ కేవలం సంగీతకళపై వారికున్న అభిమానం, బలమైన వారి వ్యక్తిత్వాలే వారిని ఒక్కటిగా చేర్చాయనేది అభివ్యక్తమౌతుంది అలాగే కాళిదాసు కూడా అమూల్యతో సాన్నిహిత్యం అభిలషించడం కాముక దృష్టితో కాదనీ, సాధారణ మానవ ప్రవృత్తికి భిన్నమైన అమలిన స్నేహార్ద్రతా భావనే అనీ పాత్ర స్వభావం ప్రస్ఫుటం చేస్తుంది

ఈ నాటక నిర్మాణంలో అడుగడుగునా నూతనత్వపుధోరణులు కన్పిస్తాయి అంతేకాదు యింతవరకు నాటక పరిభాషలో లేని కొత్త సాంకేతిక పదాలు కూడా పరిచయం చేయబడ్డాయి స్మృతి ప్రతీకలో రంగస్థలం రెండు భాగాలుగా విభజించబడింది రెండు గంటలు సాగే యీ నాటకంలో కాలవ్యవధిని సూచించే ఒకటి రెండు Lights off - on లు తప్ప - రెండు పోర్షన్లలోనూ ఒకే సమయంలో (simultaneous ) జరిగే దృశ్యాలను చూపటంలో యీ నాటకంలో కొత్తదనం చోటు చేసుకుంది మరో విషయం - రెండు స్త్రీ పాత్రలున్నప్పటికీ, ఒకే నటీమణి ఆ పాత్ర నిర్వహించటానికి వీలుగా వాచికాభినయంలో ఊతపదం,

ఆంగికాభినయంలో ఎడమచేతివాటం, ఆహార్యంలో కళ్లకు జోడూ, సాత్వికాభినయంలో విలక్షణమైన మేనరిజంలతో ఆ రెండు పాత్రలభేదం వ్యక్తీకరించబడింది ఇది నాటక సమాజాల వారికి ఊరట కలిగించే అంశం అంతేకాక సాధారణంగా నాటక రచయితలు జరిగిపోయిన వృత్తాంతాన్ని విశదీకరించేటప్పుడు ఫ్లాష్‌బ్యాక్ (Flash Back) ఉపయోగించడం అమలులో ఉన్న నాటక విధానం అలాగే ఊహాత్మక సంఘటనలను చూపించవలసి వచ్చినపుడు ఫ్లాష్ ఫార్వర్డ్ (Flash Forward) పద్ధతిని వాడటమూ ఉంది ఈ రెండు పద్ధతులూ ఒక వ్యక్తికి ఆ సంఘటనతో ప్రమేయం ఉన్నప్పుడు మాత్రమే ఉపయోగించబడతాయి కాని ఈ నాటకంలో శంకరరావు అమూల్యల ప్రేమానుబంధంలో పరిణామదశల్ని గురించి కాళిదాసు తన మిత్రుడు చక్రవర్తికి వివరించేటప్పుడు "ఫ్లాష్‌ఫాక్సిమిలీ" (Flash Facsmile) అనే పద్ధతి అవలంబించడం జరిగింది అంటే వారి గతవృత్తాంతముతో తనకెలాంటి ప్రమేయం లేకపోయినా శంకరరావు చెప్పిన సంగతులనే కాళిదాసు Third person లో యితరులకు వివరించడాన్ని (దృశ్యీకరించడాన్ని) "ఫ్లాష్‌ఫాక్సిమిలీ" అన్నారు రచయిత ఈ విధానానికి, యీ పదప్రయోగానికి ఆద్యులు ఆంజనేయులు గారే అని చెప్పాలి ఈ నాటకంలో కథావిస్తృతి సంఘటనా బాహుళ్యం ఉన్నా అక్కడక్కడా కనిపించే సుదీర్ఘ సంభాషణలను కుదించుకుంటే నాటకంలో వేగం పెరుగుతుంది అలాగే పతాక సన్నివేశం కూడా అనుకున్న స్థాయిని అందుకోలేదేమో అనిపిస్తుంది ప్రదర్శన దృష్ట్యా యీ వెలితిని పూరించుకుంటే స్మృతి ప్రతీక ఒక మంచి నాటకంగా నిస్సంశయంగా నిలబడుతుంది వైవిధ్యంతో కూడిన నాటకాలూ, నాటికలు ఈ దశాబ్దంలో వెలుగుచూశాయని పై విధంగా పరిశీలించడమైంది

## ఆధునిక నాటకం: కుటుంబ వ్యవస్థ

1980 నుండి నాటక రచనలో వచ్చిన పెద్ద మార్పుల్లో కుటుంబ వ్యవస్థకు పెద్దపీట వేయడమేననవచ్చు ఇది ఆహ్వానించదగిన పరిణామమే! కుటుంబం అస్తవ్యస్తంగా ఉంటే, దాని ప్రభావం సంఘంమీద ప్రతిఫలిస్తుంది అది దేశ శ్రేయస్సుకు, ప్రగతికి గొడ్డలిపెట్టు కనుకనే దేశభవిష్యత్తుకు కుటుంబం కేంద్ర బిందువు అవుతున్నది

తన కుటుంబం పచ్చగా ఉండాలని సంఘంలోని ప్రతి వ్యక్తి కోరుకుంటాడు ఈ సంఘంలోని వ్యక్తుల సుఖదు ఖాలకు హేతువు, మూలవిరాట్టు అదే!

అనాదిగా వస్తున్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థలో కుటుంబ సభ్యుల మధ్య బంధాలు, అనుబంధాలు, ఆప్యాయతలు, అనురాగాలు, ఒక తాటిపై నడిచే సంఘీభావం, పెద్దవారిపట్ల గౌరవం, క్రమశిక్షణవంటి ఉత్తమ లక్షణాలు పరిఢవిల్లేవి కాలం మారింది జనాభా పెరిగింది విద్య విస్తరించింది విద్యతోటే రావలసిన వినయ సంస్కారాల మాట ఎలా ఉన్నా, మనుషుల్లో స్వతంత్ర భావన, స్వార్థచింతన, విలాస జీవితం కోసం పరుగులు ప్రారంభమయ్యాయి దానికి అడ్డంగా నిలుస్తున్న పెద్దతరాన్ని నిర్లక్ష్యం చేయడం జరుగుతోంది దానిఫలితం ఉమ్మడి కుటుంబ వ్యవస్థ బీటలువారి శిథిలమైపోయింది

ఆధునిక యుగంలో కుటుంబ సమస్యలు ఒక్కొక్కటి ఒక్కొక్క తీరులో ఉంటున్నాయి అన్నిటికీ మూలం ఆర్థికపరమైన అంశాలే కాదు మానవ సంబంధాలకు చెందిన సమస్యలు, సంప్రదాయపరంగా ఎదురయ్యే సమస్యలు, నైతిక సమస్యలు, మానసికంగా మనస్సును వేధించే సమస్యల తీవ్రత అన్ని కుటుంబాలకు ఒక్కలాగే ఉండకపోవడంలోనే వైచిత్రి ఇమిడి ఉంది

"All happy families resemble one another But every unhappy family is unhappy in its own way "

అన్న టాల్‌స్టాయ్ పలుకులు ఈ సందర్భంలో స్మరించదగినవి

చాలీచాలని రాబడితో సతమతమయ్యే కుటుంబం, వయసొచ్చిన పిల్లకు పెళ్లి చెయ్యలేక బాధపడే కుటుంబం, అయిదువతనం పోగొట్టుకుని ఇంటికి చేరిన ఆడపిల్ల భవిష్యత్తు గురించి దిగులుపడే కుటుంబం, నిరుద్యోగంతో క్రుంగిపోయే కుటుంబం, క్రమశిక్షణలేని పిల్లలవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలతో తల్లడిల్లిపోయే కుటుంబం, కొడుకూ కోడళ్ల నిర్లక్ష్యానికి గురియై ఆర్తితో అలమటించే తల్లిదండ్రులున్న కుటుంబం - ఇలా ఎన్నో సమస్యలలో ఎన్నో కుటుంబాలుంటాయి

ఈ సమాజంలో కుటుంబాలను నాలుగు తరగతులుగా విభజించవచ్చు 1 పై తరగతి లేదా సంపన్న కుటుంబం 2 మధ్య తరగతి, 3 క్రింది తరగతి, 4 అంతకంటే క్రింది తరగతి, దారిద్ర్యరేఖకు అట్టడుగున ఉన్న తరగతి ఈ నాలుగు తరగతుల కుటుంబ జీవితాన్ని చిత్రించే నాటకాలు, నాటికలు గతంలో ఎన్నో వచ్చాయి ఇప్పుడూ వస్తున్నాయి కాగా, పై తరగతి గురించి వచ్చిన నాటకాలను వేళ్లపై లెక్కపెట్టవచ్చు అలాగే నాలుగవ తరగతిగురించి వచ్చినవి కూడా అత్యల్పమే తెలుగులో ఉన్న నాటక సాహిత్యంలో నాలుగింట ఒకవంతు మధ్య తరగతి మనస్తత్వం మీద, సమస్యలమీద రాయబడిన నాటకాలు కావడం పరిశీలనార్హం

పై తరగతికి చెందిన నాటకాల్లో శ్రీ బుచ్చిబాబు రాసిన 'ఆత్మవంచన', శ్రీ ఆత్రేయ రాసిన 'కప్పలు', శ్రీ గణేష్‌పాత్రో రాసిన 'తరంగాలు' చెప్పుకోదగినవి

మధ్యతరగతి కుటుంబాలను గురించి రాసిన వారిలో శ్రీ నార్లవెంకటేశ్వరరావు (జీవితఖండం, వెలుగు నీడలు - నాటికలు), శ్రీ ఆచార్య ఆత్రేయ (గుమస్తా), శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి (పల్లె పడుచు, అన్నా చెల్లెలు - నాటకాలు), షేక్ నాజర్ (ఆసామి - నాటకం), శ్రీ ముదిగొండ లింగమూర్తి (వెంకన్న కాపురం - నాటిక), శ్రీ బి ఆర్ రంగారెడ్డి (జీవనసంధ్య - నాటకం), డా కొర్రపాటి గంగాధరరావు (కమల, గుడ్డిలోకం -

నాటకాలు), శ్రీ హరనాధరావు (క్షీరసాగరమధనం) (నాటకం) శ్రీ పూసల వెంకటేశ్వరరావు (మండువా లోగిలి - నాటకం) మున్నగువారు ముఖ్యులు అలాగే, క్రింది తరగతి గురించి రాసిన వారిలో శ్రీ కొడాలి గోపాలరావు (కూలి-నాటకం), శ్రీ బోయి భీమన్న (పాలేరు - నాటకం) శ్రీ సి యస్ రావు (ఊరుమ్మడి బతుకులు - నాటిక), డా పి వి రమణ (చలిచీమలు - నాటకం) ప్రభృతులున్నారు

దారిద్ర్యరేఖకు దిగువనున్న వ్యథితుల జీవితాలను పరామర్శించిన వారిలో శ్రీ గొల్లపూడి మారుతీరావు (కళ్లు - నాటిక), శ్రీ ఆర్ ఎియస్ రామస్వామి (సొంత కూడు - నాటిక), శ్రీ వేలూరి శివరామశాస్త్రి (సుల్తానీ - నాటిక), శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు (యాచకులు - నాటకం), శ్రీ రత్నగిరి (దేవుడు - నాటిక) మున్నగువారు ప్రసిద్ధులు ఇదంతా 1980కి పూర్వం వచ్చిన రచనల, రచయితల మాట

ఇక ఈ దశాబ్దంలో అంటే 1980 – 90 మధ్యకాలంలో కుటుంబ వ్యవస్థమీద వచ్చిన రచనల విషయానికొస్తే - ఈ కాలంలో పైన ఉదహరించిన నాలుగు తరగతుల నాటక, నాటికలలాగా కాకుండా, ఒక్క మధ్య తరగతి గూర్చి రాసిన నాటక నాటికలు మాత్రమే వెలువడటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది కింది తరగతులమీద నాటకాలు రాకపోవడానికి నేటి నాటకకర్తలకు కింది తరగతి ప్రజలు జీవన విధానం మీద సరియైన అవగాహన లేకపోవడమో లేదా వారి జీవితాలకు దగ్గరగావెళ్లి పరిశీలించే అవకాశం లేకపోవడమో లేదా ఆసక్తి లేకపోవడమో కారణాలుగా అనుకోవలసి వస్తుంది ఆత్రేయగారు కూడా తన నాటకాలన్నీ మధ్య తరగతి వారి గురించే రాశారుగాని, కింది తరగతివారిని గురించి ఎక్కడా స్పృశించలేదు "మధ్యతరగతి వారికన్నా బడుగువర్గం ఉందనీ, దాని ఎక్స్‌ప్లాయిటేషన్ ఇంతకన్న అమానుషంగా ఉంటుందనీ ఆత్రేయ గుర్తించినా, నాటకీకరించలేదు దాని కారణం - తనకు తెలిసిన విషయాన్నిగురించి మాత్రమే రాయాలన్న "ఆనెస్టీ" అనుకుంటాను"[1] అని ఆత్రేయగారి విషయంలో ఆచార్య నాగభూషణ శర్మ వెలిబుచ్చిన అభిప్రాయం, నేటి నాటక కర్తలకు కూడా వర్తిస్తుందనవచ్చు

# అదాలత్

శ్రీ అనంత హృదయరాజ్ రచించిన ఈ నాటిక మధ్య తరగతి మనస్తత్వాన్ని బహిర్గతం చేస్తుంది

జీవితం పూలపాన్పుకాదు మనిషి జీవితం సుఖదు ఖాల సమ్మేళనం ప్రతి మనిషికీ సమస్యలుంటాయి కష్టాలొస్తాయి ఒక్కొక్కసారి జీవితం - చీకటి తెరలు కప్పేసి, భవిష్యత్తు నిరాశాజనకంగా, అంధకారబంధురంగా కనబడుతుంది అలాంటి క్లిష్టపరిస్థితుల్లోనే ఆత్మ స్థయిర్యం కావాలి పిరికివాడై బ్రతుకు పోరాటానికి వెన్నిచ్చి దూరంగా పారిపోవడం అవివేకం, మూర్ఖత్వం తన నీడలో బ్రతుకుతున్న తనవారిని శాశ్వతంగా వదిలేసి బంధాలు తెంచుకొని వెళ్లిపోవడం బాధ్యతారాహిత్యం, స్వార్థం అవుతుంది 'అదాలత్' నాటికలో సందేశ సారం ఇదే

కష్టాల కడలిలో కొట్టుకుపోతున్న చిరంజీవి అనే మధ్యతరగతి మానవుడు ఆత్మహత్యతో విముక్తి లభిస్తుందని ఆలోచిస్తాడు ఆలోచించడమేకాదు అంతపనీ చేస్తాడు అతని స్నేహితుడు డాక్టరు గిరి అతనిని ప్రాణాపాయంనుంచి రక్షిస్తాడు చిరంజీవి పదేళ్ల క్రిందటే చనిపోయాడనీ, డాక్టర్ తన శాస్త్ర పరిశోధనా ప్రభావంతో తాత్కాలికంగా అతనిని బ్రతికించి,ఎక్స్పెరిమెంట్లో ఒక భాగంగా అతనిచేత మాట్లాడిస్తున్నాడనీ చిరంజీవికి భ్రమ కలిగిస్తాడు చిరంజీవి కుటుంబం ఈ పదేళ్లనుంచీ అనుభవిస్తున్న బాధలు కళ్లకు కట్టినట్టు చూపిస్తాడు భిక్షాటనచేసే తండ్రి, పడుపు వృత్తిలో పొట్ట పోసుకొంటున్న భార్య, తల్లిని తార్చే స్థితిలో ఉన్న బిడ్డల పతనం కళ్లారా చూస్తాడు చిరంజీవి తాను చేసిన తప్పుకు పశ్చాత్తాప పడతాడు "గిరీ! నా ప్రాణస్నేహితుడివి, నా ప్రాణం కాపాడటానికి మహత్తరమైన నాటకాన్ని ప్రదర్శించావు నీ మేలు నేను మరిచిపోలేను భద్రతలేని సామాజిక వ్యవస్థలో బరువు బాధ్యత మోయవలసినవాడు, బ్రతుక్కి భయపడి పారిపోతే తనమీద ఆధారపడ్డ జీవితాలు ఎంత నికృష్టంగా మారిపోతాయో కళ్లకు కట్టినట్లు చూపించావు" అని మిత్రుడికి కృతజ్ఞత చెప్పి జీవన పోరాటం కొనసాగించాలన్న దృఢసంకల్పంతో బయలుదేరాడు చిరంజీవి

ఇక్కడితో నాటిక ముగిస్తే హుందాగా ఉండేది  కాని చివరికి పరిషత్తు నాటికగా మార్చేశారు దీన్ని  చిరంజీవి మళ్లీ డాక్టరు దగ్గరికి వస్తాడు  "గిరీ! నిన్నటివరకు ఏ బాధలతో చనిపోవాలనుకున్నానో ఆ బాధలన్నీ కోరలు చాచి నన్ను కాటువేయడానికి సిద్ధంగా పొంచివున్నాయి  మారని ఈ పరిస్థితుల్లో నా మనుగడ ఎలా సాధ్యం?" అంటూ రెండు చేతులతో తన గొంతు పట్టుకుని కూలిపోతాడు

"చిరంజీవి ఇప్పుడు నిజంగానే చనిపోయాడు" అని ప్రకటిస్తాడు డాక్టరు

ముగింపు ఎలా ఉన్నా ఈ నాటికలో కథనం సామాజికులను ఆలోచింపజేసే విధంగా, ఆసక్తికరంగా సాగింది  అనంతహృదయరాజ్ రచనలో సారళ్యం ఉంది భావాలలోను, అభివ్యక్తిలోను, ఆకర్షణ కన్పిస్తుంది  ఉదాహరణకు కింది వాక్యాలు చూడండి

"జీవితం కోరికల పుట్ట  అవి తీరేవి కావు  తీరవని తెలిసి మనిషి క్రుంగిపోతాడు  అయినా ఆఖరి క్షణాన కూడా ఏదో ఒక కోరిక మిగిలే వుంటుంది మనసునుపట్టి పీడిస్తూనే ఉంటుంది "

"చావలేక బతకడమే చావంటే, మీరు జీవచ్ఛవాలు  జీవితమంతా రోదన, కష్టాల్లో కాలిపోయిన అస్థిపంజరాలు మీరు  మీదీ ఒక బ్రతుకేనా?  చావు ముంగిట్లో కూర్చొనికూడా చావంటే భయం మీకు "

నెగటీవ్ అప్రోచ్‌లో రాసిన  ఈ నాటిక, సమస్యలనుంచి భయపడి పారిపోయే దుర్బల మనస్తత్వం గలవారి మస్తిష్కానికి తప్పకుండా పదును పెడుతుంది అనిశ్చిత ప్రతీక్ష అనే గుణం ఈ నాటికలో పుష్కలంగా  ఉంది అదే ఈ నాటికను నడిపిస్తుంది

## ముఖచిత్రం

మధ్యతరగతి కుటుంబంలో ఎదురయ్యే సమస్యల్ని విభిన్నమైన కోణం

నుంచి పరిశీలించి రాసిన నాటిక 'ముఖ చిత్రం' రచయిత శ్రీ కావూరి సత్యనారాయణ

పెడత్రోవ పడుతున్న నేటి యువతరం మనోవ్యాపారానికి అద్దంపట్టే నాటిక ఇది 'సముద్రానికి మల్లేనే మనో సముద్రానికి చెలియలికట్ట ఉంటుంది ఆశల కెరటాలు ఓ దశ దాటి ఎగసిపడ్డాయంటే ఉప్పెనలాంటి ఉపద్రవం తప్పదు (పుట 123) అదే జరిగింది చలపతిగారి సుపుత్రుడి విషయంలో

చలపతి మధ్యతరగతి గృహస్థు రఘు అతని ఏకైక సంతానం అతనికి చదువు చెప్పించాడు ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేదు ఆ వచ్చే బెత్తెడు జీతంతో జీవితంలో కోరికలు తీరవని అతని స్థిరాభిప్రాయం కష్టపడకుండా ఒక్కరోజులో లక్షలు లక్షలు సంపాదించి విలాస జీవితాన్ని గడపాలని ఆలోచన మనిషిచేత ఎన్ని ఘోరాలైనా చేయిస్తుంది

సంఘంలో ఉన్నత స్థానంలో ఉన్న పెద్దమనుషుల పుత్రులే దారిదోపిడి, హత్యలకు పాల్పడతారు మధ్యతరగతి కుటుంబీకుడైన చలపతి కొడుకు రఘు ఆ జట్టుకు నాయకుడని తెలుసుకుని చలపతి దంపతులు నిర్ఘాంతపోతారు రక్తపు మరకలున్నచొక్కా ఒకటి ఇంట్లో దొరుకుతుంది అక్కణ్ణుంచి డొంకంతా కదుల్తుంది 'అయితే వినండి ముసలమ్మను కత్తితో పొడిచింది నేనే ఆ నగలు దొంగిలించింది నేనే' అని జంకూ, గొంకూ లేకుండా కొడుకు చెప్పిన మాటలు విని స్థాణువులైపోయారు తల్లిదండ్రులు మరీ నిలదీసి అడిగితే కొడుకు చెప్పిన సమాధానమిది

'చెప్పమంటారా ? డబ్బు, ఈజీ మనీ నెత్తిన రూపాయి పెడితే పావలాకి పనికిరాని ప్రతివాడు తెల్లారే సరికల్లా లక్షలు సంపాదించి విలాసంగా బతుకుతున్నాడు ఇంత చదువూ చదివి ఉద్యోగం సద్యోగం లేక యింటిదగ్గర తల్లిదండ్రులు పెట్టే పిడికెడు మెతుకులు తింటూ, జేబు ఖర్చులకు వాళ్లిచ్చే చిల్లర డబ్బులు వాడుకుంటూ, ఎన్నాళ్లిలా పారసైట్‌లా ఆధారపడి బతకాలి న్యాయానికీ అన్యాయానికీ తేడా ఒక్క అక్షరమేగా? అందుకే ఎలాగైనా సరే లక్షలు సంపాదించాలి'

చలపతిః "నేరం చేసేవాడికంటే తెలిసి సహించేవాడే దోషిరా నేరం కప్పిపుచ్చుకోడానికి ఇన్ని తెలివి తేటలు ప్రదర్శిస్తున్న నిన్ను నీ స్థానంలోకి పంపడానికి నేను నా స్థానాన్ని కోల్పోడానికి సిద్ధమే పద స్టేషన్‌కు "

చలపతి "సామాజిక బహిష్కరణ నీకు తగిన శిక్ష యస్ ఈ ఇంటినుంచి నిన్ను బహిష్కరిస్తున్నాం వెళ్లిపో ఏదో ఒక రోజు కడుపు మండిన జనంచేతిలో కుక్కచావు చస్తావ్ "

ఇలా, సమాజ శ్రేయస్సు కోసం కొడుకుతో అన్ని బంధాలు తెంచుకొని వెళ్లగొట్టేస్తాడు తండ్రి రక్తపాశానికి అతీతమైన అతని మానసిక ప్రవృత్తి అతనిలోని వైక్లబ్యాన్ని నివృత్తి చేసింది కుటుంబం - సమాజం పరస్పరాశ్రితాలనీ, ఆ బంధాన్ని విస్మరించినపుడు సహజీవనం సాధ్యం కాదని నిరూపిస్తుందీ నాటిక

## నత్వం శోచితు మర్హసి

శ్రీ వి యస్ కామేశ్వరరావు రచించిన ఈ నాటిక మధ్యతరగతి కుటుంబాన్ని ప్రాతిపదికగా చేసుకుని నిర్వహించినప్పటికీ, ఈ ఇతివృత్తం ఒక ప్రాంతానికి, ఒక జాతికి, ఒక తరగతికి చెందినట్టుగా కాకుండా ఎల్లరకూ వర్తించే రీతిలో ఉంది దీనిలో యూనివర్సల్ అపీల్ ఉండటమే అందుకు కారణం

ప్రేమానురాగాలు అనేవి ఒకవైపునుంచి ప్రవహించే నదులు కావు ఆర్ద్రతాభావం ఇరువైపులనుండి వచ్చినపుడే ఆ అనుభూతులు, మధురిమను చవిచూస్తాయి అలా జరగనప్పుడు ఆ జీవితం మోడువారినట్టు, ఎడారిలో పయనిస్తున్నట్టు నిస్తేజమౌతుంది

కనిపెంచిన పిల్లలు తమకు దూరమై, ఎక్కడో విసిరి పారేసినట్టుగా ఉంటున్నా, తమను నిర్లక్ష్యం చేసినా, తల్లిదండ్రులు మాత్రం వారిని మరచిపోలేరు వారి కన్నుల్లో ఆశాదీపాలు కన్నబిడ్డల రాకకోసం ఎదురు చూస్తూనే ఉంటాయి అది రక్తపాశంలో ఉన్న శక్తి, సృష్టి ధర్మం

ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతి ప్రాణీ మరణించటం తథ్యం చనిపోయిన ప్రతీప్రాణీ జన్మించక తప్పదు అనివార్యమైన ఈ చక్రనేమి క్రమాన్ని మరచి, అనుబంధాలు, ఆప్యాయతలు పెంచుకొని వాటికోసం శోకించ తగదు - అనే గీతా శ్లోకాన్ని అన్వయిస్తూ అక్షరబద్ధంచేసి దృశ్యరూపాన్నిచ్చిన నాటిక 'నత్వం శోచితు మర్హసి'

ఇంటి యజమాని, ఆ ఇంట్లో అద్దెకు ఉంటున్న దంపతులు - మూడే పాత్రలు ఈ నాటికలో ఆత్మీయుల నిరాదరణకు గురయి, ఒంటరితనంతో తల్లడిల్లిపోతున్న శోభామూర్తి అనే వృద్ధుడు, తన ఇంట్లో అద్దెకుచేరిన యువదంపతులమీద మమకారం పెంచుకుంటాడు వాళ్లు తన వాళ్లేననే అనుబంధాన్ని పెంచుకొని, తనను వెంటాడే శూన్యాన్ని పూరించుకుంటాడు ఒంటరి జీవితానికి కొంత ఓదార్పు లభిస్తుంది కానీ అంతరాంతరాల్లో ఎక్కడో రక్తపాశం అలజడి రేపుతూ మనసును సంక్షోభంలో పడవేస్తూ వుంటుంది ఆ సంఘర్షణకు తట్టుకోలేక ఒకరోజు ఆ వృద్ధుడు భవ బంధాలు తెంపుకొని అనంత లోకాలకు పయనమైపోతాడు

అలాగే, ఆ ఇంట్లో, అద్దెకుంటున్న దంపతులు (జానకి, దాశరథి) తమకు కలిగిన ఒక్క నలుసుకోసం స్వసుఖాన్ని త్యాగంచేసి, అతనికి బంగారు భవిష్యత్తునిస్తారు విదేశాల్లో ఉన్న కన్న కొడుకు కోసం కళ్లు కాయలు కాచేలా ఎదురు చూస్తుంటారు రెండేళ్లవరకూ రానని ముక్తసరిగ జాబు రాస్తాడు ఆ కొడుకు ఆ వార్త తల్లికి అశనిపాతమౌతుంది దాశరథి ఒంటరివాడైపోతాడు మళ్లీ కథ మామూలే కొండను అద్దంలో చూపించినట్టు ఒక జీవిత ఖండాన్ని ఇంటి యజమాని నిర్వేదాన్ని, దంపతుల ఆర్తిని, అనుసంధానం చేసిన ఆ సన్నివేశం రచయితలోని నాటకశిల్ప చాతుర్యాన్ని బహిర్గతం చేస్తుంది

ఇంచుమించు ఇలాంటి ఇతివృత్తంతోనే శ్రీమతి అత్తిలి పద్మావతిగారి 'సంధ్యా - ఛాయ' నాటకం వెలువడింది కరుణరస ప్రధానమైన ఈ నాటకం మరాఠీ నాటకానికి సరళమైన అనువాదం విదేశాల్లో వున్న తనయుడికోసం వృద్ధ

దంపతులు పడే తపన, అనుభవించే మానసిక క్షోభను హృదయంగమంగా చిత్రించారు రచయిత్రి పద్మావతి గారు సాహిత్య దృష్టితో చూసినా, ప్రదర్శనాపరంగా చూసినా 'సంధ్యా-ఛాయ' చక్కటి నాటకం అనడానికి సందేహం లేదు తెలుగులో సాంఘిక నాటకం (ఫుల్ లెంగ్త్ ప్లే) రాసిన ప్రధమ రచయిత్రి అత్తిలి పద్మావతి గారేనన్న విషయం గమనించదగినది

శ్రీ అరిశెట్టి శివన్నారాయణ రచించిన 'పుణ్య ఫలం' శ్రీ బత్తుల రామకృష్ణ రాసిన 'మాతాస్సమస్త జగతాం' అనేవి కన్నబిడ్డల నిర్లక్ష్యానికి గురై తల్లిదండ్రులు అనుభవించే మానసిక సంఘర్షణ ను అభివ్యక్తం చేసిన నాటికలే

వృద్ధులు, పదవీ విరమణ చేసిన ఉద్యోగులు, తమ బిడ్డల చేతుల్లో పడేపాట్లు, వాళ్లు సహించే అవమానాలు, అనుభవించే చిత్తక్షోభను వివరించే నాటక నాటికలు కూడా ఈ దశాబ్దిలో (1980-90 మధ్య) గణనీయంగా వచ్చాయి వానిలో 'భేతాళ ప్రశ్న', 'బాధ్యత' నాటికలు, 'వృత్తవిశ్లేషణం' అనే నాటకం ముఖ్యంగా పేర్కొనదగినవి

## భేతాళప్రశ్న

ఈ నాటిక రచయిత శ్రీ కంచర్ల సూర్యప్రకాశరావు యాంత్రిక జీవితానికి అలవాటు పడిన మానవుడు, ఆర్థిక సమస్యలు, వృద్ధాప్యంలో కొడుకుల నిరాదరణకు గురి అయిన తల్లిదండ్రుల గోడు - ఈనాటికలో ఇతివృత్తం

భేతాళుని ప్రశ్నకు విక్రమార్కుడు సమాధానాలిచ్చినట్లు కొత్త టెక్నిక్‌తో సమస్యను ప్రవేశపెట్టి పరిష్కరించాడు నాటకకర్త

తల్లి, తండ్రి, ఇద్దరు కొడుకులు, ఒక కూతురు- ఇవీ ఈ నాటికలో ప్రధాన పాత్రలు

రిటైర్ అయిన చలపతి, తనకు వచ్చిన పెన్షన్ సొమ్ముతో కూతురు జ్యోతికి పెళ్లిచేసి రిక్తహస్తుడయాడు కుటుంబ పోషణ భారం పెద్ద కొడుకు గోపాలం

వహిస్తున్నాడు  కొన్నాళ్లకు అది తన తలకు మించిన భారం అనిపిస్తుంది  చిన్న కొడుకు శేషు వేరే వూళ్లోవుంటూ, బట్టలకొట్లో సేల్స్‌మేన్‌గా పనిచేస్తూ చాలీచాలని జీతంతో తన సంసారం నెట్టుకొస్తున్నాడు  నిజానికి అన్నదమ్ములిద్దరి సంపాదన అంతంత మాత్రమే  ఇద్దరూ అతి కష్టంతో బండి ఈడుస్తున్నారు  వారి ఆర్థిక పరిస్థితి రోజు రోజుకి దిగజారిపోవటంవల్ల తల్లిదండ్రుల పోషణ భారం తమవల్ల కాదని ఇద్దరూ తప్పుకున్నారు

చలపతి అతని భార్య దిక్కులేని వారవుతారు  పూట గడవడం కష్టమై పస్తులుంటున్నారు  ఇక లాభం లేదని ఇద్దరూ ఆలోచించుకొని నిద్రమాత్రలు వేసుకుని చనిపోవాలని తీర్మానించుకుంటారు  శాంత చనిపోతుంది  చలపతి బతుకుతాడు  ఆత్మహత్యా ప్రయత్నం అనే నేరంకింద అతనిని అరెస్టు చేస్తారు  న్యాయస్థానంలో తండ్రి కొడుకుల మధ్య, కూతురు మధ్య వాద ప్రతివాదనలు జరుగుతాయి  ఒక యింటికి కోడలుగా వెళ్లిన తనకు తండ్రిని పోషించవలసిన అగత్యంలేదంటుంది కూతురు  తండ్రిని పోషించే శక్తి తమకు లేదనీ, తమ జీవితాలే దయనీయంగా వున్నాయనీ కొడుకులు కోర్టుకు విన్నవించుకుంటారు  కోర్టుల్లో తర్కబద్ధమైన ప్రశ్నలు, సమాధానాలు ఆసక్తిని కలిగిస్తాయి  ఆర్తిని రగిలింపజేస్తాయి

ఈ నాటికలో కొన్ని సంభాషణలు మచ్చుకి

"మనుషుల మధ్య రక్తసంబంధాలు లేవు  ఆప్యాయతలు లేవు  అనుబంధాలు లేవు  ఎక్కడ చూసినా, ఎవరి నోట విన్నా డబ్బు డబ్బు డబ్బు"

"అసలు ఈ వ్యవస్థలో ఒక మనిషి మరో మనిషిచేత ప్రేమించబడాలన్నా, ద్వేషించబడాలన్నా అంతా డబ్బులోనే వుందమ్మా"

"నేనేం పంచభక్ష్య పరమాన్నాలు కావాలని అడగటం లేదయ్యా! నిన్ను కనిపెంచి పెద్ద చేసినందుకు మాక్కూడా చావొచ్చేదాకా బ్రతికే అవకాశం ఇవ్వమని అర్థిస్తున్నానురా"

"నేల పగిలి మొక్కకు జీవం యిస్తుందండీ  అది సృష్టి ధర్మం"

"రెక్కలొచ్చిన పిల్లలు, రెక్కలు అలిసిన మమ్మల్ని వదిలేశారు "

నిజానికి నిర్లక్ష్యంతోగాని, స్వార్థంతోగాని తల్లిదండ్రులను అమానుషంగా వదిలేయకుండా వాళ్లను పోషించాలనే ఉంది కొడుకులకు కాని, తామే పస్తులుంటున్న స్థితిలో తల్లిదండ్రులను పోషించలేకపోయిన అశక్తతవారిది ఈ దృష్టితో చూసినప్పుడు పై సమస్యపై వచ్చిన ఒక అరడజను నాటికలలో "భేతాళ ప్రశ్న" విలక్షణమైనది ఈ నాటికలో హ్యూమన్ ఎలిమెంట్ పుష్కలంగా ఉంది కోర్టు తీర్పు చెప్పలేదు కాని, వృద్ధులను పోషించవలసిన నైతిక బాధ్యత ప్రభుత్వమే వహించాలని విక్రమార్కుడు సమాధానం చెప్పడంతో నాటిక ముగుస్తుంది.

ఇటువంటి సమస్యపై వచ్చిన మరొక నాటిక "బాధ్యత" దీని రచయిత డా పి బ్రహ్మానందరావుగారు "భేతాళ ప్రశ్న" కంటే భిన్నంగా కనిపిస్తుంది తండ్రిని పోషించగల స్తోమత ఉన్నా నిరాదరించి ఇంట్లోనుండి వెళ్లగొట్టిన ఉదంతమిది

కన్నబిడ్డలకోసం తమ యావచ్ఛక్తిని ధారబోసి వృద్ధిలోకి తెచ్చిన తల్లిదండ్రులను వృద్ధాప్యంలో కంటికి పాపలా కాపాడుకోవడం పిల్లల బాధ్యత అనే సందేశాన్నిస్తుంది ఈ నాటిక

తాతయ్యను ఒక పురుగుకంటే హీనంగా చూస్తూ నిర్లక్ష్యంచేసే తల్లిని చిన్ననాడే గమనించిన మనుమడు పెద్దయ్యాక తల్లిదండ్రులకు కనువిప్పు కలిగించే అంశాన్ని మనస్సుకు హత్తుకునేలా హృద్యంగా వివరించింది 'బాధ్యత' నాటిక సంఘటనాపరంగా కథనడిపించిన విధానం ప్రశంసనీయం మనవడు చిన్నవాడుగా ఉన్నప్పుడు జరిగిన సంఘటనలను పతాక సన్నివేశానికి ముందు ఫ్లాష్ బ్యాక్ సీన్స్‌లో రూపొందించడం ఈ నాటికలో ఒక ప్రత్యేకత ఫ్లాష్ బ్యాక్ సీన్స్‌లో నటించే పాత్రధారులకు అగ్నిపరీక్ష పెడుతుంది ఇది

## కాదుసుమా కల

శ్రీ పాటిబండ్ల ఆనందరావు రచించిన 'కాదుసుమా కల' నాటకంలో మధ్య

తరగతి మనుషుల మనస్తత్వాన్ని గురించి చక్కగా విశ్లేషించడం జరిగింది తన శక్తిని, తాహతును, మర్చిపోయి డాబూ దర్పం ప్రదర్శించాలని తాపత్రయపడి నవ్వులపాలు కావడం నాటకంలోని ఇతివృత్తం

సంపన్నుడైన స్నేహితుడు బొంబాయినుండి తన ఇంటికి వస్తున్నాడని తెలుసుకొని అతని హోదాకు తగినట్లు తన ఇంట్లో అన్ని ఏర్పాట్లు చేయాలని అప్పులు చేసి చేతులు కాల్చుకుంటాడు ప్రకాశం భార్య సుభద్ర ఎంత మొత్తుకున్నా వినడు ఆ వచ్చిన స్నేహితుడు తను అనుకున్నట్టు పారిశ్రామికవేత్త కాదని అతనొక నిరుద్యోగి అని ఆలస్యంగా తెలుసుకుంటాడు కాని అప్పటికే తల బొప్పి కట్టిందతనికి అన్నివైపుల నుంచి ఎదురు దెబ్బలు తింటున్న ప్రకాశం ఇక బ్రతకడం అనవసరమని నిర్ణయానికొచ్చాడు విషం తీసుకుని ఆత్మహత్య చేసుకోడానికి సిద్ధమౌతాడు ఆ క్షణంలో ఆ ఇంటి యజమాని అక్కడకొచ్చి నాలుగు చివాట్లు పెట్టి హితబోధ చేస్తాడు

"నువ్వు చావక్కర్లేదు ఇదుగో డబ్బు పదివేలు ఈ డబ్బు ఒక మనిషి నిండు ప్రాణాన్ని నిలబెట్టగలిగినప్పుడు గూడ యివ్వకపోతే నేను మనిషిని అనుకోలేను

ప్రకాశం! ఏ అవసరమో రావచ్చు మరే ఆపదో ముంచుకు రావచ్చు మనలాంటి మధ్యతరగతి బ్రతుకులకు సెక్యూరిటీ వుండాలే అదే డబ్బు డబ్బే జీవితంకాకపోయినా జీవితానికి డబ్బు అవసరం ఎంత సంపాదిస్తున్నానూ అని కాదు ఎంత ఖర్చు పెడుతున్నానూ అని ఆలోచించు ఎంత మిగుల్చగలుగుతున్నానూ అని ఆలోచించు భౌతికంగా చచ్చినా ఫర్వాలేదు మానసికంగా బతుకు" అంటాడు ఇంటి యజమాని

హాస్య సన్నివేశాలతో ముందుకు సాగుతూ హుషారు పుట్టిస్తుంది ఈ నాటకం ఎక్కడా విసుగు పుట్టదు హాస్య సంభాషణలు కేవలం నవ్వు పుట్టించడానికే ఉద్దేశించలేదు నాటకకర్త హాస్యంచాటున నిశిత విమర్శను, కఠోర సత్యాలను, లౌకిక జ్ఞానాన్ని జతపర్చారు ప్రదర్శన సమయంలో సామాజికులలో చాలా మంది ప్రకాశం పాత్రలో తాదాత్మ్యం చెంది ఆ పాత్రలో తమ నీడ

చూసుకొంటారనడం అతిశయోక్తి కాదు

మధ్యతరగతి కుటుంబంలో సమస్యలనంతంగా ఉంటాయని, ఒక సమస్యను పరిష్కరించబోతే మరో కొత్త సమస్య ఉత్పన్నమై భయపెడుతూ ఉంటుందనే భావానికి రూపకల్పన శ్రీ బి వి యస్ శాస్త్రి 'పుష్పక విమానం' నాటిక ఇందులో సంఘటనలు తక్కువ వాచ్యంగా నడుస్తుంది

ఇదే సమస్య, ఇవే సంఘటనలు కాకపోయినా 'పుష్పక విమానం' ను పోలిన నాటిక 'ముగింపులేని కథ' రాళ్లపల్లి గారిది లోగడ వచ్చింది దీనిలోకూడా మధ్యతరగతి గృహస్థుణ్ణి సమస్యలెలా వేధిస్తాయో హాస్యరసస్ఫోరకంగా వివరించారు రచయిత

శ్రీ ఎల్ బి శ్రీరామ్ రచించిన 'ఒంటెద్దు బండి' నాటకంలో మూడు తరాల మనుషులకు నిలయమైన ఒక ఇంట్లో, ఒకరు సంపాదిస్తుంటే పదిమంది అతనిమీద ఆధారపడి బదుకుతుంటారు నలుగురూ పనిచేస్తూ నాలుగురాళ్లు తెస్తుంటే సంసార చక్రం నడుస్తుందికాని, ఒక్కరిమీదే ఆధారపడితే అంతకంటే విషాదం ఏముంది? నాటకం పేరు వినగానే ఇదేదో సీరియస్ నాటకం అని భ్రమ కలుగుతుంది కాని, నాటకం ఆద్యంతమూ హాస్య ప్రధానంగానే సాగుతుంది

శ్రీ పి వి రావు రాసిన 'డెవిల్స్' అనే నాటికలో, అసమర్థులు, సోమరిపోతులు, ఫిట్ ఫర్ నథింగ్ అయిన ముగ్గురు కొడుకులతో మాతృమూర్తి పడేపాట్లు, అనుభవించే కష్టాలు కథావస్తువు ఇందులో సంఘటనలు లేవు సంభాషణ రూపంలోనే సాగిపోతుంది కథనం

ఎవరినైనా హత్యచేస్తే జైల్లో వేళకింత తిండి దొరుకుతుందని ఆలోచించి, తల్లినే చంపడానికి పూనుకుంటారు ఆ డెవిల్స్ అలాంటి చీడపురుగులు, షరాన్న జీవులు, సంఘానికే ప్రమాదమని గ్రహించిన తల్లి, విషం కలిపిన అన్నం పెట్టి వాళ్లను అంతం చేస్తుంది తనూ ఆ అన్నం తినాలనుకుంటే ఒక్క మెతుకైనా మిగల్చలేదు ఆ పుత్రులు, నాటకీయత వెలితిగా ఉన్న ఈ నాటికలో తగిన మార్పులు చేస్తే మంచి నాటికగా రూపొందే అవకాశం ఉంది

## ఒంటికాలిపరుగు

కొడుకు మీద తండ్రికి అపారమైన వాత్సల్యం ఉండటంలో తప్పులేదు కానీ, ఆ ప్రేమానురాగాలు అతణ్ణి తప్పు మార్గం పట్టించేందుకు అవకాశం ఇచ్చేలా ఉండకూడదు అతని భవిష్యత్తుకు వెలుగు బాట చూపించేదిగా ఉన్నప్పుడే కొడుకు పట్ల తండ్రిచూపే వాత్సల్యానికి సార్ధకత అలా కాకుండా పుత్రరత్నం, కోరిందల్లా తీర్చాలన్న గుడ్డి వాత్సల్యం దు ఖానికి హేతువు అవుతుందనీ, ఆ జీవితం 'ఒంటికాలి పరుగు' అవుతుందనీ హెచ్చరించాడు శ్రీ సుధాకర్ ఈ నాటికలో ప్రదర్శనలో బాగా రాణించి ప్రసిద్ధి పొందిన నాటికలలో 'ఒంటికాలి పరుగు' ఒకటి

## లిఫ్ట్

ఈ నాటికను రాసినవారు శ్రీ కె రామచందర్ ప్రేమించి పెళ్లి చేసుకున్న దంపతుల మధ్య కలతలు చెలరేగి, కలసి కాపురంచేసే పరిస్థితులు దాటిపోయాయని అర్థంచేసుకుని విడిపోతారు

ఒకరోజు అనుకోకుండా భార్యాభర్తలు 'లిఫ్ట్' లో కలుసుకుంటారు కరెంటు పోయి లిఫ్ట్ మధ్యలో ఆగిపోతుంది లిఫ్ట్‌లోవున్న భార్య భర్తలు జరిగిపోయిన సంఘటనలను స్ఫురణకు తెచ్చుకుంటారు ఫ్లాష్ బ్యాక్ పద్ధతిలో ఒక్కొక్క ఘట్టాన్ని జ్ఞాపకం చేసుకున్నట్లు సన్నివేశాలను కూర్చడం ఒక టెక్నిక్ లిఫ్ట్ పరిధిని మరచిపోకుండా జాగ్రత్తపడ్డారు రచయిత కేవలం రెండు పాత్రలతోనే నాటిక సాగుతుంది

లిఫ్ట్‌లో ఉన్న భార్యాభర్తల మనసుల్లో మెదిలే భావాలు ఈ నాటికలో దృశ్యమానమైన సంఘటనలకు ప్రతిరూపాలు సతీపతులు నిత్య జీవితంలో చిన్న విషయాలమీద, పెద్ద విషయాలమీద ఘర్షణ పడటం జరిగేదే కాని యిక్కడ అనురాధ - మల్లిక్‌లు విడిపోవడానికి అంత బలమైన కారణాలు లేవు

భర్త నాటకాలరాయుడు ఆపద్ధర్మంగా అబద్ధాలాడుతూ తన పని

చక్కబెట్టుకుంటూ వుంటాడు భార్యను వేధించాలనిగాని, మోసం చేయాలనిగాని అతని ఉద్దేశం కాదు అతని ప్రవర్తనతో విసిగిపోయి విడాకులకు సిద్ధపడుతుంది భార్య తన ప్రేమ ఫలంగా జన్మించిన బిడ్డకోసమైనా వివాహ బంధాన్ని కాపాడుకోవాలన్న ఆలోచనైనా రాదు కరెంటు వస్తుంది భార్యాభర్తలు ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోతారు అంటే వారి నిర్ణయాల్లో మార్పేమి లేదన్నమాట

చిన్న చిన్న విషయాలలో మాటపట్టింపులకు పోయి ఆత్మాభిమానం పేరుతో విడాకుల కోసం పరుగులు తీసే తత్త్వం నేటి యువతరంలో ఉంది - ముఖ్యంగా విద్యావంతులైన వారిలో సహనం, సంయమనం, రాజీధోరణి లోపించిన చోట సంసారాలు సులభంగా విచ్ఛిన్నమైపోవటానికి ఆస్కారం వుందనీ, యిది కుటుంబ వ్యవస్థలో వాంఛనీయమైన పద్ధతి కాదనీ ఉద్బోధిస్తుంది నాటిక ఒక గంటసేపు నటీనటులు యిద్దరితోనే సాగే ఈ నాటిక ప్రతిభావంతుల చేతుల్లోనే రక్తిగడుతుంది ఇద్దరిలో ఏ ఒక్కరూ బలహీనంగా వున్నా నాటిక విసుగు పుట్టిస్తుంది

రచన దృష్ట్యా, ప్రదర్శన దృష్ట్యా కూడా 'లిఫ్ట్' నాటక రంగంలో ఒక క్రొత్త ప్రయోగం అనవచ్చు

## మనిషికీ మనిషికీ మధ్య

శ్రీ బత్తుల రామకృష్ణ రచించిన 'మనిషికీ మనిషికీ మధ్య' అనే యీ నాటకం కుటుంబ సమస్యను కొత్త తరహాలో ఆవిష్కరిస్తోంది

పెళ్లిపోయి అత్తవారింట్లో హాయిగా కాపురం చేస్తున్న కూతురు, పుట్టింట్లో అమ్మా నాన్నలు ఆర్థికంగా చితికిపోయి కష్టాలు పడుతున్నారని తెలుసుకొని కలత చెందుతుంది వారి నెలాగైనా ఆదుకోవాలని నిర్ణయించుకుంటుంది తన ప్రవర్తన సరిగా లేదని భర్తకు అనుమానం కలిగిస్తుంది ఆమెను పుట్టింట్లో వదలి వచ్చేస్తాడు భర్త

పుట్టింట్లో ఉంటూ,ఉద్యోగం చేస్తూ తల్లిదండ్రుల పోషణభారం తనపై వేసుకుంటుంది కూతురు కొన్నాళ్లకు నిజం తెలుసుకొని భర్త ఆమెను తనతో

తీసుకువెళ్తాడు వారి కథ అలా సుఖాంతమవుతుంది

కానీ, తన లక్ష్య సాధన కోసం కూతురు, భర్తతో తాత్కాలికంగానైనా విడిపోవడానికి ఎంచుకున్న మార్గం అసహజంగా, అనౌచిత్యంగా ఉంది ఉత్తముడైన భర్తదగ్గర ఆమె నిజందాచి, నాటకం ఆడాల్సిన అవసరం ఏమిటో అర్థం కాదు అనుకున్నప్పుడు భర్తకు అనుమానం కలిగించటం, మళ్లీ కావాల్సినప్పుడు ఆ అనుమానాన్ని అతని మనసులోంచి తొలగించుకోవడం అంతా తన చేతుల్లో వున్నట్టు, అంత సులభమైనట్టు సంఘటనలు సినిమాటిక్‌గా నడపడం సహజత్వానికి దూరంగా వుంది తల్లిదండ్రుల సంరక్షణ విషయంలో కొడుకులు లేనప్పుడు కూతురు శ్రద్ధవహించడం అవసరమేకాదు, బాధ్యత అని గుర్తు చేస్తుంది ఈ నాటకం ఇది ఒక ఏస్పెక్ట్ ఇందులోని సాధ్యాసాధ్యాలు, సాధకబాధకాలను గురించి ఆలోచించాల్సి బాధ్యత సామాజికులకు వదిలేశారు నాటకకర్త శ్రీ బత్తుల రామకృష్ణ

## జీవన సంధ్య

శ్రీ కాశీ విశ్వనాధ్ రచించిన 'జీవన సంధ్య' నాటిక నేటి సమాజంలో కుటుంబ వ్యవస్థను సమగ్రంగా అభివ్యక్తీకరించిన దృశ్యకావ్యం

ఈ నాటిక కుటుంబ వాతావరణాన్ని, దాని చుట్టూ ఆవరించిన దైన్యాన్ని, వ్యక్తుల్లో గూడుకట్టుకున్న స్వార్థాన్ని, స్వార్థానికి వంతపాడే హైన్యాన్ని, హాస్య, కరుణ, శాంత, రౌద్ర రసభరితంగా, ఆ దృశ్యాలను సామజికుల మనోనేత్రాల ముందు సాక్షా త్కరింపజేశారు నాటక కర్త

మనిషి తన జీవన సంధ్యలో సుఖంగా బతకడానికి కాదు, సుఖంగా చచ్చిపోవడానికి ఆరాట పడుతున్నాడనే నిర్వేదం ఈ నాటిక గుండెల్లోంచి పెల్లుబుకుతుంది

సదాశివం ఉద్యోగ విరమణ చేసిన తర్వాత వచ్చిన రిటైర్మెంట్ సొమ్మును బ్యాంకులో దాచుకున్నాడు కొడుకు, కోడలు, మనవడు - ఇదే అతనికుటుంబం

ఉద్యోగం చేస్తున్న కొడుకు రాజారాం లంచాలు పుచ్చుకున్నాడనే నేరం కింద సస్పెండ్ అయ్యాడు ప్రస్తుతం ఏదో ప్రయివేటు కంపెనీలో పనిచేస్తున్నాడు తాత్కాలికంగా బాధ్యతల బరువుతో ఆరోగ్యం చెడి గుండె జబ్బుతో బాధపడుతున్నాడు మహాలక్ష్మి వంటి అతని భార్య అన్నపూర్ణ ఉన్నదాంట్లోనే సర్దుకొంటూ ఆ ఇంటిని సాఫీగా నెట్టుకొస్తూ ఉంది ఆమె కొడుకు అంటే సదాశివం మనవడు సురేష్ ఒక శ్రీమంతుల పిల్లను ప్రేమించి, కాబోయేమామగారిని ఏకంగా ఒకరోజు ఇంటికి తీసుకొచ్చాడు పెళ్లి విషయం మాట్లాడ్డానికి

మామగారు లింగరాజులో డబ్బుతోకలిగిన అహంకారం నిలువెల్లా ఉంది అతని ధోరణి సదాశివానికి ఏమాత్రం నచ్చలేదు "సంస్కారం లేనివాళ్లతో సంబంధం కలుపుకోవడం నాకిష్టంలేదు మాటల్లో గొప్పింటి అహంకారం తప్ప, మానవత్వపు సంస్కారం నాకు కనబడలేదు (పుట 231) అని కచ్చితంగా తన అభిప్రాయం వెల్లడించాడు సదాశివం మీరు ఆయన ఆస్తినిచూసి మాట్లాడు తున్నారు నేను ఆయన అంతరంగాన్ని చూసి మాట్లాడుతున్నాను మనం మన కాలికి తగ్గ చెప్పునే వేసుకోవాలిగాని, చిన్న కాలికి పెద్ద చెప్పు తొడిగితే నడక సరిగా సాగదని నా అనుభవం మీద చెప్తున్నాను వివాహం అనేది కుటుంబాల్ని కలిపేదిగా ఉండాలిగాని, మనుషుల మధ్య అగాధాల్ని పెంచకూడదని మన పెద్దవాళ్లు సిద్ధాంతాన్ని చెప్పేరు" (పుట 232) అని చెప్పిచూశాడు కాని, సదాశివంమాట ఆ ఇంట్లో ఎవరూ వినలేదు పెద్దింటి సంబంధం చేసుకోవడం సదాశివానికి తప్ప, మిగతా అందరికీ యిష్టమే

వివాహం అయిపోయింది పెద్దింటి అమ్మాయి ముచ్చట మూడు రోజులకే మొహం మొత్తింది తండ్రికంటే మించిన అహంకారం ఉన్న రేవతికి పెద్దవాళ్లని గౌరవించే సంస్కారమే లేదు ఆ ఇంట్లో సౌకర్యాలు లేవనే సాకుతో సతీష్‌ను ఇల్లరికపుటల్లుడుగా మార్చడానికి రంగం సిద్ధంచేసింది

రాజారావు గుండె ఆపరేషన్‌కు డబ్బు కావాలి అతను పోగొట్టుకున్న ఉద్యోగం మళ్లీ రావడానికి లక్ష రూపాయలు లంచం ఇవ్వడానికి డబ్బు కావాలి మనవడు

జనరల్ మేనేజరుగా అపాయింట్‌మెంట్ కావాలంటే అతనికీ లక్ష రూపాయలు అర్జెంటుగా కావాలి

దేనికైనా సరే, తనడబ్బు కదిల్చే ప్రసక్తి లేదని ఖండితంగా చెప్పాడు సదాశివం అల్లుడు కూతుర్నీ తన ఇంటికి తీసుకుపోవడానికివచ్చాడు లింగరాజు. ఇల్లరికం విషయం వాళ్ల చెవిని పడగానే గొడవ చేస్తారు రాజారాం, అతని భార్య అలా వీల్లేదు పొమ్మంటారు మాటామాటా పెరిగింది రాజారాం మీద చెయ్యి చేసుకున్నాడు లింగరాజు తండ్రిని కొడ్తుంటే సతీష్ అడ్డుపడకపోగా తండ్రిమీద చేయెత్తాడు ఈదృశ్యం చూడగానే సదాశివం ఆవేశం కట్టలు తెంచుకుంది లింగరాజును ఎడాపెడా వాయించాడు తనకొడుకుమీద చెయ్యెత్తిన వాణ్ణి సదాశివం సహించలేకపోయాడు లింగరాజును కొడుతుంటే సతీష్ సీరియస్‌గా అడ్డుకున్నాడు అప్పుడు సదాశివం అన్నాడు " షటప్ యూ డర్టీ స్కౌండ్రల్ నాకు పిచ్చిపట్టిందాని అడుగుతున్నావా ? వీడు మీనాన్నని కాలితో తన్నినపుడు ఆప్రశ్న వీడినెందుకు అడగలేదురా రాస్కెల్! మీ నాన్నని మరొకడు కొడుతుంటే చూస్తూ వూర్కోవడానికి నువ్వు చేవజచ్చిన వెధవ్వేమో గాని, నాకొడుకు దెబ్బతిన్నప్పుడు చూస్తూ వూర్కోడానికి, నేను చేతకాని చవటను కాదురా!" (పుట 243)

కూతుర్నీ, అల్లుణ్నీ వెంటబెట్టుకుని లింగరాజు అక్కణ్ణుంచి వెళ్లిపోయాడు గుండెఆపరేషన్ కొసం, అతని ఉద్యోగం కోసం బ్యాంకునించి డబ్బు తీసి ఇవ్వడానికి సంసిద్ధుడౌతూ సదాశివం కొడుకుతోఅనేమాటలు :

"నా వార్ధక్యం నాకు శాపం కాకూడదు నా ఆరోగ్యానికి గాని, నా అంత్యక్రియలగ్గాని, నువ్వు అప్పులకోసం పరుగులుతీయకూడదు! నా జీ విత చరమాకంలో నువ్వు నాలాగ బాధలు పడకూడదని నా డబ్బంతా బ్యాంకులో దాచాను తప్ప నేను చచ్చినపుడు నాతో పాటేపట్టుకుపోడానికి కాదురా!" (పుట 245)

"నీ కొడుకు నిన్నిప్పుడు విడిచిపెట్టి వెళ్లిపోయినట్టే, నువ్వు నన్ను ఏక్షణాన

విడిచిపోతావోనన్న భయమే నన్ను స్వార్థపరుణ్ణి చేసింది నా అవసాన కాలంలో నా డబ్బయినా నన్నాదుకుంటుందని, ఆ డబ్బు దాచుకున్నానే గాని, మిమ్మల్ని బాధపెట్టి నేను సుఖపడాలని కాదురా!" (పుట 245)

"సమాజంలో పిల్లలున్న ప్రతి మనిషి నాపిల్లలు బాగుపడాలి, నా పిల్లలు పెద్దపెద్ద చదువులు చదువుకోవాలి, నా పిల్లలు గొప్పగొప్ప ఉద్యోగాలు చేయాలని తాపత్రయపడుతూ, తమసంపాదనంతా వాళ్ల అభివృద్ధికోసం ఖర్చు చేస్తారు! తమ జీవనోపాధికి పనికొస్తుందికదాని, ఒక్క రూపాయికూడా వెనకేసుకోరు ఎందుచేత! వాళ్లంతా మూర్ఖులా, కాదు! కనిపెంచిన తమ పిల్లలు తమ అవసాన దశలో తప్పకుండా పోషిస్తారనేధీమాతో తమకున్నదంతా పిల్లల క్రింద ఖర్చుచేస్తారు పిల్లల్నుంచి అలా ఆశించే హక్కు తల్లిదండ్రుల కుంది! తల్లి దండ్రులను పోషించాల్సిన భాధ్యత పిల్లలకీ ఉంది ఆ బంధంతో ముడిపడే ఆ నమ్మకానికి కట్టుబడే శతాబ్దాల తరబడి, ఈ సమాజం మనుగడ సాగిస్తుంది "(పుట 245) అని ఇంతకాలం తన హృదయాంతర్గతమైన ఆవేదననంతా ఒక్కసారిగ వెళ్లగక్కుతాడు సదాశివం 'జీవన సంధ్య' ప్రదర్శన చూసినవారి కన్నులు చెమర్చకుండావుండవంటే అతిశయోక్తి కాదు

## మధ్యతరతగతి కథ

కుటుంబ సమస్యలనువిభిన్నమైన దృష్టికోణంనుంచి పరిశీలించి రాయబడిన నాటిక 'మధ్యతరగతి కథ' రచయిత శ్రీ బి బాబూరావు

చాలీచాలని సంపాదనతో, ఉన్నదాంతోనే సర్దుకుంటూ, సంసార సాగరాన్ని ఈదుకుంటూ వస్తున్నాడు రామారావు భార్య, యిద్దరు పిల్లలు, రోగిష్ఠి తండ్రి - ఇదే అతని కుటుంబం

ఎక్కడలేనిడబ్బు ఆ ముసలాయన రోగానికి మందులూ మాకులూ కొనడానికి చాలవు పిల్లలు శ్రద్ధగా చదువుకుందామంటే ఆ తాతయ్య దగ్గు, ఆయాసం గొడవగా ఉంటాయి ఆ ముసలాయన్ని వదిలించుకుంటేగాని ఆ ఇంట్లో ఎవరికీ

సుఖం, శాంతి వుండవని పిల్లలు ఆ పిల్లల తల్లి ఉద్దేశం కాని ఇంటిపెద్ద రామారావు అభిప్రాయం ఆ ఇంటిల్లిపాడి ఉద్దేశానికి భిన్నమైంది ఎంతకష్టమైనాసరే, కన్నతండ్రిని కంటికి రెప్పలా కాపాడుకోవాలని అతని ప్రయత్నం ఇదంతా అనునిత్యం గమనిస్తున్న ఆ తాత లోలోపల కుమిలిపోతూ ఉంటాడు - తను చేయగలిగింది ఏమీలేదు గనుక!

నవనాగరకత బలిసిపోయి, మానవత్వం మరచిపోయిన ఆ మనుషుల మధ్య, పిడికెడు మెతుకులకోసం అంగలార్చటం లేదు ఆ తాతయ్య దగ్గరకొచ్చి ఆప్యాయంగా పలకరిస్తే చాలని ఆరాటపడుతున్నాడు కన్నకొడుకుమాత్రం ఆపని చేస్తున్నాడు అదే భాగ్యం!

అలాసాగిపోతున్న ఆకుటుంబంలో పులిమీద పుట్రలాగ మరో ఉపద్రవం వచ్చిపడింది తాతకు 'క్యాన్సర్' అని ఎక్స్ - రే ద్వారా బయటపడింది హాస్పిటల్లో చేర్పించడానికి పదివేలు అవసరమయ్యాయి

కూతుర్నీ మనవళ్లనీ చూచిపోదామని వచ్చిన భరత శర్మ ఇంటి పరిస్థితుల్ని తెలుసుకుని, ముందుజాగ్రత్తగా కూతురికి హిత బోధచేశాడుః [1](పుట 22) చమురు లేని వత్తి ఎంతసేపు వెలుగుతుంది" అని చప్పరించేశాడు భరత శర్మ

అతని హితోపదేశం వృధాపోలేదు రామారావు భార్య, పిల్లలు ఎదురుతిరిగారు ఊపిరి ఆడని పరిస్థితిలో భార్యపిల్లలతో రామారావు -- "సరే మీరు చెప్పిన ప్రకారం మా నాన్నకు వైద్యం చేయించడం మానుకుంటాను నేను అడిగిన ప్రశ్నకు మీరందరూ సరిఅయిన సమధానం చెప్పండి మా నాన్నకు వచ్చిన కేన్సర్ నాకు వస్తే అప్పుడు మీరు ఇదే మాట అంటారా ?

నన్నుకూడా ఇలాగే వైద్యం చేయించకుండా చంపుకుతింటారా ? చెప్పండి మీ అందరి కోరిక ప్రకారం మానాన్నకు వైద్యం చేయించకుండా చంపుకుతింటాను (136) అని సూటిగా ప్రశ్నిస్తాడు ఆ మాటలకు అందరూ తెల్లబోతారు

కథ అడ్డం తిరుగుతుంది ఎక్స్- రేకవరుమీద తాతపేరు కాకుండా తండ్రిపేరు

ఉండటం చూసి కుటుంబ సభ్యులు అదిరి పడ్డారు అతనిని కాపాడుకోడం కోసం ఎంత త్యాగం చెయ్యడానికైనా ముందుకొస్తారు

ప్రక్కగదిలోంచి ఇదంతా వింటున్న సూర్యనారాయణ (తాత) తనకోసం తనకొడుకు చేస్తున్న త్యాగానికి చలించిపోతాడు

"బాధపడకు నాన్నా! నీలాంటి కొడుకువున్నందుకు ఎంతో గర్విస్తున్నాను నాగురించి నువ్వు త్యాగం చేయడం మాత్రం నేను తట్టుకోలేను నాకోసం ఏ కొడుకు ఏ తండ్రికి చేయనంతగా చేసి నీ బాధ్యత నెరవేర్చుకున్నావు నీ బాధ్యత ఇంతచక్కగా నెరవేర్చుకున్నప్పుడు నా బాధ్యత నేను నెరవేర్చకుండా ఇలాగే వుంటే అంతకన్నా పాపం మరొకటి వుండదు ఇంకా ఎందుకు నాకోసం ఆరాటపడతావు ఏటొడ్డున చెట్టు ఏ క్షణంలో అయినా ఒరిగిపోతుంది ఒరిగిపోతున్న చెట్టుకోసం ఉన్న వాళ్లను దూరం చేసుకోకు ఒక్కసారి యిలా దగ్గరగా రా నాన్న " (పుట 40) అంటూ కొడుకును కౌగలించు కుని పుత్ర వాత్సల్యాన్ని అతనిమీద కురిపిస్తూ కొడుకు చేతుల్లో నుంచి కిందికి జారిపోతాడు తండ్రి పైనుంచి పిలుపు వచ్చింది అతనికి కరుణరస భరితమైన 'మధ్యతరగతి కథ' అన్ని తరగతుల ప్రేక్షకుల్ని కదిలించివేస్తుందనడానికి ఆవంత సందేహం లేదు స్వార్థంతో పెద్దతరాన్ని అలక్ష్యం చేసేవారికి కనువిప్పు కలిగిస్తుంది ఈ నాటిక

## క్షీరసాగర మథనం

కుటుంబంలోని పెద్ద, పూర్వాచార పరాయణుడై, వర్తమాన సమాజంతో సర్దుకుని పోలేని మనస్తత్త్వం కలవాడైతే, అతనివల్ల ఆ కుటుంబం ఎన్ని బాధలు అనుభవించవలసి వస్తుందో యం వి యస్ హరనాథరావు రచించిన 'క్షీరసాగర మథనం' అనే నాటకంలో సువ్యక్తం చేబడింది సమస్యల తాకిడికి తట్టుకోలేక కుటుంబంలోనిఅందరూ ప్రాణత్యాగం చేసుకుంటారు

సంప్రదాయకుటుంబానికి అడుగడునా ఎదురయ్యే సమస్యలను మనఃస్థైర్యంతో పరిష్కరించుకోవాలి లేదా అలా వీలుకానప్పుడు కాలంతో

రాజీపడి బ్రతకడం నేర్చుకోవాలి ఇవి రెండూ చెయ్యక ఛాందస భావాలతో కాలాన్ని ఎదిరించడం మూర్ఖత్వమే అవుతుందనీ, దాని పర్యవసానం విషాదాన్ని చవిచూడడమేనని ఈ నాటకంలో వివరించారు దారిద్ర్యం పాపం కాదు కానీ ఛాందసత్వం భయంకరమైందని వెల్లడి అవుతుంది ఈ నాటకం ద్వారా

శ్రీ హరనాధరావుగారి దర్శకత్వంలో ఒంగోలు 'అభినయ ఆర్ట్స్' సమాజంవారు ఈ నాటకాన్ని అతి మనోజ్ఞంగా పలుతావుల్లో ప్రదర్శించి రసజ్ఞుల అభిమానాన్ని చూరగొన్నారు

## శిఖరం కూలింది

అనురాగం, ఆప్యాయత, సహజీవనభావం వర్థిల్లవలసిన దంపతులమధ్య సంకుచితత్వం, అంతస్థుల తారతమ్యం,స్వార్థపరత్వం చోటుచేసుకుంటే ఆ కుటుంబంలో సుఖశాంతులు కరువౌతాయనే సత్యానికి రూపకల్పన గండవరం సుబ్బరామిరెడ్డి రాసిన'శిఖరం కూలింది' అనే నాటకం

రాజారావు ఒక సామాన్య ఉద్యోగిగా వున్నప్పుడు ఉన్నదానితో తృప్తిపడుతూ భార్య శాంతితో ఆనందంగా, హాయిగా సంసారం సాగిస్తూ ఉంటాడు కొన్నాళ్లకు అతను ఐ ఏ ఎస్ ఆఫీసర్ అవుతాడు జిల్లాఅధికారిగా పెద్ద హోదా రాగానే అతని మనఃస్థితిలో ఎన్నోమార్పులు వస్తాయి ఇన్నాళ్లు తనతో కష్టసుఖాలు పంచుకున్న భార్య తన అంతస్థుకుతగనిదిగా భావిస్తాడు ఆమె అందగత్తె కాదనీ,విద్యాగంధం లేనిదనీ, పాతకాలం పల్లెటూరు పిల్ల అనీ, అతనిలో అసంతృప్తి పెల్లుబుకుతుంది నిర్దాక్షిణ్యంగా ఈమెకు విడాకులిచ్చి విద్యావతి, రూపవతి అయిన రూపను పెళ్లిచేసుకుంటాడు ఈమె శ్రీమంతుని ఏకైకపుత్రిక ఐశ్వర్యంమధ్యగారాబంగా పెరిగింది జీవితం అనుభవించడానికేగాని ధనార్జనతో కాలం గడపడానికి కాదనుకునే తత్త్వం ఆమెది రాజారావు మన ప్రవృత్తికి ఆమె స్వభావం, నడవడికి పూర్తిగా భిన్నమైంది ఈ కారణంచేత రాజారావు రూపతో సుఖంగా కాపురం చెయ్యలేకపోతాడు అనుక్షణం అశాంతితో అల్లాడిపోతాడు చివరికి రూప

అతనితో తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోతుంది

గుడ్డిగవ్వ విలువచెయ్యదని ఆనాడు తృణప్రాయంగా వదిలివేసిన మొదటి భార్య (శాంతి) పట్టుదలతో చదువుకొని జీవితంలో ఎంతో పైకొస్తుంది ప్రసిద్ధ రచయిత్రిగా సంఘంలో పేరుప్రఖ్యాతులు ఆర్జిస్తుంది ఆమె కీర్తి ప్రతిష్ఠలను చూసి రాజారావు ఆశ్చర్యపోతాడు, ఆనందిస్తాడు గతంలో ఆమెపట్ల తాను అమానుషంగా ప్రవర్తించిన దానికి అనుక్షణం పశ్చాత్తాపంతో కుమిలిపోతూ ఉంటాడు చివరికి శాంతిని వెతుక్కొంటూ ఆమెదగ్గరకెళ్ళి పశ్చాత్తాపం వెల్లడించి మళ్ళీ తన జీవితంలోకి రమ్మని మనసారా ఆహ్వానిస్తాడు కాని శాంతి నిరాకరిస్తుంది తనకూ వ్యక్తిత్వం వుందనీ, మగవాడు పొమ్మంటే పోయి, రమ్మంటే రావడానికి స్త్రీ అతని చేతిలో కీలుబొమ్మ కాదనీ నిష్కర్షగా చెప్తుంది చేజేతులా శాంతిని పోగొట్టుకుని అశాంతిని స్వార్థంతో కౌగిలించుకున్నందుకు రాజారావు ఖిన్నుడౌతాడు అంతులేని స్వార్థంతో కన్నూ మిన్నూ కానకుండా నియంతృత్వంగా ప్రవర్తించినందుకు అది తనకు తగిన శిక్షేనని మనసును సమాధానపరచుకోవడంతో నాటకం ముగుస్తుంది ఈ నాటకం ముగింపులో శాంతిపరంగా స్త్రీవాదపుధోరణి వ్యక్తమౌతున్నా దీనిని కుటుంబవ్యవస్థను చిత్రించే నాటకం కిందే పరిగణించవలసి వస్తుంది ఎందుకంటే స్త్రీవాదం కుటుంబ వ్యవస్థను సమర్థించదు ఇక్కడా శాంతి భర్తను నిరాకరించింది స్త్రీ వాదపు ప్రాబల్యంతోకాదు, స్త్రీగా తన వ్యక్తిత్వాన్ని కాపాడుకొని ఆత్మాభిమానం నిలుపుకోవడానికి మాత్రమే!

ఈ నాటకంలో రాజారావు, శాంతి, రూప పాత్రల వ్యక్తిత్వాల వైరుధ్యాన్ని సన్నివేశాలద్వారా, మానసిక సంఘర్షణ ద్వారా రచయిత చక్కగా ఆవిష్కరించారు

కుటుంబ వ్యవస్థను చిత్రించిన నాటకాలలో కుటుంబ కలహాలు, మనస్పర్థలు, అపోహలు, అవగాహనా రాహిత్యం, కష్టాలు, కన్నీళ్ళు - ఇవే కన్పిస్తున్నాయి అంటే కుటుంబ వ్యవస్థలో అంతా శోకమే ఆవరించినట్టు స్ఫురిస్తుంది

ఈ రీతిలో నాణానికి ఒకవైపు మాత్రమే మనకు చూపిస్తున్నారు నాటకకర్తలు జీవితం సుఖదు ఖాల సమ్మేళనం కనుక ఆదర్శకుటుంబాన్నిఆనందమయంగా

సాగే కుటుంబాన్ని, సమస్యల వలయంలో చిక్కుకున్నప్పుడు కూడా సహనంతో వాటిని తొలగించుకుని లేదా భరిస్తూనే ఉన్నంతలో జీవితాన్ని నిర్విచారంగా అనుభవించే కుటుంబాన్ని గురించి రాయడంలేదు పాజిటివ్‌గా కూడా కొన్ని నాటకాలు రావలసి వుంది

అంతులేని విలాసజీవితంతో మొహంమొత్తి పాశ్చాత్యులు మన కుటుంబ వ్యవస్థను మెచ్చుకొంటూ మన వ్యవస్థకోసం అర్రులు చాస్తున్న ఈ కాలంలో కుటుంబ వ్యవస్థను మనమే పరిరక్షించుకోక పాశ్చాత్యులను అనుకరించడం శోచనీయం

ఇలా ఎన్నో మంచి నాటకాలు, నాటికలు కుటుంబ వ్యవస్థమీద వచ్చాయి ఈ సబ్జక్టుమీద వెలువడిన నాటకాలలో అత్యధిక భాగం ఉన్నత ప్రమాణాలు కలవిగా ఉండటం గుర్తించవలసిన విషయం

పెడత్రోవ పడుతున్నయువతకుమంచిమార్గం చూపడానికి వారిలో మానసిక పరివర్తన కలిగించడానికి ఈ దశాబ్దిలో (1980-90) వెలువడిన నాటక సాహిత్యం దోహదకారి అయింది - ఈ దిశలో మరికొన్ని ఉత్తమ నాటకాలను మనం ఆశించవచ్చు

# నాలుగవ ప్రకరణం
# ఆధునిక నాటకం : స్త్రీ వాదం
# స్త్రీ సమస్యాత్మక నాటకాలు

ఈ దశాబ్దంలో స్త్రీలసమస్యలు నాటకరంగంలో అత్యధిక ప్రాధాన్యాన్ని సంతరించుకొని, కేంద్రబిందువు కావటం గమనించదగిన పరిణామం అంటే, ఒక సుప్రభాతవేళ ఈ మార్పు హరాత్తుగా వచ్చిపడిందనీ, ఆ గాలివాటంలో నాటకకర్తలు ఉన్నట్టుండి మేలుకొని కొత్తగళం విప్పారనీ అర్థం కాదు పరిణామక్రమంలో ఇది ఒక ముఖ్యమైన భాగం మాత్రమే

స్త్రీ జనాభ్యుదయం పట్ల రచయితలలో ఆసక్తి పెరిగింది నిశిత పరిశీలన సాగుతుంది నేటి రచయితలు సామాజిక పరిస్థితులకు, అవసరాలకు స్పందించి 'స్త్రీల కౌటుంబిక సామాజిక స్థితిగతుల గురించి ప్రచారంలోకి వస్తున్న నూతన భావజాల ప్రభావంతో స్త్రీల జీవితాన్ని ఇంతకుముందు కంటే భిన్నంగా చూడగల కొత్తచూపును అలవరచుకొని'[1] నిర్మాణాత్మకంగా రచనలు సాగిస్తున్నారు స్త్రీలను మానవవ్యక్తులుగా ఎదగనీయని సంస్కృతిపట్ల అసహనాన్ని, అసంతృప్తినీ, ఆక్రోశాన్ని ప్రకటించటమే కాక స్త్రీల వ్యక్తిత్వ వికాసానికి అడుగడుగునా అడ్డు తగిలే అవరోధాలను తొలగించటానికి మార్గాలు అన్వేషిస్తున్నారు ఇది శుభపరిణామం

స్త్రీ కొన్ని సామాజిక ఆంక్షలు, కట్టుబాట్లు నడుమ, సంప్రదాయం అనే సంకెళ్ళతో, నిర్ణీత పరిధుల మధ్య సంచరించవలసిన దుస్థితిని ఎదుర్కోవడానికి తగిన మానసిక ధైర్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని, తెగువను ప్రదర్శించటానికి అనువైన పరిస్థితుల్ని, వాతావరణాన్ని సృష్టించటానికి తహతహ లాడుతున్నారు నేటి రచయితలు

ఒక అర్ధ శతాబ్దంగా కవిత, కథ, నవల వంటి సాహిత్య ప్రక్రియల్లో స్త్రీ జీవితం అభివ్యక్తమౌతున్నంత బలంగా, ముమ్మరంగా నాటక ప్రక్రియలో ఆవిష్కృతం కాకపోయినా, కొంతవరకు స్త్రీ జీవితాన్ని గురించి ఆలోచన, ఆర్తి బీజప్రాయంగా

నాటక రచయితల మస్తిష్కంలో మెదులుతూనే ఉందనేది విస్మరించలేని చారిత్రక సత్యం నేటి ప్రగతికి ఆధారభూతమైన పరిస్థితుల నేపథ్యాన్ని గూర్చి, స్త్రీ జనాభ్యుదయం కోసం గతంలో చేసిన ప్రయత్నాల సాఫల్యాల వైనాన్ని వివరించడం ఎంతో అవసరం

## పూర్వరంగం: కందుకూరి, గురజాడల సేవలు.

ఎక్కడ స్త్రీలు పూజింపబడతారో అక్కడ దేవతలు నివసిస్తారని ఆర్యోక్తి అలాగే 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హసి' అని కూడా పెద్దలే అన్నారు నిజానికి ఈ రెండు సూక్తుల వైరుధ్యంలోపడి నలిగిపోయింది స్త్రీజీవితం పచ్చి సాంప్రదాయవాదుల ఆదేశం ప్రకారం - స్త్రీ జీవిత పరమావధి తన భర్త, తన పిల్లలు, తన కుటుంబ పరిరక్షణకే పరిమితమైంది అంతకుమించి ఒక్క మెట్టు పైకి పోయినా కిందకి దిగినా ఆ చర్య సంఘానికి దుస్సహం అవుతుందనీ, ధర్మచ్యుతి సంభవిస్తుందనీ సనాతన వాదుల భయం ఆ భయాల నీడల్లో, అజ్ఞానమనే కంచుకోటలో తరతరాలుగా మగ్గిపోతున్న స్త్రీ మూర్తి దయనీయ స్థితికి పరాకాష్ఠ 'సతీసహగమనం' అనే దురాచారం పురాణయుగం నుంచి విశృంఖలంగా సాగుతున్న ఈ దౌష్ట్యాన్ని అరికట్టి, పునాదులతోసహా పెకలించిన ధీరుడు, మహామనీషి రాజారాం మోహనరాయ్ అలాగే సాంఘిక దురాచారాల కబంధహస్తాలనుంచి స్త్రీని విముక్తురాలిని చేయటానికి అహర్నిశలు సేవచేసిన మహాపురుషుడు ఈశ్వరచంద్ర విద్యాసాగరులు వీరిద్దరినీ ఆదర్శంగా తీసుకుని సాంఘిక అభ్యుదయంకోసం - ముఖ్యంగా స్త్రీ జనాభ్యుదయంకోసం తన జీవితాన్ని హారతి కర్పూరంలా వెచ్చించిన కారణజన్ముడు, యుగకర్త కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848 - 1919)

పందొమ్మిదో శతాబ్దంలో బ్రహ్మజెముడులా అల్లుకుపోయి సంఘాన్ని పట్టిపీడిస్తున్న బాల్య వివాహం, వృద్ధవివాహం, కన్యాశుల్కం వంటి దురాచారాలు, మూఢ విశ్వాసాలు, కాలదోషం పట్టిన సంప్రదాయాల మూర్ఖత్వాన్ని చూసి కలతచెందిన కందుకూరి, వాటిని నిర్మూలించడానికి కంకణం కట్టుకున్నాడు

సంఘసంస్కరణ కోసం సమరశంఖం పూరించి, జీవిత పర్యంతమూ తన ఆశయసాధనకోసం అహోరాత్రులూ శ్రమించిన కర్మయోగి కందుకూరి

స్త్రీ పునర్వివాహాన్ని ఒక ఉద్యమంగా చేపట్టి, స్వయంగా కార్యరంగంలోకి దూకి వితంతువుల కన్నీళ్ళు తుడిచాడు "1881 వ సంవత్సరము డిసెంబరు నెల 11వ తేదీ రాత్రి రాజమహేంద్రవరములో మొదటి స్త్రీ పునర్వివాహము జరిగినది' 2' ఇది ఆంధ్రుల సాంఘిక చరిత్రలో చిరస్మరణీయమైన సువర్ణఘట్టం

స్త్రీ పునర్వివాహాన్ని ఆనాటి సనాతనవాదులు ఎంత ప్రతిఘటించినా, ఎన్ని అవరోధాలు కల్పించినా, వేదం వెంకటరాయశాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం, ధర్మవరం రామకృష్ణమాచార్యులు వంటి మేధావులు తిరస్కరించినా, పీఠాధిపతులు కుల బహిష్కరణ పత్రాలతో బెదిరించినా చలించక తాననుకొన్న మార్గంలో సూటిగా సాగిపోతూ సంఘసంస్కరణోద్యమానికి జీవనాడిగా భాసించారు

స్త్రీలు ఎదుర్కొంటున్న అనేక సమస్యలకు మూలకారణం అవిద్య, అజ్ఞానమే అనీ, వారి సమస్యలకు శాశ్వత పరిష్కారం లభించాలంటే వారిని చైతన్యవంతులుగా మార్చగల సాధనం విద్యేనని గ్రహించిన కందుకూరి, స్త్రీ విద్యకు తన కృషిలో అత్యధిక ప్రాధాన్యమిచ్చారు 1911 లో వ్రాసుకున్న తమ స్వీయ చరిత్రలో స్త్రీ విద్యను గురించి ఇలా అన్నారు

"నాకు స్త్రీ విద్యయందును స్త్రీల వృద్ధియందును విశేషాభిమానము స్త్రీల దురవస్థకు బలుమారు పరితపించి వారి దుస్థితిని తొలగింప బ్రయత్నింపవలయు ననియు, స్త్రీలను ప్రస్తుత స్థితిలోనే యుంచి తాము పైకి లేచుట పురుషులకెన్నడునూ సాధ్యము కాదనియూ, తాము బాగుపడవలెనన్నచో వారినిగూడ విద్యావివేకాదుల యందు మంచి స్థితిలోనికి దెచ్చివారితో గలిసి యున్నతపదవికి తేవలయుననియు, తాము మాత్రమే వృద్ధినొంది వారిని నిజమైన మైత్రి కనర్హమైన దాస్యమునందే యుంచదలచిన పక్షమున దెలియకయే, దినదిన క్రమమున తామున్నత పథము నారోహించుచు వచ్చుటకు మాఱుగా నొక్కొక్క మెట్టు దిగుచు వచ్చి కడపటవారితో గూడ నడుగంటుట

యనివార్యమనియు, నేను దలంచుచుండెడి వాడను "[3] అంటూ స్త్రీ విద్యను ప్రోత్సాహించని మగవారిపై చురక వేశారు స్త్రీల విద్యావ్యాప్తి కోసం గ్రామస్థులను ప్రోత్సాహించి ఇన్నీసుపేటలోను, ధవళేశ్వరంలోను బాలికా పారశాలలను నెలకొల్పారు. వారికి అర్థమయ్యే సులభశైలిలో పుస్తకాలు వ్రాసి ప్రచురించారు 1883 లో స్త్రీల కొఱకు 'సతీహితబోధిని' అనే పేరుతో ఒక మాసపత్రికను నడిపారు స్త్రీల సమస్యలమీద ఆంధ్రదేశంలో పలు ప్రాంతాలు తిరిగి ఉపన్యాసాలిచ్చారు స్త్రీ పునర్వివాహంపై లెక్కలేనన్ని వ్యాసాలు ప్రకటించారు 1880 లో వ్రాసిన 'వివేక దీపిక' అనే స్వతంత్ర రూపకంలో స్త్రీ పునర్వివాహ విషయమై చర్చ సంభాషణా పూర్వకంగా ప్రతిపాదించారు [4] సంఘశ్రేయస్సుకోసం ప్రబోధాత్మకమైన ప్రహసనాలు సుమారు ఎనభైదాకా రచించారు

వీరేశలింగంగారి కాలంలో సంపన్నులు, విద్యాధికులు, ఉన్నతోద్యోగులు వేశ్యా సంపర్కం అనే వ్యసనానికి బానిసలై ఉండేవారు వారకాంతా వల్లభులై ఉండటం ఒక సాంఘిక హోదా (స్టేటస్-సింబల్)గా పరిగణించేవారు దానికి సమాజం కూడా ఆమోదముద్ర వేసినట్లే మిన్నకుండా ఉండేది ఆ పరిస్థితిని చూసి వీరేశలింగంగారు భరించలేకపోయారు పడుపువృత్తిని ఖండిస్తూ కొన్ని ప్రహసనాలు రచించారు

స్త్రీల దృష్టికోణం నుంచి అన్ని సమస్యలను పరిశీలించి స్త్రీ జనబాంధవుడుగా, సంఘసంస్కర్తగా మానవీయ విలువలకు పట్టం కట్టిన మహనీయుడుగా ఆంధ్రదేశానికి అసాధ్యమైన సేవచేసిన వీరేశలింగంగారికి నారీలోకం తీర్చలేనంతగా ఋణపడి ఉందనటం అతిశయోక్తి కాదు మధునాపంతులవారు పేర్కొన్నట్లు - "వీరేశలింగం పంతులు వంటి దీక్షాపరుడు, కర్మశూరుడు, ధైర్యవంతుడు, కార్యదక్షుడు, స్వార్థత్యాగి, స్వతంత్రుడు ఆంధ్ర మహారచయితలలో దుర్లభుడు"[5]

# కన్యాశుల్కం అవతరణ

గురజాడ అప్పారావుగారి (1861 - 1915) కలం నుంచి ఊపిరి పోసుకున్న అసలు సిసలైన ఆధునిక సాంఘిక నాటకం 'కన్యాశుల్కం' 1892 లో తొలిసారిగ వెలుగుచూసింది మొదటి ప్రదర్శన కూడా ఆ సంవత్సరములోనే దరిమిలా ఎన్నో చేర్పులు, మార్పులతో సంస్కరించబడి 1897 నాటికి ఒక కొత్త రూపాన్ని ధరించింది శతజయంతి పండుగ చేసుకున్న ఈ కళాఖండం ఆంధ్రనాటక రంగంలో ఒక అపురూప దృశ్యకావ్యంగా అమరత్వాన్ని పొందింది

'కన్యాశుల్కం' నాటకంలో చిత్రితమైన సమస్య - ఆనాటి సమాజంలో వ్యాప్తిలో ఉన్న 'కన్యాశుల్కం' అనే దురాచారమే అయినా, నాటకం పేరునుబట్టి నాటక లక్ష్యం కన్యాశుల్కాన్ని నిరసించటమే అయినా, నిజానికి ఆ నాటకంలో ప్రధానంగా దోత్యకమయ్యేవి స్త్రీ సమస్యలే! ఒక్కొక్క స్త్రీ సమస్యకు ఒక్కో సజీవ పాత్రను సృష్టించి సమస్యలు మనసును తాకేటట్లు హృద్యంగా చెప్పారు గురజాడ

ఉదాహరణకు - అగ్నిహోత్రావధానుల భార్య (వెంకమ్మ) ను తీసుకుందాం పందొమ్మిదో శతాబ్దంలో మధ్యతరగతి గృహిణుల నిస్సహాయ స్థితికి ఆమె ప్రతినిధి విద్యాగంధంలేని, లోకరీతులు తెలియని అమాయకురాలు ఆమె మాట గుడ్డి గవ్వ విలువ చెయ్యదు ఆ ఇంట్లో తన ఇష్ట ప్రకారం ఏదీ జరగదు చండశాసనుడైన అగ్నిహోత్రావధానులు చెప్పిందే వేదం ఆమెకు సొంతంగా కొన్ని ఆశలు, అభిప్రాయాలు ఉండటానికి వీల్లేదు వండి వార్చడానికి, ఇల్లు చక్కదిద్దుకోవడానికే ఆమె పుట్టింది చచ్చేవరకు ఆమె జీవన విధానంలో మార్పుండదు ప్రాణమున్న రాయిలా బతికే వెంకమ్మ పాత్ర ఆనాటి సమాజంలో జీవచ్ఛవాలుగా బతుకీడ్చే లక్షలాది సగటు గృహిణులకు ప్రతీక పితృస్వామ్య వ్యవస్థలో స్త్రీలు చైతన్యవంతులుగా పరివర్తన చెందకపోతే స్త్రీల సమస్యలకు విముక్తి లేదనే ప్రచ్ఛన్న స్వరం వినిపిస్తుంది వెంకమ్మ పాత్రలో

కన్యాశుల్కం పేరుకి ప్రాతినిధ్యం వహించేది సుబ్బులు పాత్ర నాటకంలో

వివిధ సన్నివేశాల్ని అనుసంధానం చేసే ఈ పాత్ర వినిపించడమే గాని ఎక్కడా కనిపించదు కన్యాశుల్కం మీద ఆశతో ముక్కుపచ్చలారని సుబ్బుల్ని సంతలో పశువును విక్రయించే తీరులో లుబ్ధావధానులనే వృద్ధుడికి కట్టబెట్టాలని అగ్నిహోత్రావధానులు సంసిద్ధుడు కావటం అతనిలోని మూర్ఖత్వాన్ని, పైశాచిక ప్రవృత్తిని ఎండగడుతుంది వృద్ధవివాహాలకు సిద్ధమయ్యే పెద్దల్ని తలచుకొంటే అంతరాత్మలు చచ్చిపోయిన కుళ్ళిన శవాలా వీళ్ళు అనిపించక మానదు

ఆనాటి సమాజంలో బాల వితంతువుల దీన స్థితిని ప్రతిబింబించే పాత్ర బుచ్చమ్మ వేకువజామున నిద్రలేచింది మొదలు అర్ధరాత్రి వరకు ఆ ఇంటి చాకిరి చెయ్యడానికే ఆమె జీవితం అంకితమైపోయింది ఆమె సుఖదు ఖాలను గురించి పట్టించుకునే వాళ్ళే లేరు తల్లిదండ్రులున్నపుడు అంతంతమాత్రంగా వున్న ఆమె బ్రతుకు, వాళ్ళు పోయాక ఎంత దుర్భరమవుతుందో! చక్రనేమి క్రమంగా మళ్ళీ తన తమ్ముడి పంచన అరవ చాకిరీ చేస్తూ పడుండవలసిందే కదా? ఇంకా మూడు వంతుల జీవితాన్ని కొనసాగించాల్సిన ఆమె బ్రతుకు, ఎండిన మ్రోడై, అంధకారంలో కొట్టుమిట్టాడవలసిందేనా? - ఈ ప్రశ్నలు సమాజంపై వేసి మనుషుల్లో మానవత్వం రగుల్కొల్పాలని గురజాడ ఆశించారు

అటువంటిదే మీనాక్షి పాత్ర లుబ్ధావధానులు కూతురు తలచెడి ఇంటికి చేరింది, ఆమె ఆలనా పాలనా తండ్రికి పట్టదు ఇంటిపనులు చేస్తూ వేళకు ఇంత తిని కాలం వెళ్లబుచ్చడమే ఆమె చెయ్యవలసిన పని అంతకుమించి ఆమె ఇంకేమీ ఆశించడానికి వీల్లేదు అది ఆమె పూర్వజన్మలో చేసుకున్న కర్మఫలితం అనుభవించక తప్పదు అంటాడు లుబ్ధావధానులు కాని ఉప్పుకారం తింటున్న యౌవనవతికి భౌతిక వాంఛలుండవా? ఆ కారణంచేతనే అందుబాటులో ఉన్న రామప్పంతులు వైపు మీనాక్షి మొగ్గు చూపింది ఇది ఆమె తప్పుకాదు ఆమెను ఆ స్థితికి నెట్టివేసిన సాంఘిక సంప్రదాయాల ప్రాబల్యమే తప్ప మరేమీ కాదు ఇలాంటి పరిస్థితుల్ని నివారించాలంటే మీనాక్షి వంటి వితంతువులకు పునర్వివాహం చేయడం ఒక్కటే మంచిమార్గమనీ, అదే కుటుంబ ప్రతిష్ఠను కాపాడుతుందనే

సందేశాన్ని ధ్వనిమాత్రంగా అందించారు గురజాడవారు మీనాక్షి పాత్రద్వారా

'కన్యాశుల్కం' లో అత్యంత ప్రాముఖ్యం గల స్త్రీ పాత్ర మధురవాణిది మధురవాణి అంటేనే తియ్యటిమాట అని అర్థం తియ్యగా మాట్టాడటం వృత్తిరీత్యా ఆమెకు అవసరమైన లక్షణమే అయినా, తియ్యగా మాట్లాడి మనుషుల్ని బోల్తా కొట్టించి, తనపబ్బం గడుపుకునే తత్త్వం కాదామెది తీయని మనసున్న మగువ మంచి మాటలతో ఎదుటి మనిషికి తోడ్పడాలన్న తపన ఆమెకు జన్మత వచ్చింది శాపవశాన ఈ భూమ్మీదికి వచ్చిన దేవకన్య అని ఆమె ప్రవర్తన రుజువు చేస్తుంది వృత్తిరీత్యా ఆమె వేశ్య అయినా ఆమెలో సంస్కారం ఉంటుంది నీతినియమాలున్నాయి స్త్రీగా తనకొక వ్యక్తిత్వం ఉంది కనుకనే తన వ్యక్తిత్వాన్ని కించపరిచే ఎవర్నీ ఆమె సహించదు నిశితంగా, నిర్భయంగా మాట్లాడే స్వభావం కలది నాటకకర్త మధురవాణి పాత్రను సృష్టించడంలో గల అంతరార్థం వేశ్యావృత్తి మూలంగా సంఘానికి కలిగే నష్టాన్ని గూర్చి తెలియచెప్పడానికి కాదు ఆ పాత్రను కేంద్రబిందువుగా చేసి ఆమె చేత కొన్ని మంచిపనులు చేయించడానికే సుబ్బి పెళ్లి లుబ్ధావధానులతో తప్పించటానికి కరటకశాస్త్రి చేసే ప్రయత్నాలకు మధురవాణి సహకారం అందించకపోతే ఆ ఘోరం తప్పిపోయేది కాదు రామప్ప పంతులు జుట్టు తన చేతిలో ఉంది కనుక మీనాక్షిని రక్షించగలిగింది పూటకూళ్లమ్మ భూతాన్ని చూపి, గిరీశాన్ని ఆ ఛాయలకు రాకుండా చేసింది గిరీశం చేతిలో మోసపోకుండా బుచ్చమ్మను కాపాడటంలో కూడా తన వంతు పాత్రను నిర్వహించింది

ఇలా ఎన్నోవిధాల ఎందరికో స్నేహహస్తం అందించగలిగిన మధురవాణి తన జీవితంలోకి ఎన్నడూ తొంగి చూడకపోవడం ఆశ్చర్యం తన భవిష్యత్తు గురించి కించిత్తయినా ఆందోళన పడదు సంఘంలోని గౌరవ మర్యాదలకు నోచుకోని తన బతుకు గురించి ఆవేదన చెందినట్టూ, తన మనుగడలోని అస్థిరత్వాన్ని తనకు తెలియకుండా తనను కబళిస్తున్న నైరాశ్యాన్ని గూర్చి ఎన్నడూ ఆలోచించినట్టూ కనబడదు మధురవాణి ఎదుర్కొంటున్న ఈ సమస్యల్ని

స్పృశించకుండా గురజాడవారు మధురవాణికే ఎందుకు వదిలివేశారో ఊహకందదు

కన్యాశుల్కం నాటకంలో స్త్రీలు ఎదుర్కొనే సమస్యల తీవ్రతను సంఘానికి చూపించారేగాని, స్త్రీ పాత్రలకు ఒకముగింపు కానీ వారిద్వారా ప్రతిపాదించిన సమస్యలకు ఒక పరిష్కారం కానీ సూచించలేదు నాటకకర్త

స్త్రీ సమస్యాత్మక సాంఘిక నాటకాలకు 1920 ప్రాంతాలతోనే శ్రీకారం చుట్టిన ఘనత కాళ్లకూరినారాయణరావు (1871 - 1927) గారికి దక్కుతుంది దీనికి 'వరవిక్రయం', 'చింతామణి' నాటకాలే ప్రబల నిదర్శనాలు నవీన భావాలను, సంస్కరణ వాదాన్ని సంప్రదాయ పద్ధతిలో జోడించి, అటు సంప్రదాయవాదులను ఇటు అభ్యుదయవాదులను తృప్తిపరిచే రీతిలో నాటకాలు వ్రాసి పండిత పామరులను ఆకర్షించిన నాటకరచయిత కాళ్లకూరి 'చింతామణి' లో వేశ్యావృత్తి నిర్మూలనం ఇతివృత్తంకాగా, 'వరవిక్రయం' లో వరకట్నాలనే దురాచారం వల్ల కన్యలు, వారి తల్లిదండ్రులు బాధలు పడటం ఇతివృత్తం

వేశ్యావృత్తిని విసర్జించాలని స్త్రీలకు, వేశ్యా సంపర్కానికి దూరంగా వుండాలని శృంగార పురుషులకు నీతిచెప్పాలన్న లక్ష్యం చింతామణి నాటకంలో ఉన్నా, మంచిని స్థాపించటానికై చెడును భూతద్దంలో పెట్టి చూపడం జరిగింది మంచికన్నా చెడు ప్రభావం మనుషులపైన బలంగా ఉంటుంది కదా! ఆ దృష్టితో చూసినపుడు నాటకకర్త ఆశించిన గమ్యాన్ని 'చింతామణి' చేరుకోలేదేమో అనిపిస్తుంది

కన్యాశుల్కం అనే దురాచారం కాలక్రమేణా వరకట్నంగా పరివర్తన చెందిన తర్వాత ఆ సమస్యమీద మొదటిసారిగ నాటకం వ్రాసినవారు కాళ్లకూరి నారాయణరావుగారే

## వర విక్రయం

'వరవిక్రయం' వస్తుపరంగా తీసుకున్నప్పుడు సమస్య వరకట్నమే అయినా, ఈనాటకంలో అంతర్గతంగా ఉన్న మౌలిక సమస్య స్త్రీ సమస్య కట్నం కోసం మగపెళ్లివారు వేధించటం, హిరణ్యాక్షవరాలు కోరటం, ఆడపిల్లలను కన్నవారు

కట్నాలిచ్చుకోలేక అగచాట్లు పడటం- ఇవి బాహ్యంగా కనిపించే దృశ్యాలు. వాస్తవానికి ఈ సమస్యలన్నింటికీ మూలం స్త్రీ ఆర్థిక పునాదులు లేని స్త్రీ విషయంలో సంఘం కర్కశంగా ప్రవర్తించటం, ఆచారం పేరిట, సంప్రదాయం పేరిట ఆడపిల్లల స్వాతంత్ర్యాన్ని హరించటం, నోరునొక్కటం, వ్యక్తిత్వాన్ని గుర్తించకపోవటంవల్ల జరిగే అనర్థాలకు స్త్రీ జీవితం బలి అయిపోతున్నది కనుక వరవిక్రయం ప్రధానంగా స్త్రీ సమస్యాత్మక నాటకం అని చెప్పాలి అందుకే ఈ నాటకంలో స్త్రీ పాత్రల ప్రమేయం ఎక్కువ

వరవిక్రయంలో కాళింది పాత్ర ఆయువుపట్టు కట్నంకోరని సంస్కారవంతుడైన వరుణ్ణి పెళ్లి చేసుకోవాలని ఆశిస్తుంది అలాంటి పురుషుడు దొరకడం గగనకుసుమం అని తెలుసుకున్న తల్లిదండ్రులు సింగరాజు లింగరాజుగారి దత్తపుత్రుడు బసవరాజుతో పెళ్లి సంబంధం ఖాయం చేస్తారు తన ఆశయాలకు భిన్నంగా కట్నం ఇచ్చి పెళ్లి చేయబోతున్నారని తెలుసుకున్న కాళింది ఆ ప్రయత్నం నుంచి విరమింపచేయడానికి తల్లిదండ్రులతో మొరపెట్టుకొంటుంది తల్లిదండ్రులు ఇష్టపడని కారణంగా ఆర్థికంగా వాళ్లని కష్టాలపాలు చేయటం ఇష్టంలేక ఆత్మహత్య చేసుకొంటుంది కాళింది

కాళింది చెల్లెలు కమల బసవరాజునుపెళ్లిచేసుకొని లింగరాజును కోర్టుకీడ్చి, ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగిస్తుంది లింగరాజులో మన పరివర్తన కలిగించడంలో కృతకృత్యురాలవుతుంది చింతామణి నాటకంవలె కాకుండా వరవిక్రయంలో పాజిటివ్ ఎలిమెంట్ కన్పిస్తుంది వరకట్నం సమస్యకు తగిన న్యాయం జరిగింది ఈ నాటకంలో కానీ విచిత్రమేమిటంటే ప్రదర్శనాపరంగా 'చింతామణి' పొందిన ప్రజాదరణను ఘనవిజయాన్ని 'వరవిక్రయం' సాధించలేకపోయింది ప్రజల స్మృతిపథం నుంచి 'వరవిక్రయం' తొలగి పోతూవుంది 'చింతామణి' నేటికీ సజీవ నాటకంగా నిలిచి ప్రజల మన్నన పొందుతూనే ఉంది

ముప్పయ్యో దశకంలో స్త్రీల సమస్యలమీద చెప్పుకోదగిన నాటకాలు రాలేదు

నలభైయవ దశకంలో బళ్లారి రాఘవగారి 'సరిపడని సంగతులు' నాటకం వచ్చింది ఆ నాటకంలో విధవా వివాహం కధావస్తువు సంఘసంస్కరణకు పూర్వాచార పరాయణులు కల్పించె అడ్డంకులను దృష్టికి తెస్తూ, ఆదర్శయువకులు ఆ అవరోధాలను ఎలా ఎదుర్కోవాలో సూచించారు

రాజమన్నార్ నాటిక 'దయ్యాల లంక' లో స్త్రీకి స్త్రీయే శత్రువైనట్లుగా, వైధవ్యంతో కృంగిపోతున్న స్త్రీని - స్త్రీలే ఎలా మానసికంగా హింసిస్తారో వివరించారు ఇది శ్రవ్య నాటికల కోవకు చెందిన నాటిక పుట్టింట్లోనూ, మెట్టినింట్లోనూ సుఖానికి నోచుకోని ఒక అబల దయనీయ జీవితానికి దర్పణం నార్ల వెంకటేశ్వరరావుగారి నాటిక 'ప్రారబ్ధం'

1950 - 80 సంవత్సరాల మధ్య, స్త్రీసమస్యల మీద చాలా మంచి నాటకాలు, నాటికలు వెలువడినాయి కొప్పరపు సుబ్బారావు, ఆచార్య ఆత్రేయ, బెల్లంకొండ రామదాసు, అవసరాల సూర్యారావు, గన్నిశెట్టి వెంకటేశ్వరరావు, రమణారెడ్డి-వేణు, వేలూరి శివరామశాస్త్రి, కప్పగంతుల మల్లికార్జునరావు వంటి నిష్ణాతులు రాసిన నాటక, నాటికలు ఆంధ్రనాటక రంగాన్ని సుసంపన్నం చేశాయి

## ఇనుప తెరలు

కొప్పరపు సుబ్బారావుగారు (1890 - 1959) రచించిన 'ఇనుప తెరలు' నాటకం, జె బి ప్రీస్ట్లీ రచించిన 'ఏన్ ఇనస్పెక్టర్ కాల్స్' అనే నాటకానికి అనుసరణ అయినప్పటికీ, రచనా శిల్పాన్నిబట్టి చూస్తే, పూర్తిగా స్వతంత్రనాటకం అనిపిస్తుంది

స్వార్థంతో కరడుగట్టుకు పోయిన ఈ సంఘంలో అనాథలు పడుతున్న కష్టాలు, కార్చే కన్నీళ్లు, ఒక అబల జీవితం పతనమైపోవటానికి తామే కారకులు అని తెలిసి కూడ పశ్చాత్తాపపడి, ఒకకన్నీటి బొట్టయినా రాల్చని నరరూప రాక్షసుల మనస్తత్త్వం ఈ నాటకంలో శక్తిమంతంగా చిత్రించడమైంది

"అసంఖ్యాకులైన అనాథలపై ఆర్థిక, సాంఘిక, నైతిక రంగాలలో దోపిడిదార్ల

నియంతృత్వానికి వ్యతిరేకంగా మానవాళి అంతరాత్మ ఏక కంఠంతో వ్యక్తపరచిన నిరసనకు ప్రతీక ఈ నాటకం "[6]

అడుగడుగునా అన్యాయానికి గురి అయిన కరుణకుమారి చుట్టూ ఈ నాటకంలో పాత్రలన్నీ కేంద్రీకృతమై వుంటాయి కాని కథానాయిక రంగస్థలం మీదికి రాదు అయినా ప్రతిక్షణం పారిషదుల మనోనేత్రాల ముందు కదలాడుతూ అపార సానుభూతిని దోచుకుంటుంది ఇది అసమానమైన రచనా శిల్పానికి అద్దం పట్టే విశిష్టాంశం

'ఇనుప తెరలు' నాటకంలో సంఘటనలు తక్కువ, సంభాషణలు ఎక్కువ కావడం చేత సమర్థులైన నటులు లేకపోతే ఈ నాటక ప్రదర్శనం పూర్తిగా రక్తి కట్టకపోయే ప్రమాదం వుంది

కొప్పరపు సుబ్బారావుగారి దర్శకత్వంలో ఈ నాటకం 1950 సం లో కాకినాడలో జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్తు నాటక పోటీలలో ప్రదర్శించబడి బహుమతి పొందింది ఒక దశాబ్దం పాటు ఈ నాటకం పలు తావుల్లో ప్రదర్శించబడి విజయభేరి మ్రోగించింది

ప్రీస్ట్లీ నాటకాన్నిచిన్నదిగా కుదించి, అన్నీ స్త్రీ పాత్రలతో ఆచార్య ఆత్రేయగారు 'చావకూడదు' అనే పేరుతో ఒక నాటిక వ్రాశారు గుడివాడ శ్రీ ప్రభాకర నాట్యమండలి వారిచే పామర్తి సుబ్బారావుగారి దర్శకత్వంలో ఈ నాటిక విస్తృతంగా ప్రదర్శించబడింది

కొన్ని పరిస్థితుల ప్రభావంతో అవినీతి ఊబిలోంచి బయటకు రాలేక క్రుంగిపోతున్న పతితల బాధామయ జీవితాలను చిత్రిస్తూ నిర్మాణాత్మకమైన నాటకాలు, నాటికలు ఈ కాలంలో కొన్ని వెలుగు చూశాయి వాటిలో బెల్లంకొండ రామదాసుగారి 'పునర్జన్మ' అగ్రశ్రేణికి చెందింది ర స న సమాఖ్య, విజయవాడ వారిచే కె వెంకటేశ్వరరావుగారి దర్శకత్వంలో ఈ నాటకం జనరంజకంగా ప్రదర్శించబడి ప్రజాదరణ చూరగొన్నది కప్పగంతుల మల్లికార్జునరావు గారి

'సాలెగూడు' గ్రిద్దలూరు గోపాలరావుగారి 'స్త్రీ'వేశ్యా సమస్యలతో ప్రమేయం ఉన్న ప్రయోజనాత్మకమైన చక్కని నాటికలు

## రాజీవం

అరవయ్యో దశాబ్దిలో వచ్చిన నాటికలలో కె వి రమణారెడ్డి - వేణుగార్లు రచించిన 'రాజీవం' అగ్రశ్రేణికి చెందింది నిండు యౌవనంతో అప్పుడే వికసించి అనాఘ్రాత పుష్పంలా వున్న ఒక మూగపిల్ల (రాజీ)ను, ఆమె నిస్సహాయ స్థితిని ఆసరా చేసుకుని పెడత్రోవ పట్టించి, ఆమె అందాన్ని కొల్లగొడతారు కొందరు ధూర్తులు ఆమె యౌవనాన్ని హరించిన వాళ్లలో రోడ్‌సైడ్ రోమియోలేకాదు, ఘరానా రాజకీయ నాయకులు, పెద్ద మనుషులుగాచెలామణి అయ్యేవారు వున్నారు జరుగుతున్న దౌష్ట్యాన్ని చూస్తూ కూడా నోరు మెదపదు సమాజం చెప్పుకోవడానికి నోరు లేదు చెప్పుకుందామన్నా వినే నాథుడు లేడు రోజు రోజుకీ ఆరోగ్యం క్షీణించిపోతోంది జవసత్త్వాలు ఉడిగిపోయి రోగగ్రస్తురాలవుతుంది ఈగలు ముసురుకొంటున్న కాయంతో, రోడ్డు పక్కన చెట్టు నీడన దిక్కులేకుండా పడివుంటుంది ఈమె జీవితం అలా ఘోర నరకంలో పడిపోవడానికి, ఆ దీనావస్థకు బాధ్యులైనవారు ఆమె వైపు కన్నెత్తయినా చూడరు అసహ్యంచుకొంటూ ప్రక్కకు తప్పుకుపోతుంటారు మనిషి రూపంలో దానవత్వం వేసిన విషపుకాటు ఫలితంగా ఆమె జీవితం చిత్రహింసల పాలయింది నేరం ఒకరిదైతే, శిక్ష అనుభవించేది ఇంకొకరా? ఈ సమస్యను పరిష్కరించేదెవరు? మానవత్వం కళ్లు విప్పేదెప్పుడు? అని సభ్య ప్రపంచంమీదికి ప్రశ్నల వర్షం కురిపిస్తుందీ నాటిక కావ్యార్థాన్ని కమనీయ సన్నివేశాల ద్వారా, శక్తిమంతమైన సంభాషణల ద్వారా ద్యోతకం చెయ్యడంలో రచయితలు కృతకృత్యులయ్యారు ఈ నాటికను డా వేణు దర్శకత్వంలో వెంకటగిరి కల్చరల్ ఆర్ట్స్ అసోసియేషన్ వారు వందలాది ప్రదర్శనలిచ్చారు

# సుల్తానీ

శ్రీ వేలూరి శివరామశాస్త్రి రచించిన 'సుల్తానీ', నాటిక, నాటక రంగానికి వారిచ్చిన ఒక అపురూప కానుక

నిరక్షరాస్యులుగా వుంటూ, కటిక దారిద్ర్యంతో, తమ కాళ్లమీద నిలబడలేని దైన్యావస్థలో స్త్రీలు నేటి సమాజంలో పడుతున్న కష్టాలను 'సుల్తానీ' నాటికలో హృదయంగమంగా చిత్రించారు రచయిత తెలంగాణా మాండలికంలో వున్న సంభాషణలు ఈ నాటికకు మరింత సహజత్వాన్ని సంతరించిపెట్టాయి బాధాసర్పదష్టుల బ్రతుకు బాటలో గతుకులకు, అనంతమైన సమస్యల వలయాలకు ఈ విషాదనాటిక ఒక నిలువుటద్దం

ఏ సుఖానికి నోచుకోకుండా, కష్టాల్లో పెరిగి, కష్టాలతోనే జీవిత పర్యంతమూ మునిగితేలే దురదృష్ట జాతకులకు,సుల్తానీ వంటి స్రీలకు కన్నీరు ఇంకిపోయినా సమస్యలు మాత్రం అపరిష్కృతంగా వుండిపోతున్నాయి ఇది మన సాంఘిక వ్యవస్థలో వున్న భయంకర పరిస్థితి మగవారి దౌష్ట్యానికి బలియైపోయే సుల్తానీలు ఈ సమాజంలో ఉన్నంతకాలం 'సుల్తానీ' నాటకం బతికేవుంటుంది

శ్రీ ప్రభాకర నాట్యమండలి, గుడివాడవారు ఆంధ్ర నాటక కళాపరిషత్ పోటీలలో 1962 సం లో ప్రదర్శించి ప్రథమ బహుమతి పొందిన నాటినుంచీ ఆ సంస్థవారే ఆంధ్రదేశంలో వందలాది ప్రదర్శనలిచ్చారు పామర్తి సుబ్బారావుగారి పేరు వినగానే 'సుల్తానీ' నాటిక జ్ఞాపకం వస్తుంది సుల్తానీ నాటికలో తాదాత్మ్యంపొందిన మహానటుడు, ప్రయోక్త పామర్తి సుబ్బారావుగారు

యం జయప్రకాష్ రచించిన 'గారడి' యస్ మునిసుందరంగారి 'సింగారం' నాటికలు కూడా స్త్రీ జీవితంలోని విషాదాన్ని కుమ్మరించిన మెరుపుతీగలే!

## స్త్రీల సమస్యలపై కొత్తచూపు

రోడ్డుమీద నడుస్తున్న మనిషి స్పృహ తప్పి పడిపోతే, ఆ సమీపంలో వున్న

మనిషి దగ్గరికెళ్ళి నీళ్లు చల్లి సహాయం చేసే కాలం కాదిది ఇంకా మానవత్వం చచ్చిపోని దయార్ద్ర హృదయులు ఎక్కడో ఉంటారు ఒకరిద్దరు వాళ్ల సంగతి కాదిది కర్రతో పెళ్లాన్ని గొడ్డును బాదినట్టు బాదుతూవుంటే అదేమని అడిగే దిక్కుండదు అది మొగుడు-పెళ్లాల తగువు మనకెందుకని తలుపులు వేసుకుంటారు ఇరుగుపొరుగులు ఇది నేటి నాగరిక ప్రపంచంలో నిత్యం మనకళ్లకు కనిపించే దృశ్యం స్వార్థం ఇలా అణువణువునా జీర్ణించుకుపోయిన నేటి సాంఘికవ్యవస్థలో, మౌనంగా స్త్రీలు అనుభవిస్తున్న బాధల గాధల్ని పట్టించుకునే నాధుడెవరు?

అక్కడక్కడా ఉంటారు ఆదర్శాల కోసం అంగలార్చే కధకులు, నవలాకారులు, నాటకరచయితలు ధర్మచ్యుతి పట్ల ఆందోళన పడటం, పతనమవుతున్న నైతిక విలువల సంరక్షణకోసం తపన పడటం వీరి బలహీనత! ధార్మిక విప్లవం వీరి గమ్యస్థానమే అయినా, అన్యాయానికి గురి అయ్యే మనిషికి కనీసం న్యాయం చెయ్యగలిగితే అదే పదివేలు!

నేటి సమాజంలో స్త్రీలు అనుభవించే కష్టాలకు కారణం ఎవరో బయటినుంచి వచ్చిన 'విలన్లు' కాదు కట్టుకున్న భర్త, తాను జన్మనిచ్చిన పిల్లలు, పెంచి పోషించిన తల్లిదండ్రులు, మెట్టినింట్లో అత్తమామలు, ఆడపడుచులు - ఆ పరిధిలోనే ఉంటారు

స్త్రీ విద్యాధికురాలుగా ఉన్నా, విద్య లేనిదైనా, కట్నం తెచ్చినా, తేలేకపోయినా, ఉద్యోగం చేస్తున్నా లేక గృహిణిగానే ఉంటున్నా, వారికి ఎదురయ్యే సమస్యలకు తట్టుకుని నిలబడగల శక్తిని కూడగట్టుకోలేక పోవడంలోనే ఉంది స్త్రీల బలహీనత అందువల్లనే చాలమంది స్త్రీలు తమకు ఎదురయ్యే సమస్యలను ప్రతిఘటించకుండా అనుభవించడానికే సిద్ధపడుతుంటారు ఇలాంటి పాసివ్ సఫరర్స్‌ని గురించి ఇటీవలి కాలంలో కొన్ని మంచి నాటకాలొచ్చాయి స్త్రీ సమస్యలమీద ఉత్తమశ్రేణి నాటకాలు వ్రాసిన వారిలో వి యస్ కామేశ్వరరావు, అత్తిలి కృష్ణారావు, మార్గశీర్ష, ఆకెళ్ళ, యస్ మునిసుందరం, మారెళ్ళ, ఇసుకపల్లి

మోహనరావు, నుసుము నాగభూషణం, కె యస్ టి శాయి, బత్తుల రామకృష్ణ, జె యస్ రాజశేఖర్ యస్సేరావు, ఏ భాస్కరచంద్ర గార్లు ముఖ్యులు

## అమ్మ

వృద్ధాప్యంలో తల్లిదండ్రులు, కన్నబిడ్డలచేత నిరాదరణకు గురి అయి దయనీయ జీవితం గడపటం వంటి సంఘటనలు మనకళ్లముందు ఎన్నో జరుగుతున్నాయి నాగరికత బలిసిపోయిన ఈ సమాజంనుంచి మానవత్వం అయిపులేకుండా పారిపోతున్నదని శ్రీ ఆకెళ్ల రాసిన 'అమ్మ' నాటిక గుర్తుచేస్తుంది

భూదేవి వంటి సహనంగల తల్లి, భర్తచనిపోయిన నాటినుంచీ కొడుకులు కోడళ్ల చేతుల్లో పడేపాట్లు, మానసిక వేదన 'అమ్మ' నాటికలో హృద్యంగా చిత్రించారు రచయిత తండ్రికి వచ్చే రిటైర్మెంటు డబ్బుకోసం కొడుకులు కాట్ల కుక్కల్లాగా పోట్లాడుకుంటారు తల్లికి ఏ లోటూ రానివ్వకుండా కాపాడుకోవడం ఎలాగా అన్నది వాళ్ల ఆలోచన కాదు ఉన్నంతవరకు దోచుకుపోవాలనే వాళ్ల తాపత్రయం కోడళ్లిచ్చే ప్రోత్సాహంతోనే కొడుకులలా దూసుకుపోతున్నారు తల్లికి వచ్చే పెన్షను, ఇంటి అద్దెను కూడా లెక్కగట్టుకుని, తల్లిని ఒక వంట మనిషిగా, జీతంబత్తం లేకుండా వెట్టి చాకిరి చేసే ఒక పనిమనిషిగా తీసుకుపోవడానికి సిద్ధపడతారు వారి స్వార్థాన్ని చూసి తల్లి విలవిలలాడి పోతుంది తాను కేన్సర్ వ్యాధితో బాధపడుతున్నానని చెప్పగానే ఎక్కడివాళ్లక్కడ మౌనం వహిస్తారు ఆమెను తమవెంట తీసుకెళ్లే ప్రయత్నం విరమించుకుంటారు తాను ఎక్కడికీ రానని నిరాకరించి భర్త జ్ఞాపకాలతో ముడిపడిన ఆ ఇంట్లోనే వుండి రాలిపోతానని స్థిరనిశ్చయాన్ని తెలుపుతూ కొడుకులను కోడళ్లనూ సాగనంపుతుంది

అయిదు పాత్రలతో ఉన్న ఈ నాటిక అడుగడుగునా ప్రేక్షకులను కదిలిస్తుంది లోకజ్ఞతను వెల్లడించే నిశిత సంభాషణలకు కొన్ని ఉదాహరణలు

అన్నపూర్ణ "క్షమించాల్సింది నేనుకాదు అంతరాత్మ పాలిచ్చి ముసలిదైపోయిన ఆవునే చంపకూడదనే దేశంలో పుట్టి రక్త మాంసాలు

పంచియిచ్చిన తల్లినే పంచుకునే కొడుకులు ”

“ఎందుకురా ఏడుస్తున్నావ్ నాకోసమా? నేను కాదురా, ప్రతి తల్లి రాలిపోతుందిరా అమ్మ అరటి ఒక్కలాంటిదే

పిలక వెయ్యగానే శక్తి పిల్లకి ధారబోసి తల్లి చెట్టు మట్టిపాలవుతుంది ఇది సృష్టి ”

“వర్ణక్రమాలు దిద్దించేటప్పుడు పసిబిడ్డచేత అమ్మ - ఆవూ అంటూ ఎందుకు దిద్దిస్తారో తెలుసా ? అమ్మమీద ప్రేమ పెంచటానికి, అమ్మలాంటి ఆవుమీద అభిమానం పెరగటానికి అంతేకాని ఆ అక్షరాలే పునాదులుగా ఎదిగి ఈ అమ్మనే మర్చిపోవటానికి కాదు బాబూ ”

“ఈ సమాజానికే ఇది పరీక్షా కాలం తల్లి పేగు బలమెంతో కాలమే నిర్ణయిస్తుంది ”[7]

అనటంతో నాటిక ముగుస్తుంది మానవత్వం ఈ నాటికకు ఊపిరి తల్లిని ఉన్నత శిఖరంమీద ప్రతిష్ఠించే ప్రయత్నంలో, కవిత్వాన్నీ, మెలోడ్రామాని తోడుతెచ్చుకోకుండా, చిన్నచిన్న మాటలతోనే అన్నపూర్ణ పాత్రలో ఔన్నత్యాన్ని, పరిణతిని ద్యోతకంచేసిన ఆకెళ్లగారి శిల్పం అననుకరణీయం, అనితరసాధ్యం

## ఏడవకండేడవకండి

అనేక సందర్భాలలో అరణ్య రోదనగా పరిణమిస్తున్న వ్యధితస్త్రీల ఆర్తనాదాలకు, గుండె చప్పుళ్లకు ప్రతిధ్వనులుగా ఎన్నో నాటకాలొచ్చాయి వాటిలో శ్రీ మారెళ్ల రచించిన ‘ఏడవకండేడవకండి’ ప్రజాదరణ పొందిన చక్కని నాటిక

ఫుట్‌పాత్‌మీద పూసలమ్ముకుని బ్రతికే కష్టజీవులకు సంబంధించిన ఇతివృత్తం ఇది మాయామర్మం ఎరగని అమాయకుల జీవితాల్లో చిచ్చు పెట్టి పర్యవసానం రుచిచూస్తాడొక దుర్మార్గుడు కనకారావు కామవాంఛకు బలైపోయింది బిజిలి ప్రతిఘటించి ప్రాణాలే పోగొట్టుకుంది మానభంగంచేసి దారుణంగా హత్యచేసినా

భర్త, మామ ఏమీ చెయ్యలేని నిస్సహాయ స్థితిలో, బిజిలి అంత్యక్రియలు చెయ్యడానికి సన్నద్ధులవుతుంటారు "ఇదంతా మన ఖర్మరా! ఖర్మ! మన బాధలొరికి సెప్పుకున్న యినేదెవరు? ఇది దుర్మార్గపు రాజ్యంరా" అని గుండెపగిలేటట్టు ఏడుస్తూ పాడె సిద్ధంచేస్తుంటారు జరిగిన ఘోరం తెలుసుకుని జర్నలిస్టు రవి, కనకరావును ఆ ప్రదేశానికి తీసుకొస్తాడు మాయోపాయంతో 'నిజం చెప్పు బిజిలీ చావుకి కారణం నీవే కదూ?' అని గర్జించాడు రవి అన్యథా శరణం నాస్తి అంటూ అతని కాళ్లమీద పడ్డాడు కనకారావు నిన్ను వదిలేస్తే దుర్మార్గానికి స్వేచ్ఛనివ్వడమే! అంటూ అతని డొక్కలో పొడిచాడు విషయం అర్థం అయింది బెజవాడ సింగుకి బందరు సింగుకి - పాడెకడుతున్న కర్రలు ఊడదీశారు రెండు కర్రల నడుమ కనకారావు తల చితికిపోయింది

పతితులార
భ్రష్టులార
బాధాసర్పదష్టులార
ఏడవకండేడవకండి
వస్తున్నాయొస్తున్నాయి
జగన్నాధ రధచక్రాలు

అనే శ్రీ శ్రీ గేయం నేపథ్యంలో విన్పిస్తుండగా నాటిక ముగుస్తుంది పూసలోళ్ల ఆచార వ్యవహారాలు వేషభాషలు చాల సహజంగా చిత్రించబడ్డాయి ఈ నాటికలో సహజీవనం, సమాజం, వసుధైక కుటుంబం అంటూ వేదికలమీద ఉపన్యాసాలు యివ్వడానికే పరిమితమా మన ప్రజాస్వామ్యం! ఇలాంటి మూగజీవులకు అన్యాయం జరిగినపుడు వాళ్లని ఆదుకోని చట్టాలు, రక్షకభటులు ఎవరి కోసం? - అనే ఆర్తి ధ్వనిస్తుంది ఈ నాటికలో కావ్యార్థాన్ని మాటలద్వారా చెప్పించక సన్నివేశాలలో పొదిగి శక్తిమంతంగా అభివ్యక్తం చేశారు రచయిత

## శమీవహ్ని

తన ప్రాణాలను సైతం పణంగా పెట్టి మగవాడికి ప్రాణం పోస్తూ ఆ మగవారి

నిరంకుశత్వానికి, దౌర్జన్యానికి నిస్సహాయంగా తలవంచుతూ, మూగబాధను, వేదననూ అనుభవించే మరో అబల ఉదంతాన్ని వెల్లడించే నాటిక 'శమీవహ్ని' మారెళ్ల - సుంకర కోటేశ్వరరరావుల సంయుక్త రచన ఇది

సంప్రదాయ విరుద్ధమైన (యాంటీ సెంటిమెంటు) పోకడలుగల నాటికగా కొంతమంది విమర్శకులు ముద్రవేసిన శమీవహ్ని' లో అసహజం, అసంభవం అనిపించే సంఘటన ఒక్కటీ లేదు ఇలా జరుగుతుందా! అని ఆశ్చర్యపోవలసిన అగత్యమూ లేదు

మధ్యతరగతి గృహస్థు అయిన హరిశ్చంద్రమూర్తి తాను ఉద్యోగవిరమణ చేసేముందు కూతురు అరుంధతికి పెళ్లిచేసి తన బాధ్యత నెరవేర్చుకున్నాడు కాని రిటైరై ఎనిమిది నెలలు కావొస్తున్నా పెన్షన్ సొమ్ము చేతికి రాలేదు కట్నం సొమ్ము చేతిలో పడందే కదలనని అల్లుడు సన్యాసిరావు మామగారింట్లోనే తిష్ఠవేశాడు రోజూ అతని పేకాటకు, విలాసాలకు డబ్బుతేలేక ఇంట్లో వాళ్ల కటకటలాడుతున్నారు జీవితంలో ఎలాంటి నీతినియమాలు, క్రమశిక్షణ, సంస్కారం వంటి వేవీ లేనిపశుప్రాయుడు సన్యాసిరావు శాడిస్టు లక్షణాలను పుణికి పుచ్చుకొన్న దౌర్భాగ్యుడు "ఈ సమాజంలో ఆడదాని గౌరవానికీ రక్షణకూ కట్టిన రిజిస్ట్రేషన్ సర్టిఫికెట్" అని తాళిని గూర్చి ఎగతాళి చేసే ధూర్తుడు అరుంధతి అతను పెట్టే కష్టాలు సహిస్తుంది, ఈటెల్లాంటి అతని మాటలు విని ఓర్చుకొంటుంది కాని తన శరీరాన్ని ఇంకొకరికి అప్పగించమని తాళి గట్టిన వాడే శాసిస్తే ఇంక భరించలేకపోతుంది ఆమె ఆగ్రహం కట్టలు తెంచుకొంటుంది

"రాస్కెల్! ఆడదంటే ఆటబొమ్మనుకున్నావు కదూ! తాళి కట్టినంతమాత్రాన నీ సంపాదనకు నీ పైశాచికానందానికి భార్యను బలివశువును చేయాలనుకుంటావా? ఆడది ఆదిశక్తని మరిచిపోయావా? అబల ఆగ్రహిస్తే సబల అవుతుందనీ, అన్యాయాన్ని అంతం చేయగలదనీ నీ చావు ఈ సమాజానికి చాటాలి"[9] అంటూ అతన్ని పొడిచి చంపుతుంది

"ప్రమాదకరంగా పరిణమించిన క్రూరజంతువును వెంటాడి వేటాడినట్లు

కసిగా దారుణంగా పొడిచిపొడిచి చంపేశాను ఇది తప్పా? నేరమా మీరే నిర్ణయించండి''[10] అని సభ్యప్రపంచాన్ని ప్రశ్నిస్తుంది అరుంధతి

ఒక మనిషిని ఒక మనిషి చంపటం నేరమే! కాని ఆ నేరం చేసిన పరిస్థితులెలాంటివి? విటుడు చెయ్యిపట్టి లాగుతున్నాడు కట్టుకున్న మొగుడు ఆమెను ముందుకు తోస్తున్నాడు అరిచినా ఆదుకునే మనిషి లేడక్కడ-ఇంకేం చేస్తుంది? కోర్టులు, పోలీసులు కల్పించుకోవచ్చు నేరస్థుల్ని శిక్షించవచ్చు కానీ కోల్పోయిన శీలాన్ని తెచ్చివ్వలేవు కదా?

సంప్రదాయవాదులకు 'శమీవహ్ని' మింగుడు పడకపోయినా, ఆ నాటిక ప్రదర్శనాపరంగా విజయవంతమైంది పలుచోట్ల నాటిక పోటీలో ఉత్తమ ప్రదర్శనకు, ఉత్తమ రచనకు బహుమతులు గెల్చుకుంది ఈ నాటిక

'సతి' అనే పేరుతో మరొక స్త్రీ సమస్యాత్మక నాటికను కూడా శ్రీ మారెళ్ల రచించారు

## జోగు జాతర

శ్రీ అత్తిలి కృష్ణారావు రచించిన 'జోగుజాతర' నాటకం జోగినీ వ్యవస్థలోని దుర్మార్గాన్ని బట్టబయలుచేసింది దేవునిసేవ పేరుతో గ్రామంలో కొంతమంది ఆడపిల్లలను అవివాహితులుగానే ఉంచి, వారిని జోగినులుగా వ్యవహరిస్తారు ఆ కుటుంబంలోని వారంతా వారసత్వంవలె అవివాహితలుగా కాలం వెళ్లబుచ్చాలనే నియమం ఉంది క్రమక్రమంగా జోగిని వ్యవస్థలో పవిత్రతపోయి అవినీతి చోటు చేసుకుంది జోగినులు ఊరంతటికీ ఉమ్మడి ఆస్తి అన్నట్టు రూపం ధరించింది తమ ఇష్టానికి వ్యతిరేకంగా సాగుతున్న ఈ అత్యాచారాన్ని అంతం చేయాలని జోగినులు విఫలయత్నంచేశారు వారి దుస్థితిని, కడగళ్లను సభ్య ప్రపంచం దృష్టికి తెస్తూ శ్రీ అత్తిలి రాసిన 'జోగుజాతర' చక్కని నాటకంగా రూపుదిద్దుకొని ప్రజలమన్నన పొందగలిగింది ఈ నాటక ప్రభావం ప్రభుత్వం దృష్టికి పోవడం, జోగినుల కష్టనిష్ఠురాలను గూర్చి పరిశీలించి తగిన చర్యలు

తీసుకోవడం కూడా జరిగింది ఈ విధంగా శ్రీ అత్తిలి జోగినీవ్యవస్థను ప్రజల దృష్టికి తెచ్చి స్త్రీ లోకానికి మహోపకారం చేశారు ఒక నాటకం ఒక ఉద్యమానికి ప్రాణం పోసిందంటే అందుకు నాటకరంగం గర్వపడాలి

## తేనెటీగలు పగబడ్తాయ్

రచన శ్రీ కె కె యల్ స్వామి భూస్వాముల పల్లెప్రాంతాల్లో సన్నజనాన్ని పీల్చి పిప్పిచెయ్యడం, ప్రతిఘటించిన వాణ్ణి తమ ఉక్కుపాదాల కింద తొక్కిపారెయ్యడం వంటి సంఘటనలు సర్వసాధారణంగా వింటూంటాం మనం కొండల్లో కోనల్లో అడవి ప్రాంతాలలో భయంకరమైన మృగాలు, విషసర్పాలమధ్య జీవిస్తూ అడవి సంపదను తమ జీవనాధారంగా చేసుకొని బ్రతికే గిరిజనులు, పాముల వాళ్లవంటి బడుగువర్గాల బ్రతుకుల్లో కూడా నిప్పులు కురిపించే ధూర్తులున్నారు అటువంటి దానవత్వానికి గురి అయిన ఒక పాములవాళ్ల కుటుంబగాథ ఇది

ఆదయ్య అతని కొడుకు లచ్చిగాడు, కోడలు సీతాలు అడవి ప్రాంతంలో ఉంటూ రెక్కలకష్టంతో పొట్టపోసుకుంటూన్న శ్రమజీవులు దొర వాళ్ల పాలిటి యముడు ఏదో సాకుపెట్టి ఆదయ్యకున్న భూమిపుట్రా ఏనాడో హరించాడు దొర ఎదురు తిరిగిన ఆదయ్య పెద్దకొడుకును చెట్టుకి కట్టి కొట్టించి చంపేశాడు దొర మూలంగానే ఆదయ్య పెళ్లాం అవమానంభరించలేక నూతిలోపడి చచ్చిపోయింది ఇన్ని జరిగినా ఆదయ్య ఇప్పటికీ దొర కళ్లెర్రజేస్తే కాళ్లమీద పడి బ్రతిమిలాడుకుంటాడు తప్ప ఎదురుచెప్పే ధైర్యం లేదు అతనికి సీతాలు గుండెల్లో మాత్రం అగ్నిపర్వతం రగులుకొంటూ ఉంది

ఒకరోజు దొర పాముకాటుకు గురి అయ్యాడు ఆదెయ్య మంత్రమేసి అతన్ని బ్రతికించాడు మానవతాదృష్టితో పాలిచ్చి ప్రాణదానం చేసింది సీతాలు పాముకు పోలు పోసినట్టే అయింది స్పృహరాగానే ఆ దుర్మార్గుడు సీతాలును చూసి కన్నుచెదిరి చెయ్యిపట్టుకున్నాడు, అప్పటికైనా ఆదెయ్యలోను, లచ్చిగాడులోను చలనం వస్తుందేమో, రోషం వస్తుందేమో అని ఎదురుచూసింది చీమూ,

నెత్తురూ చచ్చిపోయిన జీవచ్ఛవాలని అర్థంచేసుకొంది సీతాలు  దొరను పాము చేత కరిపించింది "రేయ్ దొరా! తాసుపాములే కాదురా, తేనెటిగలు పగబడ్తాయ్ కాస్కోనాకొడకా! " అంటూ కొడవలి చేతికెత్తుకుని దొరను రెండుగా చీల్చింది

శ్రీ గంజి రామారావు రచించిన 'విషాద భారతంలో మరో ఆడపడుచు' నాటిక కట్నంచావును వివరిస్తుంది  ఈ నాటికలో అన్నీ స్త్రీ పాత్రలే వుండటం ఒక ప్రత్యేకత  వస్తుబలంతో పాటు సహజసన్నివేశాలుండటంవల్ల, రచన మామూలుగావున్నా,ప్రదర్శనార్హత కలిగివుంది

నిస్సహాయ స్త్రీపై జరిగిన అత్యాచారాన్ని వివరించే 'గారడి' నాటికను శ్రీ యం జయప్రకాశ్ రచించారు  గారడీవాళ్లు పొట్టకోసం గారడీ చేస్తారు  కాని కొందరు ఘరానా పెద్దమనుషులు పదవులకోసం, స్వార్థప్రయోజనాలకోసం గారడీచేసి ప్రజల్ని మోసగిస్తారు  గారడీ చేసే జుమ్రీ మీద అత్యాచారం చేస్తారు  రాజకీయ నాయకులు నేరస్థులుగా చిత్రించబడటం ఈ నాటికలోని విశేషం

స్త్రీ సమస్యలపై ఈ దశాబ్దిలో వచ్చిన నాటక నాటికలలో మార్గశీర్ష రచించిన 'పసుపు - బొట్టు - పేరంటానికి' నాటకం, కె ఎస్ టి శాయిగారి 'సుమతి' నాటిక బాధాసర్పదష్టులైన స్త్రీల ఉదంతాలను శక్తిమంతంగా వ్యక్తీకరించిన రచనలలో పేర్కొనదగినవి

## స్త్రీవాదం

ఇంగ్లీషులో 'ఫెమినిజం' అన్న పదాన్ని సమానార్థంలో తెలుగులో 'స్త్రీ వాదం' అని వ్యవహరిస్తున్నారు  మన దేశంలో అనాది కాలం నుంచీ స్త్రీలు అనేక సమస్యల్ని ఎదుర్కొంటున్నా, ఎవరికి వారు అవి తమ వైయక్తిక సమస్యలుగానే పరిగణించారు  తమ కష్టనిష్ఠురాలను తమ సంసారానికి పరిమితమైనట్లుగానే భావించారు  స్త్రీకి భర్తవినా ప్రపంచంలేదనీ, పతియే ప్రత్యక్షదైవమనీ విశ్వసించి సంప్రదాయాల నీడలో బ్రతుకు వెళ్లబుచ్చుతూ వచ్చారు  భర్త తన మాటకు విలువ ఇవ్వకపోతే అది తన వ్యక్తిస్వాతంత్ర్యానికి భంగకరమైన అంశంగా స్త్రీ

ఎన్నడూ ఆలోచించేది కాదు భార్య తనకిష్టమైన వస్తువును కొనడానికి భర్త నిరాకరిస్తే దాన్ని ఆర్థిక స్వాతంత్ర్యంలేని దుస్థితిగా స్త్రీ వేలెత్తి చూపలేదు ఆస్తిలో తనకు హక్కులేకపోయినా నిస్సహాయంగా బాధలు పడిందేకాని ఆస్తిలో వాటాకోసం స్త్రీ పోరాడలేదు భార్య చనిపోతే మళ్లీ పెళ్లి చేసుకోవడానికి మగవాడికి హక్కుంది కానీ స్త్రీకీ ఆహక్కు నిర్దాక్షిణ్యంగా నిరాకరించబడింది బాల్యంలో తండ్రి చాటున, యౌవనదశలో భర్త చాటున, వృద్ధాప్యంలో కొడుకు చాటున బ్రతకడమే స్త్రీ జీవిత విధానమైంది అడుగడుగునా ఆంక్షలతో, సంప్రదాయాల అగ్నిగుండంలో పడి ఆడది తల్లడిల్లి పోయింది మౌనంగా కష్టాలు భరించడమే ఆమె వంతు అయింది తరతరాల భారత స్త్రీల చరిత్ర ఇదే

స్త్రీ భూదేవివంటి సహనం కలదనీ, త్యాగం ఆమె రక్తంలో ప్రవహిస్తూ ఉందనీ, సౌశీల్యం ఆమెకు పెట్టని ఆభరణమనీ, స్త్రీశక్తిస్వరూపిణి అనీ శుష్కప్రియాలతో శూన్య హస్తాలు చూపిస్తూ స్త్రీని జీతం బత్తెంలేని పనిమనిషిగానే చేస్తూ వచ్చింది పురుష ప్రపంచం ఏ విషయం లోనూ ప్రతిఘటన చూపని స్త్రీ ధోరణిని అలుసుగా తీసుకుని మగవాడు తిరుగులేని నిరంకుశత్వంతో వ్యవహరిస్తూ వచ్చాడు స్త్రీ తన భర్త, తన పిల్లలు, తన బంధువులు అనే నిర్ణీత పరిధిలో సంచరిస్తూ తన సుఖాన్ని, స్వేచ్ఛను, ఇష్టాయిష్టాలను, వ్యక్తిత్వాన్ని కుటుంబంకోసం త్యాగం చేస్తూ వచ్చింది భర్తను పోగొట్టుకొన్న స్త్రీని, పాతివ్రత్యం పేరుతో, సతీధర్మం పేరుతో సతీసహగమనమనే రాక్షస సంప్రదాయాన్ని కూడా అమలు చేసి స్త్రీని సజీవదహనం చేసే క్రూరత్వానికి కూడా బలి చేశారు అంతగా ఎదిగిపోయింది మగవాడి దౌష్ట్యం స్త్రీ బాగోగుల గురించి, ఆమె మనోభావాలగురించి ఒక్క క్షణమైనా ఆలోచించిన దాఖలాలు కనబడవు మన ప్రాచీన చరిత్రలో

ఈ దారుణ పరిస్థితుల నుంచి స్త్రీ విముక్తి పొందింది పందొమ్మిదో శతాబ్దంనుంచే! రాజారామమోహనరాయ్ వంటి సంఘ సంస్కర్తలు స్త్రీల దీనస్థితిపట్ల కలతచెంది దుష్ట సంప్రదాయాలమీద యుద్ధం ప్రకటించారు ఆంధ్రదేశంలో కందుకూరి

వీరేశలింగం వంటి సంఘ సంస్కర్తలు స్త్రీల సమస్యల పట్ల శ్రద్ధ వహించారు తమ జీవితపర్యంతము స్త్రీ జనోద్ధరణకోసం అహర్నిశలు పాటుబడ్డారు స్త్రీల దుస్థితికి ప్రధాన కారణం అవిద్య, అజ్ఞానమే నని గ్రహించినకందుకూరి,స్త్రీ విద్యావ్యాప్తికోసం అనితరసాధ్యమైన సేవచేశారు

ఆంగ్లేయ పరిపాలనలో విద్యకు అత్యధిక ప్రాధాన్యం లభించింది విద్య అందుబాటులోకి రావడంవల్ల బాలికలు విద్యార్జనపట్ల మక్కువ చూపసాగారు క్రమక్రమంగా స్త్రీల స్థితిగతులలో, మన ప్రవృత్తిలో అపూర్వమైన మార్పులు వచ్చాయి అన్ని రంగాలలో మగవారితో పోటీపడగల చేవ, సామర్థ్యం, ఆత్మవిశ్వాసం స్త్రీలకు విద్యాఫలితంగా లభించాయి వారిలో వ్యక్తిత్వం వికసించింది తమ ఇష్టాలగురించి అభిప్రాయాలను కుండబద్దలుకొట్టి చెప్పగల చొరవ, ప్రతిఘటించగల ధైర్యం వారిలో కలిగాయి సంఘంలో పాతుకుపోయిన కొన్ని దుష్టసాంప్రదాయాలపట్ల వారికి వైముఖ్యం ఏర్పడింది సంప్రదాయాల హేతుబద్ధత గురించి ప్రశ్నించసాగారు నేటి సామాజిక పరిస్థితులను విశ్లేషించుకొని ఏది మంచిదైతే దాన్ని మాత్రమే స్వీకరించగల శాస్త్రీయదృక్పథం వారి సొత్తయింది

అలా వారిలో వ్యాపించిన వ్యక్తివాదం, శాస్త్రీయ దృక్పథం, సామాజిక అవసరం - వీటి దృష్ట్యా ఉమ్మడి కుటుంబం బీటలువారింది క్రమంగా కుటుంబ వ్యవస్థలో ఎన్నో అనుకోని మార్పులు వస్తున్నాయి

పాశ్చాత్య దేశాలలో వ్యాపించిన స్త్రీవాదం ఆంధ్రదేశం దాకా ప్రాకింది పాశ్చాత్య స్త్రీవాదులను ఆదర్శంగా తీసుకుని మన సమాజంలో స్త్రీవాదాన్ని ఒక ప్రబల శక్తిగా రూపొందించి పురుషాధిక్య సమాజాన్ని సమూలంగా మార్చాలని ఇక్కడి స్త్రీవాదులు ఉద్యమం సాగిస్తున్నారు

"స్త్రీ వాదంలో అనేక ధోరణులు ఏర్పడినాయి అయినా స్త్రీవాద తాత్వికతలో ప్రధానంగా మూడువిధాలైన ధోరణులు కన్పిస్తున్నాయి ఒకటి లిబరల్ ఫెమినిజం - స్త్రీలకు పురుషులతో సమానమైన హక్కులు అవకాశాలు రావాలనడం, విద్య, ఉద్యోగం రాజకీయ, ఆర్థిక రంగాల్లో స్త్రీలు పాల్గొనాలని వీళ్లు కోరుతారు స్త్రీ

పురుషులు ఎవరి బాధ్యతలు వాళ్ళు నిర్వహిస్తూ సామరస్యధోరణిలో జీవించాలన్నది వీళ్ల వాదం ఇక రెండోది రాడికల్ ఫెమినిజం - వీళ్లు స్త్రీలను ఒక ప్రత్యేక వర్గంగా భావిస్తారు స్త్రీ అణచివేతకు పితృస్వామ్యం మూల కారణమని అంటారు స్త్రీల శరీరాల మీద, జీవితాలమీద మతం, రాజ్యం అధికారం చెలాయిస్తాయి పితృస్వామిక సమాజం,మతం రాజ్యాలను స్త్రీ అణచివేతకనుకూలంగా భావజాలాన్ని సృష్టించి తరతరాలుగా వ్యాపింపజేసింది స్త్రీ పురుష సంబంధాలలో పురుషుడుఅనుభవించేవాడుగా అంటే భోగిగా స్త్రీ అనుభవింపబడే వస్తువు అంటే భోగ్యంగా చూశారని,మగవాణ్ణి ప్రేమించడానికి కనడానికి తయారు చేయబడింది స్త్రీ శరీరం అని చెప్పే స్త్రీవాదంలో స్త్రీ శరీరాన్ని ద్వేషించడం కన్పిస్తున్నది మగవాళ్లను వర్గశత్రువులుగా,మగపిల్లలను శత్రువర్గపు మొలకలుగా భావించడం వంటి ధోరణులు దీనిలో ఉన్నాయి ఇంటిపని - స్త్రీల జీవితసారాన్ని మేధాశక్తిని సృజనాత్మకతను నశింపజేసేదిగా వీళ్లు భావించారు ఇల్లు స్వర్గసీమ, ఇల్లాలు గృహలక్ష్మి వంటి భావజాలాన్ని వీళ్లు ద్వేషించారు పితృస్వామ్యంనుంచి ఏర్పడింది కుటుంబవ్యవస్థ అనీ, పితృస్వామ్యం, కుటుంబ వ్యవస్థ కుళ్లు, ప్రయివేటు ఆస్తులు నశించాలని వీళ్లు అంటారు

ఇవి కాక, స్త్రీవాదంలో మరోధోరణి కన్పిస్తున్నది వాళ్లు స్త్రీ స్వేచ్ఛను, సంప్రదాయ పరిధిలోనె న్యాయపరంగా, సామాజిక పరంగా ఏ రాజకీయాలు లేకుండా నిజాయితీగా అమలులోకి తెచ్చేందుకు స్త్రీలు ఉద్యమించాలంటున్నారు స్త్రి తనకుతాను మారాలి, ఎదగాలి తన హక్కులను తాను తెలుసుకొని అమలులోకి తెచ్చుకుని మనోధైర్యం, ఆత్మ విశ్వాసం రావాలన్నది వాళ్ల వాదన అన్ని రంగాల్లో స్త్రీలు చొచ్చుకొని ముందుకు రావాలి పురుషుల్ని ఒక శత్రువుగా తన బలహీనతలకు కారణంగా చూడటం కుటుంబ వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయాలనడం వాళ్లు వ్యతిరేకిస్తున్నారు".[11]

స్త్రీవాదం సిద్ధాంతపరంగా ఆకర్షణీయంగా కనబడినా మన దేశపరిస్థితులకు స్త్రీవాదం ఎంతవరకు అనుసరణ యోగ్యమౌతుందన్నది ప్రశ్న పాశ్చాత్య

దేశాలలో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలు భారతదేశంలో స్త్రీలు అనుభవిస్తున్న బాధలు ఒకటికావు స్త్రీపురుష సంబంధాలలో భారతదేశంలో ఆప్యాయతలు, అనురాగాలు ప్రధాన పాత్ర వహిస్తాయి మాంగల్యాన్ని ఒక పవిత్రబంధంగా భావిస్తారు విదేశాలలో స్త్రీ పురుషుల మధ్య శారీరక ఆకర్షణ, లైంగిక ప్రవృత్తి ప్రాధాన్యం వహిస్తాయి ఏ చిన్న కారణంతోనైనా భార్యాభర్తలు విడాకులు తీసుకొని పునర్వివాహం చేసుకొంటారు అరవై ఏళ్ల వయస్సులో కూడా మగవాడు భార్యకు విడాకులిచ్చేసి తన కళ్లకు అందంగా కనిపించిన ఓ యువతిని వివాహం చేసుకొంటాడు పిల్లలతో అతని భార్య మిగిలిపోతుంది ఆమె వివాహం చేసుకొంటే ఆ పిల్లలు తల్లి ప్రేమకు, తండ్రి ప్రేమకు నోచుకోక తల్లడిల్లిపోతారు ఇటీవలి కాలంలో ఇటువంటి పిల్లల సమస్య పాశ్చాత్య సమాజాన్ని కూడా పునరాలోచింపజేస్తున్నది భార్య దీర్ఘకాలంగా రోగగ్రస్తురాలుగా ఉంటే భర్త ఆమెతో వైవాహికబంధాన్ని తెగతెంపులు చేసుకొని హాయిగా మరో పెళ్లిచేసుకొంటాడు వయస్సు మళ్లిపోతున్న స్త్రీ ఏ క్షణంలోనైనా పురుషుడు తనను వదిలిపోతాడేమోనని భయవిహ్వల అవుతూ వుంటుంది అంటే అభద్రత ఆమెను వెంటాడుతూ వుంటుంది ఈభయంకర పరిణామాల్ని దృష్టిలో పెట్టుకుని నేడు పాశ్చాత్యులు కూడా భారతీయ కుటుంబ వ్యవస్థవైపు ఆకర్షితులు అవుతున్నారు పటిష్ఠమైన కుటుంబ వ్యవస్థ సమాజానికి దేశానికి కూడా మేలు చేస్తుందని వారు అభిలషిస్తున్నారు ఈ పరిస్థితుల దృష్ట్యా స్త్రీ వాదం విదేశాలలో ఆకర్షణను కోల్పోయి తగ్గుముఖం పడుతున్న దశలోమన దేశంలో స్త్రీవాదం కొత్త వూపిరిపోసుకోవడం ఆశ్చర్యావహం విదేశాలలో స్త్రీలు అధిక శాతం అక్షరాస్యులు కాగా మన దేశంలో 80 శాతం స్త్రీలు నిరక్షరాస్యులే ఇంగ్లాండు, అమెరికా వంటి సంపన్న దేశాలలో భర్తనుంచి విడిపోయిన స్త్రీలు తమ కాళ్ల మీద తాము నిలబడి పిల్లల్ని పోషించుకోగల స్తోమత కలవారై వుంటారు భారతదేశంలో ఏ కారణంచేతనైనా భర్తతో విడాకులు తిసుకున్న స్త్రీ స్వతంత్రంగా బ్రతకగల పరిస్థితులు ఇంకా ఏర్పడలేదు పరిస్థితులకు ఎదురునిల్చి జీవనపోరాటం సాగించగల స్త్రీలు ఇక్కడకూడా వుండొచ్చు కాని అలాంటివారి సంఖ్య

గణించదగిన స్థాయిలో వుండదు మన దేశంలో విద్యావంతులైన స్త్రీల సంఖ్య పురుషులతో సమానంగా వున్నప్పుడే స్త్రీవాదానికి ఆచరణయోగ్యమైన వాతావరణం ఏర్పడుతుంది అంతవరకు స్త్రీవాదం నినాదాలకె పరిమితమవుతుంది కుటుంబవ్యవస్థను చిన్నాభిన్నం చేయాలని, స్వేచ్ఛాప్రణయం కావాలని వాదించే అతివాదస్త్రీవాద ధోరణులకు భారతీయ సమాజంలో ప్రాతిపదిక ఇంకా ఏర్పడలేదు భారతదేశంలో నెలకొని వున్న సామాజిక పరిస్థితులకు భిన్నంగా విదేశీ స్త్రీవాద భావజాలంతో ప్రభావితమై భారతదేశంలో సామాజిక పరిస్థితులకు, సంస్కృతికి భిన్నమైన అతివాద ధోరణులను ఆహ్వానించే స్థితికి మన సమాజం ఎదగలేదు మన దేశంలో స్త్రీకి ఆమె వ్యక్తిత్వాన్ని ఆత్మ విశ్వాసాన్ని మెరుగుపరిచే భావజాలం కావాలి! కాని పురుషద్వేషాన్ని పెంచుకొని పురుషవర్గం వేరు, స్త్రీ వర్గం వేరని వర్గపోరాటాన్ని ఈ విషయంలో సృష్టిస్తే లాభం లేదు స్త్రీవాదం మన సమాజంలో నిలదొక్కుకో గలదో లేదో ఇంక కాలమే నిర్ణయించాలి

## ఆధునిక నాటకాల్లో స్త్రీవాదస్పృహ

అన్ని సాహిత్యప్రక్రియల్లో, ముఖ్యంగా కధాసాహిత్యంలోను, నవలా సాహిత్యంలోను నేడు స్త్రీవాదం చాపకింద నీరులా విస్తరిస్తూ ఉంది ఇటీవలి కాలంలో నాటకరంగంలో కూడా స్త్రీవాదం చోటు చేసుకొంటోంది ఇది సహజపరిణామం పురుషాధిక్య సమాజపు ఉక్కుపాదాల కిందపడి నలిగిపోతున్న స్త్రీతన వ్యక్తిత్వం పరిరక్షించుకోవడంకోసం, తన కోర్కెల సాధన కోసం, సమాజంలో తన స్థానాన్ని సమస్థాయిలో ప్రతిష్ఠించటం కోసం సాగిస్తున్న ఉద్యమ తత్త్వాన్ని స్త్రీ వాదం అని భావించవచ్చు

స్త్రీవాద కవిత్వాన్ని పరిశీలిస్తూ ప్రముఖ రచయిత, విమర్శకులు అద్దేపల్లి రామమోహనరావుగారు "స్త్రీలు తమపై జరుగుతున్న అన్ని విధాలైన దోపిడిని చైతన్యవంతంగా ఎదిరించి పోరాడాలని ప్రబోధించే కవిత్వాన్ని ఫెమినిష్టు కవిత్వం లేదా స్త్రీవాద కవిత్వం అంటున్నారు ఒక విశాల పరిధిల్లో, దోపిడి స్పృహనుండి పోరాట చైతన్యం దాకా ఈ కవిత్వం విస్తరించి ఉంటుంది వ్యక్తిగతంగా

పురుషాధిపత్యాన్ని వ్యతిరేకించే ధోరణినుండి, వ్యవస్థాగతమైప రాజకీయాలతో సంఘర్షించేవరకు, ఈ నాటి స్త్రీవాద కవిత్వం విభిన్న దశల్ని ప్రతిబింబిస్తుంది ఇక్కడి సాంస్కృతిక పరిస్థితుల దృష్ట్యా, మార్క్సిస్టు భావజాలాన్ని అన్వయించుకొని, విముక్తి పోరాటంలో భాగస్వామ్యం పొందటం కొందరి లక్ష్యం కాగా, పాశ్చాత్య దేశాల స్త్రీ విముక్తి భావాల్ని ప్రధానంగా మరికొందరు భావించారు ఈ రెండోవారిని ఎక్కువగా ఫెమినిస్టులు అని పేర్కొనటం జరుగుతుంది "[12] అని వివరించారు ఇది స్త్రీవాదంతో ముడిపడిన నాటక సాహిత్యానికి కూడా అన్వయిస్తుంది

స్త్రీలలో అజ్ఞానాంధకారాన్ని పోగొట్టి విద్యతో జ్ఞానజ్యోతిని వెలిగించటానికి పందొమ్మిదో శతాబ్దంలో కందుకూరి వీరేశలింగంగారు చేసిన ప్రయత్నాలు స్త్రీలలో వ్యక్తిత్వ వికాసానికి తొలిమెట్టు కాగా, ఇరవయ్యో శతాబ్దంలో స్త్రీలు అంతర్ముఖులై ఆలోచించటానికి, కర్తవ్యోన్ముఖులు కావటానికి అగ్నిధారలవంటి తన రచనలతో మహిళాలోకాన్ని మేలుకొలిపి ప్రేరణ కలిగించిన సాంఘిక విప్లవరచయిత గుడిపాటి వెంకటచలం (1894 - 1979) సాగించిన పోరాటం రెండవమెట్టు ఆంధ్రదేశంలో హేతువాదయుగానికి ఆది పురుషుడైన త్రిపురనేని రామస్వామి చౌదరిగారు (1887 -1943) పురాణగ్రంధాలలో, ప్రాచీన గ్రంధాలలో వెలిబుచ్చిన అభిప్రాయాలను భావాలను గుడ్డిగా విశ్వసించరాదని, అధునికులు హేతువాద, శాస్త్రీయ మార్గాన నడిపించి స్వతంత్ర ఆలోచనాశక్తి పెంపొందించే కృషితో ఎన్నో గ్రంధాలు రచించారు ముద్దుకృష్ణ (1899 - 1973), ఆమంచర్ల గోపాలరావు (1907 - 1969) జి వి కృష్ణారావు, గోరా (1902 - 1975) వంటి మేధావులు శాస్త్రీయ దృష్టితో రాసిన పుస్తకాలు కొత్త ఆలోచనలకు వాకిళ్లు తెరిచాయి స్త్రీ వాదానికి పరోక్షంగా స్ఫూర్తినిచ్చాయి

తెలుగు నాటకరంగంలో స్త్రీవాద ధోరణిలో గతంలో కొన్ని నాటకాలు, నాటికలు వచ్చాయి ఆ నాటకాలను రచయితలు స్త్రీ వాద స్పృహతో రాశారని చెప్పలేంకాని, ఆ నాటకాలలో స్త్రీవాద స్పర్శ ఉందని మాత్రం రూఢిగా చెప్పొచ్చు

# తప్పెవరిది ?

1930 లో పి వి రాజమన్నారు గారు 'తప్పెవరిది?' అనే పేరుతో ఒక సాంఘిక నాటకం రాశారు ఆ నాటకంతోనే ఆధునిక నాటకానికి అంకురార్పణ జరిగింది ఇబ్సన్ ప్రభావంతో రాసిన ఆ నాటకంలో ఆధునికత, వాస్తవికత కలబోసుకొన్న పాత్రలు, సన్నివేశాలు సామాజికులకు కొత్త అందాలను, నూతన భావ తరంగాలను, ఉత్తేజాన్ని అందించాయి వృద్ధుడైన ఒక పెద్దమనిషి పునర్వివాహం చేసుకుంటాడు యౌవనంలో ఉన్న అతని భార్య సవతికొడుకును ప్రేమిస్తున్నట్టు అనుమానించి ఆమెను వేధిస్తాడు చెప్పుచేతల్లో ఉంటుందనుకున్న భార్య అతని మాటలకు తీవ్రంగా స్పందిస్తుంది తిరుగుబాటుచేస్తుంది అతడు ఊహించని పరిణామానికి నిర్ఘాంతపోతాడు తీవ్రమైన మానసిక క్షోభకు గురి అవుతాడు పురుషాహంకారానికి గొడ్డలిపెట్టు అయిన ఆ సంఘటన, తన వ్యక్తిత్వాన్ని ఆత్మాభిమానాన్ని, కాపాడుకోవడం కోసం భర్తపై తిరుగుబాటుచేసిన ఆ సన్నివేశం 'తప్పెవరిది?' నాటకానికి ఆయువుపట్టు తెలుగునాటకాలలో "స్త్రీకి కూడా శరీరం ఉంది. దానికి వ్యాయామం యివ్వాలి ఆమెకు హృదయం ఉంది, దానికి జ్ఞానం ఇవ్వాలి" అని నినదించిన చలం పలుకుల ప్రతిధ్వనులు 'తప్పెవరిది?' లో వినిపిస్తాయి

# మనోరమ

అలాగే, రాజమన్నారుగారి 'మనోరమ' నాటకంలో మనోరమ ఆలయసేవకు అంకితమైన దేవదాసి కొన్నాళ్లకు ఆమెకు వైవాహిక జీవితంపై ఆశ కలుగుతుంది ఒక ఆదర్శ యువకుడు ముందుకొచ్చి ఆమెను వివాహం చేసుకుని తనతో తీసుకువెళ్లాడు వారి వివాహాన్ని సంఘం సమ్మతించదు ముఖ్యంగా ఆ ఆలయపూజారి ఆమెకు అడుగడుగునా ఆటంకాలు కల్పిస్తాడు మనోరమను వెంటాడుతూ కట్టుకథలతో భర్త మనసులో అనుమాన బీజం మొలకెత్తేటట్లు చేయడంలో కృతార్థుడౌతాడు

ఆ స్థితిలో సహనం కోల్పోయిన మనోరమ పూజారిని అంతంచేసి తన సమస్యను పరిష్కరించుకొంటుంది బూజుపట్టిన సంప్రదాయ విలువల కోసం తన జీవితాన్ని బుగ్గిపాలు చేసుకోలేక సంఘంమీద తిరగబడి తన ఆత్మగౌరవాన్ని కాపాడుకోవటంలో ఆమె చూపిన సాహసం సభ్య ప్రపంచానికే ఒక సవాలు!

ఆధునిక యుగంలో స్త్రీ సమస్యలను వారి బాధామయగాథలను ప్రముఖంగా నాటకసాహిత్యంలోకి తెచ్చిన వారు రాజమన్నారుగారే! ఏమి మగవాళ్లు, నిష్ఫలం, దెయ్యాలలంక నాటికలను యిందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు స్త్రీ పాత్రలను అయోమయంలో చిక్కుకొని దిక్కుతోచక విలవిలలాడే బుచ్చమ్మలుగా కాకుండా, సమస్యలను తామే సరిదిద్దుకోగల సమర్థతగల ధైర్యవంతులుగా చిత్రించటంలో రాజమన్నారు గారి పాజిటివ్ ఎప్రోచ్ స్పష్టమవుతుంది

వేశ్యలను, వేశ్యావృత్తిని అసహ్యించుకునే మగవాళ్లు, అవకాశం దొరికితే వేశ్యాసంపర్కానికి అర్రులు చాచటం వారి మన ప్రవృత్తిలో అంతర్లీనంగా దాగివున్న సహజగుణమనీ, ఆదర్శం, విశాల హృదయం అనే ముసుగులో ఎంత హిపోక్రసీ ప్రదర్శించినా అది అన్నివేళలా చెల్లుబాటు కాదనీ, తాడెక్కే మనిషిని తలదన్నే వాళ్లుంటారని గ్రహించడం అవసరమనీ వెల్లడిచేస్తుంది రాజమన్నారుగారి నాటిక 'ఏమిమగవాళ్లు' (1947) గతజీవితంలో వేశ్యావృత్తితో జీవించిన కనకాంగిని విద్యాధికుడైన ఒక యువకుడు పెళ్లిచేసుకొని పట్నం నుంచి పల్లెటూరికి తీసుకొస్తాడు ఇంట్లో ఉన్న పెదనాన్న, యౌవనంలో ఉన్న తమ్ముడు, చుట్టపుచూపుగా వచ్చిన ఒక పెద్దమనిషి, ఏకాంతంలో ఎవరికివారు కనకాంగితో చొరవ తీసుకుని అనుచితంగా ప్రవర్తించి భంగపడతారు ఆ విషయం కనకాంగి చెప్పగావిని భగ్గున మండిపడుతూ భర్త అంటాడు "నీవే వాళ్లని బుట్టలో వెయ్యడానికి ప్రయత్నించివుంటావు వెనుకటి గుణం ఎక్కడికి పోతుంది అవును నీలాంటిదాన్ని పెళ్లి చేసుకోవడమే పొరపాటు" అని ఆమెను అసహ్యించుకొంటూ చిందులు తొక్కుతాడు అతని సంస్కారహీనతను అసహ్యించుకొని, మంగళసూత్రం తెంపిపారవేస్తూ "ఛీఛీ! ఏమి మగవాళ్లు!"

అంటూ అక్కడ్నుంచి వెళ్ళిపోతుంది కనకాంగి గతజీవితాన్ని ఆసరా చేసుకొని, శూలాలతో గుచ్చి బాధిస్తున్న సంస్కారంలేని మనుషుల మధ్య అభిమానాన్ని చంపుకొని అక్కడ పడుండవలసిన అక్కర ఆ అభిమానవతికి లేదు మరి! [13]

## నిష్ఫలం

ఆ విధంగానే మరో దృష్టికోణంనుంచి రాసిన నాటిక 'నిష్ఫలం' (1946) జమిందారు రంగారావు ఉంపుడుకత్తె చిత్రలేఖ వృత్తిరీత్యా వేశ్య అయినా నీతి నిజాయితీలలో, కులాంగనకు తీసిపోదు ఆర్థికంగా దెబ్బతిన్న జమీందారును అప్పులవాళ్లు పీడిస్తున్నారని తెలుసుకుని, తన నగలమ్మి అప్పులు తీరుస్తుంది ఆ సంగతి రంగారావుకు తెలియదు అప్పులవారి బాధతట్టుకోలేక ఒకరోజు రంగారావు భార్య సీతయ్యమ్మ చిత్రలేఖ ఇంటికొస్తుంది తనభర్తను ఋణవిముక్తుణ్ణి చేసి పరువు ప్రతిష్ఠలు కాపాడమని చిత్రలేఖను అర్థిస్తుంది నిజపరిస్థితి చిత్రలేఖ చెప్పగా విని సీతాయమ్మ, నిశ్చేష్టురాలవుతుంది కానీ ఆమె త్యాగనిరతిని హర్షించదు పైపెచ్చు ఆమె సౌందర్యాన్ని పణంగాపెట్టి మిగిలిన అప్పులు తీర్చమని సూచిస్తుంది జమీందారిణి వ్యక్తిగానైనా గౌరవించని జమీందారిణి కుసంస్కారాన్ని చూసి కోపంతో కళ్లలోంచి నిప్పులు కురిపిస్తూ, చిత్రలేఖ

"ఎంతగొప్ప ఊహ, ఎట్టి ఉదారస్వభావం పెండ్లాడిన భార్యవని మిడిసిపడుతున్నావు కాబోలు పాతివ్రత్యం ఇంకా మీవంటి వారి కాణాచి అనుకున్నావు ఆ గర్వంతోకదూ, ఈ విధంగా మాట్లాడుతున్నావు ? ఏమిటి నీ గొప్పతనం ? మీ పాతివ్రత్యం ? వేరేగతిలేక, స్వాతంత్ర్యంలేక, ధర్మమని, విధియని మీరు భర్తలమీది భక్తి, విశ్వాసం కనబరుస్తున్నారు మాబోటివాళ్లకు ఆ సంకెళ్లులేవు స్వచ్ఛంద వృత్తి ఈ కృత్రిమ బంధాలులేవు బలవంతపు పాతివ్రత్యం మీది నాది స్వతంత్రమైనది నాకు నిజంగా వారిమీద ప్రేమ విశ్వాసం విధియనిగాదు, ధర్మమనిగాదు, వేరే గతిలేక కాదు" ! [14]

అని మెత్తగా ఒంటినిండా పెట్టిన మాటల వాతలు భరించలేక

నిప్పులుగక్కుకుంటూ వెళ్లిపోతుంది జమీందారిణి ఏది ఏమైనా తాను చేసిన త్యాగానికి చిత్రలేఖకు దక్కిన ఫలితం - రంగారావు కృతఘ్నుడై ఆమెను నిరాధారంగా, నిర్దాక్షిణ్యంగా ఒంటరిదాన్ని చేసి వెళ్లిపోవడం ! విలాసపురుషుల సహజలక్షణాన్ని, దౌష్ట్యాన్ని, నైచ్యాన్ని బట్టబయలు చేస్తుంది నాటిక అంతేకాదు ప్రేమానురాగాలు మనసునిండా నింపుకొని తన సర్వస్వాన్నీ అర్పించే స్త్రీ కథ పునరావృతం అవుతున్నా అదేకథకు మళ్లీమళ్లీ కథానాయక అవుతూనే వుంది స్త్రీ ఇలాంటి కథ చర్విత చర్వణం కాకూడదు అనేది 'నిష్ఫలం' ఇస్తున్న సందేశం

ఇంత చిన్న నాటికలో చిన్నచిన్న మాటలతో చిత్రలేఖను హిమశైల శిఖరం మీదకూచోబెట్టి మరపురాని పాత్రగా తీర్చిదిద్దిన దృశ్యకావ్య నిర్మాత ధన్యుడనవచ్చు

## తిరస్కృతి

స్త్రీవాదానికి దగ్గరలో ఉన్న రాచకొండ విశ్వనాధశాస్త్రిగారి తిరస్కృతి (1957) నాటకం ఈ సందర్భంలో తప్పకుండా పేర్కొనదగింది మగవాడి స్వార్థానికీ, అహంకారానికీ బలి అయిపోతున్న ఆడది, అది తన తలరాత అని పరిస్థితులకు తలవొగ్గి పోయినంతకాలం ఆ స్త్రీ సమస్యలు, కష్టాలు పరిష్కారంకావనీ, ధైర్యంగా నిలబడి పరిస్థితులపై తిరగబడి స్వీయవ్యక్తిత్వాన్ని కాపాడుకున్నప్పుడే పురుషాధిక్యానికి పగ్గాలు పడతాయని ప్రబోధించారు ఆ నాటకంలో

జీవితంలో ఒక లక్ష్యం, ఒక గమ్యం, నీతి నియమాలు, మానవత్వం యివేవీ లేకుండా, స్త్రీని భోగ వస్తువు కింద జమకట్టి, విశృంఖలంగా విహరించే శ్రీమంతుడైన ఒక యువకుని వలలోచిక్కుకొని మోసపోతుంది ఒక పడుచుపిల్ల కామేశ్వరి చీకటి తప్పు వెలుగులోకి వచ్చి తన బ్రతుకును భయపెట్టే తరుణం ఆసన్నమైందని తెలుసుకొని పెళ్లిచేసుకోమని ఆ యువకుణ్ణి ప్రాధేయపడుతుంది లేడికన్నీళ్లకు వేటగాడు కరగకపోగా కసిరికొడతాడు దిక్కుతోచని పరిస్థితుల్లో ఆత్మహత్యే శరణ్యం అనుకొంటుంది తన తండ్రి స్నేహితుడు అడ్డుపడి ఆమెకు ధైర్యం చెబుతాడు మోసంచేసి ఆయువకుణ్ణి అదిలించి, బెదిరించి ఆమెతో పెళ్ళి

జరిపించడానికి తీవ్రప్రయత్నం చేస్తాడు కాని బలవంతంగా ఆమోసగాడిచేత మూడుముళ్ళు వేయించుకోవడానికి ఎదురుతిరిగి ఆ పెళ్ళి తిరస్కరిస్తుంది బ్రతుకుపోరాటం తన కుటుంబానికి కొత్తకాదని, తానూ కష్టాలకు ఎదురునిల్చి బతకగలనని ఆత్మస్థైర్యాన్ని ప్రకటించి వెళ్ళిపోతుంది

మగవాడు తాగుబోతు, పేకాటదాసు, పచ్చిదగాకోరు, దగుల్బాజీ అయినా, నువ్వేనాకు దిక్కుఅంటూ స్త్రీ అతగాడి కాళ్ళకు మొక్కి దీనంగా మొరపెట్టుకొనే రోజులు పోయాయి తన ఆత్మగౌరవానికి, వ్యక్తిత్వానికి హాని కలిగినప్పుడు మగవాళ్ళ ఆటలు కట్టించడానికి స్త్రీలు వెనుకంజ వెయ్యరని హెచ్చరికచేస్తుంది 'తిరస్కృతి' నాటకం ఈ నాటకంలో లైంగిక దోపిడిని, వ్యక్తిస్వేచ్ఛను శక్తిమంతంగా చిత్రించారు "స్త్రీ అయినా, పురుషుడైనా ఎవరిధర్మాన్ని వాళ్ళే నిర్ణయించుకోవాలి ఎవరి గమ్యాన్నివారే నిర్దేశించుకోవాలి ఒకరి వ్యక్తిగత జీవితంలో జోక్యం చేసుకోవటానికి మరొకరికి హక్కులేదు వ్యక్తి స్వేచ్ఛకు అడ్డొచ్చే ప్రతిశక్తిని ఎదిరించమన్నాడు చలం" చలం మాటలకు ఆచరణ రూపమే ఈ నాటకంలో కామేశ్వరి తీసుకున్న నిర్ణయం అనవచ్చు

## ఈ దశాబ్దంలో వచ్చిన నాటకాలు, నాటికలు (1980-1990) ;

స్త్రీల సమస్యలపై ముప్ఫయో దశకంలో పి వి రాజమన్నార్ ఎగరవేసిన బావుటా అవిచ్ఛిన్నంగా సాగుతూ ముందుతరాల వారికి మార్గదర్శకం అవుతూనే ఉంది ఇరువయ్యో దశకంలో "సమకాలిక సమాజం కొట్టిన దెబ్బలన్నీ తిని చలం ఈ నాటి స్త్రీవాదులకు మార్గాన్ని సుగమం చేశాడు అయితే, ఈనాటి కొందరు స్త్రీవాదుల్లా చలం స్త్రీకి పురుషుడు శత్రువని భావించలేదు "[15]

ఈ తరంలో, స్త్రీల దృష్టికోణంనుంచి పరిశీలించి పురుషులు రాసిన నాటకాలు, నాటికలు స్త్రీ వాదానికి బలాన్నిస్తూ, వాడినీ, వేడినీ చేకూరుస్తూ, గుణాత్మకరీతిలో ఉద్యమానికి దోహదం చేస్తున్నాయి ఇలాంటి నాటకాలు రాసినవారిలో ఇసుకపల్లి మోహనరావు, వి యస్ కామేశ్వరరావు, నుసుము నాగభూషణం, యస్ కె ఆంజనేయులు, ఏ భాస్కరచంద్ర, యస్సేరావులు -, పేర్కొనదగినవారు

# కాల జ్ఞానం

నుసుము నాగభూషణం రచించిన ఈ నాటిక నేటి సమాజంలో స్త్రీ ఎదుర్కొనే సరికొత్త సమస్యకు అద్దంపడుతూంది గర్భస్థ శిశువు మగ, ఆడ అని నిర్ణయించగల స్థితిలో నేటి శాస్త్ర విజ్ఞానం వుంది ఆడపిల్ల అంటేనే భయంతో అయిష్టత చూపే తల్లిదండ్రుల సంఖ్య అధికం మన సమాజంలో దుర్భరమైన ఆర్థిక, సామాజిక పరిస్థితుల వల్ల మగపెళ్ళివారు అడిగిన కట్నాలు యిచ్చుకోలేక ఆడపిల్ల తల్లిదండ్రులు అనుభవించే మనోవేదన, అగచాట్లు అన్నీయిన్నీకావు ఈ పరిస్థితుల్నించి బయటపడటానికి ముందుచూపుతో అసలు ఆడపిల్ల భూమిమీద పడకుండా ఆదిలోనే నివారిస్తున్నారు పుట్టబోయేది ఆడపిల్ల అని నిర్ధారణ అయిన మరుక్షణమే గర్భస్రావం చేయించడానికి ప్రయత్నాలు చేస్తుంటారు కొందరు సృష్టికి మూలమైన స్త్రీ పట్ల ఈ విధమైన అమానుష ధోరణి ప్రదర్శిస్తే, ఈ అవాంఛనీయ పరిస్థితులు ఇలాగే కొనసాగితే మానవజాతి మనుగడ భయంకర పరిణామాలకు దారితీయడమేగాక భూతలంమీద మానవజాతి తుడిచిపెట్టుకు పోయే ప్రమాదం ఉంది 'కాలజ్ఞానం' నాటికలోని ప్రధాన వస్తువిది ఈ చరాచర సృష్టిలో మగవాడు బ్రతకడానికి ఎంత హక్కుందో ఆడపిల్లకూ అంతే హక్కుంది ఒకరి జననాన్ని నిరోధించే హక్కు ఇంకొకరికి లేదు ఉండకూడదు ఒకవేళ మగవాడు ధిక్కరిస్తే స్త్రీ శక్తి ప్రతిఘటిస్తుందనే హెచ్చరిక ఉంది ఈ నాటికలొ

భారతి ప్రసవించబోయేది ఆడపిల్ల అని పరీక్ష ద్వారా తెలుసుకున్న చంద్రం గర్భస్రావం చేసుకోవాలని భార్యను ఆదేశిస్తాడు ఆపని ఇంట్లో ఎవరికి ఇష్టం లేకపోయినా కాదనలేకపోతారు భారతి తీవ్ర మానసిక క్షోభకు గురి అవుతుంది ఆస్థితిలో ఆ ఇంటి యజమాని మారుతాత్మజం ఆమెకు మనోధైర్యాన్ని ఇస్తాడు ముగ్గురు ఆడపిల్లల తండ్రి మారుతాత్మజం, జీవితంలో ఎంతో విషాదాన్ని చవిచూసిన వ్యక్తి ఆడపిల్లల్ని శారీరకంగా ఏలోటు లేకుండా పెంచటమే కాదు, వారికి మానసిక ధైర్యం కూడా ఇవ్వాలి "చిటికెడు జ్ఞానం, పిడికెడు ఆత్మజ్ఞానం పిల్లలకివ్వాల్సిన ఆస్తి" అని అనుభవంమీద ఆలస్యంగా తెలుసుకున్నాడు ఆ

బస్సు ఛార్జీలకు కూడా ఏరోజు కారోజు భర్తను అడగాల్సిన దుస్థితిలో పడి క్రుంగిపోతుంది

నారాయణ ఒక్కడే సంపాదిస్తున్న రోజుల్లో భారతి నిస్సహాయ స్థితిలో ఉన్న తన తల్లికి అడపాతడపా డబ్బు పంపుతూ ఉండేది "అలాగే పంపించు కాదన్నానా? వాళ్లకు మాత్రం ఎవరున్నారు? మనకున్న దాంట్లోనే కొంచెం వాళ్లకి - సరేనా?"[16] అని విశాల హృదయంతో అంగీకారం తెలిపిన భర్త ఇప్పుడు మారిపోయాడు "నీకు సంపాదించే అర్హతేకాని ఖర్చుపెట్టుకునే హక్కులేదు ఆవు మనింట్లో గడ్డితిని పక్కింట్లో పాలిస్తే చూసి సహించే వాడ్నికాదు కొమ్ములు విరిచేసి పొదుగులు కోసేస్తాను మైండిట్"[17] అనే సంకుచిత మనస్తత్వానికి దిగజారిపోయాడు రెసిడెన్షియల్ స్కూల్లో చదువుతున్న బిడ్డ తీవ్రమైన జ్వరంతో బాధపడుతూ తల్లిని చూడాలని కలవరిస్తూన్నాడని ఉత్తరం వస్తే,ప్రమోషన్‌కోసం రాయాల్సిన 'ఎలిజిబిలిటీ టెస్టు' రాసి కదలమంటాడు భర్త "ఆరు నూరైనా నేనీ పరీక్ష రాయనంటే రాయను నేనిప్పుడే నా బాబుని చూడాలి' ' అని పట్టుపడుతుంది భారతి "నేను చెప్పేది వినవా? నేను నీ మొగుడ్ని " అని అహంకారంతో హుంకరించినపుడు,సహనం కోల్పోయి, సాహసానికి తెగబడిన భారతి, గొంగళి పురుగును దులిపేసినట్టు భర్తను అసహ్యించుకొంటూ

"ఓహో మొగుడు! అంటే ఒక మగాడు నాలానే పోస్ట్ గ్రాడ్యుయేషన్ చేశాడు నాలాగే ఉద్యోగం చేస్తున్నాడు నేనెంత సంపాదిస్తున్నానో అంత సంపాదిస్తున్నాడు అంతేనా లేక యింకేమైనా ప్రత్యేకతలున్నాయా? కానీ నాకున్న అదనపు అర్హత నేను తల్లిని నా బిడ్డకు జన్మనిచ్చాను నువ్వివ్వగలవా? 'పెళ్లి' అనే సామాజిక కట్టుబాటుతో మొగుడుగా మీకు అహంకారంవుంటే అనుకున్నది సాధించే స్త్రీ శక్తిగా నాకు ఆత్మస్థైర్యం ఉంది సామాజిక కట్టుబాటు ననుసరించి ప్రకృతి ధర్మంగా పునరుత్పత్తికి మాత్రమే పురుషుడు నేడు స్త్రీకి అవసరం ఒక్కసారి ఆ శృంఖలాలుకూడా తెంచుకుంటే టెస్ట్‌ట్యూబ్ ద్వారా కూడా మేం తల్లులం కావచ్చు అప్పుడు అప్పుడు పురుషుడితో కలిసిజీవించాల్సిన అవసరం కూడా ఆడవాళ్లకుండదు కానీ మీ అదృష్టం మన

సాంప్రదాయం యింకా అంత అభివృద్ధిని ఆమోదించలేదు   నా వుద్యోగం నేను చేయాలో అక్కర్లేదో నేను నిర్ణయించుకోలేనప్పుడు, నా శరీరాన్ని, శారీరక శ్రమనేతప్ప మనసుని ప్రేమించలేని మీతో నేను కాపురం చెయ్యను  చెయ్యలేను గుడ్ బై  "[18] అంటుంది

ఆ సమయంలో, సంస్కార హృదయం వున్న మామగారు కల్పించుకుని "అమ్మా భారతీ! నేను నీ అంత చదువుకోలేదు  నీ అంత ఆలోచనాలేదు  కాని ఏ మామగారూ చెప్పంది చెబుతున్నా తల్లీ   ఈ ధనపిశాచిని వదలివెళ్లిపో - హాయిగా స్వేచ్ఛగా బ్రతుకు  ఈ ఉద్యోగం చేయించటమే స్త్రీకి స్వేచ్ఛ అంటే రొమ్ము విరుచుకుంటున్న వీడిలాంటి మగాళ్లకు తగిన గుణపాఠం చెప్పేవిధంగా వెళ్లు తల్లీ!  వ్యక్తిగత స్వేచ్ఛలేనంత కాలం స్త్రీకి అసలైన స్వేచ్ఛ లేదు తల్లీ! ఫో! నిర్భయంగా ఈ సమాజంలో బ్రతుకు   నిర్భయంగా"[19] అంటూ ఆమెను మనస్ఫూర్తిగా దీవిస్తాడు

ఇంట్లోనుంచి భారతి వెళ్లబోతుండగా నారాయణ పశ్చాత్తాపంతో అడ్డుకుంటాడు  హాల్‌టికెట్ చింపేస్తాడు  ఎక్కడ్నుంచో దూరంగా "కొత్తబంగారు లోకం" వినిపిస్తుండగా దు ఖంతో భారతిచేతులు పట్టుకుని "నన్ను క్షమించు భారతీ! నేను మధ్యతరగతి మగవాణ్ణి.క్షమించు" అనటంతో నాటిక ముగుస్తుంది

చదువుకొని ఉద్యోగం చేస్తున్న తల్లిదండ్రులు చేసిన నిర్లక్ష్యానికి నిరాదరణకు బలిపశువుగా మారి మందమతిగా సంచరించే 'నాని' కూడా ఆ సన్నివేశం చూసి ఎంతో ఉప్పొంగిపోతాడు

ఆరోహణ క్రమంలో సాగే సంఘటనల పరంపర, పాత్రోన్మీలనం, అద్భుతమైన పాత్రచిత్రణ ఈనాటికలోని ప్రత్యేకతలు  శృంగారపు జల్లులతో ప్రారంభమై, సున్నిత హాస్యంతో తడిసి, కరుణార్ద్ర సన్నివేశంతో పతాక స్థాయికి చేరుకొంటుంది నాటిక  కావ్యార్థాన్ని ఎక్కడో ఒకచోట రచయిత పని గట్టుకుని చెప్పినట్టు కాకుండ, సన్నివేశ కల్పనలో, పాత్ర చిత్రణలో, సంఘర్షణలో మేళవించి బహిర్గతం చేశారు  ఈ నాటికలో ఏ పాత్రకు ఆ పాత్ర తన ప్రత్యేకతను, నిలుపుకొంటూనే సందేశాన్ని ఆవిష్కరించే అంశంలో ఏకోన్ముఖం కావటం,

నాటకకర్తలోని నాటక నిర్మాణ దక్షతను ధ్రువీకరిస్తుంది హిమాగ్నిలో భారతి - నారాయణల దాంపత్యజీవితంలో చెలరేగిన కల్లోలం అధికారిక ఇతివృత్తం కాగా, నానీ ఉదంతం ప్రాసంగికం ఇక్కడ రెండూ శక్తిమంతమైనవే! అయితే అధికారికేతివృత్తాన్ని ప్రాసంగికేతివృత్తం కబళించకుండా జాగ్రత్తపడుతూ పతాక సన్నివేశంలో ఆరెంటినీ హృద్యంగా అనుసంధానం చేసిన రచయిత నాటకశిల్పంప్రశంసార్హమైంది

కళా భారతి ప్రొద్దుటూరు వారిచే ఈ నాటిక ఆంధ్రప్రదేశ్‌లో అనేక నాటకపోటీలలో ప్రదర్శించబడి, ఉత్తమ ప్రదర్శనకు, రచనకు ఎన్నో బహుమతులు పొంది బహుళ జనాదరణ పొందింది

## రాధికాస్వాంతము:

యస్ కె ఆంజనేయులుగారు రచించిన 'రాధికా స్వాంతము' ప్రేక్షకుల మస్తిష్కానికి మేతపెట్టే తర్కబద్ధమైన నాటిక స్త్రీ స్వేచ్ఛ అనే సమస్యను సరికొత్త కోణంనుంచి విశ్లేషించిన నాటిక ఇది

సమస్యను ప్రవేశపెట్టిన తీరు, కథనం, ముగింపులో నవ్యత్వం కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది ఈ నాటికలో కథానాయిక ప్రవర్తించేతీరు ఎప్పటికప్పుడు ప్రేక్షకుల లేదా పాఠకుల అంచనాలను తారుమారుచేస్తూ వుండటం ఒక ప్రత్యేకత

తరతరాలుగా స్త్రీ పరాధీనగానే బ్రతుకుతున్నది బాల్య, కౌమార దశల్లో తండ్రిచాటున పెరుగుతుంది యౌవన దశలో భర్త రక్షణలో ఉంటుంది వార్థక్యంలో కొడుకు అండన బ్రతుకుతుంది దీనివల్ల స్త్రీల వ్యక్తిత్వ వికాసానికి ప్రతి దశలోను అడ్డుగోడలున్నట్లు అవగతమవుతుంది స్త్రీ జీవనోత్సాహాన్ని కోల్పోతుంది

ఈ నాటికలో రాధిక కోరుకునేది స్త్రీ స్వేచ్ఛకాదు "ఈ సభ్య ప్రపంచంలో సజీవ సంబంధం తన ఉనికివల్ల స్త్రీ లోకంలో ఏదో ఒక సంచలనం ఒక స్పందన - ఒక చలనం"[20] కలగాలని తపన పడుతుంది జీవనోత్సాహంకోసం అన్వేషిస్తున్నది ' ఆమెసాగిస్తున్న పోరాటం ఐడెంటిటీ కోసం!

బాల్యంలో ఉన్నప్పుడే తండ్రిలో గూడుకట్టుకున్న పురుషాధిక్యతను చూసింది కౌమార దశలో తండ్రి నియంతృత్వాన్ని బాగా అర్థం చేసుకొంది తాను నిర్ణయించిన వరుణ్ణే పెళ్లాడమని శాసించినపుడు ఇక భరించలేకపోయింది పురుషాహంకారం మీద తనలో రగులుకుంటున్న ద్వేషాన్ని ఒక్కసారిగ వెళ్లగక్కింది

"నిజమే అంటున్నా నాన్నా! నా ఇష్టాన్ని మీరెప్పుడైనా ఆమోదించారా? మీకు నచ్చి మీరు తెచ్చిన చీర కట్టుకున్నాను మీరు చెప్పిన వాళ్లతో స్నేహం చేశాను తీసిన ఊపిరి, వేసిన అడుగు, పోసుకునే నీళ్లు, రాసుకునే పౌడరు అన్నిటిమీద మీ అభ్యంతరాలు వుండేవి నేనేపని చేద్దామన్నా మీ పర్మిషన్ కావలసివచ్చేది చివరకి - చివరకి నాకిష్టమైన చదువు నన్ను చదవనివ్వలేదు మీ కోసం నా కోర్కెలు చంపుకున్నాను అప్పుడు నాకు ఓ వ్యక్తిత్వం వుంది నాన్నా! పురుషాధిక్యత పురులువిప్పి నాట్యం చేస్తున్న ఈ సమాజంలో ఆడదానికిఏ విషయంలోనూ స్వేచ్ఛలేదని తెలుసుకున్నాను"[20] అని కుండబద్దలుకొట్టి చెప్పగలిగే స్థాయికి ఎదిగింది రాధిక

కూతురు ఎదురుతిరిగి మాట్లాడటం తండ్రికి షాక్ తగిలినట్లు అయ్యింది ఆ హఠాత్పరిణామానికి తట్టుకోలేక అతని ఆత్మ ఎప్పుడో అనంతవాయువుల్లో కలిసిపోయింది నిర్జీవంగా పడిపోయిన తండ్రిని చూసి ఆమె చలించలేదు అతడు కప్పుకొన్న తుండు ఆ శవం మీద కప్పి నిశ్చలంగా చూస్తూ నిలబడింది

"గుడ్! మీ పురుషాధిపత్యంతో నా నోరు మూయించారు ఇంతకాలం ఇప్పుడు నేను నోరు తెరిచేసరికి మీరు కళ్లు మూసుకున్నారుకదూ! నా కౌమరం అంతా తండ్రిచాటు కట్టడిలో ఇలా ముగిసిపోయింది ఇహ రానున్న యౌవనవార్థక్యాలలోనైనా స్వేచ్ఛా వాయువులు పీల్చగలనా?"[22] అనుకుంది

రైల్వే స్టేషన్ వెయిటింగ్ రూములో పరిచయమైన మధుకర్‌ను తన జీవిత భాగస్వామిగా చేసుకుంది కొన్ని కొన్ని విషయాలలో అతనితో రాజీపడలేకపోయింది మధూని ఇంట్లోనుంచి వెళ్లగొట్టింది అప్పటినుంచీ ఒంటరి పోరాటానికి సిద్ధమైంది కొడుకుతోనూ అభిప్రాయ భేదాలొచ్చాయి పతితల ఉద్ధరణకోసం వీళ్లతో కలిసి తిరగవద్దని ఆంక్షలు పెట్టాడు కొడుకు అంటే వృద్ధాప్యంలోకూడా కొడుకు

రూపంలో పురుషాధిక్యతను చవిచూసిందామె ఆవేశంతో కొడుకును చురకత్తితో చంపేసింది ఇక్కడ కథానాయిక చంపింది కొడుకును కాదు పురుషాహంకారాన్ని - ఆధిక్యతను - అతిశయాన్ని - అధికారాన్ని అని అర్థం చెప్పించారు ప్రయోక్తద్వారా రచయిత

రాధిక ఆంతర్యాన్ని గురించి అపోహలకు తావులేకుండా ప్రయోక్తచేత కావ్యార్థాన్ని ఇలా వ్యక్తం చేశారు

"ఆమె ఆంతర్యం మీరు ఊహించినట్టు సమానహక్కు కానేకాదు భౌతికంగా, అనుభూతిపరంగా స్త్రీ స్పందించినట్టు పురుషుడు ఆలోచించలేడు మరి సమానత ఏమిటి? ఇప్పుడు స్త్రీ నినాదం సమానత్వం కాదు ప్రత్యేకత, గుర్తింపు, ఐడెంటిటీ! స్త్రీలు తమ ప్రత్యేక అస్తిత్వాన్ని నిరూపించుకోవాలి వాళ్ల మాటల్లో - చేతల్లో - ఆలోచనల్లో - బలహీనంగా, సుకుమారంగా వుండకుండా దృఢమైన స్త్రీత్వాన్ని కనపరచాలి, మగవాళ్లు మనకు నేర్పినట్టు కాకుండా మన పద్ధతిలో మనం ఆలోచించడం నేర్చుకోవాలి మనకేది మంచిదో మనమే నిర్ణయించుకోవాలి స్త్రీ విలువను పున ప్రతిష్ఠించుకోవాలి"[23] అని వ్యాఖ్యానించారు

నాటికను సిద్ధాంతపరమైన చర్చావేదికగా మార్చకుండా జాగ్రత్తగా, అతి చాకచక్యంగా నడిపించారు రచయిత అయితే ఈ నాటికలోని సన్నివేశాలు, కథాగమనం, పాత్రల ధోరణి జాగ్రత్తగా వ్యక్తిత్వాన్ని స్థాపించే ప్రయత్నంలో పురుషాహంకారాన్ని తీవ్రంగా దుయ్యబడతై అంతవరకు సమంజసమేగాని, రాధిక ప్రవర్తించిన వైఖరి పురుషాధిక్యత స్థానంలో స్త్రీ ఆధిక్యతను ప్రతిష్ఠించినట్లు కనబడుతుంది రచయిత ప్రతిపాదించిన స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్‌కి అర్థం పురుషాధిక్యతకు ప్రత్యామ్నాయంగా స్త్రీ ఆధిక్యతను నిరూపించడం అనికాదుగదా?

1987లో ఆంధ్రజ్యోతి పత్రిక నిర్వహించిన దీపావళి ఏకాంక నాటికల పోటిలో 'రాధికా స్వాంతము' నాటికకు ఉత్తమ బహుమతి లభించింది

## హరిత

ఎస్ ఏ రావుగారు రచించిన ఈ నాటికకు 'హరిత' అన్న పేరు ఇతివృత్తంలో అందంగా వొదిగిపోయి, మాతృత్వానికి ప్రతీకగా, సార్థకంగా ఉంది

పిల్లలు కావాలన్న కోరిక సాధారణంగా స్త్రీలకే ఉంటుంది మాతృత్వం స్త్రీ జీవితానికి నిండుతనాన్ని, హక్కును ప్రసాదిస్తుందన్న భావన దీనికి ఆలంబన కావచ్చు కానీ ఈ నాటికలో పెళ్లయి పదేళ్లుదాటినా పిల్లలు లేరన్న బెంగ మానసికంగా మదన్‌ను ఎంతోక్రుంగదీస్తుంది అతనిలో లోపాన్ని వేలెత్తిచూపుతూ స్నేహితులు చాటుమాటుగా నవ్వుకోవడం, చులకనగా మాట్లాడటం మదన్ తట్టుకోలేకపోతాడు తనంటే పంచ ప్రాణాలిచ్చే భార్యను, విడాకుల పత్రంమీద సంతకం చెయ్యమని కోరినపుడు హరిత నిర్ఘాంతపోతుంది ఏడుస్తుంది బ్రతిమాలుతుంది కాళ్లపైబడి ప్రార్థిస్తుంది కాని మదన్ చలించడు తననిర్ణయాన్ని మార్చుకోడు

"సంప్రదాయం తాళికట్టిన భర్తతో బ్రతకమని ఆదేశిస్తున్నా, సంస్కారం ఒంటరిగా అయినా తలెత్తుకుని జీవించమని హెచ్చరిస్తుంది ఆత్మస్థైర్యం గల ఆడది మగవాడి నీడలేకపోయినా మనుగడ సాధించగలదన్న సత్యాన్ని నిరూపించడంకోసమైనా నేను ఒంటరిగా బ్రతకాలి ఈ నిశ్చయంతో, దృఢ సంకల్పంతో ఈ విడాకుల పత్రంమీద సంతకం పెడుతున్నాను "[24] అంటుంది హరిత

మదన్ రెండోపెళ్లి చేసుకుంటాడు ఒక బాబుకు జన్మనిచ్చి ఆ భార్య చనిపోతుంది బాబును అపురూపంగా పెంచుకొంటూ వుంటాడు మదన్ అతని కథ మరో మలుపు తిరుగుతుంది అతనిస్నేహితుడైన డాక్టర్ సుదర్శనం ఒకనాడు మదన్ ఇంటికివస్తాడు హరిత విడాకుల విషయం, రెండో భార్యకు బాబు జన్మించటం ఇవన్నీ విని ఆశ్చర్యపోతాడు అప్పుడు అసలు రహస్యం ఇలా బయటపెడతాడు

"మదన్! నీ ప్రాణస్నేహితునిగా నీకోనిజం చెప్పడం నాధర్మం చనిపోయిన నీ భార్య ఆ బిడ్డకు తల్లికావచ్చు కాని, నువ్వు మాత్రం తండ్రివనిపించుకోలేవు ఎందుకంటే నీవలన సంతానం కలిగే అవకాశం లేదుకాబట్టి చాలామంది పురుషులకు నీలాగే పుంసత్వం వుంటుంది కానీ మా మెడికల్ పరిభాషలో చెప్పాలంటే కొంతమంది రేతస్సులో 'స్పెర్మటోజా'

అంటే జీవాణువులుండవు కొన్ని వంధ్యత్వాలకు కారణ ఇదే! నీకేసు కూడా అటువంటిదే!"[25]

"నిప్పులా దహించివేసే ఆ నిజాన్ని హరిత తన గుండెల్లోనే దాచుకుంది ఆలోపం నీలోనే ఉందని తెలిస్తే ఉద్రేకంలో ఏ అఘాయిత్యానికి తలపడతావోనని భయపడి అపనిందను తన నెత్తిన వేసుకుంది హరిత పేరులోనే కాదురా! మాతృమూర్తి కాగల పచ్చదనం ఆమె స్త్రీత్వంలో కూడా వుంది హరితా ఈజ్ గ్రీన్"[20]

తనలోనే లోపం పెట్టుకొని భార్యమీద నిందవేసి హరితను అన్యాయం చేసినందుకు కుమిలిపోతాడు మదన్

మదన్ ఆరోగ్యం క్షీణిస్తుంది అతని దగ్గరుండి జాగ్రత్తగా ట్రీట్‌మెంట్ ఇచ్చే సాకుతో హరితను పిలిపించి వాళ్లిద్దర్నీ దగ్గరకు చేరుస్తాడు డాక్టర్ అహర్నిశలూ దగ్గరుండి మదన్‌కి సపర్యలు చేస్తుంది క్రమంగా మదన్ కోలుకొంటాడు ఇక హరిత తనతోనే వుంటుందని ఆశపడతాడు "హరితా! నిన్ను క్షమించమని అడిగే అర్హత నాకులేదు కానీ, క్షమించే ఔదార్యం నీకుంది నన్ను క్షమించు హరితా' '[27] అని ఆమెను ప్రాధేయపడతాడు హరిత చలించదు ఉన్నట్టుండి ఆమెలో అగ్నిపర్వతం బ్రద్దలైంది

"ఒకరోజున నేను, నా తండ్రి ఇలాగే మీ కాళ్లమీదపడి కన్నీళ్లతో ప్రాధేయపడ్డాం కానీ, మీ మనసు కరగలేదే! ఎంత ఆడదాన్ని అయితే మాత్రం నాకూ ఆత్మాభిమానం వుందండీ! నేనుగనక మిమ్మల్ని క్షమించి మళ్లీ మీతో కాపురం చేస్తే, మా స్త్రీ జాతి అంతటినీ అవమానించినట్టు అవుతుంది ఆడవారికో నీతి, మగవారికో నీతీనా? నో! ఇద్దరికీ సమానమైన న్యాయమే జరగాలి ఏది ఏమైనా మిమ్మల్ని నేను క్షమించలేను నా జీవితంలోకి ఆహ్వానించలేను"[28] – హరిత గొంతు ప్రతిధ్వనిస్తుండగా మదన్ అంధకారంలో కలిసిపోయాడు నాటిక అలా అంతమవుతుంది

క్షమాగుణం అనే లక్షణం స్త్రీలకు పుట్టుకతో వచ్చిన ఒక ఆభరణమే అయినా, ఈ నాటికలో హరిత, భర్త క్షమార్హుడుకాదని నిర్ద్వంద్వంగా నిర్ణయించడం, అతనివల్ల ఆమె అనుభవించిన మానసిక క్షోభ తీవ్రతను తెలియజేస్తుంది

కరుణరస ప్రధానమైన ఈ నాటిక హృదయాన్ని మెదడునీ ఆకట్టుకొంటుంది ప్రదర్శనానంతరం ప్రేక్షకుల్ని ఆలోచింపజేస్తుంది సాత్త్వికాభినయ ప్రధానమైన ఈ నాటిక నటీనటుల సామర్థ్యానికి అగ్నిపరీక్ష పెడుతుంది ప్రతీకాత్మకంగా సూచించబడే ఊహాదృశ్యాలు, సాంకేతిక విలువలు ప్రదర్శనకు మరింత వన్నెతెస్తాయి ఈ నాటికను జయ కళానికేతన్, విశాఖపట్నంవారు రాష్ట్రంలో విరివిగా ప్రదర్శించి ప్రశంసలు పొందారు శ్రీమతి ఆలపాటి లక్ష్మి, శ్రీ కె వెంకటేశ్వర్రావు తదితరులు 'హరిత' ప్రదర్శనకు జీవం పోశారు

## కొయ్యగుర్రం

ఏ భాస్కరచంద్ర రచించిన 'కొయ్యగుర్రం' నాటిక, నేటి సాంఘిక వ్యవస్థలో శక్తిమంతమైన ఆయుధంగా రూపుదిద్దుకొంటున్న స్త్రీవాదానికి, ఒక విలక్షణమైన వ్యాఖ్యానంగా పేర్కొనవచ్చు సాంఘిక జీవితంలో ముఖ్యంగా వైవాహిక వ్యవస్థలో సమూలమైన, విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావాలనే లక్ష్యంతో సుడిగాలిలా దూసుకు వస్తున్న స్త్రీవాదం, కొన్ని సందర్భాలలో వెర్రితలలు వేస్తున్న వైనాన్ని 'కొయ్యగుర్రం' వ్యక్తం చేస్తుంది

స్వార్థం మూర్తీభవించిన తత్త్వంతో విశృంఖలంగా సాగే పురుషాధిపత్యాన్ని దురహంకారాన్ని నిరసిస్తూ, ప్రతిఘటించడంలో నేటి మహిళలు ముందంజవేస్తున్న వైఖరి సమర్థనీయమూ, అభిలషణీయమే అయినా. ఉచితానుచితాలు పాటించని కొన్ని తొందరపాటు నిర్ణయాలు దు ఖ హేతువులు అవుతాయని నిరూపిస్తుంది ఈ నాటిక

**కొయ్యగుర్రంలో ఇతివృత్తం ఇది·**

వినాయకరావు మధ్యతరగతి కుటుంబీకుడు ఏదో ప్రైవేటు కంపెనీలో ఉద్యోగం చేస్తూ కుటుంబాన్ని పోషిస్తున్నాడు ఒక పోర్షన్‌లో అద్దెకు ఉంటున్న పీతాంబరం ఇచ్చే అద్దె వేన్నీళ్లకు చన్నీళ్లుగా ఉపయోగపడుతోంది ఊర్మిళ, భానుమతులు వినాయకరావు కుమార్తెలు ఊర్మిళ మూగపిల్ల ఆమెకు వివాహం అయింది ఇచ్చిన కట్నంతో భర్త దుబాయ్‌కెళ్లి అక్కడ ఉద్యోగం చేస్తున్నాడు

అతనొచ్చి తనను తీసుకెళ్తాడని నాలుగేళ్లుగా అతనికోసం ఆశగా ఎదురు చూస్తోంది ఊర్మిళ వచ్చే జాడ కనబడకపోగా అతనివద్దనుంచి ఒక్క జాబైనా లేదు

చిన్నకూతురు భానుమతి ఆధునిక భావాలు ముఖ్యంగా స్త్రీ వాద భావజాలాన్ని పుణికిపుచ్చుకున్న యువతి తండ్రి తెచ్చిన పెళ్లి సంబంధాన్ని ఇష్టపడదు భానుమతి

అరేంజ్డ్ మేరేజి పట్ల ఆమెకు మొదటినుంచీ వైముఖ్యం అది వరకు ఎన్నడూ పరిచయంలేని వ్యక్తితో, అతని ఇష్టాయిష్టాలు, సంస్కారం తెలియని వ్యక్తితో వివాహం అంటే భానుమతి తత్త్వానికి సరిపడని సంగతి అంతేకాకుండా రాంగోపాల్ అనే యువకుడికి ఆమె మనసిచ్చింది ఆ విషయం నిర్భయంగా తండ్రితో చెప్పింది కూడా ఆమె అభిమతానికి అనుగుణంగా రాంగోపాల్‌తోనే భానుమతి వివాహమైంది "పెళ్లయిన తర్వాత ముక్కుమొహం తెలియని చోటికి కేవలం ఒక మగాణ్ణి నమ్ముకుని స్త్రీ ఎందుకెళ్లాలి? ఇది నా ఇల్లు - నాయింట్లో నేనుంటాను నన్ను కావాలనుకున్నవాడు నా దగ్గరే వుంటాడు"[29] అని వాదించే మనస్తత్త్వంగల భానుమతిఇష్టానుసారంగానే భర్త ఇల్లరికం వచ్చాడు రాంగోపాల్ సౌమ్యుడు భానుమతి దురుసుతనాన్ని అర్థం చేసుకొని ఎప్పటికప్పుడు సర్దుకుపోయే తత్త్వంగల మంచిమనిషి అడుగడుగునా ఆంక్షలు విధిస్తూ అతని స్వాతంత్ర్యాన్ని హరించివేస్తుంది ఊర్నించి వచ్చిన ఆప్తమిత్రుడ్ని ఇంటికి తీసుకురావడానికి వీల్లేదని కూడ ఆ ఆజ్ఞ జారీచేస్తుంది ఆమె ప్రవర్తన చూసి తండ్రి హితబోధచేసినా ఖాతరు చేయదు భానుమతి తన అందం పాడై పోతుందని భర్తతో మాటమాత్రమైనా చెప్పకుండా అబార్షన్ చేయించుకొంటుంది

ఇంతకాలం ఎన్నో విషయాలలో సహనం వహించి సర్దుకుపోయిన రాంగోపాల్ ఇక భరించలేకపోతాడు "శిఖరాగ్రాన పూసిన పూవును చూసుకుని మురిసిపోతుంది చిన్న గులాబి మొక్క చివరికి రోడ్డు ప్రక్కనున్న కుక్క సైతం పిల్లల్ని అక్కున చేర్చుకుంటుంది అలాంటి ఆనందాన్ని, నేను తండ్రిని కాబోతున్న ఆనందాన్ని క్రూరంగా హేయంగా నాశనం చేశావ్ ఎందుకు ఎందుకు అని నిన్ను ప్రశ్నించను నిన్ను నేను ప్రేమించాను భానూ! ఇట్

రిక్వయిర్స్ రిసిప్రొకేషన్! ఎంతసేపూ 'నేనే నేను' అనడం తప్ప 'మనం' అనలేని నీతో ఏ అనుభూతులు పంచుకోమంటావ్? మనల్ని మనం మోసం చేసుకుంటూ ముఖానికి రంగువేసుకుని బ్రతకడం నా వల్ల కాదు నా వల్ల కాదు గుడ్‌బై!"[30] అంటూ రాంగోపాల్ ఆమె జీవితంలోంచి దూరంగా వెళ్లిపోయాడు

ఇంతలో పులిమీద పుట్రలాగ దుబాయ్‌నుంచి ఉత్తరం వస్తుంది ఊర్మిళకు విడాకులిచ్చి తాను వేరొక వివాహం చేసుకోబోతున్నట్టు అల్లుడు గారి లేఖలోని సారాంశం! ఉత్తరం చదివిన ఊర్మిళ హతాశురాలై ఏడుస్తుంది

వినాయకరావు కుటుంబంతో సన్నిహిత సంబంధం ఉన్న పరబ్రహ్మం, ఇల్లు విడిచిపోయేందుకు సిద్ధపడుతున్న భానుమతి ప్రవర్తనలో మార్పు తేవాలని చివరి ప్రయత్నం చేస్తూ ఇలా అంటాడు!

"భానూ! భార్యాభర్తల అనుబంధం ప్రేమతోనూ, అనురాగంతోనూ రోజురోజుకీ పెంపొందాలి తప్ప సిద్ధాంతాల పేరుతో ముక్కలు కాకూడదమ్మా స్త్రీ పురుషులు చేసుకునే సామాజిక సర్దుబాటునే వివాహం అంటారు దానికి చట్టాలు, సిద్ధాంతాలూ సహకరిస్తాయే తప్ప జీవితాలను నిర్దేశించలేవమ్మా! ఎవడో మీ బావలాంటి వాడు ఒకడో యిద్దరో ఉన్నారని అసలు మగవాడ్నే నమ్మననటం మూర్ఖత్వం! అసలు ఈ ప్రకృతిలోనే చీకటి, వెలుతురు, వెన్నెల, అమావాస్య, ఎండలు, వర్షాలు లాంటి వైరుధ్యాలున్నాయి సృష్టి మనుగడకు ఈ వైరుధ్యమే తోడ్పడుతుంది పురుషుడి అహంకారం మీద, పురుషాధిక్యతా భావనమీదా యుద్ధంచెయ్, అంతేకాని పురుషుడ్ని శత్రువుగా భావించకు పోనీ పురుషుడే శత్రువు అనుకుంటే స్త్రీలంతా సుఖంగా వుండగలరా? జీవితమంటే సిద్ధాంతాలు కాదు జీవితమంటే మనసుపొందే అనుభూతులు, మమతలు, మమకారాలు, కలలు, కన్నీళ్లు యివన్నీ వున్నదే జీవితం! హాయిగా నువ్వు - మనసారా యేడ్చెయ్ ఏది సత్యమో, ఏదసత్యమో అన్వేషించి తెలుసుకో - అలా అన్వేషించటానికి మనసును సిద్ధం చెయ్ అంతేకాని, కొయ్యగుర్రం ఎక్కి యుద్ధం చేయాలని ప్రయత్నించకు అది నిన్నుఅటూయిటూ వూపుతుందే గాని గమ్యం చేర్చదు"[31] అని నిర్మాణాత్మకమైన హితబోధ చేస్తాడు భానుమతి ఆలోచనలో పడుతుంది

ఈ నాటికలో సంప్రదాయ వివాహం చేసుకున్న అక్క, ప్రేమ పెళ్లి చేసుకున్న చెల్లెలు - ఇద్దరి జీవితాలు దుఃఖాంతంగా పరిణమిస్తాయి ఇద్దరి వైవాహిక జీవితాలను తులనాత్మకంగా పరిశీలించినమీదట సామాజికులకు లేదా పాఠకులకు నాటకకర్త ఇస్తున్న సందేశమేమిటి? అన్న ప్రశ్నకు తావిస్తుంది నాటిక ముగింపు

తాను స్త్రీవాదినని చెప్పుకొన్న భానుమతి స్త్రీవాద భావజాలానికి వ్యతిరేకమైన పనులు చేస్తుంది అందాల పోటీలలో పాల్గొనడం, తండ్రి నుంచి కట్నం తీసుకొని తన పేరుతో బ్యాంకులో వేసుకోవడం వంటి చర్యలు స్త్రీ వాదానికి ప్రతీపధోరణిలో పయనిస్తున్నట్టు అర్థమవుతాయి ఈ నాటికలో ఊర్మిళ ఉనికికిసమర్ధనీయమైన ప్రయోజనం కనబడదు మంగళసూత్రాన్ని తీసివ్వడానికి భానుమతి సంకోచించడంవల్ల ఆమె సంప్రదాయానికి తలొగ్గినట్టు, స్త్రీ వాదం పట్ల ఆమె భ్రమలు తొలగిపోయినట్లు, ఆమె యిప్పుడు కొత్తవ్యక్తిగా పరివర్తన చెందినట్టు భావించవలసివస్తుంది అదే నిజమైతే స్త్రీ వాదం పట్ల రచయిత తన వ్యతిరేకతను వెల్లడించినట్లవుతుంది నాటకకర్త ఆశించిన గమ్యం ఇది కాదు గదా? స్త్రీ వాదపు అంతరార్థాన్ని గ్రహించకుండా మిడిమిడి జ్ఞానంతో పెడత్రోవ పడుతున్న మహిళలను హెచ్చరించటమే యీ నాటిక లక్ష్యమైతే, అది కూడా వ్యక్తం కాలేదు రచయితలో ఇతివృత్త నిర్మాణంలో అవగాహనలోపం, పాత్రచిత్రణలో అస్పష్టత అభివ్యక్తం అవుతోంది

ఈ దశాబ్దిలో స్త్రీవాద స్ఫూర్తితో వ్రాయబడి, ప్రజాదరణ పొందిన రచనల్లో వి యస్ కామేశ్వరరావుగారి 'తీర్పు', వై సుందరరావుగారి 'ఇది తప్పంటారా?' నాటికలు, మార్గశీర్షగారి 'శ్వేతపత్రం', ఇసుకపల్లి మోహనరావు గారి 'ఓ బూతునాటకం' అనే నాటకాలు పేర్కొనదగినవి

స్త్రీవాదం ప్రతిబింబించే ఈ నాటికలలో, నేటి సమాజంలో స్త్రీ ఎదుర్కొంటున్న సమస్యల తోరణాన్ని యధా తధంగా చిత్రించడమే కాక, కొన్నిచోట్ల రచయితలు పరిష్కారాన్ని కూడా సూచించారు స్వార్థం రాజ్యం చేస్తున్న మనుషుల తలపుల్లో, ఎదుటి మనిషి పడే బాధను కళ్లారా చూసి కూడా మనకెందుకులే అని నిర్లిప్తంగా పక్కకు తప్పుకు పోయే కర్కశత్వం, అమానుష ధోరణి పెరిగిపోయింది తనకు

చేతనైన, చెయ్యగలిగిన సహాయాన్ని కూడా అందించడానికి ముందుకు రాకుండా డిటాచ్డ్ ఔట్ లుక్‌తో వ్యవహరిస్తున్నాడు మనిషి తనకు అనుకూలమైన పాత విలువలను పట్టుకుని ప్రాకులాడుతున్నాడే తప్ప, మారుతున్న సమాజాన్ని గుర్తించి కొత్త విలువలను ఆహ్వానించటంలేదు అందువల్ల ఆధునిక స్త్రీలకు కూడా అగచాట్లు తప్పడంలేదు

నాటక రచనలో రచయితలు సమస్యల తీవ్రతను బట్టి కొన్ని చోట్ల ఆవేశం చూపించినా, వాటిని కేవలం ప్రచార ధోరణిలో చెప్పకుండా సంఘటనలతో మేళవించి తర్కబద్ధంగా, కళాత్మకంగా చెప్పారు పాత్రల సంఖ్యను పరిమితంగా ఉంచి, అవసరమున్నంతమేరకే వాడుకోవటంవల్ల వాటి ప్రాధాన్యం పెరగడమే కాకుండా పాత్రల మూర్తిమత్వం నిండుగా ఆవిష్కృతం కావడానికి వీలుకలిగింది

కధావస్తువు విలక్షణంగా ఉండటం కోసమో, నూతనత్వం కోసమో స్త్రీల సమస్యలను చేపట్టినట్టు కాకుండా, రచయితలు, ఆ సమస్యల పట్ల తమకున్న ఆసక్తినీ, ఆర్ద్రతా భావాన్ని నిజాయితీగా ద్యోతకం చేయడానికే ముందంజ వేసినట్లు ఆ రచయితల రచనా వైఖరి వల్ల స్పష్టమవుతుంది

ఈ నాటికలలో ముగింపు సన్నివేశాలలో నాయికలు తీసుకున్న నిర్ణయాలు ఆవేశంతో, కక్ష సాధింపుచర్యగా, అనాలోచితంగా పర్యవసానం యోచించకుండా తీసుకున్నవిగా తోచవు ఆలోచనా పరిపక్వతతో, తమకు అనుభవం నేర్పిన పాఠంతో అలా కఠినంగా వ్యవహరించారని అర్థమవుతుంది

అన్యాయానికి గురి అయిన స్త్రీలు, వైయక్తికమైన పురుషాహంకార చర్యల్ని ప్రతిఘటించటం, పరిష్కరించటం సమంజసమే కానీ, వాటిని సాధారణీకరించి మొత్తం పురుష జాతిపై ద్వేషభావాన్ని రగిల్చే ప్రయత్నంగా ఉండటం అభిలషణీయం కాదు

ఏది ఏమైనా స్త్రీ జాతి జాగృతం అవుతున్నది తన అస్తిత్వాన్ని స్థాపించుకునే ప్రయత్నంలో దుర్నిరీక్ష్య తేజంతో వడిగా ముందుకు సాగిపోతున్నది ఆ శక్తిని ఆపడం ఎవరితరమూ కాదనే హెచ్చరికకు సూచికలు ఈ నాటికలు మహిళాభ్యుదయాన్ని వాంఛించే వారందరూ మనస్ఫూర్తిగా ఆహ్వానించతగిన పరిణామాలే ఇవన్నీ అనవచ్చు

## స్త్రీల సమస్యలు, స్త్రీవాద స్పర్శ ఉన్న నాటక నాటికలు

| నాటకం/నాటిక పేరు | రచయిత |
|---|---|
| 1 స్త్రీ (నాటకం) | మల్లాది వెంకటకృష్ణ శర్మ |
| 2 ఏమి మగవాళ్లు | పి వి రాజమన్నార్ |
| 3 చావకూడదు | ఆచార్య ఆత్రేయ |
| 4 దయ్యాల లంక | పి వి రాజమన్నార్ |
| 5 దూరతీరాలు | గోరాశాస్త్రి |
| 6 నిష్ఫలం | పి వి రాజమన్నార్ |
| 7 పతిత | మిత్రశ్రీ |
| 8 పెళ్లిచూపులు | ముదిగొండ లింగమూర్తి |
| 9. రాజీవం | కె వి రమణారెడ్డి, వేణు |
| 10 సాలెగూడు | కప్పగంతుల మల్లికార్జునరావు |
| 11 స్త్రీ | నార్ల చిరంజీవి |
| 12 స్వీకారం | కావ్యశ్రీ |
| 13. గుడ్డిలోకం | డా కొర్రపాటి గంగాధరరావు |
| 14 సుల్తానీ | వేలూరి శివరామశాస్త్రి |
| 15 జ్వలిత జ్వాల | చింతపల్లి హనుమంతరావు |
| 16 పరాజితులు | ఆర్ వి యస్ రామస్వామి |
| 17 శిరోమణి | దివ్య ప్రభాకర్ |
| 18 స్త్రీ | గ్రిద్దలూరు గోపాలరావు |
| 19 ఓ బూతు నాటకం (నాటకం) | ఇసుకపల్లి మోహనరావు |
| 20 ఊరుమ్మడి బతుకులు | సి యస్ రావు |
| 21. కేండిల్స్ | జి విజయరత్నం |
| 22 నాగులు తిరిగే కోనలో | పెందుర్తి యువరాజ్ |
| 23 తీర్పు | వి.యస్ కామేశ్వరరావు |
| 24 దేవుడూ నిద్రలే ! | చిట్టిబాబు |
| 25 ఒరేయ్! | చిట్టిబాబు |

| | | |
|---|---|---|
| 26 | సంప్రదాయమా! నీకిది న్యాయమా? | నాగశ్రీ |
| 27 | ఇనుపతెరలు (నాటకం) | కొప్పరపు సుబ్బారావు |
| 28 | ఎదురీత (నాటకం) | కొండముది గోపాలరాయశర్మ |
| 29 | ఓన్లీ డాటర్ (నాటకం) | కోపల్లి వెంకటరమణారావు |
| 30 | కన్యాశుల్కం (నాటకం) | గురజాడ వెంకట అప్పారావు |
| 31 | కమల (నాటకం) | డా కొర్రపాటి గంగాధరరావు |
| 32 | కులంలేని పిల్ల (నాటకం) | పినిశెట్టి శ్రీరామమూర్తి |
| 33 | చిల్లరకొట్టు చిట్టెమ్మ (నాటకం) | దాసం గోపాలకృష్ణ |
| 34 | చేసినపాపం కాశికి పోయినా (నాటకం) | కొడాలి గోపాలరావు |
| 35 | జ్యోత్స్న(నాటకం) | దుగ్గిరాల విశ్వనాథం |
| 36 | తప్పెవరిది (నాటకం) | పి వి రాజమన్నార్ |
| 37 | దీక్షితదుహిత (నాటకం) | తల్లావఝుల శివశంకరస్వామి |
| 38 | నీలినీడలు(నాటకం) | కప్పగంతుల మల్లికార్జునరావు |
| 39 | పద్మరాణి (నాటకం) | కప్పగంతుల మల్లికార్జునరావు |
| 40 | పనిమనిషి (నాటకం) | బి యన్ సూరి |
| 41 | పునర్జన్మ (నాటకం) | బెల్లంకొండ రామదాసు |
| 42 | పునర్వివాహం (నాటకం) | దేశిరాజు రామదాసు |
| 43 | బొమ్మరిల్లు (నాటకం) | దేశిరాజు రామదాసు |
| 44 | మనోరమ (నాటకం) | పి వి రాజమన్నార్ |
| 45 | మేడిపళ్లు (నాటకం) | గౌతమ్ |
| 46 | విడాకులా? (నాటకం) | గుళ్లపల్లి నారాయణమూర్తి |
| 47 | శారద (నాటకం) | గన్నిశెట్టి వెంకటేశ్వరరావు |
| 48 | సంక్రాంతి (నాటకం) | డా॥ కొర్రపాటి గంగాధరరావు |
| 49 | సరిపడని సంగతులు | బళ్లారి టి రాఘవ |
| 50 | సింగారం | యస్ మునిసుందరం |
| 51 | పంకజం నచ్చిపోయింది | సూర్యమూర్తి |
| 52 | గారడి | జయప్రకాష్ |

| | |
|---|---|
| 53. తాళి | డీన్ బద్రు |
| 55 గోగ్రహణం | తనికెళ్ల భరణి |
| 56 లిఫ్ట్ | కె రామచందర్ |
| 57 విషాదభారతంలో మరో ఆడపడుచు | గంజి రామారావు |
| 58 సతి | మారెళ్ల |
| 59 శమీవహ్ని | మారెళ్ల |
| 60 సమిధ | జలదంకి సుధాకర్ |
| 61 రాధికా స్వాంతము | యస్ కె ఆంజనేయులు |
| 62 జోగు జాతర (నాటకం) | అత్తిలి కృష్ణ |
| 63 పసుపు-బొట్టు పేరంటానికి (నాటకం) | బి వి రమణమూర్తి (మార్గశీర్ష) |
| 64 అహల్య (నాటకం) | మల్లెల శ్రీనివాసరావు |
| 65 అసంపూర్ణ శిల్పాలు (నాటకం) | బి పి ప్రసాదరావు |
| 66 అమ్మ | ఆకెళ్ల |
| 67 ఏడవకండేడవకండి | మారెళ్ల |
| 68 కాదుసుమా కల (నాటకం) | పాడిబండ్ల ఆనందరావు |
| 69 కాలజ్ఞానం | నుసుము నాగభూషణం |
| 70 కుడికాలు పెట్టమ్మా (నాటకం) | మార్గశీర్ష |
| 71 తర్జని (నాటకం) | ఇసుకపల్లి మోహనరావు |
| 72 దగాపడిన చెల్లెలు | అత్తిలి కృష్ణ |
| 73 బొమ్మలాట (నాటకం) | నడిమింటి నరసింగరావు |
| 74 మనిషికీ మనిషికీ మధ్య (నాటకం) | బత్తుల రామకృష్ణ |
| 75 శ్వేతపత్రం (నాటకం) | మార్గశీర్ష |
| 76 సుమతి | కె యస్ టి శాయి |
| 77 స్త్రీమేధం | బీనీడు కృష్ణయ్య |
| 78 హిమాగ్ని | ఏ భాస్కరచంద్ర |
| 79. హరిత | యస్ ఏ రావు |
| 80 మృగమైదానం | వీరపల్లి వీణావాణి |
| 81 కొయ్యగుఱ్ఱం | ఏ భాస్కరచంద్ర |

# ఐదవ ప్రకరణం

## ఆధునిక నాటకాలు - దళితవాదం

ఏమహోద్యమానికైనా, మహా విప్లవానికైనా, మహత్తర కార్యానికైనా ఒక వ్యక్తిలో క్షణకాలం తళుక్కుమని విరిసిన భావనే మూలం క్రమంగా అది ఎన్నో అలలుగా వ్యాపించి, సమష్టిరూపాన్ని దాల్చి ఉద్యమ రూపాన్ని సంతరించుకొని ఫలవంతం అవుతుంది ఏ మహత్కార్య సాఫల్యవైఫల్యాలకైనా ఇది క్రమ పరిణామం

ఆర్థిక, రాజకీయ రంగాలలో వచ్చే మార్పులకు సమాజం ఎలా ప్రభావితం అవుతుందో, సమాజంలో తలెత్తే సమస్యల ప్రభావం కూడా అన్ని రంగాలకు విస్తరిస్తుంది సాహిత్య రంగం అందుకు అతీతం కాదు కాలేదు

సమాజానికి పట్టిన దీర్ఘకాలిక రుగ్మతలా, రాచపుండులా బడుగు వర్గాల పాలిటి శాపంలా వర్ణవ్యవస్థ విశృంఖల విహారం చేసింది తరతరాలుగా నిమ్న వర్గాల మీద సాగుతున్న సాంఘిక అసమానతలనుంచీ, అమానవీకరణ దౌష్ట్యంనుంచీ, పెట్టిచాకిరి దోపిడినుంచీ, అణచుకున్న కోపంనుంచీ, ప్రతీకార కంఠంతో పెల్లుబికిన సింహగర్జన నేటి దళిత వాదానికి ప్రాతిపదిక రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో కొనసాగుతున్న అణచివేత చర్యలను ప్రతిఘటించడం, దళితుల స్వీయత్వాన్ని (ఐడెంటిటీ) స్థాపించడం దళితోద్యమ ప్రధాన లక్ష్యం అని దళితవాదాన్ని స్థూలంగా అర్థం చేసుకోవచ్చు ఆత్మన్యూనతా భావానికి సమాధికట్టి ఆత్మ విశ్వాసం ఆధిక్యతను సంతరించుకుంటున్న సంధియుగం ఇది

దళితవాదం, దళిత సాహిత్యం, దళితోద్యమం అనే పదాలు ఇటీవలికాలంలో రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో అధిక ప్రాముఖ్యాన్ని సంతరించుకొని బలంగా వినబడుతున్నాయి

దళితుడు అన్న పదం కేవలం నాలుగు అక్షరాల పదంకాదు దాని వెనక చాతుర్వర్ణ వ్యవస్థలో అమానుషంగా హింసించబడి, తరతరాల దాస్యంతో కనపడని సంకెళ్లతో బంధింపబడి, స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేక చీకటిలో మగ్గిపోయి, కుమిలిపోతున్న కోట్లాది మూగజీవుల ఆర్తనాదం ఉంది ఆర్తి ఉంది ఆవేదన ఉంది ఆగ్రహం ఉంది

దళితుడు అన్న పేరు ఇటీవలి కాలంలో కొత్తగా పెట్టుకున్నదే కాని దళితుడు వర్ణవ్యవస్థ అమలులోకి వచ్చిన తాతముత్తాతలకాలంనుంచీ ఉన్నవాడే అగ్రవర్ణాలకు కట్టుబానిసగా ఊడిగంచేస్తూ, అస్పృశ్యుడిగా ఊరికి దూరంగా దైన్యంగా హైన్యంగా కాలం గడిపిన వాడే అలాంటి వారంతా అంటే చాతుర్వర్ణ వ్యవస్థకు ఇవతల ఉన్న కష్టజీవులంతా పంచములుగా పేర్కొనబడ్డారు వారికి బాధ్యతలేగాని హక్కులు లేవు జీవిత పర్యంతమూ వాళ్లు చెమటోడ్చి పనిచెయ్యడానికేగాని ఫలాన్ని ఆశించడానికి, మనుషులుగా బ్రతకడానికి వాళ్లు అనర్హులు వారి జన్మ పూర్వజన్మ కర్మఫలం కనుక ఈ జన్మలో కష్టపడవలసిందే! అలా అని పురాణాలు శాసిస్తున్నాయి వేదాలు ఘోషిస్తున్నాయి - అని తరతరాలుగా పంచముల్ని మభ్యపెట్టి, అజ్ఞానంలో ముంచి వారి బ్రతుకుల్ని నరకప్రాయంగా మార్చి ప్రతి సాంఘిక అన్యాయానికి దివ్య యోనిత్వాన్ని కల్పించి ఆ ముసుగులో అగ్రవర్ణస్థులు పంచముల బ్రతుకులో నిప్పులు పోశారు ఇది ఎన్నో శతాబ్దాలు కొనసాగింది

ఐతే ఒక్కొక్క తరంలో అగ్రవర్ణాల వారిని ప్రతిఘటించిన సంఘటనలు చరిత్రలో లేకపోలేదు వర్ణాశ్రమ ధర్మాలకు భిన్నంగా శంబుకుడు సన్యాసాశ్రమం స్వీకరించి ఆశ్రమం కట్టుకుని, తపస్సు చేస్తూ శిష్యులకు జ్ఞానబోధ చేశారు అందుకు కుపితులైనఋషులు వర్ణాశ్రమధర్మాలను ధి క్కరించి ఒక అనార్యతాపసి వేదాధ్యయనం చేయడం ఘోరమైన నేరంగా ఆరోపించి శ్రీరామచంద్రునిచేత అతని శిరస్సు ఖండింపజేశారు అలాగే వేనరాజు ఉదంతంకూడా దేవుడు లేడని విశ్వసించాడు వేనరాజు మనుషులు మానవత్వంతో మెలగడమే జీవిత

పరమార్థమని ప్రచారం చేసినందుకు ఆగ్రహం చెందిన ఋషులు, ప్రజలలో తమ ఆధిపత్యాన్ని ఎక్కడ కోల్పోవలసి వస్తుందోనని కుట్రపన్ని వేనరాజును వధిస్తారు

బోయ కులానికి చెందిన ఏకలవ్యుడు స్వశక్తితో విలువిద్యలో అసాధారణ నైపుణ్యం సాధించాడనే అసూయతో ద్రోణాచార్యులు తన శిష్యులైన క్షత్రియ కుమారులను సంతోషపెట్టడానికై ఏకలవ్యుడి బొటనవ్రేలు గురుదక్షిణగా తీసుకొన్నాడు ఇవన్నీ అగ్రవర్ణస్థుల స్వార్థానికి, అమానుష ధోరణికి, హేతుబద్ధంకాని నీచ ప్రవృత్తికి కొన్ని ఉదాహరణలు మాత్రమే అది పురాణ కాలమని సరిపెట్టుకున్నా ఆధునిక కాలంలో కూడా పంచముల విషయంలో సాంఘిక అసమానత, అమానుషత్వం ఏదో ఒక రూపంలో సాగుతూనే ఉంది

మహాత్మా గాంధీ పంచముల దైన్యస్థితి చూసి కలతచెంది వారిపట్ల ప్రత్యేక శ్రద్ధ కనబరిచాడు పంచములకు హరిజనులని నామకరణం చేశాడు తాను సాగిస్తున్న జాతీయోద్యమంలొ హరిజనోద్ధరణను ఒక అంతర్భాగం చేసి హరిజనుల పట్ల ప్రజలలో న్యూనతాభావం తొలగిపోయేటట్లుగా చేయాలని వజ్ర సంకల్పంతో దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత స్వదేశీ పాలనలో హరిజనుల పరిస్థితులు మెరుగు పడతాయని, ఆవేదనల అవమానాల పర్వం అంతమవుతుందని ఆశించిన వారికి నిరాశే మిగిలింది రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రంగాలలో చెప్పుకోదగిన మార్పురాలేదు ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలో భూస్వామ్య ఫ్యూడల్ శక్తుల విజృంభణ ఆగలేదు హరిజనుల మనుగడ దయనీయంగానే ఉంది హరిజనులకోసం ఉద్దేశించిన ప్రణాళికలు ధనవంతుల చేతుల్లో పడి వారికి దక్కకుండా పోతున్నాయి దౌర్జన్యం, అణచివేత చర్యలు, హరిజన స్త్రీలపట్ల అత్యాచారాలు యథేచ్ఛగా కొనసాగుతూనే ఉన్నాయి

ఈ పరిస్థితిని గమనించి వామపక్షాలు హరిజనులను అక్కున చేర్చుకున్నాయి కాని వారు సాగించిన ఉద్యమాలలో రాజకీయపరంగా లబ్ధిపొందగలిగారు కాని హరిజనుల స్థితి ఎక్కడవేసిన గొంగడి అక్కడే ఉండిపోయినట్టయింది కనుక

తమ ప్రయోజనాలు విప్లవ పోరాటాల సరసన లభించేవి కావని హరిజనులకు అవగాహన అయ్యింది నిమ్నవర్గాలు తమ సమస్యల పరిష్కారం కోసం మరొక కొత్తదారి వెతుక్కోవలసి వచ్చింది ఈ అంశాన్ని ప్రస్తావిస్తూ డా॥ ముదిగంటి సుజాతారెడ్డిగారు తమ 'తెలుగు సాహిత్య చరిత్ర' గ్రంధంలో యిలా పేర్కొన్నారు

"విప్లవ పోరాటంలో తమకు సమానావకాశాలు సమాన ప్రతిపత్తి వస్తుందని ఆశించిన దళితులకు నిరాశ మళ్లీ ఎదురైంది విప్లవోద్యమంవర్గవినాశంకోసం పోరాడిందికాని వర్ణవిభేదాన్ని నాశనం చేయలేకపోయింది పల్లెల్లో పట్టణాల్లో సజీవంగా వున్న కులభేదాన్ని అస్పృశ్యతను వాళ్లు గుర్తించలేదు సామాజిక వ్యవస్థలో భాగంగా దళితుల సమస్యలను ప్రత్యేకంగా తీర్చలేకపోయిందని, సాహిత్యంలోను ఉద్యమంలోను ప్రతి రంగంలోను పై వర్ణాలవాళ్లు దళితుల కృషికి గుర్తింపునియ్యడంలేదనే అసంతృప్తితో దళితులు ఆగ్రహానికి గురయినారు ఇస్తే తీసుకోవడం, ఎవరో ఉద్ధరిస్తారనే భావననుంచి దళితులు దూరం కావాలని తమకు తాముగా ఉద్యమించి చైతన్యవంతులు కావాలని గుర్తించారు దాంతో సామాజిక సాంస్కృతిక రంగాలలో దళిత చైతన్యంతో దళిత సాహిత్యం వికసించింది దళితులు తమ ఆవేదనను, ఆర్తిని యుగయుగాలుగా అనుభవించినదాన్ని అక్షరరూపంలో పెట్టిందే దళిత సాహిత్యం అనబడుతున్నది దళితులమీద సానుభూతితో దళితేతరులు వ్రాసిందాన్ని దళితసాహిత్యంగా దళితులు పరిగణించడం లేదు మా వేదికను మేమే నిర్మించుకుంటామంటున్నారు దళిత అనుభవంతో దళిత స్పృహతో వ్రాసిందే నిజమైన దళిత సాహిత్యం అంటున్నారు"[1]

హరిజనులు తమ స్వీయత్వాన్ని స్థాపించుకొనే యత్నంలో సాగించే పోరాటంలో చాకలి, మంగలి, సాలీ, గొల్ల, గౌండ్ల, ఎరుకల, ఏనాది, పాముల వంటి నిమ్న వర్గాలను కూడా తమతో కలుపుకుని 'దళితులు' అనే పేరుతో వ్యవహరిస్తున్నారు వీరిలో ముస్లిమ్ సోదరులను కూడా కలుపుకున్నారు కులాన్ని కేవలం ఒక సాంఘిక విషయంలాకాక దాన్ని ఒక ఆర్థిక, రాజకీయ, సాంఘిక వ్యవస్థగా వీక్షిస్తున్నారు నేటి దళిత వాదులు సామాజిక రుగ్మతలను విశ్లేషించి, కసిగా కవిత్వీకరించడం ద్వారా దళిత సాహిత్యం శరవేగంతో ముందుకు సాగుతూవుంది

దళిత సాహిత్య విమర్శకులు శ్రీ జి లక్ష్మీనరసయ్యగారు దళిత సాహిత్యదృక్పధాన్ని యిలా వివరించారు -

"దళిత సాహిత్యానికి ఒక తాత్విక దృక్పధంవుంది అదే అంబేద్కరిజం మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం తాత్విక నేపథ్యంగా ముందుకువచ్చిన విప్లవోద్యమ దృక్పధం విప్లవసాహిత్యానికిబాసటగా నిల్చినట్లు, చార్వాక లోకాయత వాదాలనుంచి బుద్ధిజం మీదుగా బసవేశ్వరుని మీదుగా, భక్తి కవుల ప్రవచనాల సారాన్ని నింపుకుంటూ పూలే, సాహు మహారాజ్, పెరియార్, నారాయణగురు, బాబాసాహెబ్ అంబేద్కర్ విశ్లేషించి చూపిన భారత వాస్తవికత ప్రాతిపదిగ్గా ముందుకు వచ్చిన బహుజనోద్యమం ఏదయితే ఉందో అదే దళిత సాహిత్య తాత్విక నేపథ్యం క్లుప్తంగా చెప్పాలంటే అంబేద్కరిజం దళిత సాహిత్యానికి సరయిన చూపునిచ్చింది ఏ అంబేద్కరిస్టు దృక్పధాన్నయితే అభ్యుదయ విప్లవ దృక్పధాలు తిరస్కరించి చిన్నచూపు చూశాయో ఆ దృక్పధం దళిత సాహిత్యానికి గుండె అయింది"[2]

దళిత వాదంలో దళితుల అభ్యున్నతికి రెండు ప్రధాన లక్ష్యాలు నిర్దేశించబడినాయి 1 దళితుల అన్ని సమస్యలకు మూలకారణమైన కులాన్ని కూకటి వేళ్లతో పెళ్లగించి ధ్వంసంచేయడం 2 దళితులు రాజ్యాధికారం చేజిక్కించుకోవడం

కులనిర్మూలనా విప్లవ విజయానికి అంబేద్కర్ రెండు మార్గాలు సూచించారు కింది కులాల మనసుల్నీ, ఆలోచనల్నీ విముక్తిచేసే కార్యక్రమంలో భాగంగా వారికి తగిన మేధాశిక్షణ ఇవ్వడం

ప్రత్యామ్నాయ విలువల్ని ప్రచారం చేయటం జరగాలని, తరతరాలనుంచి హిందూ విలువలకి వ్యతిరేకంగా జరుగుతూ వస్తున్న పోరాటాల చరిత్రను కింది కులస్థులకి అందించాలనీ ఆవిధంగా తాత్వికరంగాన్ని సిద్ధం చేయాలని సూచించారు అంతేకాదు యువతీ యువకులంతా కులాంతర వివాహాలు చేసుకొన్నట్లయితే తరువాత తరంనుంచీ అన్ని కులాల మధ్య బంధుత్వం, రక్త

సంబంధం ఏర్పడగలిగే అవకాశం క్రమేణా కులనిర్మూలనకు దారి తీయొచ్చనీ అంబేద్కర్ వ్యక్తం చేసారు

రాజకీయంగా దళితరాజకియాధికారమే కింది కులాల విముక్తికి సరయిన మార్గమని ప్రతిపాదించారు డాక్టర్ అంబేద్కర్ అగ్రకుల పార్టీల్ని వదిలి కిందికులాల ప్రజలంతా తమదయిన రాజకీయ పార్టీ ఆధ్వర్యంలో ఒక గొప్ప రాజకీయ కార్యాచరణకు పూనుకోవడంలోనే పీడిత కులాల అభ్యున్నతికి తద్వారా సామాజిక పరివర్తనకు అవకాశం ఏర్పడుతుందని ఉద్బోధించారు

1980 నాటికి దళితులు ఎదుర్కొనే సమస్యలమీద భారతదేశం దృష్టి సారించింది దీనికి మరాఠీ దళిత సాహిత్యం మార్గదర్శి అయ్యింది గుజరాతీ దళితసాహిత్యం, తమిళ, కర్నాటక దళిత సాహిత్యాలుకూడా పరిచయం కావడంతో ఆంధ్ర ప్రదేశ్‌లోకూడా దళిత సాహిత్యం వికసించింది కొత్త ఊపిరి పీల్చుకోసాగింది

ఆంధ్ర ప్రదేశ్ దళిత సాహిత్య ఆవిర్భావానికి కొన్ని బలమైన హేతువులు కూడా ఉన్నాయి దళితులమీద అగ్రకులస్థులు చూపిన అమానుషత్వం, సాగించిన హింసాకాండ దళితవర్గాలలో అలజడిని, ఆవేశాన్ని, ఆగ్రహాన్ని కలిగించాయి

1970లో కృష్ణా జిల్లా కంచకచర్ల గ్రామంలో దొంగతనం చేశాడని నేరంమోపి అగ్రకులస్థులు ఒక హరిజన పిల్లవాడిని చెట్టుకు కట్టేసి సజీవదహనం చేశారు 1985లో కారంచేడులో మాదిగప్రజలపై అగ్రకులస్థులు జరిపిన దాడి పర్యవసానంగా ఆంధ్రప్రదేశ్ దళితులంతా లేవదీసిన ఆందోళనోద్యమాలు, ఈ నేపథ్యంలో కత్తి పద్మారావు, బొజ్జా తారకంల నాయకత్వంలో ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ, దాని పోరాటాలు, చుండూరు, నీరుకొండ, పిప్పరలలో జరిగిన సంఘటనలమీద రాష్ట్రంలో నలుమూలలా దళితుల్లో రేగిన కోపాగ్నిజ్వాలలు తెలుగు దళిత సాహిత్యానికి గొప్ప స్ఫూర్తినిచ్చాయి అప్పటినుంచీ గేయాలూ, కవితలూ, కథలూ, నవలలూ, విమర్శలు దళిత వాద సాహిత్యంలో అంతర్భాగమయ్యాయి

"పశువుల చర్మాలనుంచి, సాకిరేవు బండలనుంచీ, కొండమంగలి కత్తులనుంచీ, కల్లుగీతల్నుంచి, గొర్రెల మందల్నుంచీ, మాలమాదిగ వాడల కదుములుగట్టిన అవమానాల్నించీ, నూలువడికే చేతుల్నించీ, ఎరుకల ఏనాది కలుగుల్నుంచీ నిప్పులు చిమ్ముకుంటూ' దళిత సాహిత్యం విస్తరిస్తూవుంది [3]

1989 లో అఖిల భారత దళిత రచయితల ప్రధమ మహాసభలు హైదరాబాదులో జరిగాయి 1993 లో ఆంధ్ర ప్రదేశ్ దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్యవేదిక మహాసభలు జరిగాయి దళితుల్లో చైతన్యస్ఫూర్తి రేకెత్తించే సాహిత్యసృష్టి చేయాలనీ దళితుల సమస్యలు వివిధ సాహిత్య ప్రక్రియల్లో ప్రతిబింబించాలని, దళితుల సంక్షేమం తమ సాహిత్యసృష్టికి పరమావధిగా వుండాలని ఆ మహాసభలు పిలుపునిచ్చాయి

దళితులపై జరిగిన దౌర్జన్యాలు, అత్యాచారాలపై స్పందించడం ప్రధాన కారణం కాగా రాష్ట్రంలో జరిగిన దళిత మహాసభలు కలిగించిన ప్రేరణ దళిత వర్గాలలో అపూర్వ చైతన్యస్ఫూర్తికి పట్టుగొమ్మ అయ్యింది దీనితోపాటు ఎన్నడూ లేనివిధంగా దళితులను సమైక్యపరచగల బలమైన, సమర్థవంతమైన నాయకత్వం కూడా లభించడం దళితోద్యమానికి మంచి ఊపునిచ్చింది యాదృచ్ఛికంగా దళితనాయకులలో చాలామంది కవితావేశంకలవారు కావటంకూడా దళితోద్యమానికి కావలసిన వాడివేడి యిబ్బడిముబ్బడిగా చేకూర్చింది ఎంత జటిల సమస్యనైనా హేతు బద్ధంగా వాదించి ఎదుటివారిని మెప్పించగల ధీశక్తి సంపన్నత నేటి నాయకత్వానికుంది

దళిత కవితలలో తరతరాలుగా తాము అనుభవించిన అవమానాలు, సహించిన అత్యాచారాలు తాలూకు గూడుకట్టుకొన్న కసి, ఆగ్రహం వరదలై పారుతూ ఉంది దళిత దృష్టికోణంనుంచి తమదైన సొంత గళంతో, తమదైన భావజాలంతో సనాతనపరుల గుండెల్లో రైళ్లు పరిగెత్తేటట్లు కవితా ఫిరంగులను పేలుస్తున్నారు అయితే కొన్నివేళల నిగ్రహం కోల్పోయి సభ్యతా పరిధుల్ని దాటి అశ్లీలపదజాలంతో కవితలు రాస్తున్నారు

ఈ క్రింది కవితలు దిగంబర కవుల కవితాధోరణిని, తిట్టు కవిత్వాన్ని గుర్తుచేస్తున్నవి

మాలవాడల్లోంచి దొమ్మరి గుడిసెల్లోంచి రీవిగా నడిచొచ్చి
వర్ణాశ్రమ ధర్మాలమీద కుటిలనీతి సూత్రాలమీద
పవిత్ర గ్రంధాలమీద, పాతివ్రత్య హర్మ్యాలమీద
వీర్యస్ఖలనం చేసిపోదాం (గాయాల్ని విభజించకు)

అక్షరాలా నేను చంపితేనేరా
నీ త్రినేత్రుడి ముడ్డికోపులిచర్మం వచ్చిందీ
నేనోకుతికి కోస్తేనేరా
నీ దేవతల అక్రమ సంతానానికి
ఏనుగుతలల కిరీటాలొచ్చిందీ (నిశానీ)

ఎవరో ఒకళ్లు నామొకంపైకి లుంగీ ఎత్తి నుంచోవాలంట
నా ఆ శల ఎసరుబియ్యంలో కాకరించి ఉయ్యాలంట
(దళితురాలు)

పై కవితలు దళిత సాహిత్యానికి, దళితోద్యమానికి ఏవిధంగానూ శోభను కూర్చలేవు

చెప్పేది నిప్పులాంటి నిజాలే అయినా కొంత నిగ్రహం పాటించడం అవసరం అభిలషణీయం ఎందుకంటే దళిత సాహిత్య ధ్యేయం దళితులలో చైతన్యస్ఫూర్తి కలిగించి వారిని కార్యోన్ముఖుల్ని చేయడమే కాదు, దళితేతరుల్లో మనఃపరివర్తన కలిగించి వారిలో సుహృద్భావాన్ని ప్రోదిచేయడం కూడా కనుక 'వన్ వే ట్రాఫిక్' విధానాన్ని విడనాడితే దళజతోద్యమ ప్రగతి సుగమం అవుతుంది

కాగా, దళిత సాహిత్యంలో కవితలలో అభివ్యక్తమౌతున్నంత భావతీవ్రత, భాషతీవ్రత కథ, నవల, నాటకం వంటి సాహిత్య ప్రక్రియల్లో కానరావడంలేదు

వాటిలో సంయమనం పాటించబడుతూ ఉండటం ముదావహం

"దళిత సాహిత్యం భావకవిత్వం, అభ్యుదయ కవిత్వంవలె వ్యక్తి అనుభూతిని కాక సామూహికానుభూతిని వ్యక్తంచేసింది దళిత కవులు రచయితలు ఉత్పత్తి రంగంలో జరిగే శ్రమదోపిడీని ఎదుర్కోవడం,సామాజికంగా సాంస్కృతికంగా ఉన్న ఆధిక్యతాభావాన్ని అహంకారాన్ని బద్దలుకొట్టడం, సాహిత్యం కళల్లో ఉన్న వర్గదృక్పథాన్ని విచ్ఛిన్నం చేయడం, భాషశిల్పంలోవున్న ఉచ్చనీచ భావాలను ఎదిరించడం, సనాతన సంస్కృతిని ఉన్నత సంస్కృతి పేరుతో పై వర్గాలవాళ్ల సంస్కృతి చలామణి కావడాన్ని దళితులు ప్రశ్నించారు ఉన్నత వర్గ సంస్కృతిని ప్రతిఘటించడం, ఉన్నత మధ్యవర్గాలవాళ్ల దృక్పథాలను సాహిత్యంలో ప్రతిబింబించడం దళిత రచయితలు చేసారు ఇంతవరకు ఉన్నతవర్గాల మధ్య తరగతి వర్గాల అనుభూతులు, భావజాలం మాత్రమే తెలుగు కవిత్వంలో వచ్చింది కాని శ్రమించే అట్టడుగు వర్గాల దృక్పథం, భావజాలం దళిత కవిత్వంలోనే వ్యక్తమయ్యిందని దళితవాదులంటారు"[4]

దళిత సాహిత్యంలో డొంకతిరుగుడు, మార్మికత, మెతకదనంల స్థానంలో సూటితనం, తాజాతనం, కరుకుదనం ఉండటంవల్ల వ్యక్తీకరణలో జీవం వుట్టిపడుతూ సామాన్యులకు అందుబాటులో ఉంటూ ఆస్వాదయోగ్యంగా ఉంటుంది ·

దళితవాదమనే సిద్ధాంతపరమైన అవగాహన లేని రోజుల్లో అంటే 1920 నాటికే దళితుల సమస్యలను ఆవిష్కరిస్తూ శ్రీ మంగిపూడి వేంకటశర్మగారు నిరుద్ధ భారతం రాశారు దాని ద్వారా కులస్పృహను ప్రదర్శించినప్పటికీ, కులపీడనను, అంటరాని తనాన్ని అనుభవించి పలవరించిన జాషువా కవిత్వంలో దళిత వాస్తవికత తాలూకు అమానవీకరణ శక్తిమంతంగా కదలించే రీతిలో వ్యక్తమవుతుంది

"భారత చరిత్రమీద పూలే వ్యక్తం చేసిన అభిప్రాయాల్ని దళితులు అంగీకరిస్తున్నారు ఇప్పుడు ఎవరినైతే దళితులు అని పిలుస్తున్నామో, వాళ్లే ఈ

దేశంలో మొదటినుంచీ ఉంటున్న వాళ్లనీ, ఈ స్వదేశీయుల్ని విదేశీయులైన ఆర్యులు జయించి బానిసల్ని కావించారనీ, గెలిచిన ఆర్యజాతి ఉన్నత కులాలుగా చెప్పుకుంటూ స్వదేశీయుల్ని శూద్రులుగా చేసి అధికారాన్నికైవసం చేసుకున్నారని పూలే వివరించారు"[5]

వ్యాసముని చంద్రుగన్న పరాశరుండు
మాలదానికి పుట్టి బ్రహ్మర్షియయ్యె
వేశ్యకును పుట్టి, మాలెత బెండ్లియాడి
ఆ వశిష్ఠ మహర్షి బ్రహ్మర్షియయ్యె
(నిరుద్ధ భారతం - మంగిపూడి వేంకట శర్మ)

డా॥ బోయి భీమన్నగారు 'రాగవాసిష్ఠం' అనే నాటకానికి రాసిన సుదీర్ఘ ప్రస్తావనలో ఇలా అన్నారు --

"హరిజనులు ఆర్యులేనన్న భావం నాకు కలగడానికి ఈ పద్యం అధారం అదే నన్ను ఈ రాగవాసిష్ఠం నాటకాన్ని వ్రాయడానికి పురికొల్పింది"[6]

అలాగే శ్రీ ఆవుల సాంబశివరావుగారు "త్రిపురనేని రామస్వామి ఎ హెరాల్డ్ ఆఫ్ ఫిలసాఫికల్ రినైజాన్స్" అన్న పుస్తకంలో, స్మృతులు నిర్దేశిస్తున్న వర్ణాశ్రమ ధర్మంలో అంతర్నిహితమై ఉన్న దౌష్ట్యాన్ని పూజారి వర్గపు దురాలోచననూ గర్హిస్తూ ఇలా వివరించారు

"He (Tripuraneni Ramaswamy) experienced caste discrimination and instinctively felt repelled by it This made him undertake pursuit of knowledge about existing institutions He never rejected any idea offhand He must have valid reasons either to accept or reject a proposal His studies and researches led him to conclude that the varnashrama Dharma, as prescribed by the Smruties was an evil imposition, intended to preserve and protect the supremacy of certain classes of people, particularly the priestly caste"[7]

దళితుల ఉనికిని, దైన్యస్థితిని గురించి ఆలోచనలు మేధావివర్గంలో

ఎప్పటినుంచో చెలరేగుతున్నాయని గుర్తుచెయ్యడానికే పై ఉదాహరణలు దళితుల జీవన విధానం, స్థితిగతులు, వారిలో వస్తున్న చైతన్యం గురించి 1980 నుంచీ కథలు, నవలలు విరివిగా వస్తున్నాయి అయితే దళిత సాహిత్యం అనే గుర్తింపుతో కాకపోయినా దళిత వర్గాలను గూర్చి కొన్ని కథలు, నవలలు 1920 ప్రాంతాలలోనే వెలువడినాయని చెప్పడానికి ఆధారాలున్నాయి

"దళిత చైతన్యంలో భాగంగా ఎనభైల తరువాత వచ్చిన దళిత వచన సాహిత్యం గుర్తించదగినంతరాలేదు కానీ, అంతకుముందు ఎప్పటినుంచో దళిత జీవితాన్ని నవలా సాహిత్యంలోకి ఎక్కించే ప్రయత్నం కొందరు అగ్రకుల ప్రగతివాదులు చేశారు ఈ దేశంలో జాతీయోద్యమం సాగుతున్న దశలో దళితులను ఉద్ధరించాలనే భావనతో కొన్ని నవలలు వచ్చాయి అస్పృశ్యతను ఒక ముఖ్య సమస్యగా తీసుకుని తల్లాప్రగడ సూర్యనారాయణ 'హేలావతి' నవల రాశాడు పేదలోని గింజల్ని ఏరికడుక్కుని తినే దయనీయమైన దళిత జీవితాన్ని వర్ణిస్తారు రచయిత దళితులపట్ల తమ ధోరణిని మార్చుకోమని హిందూ అగ్రకులస్థులకు రచయిత విన్నపం చేశాడు

1919 లో వేంకటపార్వతీశ్వరకవులు రాసిన 'మాతృమందిరం' నవల వచ్చింది 1922 లో ఉన్నవ లక్ష్మీనారాయణ రాసిన 'మాలపల్లి' నవల వచ్చింది తెలుగులో ఈ నాటికీ మాలపల్లిని మించిన నవలలేదని విమర్శకులు అంటారు కానీ, ఈ నవలలో చిత్రించింది మాలపల్లి కాదనీ, 'మునిపల్లె' అని ఒక విమర్శ ఇటీవల వచ్చింది అయితే గాంధీ హరిజనోద్ధరణ సిద్ధాంతంలో భాగంగా వచ్చిన నవలల్లో మాలపల్లి ఒక గొప్ప నవలవుతుంది ఆ తరువాత హరిజన నాయకుడు, నరుడు, మల్లి మొదలైన నవలలు దళిత జీవిత నేపథ్యంగా వచ్చాయి రంగనాయకమ్మ 'బలిపీఠం' కులం ఈ వ్యవస్థలో ఎంత బలంగా పాతుకుపోయిందో నిరూపిస్తుంది మహీధర రామమోహనరావు 'కొల్లాయిగట్టితేనేమి', దాశరథి రంగాచార్య 'చిల్లరదేవుళ్లు' అస్పృశ్యతను ఇతివృత్తంగా చేసుకొని వచ్చిన నవలలే కానీ, డా॥ కేశవరెడ్డి డెబ్బయిలలో రాసిన బానిసలు, ఇంక్రెడిబుల్ గాడెస్, స్మశానం దున్నేరు

దళిత సమస్యలను నిర్దిష్టంగా చిత్రించడమే కాకుండా వాస్తవిక దృక్పథంతో సాగుతాయి అప్పట్లో ఈ నవలలు మంచి సంచలనాన్ని కలిగించాయి ఇంకా కేతు విశ్వనాథరెడ్డి 'వేర్లు', అక్కినేని కుటుంబరావు 'సారాజ్యం' ఈ ధోరణితో సాగిన నవలలుగా కనిపిస్తాయి ఇటీవల సాధన రాసిన రాగో, అరుణ రాసిన ఎల్లి నవలల్లో దళిత జీవిత చిత్రణ ఉంది"[8]

"కధల విషయానికొస్తే కరుణ కుమార్ దళితుల ఇక్కట్లను గట్టి కధలుగా మలిచాడు కొలకలూరి ఇనాక్ ఊరబావిలాంటి మంచి కధలు రాశాడు బోయ జంగయ్య, అల్లం రాజయ్య, సాహు, బి యస్ రాములు నిజమైన దళిత కధలు రాశారు కా రా కధల్లో దళితులు దోపిడీకి గురవుతున్న చిత్రణ ఉంది ఇటీవల చార్లెస్, కెమేరా విజయకుమార్ లాంటివాళ్లు విడివిడిగా కధలు రాస్తున్నారు మొత్తంమీద ఈనాటి దళిత చైతన్యంలో భాగంగా నవలల్ని, కధల్ని రాస్తున్న దళిత రచయితలు లేరనే చెప్పవచ్చు"

కులవ్యవస్థను ఖండిస్తూ మానవులందరూ సమానులే అన్న భావాన్ని ప్రచారం చేసిన వ్యక్తుల ఉదంతాలు చరిత్ర పుటల్లో ఎన్నో కనిపిస్తాయి

12 - 13 శతాబ్దాలలో శివకవులు వర్ణవ్యవస్థను నిరసిస్తూ ఉద్యమం నడిపారు కావ్యగానాలు చేశారు రెడ్డిరాజుల కాలంలో వేమన అంటరానితనాన్ని హేళన చేసాడు 1975లో ఆర్య సమాజాన్ని స్థాపించిన దయానంద సరస్వతి కుల వ్యవస్థమీద కత్తులు దూసినవాడే పల్నాటియుద్ధం జరిగిన కాలంనాటి బ్రహ్మనాయుడు కులాల ప్రసక్తిలేని 'చాపకూడు' సాంప్రదాయం అమలుచేసి మనుషులంతా ఆ దేవుని బిడ్డలేనని ప్రచారం చేశాడు అలాగే ఆధునిక యుగంలో మహాత్మాగాంధీ హరిజనులపట్ల చూపిన శ్రద్ధాసక్తుల మాట చెప్పనక్కరలేదు

ఎవరెన్ని బోధించినా, ఎంత కృషి చేసినా కులవ్యవస్థ ఇప్పటికీ చెక్కుచెదరకుండా, కొన్ని వేళల భయంకరాకృతిని ప్రదర్శిస్తూనే ఉంది చట్టాలు యీ పరిస్థితులను కొంతవరకు అదుపుచేస్తున్నా మౌలికంగా మనుషుల అంతరంగంలో మార్పు

వస్తేతప్ప దళితుల ఆవేదన చల్లారదు వారి సమస్యలు పరిష్కారం కావు అలాంటి మనఃపరివర్తన కలిగించడానికి ఈనాటి దళితవాదులు గళం విప్పారు దళితవాద చైతన్య కెరటం ఉవ్వెత్తున లేచి చెలియలికట్ట దాటి ముందుకు ఉరుకుతూ ఉంది

దళితుల దుర్భర జీవితాన్ని చిత్రంచే కథలూ, నవలలూ వచ్చాయి కాని, నాటకాలు రాలేదనే అపప్రథ ఉంది ఆమాట నిజంకాదు దళితుల సమస్యల్ని నేపథ్యంగా చేసుకొని కథలు, నవలలు, కవితలకంటే అధిక సంఖ్యలో నాటకాలు వచ్చాయనే సత్యం గమనించాలి

దళితుల జీవన విధానాన్ని, వారు ఎదుర్కొంటున్న సమస్యల్ని, వారిలో క్రమక్రమంగా పాదుకొంటున్న ప్రతిఘటనా తత్త్వాన్ని వివరిస్తూ తెలుగు నాటకం పుట్టిన నాటినుంచీ నేటి వరకూ సుమారు యాభై నాటకాలొచ్చాయి ఇతర సాహిత్య ప్రక్రియలతో పోల్చుకుంటే ఈ సంఖ్య తక్కువేమీ కాదు

పూర్వోక్తమైనట్లుగా నాటకరచనలో రచయితలు విశృంఖలంగా కవితలు రాసే విధానానికి భిన్నంగా సంయమనం పాటించారు నాటక సంప్రదాయాల చట్రంలోనే నాటక రచనసాగించారు దీనికి కారణం దళితస్పర్శవున్న నాటకాలు రాసిన వారిలో అధిక సంఖ్యాకులు దళితేతరులు కావడమే అంతేకాదు దళిత రచయితలుకూడా సభ్యతా పరిధుల్ని దాటకుండా రచనలు చేసారు

నాటకం కవితలవలె, కథలవలె, నవలలవలె వైయక్తికంగా చదువుకొని ఆనందించేది కాదు నాటకం జనబాహుళ్యంకోసం వ్రాయబడేది నాటకం వేలమంది సభికుల ఎదుట ప్రదర్శింపబడుతుంది కేవలం ఏ సిద్ధాంతానికో, ఏ వాదానికో కట్టుబడిన నాటకం జనాదరణ పొందలేదు ఆనాటకం నాటకంగా మనలేదు అందువల్ల సెన్సిటివ్‌గా ఉన్న ఏ విషయాన్నయినా కేంద్ర బిందువుగా చేసుకొని నాటకం వ్రాసేటపుడు ఎన్నో జాగ్రత్తలు తీసుకోవలసి వస్తుంది

ఇంతవరకు దళిత సమస్యలమీద వచ్చిన (దళిత సాహిత్యం పేరుతో

రాకపోయినా దళితుల సమస్యలనే ప్రధాన వస్తువుగా చిత్రించిన) నాటకాలలో ఈ నాటి దళితవాదులు ప్రతిపాదించే ముఖ్యాంశాలు, లక్ష్యాలు అన్నీ కాకపోయినా అధికభాగం వాటిలో అంతర్నిహితమై ఉన్నాయి ఉదాహరణకు కె యస్ టి సాయి రచించిన 'పరమపదం' ఏ 'దృష్టికోణం నుంచి పరిశీలించినా దాన్ని దళితనాటకం కిందే పరిగణించాల్సివస్తుంది అలాగే సంజీవి రాసిన ' ఈచరిత్ర ఏ సిరాతో ?' అనే నాటకంకూడా

1935లో వచ్చిన 'నందనార్' హరిజన సమస్యను అస్పృశ్యతను ఆధారం చేసుకుని రాసిన మొదటి నాటకం దీనిని శ్రీ కృష్ణ కౌండిన్య రచించారు శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రి అదే పేరుతో 1936లోను, శ్రీ ఆంధ్ర శేషగిరిరావు 'భక్తనంద' (1936) పేరుతోను నాటకాలు రాశారు. నందనార్ అనే హరిజనుడికి అస్పృశ్యుడన్న నెపంతో పూజారి వర్గం దేవాలయ ప్రవేశాన్ని నిరాకరిస్తారు మహాభక్తుడైన నందనార్‌కు దైవదర్శనాన్ని మనిషి అడ్డగించినా దేవుడే దిగివచ్చి అతనికి దర్శనమిచ్చి తనలో ఐక్యం చేసుకొంటాడు నందనార్ పూజారులతో గట్టి వాదనకు దిగడు అతడు ప్రదర్శించింది సాత్విక ప్రతిఘటన మాత్రమే అప్పటికి దళితవాదానికి నిర్దిష్టరూపం, భావం, లక్ష్యం లేకపోయినా దానికి పరోక్షంగా నిర్మించిన మొదటి మెట్టు 'నందనార్' నాటకం దళితవాదంలో ముఖ్యాంశమైన అస్పృశ్యతను మొదటిసారి స్పృశించిన నాటకం ఇదే కావడం విశేషం

ఆరోజుల్లోనే వెలువడిన తాంధ్ర సుబ్రహ్మణ్య శాస్త్రిగారి 'పతితపావన' నాటకంలో అగ్రవర్ణాలవారిచేత హరిజనులు హింసించబడటం ఇతివృత్తమయింది తిరుగుబాటు చెయ్యలేక అసహాయులు గానే ఉండిపోతారు హరిజనులు అంటే బలవంతుల కారిన్యాన్ని బలహీనుల అసహాయతను చూపించడంద్వారా అగ్రవర్ణాలలో మానసిక పరివర్తనను తేవాలన్న సంకల్పమే 'పతితపావన'లో ద్యోతకమవుతుంది

1936లోనే నాటక రచనలో రెండవ దశకూడా ప్రారంభమైంది అగ్రవర్ణాలవారిని ప్రతిఘటించి, సాంఘిక న్యాయాన్ని సాధించగల ఆత్మ విశ్వాసంతో ముందుకు

సాగే తిరుగుబాటు తత్త్వాన్ని చిత్రించే నాటకాలు వచ్చాయి శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు రాసిన 'అస్పృశ్య విజయం', శ్రీ మునిమాణిక్యం నరసింహారావు రచించిన 'తిరుగుబాటు' నాటకాలు ఈ కోవకు చెందినవి

డా॥ బోయి భీమన్నగారి 'పాలేరు' (1947), అంతటి నరసింహంగారి 'సహజీవనం' (1957), 'మానవత్వం' (1959), శ్రీ సుంకర సత్యనారాయణగారి 'జీతగాడు' (1953), తాతా జగన్నాధరావుగారి 'జన్మహక్కు' (1958) నాటకాలు ప్రతిఘటనా పూర్వకమైన నాటకాలే వెంపోగారి 'జన్మహక్కు' నాటకం కూడా సాంఘిక న్యాయంకోసం సాగించే పోరాటాన్ని ప్రతిబింబించే నాటకం

శ్రీ ఊటుకూరి సత్యనారాయణరావు రచించిన 'శాపవిమోచనం' (1943) నాటకంలో ఒక ప్రత్యేకత ఉంది పురోహితుడు హరిజన పక్షపాతిగా ఉంటాడు గాంధీ మహాత్ముని సిద్ధాంతాలలో ఒకటైన అస్పృశ్యతా నివారణ ఈ నాటకంలో ఇతివృత్తం కులమతాలు అడ్డు గోడలై నిలిచి, మానవత్వానికి సమాధి కడుతున్న దుర్దశలో, సర్వమానవ సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ వచ్చిన ప్రబోధాత్మక నాటకశ్రేణి లోనిదే 'శాపవిమోచనం' అంటరానితనం అనే దురాచారాన్ని సంఘంలో రూపుమాపాలని కంకణం కట్టుకున్న అగ్రజాతివారికి ఎదురయ్యే సమస్యలు ఈ నాటకంలో కళాత్మకంగా చిత్రించబడినాయి శంకరయ్య (పురోహితుడు) పాత్ర చిత్రణ ఉదాత్తగంభీరంగా ఉంది

హరిజన పక్షపాతి, సంఘసేవకుడు అయిన శంకరయ్య తల్లి చనిపోతే అంత్యక్రియలు జరపడానికి బ్రాహ్మణులు నిరాకరిస్తారు కులం కట్టుబాట్లకు తలవంచి శవవాహకులెవరూ ముందుకురారు ఆత్మస్థైర్యాన్ని కూడగట్టుకున్న శంకరయ్య భావాలను రచయిత ఇలా వ్యక్తం చేశారు

చ నను వెలివేసి స్వామి కరుణామయుడయ్యెను - లేకయున్న తల్లిని నిజబాష్పవారి దొరలించుచు మూపులపైన కాటికిన్

గొనిచను భాగ్యమెట్టు లొనగూడును వీనికి - కోటియజ్ఞముల్

తనయుడు చేయుగాక యవి తల్లి ఋణంబును దీర్చజాలునే! - అని

ఎన్ని కష్టాలైన భరించడానికి సిద్ధపడతాడేగాని తన లక్ష్యాన్ని దూరం చేసుకోవ డానికి సమ్మతించడు ఆ అసహాయ శూరుడు

తీవ్ర పదజాలంతో ఘర్షణకు తలపడే పాత్రలున్న నాటకాలకంటే, మానసిక పరివర్తనకు రంగాన్ని సిద్ధం చేసే ఇలాంటి నాటకాలవల్ల ఎక్కువ ప్రయోజనం ఉంటుందని ఆశించవచ్చు ఎందుకంటే అవి సైకొలాజికల్ గ్రౌండ్ తయారు చేస్తాయిగనుక

దళితుల బాధామయ గాధలను గురించి చెదురు మదురుగా వస్తున్న రచనలు 1950 నుంచీ రాజకీయ, ఆర్థిక, సాంఘిక రంగాలలోనే వచ్చిన పెనుమార్పులవల్ల ఏర్పడిన పరిస్థితుల దృష్ట్యా వేగం పుంజుకున్నాయి

ఒక వ్యక్తిని మరొక వ్యక్తి<br>ఒక జాతిని వేరొక జాతి<br>పీడించే సాంఘిక ధర్మం<br>ఇంకానా? ఇకపై సాగదు - అంటాడు శ్రీశ్రీ

బలహీన వర్గాలను ఉద్ధరించడమే మా ప్రధాన లక్ష్యమని గొంతు చించుకొని అరిచే నాయకులు - ఆ బడుగు వర్గాలనుంచి విద్యావంతుడైన ఒక యువకుడు ఒక మెట్టు పైకి పోవడానికి ప్రయత్నిస్తే సహించరు తమ మార్గానికి అడ్డొస్తున్నాడని గ్రహించిన మరుక్షణం నుంచీ లెక్కలేని అడ్డంకులు కల్పించి ప్రతిఘటిస్తారు సామదానభేదదండోపాయాలు ప్రయోగించి ఆ మనిషిని లొంగదీయడానికి ప్రయత్నిస్తారు అప్పటికీ సాధ్యం కాకపోతే అతన్ని ఖర్చుకింద లెక్కరాసి సమస్య పరిష్కరించుకుంటారు ఓట్లు కొనుక్కొని గద్దెలెక్కే పెద్దలు, ఓట్లు అమ్ముకునే ప్రజలూ ఉన్న నేటి ప్రజాస్వామ్య వ్యవస్థలో ఏదీ అసంభవం కాదు

అభ్యుదయ భావాలుగల ఓ యువకుణ్ణి (చంద్రయ్యను) ఎంపిక చేసి, పార్టీ టికెట్ యిచ్చింది హైకమాండు రెండు దఫాలుగా యం ఎల్ ఏ గా కొనసాగుతున్న

సూరయ్యకు ఆగ్రహం కలిగింది నిద్ర పట్టలేదు చంద్రయ్యను ఎన్నికల రంగంలోనుంచి తప్పించడానికి నయానా భయానా ప్రయత్నించి చూసాడు లాభం లేకపోయే సరికి చంద్రయ్యను శాశ్వతంగా ఈ లోకంనుంచే తప్పించి తన ముప్పు తప్పించుకున్నాడు సూరయ్య అగ్నిప్రమాదంలో మరణించాడని గూడెం ప్రజలను నమ్మించి అమరవీరుని చితాభస్మాన్ని ఊరేగించి అతనికి "సమాధి కడుతున్నాం - చందాలివ్వండి" అంటూ ఊరిమీద పడడంతో తెరపడుతుంది

రాజకీయ రంగంలో దళితులపట్ల ప్రదర్శితమవుతున్న రిక్తకౌగిలి కాపట్యాన్ని కళ్లకు కట్టినట్టు చిత్రించారు ఈ నాటకంలో శ్రీ పరుచూరి వేంకటేశ్వరరావు సాంఘిక పరిస్థితులు అస్తవ్యస్తంగానే ఉంటాయని హెచ్చరించారు 'సమాధి కడుతున్నాం - చందాలివ్వండి' (1975) నాటకం ద్వారా రాజకీయ రంగంలో అణచివేతకు గురిఅవుతున్న దళితుల యథార్థ స్థితికి ఇదొక మచ్చుతునక

ఇంచుమించు ఇదే ఇతివృత్తంతో శ్రీ రత్నగిరి జగన్నాథం 'వెలుగొచ్చింది', 'దేవుడు' అనే రెండు నాటికలు రాశారు

ఆర్థికంగా చితికిపోయి దీనావస్థలో ఉన్న కష్టజీవుల్ని కాల్చుకుతినే ధనమదాంధుల దౌష్ట్యాలను, బడుగు వర్గాల బాధలను చిత్రించే నాటికలు డెబ్బయవ దశకంలో మరికొన్ని వచ్చాయి వాటిలో న్యూట్రాన్ రచించిన 'సూరీడు' శ్రీ యం దివాకరబాబు రచించిన 'అసురగణం', శ్రీ యమ్ సంజీవి 'కదలిక' సుకమంచి కోటేశ్వరరావుగారి 'మా సమాధులే మీ పునాదులు', వి యస్ కామేశ్వరరావుగారి 'సర్పయాగం' మొదలైనవి విశేష ప్రజాదరణ పొందిన ఉత్తమ నాటికలు

సమాజంలో అంటరానివారుగా అణగద్రొక్కబడిన నిమ్నకులాల మధ్య సంఘర్షణకు, అనైక్యతకూ అద్దంపడుతూ, వారి బలహీనతలను మత్తుగా మార్చి, తమ సొంత లాభంకోసం పెనుగులాడే పెద్ద కులాల స్వార్థానికి సమగ్రరూప కల్పన 'పిడికిలి' నాటిక, రచయిత శ్రీ యిక్కుర్తి నరసింహారావు

ఈ నాటికలో ప్రాతోచిత సంభాషణలు మళ్లీ మళ్లీ వినాలనిపించేంత సహజంగా, పసందుగా ఉన్నాయి నిరక్షరాస్యుడు పలికే మాటల్లోకూడా భావ గాంభీర్యం కన్పిస్తుంది

"ముసిలోడు అందరం శవాలమేన్రా అయ్యా! సచ్చినోడు ముందు శవమైతే బతికున్నోడు ఎనక శవంరా బతికున్నోళ్లని పాడుసుకుతినే గొప్పనాకొడుక్కన్నా బతకడంకోసం శవాల్ని పూడ్చుకునేవాడు గొప్పోడు కాదంట్రా? (పుట (21)

సెంద్రి ఏకట్టడున్నా మడిసి సుకం కోసమేకదయ్యా, ఒక దిక్కులేని ఆడదాని తాడు తెంపి బతుకు పాడుసేసేందుకు కట్టడే కావాలా అయ్యా? (పుట 22)

నాగరాజు మడిసి పిలిస్తేనే అంత బయమైతే ఎట్టాగే?

సెంద్రి మడిసేగదండి మడిసికి పగోడు ఏ గొడ్డన్నా గోదన్నా అయితే దడుసుకోనక్కర్లేదు అయ్యే మడిసిని చూసి దడుసుకుంటాయి బాబు" (పుట 38)[9]

బలహీనుల్కు మౌనంగా ఉన్నంతవరకే బలవంతుల ఆటలు దుర్బలులు కడుపు కాలి తిరగబడితే "చిక్కటి చీకటి చీల్చడానికి చిన్నదీపం చాలు కర్తవ్యం కళ్లు తెరిస్తే - మూఢత్వపు మబ్బు విడిపోయి చీకటి గూళ్లలో - కోటి పిడికిళ్లు బిగుస్తాయి" అనే ఆశాభావాన్ని వ్యక్తం చేశారు నాటకకర్త

శ్రీ సి యస్ రావు రచించిన 'ఊరుమ్మడి బతుకులు (1974) పండిత పామరులను అలరించిన ఉత్తమ దృశ్యకావ్యం

నాటిక ప్రారంభం అయ్యేముందు ప్రయోక్తచేత ఇలా అనిపించారు క్లుప్తంగా కావ్యార్థాన్ని ఈ వ్యాఖ్యానం స్పష్టంగా ఆవిష్కరిస్తుంది

"పల్లకీలో ఊరేగేవాళ్లు అది తమ జన్మహక్కనుకోవడం, పల్లకీ మోసేవాళ్లు అది తమ కర్మ అనుకోవడం - ప్రపంచ మానవ చరిత్రలో తరతరాలుగా వస్తున్న నగ్న సత్యం కర్మ సిద్ధాంతానికీ, ఆధ్యాత్మిక చింతనకీ ఆటపట్టయిన మన

భారతదేశంలో అది మరీ నిజం కానీ పల్లకీ మోసేవాళ్లు విసుగెత్తి, సహనం కోల్పోయి, తాము తరతరాలుగా ఎందుకు పల్లకీ మోయవలసి వచ్చిందో తెలుసుకున్ననాడు ఏంజరుగుతుంది? - చూడండి ఏం జరుగుతుందో"[10]

ఊరుమ్మడి కమ్మరిసాలలో ఉంటూ ఊరందరి పనులూ చేసిపెట్టే కమ్మరి గన్నెయ్య పెళ్లిచేసుకొని పట్నంనుంచి భార్యను తెచ్చుకున్నాడు నిండు యౌవనంతో నిగనిగలాడుతూన్న సీతాలు ఆఊరి కామందు కంటబడింది ఆమెను పొందాలని ఆరాటపడుతూ ఏదో పనిమీద గన్నెయ్యను పట్నం పంపించాడు పెద్దకాపు ఆ రాత్రి ఆమెను అనుభవించాలని పథకం వేశాడు సీతాలు ప్రతిఘటించింది బుసలుకొడుతూ బండబూతులు తిడుతూ వెళ్లిపోయాడు పెద్దకాపు ప్రొద్దున్నే భర్త రాగానే జరిగిన సంగతి చెప్పి ఏడ్చింది సీతాలు ఆ సంగతి విని రక్తం ఉడికింది కాని నిస్సహాయుడైన గన్నెయ్యకు తెలుసు - పెద్దకాపుని తానేమీ చెయ్యలేడని భార్యను ఓదార్చడంతప్ప మరేమీ చెయ్యలేకపోయాడు అతని మాటలు విని సహించలేకపోయింది భర్తలో పౌరుషాన్ని రెచ్చగొట్టింది ఆ సంఘటన గన్నెయ్య జీవితంలో ఒక కొత్తమలుపు

ఈసారి చిన్నకాపు పనిమీద పట్నం పంపించాడు గన్నెయ్యను కాని అతను వెళ్లకుండా ఎక్కడో దాక్కున్నాడు ఆరాత్రి పెద్దకాపు, చిన్నకాపు అచ్చేసి విడిచిన ఆంబోతుల్లా గన్నెయ్య పెళ్లాంమీదికి దూకి అత్యాచారం చెయ్యబోయారు చాటునుంచి వాళ్లపైకి దూకి వారిద్దరినీ హతమార్చాడు గన్నెయ్య "పీడ విరగడైపోయింది ఇంక నేనేమైపోయినా ఫర్వాలేదు" అంటూ తృప్తిగా వెళ్లిపోయాడు గన్నెయ్య

ఈ నాటికలో హరిశ్చంద్రుడు అనే తాగుబోతు పాత్ర చాలా ముఖ్యమైంది గతంలో పెద్దకాపు, చిన్నకాపు దౌష్ట్యానికి బలైపోయింది హరిశ్చంద్రుడి భార్య ఆమె చావుకి కారణమేమిటో, దానికి బాధ్యులెవరో తెలిసికూడా ఎవరూ ఏమీ చెయ్యలేకపోతారు ఆనాటినుంచి హరిశ్చంద్రుడు తాగుమోతుగా మారిపోతాడు కాని సమయంకోసం ఎదురుచూస్తున్నాడు హరిశ్చంద్రుడు గన్నెయ్య భార్యకు

హాని జరక్కుండా ఒక కంట కనిపెడుతుంటాడు చివరికి హత్యానేరంకింద గన్నెయ్య దొరికిపోకుండా, తానే హంతకుడనని పోలీసులకి చెప్పడానికికూడా ప్రయత్నిస్తాడు ఇలాంటి ఉత్తమ పాత్రగా హరిశ్చంద్రుణ్ణి రూపొందించడంలో శ్రీ సి యస్ రావు నిరుపమానమైన రచనా వైదుష్యం ప్రదర్శించారు

పిరికివాడైన గన్నెయ్య, అతని మానసిక పరిస్థితి, బ్రతుకుభయం, భార్యపై ఉన్న వల్లమాలిన ప్రేమ, కామాంధుల్ని ఎదిరించలేని నిస్సహాయత క్రమంగా అతనిలో కలిగే పరిణామం - ఇవన్నీ అతి సహజంగా, అద్భుతంగా చిత్రించటంలో కృతకృత్యులయ్యారు రచయిత కేవలం సంభాషణలతో కాకుండా సంఘటనల రూపంలో సందేశాన్ని శక్తిమంతంగా చెప్పగలిగారు నాటకకర్త

పేదవాడి పెళ్ళాం అనేది అలుసుగా తీసుకుని, కామాంధులై లైంగిక దోపిడీకి పాల్పడే పెద్దలచిత్తప్రవృత్తుల నిరూపణ, పల్లెటూళ్లలో దళితులకు ఎదురయ్యే ఇలాంటి అత్యాచారాలగురించి విశదీకరణ 'ఊరుమ్మడి బతుకులు' నాటికను నిర్మాణాత్మకమైన ఉత్తమ నాటికగా నిలబెడతాయి

దళితులను జాగృతం చేసే ప్రయత్నంలో భాగంగా ఈ దశాబ్దంలో (1980 - 90) కూడా కొన్ని మంచి నాటకాలు, నాటికలూ వెలువడినాయి

దళితులు సమాజంలో ఎదుర్కొనే సమస్యలు బహుముఖాలు కొన్ని ప్రధాన సమస్యల్ని ఈ విధంగా వర్గీకరించవచ్చు

1 ఆర్థికపరమైనవి, 2 సామాజిక పరమైనవి, 3 రాజకీయ సంబంధమైనవి

## ఆర్థిక సమస్యలు :

సమాజంలో, ఆనాడు, ఈనాడు, ఏనాడైనా ప్రధాన సమస్యలకు కేంద్ర బిందువు డబ్బే ధనం ఉన్నవాడికి సమాజంలో బలముంటుంది గౌరవం ఉంటుంది నందిని పందిగా, పందిని నందిగా మార్చుకోగల సామర్థ్యం ఉంటుంది ధనం వెచ్చించి అబద్ధపు సాక్ష్యాలు చెప్పించి, న్యాయాన్ని తారుమారు చేసి తమకు

అనుకూలంగా మార్చుకోగల శక్తియుక్తులు ఉంటాయి మేధావులను సయితం డబ్బుతో తమవైపు త్రిప్పుకొని తమ పనులు సానుకూలం చేసుకోవచ్చు అందుకే 'ధన మూలమ్ ఇదమ్ జగత్' అనే నానుడి వ్యాప్తిలోకి వచ్చింది డబ్బులేనివాడు డుబ్బుకి కొరగాడనీ, కర్ర ఉన్నవాడిదే గొర్రె అనే సామెతలేర్పడ్డాయి తరతరాలుగా నిర్ధనులుగా ఉండటమే దళితులపాలిటి శాపం అయింది ఎండనకా, వాననకా చెమటోడ్చి పనిచేసి భూస్వాముల గాదెలు నింపుతూ తాముమాత్రం 'గంజిలో మెతుకెరగని' దైన్య జీవితానికి బలయిపోవడమే దళితుల వంతు అయింది తాత, తండ్రి, మనవడు అందరి జీవితాలు ఒక్కలాగే విషాదభరితంగా సాగిపోతూ సుఖానికి నోచుకోకపోతే, యింక ఆ బ్రతుకులకు అర్థమేమిటి? దేవుడిచ్చిన ప్రకృతి సంపద ఏఒక్క వర్గానికి పరిమితంకాదే? అది అందరిదీ! ఒకరు పడ్డ శ్రమను యింకొకరు దోచుకోవడమేమిటి? కష్టం చేసినవాడికి కన్నీరు శ్రమదోపిడి చేసినవాడికి పన్నీరా? ఇదెక్కడి సామాజిక న్యాయం? మేము ఎల్లకాలం పల్లకీ మోసేవాళ్లం, మీరు పల్లకీలో ఊరేగేవాళ్లా? ఇదెక్కడి న్యాయం ? ఈ ప్రశ్నా పరంపరలనుంచి, ఈ అవగాహననుంచి పుట్టిందే దళితవాదం ఆర్థికంగా దళితుల స్థితిగతుల్లో మార్పులొచ్చి వారి జీవన ప్రమాణం పెరిగేవరకు దళితులు ఎదుర్కొనే అనేక సమస్యలకు పరిష్కారం దొరకదు

దళితులు తాము ఎదుర్కొనే ఆర్థిక సమస్యలను మనసుమార్చుకుని ఏ భూకామందులో, గుత్తాధిపత్యం నెరిపే ఏ పెట్టుబడిదారులో, ప్రభుత్వమో పరిష్కరిస్తారని ఎదురు చూడటం కాదు ఆ రోజులు గతించాయి న్యాయమైన ధర్మసమ్మతమైన తమ కోర్కెల సాధనకోసం దళితులే సమాయత్తం కావాలని ఉద్బోధిస్తూ కొన్ని నాటక, నాటికలు వచ్చాయి శ్రీ కె యస్ టి సాయి రచించిన 'పరమపదం', వంగపండు ప్రసాదరావుగారి 'అడవిదివిటీలు', శ్రీ కె కె యల్ స్వామి గారి 'కరిమింగిన వెలగపండు' నాటకాలు, సంజీవి రచించిన 'కదలిక', గణేష్‌పాత్రోగారి 'ఆగండి కొంచెం ఆలోచించండి', భీమరాజుగారి 'మొక్కు', యిక్కుర్తి నరసింహారావుగారి 'పిడికిలి' మొదలైన నాటికలు ఈ కోవకు చెందిన నాటక సాహిత్యంలో పేర్కొనదగిన కొన్ని ఉదాహరణలు

# సామాజిక సమస్యలు

సృష్టిలోని ప్రాణులంతా సమానమే, దేవుని దృష్టిలో తేడాలు లేవు మానవుడే స్వార్ధబుద్ధితో మనుషుల్ని విడగొట్టి అంతరాలు సృష్టించాడు ఆ ఊబిలోపడి తల్లడిల్లిపోతున్నవారిలో దళితులు ప్రధమగణ్యులు అసమానతల వలయంలో చిక్కుకొని నిత్యజీవితంలో ఎన్నో అవమానాలకు, అగచాట్లకు, ఆత్మక్షోభకు, ఆత్మన్యూనతా భావానికి గురి అవుతున్న దళితులు సంఘంలో అనుభవిస్తున్న సమస్యలు అసంఖ్యాకం

దళితులు సమాజంలో నిత్యం ఎదుర్కొనే సమస్యల్లో ముఖ్యమైనవి 1 అంటరానితనం 2 ఆలయప్రవేశ నిషేధం 3 సంఘంలో గౌరవప్రతిపత్తి లేకపోవడం 4 ప్రేమ - పెళ్లి విషయాలలో కఠోర నియమాలు 5 అమానుష వైఖరి

వర్ణవ్యవస్థలో అంతర్భాగంగా, అగ్రవర్ణాలకు సంక్రమించిన ఒక అంటు వ్యాధిలా సంఘంలో హరిజనులను అంటరానివారుగా పరిగణించడం అనే దురాచారం అనాదిగా సాగుతూంది శాస్త్రవిజ్ఞానపరంగా సాంకేతికంగా ఈనాడు దేశం ఎంత అభివృద్ధి సాధించినా ప్రగతిపధంలో సాగిపోతున్నా మనిషిని మనిషిగా చూడలేని అజ్ఞాన తిమిరం యింకా మనసమాజాన్ని పట్టిపీడిస్తోంది హరిజనులను అస్పృశ్యులుగా చూస్తూ వారిని సంఘబాహ్యులుగా ఉంచడం, వారిని దేవాలయ ప్రవేశానికి అనర్హులుగా శాసించడం, నలుగురువాడే బావుల్లోనుంచి వారిని నీళ్లు తెచ్చుకోకుండా నిరోధించడం, అగ్రవర్ణాలు విధించిన సంఘనియమాలను ఉల్లంఘిస్తే హరిజనులను అమానుషంగా శిక్షించడం, హరిజనుల బిడ్డలు విద్యనభ్యసించకుండా అడుగడుగునా ప్రతిఘటించడం, అవరోధాలు సృష్టించడం మొదలైన ఎన్నో అత్యాచారాలకు పాల్పడుతున్న అగ్రవర్ణాల అమానుష చర్యల్ని ఒకవైపు గర్హిస్తూ, మరొకవైపు హరిజనుల్ని సంఘటితపరచి, వారిలో చైతన్యాన్ని, ఆత్మ విశ్వాసాన్ని కలిగించి, అగ్రవర్ణాల దుష్టచర్యల్ని ఎదుర్కొని తమ ఆత్మగౌరవాన్ని ప్రతిష్ఠించుకోగల ఆత్మస్థైర్యాన్ని దళితుల్లో కలిగించే విధంగా ప్రగతివాదులైన

కొందరు నాటకకర్తలు మంచి నాటకాలను, నాటికలను రచించారు

శ్రీకృష్ణ కౌండిన్య రాసిన 'నందనార్', ధర్మవరం గోపాలాచార్యులవారి 'అస్పృశ్య విజయం', డా॥ బోయి భీమన్నగారి 'పడిపోతున్న అడ్డుగోడలు', శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి 'కలసి బ్రతుకుదాం', శ్రీ విరియాల లక్ష్మీపతి 'పంచమవేదం', శ్రీ పాడిబండ్ల ఆనందరావు 'నిషిద్ధాక్షరి', శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు 'సప్తపది' మొదలైనవి ఈ కోవకు చెందిన నాటకాలు

## రాజకీయ సంబంధ సమస్యలు

దళితులు ఎంతో శ్రమపడి, కష్టనష్టాలకోర్చి విద్యార్జన చేసి సంస్కారవంతులై జీవితసమరంలో నిలబడితే, రాజకీయ నేతలు దళితులను వివక్షతకు గురిచేస్తున్నారు వారిని రాజకీయరంగంలో ఎదగనీయకుండా అడుగడుగున అడ్డుతగలడం జరుగుతూ ఉంది రాజకీయపరమైన హక్కులు సాధించకపోతే దళితుల సమస్యలను పరిష్కరించడం నేటి వ్యవస్థలో సాధ్యం కాదనే అవగాహనతో రాజకీయ రంగంలో అడుగు పెడుతున్న దళిత యువకులకు నిరాశే ఎదురవుతున్నది ఎల్లకాలం పదవులు తామే అధిష్ఠించాలనుకునే అగ్రవర్ణాల ధాటికి, కుయుక్తులకు ఉత్సాహవంతులైన దళితులు నిలబడలేక ఓటమి చవిచూస్తున్నారు దళితుల ఎదుగుదలకు ఆనకట్టవేయాలన్న దురాశతో వారిని మానసికంగా హింసించడమేకాక శారీరకంగా అంతం చేయడానిక్కూడా రాజకీయనేతలు వెనుకాడటంలేదు ఈ పరిస్థితులు గ్రహించి దళితులు అప్రమత్తంగా ఉండాలనీ, ఎత్తుకు పై ఎత్తులు వేసి దళితులు తమ గమ్యాన్ని చేరుకోవడానికి ఆత్మస్థైర్యంతో ముందుకు సాగాలని ఉద్బోధించే నాటక సాహిత్యంకూడా వెలువడింది

శ్రీ పరుచూరి వేంకటేశ్వరరావు రచించిన 'సమాధి కడుతున్నాం - చందాలివ్వండి' , శ్రీ కె చిరంజీవిగారి 'నీలిదీపాలు' పై వర్గానికి చెందిన నాటకాలుగా పేర్కొనవచ్చు

దళితుల సమస్యలను నాటకాలలో శక్తిమంతంగా చిత్రించడంలో నాటకకర్తలు

మూడు విధాలైన మార్గాలను స్వీకరించారు

దళితులు ఎదుర్కొనే సమస్యల తీవ్రత అందరికీ ఒకటే అయినా, దళితుల స్వభావాన్నిబట్టి మూడు రకాలుగా విభజించి సమస్యలను ఆవిష్కృతం చేశారు నాటకకర్తలు

1 దళితుల స్థితి గతులను యథాతథంగా చిత్రించి వారి దయనీయ జీవితాలకు అద్దంపట్టే నాటకాలు వీటిలో దళితులు చైతన్యరహితులుగా (అంటే తాము అనుభవిస్తున్న కష్టాలగురించి తామే పట్టించుకోని అజ్ఞాన దశలోవున్నవారు) ఉంటూ బాధలు అనుభవించడానికే తాము ఉన్నట్టు కన్పిస్తుంది వీరు పాసివ్ సఫరర్స్

శ్రీ విరియాల లక్ష్మీపతి రాసిన 'పంచమవేదం' నాటకంలో గంగులు చైతన్య, సింహాద్రి పాత్రలను, బోయి భీమన్నగారి 'పాలేరు' నాటకంలో పుల్లిగాడు పాత్రను, శ్రీ కొలకలూరి ఇనాక్ 'దిక్కులేనోడు' నాటికలో కోటీశు పాత్రను, మొదటి తరగతికి ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు

2 దళితులలో రెండవ తరగతివారున్నారు వీరికి తమ సమస్యలపట్ల అవగాహన వుంటుంది కానీ అన్యాయాలను, అక్రమాలను ఎదుర్కొనే శక్తి యుక్తులూ, ధైర్యమూ ఉండవు

శ్రీ కె చిరంజీవి రాసిన 'నీలి దీపాలు' నాటకంలో ముత్తడు, శ్రీ వి యస్ కామేశ్వరరావు గారి 'ఈ మంటలార్పండి' నాటకంలో మాణిక్యం, శ్రీ కొలకలూరి ఇనాక్‌గారి 'కూలి' నాటికలో రంగడు పాత్రలు రెండవ వర్గానికి ప్రతినిధులుగా పేర్కొనవచ్చు

3 పరిస్థితులపై ఎదురుతిరిగి అన్యాయాన్ని ప్రతిఘటించి తమ లక్ష్యం సాధించుకున్న పాత్రలు మూడవ వర్గానికి చెందుతాయి

శ్రీ నంబూరి శ్రీనివాసరావు రచించిన 'ప్రజా విజయం' నాటకంలో ప్రకాశ్, కె చిరంజీవిగారి 'నీలిదీపాలు' నాటకంలో వీరదాసు, శ్రీ కె యస్ టి శాయి 'పరమపదం' నాటకంలో చంద్రం, శ్రీ ఇనాక్ రాసిన 'నిర్జనం' నాటికలో

రాజారావు, శ్రీ యం కన్నబాబు రాసిన 'రత్నగర్భంలో నిత్య దరిద్రుడు' నాటికలో పోలిగాడు, వల్లంపట్ల నాగేశ్వరరావు రచించిన 'రాతిబొమ్మ' నాటికలో రామన్న, సూర్యం పాత్రలు ఈ మూడవ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తాయి

దళితుల బాధల గాధలకు మూలకారణం అజ్ఞానమే వారిలో అక్షరాస్యత పెరిగి, అజ్ఞాన తిమిరం పటాపంచలైన రోజు సాంఘికంగా ఆర్థికంగా, రాజకీయంగా వారిని ఎదుర్కొంటున్న సమస్యలు మబ్బు తునకల్లా విడిపోతాయన్నది సత్యం ఆ లక్ష్యాన్ని సాధించడానికి నాటకకర్తలు తమ రచనలద్వారా నిరంతర సమరం సాగిస్తూనే ఉన్నారు

## నీలి దీపాలు

శ్రీ కె చిరంజీవి రచించిన 'నీలిదీపాలు' ఈ దశాబ్దిలో, బాధా సర్పదష్టులైన దళితుల ఆక్రందనాల్లోంచి పుట్టిన నాటకం

ఈ నాటకంలో కథ పాతది అయితే కథనంలో కొత్తదనం ఉంది ఈ నాటకానికి 'ప్రస్తావన' రాస్తూ ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు డా మొదలి నాగభూషణశర్మగారు నాటకంలోని ముఖ్యపాత్రలను 'మాలపల్లి' నవలలోని పాత్రలతో సామ్యం కూర్చారు నాటకకర్త కూడా 'అవతారిక' లో మాలపల్లి' నవల ఈ నాటకానికి ప్రేరణ అని చెప్పుకున్నారు

బ్రెహ్ట్ సిద్ధాంతంలో ఒక భాగమైన ఎలియనేషన్ అనే పద్ధతిని 'నీలిదీపాలు' లో వాడుకున్నారు శ్రీ చిరంజీవి

"కథాకథనాన్ని సూత్రధారుడిద్వారాకాక బుర్రకథద్వారా చెప్పించడం కొత్త పద్ధతి కాకపోయినా, ఇందులో ఒక విధంగా 'ఎలియనేషన్ ఎఫెక్ట్' ను సాధించడంకోసం రచయిత ప్రవేశపెట్టినట్టు అనిపిస్తుంది కథను ఆపి, జరిగిన, జరగబోతున్న సంఘటనల్లోని అంతర్యాన్ని కథకుడి ద్వారా చెప్పించారు అయితే ఈ బుర్రకథకూడా ప్రేక్షకుల తాదాత్మ్యాన్ని చెడగొట్టదు సరికదా మరింత ఎక్కువగా తాదాత్మ్యతను కలిగిస్తున్నది"[11] అన్నారు డా నాగభూషణశర్మగారు

ఈ నాటకం అడుగడుగునా సుంకర – వాసిరెడ్డిగార్ల 'మాభూమి' నాటకాన్ని తలపింపజేస్తుంది మా భూమిలో అంకాలకు వరసగా బందగీ,

సమాధి, దివాణం, వీరారెడ్డి ఇల్లు, సమాధులు - అనే పేర్లతో అంకాలు ఉన్నాయి నీలిదీపాలలో కూడా అదే ఫక్కీలో బానిస, వైద్యుడొచ్చాడు, పోరాటానికి పిలుపు, ఇది ముగింపుకాదు - శీర్షికలతో ఐదు (5) అంకాలున్నాయి

"ఈ శీర్షికలు కథలోని మలుపులను, పరిణామక్రమాన్ని సూచిస్తున్నవే కానీ, నిజానికి సన్నివేశ కల్పనలో ఈ పరిణామం లేదు ముందుకు పోతున్నట్టు వాచ్యం గానే కథనం సాగింది దృశ్యమానం చెయ్యదగిన ముఖ్యమైన ఘట్టాలను జరిగినట్టు బుర్రకథలో చెప్పించారు రచయిత"[12] అని పేర్కొన్నారు శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి

"మా భూమిలో సంఘటిత శక్తితో ప్రజలు దేశముఖ్‌మీద తిరుగుబాటు చేస్తారు ప్రజాశక్తికి తలవాల్చి ఊరువిడిచి వెళ్లిపోతాడు దేశముఖ్ అలా ప్రజావిజయంతో నాటకం ముగుస్తుంది అయితే 'నీలిదీపాలు' లో ప్రజలను సంఘటితపరచడం వరకే జరుగుతుంది (బుర్రకథలో చెప్పే వివరాలనుబట్టి) భూస్వామి చేతిలో ప్రజానాయకుడు దారుణంగా వధించబడటంతో నాటకం అంతమవుతుంది ఈ నాటకంలో రాయుడయ్య పాత్ర తప్ప మిగిలిన పాత్రలన్నీ నిర్జీవంగా కన్పిస్తాయి రాయుడయ్యవల్ల బాధలు పడేవారిపట్లకూడా ప్రేక్షకులకు సానుభూతి కలిగేవిధంగా పాత్ర చిత్రణ లేదు నాటకంనిండా రాయుడయ్య క్రౌర్యమే రాజ్యం చేస్తుంది "[13]

'నీలిదీపాలు' లో ప్రజానాయకుడు ఏమీ సాధించలేకపోయినా భవిష్యత్తులో రాయుడయ్యవంటి దుర్మార్గులకు తగిన బుద్ధిచెప్పగల ధైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని, చైతన్యాన్ని ప్రజలలో కలిగించి తిరుగుబాటుకు రంగాన్ని సిద్ధం చేయడంలో కథానాయకుడు దాసు కృతకృత్యుడయ్యాడు

## ఈ మంటలార్పండి

శ్రీ వి యస్ కామేశ్వరరావు రచించిన ఈ నాటకంలోని ఇతివృత్తం 'నీలిదీపాలు' వంటిదే ఈ రచయిత రాసిన నాటకనాటికలలో అధికభాగం గ్రామీణ జీవితానికి సంబంధించినవిగా ఉండటంవల్ల పల్లె సీమలతో ఈయనకున్న అనుబంధం

స్పష్టమవుతుంది సంభాషణలలో కృత్రిమత్వానికి తావుండదు ఏ పాత్ర తన స్థాయిని మించి మాట్లాడదు యతిప్రాసల ఊకదంపుడు వినిపించదు కథావస్తువు సామాన్యంగా వున్నా, ఒక్కొక్కసారి పేలవంగా వున్నా తన రచనా శిల్పంతో ఆలోటును పూరించుకుని నాటక ప్రదర్శన ఆసక్తికరంగా ఉండేటట్లు నిర్మించగల ప్రతిభ శ్రీ కామేశ్వరరావులో పుష్కలంగా ఉంది

'ఈ మంటలార్పండి' నాటకం ప్రదర్శనాపరంగా బాగా రాణించిన నాటకమే అయినా, దీనిలోని కథావస్తువు మరీ చౌకబారుగా అతి సామాన్యంగా ఉంది నేటి గ్రామీణ వాతావరణాన్ని చిత్రంచే నాటకాలు ఇదివరకే ఎన్నో వచ్చాయి వాటిలో సన్నివేశాలకు, కథాక్రమానికి, పాత్రచిత్రణకు యీ నాటకం అంత భిన్నంగా లేదు పల్లెటూళ్లలో అగ్రవర్ణాలు తమ ఆధిపత్యం పదిలపరచుకోవడం కోసం సాగించే కులవ్యవస్థ ఎంత గర్హనీయమో గుర్తచేస్తుంది నాటకం

"సత్యం, శాంతి, సహనం ఆహుతైపోతే - దేశంలో మిగిలేది అరాచకత్వం, పైశాచికత్వం ఈ మంటలార్పడానికి యువతరం ముందుకు రావాలి క్షుద్ర రాజకీయ కబంధ హస్తాల బిగువులనుండి బయటికి రండి చేయిచేయి కలిపి ఈ మంటలార్పండి కులమత విచక్షణ విస్మరించి వివేకంతో ముందుకు కదలి అన్యాయాల్ని ప్రతిఘటిస్తూ ఈ మంటలార్పండి ఆధిక్యతకోసం పాకులాడే కుళ్లు వ్యవస్థ నిర్మూలనకు ఒక్కటై వెల్లువలా సాగుతూ ఈమంటలార్పండి"[14] అని వ్యాఖ్యాతచేత పలికించారు నాటకకర్త

ఈ నాటకంలో కథానాయకుడు దుర్బలుడుగా ఉంటూ పతాక సన్నివేశంలో హత్య చేయబడటంతో హీరో అనిపిస్తాడే తప్ప స్వతహాగా అతనిలోనాయకలక్షణాలే కనబడవు గ్రామంలో చైతన్యం తేవడానికి హీరో హీరోయిన్‌లు చేసిన ప్రయత్నం లేకపోడం విస్మయం కలిగిస్తుంది ప్రధానసన్నివేశాలలో ప్రధాన పాత్రలు మూగప్రేక్షకులుగా ఉండిపోవడం విడ్డూరం కాని ఈ నాటకంలో పరిషత్తు నాటకాలకు కావలసిన మసాల ఉంది [15]

ఇలాంటి స్టీరియో టైపునాటకాలు చూసినతర్వాత ఏమో కొందరు మేధావులు

ఇలా వ్యాఖ్యానించడం జరిగింది

"ప్రపంచమంతా మంచినాటకాలు, మంచి సినిమాలకు ప్రేరణ కలిగిస్తున్నాయి కాని తెలుగు దేశంలో మాత్రం చెడ్డ సినిమాలనుంచి చెడ్డ నాటకాలు నవలలు పుట్టుకొస్తున్నాయి ఇది విపరిణామం"[16] అన్నారు ఆచార్య ఆత్రేయగారు

'ఆధునిక సాహితీ ప్రక్రియలో నవల ప్రాచుర్యం పొందినా, నాటికలు, నాటకాలు కదిలించినంతగా, ఆలోచింపజేసేవిగా లేవనే చెప్పాలి"[17] అని శ్రీమతి మాదిరెడ్డి సులోచనగారు వ్యాఖ్యానించారు

"చాలా నాటకాలు మంచి నాటకాన్ని చూచామన్న భావనను కలిగించాయి కాని రసానుభూతిని కలిగించలేకపోయాయి అంటే వేగం మధ్యే హృదయానుభూతి నలిగిపోయిందన్నమాట"[18] అని శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు అభిభాషణ

శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి ఒక కథల సంపుటిని సమీక్షిస్తూ ఇలా వ్యాఖ్యానించారు ఈ వ్యాఖ్యానం నాటిక సాహిత్యానికి కూడా అన్వయిస్తుంది

'కథకు పాయింటు ఎంత ముఖ్యమైనదైనా, పాయింటు చెప్పడమే కథ చెప్పడం కాదు ఆ పాయింటు చుట్టూ పాత్రలు,సన్నివేశాలు, ఆ సన్నివేశాలలో ఆ పాత్రల రాగద్వేషాలు మొదలయిన అంగాలన్నీ సరిగా వుండి సమన్వయింప బడినపుడే ఆ పాయింటుకొక సాహిత్య స్వరూపం ఏర్పడి కథ అవుతుంది ముఖ్యంగా కథలోని పాయింటు పాఠకుని గుండెలకు తాకాలి అలా తాకాలంటే కథలోపాయింటు చుట్టు అనుభూతి సంపద వుండాలి ఆ అనుభూతి సాధారణంగా కథలోని పాత్రలను ఆశ్రయించుకొని వుంటుంది ఆ కథలోని పాత్రలతో (లేదా ఏదో ఒక పాత్రతో) పాఠకుడు తాదాత్మ్యంచెంది ఆ పాత్ర(ల) రాగద్వేషాలను తనవిగా అనుభవించినపుడే ఆ కథలోని పాయింటు గుండెల్లో నాటుకుంటుంది అప్పుడే శిల్పం కళ అవుతుంది" [19]

అందుకే ఏ సాహిత్య ప్రక్రియ అయినా బుద్ధికి పదును పెడితేనే చాలదు హృదయాన్ని తాకగలిగినపుడే ఆ సాహిత్య ప్రక్రియకు పరిపూర్ణత సిద్ధిస్తుంది

# రాముడు లేని రాజ్యంలో

శ్రీ కాశీవిశ్వనాధ్ రచించిన 'రాముడు లేని రాజ్యంలో' అనేది కూడా పై కోవకు చెందిన నాటకమే ధనమదాంధుడైన కొండబాబు అనే విలను పేదలకు అప్పులిచ్చి వాళ్ళని బానిసలుగా మార్చి వేధించటం,చదువు సంధ్యల్లో వారి బిడ్డలు ఎదగనీయకుండా ఆటంకాలు కల్పించడం, ఒక మానభంగం దృశ్యం,అతడు చేసే అరాచకాలన్నిటికీ వంతపాడే దుష్ట త్రయం, చివరికి అతని దౌష్ట్యానికి దోపిడికి గురైన దళితులే చైతన్యవంతులై విలను మీదికి విరుచుకుపడటం -ఫ్రీజలో వ్యాఖ్యానం-అంతా మామూలే ఎన్నో మంచి నాటకాలను రచించిన శ్రీ కాశీవిశ్వనాధే - ఏమాత్రం బరువు పెట్టకుండా లైటర్ వీను లో రాసిన నాటకం బహుశా ఇదొక్కటే కావచ్చు

ఇలాంటి నాటకాల్లో దుష్టపాత్ర చుట్టూ కథ కేంద్రీకృతమై,మిగిలిన పాత్రలన్నీ అతని చుట్టూ ఉపగ్రహాల్లా తిరుగుతూ ఉంటాయి కథలో పెద్దగా మార్పుండదు నాటకం పేరు,రచయిత పేరు,పాత్రల పేర్లు మారుతూ ఉంటాయి నాటక ధ్యేయం ఎంత మంచిదైనా కథనంలో నవ్యత్వంలోపిస్తే ఆ రచన 'నలుగురిలో నారాయణ' అన్నట్టే వుంటుంది

# న్యాయం నెగ్గింది

శ్రీ దోనేపూడి రాజారావు రచించిన ఈ నాటకంలో కథ పాతదే అయినా

కథనంలో కొత్తదనం ఉంది ఎనభై రూపాయలు మూడు తరాలను కట్టు బానిసలుగా మార్చి తాతను,తండ్రిని,మనవడిని కూడా కష్టాలు పాలుచేసి రక్తమాంసాలను దోపిడీ చేసిన ఓ కోటయ్య కథ ఇది తాతా తండ్రులు నిస్సహాయులై ఉండిపోయినా,మనవడి తరంలో తిరుగుబాటు తత్వం తలెత్తింది "ఇక మన సంఘాన్ని మనం వృద్ధి చేసుకుందాం మన శక్తిని మనం పెంచుకుందాం" అంటే"అదెట్లా తాతా? ఏం తింటే వస్తుంది?" అని ప్రశ్నించిన

అజ్ఞాన దశ నుంచీ "ఈయన పనీయకపోతే మేం తిండిలేక చస్తామను కున్నాడేమో.అసలే మేము పనిచేయకపోతే ఈయనకి తిండెక్కడిది? ఈయనకే కాదు, ఈదేశానికే తిండిలేదు" అని ధీమాగా అనగలిగిన చైతన్య దశకు ఎదిగారుకష్టజీవులు ఎవరో బోధిస్తే వాళ్లలో చైతన్యం రావడం కాదు, ఎవరికి వారు తమ కష్టాలు, అనుభవాలు నేర్పిన పాఠంతో పరివర్తన చెందారు ఆ చైతన్య స్ఫూర్తితోనే కోటయ్య దురహంకారానికి, విశృంఖలత్వానికి పగ్గాలు వెయ్యగలిగారు రాజారావుగారి నాటకాల్లో నాందీప్రస్తావనలు విధిగా ఉండటం గమనించదగిన విషయం

## పంచమ వేదం,నిషిద్ధాక్షరి

కుల వ్యవస్థను ఖండిస్తూ ఈ దశాబ్దిలో కొన్ని నాటకాలు వచ్చాయి వర్ణ వ్యవస్థకూ,సనాతన ధర్మాలకు,సంప్రదాయాలకూ కట్టుబడి తాము నమ్మిన సిద్ధాంతాల బాటలో పయనించే సంప్రదాయవాదులకూ,మారిన పరిస్థితులకు అనుగుణంగా జీవన విధానం మార్చుకోవాలనీ కాలదోషంపట్టిన సంప్రదాయాలను, మూఢ విశ్వాసాలను పట్టుకుని వేలాడటం మూర్ఖత్వమని వాదించే ప్రగతి వాదులకు మధ్య సంఘర్షణ ప్రతి తరంలోనూ ఉంది అయినా సంప్రదాయాలపట్ల విధేయత,కులతత్వం,ఛాందసత్వం యింకా జీవించే ఉన్నాయి మన సమాజంలో ఈ ఇతివృత్తం మీద శ్రీ విరియాల లక్ష్మీపతి 'పంచమవేదం' అనే నాటకాన్ని రచించారు సంప్రదాయాలవాసన వదులుకోలేని పూజారిని అడుగడుగునా ప్రగతివాదులను ప్రతిఘటించటం,చివరకు ఓటమిని ఒప్పుకోలేక ప్రాణత్యాగానికి సిద్ధపడటం ఈ నాటకంలో చిత్రంచబడింది పాత్రోచిత సంభాషణలు,సహజమైన సంభాషణలద్వారా రచయితయొక్కలోకజ్ఞత,తార్కిక ప్రజ్ఞ వ్యక్తమవుతున్నాయి 'పంచమవేదం' నాటకంలో

అలాగే శ్రీ పాటిబండ్ల ఆనందరావు రాసిన 'నిషిద్ధాక్షరి'లో కూడ కులతత్వం నిరసించబడింది సంప్రదాయాలను గౌరవించే శాస్త్రి చేత పలికించిన మాటలు జిజ్ఞాస రేపేవిగా,నిర్మాణాత్మకంగా ఉన్నాయి ఉన్నత నిమ్న జాతుల మధ్య గోడగా

నిలిచిన జంధ్యాన్ని శాస్త్రి తీసెయ్యడం అనే చర్య, కులాతీత మానవతకు పట్టం కట్టడమే! 'పంచమవేదం'లో రచయిత నెగిటివు అప్రోచ్‌తో నాటక నిర్మాణం చేస్తే, 'నిషిద్ధాక్షరి' లో నాటక కర్త పాజిటివు అప్రోచ్‌తో సమస్యను విశదీకరించారు

శ్రీ అత్తిలి కృష్ణారావు రచించిన 'తూర్పురేఖలు' నాటకం గిరిజనులపై భూస్వాములు చూపే కాఠిన్యాన్ని,అమానుష చర్యలను చిత్రిస్తుంది శ్రీ వాగ్దేవి రాసిన 'అరణ్యపర్వం',డా మొదలి నాగభూషణశర్మగారి 'దొరా నీ సావుమూడింది' నాటకం,శ్రీ చింతాడ రామారావు గారి 'నరబలి',శ్రీవి సి కృష్ణగారి 'నడుస్తున్న చరిత్ర' నాటికలు దళితవాదపు నేపథ్యంలో రాయబడిన నాటిక నాటకలుగా పరిగణించవలసిఉన్నది ఇటీవలి కాలంలో శ్రీకె కె ఎల్ స్వామి 'కరి మింగిన వెలగపండు' నాటకం, భీమరాజుగారి 'మొక్కు' నాటికలు ఆంధ్రదేశంలో విరివిగా ప్రదర్శితం అవుతున్నాయి గిరిజన ప్రాంతాలలో దొరికే ప్రకృతి సంపదమీదే ఆధారపడి దుర్భరమైన జీవితం గడుపుతున్న గిరిజనులపై 'జులుం' చెలాయిస్తూ,ఆ అమాయకులను హింసించే నరసింహుల దురాగతాలను చిత్రించిన ఈ రెండు నాటకాలు దళితవాదానికి నిర్వచనాలుగా పరిగణించదగినవి

చివరగా, దళితుల సమస్యల్ని ఇతివృత్తాలుగా స్వీకరించి నాటకాలు వ్రాస్తున్నవారి కృషి బహూధా ప్రశంసనీయమైనది అయితే ఒక ఆదర్శాన్ని ఉద్దీపింపచేసే ప్రయత్నంలో, అమితోత్సాహంతో నాటక వస్తునిర్వహణలో నాటకీయతను బలిచేయడం జరుగుతున్నది ప్రచార ధోరణికి అగ్రస్థానం లభిస్తున్నది కళాత్మకత నీరుగారిపోకుండా ఏ విషయాన్నయినా అభివ్యక్తీకరించినపుడే ఆ కావ్యసృష్టికి అందం వస్తుంది అదే వాంఛిత గమ్యాన్ని చేరగలుగుతుంది

ఇదివరకే పేర్కొన్నట్లు ఈ ప్రకరణంలో ఉదహరించిన నాటకాలన్నీ దళితవాదాన్ని పుణికిపుచ్చుకుని దళితవాద స్పృహతో రాసినవి కావు కాకపోతే దళిత వాదంలో అంతర్భాగమైన లక్షణాలలో కొన్నిటినైనా స్పృశించి దళిత వాదాన్ని ధ్వనిగర్భితంగా అభివ్యక్తీకరించాయని చెప్పవచ్చు దళితులు నిత్యజీవితంలో ఎదుర్కొంటున్న

అంటరానితనం, అణచివేత, అవమానాలు, దుర్మార్గాన్ని దౌర్జన్యాన్ని ప్రతిఘటించలేని నిస్సహాయ స్థితి, సంఘంలో గౌరవ ప్రతిపత్తి లేకపోవడం, శ్రమదోపిడి మొదలైన సమస్యలన్నిటిమీదా నాటకాలొచ్చాయి కులరహిత సమాజస్థాపన జరగాలనీ, అసమానతలు తొలగిపోవాలనీ ప్రబోధించే నాటకాలొచ్చాయి నేటి సమాజంలో దళితులకు అన్ని రంగాలలో ఎదురౌతున్న దోపిడీతత్వాన్ని నిరసిస్తూ, చైతన్యవంతులైన దళితులు తిరుగుబాటుచేసి తమ లక్ష్యాన్ని సాధించుకొన్న నాటకాలు కూడా రంగస్థలాన్ని అలరించాయి. దళితుల్లో ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మస్థైర్యాన్ని ప్రోదిచేసే నాటకాలు, హింసను ప్రతిహింసతో ఎదుర్కొని ప్రతిఘటనాత్మకత తత్వాన్ని చాటిచెప్పే నాటకాలు, రాజకీయలబ్ధికై దళిత వర్గాలలో చైతన్యస్ఫూర్తి కలిగించే నాటకాలు యిలా ఎన్నో రకాలుగా దళిత సమస్యలను ప్రతిబింబించే రచనలు నాటక సాహిత్యంలో వచ్చి చేరాయి ఈ నాటకాలను ఎక్కువగా దళితేతరులే రచించారు కనుక వాటిని దళిత నాటకాలుగా పరగణించరాదు అనే వాదం సమంజసంగా కనబడదు

నేడు వ్యాప్తిలో ఉన్న దళిత వాదపు వెలుగులో ఈ నాటకాలను పరిశీలించినపుడు ఉగ్రరూపం దాల్చిన నేటి దళితోద్యమం తాలూకు భావతీవ్రతకు అనువుగా ఈ నాటకాలు లేకపోవచ్చు ఆ వెలితిని సమకాలీన నాటక రచయితలు పూరించవలసివుంది దళిత వాదపు విశ్వరూపాన్ని ప్రదర్శించే నాటకాలు రావలసివుంది ఆ సమయం దగ్గరలోనే ఉంది

## దళితుల సమస్యలు ప్రతిబింబించే నాటకాలు, నాటికలు

| నాటకం/నాటిక పేరు | రచయిత |
|---|---|
| 1 నందనార్ (నాటకం) | కృష్ణకౌండిన్య |
| 2 నందనార్ (నాటకం) | పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రి |
| 3 పతితపావన (నాటకం) | తాంగ్రడ సుబ్రహ్మణ్య శాస్త్రి |
| 4 అస్పృశ్య విజయం (నాటకం) | ధర్మవరం గోపాలాచార్యులు |

| | |
|---|---|
| 5 భక్తనంద (నాటకం) | ఆంధ్ర శేషగిరిరావు |
| 6 తిరుగుబాటు (నాటకం) | మునిమాణిక్యం నరసింహారావు |
| 7 విషకన్య | మల్లాది వెంకటకృష్ణ శర్మ |
| 8 సహజీవనం | అంతటి నరసింహం |
| 9 పడిపోతున్న అడ్డుగోడలు | డా॥ బోయి భీమన్న |
| 10 జన్మహక్కు | తాతా జగన్నాధరావు |
| 11 జీతగాడు | సుంకర సత్యనారాయణ |
| 12 మానవత్వం | అంతటి నరసింహం |
| 13 జన్మహక్కు (నాటకం) | వెంపో |
| 14 రాగవాసిష్ఠం (నాటకం) | డా॥ బోయి భీమన్న |
| 15 శాపవిమోచనం (నాటకం) | ఊటుకూరి సత్యనారాయణ రావు |
| 16 పాలేరు (నాటకం) | డా॥ బోయి భీమన్న |
| 17 ఇదా ప్రపంచం (నాటకం) | కణ్వశ్రీ |
| 18 సప్తపది | కప్పగంతుల మల్లికార్జునరావు |
| 19 ఆగండి కొంచం ఆలోచించండి | గణేష్‌పాత్రో |
| 20 ఊరుమ్మడి బతుకులు | సి యస్ రావు |
| 21 సమాధికడుతున్నాం చందాలివ్వండి (నాటకం) | పరుచూరి వెంకటేశ్వరరావు |
| 22 ప్రాణం ఖరీదు | సి యస్ రావు |
| 23 వెలుగొచ్చింది | రత్నగిరి జగన్నాధం |
| 24 సర్పయాగం | వి యస్ కామేశ్వరరావు |
| 25 పిడికిలి | యిక్కుర్తి నరసింహారావు |
| 26 కదలిక | యమ్ సంజీవి |

| | |
|---|---|
| 27 సర్వజాతి | కె యస్ టి శాయి |
| 28 తులసీతీర్థం | అప్పలాచార్య |
| 29 తూర్పురేఖలు (నాటకం) | అత్తిలి కృష్ణారావు |
| 30 సహనం చచ్చిపోతే | బైనబోయిన |
| 31 అరణ్యపర్వం | వాగ్దేవి |
| 32 నీలిదీపాలు (నాటకం) | కె చిరంజీవి |
| 33 హరిజనాగ్రహారం (నాటకం) | వేమవరపు సుబ్బారావు |
| 34 నిషిద్ధాక్షరి (నాటకం) | పాటిబండ్ల ఆనందరావు |
| 35 దొరా నీసావు మూడింది | డా॥ మొదలి నాగభూషణ శర్మ |
| 36 పంచమవేదం (నాటకం) | విరియాల లక్ష్మీపతి |
| 37 కరిమింగిన వెలగపండు (నాటకం) | కె కె ఎల్ స్వామి |
| 39 మొక్కు | భీమరాజు |
| 40 నరబలి | చింతాడ రామారావు |
| 41 నడుస్తున్న చరిత్ర | వి సి కృష్ణ |
| 42 ఈ మంటలార్పండి (నాటకం) | వి యస్ కామేశ్వరరావు |
| 43 ఆడవి దివిటీలు (నాటకం) | వంగపండు ప్రసాదరావు |
| 44 ఊరికో రుద్రమ్మ (నాటకం) | గొట్టిముక్కల నాగేశ్వరరావు |
| 45 ఈ చరిత్ర ఏసిరాతో (నాటకం) | సంజీవి |
| 46 రాముడు లేని రాజ్యంలో (నాటకం) | కాశీవిశ్వనాధ్ |
| 47 మీరైతే ఏం చేస్తారు? | కాశీవిశ్వనాధ్ |
| 48 న్యాయం నెగ్గింది | దోనేపూడి రాజారావు |
| 49 అం అః | ఆనంత హృదయరాజ్ |
| 50 కులం | వి యస్ కామేశ్వరరావు |

| | | |
|---|---|---|
| 51 | కులంలేని పిల్ల (నాటకం) | పినిశెట్టి |
| 52 | కూలి | ఆచార్య కొలకలూరి ఇనాక్ |
| 53 | గాంధేయులా బ్రాందేయులా? (నాటకం) | అభ్యుదయ శ్రీ |
| 54 | చైతన్యకిరణం (నాటకం) | వసంతరావు, కొప్పుల |
| 55 | దర్శనం | కొలకలూరి ఇనాక్ |
| 56 | దిక్కులేనోడు | కొలకలూరి ఇనాక్ |
| 57 | నిచ్చెనమెట్లు | మోదుకూరి జాన్సన్ |
| 58 | నిర్ణయం | కొలకలూరి ఇనాక్ |
| 59 | న్యాయం | కొలకలూరి ఇనాక్ |
| 60 | పరమపదం (నాటకం) | కె యస్ టి సాయి |
| 61 | ప్రేమకు సంకెళ్లు | బైనబోయిన వేంకటేశ్వర్లు |
| 62 | భక్తతుకారాం (నాటకం) | సురవరం ప్రతాపరెడ్డి |
| 63 | మునివాహనుడు | కొలకలూరి ఇనాక్ |
| 64 | రాతిబొమ్మ | వల్లంపట్ల నాగేశ్వరరావు |
| 65 | విముక్తి (నాటకం) | పులుగుండ్ల రామకృష్ణయ్య |

# ఆరవ ప్రకరణం

## ఆధునిక నాటకం - విదేశీ ప్రభావం

పందొమ్మిదవ శతాబ్దంలో, ఆంగ్లభాషా సంపర్కంవల్ల భారతీయ భాషల్లో ఎన్నో మార్పులు వచ్చినట్టుగానే తెలుగు సాహిత్యప్రక్రియల్లో కూడా కొత్తదనం చోటుచేసుకుంది

ప్రథమ స్వాతంత్ర్య సమరం జరిగిన 1857 లో బ్రిటీష్‌వారు భారతదేశంలో బొంబాయి, కలకత్తా, మద్రాసు నగరాలలో మూడు విశ్వవిద్యాలయాలు స్థాపించారు వానికి అనుబంధంగా కొన్ని కళాశాలలు ఏర్పడ్డాయి తత్ఫలితంగా ఆంగ్లవిద్యావ్యాప్తి శీఘ్రగతిని పురోగమించింది

ఆంగ్ల విద్యాసంపర్కంతో విద్యాధికులలో నూతన చైతన్యం వెల్లివిరిసింది నూతన భావసంఘర్షణకులోనై అన్ని రంగాలలోని నూతన పద్ధతులు ప్రవేశపెట్టడం కోసం అన్వేషించసాగారు వారి అన్వేషణలో ఒక భాగమే తెలుగు సాహిత్యంలో నూతన ప్రక్రియల ఆవిర్భావం తెలుగులోని అంతకు పూర్వంలేని నవల, ఖండకావ్యం, వ్యాసం, ఆత్మకథ జీవితచరిత్ర వంటి కొత్తకొత్త సాహిత్య ప్రక్రియలు వెలుగులోకి వచ్చాయి తెలుగులో నాటక రచన కూడా ఆంగ్ల విద్యాప్రభావంతో మొదలైందని చెప్పవచ్చు

నవల, వ్యాసం, ఆత్మకథ, జీవితచరిత్ర వంటి సాహిత్య ప్రక్రియలకు శ్రీ కందుకూరి వీరేశలింగం ఆద్యుడుకాగా, నాటక రచనలో ప్రథముడు శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి వీరు రచించిన 'మంజరీ మధుకరీయం' అనే రూపకం నాటకరంగంలో వికసించిన తొలి పుష్పం అని ఇదివరకే చెప్పబడింది

కాగా, "కొక్కొండవారు సంస్కృత రూపకాంధ్రీకరణమునకు దారిచూపగా, వావిలాల వాసుదేవశాస్త్రిగారు ఆంగ్ల రూపకాంధ్రీకరణమునకు మార్గంవేశారు 'జూలియస్ సీజరు' ను 'సీజరు చరిత్రము' అనే పేరుతో 1874 లో ఆసాంతం

"తేటగీతి" అనే ఛందస్సులోకి అనువదించారు, ఇది 1875 లో ప్రకటితమైంది కావున వావిలాలవారు ఆంధ్ర రూపకాంధ్రీకరణమునకు పూనుకొన్న ప్రధములేకాక, తెలుగులో విషాద రూపకమును, కేవలం పద్యరూపకమును రచించిన ప్రధములుకూడా అవుతున్నారు అందుచే ఆంగ్ల రూపకానువాదంలో ఉత్పన్నమయ్యే సమస్యలను వారే స్వయంగా పరిష్కరించుకొని, కొన్ని నియమాలను ఏర్పరచుకోవలసి వచ్చినది సంస్కృత భాషలోని పేర్లను, భావాలను, శబ్దాలను తెలుగులో యథాతధంగా వాడుకోవచ్చు మరి, ఆంగ్లభాషా విషయం అట్లాకాదు శాస్త్రిగారు ఆంగ్లంలో పేర్లకు తెలుగు విభక్తులు చేర్చి, యథాతధంగా ప్రయోగించారు కాని, పాశ్చాత్యుల ఆచార-సంప్రదాయాలను చాలావరకు మార్చి, భారతీయం చేయటానికి ప్రయత్నించారు కొన్నిచోట్ల అనువాదం వ్యాఖ్యానాత్మకంగా ఉంది అంతా పద్యమయంకావటం వల్ల అక్కడక్కడా వ్యర్థపదాలు తప్పలేదు, షేక్స్పియర్ రూపకాలలోని 'బ్లాంకు వెర్సు' వంటిదే తెలుగులోని "తేటగీతి" దానివలనే దీనిని కూడా "గద్యంగా పఠించవచ్చు"[1] అని వివరించారు మొదటి ఆంగ్ల రూపకానువాదం గురించి ప్రసిద్ధ పరిశోధకులు, విమర్శకులు డా॥ పోణంగి శ్రీరామ అప్పారావు గారు

దరిమిలా శ్రీ గురజాడ శ్రీరామమూర్తి షేక్స్పియర్ 'మర్చెంట్ ఆఫ్ వెనీస్' నాటకాన్ని 'వెనీసు వణిజ నాటకము' అనే పేరుతో అనువాదించారు అయితే, ఈ రెండు నాటకాలు, అప్పటికి నాటక సమాజాలు ఏవీ ఏర్పడకపోవడంచేత ప్రదర్శింపబడలేదు

1880 సంవత్సరంలో ధార్వాడ నాటక సమాజంవారు రాజమహేంద్రవరంలో ఆకర్షణీయమైన హిందీ నాటకాలను ప్రదర్శించి వెళ్ళిపోయిన తర్వాత వారు నిర్మించిన తాటియాకుల పాకలోనే, శ్రీ కందుకూరి వీరేశలింగం తమ విద్యార్థులచేత 'చమత్కార రత్నావళి' అనే నాటకం ప్రదర్శింపజేశారు షేక్స్పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' అనే నాటకానికి కందుకూరి వారి అనువాదం ఆ నాటకం " పాత్రలపేర్లను, అయాదేశాల ప్రాంతల పేర్లను మార్చివేసినారు స్త్రీలకు, సేవకులకు వ్యావహారిక భాషను వాడినారు మూలంలోని పద్యభాగాన్ని కూడా వచనంలోకి అనువదించారు

కథాప్రారంభంలో కొంత కల్పన చేశారు ఆయా సన్నివేశాలలో కూడా అల్పాల్పములైన చెర్పులు మార్పులు లేకపోలేదు మొత్తంమీద దీనిని అనువాదం అనటం కంటే "అనుసరణ" అనటం సమంజసం కాగలదు[2]

1860-1900 సంవత్సరాల మధ్య, అంటే తెలుగు నాటక రచన, ప్రదర్శన ప్రారంభదశలో అనువాద నాటకాలు అంతగా వెలువడలేదు కందుకూరివారే షెరిడాన్ రాసిన 'రైవల్స్', 'డ్యూయోనా' అనే నాటకాలను వరుసగా 'కళ్యాణకల్పవల్లి' (1894) 'రాగమంజరి' (1885) పేర్లతో ఆంధ్రీకరించారు ఈ విధంగా షెరిడాన్ రచనలను తొలిసారిగా తెలుగువారికి పరిచయం చేసినవారు కందుకూరి వీరేశలింగంగారే అయితే ఈ నాటకాలలో విదేశీయ వాతావరణమే కన్పించడంచేత తెలుగు నేలమీద అవి ప్రదర్శనకు వీలు కల్గించలేకపోయాయి

"ప్రాచ్య పాశ్చాత్య నాటకసిద్ధాంతాలను బాగా అవగాహన చేసుకొన్న ధర్మవరం రామకృష్ణమాచార్యులుగారు ప్రాతక్రొత్తల మేలుకలయికను సాధించటానికి పూనుకొన్నారు అందుచేతనే వారు అన్నీ స్వతంత్ర రచనలే చేసినారు, అనువాదాల అనుకరణల పొంతకు పోలేదు" [3]

ధర్మవరంవారు పాశ్చాత్య నాటకాలను అనువదించకపోయినప్పటికీ పాశ్చాత్యనాటక సాంప్రదాయాలను చాలావరకు అనుసరించినారు పాశ్చాత్యుల పద్ధతిననుసరించి విషాద నాటకాలను రచించారు విషాద సారంగధర, అజామిళ, పాదుకా పట్టాభిషేకం నాటకాలను దీనికి ఉదాహరణలుగా చెప్పవచ్చు అంకాలను రంగాలుగా విభజించారు భరతుని నాట్యశాస్త్రం ప్రకారం నాటకంలో కథానాయకుడు ప్రఖ్యాతుడు ఉదాత్తుడే అయివుండాలని నియమం ఉండగా ధర్మవరంవారు సామాన్యులను కూడా కథానాయకులను చేశారు నాటకాలలో స్త్రీ పాత్రలకు ప్రాధాన్యం కల్పించారు అంతేకాక పాశ్చాత్య నాటక పద్ధతిలో దీర్ఘ స్వగతాలను కూడా తమ నాటకాలలో ప్రవేశపెట్టారు పాత్ర చిత్రణకు భావసంఘర్షణకు ప్రాధాన్యమిచ్చారు ఇవన్నీ విదేశీనాటక సంపర్కంవల్ల సంభవించిన మార్పులే

1900-1930 మధ్యకాలంలో మరికొందరు పాశ్చాత్య నాటకకర్తల ప్రభావం తెలుగు రచయితలపై ప్రసరించింది

షెక్స్పియర్ రచనలకు అనువాదాలెకాక మోలియర్ మాటర్‌లింక్ ఆస్కార్‌వైల్డ్ వంటి రచయితలకు ప్రవేశం లభించింది శ్రీ సెట్టి లక్ష్మీనరసింహం మోలియార్ రాసిన 'మైజర్' నాటకాన్ని 'లుబ్ధాగ్రెసర చక్రవర్తి (1914) అనె పెరులో అనుపదించారు శ్రీ పింగళి నాగేంద్రరావు ఆస్కార్‌వైల్డ్ రాసిన 'డచెస్ ఆఫ్ పాదువా' అనె నాటకాన్ని 'వింధ్యరాణి' పేరుతో అనువదించారు గుడిపాటి వేంకటాచలం మాటర్ లింక్ రచనను 'సావిత్రి' పేరుతో వెలుగులోకి తెచ్చారు శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు 'సరస్వతి' పేరుతో షేక్స్పియర్ 'కామెడీ ఆఫ్ ఎర్రర్స్' నాటకాన్ని ఆంధ్రీకరించారు ఆ కాలంలో 'వింధ్యరాణి' (1928) నాటకం మాత్రమే రంగస్థలంమీద ప్రదర్శింపబడింది

1930-50 వ సంవత్సరాలలో ప్రపంచ ప్రసిద్ధిగాంచిన నాటకాలు తెలుగు నాటక క్షేత్రంలోకి వరదలా వచ్చిపడ్డాయి ఒక్కోసారి ఒక నాటకానికే రెండు మూడు అనువాదాలు కూడా వచ్చాయి

1930 సంవత్సరం నాటక చరిత్రలో ప్రాముఖ్యం కలది ఆ సంవత్సరం పి వి రాజమన్నార్ గారి 'తప్పెవరిది' అనే నాటకం వాస్తవిక ధోరణిలో రాయబడి ప్రదర్శింపబడింది ఆ నాటకానికి మహానటుడు బళ్ళారి రాఘవ నేతృత్వం వహించారు తెలుగు నాటకరంగంలో వాస్తవికతావాదాన్ని ప్రవేశపెట్టిన మూలపురుషులు వీరేనని చెప్పవచ్చు అప్పటినుండి వాస్తవికతావాదం (రియలిజమ్) తెలుగు నాటక సాహిత్య సృష్టిలో ఒక అంతర్భాగమైపోయింది ఆ తర్వాత వచ్చిన అనేక నాటక శైలులు (థియేటర్ స్టయిల్స్) కొన్ని మెరుపులా మెరిసి మాయమైపోయాయిగాని, ఈ వాస్తవికతావాదం మాత్రం నాటకరంగాన్ని ఇప్పటికీ అంటిపెట్టుకునే ఉంది

వాస్తవికతావాదాన్ని బహుళ ప్రచారంలోకి తెచ్చిన ఇబ్సన్ ప్రభావం నాటకరచయితలమీద బలంగా ఉంది ఇబ్సన్ రాసిన 'డాల్స్‌హౌస్' నాటకాన్ని

తెలుగులోకి ముగ్గురు అనువదించారు 'బొమ్మరిల్లు' పేరుతో శ్రీ దేశిరాజు రామదాసు, శ్రీ వెమనగంటి శ్రీరాములు, శ్రీమతి మామిడిపూడి వెంకమ్మ అనువాదాలు వెలువడినాయి తెలుగు వాతావరణం కల్పించే ప్రయత్నాలు జరిగినా, ఈఅనువాదాలేవీ రంగస్థలంమీదికెక్కిన ఆనవాళ్ళు కనబడవు పార్యాలుగానే మిగిలిపోయాయి

ఇబ్సన్ రాసిన మరోనాటకం 'ఎనిమీ ఆఫ్‌ద పీపుల్' తెలుగు రంగస్థలంపై అత్యంత ఆదరణపొంది ప్రాచుర్యంలోకి వచ్చింది ఈ నాటకాన్ని శ్రీ కొర్రపాటి గంగాధరరావు 'ఈరోడ్డు ఎక్కడికి?' పేరుతోను, శ్రీ గొల్లపూడి మారుతీరావు 'సత్యంగారిల్లెక్కడ' పేరుతోను, డా॥ మొదలి నాగభూషణ శర్మ 'ప్రజలమనిషి' అనే పేరుతోను, శ్రీ కె యస్ టి సాయి 'విషవలయం' అనే పేరుతోను అనువదించారు ఆ నాటకాలన్నీ రంగస్థలంమీద ప్రదర్శింపబడి ఇబ్సన్ కీర్తిని ఇనుమడింపజేసినవే అలాగే, ఇబ్సన్ 'పిల్లర్స్ ఆఫ్ సొసైటీ' నాటకాన్ని 'సంఘసేవకులు' అనే పేరుతో శ్రీ కోగంటి రాధాకృష్ణమూర్తి తెలుగు చేశారు

మోలియర్ రచనలకు తెలుగు అనువాదాలు చాలా వచ్చాయి భమిడిపాటి కామేశ్వరరావుగారి 'తప్పనిసరి', 'వద్దంటే పెళ్లి' 'పూర్వరంగం' అనే నాటకాలు మోలియర్‌కి అనువాదాలు శ్రీ ముద్దుకృష్ణ 'ఆడవాళ్ళ తెలివి' మోలియర్ నాటకానువాదమే

ఆస్కార్ వైల్డ్ 'యాన్ ఐడియల్ హజ్‌బెండ్' నాటకాన్ని 'ఆదర్శాలు' పేరుతో శ్రీ ఎ యస్ అవధాని, 'ఆదర్శమూర్తి' పేరుతో శ్రీ ఎ ఆర్ కృష్ణ అనువదించారు చివరి నాటకం ప్రదర్శితమైంది

బెర్నార్డ్‌షా నాటకాలను శ్రీ సోమంచి యజ్ఞన్నశాస్త్రి 'విశ్వంపెళ్లి'గా, శ్రీ కొరపాటి గంగాధరరావు 'విషకుంభాలు', 'సాహసి' 'మర-మనిషి'గా, శ్రీ వేమునగంటి శ్రీరాములు 'మరా-మనిషి'గా తెలుగులోకి తెచ్చారు బెర్నార్డ్‌షా నాటకాలేవీ తెలుగులో ప్రాచుర్యం పొందలేదు

డా॥ మొదలి నాగభూషణ శర్మ, శ్రీ ఎం ఆర్ అప్పారావు గ్రీకు నాటకాలను తెలుగువారికి పరిచయం చేశారు సోఫోక్లిస్ నాటకాన్ని 'రాజా ఈడిపస్' పేరుతో శర్మగారు అనువదించగా 'యాంటిగని' నాటకాన్ని శ్రీ అప్పారావుగారు తెలుగు చేసారు

రష్యన్ నాటకకర్తలను తెలుగు నాటకరంగానికి శ్రీయుతులు శ్రీనివాస చక్రవర్తి, బెల్లంకొండ రామదాసు, శివం, సోమంచి, పరిచయం చేశారు రష్యా రచయితల నాటకాలకు తెలుగులో మంచి స్పందన లభించడం విశేషం

గోగోల్ 'ఇనస్పెక్టర్ జనరల్' నాటకాన్ని సోమంచి యజ్ఞన్నశాస్త్రి 'మహానుభావులు' పేరుతోను, శ్రీ బెల్లంకొండ రామదాసు, శ్రీ రెంటాల గోపాలకృష్ణ 'ఇన్‌స్పెక్టర్ జనరల్' అనే పేరుతోను చేసిన అనువాదాలు రంగస్థలంపై అఖండవిజయాన్ని సాధించాయి అలాగే, ప్రీస్ట్లీ రాసిన 'ఇనస్పెక్టర్ కాల్స్' నాటకానికి కొప్పరపు సుబ్బారావుగారు చేసిన అనువాదం 'ఇనపతెరలు' వందలాది ప్రదర్శనలకు అవకాశం కలిగించింది

యూజినీ ఒనీల్ రాసిన 'బియాండ్ ది హోరైజన్', 'ఎంపరర్ జోన్స్' నాటకాలకు అనువాదాలైనా 'రాగరాగిణి' (శ్రీ గొల్లపూడి మారుతీరావు) 'నరజాతి చరిత్ర సమస్తం' (డా మొదలి నాగభూషణ శర్మ) నాటకాలు మంచి ప్రజాదరణ పొందగలిగాయి

"1960 లో జొన్నలగడ్డ రమాకాంత్, జె బి ప్రీస్ట్లీ నాటకం 'ఐహావ్ బీన్ హియన్ బిఫోర్' ని 'కాలచక్రం' అన్న పేరుతో అనుసరణ చేసారు మనిషి పూర్వజన్మవృత్తాంతం ఇందులో చోటుచేసుకుంది గత జీవితంలో కొన్ని పొరపాట్లు జరిగివుంటే ఆ గతస్మృతులు ఈ జన్మలో ఆ మనిషికి జ్ఞాపకంవుంటే ఆ పొరపాట్లని సరిదిద్దుకోవడం సాధ్యమవుతుందని ప్రవచిస్తుంది ఈ నాటకం జె యల్ నరసింహారావు, 'భయం' లక్ష్మి ఆదిగాగల మహానటుల సమ్మేళనంలో చాట్ల శ్రీరాములు నిర్దేశకత్వంలో 1960 సంవత్సరం తణుకు ఆంధ్రనాటక కళాపరిషత్తులో ప్రదర్శనకు బహుమతినందుకొంది మనిషిలో ఆలోచనలకి పదునుపెట్టిందీ నాటకం"[4] అని పేర్కొన్నారు ఒక వ్యాసంలో చాట్ల శ్రీరాములు గారు

1980 నుంచి తెలుగులో అనువాదాలుకాని అనుసరణలు గాని రావడంలేదు స్వతంత్ర రచనలవైపే మొగ్గు చూపుతున్నారు నాటకకర్తలు చెదురుమదురుగా ఒకటి రెండు వస్తున్నా సామాజికుల దృష్టిని ఆకర్షించగల స్థాయిలో ఉండటం లేదు

భారతీయ భారతీయేతర భాషలనుంచి అనువాదాలు, అనుసరణలు చేసుకోవడం అభిలషణీయం అయినప్పటికీ, ఇతర భాషలనుంచి అనువాదం చేసినంతమాత్రాన అది ఉత్తమ కళాఖండమైపోతుందని భ్రమించడం అమాయకత్వం అలాంటి నాటకాలు కేవలం గ్రంథాలయాలకే పరిమితం అవుతాయి తప్ప రంగస్థలాన్ని స్పృశించలేవు అనువాదం అంటే మక్కికి మక్కీ చేసేది కాదు తెలుగు వాతావరణంతో అల్లుకుపోయినప్పుడే ఆ అనువాదానికి జీవం వస్తుంది

"మనిషిని ఆలోచింపచేసేదీ, ఆహ్లాదపరచేదీ, కలచివేసేదీ, కలవరపరచేదీ, జాగృతం చేసేది, ప్రశాంతచిత్తుడ్ని చేసేది సత్యరూప సందర్శన కలిగించేది నాటకం అవుతున్నది ఆ నాటకం ఏ భాషలోవున్నా మన భాషలోకి అనువదించుకోవడంలో తప్పులేదు అన్ని భాషల్లోంచి ఎన్నో పదాలు, భావాలు గ్రహించి సొంతంచేసుకున్న కారణాన ఇంగ్లీషు భాష సార్వజనీనత బహుళజనాదరణ సాధించుకున్నట్లుగా మన నాటక ప్రయోగంకూడా ముందు ముందు ప్రపంచ నాటకరంగ ప్రయోగ పద్ధతుల్ని తనలో ఇముడ్చుకుంటుందనీ, మనిషి మానసిక ప్రగతికి గట్టి పునాదులు వేస్తుందని"[5] ఆశాభావం వెలిబుచ్చారు సుప్రసిద్ధ నటులు, దర్శకులు, ప్రయోక్తలు అయిన శ్రీ చాట్ల శ్రీరాములు

విదేశీ నాటక ప్రభావంవల్ల తెలుగు నాటకరంగంలో ప్రయోగ పద్ధతులెన్నో కొత్తగా చేరి కళారంగాన్ని సుసంపన్నం చేస్తున్నాయి అయితే తెలుగు వాతావరణానికి, సంస్కృతికి ఇమడని ప్రయోగరీతులు జనాదరణ పొందలేక స్మృతిపథంలోనించి జారిపోతున్నాయి మంచి ఎక్కడున్నా ఆహ్వానించవలసిందే చెడు ఎక్కడున్నా పరిహరించవలసిందే

నాటక ప్రయోగరీతుల్లో వచ్చిన మార్పులను గురించి ఇప్పుడు తెలుసుకోవలసివుంది

## నాటకంలో నూతన ప్రయోగాలు - సిద్ధాంతాలు.

కధావస్తువు ఒక సరికొత్త రూపంలో అభివ్యక్తం చెయ్యడాన్నే శైలి (స్టయిల్) అంటున్నారు పాశ్చాత్య లాక్షణికులు ప్రగతిశీలమైన వస్తువు ప్రదర్శనలో ప్రయుక్తం చేయడాన్ని 'శైలి' అనే పేరుతో పిలుస్తున్నారు

సాహిత్యం కళలపరంగా సాగిన పునరుజ్జీవనం (రినయసెన్స్), పారిశ్రామిక విప్లవం, ప్రపంచ యుద్ధాలవల్ల తారుమారైన పరిస్థితులు, మారిపోయిన సాంఘిక నైతిక విలువలు - వీటివల్ల ప్రపంచంలో వివిధరంగాలలో ఎన్నో మౌలిక మార్పులు వచ్చాయి సాంఘిక పరిస్థితులు అస్తవ్యస్తం కావడంతో ప్రపంచ మేధావుల్లో సంచలనం కలిగింది సామాన్య మానవుణ్ణి సంక్షోభంనుంచి రక్షించాలన్న తపన మొదలైంది బ్రతుకుమీద నిరాశ కలగకుండా ఉన్నదానితో సర్దుకుని ముందుకు సాగేటట్టు ఆత్మబలాన్ని కలిగించాలన్న దృక్పధం ఏర్పడింది వారి అన్వేషణ ఫలితమే నాటక సాహిత్యంలో వివిధరకాలైన నాటకశైలులు (థియేటర్ స్టయిల్స్) ఆవిర్భవించాయి వాటిలో ముఖ్యమైన సిద్ధాంతాలు ఇవి

వాస్తవికతావాదం (రియలిజం), స్వభావవాదం (నేచురలిజం), అభివ్యక్తి లేదా భావవాదం (ఎక్స్‌ప్రెషనిజం), ప్రతీకవాదం (సింబాలిజం), అసంబద్ధవాదం (అబ్సర్డిజం), ఆస్తిత్వవాదం (ఎగ్జిస్టెన్షియలిజం), ఐతిహాసిక నాటకరంగం (ఎపిక్ థియేటర్) మొదలైనవి

కళాసాహిత్యాలు నిత్యనూతనంగా వర్థిల్లడం జీవలక్షణం చేప్పేవిషయం ఎంత గొప్పదైనా, చెప్పే విధానంలో ఆకర్షణ లేకపోతే అది ప్రజలను ఆకట్టుకోలేదు అందుకే కళా సాహిత్యాలు దేశకాల పరిస్థితుల్నిబట్టి ప్రతి తరంలోనూ తమ రూపురేఖలు మార్చుకుంటూ ఉంటాయి శాస్త్రవిజ్ఞానం విస్తరించి మానవుడు గ్రహాంతరాళాల్లోకి చొచ్చుకుపోతున్న ఈ రోజుల్లో ఏ రంగంలోనైన మార్పులు

అనివార్యం కదా!

కళా ప్రపంచంలో ఒక నూతన ప్రయోగం జరిగినపుడల్లా పండిత పామరులకు ఆ ప్రయోగం ఆమోదయోగ్యం అవుతుందని నమ్మకంలేదు సంఘంలో భిన్నాభిప్రాయాలు, అభిరుచులు కలవాళ్ళుంటారు గతంలో నుంచి వర్తమానంలోకి రావాలంటే ఇష్టపడనివారు కొందరు అలాగే వర్తమానం నుంచి భవిష్యత్తులోకి తొంగి చూడటానికి విముఖత చూపేవాళ్లు కొందరు అందువల్లనే ప్రతి నూతన ప్రయోగానికి సర్వజనామోదం లభించడం సాధ్యంకాదు

విదేశాలలో గ్రీకు నాటకంనుంచి అనిబద్ధనాటకం వరకూ ఎన్నో నాటక విధానాలు ప్రచారంలోకి వచ్చాయి కొన్ని కాలగర్భంలో కలసిపోయినా నేటి సిద్ధాంతాల ప్రభావం ప్రపంచ నాటరంగంమీద యిప్పటికీ ఉంది భారతీయులు సంప్రదాయ బద్ధులు మత, ఆచార సాంప్రదాయాల పరిష్వంగంనుంచి ఒక్క అడుగు ముందుకు వేస్తే ఈ సమాజంలో బ్రతకలేము అనే తత్వం మన రక్తనాళాలలో ఇమిడిఉంది ఇది జాతి శీలాన్ని పదిలపరచడంలో కొంత మేలుచేసినా, కళాసాహిత్య రంగాల ప్రగతిని కొన్ని వేళల నిరోధిస్తున్నదని చెప్పవచ్చు

పందొమ్మిదో శతాబ్ది చివరిపాదంలో ప్రపంచనాటకకర్తల దృక్పథంలో గణనీయమైన మార్పులు వచ్చాయి సంఘంలో మౌలికమైన మార్పులు తేవడానికి నాటకం ఒకశక్తిమంతమైన ఆయుధంగా పరిగణించారు సగటు మనిషి సమాజంలో ఎదుర్కొంటున్న సమస్యలమీద దృష్టి సారించారు వారి కృషి ఫలితమే 'ఆధునిక నాటకరంగం' ఆవిర్భావం

ఆధునిక నాటకరంగంలో కీలకపాత్ర వహించిన, వాస్తవికతావాదానికి గురుపీఠం అనదగిన హెన్రిక్ ఇబ్సన్ (1828 -1906) నార్వే దేశస్థుడు ఆకాశమార్గాన విహరించే నాటకరంగాన్ని నేలమీదికి తెచ్చి నడిపించినవారిలో ఇబ్సన్ అగ్రగణ్యుడు

# వాస్తవికతా వాదం

19వ శతాబ్ది మధ్యకాలంలో ఐరోపా ఖండంలో అనేక సాహిత్య ప్రక్రియల్లో వాస్తవికతావాదం (రియలిజం) చోటుచేసుకుంది ఈ వాదం ప్రప్రథమంగా ఫ్రాన్స్‌లో మొదలైంది నెపోలియన్ పతనానంతరం ఐరోపాలో రాజకీయంగా అస్థిర పరిస్థితులు నెలకొన్నాయి ఆర్థిక పరిస్థితులు క్షీణించాయి దీనికి తోడు పారిశ్రామిక విప్లవం ఫలితంగా పల్లెటూళ్లను వదిలి పట్టణాలకు ఎగబడే శ్రామికుల సంఖ్య అధికం కావడంతో పట్టణాల్లో జీవించేవారి బ్రతుకులు దుర్భరమయ్యాయి అలాంటివారికి ఆదర్శవాదం (ఐడియలిజం)తో కూడిన సాహిత్యప్రక్రియలు కళారూపాలు నిష్ఫలమని మేధావులు గ్రహించారు

మనిషి బాగోగులను గురించి పట్టించుకునే 'సామాజికశాస్త్రం' అన్ని శాస్త్రాలలో ప్రశస్తమైనదనీ, కనుక సమాజాన్ని బాగుపరచడానికి సర్వమానవ విజ్ఞానాన్ని కేంద్రీకృతం చెయ్యాలని ఆగస్ట్ కాంప్టే వంటి తాత్వికులు ప్రబోధించారు డార్విన్ జీవపరిణామ సిద్ధాంతం ఈ వాదానికి మరింత బలాన్నిచ్చింది ఊహాజగత్తులో విహరించే భావనాత్మక రచనలకు సమాజానికి దూరమైన కాల్పనిక సాహిత్యానికి కాలం చెల్లిందని నాటకకర్తలు గ్రహించారు నూతనత్వంకోసం అన్వేషించసాగారు వారి అన్వేషణ ఫలితమే వాస్తవికతావాదానికి నాంది పలికింది

ఆనువంశిక లక్షణాలు, పరిసరాల ప్రభావం ప్రతి మనిషి జీవితాన్ని వెంటాడటంచేత అతడి ప్రవర్తనను అవి రెండూ నియంత్రిస్తాయనీ, ఆ విధంగా అతని ప్రవర్తన అతని అదుపులో లేకపోవడానికి ఆనువంశికత, పరిసరాలే కారణభూతాలు కనుక, ఒక వ్యక్తి చేసేపనికి అతడు బాధ్యుడు కాడని వాదిస్తారు వాస్తవికతావాదులు ఒకవేళ అతడు చేసేపనికి అతనిని తప్పుపట్టాల్సివస్తే ఆ నేరం అతనిది కాదని, అలాంటి పరిస్థితులు కల్పించిన సంఘానిదేనని వీరి వాదన ఆ నమ్మకాల మీదనే వాస్తవిక వాదం బయలుదేరింది పంచేంద్రియాల ద్వారా వెల్లడి అయ్యే సత్యాన్ని మాత్రమే ఆవిష్కరింపజేయాలన్నది వాస్తవిక వాదుల ప్రధాన లక్ష్యం సత్యాన్వేషణ ఈ వాదానికిమూలసూత్రం వాస్తవ చిత్రణే దీనికి ప్రాతిపదిక

ఈ సూత్రాన్ని నాటక రచయితలుకూడా స్వీకరించారు వాస్తవాన్ని మాత్రమే రచనద్వారా వ్యక్తీకరించాలనీ, తన చుట్టూఉన్న సమాజాన్ని శాస్త్రజ్ఞుడి దృష్టితో అవలోకించి, సమకాలీన సమాజాన్ని చిత్రించాలని వాస్తవికవాదులు ఆకాంక్షించారు నాటకంలో ఇతివృత్తం, సన్నివేశాలు, పాత్ర చిత్రణ, సంభాషణలు, ఆహార్యం, రంగాలంకరణ సహజంగా ఉండాలని వాస్తవికవాదుల ఆదర్శం రంగస్థలంమీద ప్రదర్శనకు అవసరమైన వస్తువులు మాత్రమే ఉండాలని వాస్తవిక నాటక విధానంలో నియమం ఉంది ఈ పద్ధతిలో అలెగ్జాండర్ డ్యుమాస్, ఎమిలీ అగియల్‌వంటి ఫ్రెంచి రచయితలు ప్రథమ ప్రయత్నాలు చేశారు అనాటి సమాజాన్ని సవాలు చేస్తున్న విడాకులు, వ్యాపారంలో మోసాలు, అక్రమ సంతానం, పతితల దైన్యజీవితం వంటి సమస్యలమీద వాస్తవిక ధోరణిలో నాటకాలను రచించారు కానీ ఆ నాటకాలు వాస్తవికతావాదానికి విశేష ప్రచారం తెచ్చిపెట్టలేకపోయాయి అయితే అవి వాస్తవికతావాదానికి పునాదులు వేశాయని మాత్రం చెప్పవచ్చు

1870 లో ఇబ్సన్ ప్రవేశం ప్రపంచ నాటకరంగంలో ఒక నూతన శకానికి నాంది పలికింది 1877 లో ది పిల్లర్స్ ఆఫ్ సొసైటీ, ఎ డాల్స్‌హౌస్ (1879) ఘోస్ట్స్ (1881) వంటి నాటకాలు ప్రపంచ ఖ్యాతి పొందాయి ముఖ్యంగా ఎ డాల్స్‌హౌస్' (బొమ్మరిల్లు) నాటకం అనాటి సమాజాన్ని కుదిపివేసింది 'భూతాలు నాటకం సమాజంలో కలకలం సృష్టించడం చూసి భయపడి కొన్నాళ్లపాటు ఆ నాటకంపై ఆంక్షలు విధించింది ప్రభుత్వం ఇబ్సన్‌పై వివాదాస్పద నాటకకర్తగా ముద్రపడింది

భర్త తనపట్ల చూపే క్రౌర్యాన్ని, కఠినమైన ఆంక్షలను సహిస్తూ, వ్యక్తిత్వాన్ని చంపుకుని కేవలం ఒక ఆటవస్తువులాగా పడివుండటం ఇష్టంలేక భర్తను ధిక్కరించి స్వేచ్ఛాజీవిగా ఇల్లువిడిచి వెళ్లిపోతుంది నోరా, బొమ్మరిల్లు నాటకంలో అలాగే ఘోస్ట్ నాటకంలో మిసెస్ అల్వింగ్ సంప్రదాయానికి తలవొగ్గి తన యిష్టానికి వ్యతిరేకంగా, భర్త లైంగిక వ్యాధిగ్రస్తుడని తెలిసికూడా అతనితో కాపురం చేస్తుంది తత్ఫలితంగా అతనివల్ల కలిగిన బిడ్డకు పిచ్చిపడుతుంది వ్యక్తి

క్షేమంకంటే ఇతరుల క్షేమం ముఖ్యమనే నైతిక సూత్రానికి కట్టుబడి జీవితాన్ని ధ్వంసం చేసుకొంటుంది ఆల్వింగ్ వైయక్తిక బాధ్యతకూ ఇతరులపట్ల తన బాధ్యతకూ మధ్య ఘర్షణపడి తల్లడిల్లిపోతుంది ఆల్వింగ్ సంప్రదాయానికి తలొగ్గి తన జీవితాన్ని వృథా చేసుకొంటుంది ఈ నాటకం చూసి విమర్శకులు గగ్గోలు పెట్టారు నాటకరంగం బురదగుంటలోకి ఈడ్చబడిందని అవహేళన చేసారు ఇబ్సన్ లెక్కచెయ్యకుండా తన నాటకాలను సమాజ జీవితానికి అతి సన్నిహితంగా చిత్రించి రచనలో, ప్రదర్శనారీతిలో వాస్తవికతకు ప్రాధాన్యమిచ్చి ప్రాచుర్యంలోకి తెచ్చాడు నాటకం కేవలం వినోదం కోసమేకాక నూతన భావోద్దీపనకు, ఆత్మావలోకనానికి సాధనంగా ఉండాలని ఇబ్సన్ ధ్యేయం

ఇబ్సన్ చూపిన మార్గం ఇతర దేశాలకు స్ఫూర్తినిచ్చింది ఇంగ్లాండుకు కూడా వాస్తవికతావాదం ప్రాకింది ఆర్థర్‌వింగ్‌పైనేరో, హెన్రీ ఆర్థర్ జోన్, జార్జి బెర్నార్డ్ షా వంటి నాటకరచయితల్లో వాస్తవికతా వాదం మంచి ప్రాచుర్యం పొందింది అలాగే సోవియట్ రష్యాలోకూడా ఆంటోన్‌చెకోవ్, టాల్‌స్టాయ్, గోర్కీ వాస్తవిక నాటక రచయితలుగా సుప్రసిద్ధులు వారి నాటకాలు నీటికాకి (సీగల్) పవర్ ఆఫ్ డార్క్‌నెస్, సంపంగి తోట (చెర్రీ ఆర్చర్డ్) మాస్కో ఆర్ట్ థియేటర్ ఆధ్వర్యంలో అద్భుతంగా ప్రదర్శింపబడి, వాస్తవికతావాదానికి పట్టంగట్టాయి వీరి నాటకాలకు మెరుగులు పెట్టి ఖ్యాతి ఆర్జించిపెట్టిన ఘనత దర్శకుడు స్టాన్‌స్లావిస్కీకి దక్కుతుంది

తెలుగు నాటకాల విషయానికొస్తే ఇబ్సన్ ప్రభావంతో నాటక రచనకు పూనుకున్న తొలి నాటకకర్తలలో పి వి రాజమన్నార్, గుడిపాటి వెంకటచలం, నార్ల ప్రభృతులు ముఖ్యులు 'తప్పెవరిది?' నాటకంలోను, 'ఏమి మగవాళ్లు', 'నిష్ఫలం' నాటికలలోను, వాస్తవికతావాదం ప్రస్ఫుటమౌతుంది చలం రాసిన నాటకాలు, నాటికలేవీ ప్రదర్శన యోగ్యం కాకపోయినా రచనాపరంగా చూసినపుడు శశాంక, మంగమ్మ వంటి నాటకాలలో ఇబ్సన్ ప్రభావం కన్పిస్తుంది నార్లవారి నాటిక 'ప్రారబ్ధం' లో ఇబ్సన్ ఛాయలు కనిపిస్తాయి

తెలుగు నేలపై వాస్తవిక నాటకాలకు ఒక సమగ్రరూపం ఇచ్చిన నాటకరచయితలలో ఆచార్య ఆత్రేయ అగ్రగణ్యుడు ఆత్రేయ రచించిన

'యన్ జి ఓ ' నాటకం, 'ఎవరు దొంగ?', ఒక్కరూపాయి' నాటికలు వాస్తవికతను ఆవిష్కరించిన దృశ్యకావ్యాలు రాచకొండ వారి 'నిజం' నాటకం, రమణారెడ్డి - వేణు గార్ల 'రాజీవం' నాటిక, సి యస్ రావు రచించిన 'ఊరుమ్మడి బతుకులు' నాటిక - వాస్తవికత నాటికలలో పేర్కొనదగినవి

ఇటీవలి కాలంలోవస్తున్ననాటక సాహిత్యంలో రియలిస్టిక్ డ్రామాస్ వందకు పైగా ఉంటాయంటే ఆశ్చర్యపడనవసరంలేదు

## స్వభావ వాదం

వాస్తవిక వాదానికి కొంచెం అటూయిటూగా స్వభావవాదం (నేచురలిజం) ప్రచారంలోకి వచ్చింది దీని జన్మస్థానం ఫ్రాన్స్ మానవుడు చేసే కృత్యాలకు, అకృత్యాలకు అతని బాధ్యత ఏమీలేదనీ, అతడు అనువంశిక లక్షణాలకు, పరిసరాలకు బానిస అయినందువల్ల అతని చర్యలను తప్పుపట్టడం సమంజసం కాదని చెబుతుంది. స్వభావవాదం (నేచురలిజం) మనిషి ఏదైనా నేరం చేస్తే అది అతని తప్పుకాదనీ అతనికా పరిస్థితులు కల్పించిన సంఘానిదేనంటారు స్వభావవాదులు

1870 ప్రాంతాలలో ఎమిలీజోలా, మొపాసా వంటి రచయితలు స్వభావవాదాన్ని ధ్వనింపజేస్తూ అనేక నవలలు వెలువరించారు వారి రచనలవల్ల ప్రభావితులైన నాటకకర్తలు ఎమిలీజోలా సిద్ధాంతాన్ని ఆసరా చేసుకుని స్వభావవాద ధోరణిలో నాటకాలు రాయడం ప్రారంభించారు సామాజిక సమస్యలను, ముఖ్యంగా మధ్యతరగతి ఎదుర్కొనే సమస్యలను కథావస్తువులుగా తీసుకుని విరివిరిగా నాటకాలు రాశారు తొలుత సాహిత్యోద్యమంలో ఒక భాగంగా మొదలైన స్వభావవాదం నాటకరంగంలో పరిణతిచెందింది వాస్తవవాదులవలె స్వభావవాదుల రచనా ధ్యేయం పంచేంద్రియాలద్వారా బహిర్గతమయ్యే సత్యాన్ని సామాజికుల ఎదుట సాక్షాత్కరింపచేయడమేఅయినా,ఈ రెండు వాదాలలో కొన్ని ముఖ్యతేడాలు లేకపోలేదు వాస్తవిక వాదులు సమకాలీన సమాజంనుంచి నిర్దుష్టమైన సంఘటనలను మాత్రమే ఎంపిక చేసుకొని వాస్తవికతకు రూపకల్పన చేస్తారు

అంటే వారిది సెలక్టివ్ రియలిజం స్వభావవాదులు అలాకాదు నిత్యజీవితంలో జరిగే సంఘటనల వాస్తవాన్ని ఉన్నదున్నట్లు రంగస్థలం మీదికెక్కిస్తారు జీవిత సత్యాలను యధాతధంగా చిత్రించడమంటే యించుమించు ఒక ఛాయాగ్రాహకుడు చేసే పనితో సమానం అన్నమాట అంటే వీరిది ఫోటోగ్రాఫిక్ రియలిజం ఒక డాక్టరు రోగిని పరీక్షించి రుగ్మతను బయటపెట్టి రోగనిర్ధారణ చేసినట్టుగా, నాటకకర్తకూడా సామాజిక సమస్యల్ని శాస్త్రీయ దృక్పథంతో పరిశీలించి, విశ్లేషించి, పరిష్కార మార్గంకోసం అన్వేషించాలని స్వభావవాదుల అభిమతం నాటక ప్రదర్శనలో కూడా రంగస్థలంమీద సహజత్వాన్ని సృష్టించడానికై విస్తృతమైన రంగాలంకరణ చేయడం పరిపాటి ఉదాహరణకు - అరణ్యం, శ్మశానవాటిక, ఫ్యాక్టరీ వంటి దృశ్యాలు చూపవలసివచ్చినపుడు ఆ దృశ్యాలను స్వాభావికంగా చూపడానికి తాపత్రయ పడేవారు స్వభావవాదులు - ప్రేక్షకులు ఏదో రంగాలంకరణ చూస్తున్నామని కాకుండా జీవితాన్ని చూస్తున్నట్లు అనిపించాలని తీవ్రప్రయత్నాలు చేసేవారు (ఈ అతి వాస్తవిక ధోరణికి విసుగెత్తిపోయిన నాటకకర్తలు స్వభావ నాటకాలకు ప్రత్యామ్నాయంగా ప్రతీకవాదాన్ని చేపట్టారు అది వేరొకచోట వివరించబడింది)

హెన్రీ బెక్ రాసిన 'రాబందులు' నాటకం స్వభావ నాటకాలలో బహుళ జనాదరణ పొందింది

స్వభావవాదానికి పుట్టినిల్లు ఫ్రాన్స్ దేశమే అయినా, దానికి పరిపుష్టిని చేకూర్చినవారు జర్మనీ నాటకకర్తలు హెర్మన్ సుడర్‌మన్, గెర్హార్ట్ హాప్ట్‌మన్ వంటి నాటకకర్తల చేతుల్లో స్వభావ నాటకాలు పరాకాష్ఠనందుకున్నాయి సాంప్రదాయికంగా వస్తున్న రంగస్థల పద్ధతులకూ, అలంకారప్రాయమైన భాషాభేషజాలకు, ఆకాశభాషణాదులకు, స్వగతాలకు స్వస్తి పలికారు ఈ రచయితలు వీరి రచనలకు స్ఫూర్తి మానవత్వం మానవుడి కష్టాలు, కన్నీళ్లు వీరి కధావస్తువులు సామాన్య మానవుని బాధలు గాధలతోనే వీరికి ప్రమేయం, సంఘాన్ని కర్కశంగా, విమర్శించడానికి ఏమాత్రం వెనుకాడలేదు సుడర్‌మన్ రచించిన 'గౌరవం', 'గృహం' మొదలైన నాటకాలు, హాప్ట్‌మన్ రచించిన

'సూర్యోదయ పూర్వం', 'రాజీ', 'ఒంటరితనం' 'నేతగాళ్లు', 'పనివాళ్లు' వంటి నాటకాలు స్వభావనాటక శ్రేణిలో కళాఖండాలుగా ప్రపంచ ఖ్యాతిపొందాయి హాప్ట్‌మన్ రచనల్లో కథానాయకుడు, నాయిక - వాళ్ళు చేసిన పనులవల్ల కష్టాలు పడరు కష్టాలను అనుభవంచే ప్రవృత్తివల్లనే వారి జీవితాలు విషాదాంతాలు అవుతున్నాయంటారు హాప్ట్‌మన్ ఆనువంశిక లక్షణాలు, పరిసరాల ప్రభావం వారిని అనవరతం వెంటాడుతూ ఉండటంవల్ల కష్టాలు అనుభవించడం అనివార్యం అవుతున్నదని హాప్టమన్ వివరించారు 'వీవర్స్' నాటకంలో కథానాయకుడు ఒక వ్యక్తికాదు శ్రామికుల సమష్టిరూపంగా చిత్రించి సామాన్య మానవుడికి పెద్దపీట వేశారు హాప్ట్‌మన్ ఇది నాటకరచనలో సరికొత్త ప్రయోగం తరువాతి కాలంలో ఈ టెక్నిక్‌ను మరింత ఎక్కువగా వాడుకున్నారు అభివ్యక్తివాదులు (ఎక్స్‌ప్రెషనిస్ట్లు) ఆంద్రీ ఆంటోనీ ఈ తరహా నాటకాలను 300 పైగా ప్రదర్శించాడు క్రమంగా స్వభావవాదం సన్నగిల్లిపోయి పందొమ్మిదో శతాబ్దాంతానికి గట్టున పడిపోయింది ఈ వాదానికి ప్రతిగా వెల్లివిరిసిన ప్రతీకవాదం (సింబాలిజం) లేదా నవ్యకాల్పనికోద్యమంధాటికి తట్టుకోలేక వెనకబడిపోయింది

తెలుగు నాటకరంగంలో స్వభావవాద లక్షణాలను పుణికిపుచ్చుకున్న నాటకాలు అంతగా రాలేదు కాని లక్షణాలను కొంతవరకైనా అభివ్యక్తం చేసిన కొన్ని నాటకాలు లేకపోలేదు

కణ్వశ్రీ రచించిన 'ఇదా ప్రపంచం', కొడాలి గోపాలరావుగారి 'రైతుబిడ్డ', బుచ్చిబాబుగారి 'ఆత్మవంచన', గొల్లపూడి వారి 'రాగరాగిణి', హరనాధరావు గారి 'క్షీరసాగర మధనం', గణేశపాత్రో 'తరంగాలు' వంటి నాటకాలలోను, ఆత్రేయగారి 'అంత్యార్పణ', శివరామ శాస్త్రీగారి 'సుల్తానీ' వంటి నాటికలలోను స్వభావవాదఛాయలు కనిపిస్తాయి వాస్తవిక నాటకాలకు, స్వభావ నాటకాలకు మధ్య ఉన్న సరిహద్దురేఖ అస్పష్టమైంది కనుక నాటకాలను వర్గీకరించటంలో అన్వయకారిన్యం గోచరిస్తుంది

# ప్రతీక వాదం

ప్రతీక వాదానికి (సింబాలిజమ్) మనస్సు కేంద్రం వాస్తవిక నాటకాలు, పంచేంద్రియాలద్వారా మానవుడి బాహ్య ప్రకృతిని, ప్రవర్తనను వ్యక్తం చేసేవికాగా, ప్రతీక నాటకాలు మానవుడి ఆంతర ఉద్వేగాల సంఘర్షణను ఆవిష్కరిస్తాయి నిజాన్ని వెల్లడించడం వీటి ప్రధాన లక్ష్యం అయితే మార్గం వెరు ప్రతీకవాదులకు మానవుడి బాహ్యాపరిసరాలతో పనిలేదు అతని ఆంతరంగిక ఘోషను, స్పందనను చిత్రించడమే ప్రతీకనాటకం చేసేపని స్వభావ నాటకాలలో సహజమైన సంభాషణలుంటే, ప్రతీక నాటకాల్లో పాత్రల సంభాషణ కవితామయంగా వుంటుంది పంచేంద్రియాలకు సాధ్యంకాని అద్భుత సన్నివేశాలను సాధ్యాసాధ్యాలతో నిమిత్తంలేకుండా పొందుపరచడం కూడా జరుగుతుంది సామాజిక వాస్తవికతతో సంబంధం లేకుండా వ్యక్తి ఆంతరజీవితంమీద, అతని ఉద్రేకాలమీద మొగ్గు చూపిస్తాయి ప్రతీక నాటకాలు ఇటువంటి నాటకాలకు మాటర్‌లింక్ మూలపురుషుడు ఈ తరహా నాటకాలు అన్ని దేశాలలో వెలుగు చూసినా ఏ దేశంలోనూ కళాఖండాలని చెప్పదగిన స్థాయిలో ప్రతీక నాటకాలు రాలేదు నిజానికి ప్రతీకవాదంమీద సిద్ధాంత రాద్ధాంతాలు చెలరేగినంత విస్తృతంగా ఈ నాటకాలు ప్రజాదరణ పొందలేదు ప్రతీకవాదం సిద్ధాంతానికే పరిమితం అయింది కొన్ని ప్రతీక నాటకాలు వచ్చాయి అవన్నీ తాటాకు మంటల్లా చల్లారిపోయాయి - సిద్ధాంతాలను మాత్రం మిగిల్చి

" తెలుగులోకూడా ప్రతీక నాటకాలు వచ్చాయి కానీ, పాశ్చాత్య దేశాలలో నిర్దేశించిన నాటకలక్షణాలను మన రచయితలుపూర్తిగాస్వీకరించలేదు కథను, సన్నివేశాలను, పాత్రల మతస్తత్వాన్ని కొన్ని ప్రతీకలద్వారా వెల్లడించాలన్న నియమం మాత్రం మనవారు పెట్టుకున్నారు అయితే పాశ్చాత్య దేశాలలో ప్రతీక నాటకాలు ఎన్‌లైటెన్డ్ ఆడియన్స్ మధ్య రాణించినట్లే తెలుగు నాటకాలు కూడా కల్చర్డ్ ఆడియన్స్‌కు మాత్రమే నచ్చినవి సామాన్య ప్రేక్షకులమీద ప్రతీక నాటకాల ప్రభావం లేదనే చెప్పాలి" [6]

తెలుగులో వచ్చిన మొదటి ప్రతీక నాటకం ఆత్రేయగారి 'విశ్వశాంతి', 'భయం'రెండవ నాటకం పందొమ్మిదో శతాబ్దిలో శ్రీ కందుకూరి వీరేశలింగంగారు రాసిన 'తిర్యగ్విద్వన్మహాసభ' అనే ప్రహసనంలో ప్రతీకవాద లక్షణాలున్నాయి ఇటీవలి కాలంలో యన్ ఆర్ నందిగారి 'మరోమొహంజోదారో' ఇసుకపల్లి మోహనరావుగారి 'దిగేమ్' ప్రతీక నాటకాలుగా వర్గీకరింపదగినవి భయం, మొహెంజోదారోనాటకాలకు ప్రజాదరణ లభించింది అలాగే కొన్ని ప్రతీకాత్మక నాటికలు కూడా వెలువడినాయి శ్రీ యండమూరి 'కుక్క', శ్రీ గొల్లపూడి 'కళ్ళు' , శ్రీ దివాకరబాబు 'కుందేటికొమ్ము' నాటికలు రంగస్థలంమీద ప్రజాదరణ పొందడానికి రూపం (ఫామ్) ఒక్కటే కారణంకాదు వస్తురీత్యా వైశిష్ట్యం (కంటెంట్) గల రచనలు కావడంకూడా ప్రధానంగా పేర్కొనదగిన అంశం

## అభివ్యక్తి వాదం

ఫ్రాన్స్‌లో ప్రఖ్యాత చిత్రకారుడైన వాంగో చిత్రకళలో రూపొందించిన ఒక ప్రత్యేక శైలిని ఎక్స్‌ప్రెషనిజం అని పిలిచేవారు అది క్రమంగా అన్ని కళలకూ, సాహిత్యప్రక్రియలకూ అన్వయించబడి విశేష ప్రచారం పొందింది

బాహ్యరూపాన్ని చిత్రించడంకాక దృఢమైన మనోభావాలను కూడా వ్యక్తీకరింపచేసే విధానమే ఎక్స్‌ప్రెషనిజం - అభివ్యక్తి లేదా భావవాదం జర్మనీలో 1910 ప్రాంతాలలో సాహిత్యరంగంలో అభివ్యక్తివాదం మొదటిసారిగా ప్రవేశించింది క్రమంగా యిది నాటకరంగాన్నికూడా ఆకర్షించింది స్వభావవాదానికి వ్యతిరేకమైన నాటక శైలి ఇది బాహ్య జగత్తులో మానవుడి ప్రవర్తనను చిత్రించడం వరకే వాస్తవవాదుల, స్వభావవాదుల కృషి పరిమితంకాగా, అభివ్యక్తివాదులు మానవునిలో చెలరేగే అంతర్గత భావాలను, ఉద్వేగాలను సంఘర్షణను అభివ్యక్తం చేస్తారు మానవుడు పరిసరాల ప్రభావానికి లొంగిపోయే నిస్సహాయుడు కాడనీ, పరిస్థితుల్ని తన అదుపులోకి తీసికొని సంఘాన్ని శాసించగల శక్తి సంపన్నుడని అభివ్యక్తివాదుల దృఢ విశ్వాసం ఆత్మావలోకనానికి దారి చూపించి, మానవుడిని నైతిక పతనంనుంచి రక్షించాలన్నదే అభివ్యక్తివాదుల ధ్యేయంగా ఉండేది కాని క్రమక్రమంగా యుద్ధాన్నీ,

రాజకీయాల దోపిడీని ఎదిరించడానికి ప్రజలను సమాయత్తం చేసే ప్రబలశక్తిగా కూడా పరివర్తన చెందింది

విజ్ఞానశాస్త్రం సృష్టించిన యాంత్రిక ప్రపంచంలో దోపిడికి గురిఅవుతున్న మనిషి, ఆత్మబలాన్ని కొల్పోతున్నాడనీ అతనిలో ఆశావాదం పాదుకొల్పాలని కూడా అభివ్యక్తివాదుల లక్ష్యం సాంప్రదాయకంగా వస్తున్న విలువలస్థానే కొత్త విలువలను ప్రతిష్ఠించి మానవుడి మనోనేత్రాలకు ఒక సుందర స్వప్నలోకాన్ని చూపించాలన్నదే అభివ్యక్తి నాటక శైలిలో ఇమిడిఉన్న పరమార్థం

అభివ్యక్తి నాటక విధానంలో వస్తువుకంటే ప్రదర్శన రీతిలో విలక్షణత గోచరిస్తుంది నాటక ప్రదర్శనలో రంగాలంకరణలో కృత్రిమత్వం కనబడుతుంది అసాధారణమైన రంగుల వాడకం, యాంత్రిక నటన, టెలిగ్రాఫిక్ ఫక్కీలో వ్యాకరణబద్ధం కాని పొడిపొడి మాటలు - మొదలైనవి అభివ్యక్తి నాటక విధానంలోని ప్రధాన లక్షణాలు పురాణగాధలు బైబిల్ కధలు కొత్తమూసలో కధావస్తువులు కావడం కద్దు పాత్రలకు వ్యక్తిగతమైన పేర్లుండవు మొదటిశ్రోత, రెండవశ్రోత గుమాస్తా, ఫ్యాక్టరీ యజమాని, పోలీసు, బడిపంతులు, కవి - ఇలా ఉంటాయి పేర్లు

శ్రీ పి యస్ రామారావు 'మేకర్స్ ఆఫ్ మోడర్న్ డ్రామా' అనే పుస్తకంలో ఎక్స్‌ప్రెషనిస్ట్ లక్షణాలను ఈవిధంగా క్రోడీకరించారు

1 వాస్తవవాదానికి వ్యతిరేకంగా ప్రతిచర్యగా పుట్టింది

2 భావప్రకటనే ముఖ్యం

3 వస్తువులు మరియు ఆకారాలు దిగజార్చబడి, ఉత్ప్రేక్షించబడి ప్రధానపాత్రయొక్క ప్రతిచర్యను తనచుట్టూ ఉన్న ప్రపంచానికి ప్రకటించడానికి ఉపయోగపడుతుంది

4 ధ్వనిద్వారా అంతర్గతంగా వదలిపెట్టబడిందీ, నిజంగా ప్రదర్శింపబడేదే ముఖ్యం

5 స్థలం ఉద్దేశపూర్వకంగా అసహజంగాచిత్రించబడుతుంది

6 రంగస్థల అలంకరణ ప్రధాన పాత్రయొక్క జీవితపు ధోరణిని ప్రతిబింబించేవిధంగా ఉంటుంది

7 గోడలు మరియు విడదీసిన కప్పులు మరియు దిగజార్చిన వస్తువుల ఆకారాలు అస్పష్టభావాలను ప్రకటిస్తాయి

8 పాత్రలు గుర్తించడానికి వీలులేనంతగా ఉంటాయి

9 ప్రేక్షకులు ప్రదర్శనలో పాలుపంచుకొంటారు రంగస్థలం ధ్వనివ్యంగ్య ప్రధానం

10 వత్తిడి తప్పనిసరిగా కదలిక మరియూ భావోద్వేగపు స్థితిపై ఉంటుంది

11 దిగజారిన ప్రపంచం ప్రధాన పాత్రద్వారా చూడబడి చిత్రించబడుతుంది

12 ముసుగులు వాడబడేవి

13 పాత్రలకు పేర్లు ఉండవు కేవలం సంఖ్యలు, లేదా ఆ పాత్ర ప్రవృత్తిని సూచిస్తూ ఉండేవి అస్తిత్వం లేకుండా ధ్వనింపచేయడం వారి లక్ష్యం

14 నాటకాలు ఆధునిక సాంఘిక సమస్యలతో నిండి ఉంటాయి

15 స్వభావంతో గంభీరంగా ఉంటాయి

16 వాస్తవిక ప్రవృత్తికి అత్యధిక ప్రాధాన్యతఇవ్వబడింది అనారోగ్యపు మనస్సు మరియూ మెదడు లోపలి పొరలు చిత్రించబడతాయి

17 మాటలు ప్రకృతి సిద్ధంగా ఉండవు సంభాషణలు అసహజంగా అవాస్తవికపు ముద్రను సృష్టించడానికి ఉపయోగపడేవి

18 అంతర్మథనాన్ని ప్రకటించడానికి స్వగతాన్ని వాడే ప్రయత్నం చేశారు"[7]

అభివ్యక్తి నాటకాలు విరివిగా జర్మనీలో ప్రదర్శితమయ్యాయి ఐరోపాఖండంలో అన్ని దేశాలలోనూ అభివ్యక్తి నాటకాలు ప్రదర్శింపబడినప్పటికీ పది పన్నెండేళ్లకంటే

ఆ నాటకాలు ఎక్కువకాలం నిలదొక్కుకోలేకపోయాయి

అభివ్యక్తివాదులలో జార్జికైజర్, ఎర్నెస్ట్ టాలర్, యూజినీఓనీల్ ఖండాంతర ఖ్యాతిని ఆర్జించిన నాటకకర్తలు

1925 నాటికి ఈ నాటక విధానం ఆశావాదం నుంచి నిరాశావాదానికి దిగింది అదే కాలంలో ప్రజాదరణ పొందుతున్న బ్రెఖ్ట్ 'ఎపిక్ థియేటర్' తో అభివ్యక్తి నాటకరంగం మరుగున పడిపోయింది

అభివ్యక్తి నాటకవిధాన ప్రభావం తెలుగు రచయితలమీద అంతగా లేదు ఇద్దరు ముగ్గురు రచయితలు కొంత ప్రయత్నం చేశారు డా॥ మొదలి నాగభూషణ శర్మగారు రచించిన 'నరజాతి చరిత్ర' అనే నాటకం కె చిరంజీవిగారి 'నీలి దీపాలు' , శశిమోహన్‌గారి 'ఆర్' నాటిక అభివ్యక్తి నాటక లక్షణాలను సంతరించుకున్న దృశ్య రూపకాలే

## ఐతిహాసిక నాటకరంగం

అభివ్యక్తివాదం తగ్గుముఖం పడుతున్న దశలో ఎపిక్ థియేటర్ శక్తిమంతంగా వెలుగులోకి వచ్చింది 1927 - 28 ప్రాంతాలలో ఎర్విన్ పైకేటర్ ఎపిక్ నాటకరంగానికి రూపురేఖలు దిద్దినవారిలో ప్రథములు పాశ్చాత్య దేశాలలో అనేక నాటక విధానాలలో ఎపిక్ నాటకవిధానం విలక్షణమైంది జర్మనీ దేశస్థుడైన బెర్టోల్ట్ బ్రెఖ్ట్ (1898 - 1956) ఎపిక్ థియేటర్‌ను ప్రచారంలోకి తెచ్చాడు చాలా నాటకాలకు దర్శకత్వం వహించాడు. తొలుత ఆదర్శవాదానికి కట్టుబడి అనేక నాటకాలు వెలువరించాడు బూర్జువావ్యవస్థలో ఉన్న దౌష్ట్యాన్ని, ధనిక స్వామ్యంలో ఉన్న కాఠిన్యాన్ని తన నాటకాలలో దుయ్యబట్టాడు కాలక్రమేణ తన లక్ష్యసాధనకు అది మార్గం కాదని, కార్మిక వర్గాల్లోనూ, కర్షకుల్లోనూ చైతన్యస్ఫూర్తి కలిగించాలనీ, సమస్యను అర్థంచేసుకొని పరిష్కారం కోసం కార్యోన్ముఖులయ్యేటట్టు వారిలో జిజ్ఞాస రేకెత్తించాలని సంకల్పించాడు బ్రెఖ్ట్ ఆ సంకల్పానికి కార్యరూపమే 'ఎపిక్ నాటకరంగం'

నాటకంద్వారా రచయిత చెప్పదలచుకున్న సందేశాన్ని సన్నివేశాలతో, పాత్రల సంభాషణతో అందివ్వడం అభిలషణీయం కాదని, నాటకాన్ని చూసే సామాజికులు నాటకంలో జరిగే సన్నివేశాలను కథా గమనాన్ని, సంభాషణలను వితర్కించుకుని, ఆ సమస్యలకు పరిష్కారం తామే అన్వేషించేటట్టు నాటక ప్రదర్శన ప్రేక్షకులను సమాయత్తం చేయాలంటాడు బ్రెష్ట్ ప్రేక్షకుడు యథాలాపంగా పాసివ్ స్పెక్టేటర్‌లాగ కాకుండా నాటకాన్ని విమర్శనాత్మకంగా పరిశీలించాలని బ్రెష్ట్ ఉద్దేశం

ఒక నాటకాన్ని తాదాత్మ్యంతో తిలకించే ప్రేక్షకుడికి ఆలోచించడానికి అవకాశం ఉండదనీ, అందువల్ల రచయిత నడిపించిన బాటలోనే తన ఆలోచనను నిమగ్నంచేయడం జరుగుతుందనీ, ఇలా జరగడంవల్ల ప్రేక్షకుడికి స్వతంత్రంగా ఆలోచించి నిర్ణయంతీసుకునే ఆస్కారం లేకుండా పోతున్నదని బ్రెష్ట్ వాదం ఆ లోపాన్ని సవరించడానికై బ్రెష్ట్ ఈ క్రింది మార్గాలు ప్రతిపాదించాడు

ఎలైనేషన్ ఆర్ 'వి' ఎఫెక్ట్ 'తాదాత్మ్య విచ్ఛేదనం' ద్వారా ప్రేక్షకుల మస్తిష్కంలో ఆలోచన ప్రేరేపింప చెయ్యాలనేదే ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతాలలో ప్రధానమైంది రసాస్వాదన చేస్తున్న సామాజికుల తాదాత్మ్యాన్ని భగ్నం చెయ్యాలి భ్రాంతి నుండి వేరుపరచాలి అంటే తాత్కాలికంగా అడ్డుతగలాలి. పాటల ద్వారాను, ప్రయోక్త చేసే వ్యాఖ్యానాలద్వారాను ఇది సాధ్యమౌతుంది ఒకసారి తాదాత్మ్యం నుంచి విడివడిన ప్రేక్షకుడు తప్పనిసరిగా అంతవరకు జరిగిన సన్నివేశాలను గురించి ఆలోచించడం మొదలుపెడతాడు నిత్యజీవితంలో జరిగే సంఘటనలతో వాటిని పోల్చుకుని బేరీజువేసుకుంటాడు మళ్లీ నాటకం ప్రారంభమయ్యేసరికి ప్రదర్శన లక్ష్యంవైపు దృష్టి సారించి ప్రదర్శనతోపాటు ఆలోచిస్తూ ఉంటాడు ఇలా ప్రేక్షకుడిచేత ఆలోచింపచేయడమే ఎపిక్ థియేటర్‌లో ఉన్న అంతరార్థం , ప్రధానాంశమూను

ఎపిక్ నాటక విధానంలో సన్నివేశాలు విస్తారంగా ఉండటం ఒక ముఖ్య లక్షణం సన్నివేశాలు దేనికవి స్వయంసంపూర్ణంగా ఉంటాయి అందువల్ల ఒక సన్నివేశానికి మరొక సన్నివేశానికి సంబంధం లేకపోవడమూ కద్దు ఐతే అన్ని

సన్నివేశాలను కలిపే ఒక మూల సూత్రం విధిగా ఉంటుంది అదే సందేశం బ్రెష్ట్ తన ఆశయ సాధనకు (లేదా ప్రచారం నిమిత్తం ) వాహికలుగా వాడుకోవడం చేత ఎపిక్ నాటకాలన్నీ ప్రబోధాత్మకాలే ఎపిక్ నాటక విధానంలో చారిత్రీకరణ (హిస్టారిఫికేషన్) కూడా ఒక అంతర్భాగం చరిత్రలో జరిగిపోయిన ఘట్టాలను వర్తమానంతో అనుసంధానంచేసి ప్రదర్శించడంవల్ల సమకాలీన సామాజిక సమస్యలను వాటితో పోల్చుకోవడానికి వీలు కలిగిస్తుంది ఎపిక్ నాటకాలు సౌందర్య విలసితాలు కావు బాహ్యాడంబరానికి వ్యతిరేకం ఉద్రేకాల్నీ, ఉద్వేగాల్నీ ప్రకోపింపచేయడం ఈ నాటక విధానం కాదు మేధకు పదునుపెట్టి ప్రకాశింపచేయడమే ఎపిక్ నాటక విధానంలో ఉన్న ప్రత్యేకత

బ్రెష్ట్ దృష్టిలో తాదాత్మ్యానికి తావేలేదు పైపెచ్చు ప్రేక్షకునికి తాను నాటకం చూస్తున్నాననే విషయం అడుగడుగునా గుర్తు చేయాలంటాడు బ్రెష్ట్ (యాంటీ ఎల్యూజనిస్టిక్ మెథడ్స్) అలా భ్రమనించి ప్రేక్షకుణ్ణి వేరు పరచినప్పుడే అతను ఆలోచన తత్పరుడౌతాడని బ్రెష్ట్ విశ్వాసం

డా॥ పివి రమణగారు బెష్ట్ సిద్ధాంత లక్షణాలను గురించి ఈ విధంగా వివరించారు " సాధారణ సంప్రదాయ నాటకానికి పూర్తి వైవిధ్యంలో బ్రెష్ట్ ఎపిక్ థియేటర్ ఉంటుంది సంప్రదాయనాటకంవాస్తవ జీవితాన్ని ప్రతిబింబిస్తుంది పాత్రల అభినయంమాటున ఒదిగిన అనుభూతుల్ని తమవే అన్నంత భ్రాంతిలో ఉండిపోతారు ప్రేక్షకులు హృదయ స్పందనం, రసోద్వేగం, ఆనందానుభూతి ఇవన్నీ పాత్రలు పుష్కలంగా అందిస్తాయి ప్రేక్షకులకు. ఎపిక్ థియేటర్ ఇట్లాగాక నటుణ్ణీ, ప్రేక్షకుణ్ణీ దూరంగా ఉంచుతుంది సామాజిక సమస్యలు, వైరుధ్యాలు, సంఘర్షణలు అన్నింటినీ నాటకం ప్రతిబింబిస్తుంది ఒక విశ్లేషణాత్మక ప్రమోదమార్గంలో ప్రేక్షకులకు వీటనన్నింటినీ అవగాహన చేయిస్తుంది సమాజగర్భపు లోతుల్ని ప్రేక్షకుల కందిస్తుంది కానీ ఆలోతుల్లోపడి కొట్టుకుపోయేట్లుగా ప్రేక్షకుణ్ణి తాదాత్మ్యం కానీయదు భావోద్రేకాలకు, తీవ్ర స్పందనలకు గురికానీయకుండానే సాంఘిక చైతన్యాన్ని ప్రేక్షకునిలో

పెంపొందిస్తుంది జీవితాన్ని అధ్యయనం చేయించే దిశకు బ్రతుకు వైవిధ్యాలకు కారణాలను అన్వేషించే దిశకు ప్రేక్షకుల్ని ఈ ఎపిక్ నాటకం తీసుకుపోతుంది 'మరోమొహెంజదారో' నాటక ప్రదర్శన ఈ ఎపిక్ థియేటర్ పోకడకు చక్కని సంకేతం తరతరాల మౌఢ్యం, స్వార్థపీడితవర్గం, మానవతా స్పర్శలేని అవకాశవాదం ఇవ్వన్నీ కుప్పబోసి ఆ నాటకంలో ఉన్నా ప్రదర్శన ఈ తాదాత్మ్య విచ్ఛిత్తి ప్రయోగంవల్లే ఆసక్తిదాయకంగా సాగిపోతుంది"[8]

అయితే ఈ ఎపిక్ థియేటర్ భారతదేశానికి కొత్తకాదనీ, అది మన ప్రాచీన నాటకరంగంలో అనాదిగా వర్ధిల్లుతూవున్న ప్రయోగమేనని వివరిస్తున్నారు శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి

"ఎపిక్ నాటక విధానంలోని టెక్నిక్ ప్రాచ్య దేశాలనుంచి స్వీకరించిందే 1930 ప్రాంతాలలో ఇండోనేషియా, తాయిలాండ్, కాంబోడియా, లావోస్, బర్మా దేశాలలో నృత్యరూపకాల్లోవున్న ఈ టెక్నిక్ తన్నెంతగానో ప్రభావితుణ్ని చేసిందని అంటోనియన్ ఆర్టాండ్ ఒక గ్రంథంలో వివరించారు ప్రాచ్య దేశాలలో ఒకటైన భారతదేశానికి ఎపిక్ నాటకం కొత్తకాదు. ఎపిక్ నాటకం అనే పేరుతో పిలవకపోయినా, ఆ లక్షణాలలో చాలాభాగం మన ప్రాచీన నాటకరంగంలో ఉన్నవే సంస్కృత నాటకాలలో బ్రెఫ్ట్ చెప్పిన వ్యాఖ్యానరీతి (నెరేటీవ్ స్టయిల్) సూత్రధారి ద్వారా సాధించారు మన పూర్వులు ప్రాచీన కాలంనుండి జానపదకళారూపంగా ఉంటూ వచ్చిన తోలుబొమ్మలాటలో బంగారక్క జుట్టుపోలిగాడు కావ్యార్థప్రతిపాదకులేకాక సూత్రధారుడిలా తత్వ బోధకులు కూడా! ఈ పాత్రలుకొంతవరకు ఎలియనేషన్ ఎఫెక్ట్ సాధించడానికి ఉద్దేశించినవే"[9]

ఆస్కార్‌లీబ్రౌన్‌స్టెయిన్ మరియు డార్లిన్ ఎం డెంబర్ట్ అనే రచయితలు సాధారణ నాటకానికి ఎపిక్ నాటకానికి వ్యత్యాసాలను ఈ క్రింది విధంగా పేర్కొన్నారు

| సాధారణ నాటకం | ఎపిక్ నాటకం |
|---|---|
| 1 రంగస్థలం ఒక సంఘటనను స్థాపింపజేస్తుంది | 1 రంగస్థలం చూపెడుతుంది |
| 2 ప్రేక్షకులను కార్యోన్ముఖులను చేస్తుంది | 2 ప్రేక్షకుణ్ణి ఒక పరిశోధకుడిగా మాత్రం ఉంచుతుంది |
| 3 అనుభూతికి సహకరిస్తుంది | 3 నిర్ణయాలు చేయడానికి పత్తిడి చేస్తుంది |
| 4 అనుభవాలను వ్యక్తంచేస్తుంది | 4 అంతర్ దృష్టిని వ్యక్తం చేస్తుంది |
| 5 ప్రేక్షకుడు ఇక సంఘటనలోకి నెట్టబడతాడు | 5 ప్రేక్షకుడు సంఘర్షణ పడతాడు |
| 6 సూచన వాడబడుతుంది | 6 వాదనలు వాడబడతాయి |
| 7 సంచలనాలు నిక్షిప్తం చేయబడతాయి | 7 గ్రహణ శక్తుల్ని ఒక స్థాయిలో ఉంచుతారు |
| 8 ఒక పాత్రను గుణాత్మకంగా వర్ణిస్తారు | 8 ఒక పాత్ర పరిశోధనకు గురి అవుతుంది |
| 9 మనిషి మారడు | 9 మనిషి మారతాడు, మరియు మార్పులు చేస్తాడు |
| 10 కదలికలు ముఖ్యం | 10 లక్ష్యాలు ముఖ్యం |
| 11 సంఘటనలు సరాసరి వరుసలో కదులుతాయి | 11 వంకరటింకరగా అసమంజసంగా ఉంటాయి |
| 12 ప్రపంచం ఉన్నది ఉన్నట్లుగా ఉంటుంది | 12 ప్రపంచం ఎట్లా మారుతుందో తెలియజేయబడుతుంది |

తెలుగులో ఎపిక్ నాటకశైలిలో నాటకాలు-రాకపోయినా ఇటీవలి కాలంలో ఎలియనేషన్ ఎఫెక్ట్‌ను అక్కడక్కడా ఉపయోగించడం జరుగుతుంది డి ప్రభాకర్‌గారి 'లావొక్కింతయులేదు' అనే నాటకం శ్రీ యండమూరి 'ముష్టియుద్ధం' నాటిక ఇందుకు ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు బ్రెఖ్ట్ ఎపిక్ నాటక ప్రయోగ శిల్పం ప్రపంచ నాటక రంగంమీద చెరగని ముద్రవేసింది

## అస్తిత్వవాదం

రెండు ప్రపంచ యుద్ధాల నడిమికాలంలో పాశ్చాత్య దేశాలలో ప్రజాజీవనం అతలాకుతలమైంది ఆర్థిక పరిస్థితులు అధ్వాన్నమయ్యాయి కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నమైంది నైతిక విలువలు నేలమట్టమయ్యాయి మనిషికి స్వార్థమొక్కటే చుక్కాని అయింది మధ్యతరగతి సమాజం, బడుగువర్గాలు నిరాశాకూపంలోపడి తల్లడిల్లిపోతున్నాయి

అలాంటి పరిస్థితుల్లో ఆదర్శవాదాలు, ఆధ్యాత్మిక వాదాలు ప్రవాహంలోపడి

కొట్టుకుపోతున్న మనిషిని సురక్షితంగా గట్టుకుచేర్చలేవనే నమ్మకం బలపడుతోంది అలాంటి తరుణంలో జీన్‌పాల్ సాత్రే వంటి మేధావులు ప్రజలకు బ్రతుకుమీద ఆత్మవిశ్వాసం కలిగించడానికి ఒక నూతన జీవన విధానాన్ని ప్రబోధించారు సాత్రే ప్రవచించిన జీవిత తత్త్వమే అస్తిత్వవాదం (ఎగ్జిస్టెన్షియలిజం) సాత్రే రచించిన 'నొఎగ్జిట్' అస్తిత్వవాదాన్ని అభివ్యక్తంచేసే ప్రసిద్ధ నాటకం

అస్తిత్వవాదులు దేవుని ఉనికిని త్రోసిరాజన్నారు ఈ లోకంలోకి వచ్చిపడిన మానవుడు మనుగడ సాగించాలి తన బాగోగులకు సుఖదుఃఖాలకు తానే బాధ్యుడు కనుక తన జీవన విధానాన్ని తానే రూపొందించుకొని బ్రతకాలి ఎవరో నిర్ణయించిన నీతి సూత్రాలను, ప్రవర్తనా నియమావళిని, సంప్రదాయాలను పట్టుకు వేలాడక ఎవరికి వారు స్వేచ్ఛగా సొంత అభిప్రాయాలను, విలువలను నిర్ణయించుకుని తమ జీవన విధానం ఏర్పరచుకోవాలనీ, అదే ఆత్మబలాన్ని యిస్తుందనీ జీన్‌పాల్ సాత్రే సిద్ధాంతం ఈ సిద్ధాంతాలను నాటక రూపంలో ఆవిష్కరించాడు అస్తిత్వవాదం ఆలంబనగా మరికొంతమందికూడా శక్తిమంతమైన నాటకాలను రచించారు వారిలో ఆల్బర్ట్ కామూముఖ్యుడు ఈ నాటకోద్యమం ఐరోపా, అమెరికా ఖండాలలో విశేష ప్రచారం పొంది, నాటకాభిమానులను బాగా ఆకర్షించింది సరికొత్త భావాలను నాటక సాహిత్యంలో పొందుపరిచారేగాని, ప్రదర్శనా రీతిలో మాత్రం సంప్రదాయ పద్ధతిని వీడలేదీరచయితలు అంటే మౌలికమైన మార్పు వస్తువులో (కంటెంట్) కనబడినంతగా రూపం (ఫార్మ్) లో రాలేదు

ఈ ఉద్యమంఛాయలు కొంతవరకు తెలుగునేలమీద శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి 1920 ప్రాంతాలలో ప్రారంభించిన ప్రతిఘటనోద్యంలో కన్పిస్తాయి సంప్రదాయాలను,పుక్కిటి పురాణాలను ప్రతిఘటించడం వరకే పరిమితమైందా ఉద్యమం స్వతంత్రభావాలను ప్రజ్వలింపజేసే నాటకోద్యమంగా రూపుదాల్చలేదు ఈ పనిని కొంతవరకు చలం, గోపీచంద్ పరోక్షంగా నిర్వహించారని చెప్పవచ్చు ఎగ్జిస్టెనిషయలిజం మీద తెలుగులో బుచ్చిబాబు వంటివారు నవలలు రాశారు కాని నాటకాలు రాయలేదు

# అసంబద్ధ నాటకం

రెండవ ప్రపంచయుద్ధం తరువాత ఫ్రాన్స్‌లో ఉద్భవించిన సరికొత్త నాటక విధానం 'అసంబద్ధనాటకం' (అబ్సర్డ్ డ్రామా) దీనినే అనిబద్ధనాటకమనీ, అయోమయనాటకమనీ కూడా వ్యవహరిస్తారు నాటకకళాభిజ్ఞులు అబ్సర్డ్ అన్నమాట వినగానే అర్థం పర్థంలేని, అసంగతమైన అపహాస్యంతో కూడిన నాటకం అనే అర్థం స్ఫురిస్తుంది నిజానికి ఈ ప్రపంచంలో అర్థవంతంగా లేని మానవుని జీవనగతిని యధాతధంగా (ఎలాంటి ముసుగులు లేకుండా ) చిత్రించే నాటకమే అసంబద్ధనాటకం సాంప్రదాయికంగా నాటకాలలో కనిపించే కథాక్రమం, ఇతివృత్తం, పాత్రచిత్రణ, పరాకాష్ఠ ముగింపు మొదలైన లక్షణాలు ఈ నాటకంలో కనబడవు సాంప్రదాయ నాటకానికి ఇది పూర్తిగా వ్యతిరేకం సాంప్రదాయక నిబంధనలేవీ పాటించని నాటకం కనుక ఇది అనిబద్ధనాటకం ప్రదర్శన చూసే ప్రేక్షకుడికి తలాతోక తెలియకుండా గందరగోళంలో పడవేసే నాటకం కనుక దీన్ని అయోమయ నాటకం అంటారనికూడా అర్థం చేసుకోవచ్చు

అసంబద్ధనాటకకర్తలకు నిరాశావాదమే ప్రాతిపదిక ఈ నాటకకర్తల భావనప్రకారం దేవుడు లేని ఈ ప్రపంచంలోకి మనిషి తన ప్రమేయం లేకుండానే త్రోసివేయబడ్డాడు గమ్యం తెలియని బాటసారిలా ఒంటరి జీవితాన్ని గడుపుతూ కొత్త విలువలకోసం గాలిస్తున్నాడు మానవుడి ఆశలకూ, అర్థంలేని, అశాస్త్రీయమైన, హేతుబద్ధం తర్కబద్ధంకాని ఈ ప్రపంచానికీ సామరస్యం లేదనీ, ఆ కారణంచేత మనిషిని మృత్యువు కబళించేవరకు వేచి వుండటం తప్ప మార్గాంతరం లేదనీ అసంబద్ధనాటకకర్తలు భావిస్తారు

అసంబద్ధ నాటకాలలో నిర్దిష్టమైన కథ, ప్రారంభము, ముగింపు అనేవి ఉండవు సన్నివేశాలకు, పాత్రల ప్రవేశ నిష్క్రమణలకు అర్థం ఉండదు సంభాషణలు సహేతుకంగా, తర్కబద్ధంగా ఉండక, అందీ అందకుండా ఒకదానితో ఒకటి పొంతనలేకుండా పిచ్చివాళ్లప్రేలాపనలా ధ్వనిస్తాయి ఈ ఉన్మాద ప్రేలాపన వెనుక అంతరార్థం దాగివుంటుందని, దాన్నే ప్రేక్షకులు గ్రహించాలని ఈ

నాటకకర్తలనిశ్చితాభిప్రాయం స్వాప్నికజగత్తులో పలికే భాష, భావనలు ఈ నాటకాలలో కనిపిస్తాయి

అబ్సర్డ్ థియేటర్‌కు సంబంధించిన కొన్ని ప్రత్యేకతలను డా॥ కందిమళ్ల సాంబశివరావుగారు ఇలా క్రోడీకరించారు

1 సాంప్రదాయ పద్ధతులైన కారణం, ఫలితం అనే సంబంధం ఈ ధోరణిలో తగ్గించబడింది, లేదా వదిలివేయబడింది

2 సంఘటనల లాగానే నటనకూడా అపసవ్యంగా తయారైంది

3 కథచెప్పే ప్రయత్నంకంటే నిర్మాణంపైనే శ్రద్ధ ఎక్కువగా ఉంటుంది

4 సమస్యలు - సన్నివేశాలు చాలా అరుదుగా నిర్ణయింపబడతాయి

5. పాత్రలు స్పష్టంగాను, వ్యక్తిగతంగా కాక ఒక ప్రత్యేక పద్ధతిలో ఉంటాయి

6 చాలా తరచుగా పాత్రలు వేషాలను మారుస్తూ వేరే పాత్రలలోనికి ప్రవేశిస్తారు

7 కాలానికి ప్రాధాన్యమివ్వబడింది సంఘటన లేదా సన్నివేశం స్పష్టమైన ప్రపంచంనుండి దూరమై విశాలమైన ఊహాప్రపంచంలోనో, గుణాత్మకమైన ప్రదేశాలలోనో జరిగేది

8 భాష చాలాభాగం వర్గీకరించబడింది పాత్రలు సాంప్రదాయ నాటకాలలో లాగానే మాట్లాడుతున్నప్పటికీ ఒక ప్రత్యేకమైన ధోరణిలో ఉండేవి సంభాషణల్లో క్రమవిచ్ఛేదం, అర్థంలేని తర్కం, వితండమైన పునరుక్తి కనిపిస్తాయి

9 దృశ్య గుణాత్మకంగా, పాక్షికంగా భాషను సూచించడానికి ఉపయోగప డుతుంది సంప్రదాయ ఆధిక్యత ఈ నాటకరూపాలలో మాయమౌతుంది'[10]

అసంబద్ధ నాటకరంగం (థియేటర్ ఆఫ్ ది అబ్సర్డ్) 1950లో మొదలైంది దీనికి ఆద్యుడు శామ్యూల్ బెకెట్ ఇతను రాసిన 'వెయిటింగ్ ఫర్ గోడో' (గోడోకోసం నిరీక్షణ) అసంబద్ధ నాటక విధానానికి గీటురాయి. అయినెస్కో, పైంటర్,

అదమాల్, ఎడ్వర్డ్ అర్బీ తదితరులు ఈ బాటలో నడిచి ప్రసిద్ధులైన నాటకకర్తలు

అస్తిత్వ నాటక విధానానికి, అసంబద్ధ నాటకానికి ముఖ్యంగా ఉన్న తేడా ఒకటి గమనించవలసి ఉంది అర్థవంతంకాని ప్రపంచంలో అవ్యవస్థితమైన పరిసరాలతో సామరస్యం లేని ఒంటరి జీవితం గడుపుతున్న మానవుని జీవనగతిని చిత్రించేటప్పుడు అస్తిత్వ నాటకకర్తలు సాంప్రదాయిక రీతిలో సవ్యమైన భాషలో తర్కబద్ధమైన శైలినే స్వీకరించారు కానీ అసంబద్ధ నాటకకర్తలు అర్థరహితమైన, అసమంజసమైన, తర్కబద్ధంకాని పద్ధతితోనే తమ భావాలను వ్యక్తీకరించారు

అసంబద్ధ నాటకం తెలుగువారిని ఆకర్షించలేదు - అసంబద్ధ నాటక పద్ధతిలో ఎవరూ స్వతంత్ర నాటకాలు రాయలేదు అడపాతడపా వెలువడిన అనువాద నాటకాలు రంగస్థలంమీద రాణించలేకపోయాయి పైంటర్ 'కేర్‌టేకర్' నాటకాన్ని 'సంరక్షకుడు' పేరుతో శ్రీ ఎ ఆర్ కృష్ణ అనువదించి ప్రదర్శింపజేశారు బెకెట్ 'వెయిటింగ్ ఫర్ గోడో' నాటకాన్ని డా॥ మొదలి నాగభూషణశర్మగారు అదే పేరుతో ఆంధ్రీకరించారు అయితే ఈ నాటకాలు ప్రదర్శింపబడిన సందర్భాలు చాలా అరుదు శ్రీ దోనేపూడి రాజారావు అసంబద్ధ నాటక ఫక్కీలో ధర్మకాటా, న్యాయం నెగ్గింది అనే నాటకాలు, చంద్రశిల, వ్యాధిగ్రస్తుడు అనే నాటికలు కొన్ని రచించారు అవి స్వతంత్ర రచనలే అయినా వీటిలో బెకెట్ నిర్దేశించిన మౌలిక లక్షణాలు అంతగా కనబడకపోవడం మూలాన ఈ నాటకాలను అసంబద్ధ నాటకాల కోవలో పరిగణించడం సాధ్యంకాదు

కాగా, తెలుగులో స్వతంత్ర నాటకవిధానం (థియేటర్ స్టయిల్) అంటూ ఏదీ వెలుగులోకి రాలేదు పాశ్చాత్య దేశాలలో పుట్టిన నాటకరీతుల్నికూడా మనరచయితలు ఆహ్వానించలేదు కొందరు రాసిన నాటకాలలో శైలీమిశ్రమం (మిక్స్‌డ్ స్టయిల్) కనిపిస్తోంది ఉదాహరణకు - 'పెద్దబాలశిక్ష', 'కొక్కొరొకో', 'గోగ్రహణం' వంటి నాటికలు వీథినాటకాల పద్ధతిలో రాయబడినప్పటికి వాటిలో 'అభివ్యక్తి', 'ప్రతీక' నాటకరీతులు సమ్మిళితమై ఉన్నాయి 'రాజీవం' వంటి నాటికలలో ఎపిక్, ప్రతీక, వాస్తవిక నాటక విధానాలలోని లక్షణాల కలగలుపు

కనిపిస్తుంది అందువల్ల తెలుగు నాటకాలేవీ పాశ్చాత్య నాటకశైలులను యధాతధంగా స్వీకరించలేదు తమ నాటకాలలో ఒకటి అరా లక్షణాలను అవసరమైనంత మేరకు వాడుకున్నట్లు అనిపిస్తుంది

ఏది ఏమైనా తెలుగు నాటక రచయితలు థియేటర్ స్టయిల్స్ మీద అంతగా దృష్టి కేంద్రీకరించలేదనేది స్పష్టం

నాటకరంగంలో అనేక నాటక విధానలను ప్రవేశపెట్టిన పాశ్చాత్య నాటకకర్తలు, తమదైన ఒక సిద్ధాంతాన్నివ్యాప్తిలోకి తేవడానికి ఒక ప్రత్యేకశైలిని రూపొందించుకుని ఒకే బాటలో నడిచిపోయారుకాని, మన నాటకకర్తలకు తమదైన ఒక సిద్ధాంతంగాని లేదా రచనా తత్వంగాని లేకపోవడంవల్ల తెలుగులో థియేటర్ స్టయిల్ రాలేదేమో అని ఊహించడానికి వీలున్నది రచయితకు నిమగ్నతతోబాటు నిబద్ధతకూడా ఉన్నప్పుడే రచయిత తత్వాన్ని సామాజికులు అవగాహన చేసుకునేందుకు వీలవుతుంది

మన దేశ పరిస్థితులకు, వాతావరణానికి, మన సంస్కృతికి అనుగుణమైన నాటక విధానాలను రూపొందించుకుని తెలుగు నాటకరంగం తమ స్వీయ వ్యక్తిత్వాన్ని దృగ్గోచరం చెయ్యవలసిన ఆవశ్యకత ఎంతో ఉంది

## విదేశీ నాటకాలకు తెలుగు అనువాదాలు

| నాటకం పేరు | అనువాద కర్త | మూలం |
|---|---|---|
| 1 చమత్కార రత్నావళి 1880 | కందుకూరి వీరేశలింగం | షేక్స్పియర్- కామెడీ ఆఫ్ ఎర్రర్స్ |
| 2 కళ్యాణ కల్పవల్లి 1890 | కందుకూరి వీరేశలింగం | షెరిడాన్ - రైవల్స్ |
| 3 రాగమంజరి 1885 | కందుకూరి వీరేశలింగం | షెరిడాన్ - డ్యుయెన్నా |
| 4 అపవాద తరంగిణి 1901 | కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావు | షెరిడాన్ - స్కూల్ ఫర్ స్కాండల్స్ |
| 5 లుబ్ధాగ్రేసర చక్రవర్తి 1914 | వెట్టి లక్ష్మీనరసింహం | మోలియర్ - మైజర్ |
| 6 జయదేవ 1915 | ఆకెళ్ల సత్యనారాయణ | షేక్స్పియర్ - ఒథెల్లో |

| | | |
|---|---|---|
| 7 చారుమతీ పరిణయము 1917 | రాజామంత్రిప్రెగడ భుజంగరావు | షేక్స్పియర్ యాజ్ యూ లైక్ |
| 8 వనవాసి 1918 | కూచి నరసింహం | థామస్ ఫార్నెక పద్యకావ్యం |
| 9 ఇళ్ళ సపకు 1950 | ముప్పన చిన వెంకయ్య | మాస్టియర్ట్రూ లెవివారిస్ |
| 10 సరస్వతి 1920 | పానుగంటి లక్ష్మీనరసింహారావు | షేక్స్పియర్ కామెడీ ఆఫ్ ఎర్రర్స్ |
| 11 వీరప్రతాప్ 1924 | అవటపల్లి హనుమంతరావు | మాథ్యూ ఆర్నాల్డ్ సోహరాబ్ రుస్తుం |
| 12 ప్రతాపసింహ 1927 | కొటమర్తి చినరఘుపతిరావు | షేక్స్పియర్ ఒథెల్లో |
| 13 భీష్ముడు 1927 | పాణకా పిచ్చిరెడ్డి | ఇబ్సన్ బాండ్ |
| 14 సావిత్రి 1927 | గుడిపాటి వెంకటచలం | మాటర్లింక్ |
| 15 వింధ్యారాణి 1928 | పింగళి నాగేంద్రరావు | ఆస్కార్‌వైల్డ్ డచెస్ ఆఫ్ పాదువా |
| 16 బొమ్మరిల్లు 1934 | మామిడిపూడి వెంకమ్మ | ఇబ్సన్ డాల్స్ హౌస్ (1934 మే భారతిలో ప్రచురితం) |
| 17 ముగ్ధ ప్రణయం 1933 | కర్లపాలెం లక్ష్మీనరసింహారావు | షేక్స్పియర్ ఒథెల్లో |
| 18 తప్పనిసరి 1939 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ ద మాక్ డాక్టర్ |
| 19 రంగదాసు 1930 | చలం | విక్టర్ హ్యూగో లెవిజరబిల్ |
| 20 చివరికుండ 1932 | చలం | లాస్ట్‌పాట్ |
| 21 కలిమాయ 1934 | గద్దె లింగయ్య | టాల్‌స్టాయ్ ద ఫస్ట్ డిస్టిలర్ |
| 22 సునీత 1939 | జి వి కృష్ణారావు | ఆస్కార్‌వైల్డ్ సలోమి |
| 23 ఘటన (నాటిక) 1939 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ - బ్లండరర్ |
| 24 వద్దంటే పెళ్లి 1939 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ |
| 25 కళ్యాణి 1947 | సోమంచి యజ్ఞన్నశాస్త్రి | మాటర్‌లింక్ - మోనావావా |
| 26 జ్యోతిర్మయి 1947 | అవసరాల వెంకటనర్సు | ప్రీస్ట్లీ దె కేమ్ టు ఎ సిటీ |
| 27 పూర్వరంగం 1946 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ స్కూల్ ఫర్ వైవ్స్ |
| 28 పెళ్ళి ట్రైనింగ్ 1946 | భమిడిపాటి కామేశ్వరరావు | షెరిడాన్ రైవల్స్ |
| 29 లోభి 1945 | పానుగంటి విజయరాఘవరావు | మోలియర్ - ద మైజర్ |
| 30 వీరసేన విజయం1948 | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | షేక్స్పియర్ పెరికల్స్ |

| | | |
|---|---|---|
| 31 సంఘనాయకులు 1948 | కోగంటి రాధాకృష్ణమూర్తి | ఇబ్సన్ పిల్లర్స్ ఆఫ్ సొసైటీ |
| 32 సంపెంగ తోట 1947 | శ్రీశ్రీ, వరద | చెకోవ్ చెర్రీ ఆర్చెర్డ్ |
| 33 పిచ్చి పెళ్ళి 1945 | సోమంచి యజ్ఞన్న శాస్త్రి | జి బి షా మాన్ అండ్ సూపర్ మాన్ |
| 34 అనామకులు 1950 | యస్ జోగిరాజు | ఆస్కార్‌వైల్డ్ - ఉమెన్ ఆఫ్ నో ఇంపార్టెన్స్ |
| 35 ఇనపతెరలు 1950 | కొప్పరపు సుబ్బారావు | జె బి ప్రీస్ట్లీ ఇన్‌స్పెక్టర్ కాల్స్ |
| 36 కుళ్లుసరుకు 1950 | ముప్పన చిన అంకయ్య | మాన్షియల్ బ్రూలే ఎవవారిస్ |
| 37 మేడిపళ్లు 1950 | గౌతమ | ఇ బి ప్రీస్ట్లీ ఇనస్పెక్టర్ కాల్స్ |
| 38 నాటకం 1950 | డి వి నరసరాజు | ఫెరన్స్ మొల్నార్ - దప్లే ఈజ్ ద థింగ్ |
| 39 సీటికాకి 1952 | శ్రీనివాస చక్రవర్తి | చెకోవ్ - ద సీ గల్ |
| 40 పతితజీవులు 1952 | శ్రీనివాస చక్రవర్తి | మాక్సిమ్ గోర్కీ లోయర్ డప్త్స్ |
| 41 వారసురాలు 1952 | శివం | గోయట్జ్ హెయరెస్ |
| 42 ఆదర్శాలు 1953 | ఎ యస్ అవధాని | ఆస్కార్ వైల్డ్ - ఏన్ ఐడియల్ హజ్బెండ్ |
| 43 ఈడూ జోడూ 1953 | భమిడిపాటి కామేశ్వరరావు | షెరిడాన్ డూయెన్నా |
| 44 ప్రణయరంగం 1952 | భమిడిపాటి కామేశ్వరరావు | షెరిడాన్ రైవల్స్ |
| 45 వినయప్రభ 1953 | భమిడిపాటి కామేశ్వరరావు | ఆలివర్ గోల్డ్‌స్మిత్ - షి స్టూప్స్ టు కాంకర్ |
| 46 ఆడవాళ్ల తెలివి 1954 | ముద్దు కృష్ణ | మోలియర్ ఫిజిషిన్ ఇన్‌స్పైటాఫ్ హింసెల్ఫ్ |
| 47 భూదేవి 1954 | సడాల రామారావు | హొచింగ్ చీటింగ్ - వైట్ హేర్డ్ గర్ల్ |
| 48 కాలచక్రం (అముద్రితం) | జె రమాకాంత్ | జె బి ప్రీస్ట్లి ఐ హావ్ బీన్ హియర్‌బిఫోర్ |
| 49 కాళరాత్రి 1955 | ప్రఖ్య శ్రీరామమూర్తి | హెవార్డ్ ఇర్వింగ్ యంగ్ దహాకీ ఐలెండ్ |
| 50 న్యాయం 1955 | సోమంచి యజ్ఞన్నశాస్త్రి | గాల్స్‌వర్ది జస్టీస్ |
| 51 వీలునామా 1955 | డి వి నరసరాజు | సాన్ ఒ కాసీ - జేనో అండ్ పీకాక్ |
| 52 ఇన్‌స్పెక్టర్ జనరల్ 1956 | రెంటాల గోపాలకృష్ణ | గోగోల్ - ఇన్‌స్పెక్టర్ జనరల్ |
| 53 బొమ్మరిల్లు | దేశరాజు రామదాసు | ఇబ్సన్ - ద డాల్స్ హౌస్ |
| 54 వీలునామా 1956 | మొదలి నాగభూషణ శర్మ | జె చమ్ బారీ ద విల్ |
| 55 జంటపక్షులు 1956 | మొదలి నాగభూషణ శర్మ | ఎ ఎ మిల్నీ దోవర్ రోడ్ |

| | | |
|---|---|---|
| 56 ఆరాశరామన్న 1957 | బెల్లంకొండ రామదాసు | గోగోల్ - ఇన్‌స్పెక్టర్ జనరల్ |
| 57 ఫణి 1957 | ప్రఖ్య శ్రీరామమూర్తి | ఫ్రెడరిక్ నాట్ డయల్ ఎమ్ ఫ్ మర్డర్ |
| 58 విషకుంభాలు 1957 | కొర్రపాటి గంగాధరరావు | బెర్నార్డ్ షా |
| 59 ఆపద్బాంధవులు 1958 | డా॥ ఏ వి ఆచార్ | వాల్టర్ ఎల్లీస్ గుడ్‌మెన్ స్లీప్ ఎట్ హోమ్ |
| 60 సంక్రాంతి 1958 | కొర్రపాటి గంగాధరరావు | బెర్నార్డ్ షా డెవిల్స్ డిసైపుల్ |
| 61 చంద్రయ్యలో చైతన్యం 1959 | దండమూడి మహీధర్ | టాల్‌స్టాయ్ ద పవర్ ఆఫ్ డార్క్‌నెస్ |
| 62 నేరము శిక్ష 1959 | శివం | దోస్టోవస్కీ క్రైమ్ అండ్ పనిష్మెంట్ |
| 63 పన్నా 1959 | కె వి రామరాజు | |
| 64 మహానుభావులు 1959 | సోమంచి యజ్ఞన్నశాస్త్రి | గోగోల్ - ఇన్‌స్పెక్టర్ జనరల్ |
| 65 రాజ్యకాంక్ష 1959 | దుర్భా రామమూర్తి | షేక్స్పియర్ మేక్‌బెత్ |
| 66 సాహసి 1959 | కొర్రపాటి గంగాధరరావు | బెర్నార్డ్ షా డెవిల్స్ డిసైపుల్ |
| 67 రాగరాగిణి 1960 | గొల్లపూడి మారుతీరావు | యూజినీ ఓ నీల్ బియాండ్ ద హొరైజన్ |
| 68 చిరంజీవి 1960 (అముద్రితం) | గండవరం సుబ్బరామిరెడ్డి | థామస్ హార్డీ మేయర్ ఆఫ్ కాస్టర్ బ్రిడ్జి |
| 69 వనజాక్షి 1961 | ఉపాధ్యా సూర్యనారాయణరావు | సోమర్‌సెట్ మామ్ పెనిలోప్ |
| 70 మరమనిషి 1961 | శ్రీనివాస చక్రవర్తి | బెర్నార్డ్ షా ఆరమ్స్ అండ్ ది మాన్ |
| 71 తప్పు నాదే 1962 | అల్లంశెట్టి సీతారామాంజనేయులు | సోమర్‌సెట్ మామ్ ద లెటర్ |
| 72 జీవితాలు 1965 | వి యస్ శాస్త్రి | సోమర్‌సెట్ మామ్<br>ద మూన్ అండ్ సిక్స్ పెన్స్ |
| 73 ఈ రోడ్డు ఎక్కడికి 1967 | కొర్రపాటి గంగాధరరావు | ఇబ్సన్ ఎనిమీ ఆఫ్ ద పీపుల్ |
| 74 ఆదర్శమూర్తి 1967 | ఎ ఆర్ కృష్ణ | ఆస్కార్ వైల్డ్ - ద ఐడియల్ హజ్‌బెండ్ |
| 75 కిలాడి 1968 | శ్రీనివాస చక్రవర్తి | ఆస్ట్రోవస్కీ ది డైరీ ఆఫ్ ఎ స్కౌండ్రల్ |
| 76 యాంటిగని 1966 | యం ఆర్ అప్పారావు | సాఫోక్లీస్ |
| 77 అమ్మా (నాటిక) 1966 | శ్రీ శ్రీ | కారల్ చపక్ |
| 78 గడ్డురోజులు ( నాటిక) 1968 | శ్రీవాత్సవ | థారన్‌టన్ వైల్డర్ |
| 79 పెళ్లిసంబంధం ( నాటిక) 1968 | శ్రీవాత్సవ | థారన్‌టన్ వైల్డర్ |

| | | |
|---|---|---|
| 80 మావూరు ( నాటిక) 1968 | శ్రీవాత్సవ | థారన్‌టన్ వైల్డర్ |
| 81 సంరక్షకుడు ( నాటిక) 1968 | ఎ ఆర్ కృష్ణ | హెరాల్డ్ పింటర్ |
| 82 గగనకుసుమం(నాటిక) 1962 | జె రమాకాంత్ | ది వాలియంట్ |
| 83 చీకటి వెలుగులు నాటిక 1962 | ఎ ఆర్ కృష్ణ | హ్యాయర్స్ ఆఫ్ కోల్ |
| 84 రాజా ఈడిపస్ 1988 | డా॥ మొదలి నాగభూషణ శర్మ | సోఫోక్లిస్ |
| 86 మాల్ఫీరాణి 1970 | కిరణ్ | వెబ్‌స్టర్ |
| 87 జీవచ్ఛవం 1971 | సి వి యస్ నారాయణదాసు | టాల్‌స్టాయ్ లైవ్ కార్ప్స్ |
| 88 డాక్టర్ ఫాస్టస్ 1972 | కిరణ్ | క్రిస్టఫర్ మార్లో |
| 89 వరప్రసాదం (నాటిక) | ఆచార్య ఆత్రేయ | డబ్ల్యు డబ్ల్యు జాకబ్ మంకీస్ పా |
| 90 సత్యంగారిల్లెక్కడ | గొల్లపూడి మారుతీరావు | ఇబ్సన్ - ఎన్ ఎనిమీ ఆఫ్ ద పీపుల్ |
| 91 ప్రజల మనిషి | డా॥ మొదలి నాగభూషణ శర్మ | ఇబ్సన్ ఎన్ ఎనిమీ ఆఫ్ ద పీపుల్ |
| 92 విషవలయం | కె యస్ టి సాయి | ఇబ్సన్ ఎన్ ఎనిమీ ఆఫ్ ద పీపుల్ |
| 93 గోటు హెల్ | గొల్లపూడి మారుతీరావు | జాన్ ఆస్‌బర్న్ లుక్ బ్యాక్ ఇన్ ఏంగర్ |
| 94 ఆదర్శమూర్తి | ఎ ఆర్ కృష్ణ | ఆస్కార్ వైల్డ్ ఎన్ ఐడియల్ హజ్బెండ్ |
| 95 సుందరీ సుందరుడు (నాటిక) | అత్తిలి కృష్ణారావు | చెకొవ్ - ప్రపోజల్ |
| 96 నిశ్శబ్దం నీకూ నాకూ మధ్య | యండమూరి వీరేంద్రనాథ్ | యూజీన్ ఐనెస్కో ది చైర్స్ |
| 97 కాలం వెనక్కు తిరిగింది | గొల్లపూడి మారుతీరావు | జూజిన్ ఐనెస్కో ది చైర్స్ |
| 98 సత్యకామేష్టి | ఆకెళ్ల సత్యమూర్తి | దిలాస్ట్ అపాయింట్‌మెంట్ |
| 99 ప్రగతి (నాటిక) 1948 | ఆచార్య ఆత్రేయ | సెయింట్ జాన్ ఇ ఇర్విన్ ప్రోగ్రెస్ |
| 100 మనసు - వయసు 1954 | ఆచార్య ఆత్రేయ | సిడ్నీ హవర్డ్ దె న్యూ వాట్ దె వాంటెడ్ |
| 101 పాపకూడదు (నాటిక) 1954 | ఆచార్య ఆత్రేయ | జె బి ప్రీస్ట్లీ - యాన్ ఇన్‌స్పెక్టర్ కాల్స్ |
| 102 మురికి పేటలు | వేమునగంటి శ్రీరాములు | జి బి షా - విడొయర్స్ హౌస్ |
| 103 విషకుంభాలు | డా॥ కొర్రపాటి గంగాధరరావు | జి బి షా - మాన్ అండ్ సూపర్ మాన్ |
| 104 ప్రథమ పాంథికుడు | వేలూరి శివరామశాస్త్రి | టాల్‌స్టాయ్ ఫస్ట్ డిస్టిలర్ |
| 105 శత్రువులు 1951 | అశ్వనీ కుమార్ దత్తు | గోర్కీ ఎనిమీస్ |

| | | |
|---|---|---|
| 106 అనామకులు 1950 | యస్ జోగారాజు | అస్కార్‌వైల్డ్ - ఉమెన్ ఆఫ్ నో ఇంపార్టెన్స్ |
| 107 ఇనపతెరలు 1950 | కొప్పరపు సుబ్బారావు | జెబి ప్రీస్టీలీ - ఇన్స్పెక్టర్ కాల్స్ |
| 108 ధర్మదుర్గం 1950 | విద్వాన్ విశ్వం | ఇబ్సన్ రోస్మర్‌షోం |
| 109 ప్రణయాదర్శం 1943 | కోటగిరి వెంకటకృష్ణారావు | షెక్స్పియర్ రోమియో అండ్ జూలియట్ |
| 110 బొమ్మరిల్లు 1956 | దేశరాజు రామదాసు | ఇబ్సన్ ది డాల్స్ హౌస్ |
| 111 బొమ్మరిల్లు | ఔమనగంటి శ్రీరాములు | ఇబ్సన్ ది డాల్స్ హౌస్ |
| 112 మరమనిషి 1962 | డా॥ కొర్రపాటి గంగాధరరావు | బెర్నార్డ్ షా ఆర్మ్స్ అండ్ ద మాన్ |
| 113 మహాశిల్పి 1956 | విద్వాన్ విశ్వం | ఇబ్సన్ మాస్టర్ బిల్డర్ |
| 114 మిత్రద్రోహి | సోంపల్లి బాపయ్య | షేక్స్పియర్ ఒథెల్లో |
| 115 రాగరాగిణి 1960 | గొల్లపూడి మారుతీరావు | యూజీనీ ఓ నీల్ బియాండ్ ది హొరైజన్ |
| 116 రాజ్యకాంక్ష 1959 | దుర్భా రామమూర్తి | షేక్స్పియర్ మెక్బెత్ |
| 117 రామయ్య వస్తావయ్య(అముద్రితం) | శ్రీవాత్సవ | బ్రెక్ట్ వెయిటింగ్ ఫర్ గోడో |
| 118 ఎవళ్ల గొడవ వాళ్లది 1946 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ |
| 119 గగనకుసుమం (నాటిక) 1962 | జె రమాకాంత్ | ద వాలియంట్ |
| 120 జనవరి 30 (నాటిక 1952) | ప్రఖ్య శ్రీరామమూర్తి | డార్విన్ డివియోట్ - రిమెంబర్‌సీజర్ |
| 121 జరగాలి అనుకోవాలి (నాటిక) 1955 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ ఎమలెస్క్వాస్ |
| 122 తీర్పు (నాటిక) 1949 | ఎస్ జి కె ప్రసాదరావు | అనటోల్ ఫ్రాన్స్ |
| 123 దాగని సత్యం (నాటిక) | ఎ ఆర్ కృష్ణ | హాల్వర్తి హాల్ రాబర్ట్ మిడిల్ మన్ ద వాలియన్ట్ |
| 124 దారితప్పిన దానయ్య (నాటిక) 1952 | బుచ్చిబాబు | మిల్నీ మిస్టర్ పిమ్ పాసెస్ |
| 125 పెళ్లికోసం (నాటిక) 1959 | ముదిగొండ లింగమూర్తి | ప్రీస్ట్లీ ఇన్స్పెక్టర్ కాల్స్ |
| 127 బలత్కార గానవినోదం(నాటిక) 1910 | కందుకూరి వీరేశలింగం | విలియం విక్టర్ - జంటిల్మన్ డాన్సింగ్ మాస్టర్ |
| 128 బూట్సు (నాటిక) 1949 | ముప్పన చిన అంకయ్య | డాన్సం రైడౌట్ |
| 129 మహాబధిర ప్రహసనం 1910 | కందుకూరి వీరేశలింగం | జార్జి ఫార్కు వార్ మోర్స్ స్ట్రాటజెమ్ |
| 130 మహావంచక (నాటిక) 1910 | కందుకూరి వీరేశలింగం | వాన్‌వాన్‌బ్రగ్ కాన్ఫెడరసీ |

| | | |
|---|---|---|
| 131 మాయల మాలోకం (నాటిక) 1950 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ దట్ స్కాంద్రల్ స్కాపిన్ |
| 132 పెండ్లి పెళ్ళి నాటకం (నాటిక) 1946 | భమిడిపాటి కామేశ్వరరావు | మోలియర్ |
| 133 లక్షాధికారి (నాటిక) | కామరాజు గడ్డ రామచంద్రరావు | ఆస్కార్ వైల్డ్ మోడల్ మిలినీర్ |
| 134 వరప్రసాదం (నాటిక) 1955 | ఆచార్య ఆత్రేయ | డబ్ల్యు డబ్ల్యు జాకబ్ మంకీస్‌పా |
| 135 విచిత్ర వివాహం (నాటిక) 1910 | కందుకూరి వీరేశలింగం | విలియం కేంగ్రీల్ ఓల్డ్ బాచలర్ |
| 136 లాభోక్యంతయు లేదు | డి ప్రభాకర్ | బ్రెఫ్ట్ ది ఎక్సెప్షన్ అండ్ ది రూల్ |
| 137 నరజాతి చరిత్ర సమస్తం | డా॥ మొదలి నాగభూషణ శర్మ | యూజీనీ మనీల్ ఎంపరర్ జోన్స్ |
| 138 భారతనారీ నీ మాంగల్యానికి మరోముడి | గొల్లపూడి మారుతీరావు | ఆర్థర్ మిల్లర్ ఆఫ్టర్ ది ఫాల్ |

# ఏడవ ప్రకరణం

## దర్శకత్వంలో ప్రయోగాలు

నాటక రచనకు పరమావధి ఆ నాటకాన్ని ప్రదర్శించటం తద్వారా సామాజికులకు మానసికోల్లాసాన్ని, విజ్ఞానాన్ని ప్రసాదించి చైతన్యవంతులుగా మార్చడం అందువల్ల నాటకం జనరంజకం కావడం కోసం ప్రదర్శనా రీతుల్లో ప్రతి తరంలోను అనేక మార్పులు చేర్పులుజరుగుతూ వచ్చాయి సాహిత్యం, కళలు జడపదార్థాలుకావు అవి నిత్యం కదులుతూ కదిలించే స్వభావం కలిగి ఉంటాయి కనుక ఎప్పటికప్పుడు పాతనీరు కొట్టుకుపోయి కొత్తనీరు వస్తుండాలి అది అవసరం అనివార్యంకూడాను మారుతున్న సమాజానికి, ప్రజల అభిరుచులకు అనుగుణంగా తమనితాము తీర్చిదిద్దుకుంటూ ముందుకు సాగిపోవడం కళా, సాహిత్యాల సహజ లక్షణం

కొత్త ప్రయోగం జరిగినపుడల్లా పాతతరంవారి ప్రతిఘటనకు గురి అవుతూనే, అడ్డంకులను అధిగమించి ప్రగతిపథంలో పయనిస్తుంది నాటకరంగం

"రచన, నటన, సాంకేతిక శిల్పం - అన్నమూడు అంశాల సమాహార రూపం నాటక ప్రయోగం, దాని సిద్ధికి కావ్యం ఆధారం, రంగం ఆధేయం, అభినయం, ఆధార, ఆధేయాల సమ్మేళనం ప్రయోగ సిద్ధి స్వరూపం ఈ రూపాన్ని ఆవిష్కరించే వ్యక్తి దర్శకుడు అందువల్ల దర్శకుడే నాటక ప్రయోగాధికారికూడా అవుతున్నాడు'

నటీనటుల ఆంగిక, వాచిక, సాత్త్విక అభినయాలను క్రమబద్ధంచేసి అభినయ సారాంశం నాటక క్రమోన్మీలనానికి దోహదం అయ్యేలా చూస్తాడు. ఆహార్య, రంగ - కాంతి - పరికల్పనా వివరాలను ఆయా సాంకేతిక వర్గంతో చర్చించి నిర్ధారిస్తాడు అంటే "నాటక ప్రయోగానికి అవసరమైన అన్ని అంశాలను సమ్యక్‌దృష్టితో పరిశీలించి రూపొందించేవాడు దర్శకుడు నాటక సిద్ధిని తత్పూర్వమే సంభావించే దార్శనికుడు - దర్శకుడు" [1]

నాటక ప్రదర్శనకు చుక్కాని అనదగిన దర్శకుని ప్రాముఖ్యాన్ని గురించి మన ప్రాచీనులు ఏనాడో గుర్తించినట్లు తెలుస్తుంది భరతుని 'నాట్యశాస్త్రం'లో చర్చించదగిన వివిధ నాటకాంశాలతోపాటు దర్శకుడికి ఉండవలసిన లక్షణాలను, అతని బాధ్యతలను గురించి విస్తృతంగా వివరించడం జరిగింది

సంస్కృత నాటకాలలోను, దేశీనాటక సంప్రదాయాలలోనూ 'సూత్రధారుడు' నిర్వహించే పాత్రకు నేటి అధునిక నాటకాలలో దర్శకుడు నిర్వహించే పాత్రకూ సారూప్యం ఉన్నట్టు గుర్తించవచ్చు కాని ఈ నాటివలే అప్పటి సూత్రధారునికి ఒక ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నట్లు కనిపించదు దర్శకుణ్ణి నాటక శరీరంలో ఒక ప్రత్యే అంగంగా గుర్తించటం - పాశ్చాత్య నాటకరంగం ప్రభావంతోనే అని చెప్పటంలో ప్రతిపత్తి ఏమీ ఉండబోదు అనవచ్చు

తెలుగు నాటకరంగానికి సంబంధించినంతవరకు శ్రీ కందుకూరి వీరేశలింగం 'ఆధునికాంధ్రనాటకరంగ ప్రథమ ప్రయోక్త, ప్రథమ దేశికుడు', 1880లో రాజమహేంద్రవరంలో ప్రదర్శించబడిన 'వ్యవహార ధర్మబోధిని' అనే రూపకానికి రచయిత, దర్శకుడు ఆయనే

రెండవ దర్శకుడు వడ్డాది సుబ్బారాయుడు వీరు రచించిన వేణీసంహారం నాటకానికి దర్శకత్వం వహించడమే కాక పాత్రపోషణ - అశ్వత్థామ భూమికా ధారణకూడా చేసిన నట - దర్శకుడాయన నాటకంలో పద్యాలను భావయుక్తంగా చదివే పద్ధతిని ప్రారంభించిన ఘనత వడ్డాది వారిదే! ఆవిధంగా నాటకరంగంలో తొలి ప్రయోగానికి నాంది పలికిన దర్శకుడు వడ్డాది సుబ్బారాయుడు

మూడవ దర్శకుడు శ్రీ కొండుభొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి గుంటూరులో నాటకసమాజాన్ని స్థాపించి, తాను రచించిన వచన నాటకాలను తన సహచరులకు నేర్పించి గుంటూరులో ప్రదర్శింప చేయడమే కాక ఇతర ప్రాంతాలలోకూడా ప్రదర్శించి ఆవిధంగా సంచార నాటక ప్రదర్శనా పద్ధతికి నాంది పలికారు

"మచిలీ పట్నంలో శ్రీ నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రి తాను రాసిన నాటకాలలో 'టప్పా' లనే పేర ఫార్సీ మెట్లతో కూడిన పాటలు ప్రవేశపెట్టారు

బళ్ళారిలో ధర్మవరం కృష్ణమాచార్యులవారు తమ నాటకాలలో పద్యాలను, కీర్తనలను రాగయుక్తంగా పాడేపద్ధతికి ఆద్యులయ్యారు పద్యాలు పాడే సంప్రదాయం కోస్తా జిల్లాలకు ప్రాకింది అప్పటినుంచీ పద్యాలు పాడటం అనే విధానం నాటక రంగంలో సుప్రతిష్ఠతమైంది నేటికీ అది కొనసాగుతూనే ఉంది ధర్మవరంవారు తమ నాటకాలకు తామే దర్శకత్వం వహిస్తూ నటులకు శిక్షణ ఇచ్చేవారు క్రమక్రమంగా ఈ సాంప్రదాయం అన్ని సమాజాలవారికి అనుసరణీయమైంది అయితే రాను రాను పద్య నాటకాల్లో సంగీతప్రాధాన్యం పెరిగిన తర్వాత, దర్శకుడంటే హార్మోనిస్టు అనే భావం కలిగింది ఏమైనా, నాటకానికి దర్శకుడు అనేవాడుండాలి అనే సాంప్రదాయం స్థిరపడిపోయింది

పద్యనాటకాలజోరు ప్రారంభమైన తర్వాత సంగీతప్రాధాన్యం పెరిగిపోయి నటనకు ముఖ్యంగా సాత్త్వికాభినయానికి పరపతి లేకుండా పోయింది

1885 - 90 ప్రాంతాలలో ప్రారంభమైన సురభి నాటక సమాజాలు, వారిది వృత్తి నాటకరంగం కావడంవల్ల ప్రజలను ఆకట్టుకోవడానికి ఆవశ్యకమైన హంగులన్నింటినీ తమ నాటకాలలో చొప్పించారు

వనారస గోవిందరావు నేతృత్వంలో ప్రదర్శనా విధానంలో ఎన్నో మార్పులు తెచ్చారు నాటకాలకు తగిన తెరలను రాయించేవారు రంగ పరికరాలను దూరప్రాంతాలనుండి తెప్పించుకుని సమకూర్చుకునేవారు రంగోద్దీపనం, రంగపరికల్పన, వేషరచన యిత్యాది అంశాలలో ముందంజ వేశారు

వృత్తినాటక సమాజానికి వర్తక మర్యాదలు తెచ్చిపెట్టినవారు కృత్తివెంటి నాగేశ్వరరావు గారు (హిందూ నాటక సమాజం), సత్యవోలు గున్నేశ్వరరావుగారు కొంతమంది నటులకు నెలజీతాలు ఇస్తూ, వారికి మంచి శిక్షణ యిచ్చి, ఉన్నత ప్రమాణాలతో నాటకాలు వర్తకరీతిలో ఆడించారు పాపట్ల కాంతయ్య అనే

సంగీత విద్వాంసుణ్ణి పిలిపించి ఆయనను సంగీత దర్శకుడుగా నియమించారు ఈనాడు వ్యాప్తిలోవున్న అనేక ప్రసిద్ధనాటకాలకు పాటలు రాసినవారు ఈ పాపట్ల కాంతయ్యగారే

నాటకరంగంలో విప్లవాత్మకమైన మార్పులు తేవాలని కృషి చేసినవారు మహానటుడు శ్రీ బళ్ళారి రాఘవ పద్యనాటకాలలో రాగాలాపనను ఆయన నిరసించారు "కేవలం రంగస్థల చలనాలు, ఆంగికం మాత్రమే ప్రధానం కాదని, సాత్విక నటనకు మించిన నటన లేదని తెలుగు దేశానికి మరోసారి గుర్తుచేసి, తాను ఆచరించి తన తోటి నటులు ఆచరించడానికి పాటుపడిన ఉత్తమ దర్శకుడు రాఘవ"[2] వాస్తవికతా వాదాన్ని నాటకరంగంలో ప్రవేశపెట్టిన వారిలో ఆయనే అగ్రగణ్యుడు. స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలని పట్టుపట్టి, ఆ నినాదాన్ని ఆచరణలో పెట్టి చూపించారు రాజమన్నార్‌గారి 'తప్పెవరిది' నాటక ప్రదర్శనలలో స్త్రీ పాత్రలను శ్రీమతి కొమ్మూరి పద్మావతి, శ్రీమతి మాడపాటి సరోజని గార్లు పోషించారు పద్యనాటకాలకన్నా గద్య నాటకాలను ప్రోత్సహించాలని, నాటకాలు సమకాలీన సామాజిక సమస్యాచిత్రణ కావాలని రాఘవ ఉద్బోధించారు అచరించి చూపారు

శ్రీ రాఘవ ఆశించిన వాటిలో చాలావరకు 1943 లో ఆంధ్రనాటక కళాపరిషత్తు స్థాపనతో అమలులోకి వచ్చాయి సామాజిక సమస్యలు ప్రతిబింబించే నాటకాలు, స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించే నాటకాలు, క్రమశిక్షణతో కూడిన నాటక సమాజాలు - అన్నీ సమకూడాయి కళాపరిషత్తు రంగస్థలిపై ఉన్నత ప్రమాణాలుగల నాటకాలు ప్రదర్శించబడి ఆంధ్రదేశంలో నటులందరికీ మార్గదర్శకం అయ్యాయి

నాట్యావధానం, అనే కళాప్రక్రియ రూపురేఖలు దిద్దుకొంది దీనికి ఆద్యుడు శ్రీ ధారా రామనాథశాస్త్రిగారు

ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రయోగాత్మక నాటక సమితి శాస్త్రీయ పద్ధతిలో నటశిక్షణ ఇవ్వడమే కాక సాంకేతిక విలువలతో కూడిన నాటక నాటికలు ప్రదర్శింపజేసి 'కాలేజి నాటకరంగాన్ని' ప్రోత్సహించింది

ఆంధ్ర ప్రజానాట్యమండలి సాంస్కృతికోద్యమానికి ఎనలేని సేవ చేసింది కాలగర్భంలో కలిసిపోతున్న అనేక జానపద కళారూపాలను పునరుద్ధరించి ప్రజలముంగిటకి తెచ్చింది సాంఘిక, రాజకీయ పరిస్థితుల్ని సామాన్య ప్రజానీకం అర్థంచేసుకొని చైతన్యవంతులు అయ్యేవిధంగా 'మాభూమి', 'ముందడుగు' వంటి నాటకాలను రాయించి ప్రదర్శించింది బుర్రకథ, జముకుల కథ, డప్పుల కోలాటం వంటి జానపద కళలు సాంఘిక నాటకాలలో మిళితంచేసి రసాత్మకంగా ప్రదర్శించే నూతన విధానానికి మార్గం చూపింది ప్రజానాట్యమండలి క్రమశిక్షణకు మారుపేరుగా నిలిచింది

కళాకారులలో సహజంగా ఉండే ప్రతిభాపాటవాలకు తోడు నాటక కళను శాస్త్రీయ దృక్పధంతో కూడా అభ్యసిస్తే బంగారానికి తావి అబ్బినట్లు అవుతుందనీ, సుశిక్షితులైన కళాకారుల వల్లనే నాటకరంగం ప్రగతి సాధిస్తుందనే లక్ష్యంతో శ్రీ కొప్పరపుసుబ్బారావు ఆరంభించిన "లిటిల్ థియేటర్" ఉద్యమం నటీనటులకు సాంకేతిక విజ్ఞానాన్ని పుష్కలంగా అందించగలిగింది

ఆచార్య ఆత్రేయగారు తమ 'గౌతమ బుద్ధ' నాటకంలో ప్రతీకాత్మక పరికల్పనావిధానాన్ని రంగోద్దీపనలో, కొత్త కొత్త దీపాలను సాదారంగు తెరల్ని వాడి అనుకొన్న భావాన్ని ఆవిష్కరించడంలో కొత్త ప్రయోగం చేశారు 'ఎవరుదొంగ' నాటికలో ప్రేక్షకులకు కూడా భాగస్వామ్యం కల్పించారు తెర ఎత్తకముందే నాటిక ప్రారంభమయ్యే పద్ధతి, ప్రేక్షకులలోంచి రంగస్థలం మీదికి నటులు ప్రవేశించడం వంటి కొత్త టెక్నిక్‌లు ఆత్రేయనుండి మొదలైనవే 'అంత్యార్పణ' నాటికలో జనం మధ్యనుంచి మంత్రిగారు ఊరేగింపుతో వేదికమీదికి వెళ్ళే సన్నివేశం కూడా అటువంటిదే రంగస్థలంమీద నటీనటుల గతివిన్యాసాలు, వాచికాభినయం అతి సహజంగా ఉండేటట్లు జాగ్రత్తలు తీసుకునేవారు మెలోడ్రామాకు అవకాశం ఇవ్వకుండా ఎన్ జి ఓ నాటక ప్రదర్శన ఉన్నా, మళ్ళీ 'కప్పలు', 'భయం', 'రామ్-రహీం' నాటకాలలో, 'ఎవరు దొంగ', 'చావకూడదు' నాటికలలోనూ మెలోడ్రామా పరిష్వంగంనుంచి తప్పించుకోలేక పోయారు

ఆత్రేయగారు సంభాషణల్లో వాడి, వేడి, క్లుప్తత సహజ సుందరంగా ఉంటాయి ఆత్రేయగారి నాటకశైలిని పుణికి పుచ్చుకొన్న నాటకకర్త లేడు తాను చెప్పదల్చుకొన్న విషయం సూటిగా, ఎలాంటి ముసుగులు, కవితా కసరత్తులు లేకుండా గుండెను తాకేటట్లు అవిష్కరించడం, అలా ప్రదర్శించడం ఆత్రేయగారి నాటక శిల్పంలో ఒక అంతర్భాగం

టికెట్టు కొనుక్కొని ప్రదర్శన చూసే అలవాటు పద్యనాటకాలకే పరిమితమైంది ఎంతగొప్ప సాంఘిక నాటకమైనా టిక్కెట్లు పెడితే కొనేవారుండరు

అలాంటి సమయంలో పినిశెట్టి శ్రీరామమూర్తిగారు తాను రచించిన 'పల్లెపడుచు' నాటకాన్ని టికెట్లు పెట్టి ప్రదర్శించి సాంఘిక నాటకాలు కూడా కమర్షియల్‌గా విజయం సాధించగల సత్తా గలవని నిరూపించారు పల్లె ప్రజలను ఆకర్షించగల అంశాలెన్నో ఉన్నాయి ఈ నాటకంలో "పినిశెట్టి శ్రీరామమూర్తిగారు 'పల్లెపడుచు' నాటకంతో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించారు ఔత్సాహిక నాటకానికి ప్రొఫెషనల్ స్టేటస్‌ని ఈ నాటకం ద్వారా సృష్టించగలిగారాయన ఆ తరువాత ఆయన సినిమారంగానికి వెళ్లిపోకుండా వుంటే నాటకరంగానికి ఈ స్టేటస్‌ని పటిష్ఠంచెయ్యడానికి తప్పక కృషిచేసి ఉండేవారు" అన్నారు [3] ప్రసిద్ధ దర్శకులు చాట్ల శ్రీరాములుగారు

డి వి నరసరాజుగారి 'నాటకం' అనే నాటకంలో రంగస్థలాన్నిరెండు గదులుగా విభజించారు రెండు గదుల్లోను ఏకకాలంలో నాటకం జరుగుతూవుంటుంది ఇది ఆనాటికి కొత్త ప్రయోగం ఇది 1980 వచ్చేనాటికి 3 గదులు (పురుషార్థం నాటకం) కూడా అయింది 'మాలపల్లి' నాటకంలో పన్నెండు రంగస్థలాలను కూడా ఏకకాలంలో చూపించే టెక్నిక్ వాడేరు

కె. వెంకటేశ్వరరావు గారి నేతృత్వంలో ప్రదర్శితమైన 'రాగరాగిణి', 'ఫణి' వంటి నాటకాలలో వాస్తవికత కొట్టవచ్చినట్టు కన్పిస్తుంది గతివిన్యాసాలు, వాచికాభినయంలో ప్రత్యేకశ్రద్ధ తీసుకున్నట్టు స్పష్టమవుతుంది నాటకం చూస్తున్నట్టుకాక ఆ సన్నివేశాలు జరుగుతున్నచోట ఆ వ్యక్తుల మధ్య కూచొని

చూస్తున్న అనుభూతి కలుగుతుంది సామాజికులకు కాని వీరి నాటకాలన్నీ ఏకపాత్రాత్మకాలు కావడం విశేషం నాటకరంగంలో డా రాజారావు తర్వాత అంత చరిత్ర సృష్టించిన నటుడు,దర్శకుడుశ్రీవేంకటేశ్వరరావు

శ్రీ కె వేంకటేశ్వరరావు ఒక వ్యక్తి కాదు . ఒక వ్యవస్థ ఒక ఉద్యమం శ్రీ ఆత్రేయ తర్వాత నాటకరంగంలో పెనుమార్పులు తెచ్చి చరిత్ర సృష్టించిన కారణజన్ముడు వెంకటేశ్వరరావు ఆంధ్ర నాటక రంగస్థలి మీద'వెంకటేశ్వరరావు స్కూల్ ఆఫ్ ఏక్షన్' అని ముద్రవేశారు వేంకటేశ్వరరావు తర్వాత స్థానం వేంకటేశ్వరరావుదే అన్నంత ఎత్తుకు ఎదిగారు

"అయనలోని జీనియస్ ఏమిటంటే, అయనకు కొత్తపద్ధతుల్ని నటనలో పాతపద్ధతులుగానూ, పాతపద్ధతుల్ని కొత్త పద్ధతులుగానూ చూపించగల ప్రతిభ ఉండేది"[4] అని ప్రశంసించారు రాచకొండవారు

వెంకటేశ్వరరావుగారు నాటక ప్రయోక్తగా ఒక వైతాళికుడు అని చెప్పుకోవాలి అంటే, ఎన్నో కొత్త బాటలను, కొత్త ప్రయోగాలను చేశారు సంభాషణ ఒకటైనా లేకుండా ఆయన దర్శకత్వం వహించి ప్రదర్శించిన 'బెత్తం మనిషి'అందుకు తిరుగులేని ఉదాహరణ

వేంకటేశ్వరరావు ప్రదర్శించిన పావలా, త్రివేణి.బెత్తం మనిషి, విషాదం, కొడుకు పుట్టాల మొదలయిన నాటికలు, అసురసంధ్య, ఫణి, రాగరాగిణి, వీలునామా, ఆకాశరామన్న, మహానటుడు వంటి నాటకాలు వారి దర్శకత్వంలో విలక్షణతను చాటే ఉదాహరణలుగా చెప్పుకోవచ్చు

"1950 .60 మధ్యకాలంలో ప్రజానాట్యమండలి శక్తిమంతంగా లేదు ఆ లోటును వేంకటేశ్వరరావు, తన నాటకాలద్వారా, ప్రజానాట్యమండలి అదర్శాలను నిలబెట్టారు వేంకటేశ్వరరావు వాచిక విధానంతో, నడకతో, హావభావాలతో, సంభాషణల మధ్య వచ్చే కించిత్ విరామంలో విద్యుద్ఘాతంలా అతి వేగంగా మాట్లాడే సంభాషణలతో పాత్రలతో ఆడుకుంటాడు .ఆయన నటించిన

నాటకాలుగాని పాత్రలుగాని తాను లేకపోతే రక్తి కట్టేవికావు ఒకవేళ ఎవరైనా ప్రదర్శించినా వెంకటేశ్వరరావు,నాటక వాచికాభినయ విధానప్రభావం వారిమీద ఉండేది''

''తెలుగు నాట, నాటక ప్రక్రియ నూతన పద్ధతులు అనుసరించటానికి క శే ఆత్రేయ మార్గదర్శకుడైతే నటనలో వేగం, ఉచ్చారణలో స్పష్టత, ప్రత్యేకత తెచ్చింది శ్రీ వేంకటేశ్వరరావేనన్న విషయం అందరం ఒప్పుకొని తీరాల్సిందే''[6] అని ధ్రువీకరిస్తున్నారు ప్రసిద్ధ రంగస్థల దర్శకులు, రచయిత అయిన శ్రీ కె యస్ టి శాయి

''అయన నాటకాలు వేస్తున్నంత కాలం, నాటకానికి అయనే కర్త, కర్మ, క్రియగా, మారి, అంతవరకూ నాటకానికున్న రంగు, రుచి, వాసనల్ని మార్చి నాటకాన్ని కొత్త పంథాలోకి మార్చిన ట్రెండ్ సెట్టర్‌గా వేంకటేశ్వరరావు గారిని పేర్కొనాలి అయన తెలుగు నాటక రంగానికుండే పరిమితుల్ని, ప్రదర్శనావకాశాల్ని మాత్రమే దృష్టిలో పెట్టుకొని నాటకాన్ని ప్రదర్శించేవాడు రష్యాలో రంగస్థలం ఎంతో ఎదిగింది, అమెరికాలో మరీ ఎదిగిపోయింది అంటూ విదేశీ మాటలు చెప్పి, స్వదేశీనాటకాన్ని చిన్న చూపు చూడకుండా, చాలా పరిమితులకు లొబడి బ్రతుకుతున్న తెలుగు రంగస్థలం మీదే నాటకాన్ని బ్రతికించారు ఒక్క మాటలో చెప్పాలంటే, ఆయన చాలా ప్రాక్టికల్ దృష్టి వున్న ప్రయోక్త''[7] అన్న ప్రసిద్ధ నాటకకర్త కాశీ విశ్వనాథ్ గారి మాటలు ఆలోచించదగినవి

పాశ్చాత్య నాటక విధానాలను (థియేటర్ స్టయిల్స్) తెలుగు రంగస్థలంమీద ప్రవేశపెట్టి, అవి ఇక్కడి సంస్కృతికి సంప్రదాయాలకు విరుద్ధంగా, కృతకంగా ఉన్నా, " మేము కొత్త ప్రయోగం చేశాం చూడండి "అని సామాజికులచేత బలవంతపుమాఘ స్నానం చేయించి సంబరపడే ప్రయోక్తలు తెలుగు రంగస్థల పరిమితుల్ని దృష్టిలో ఉంచుకొని ప్రయోగాలు చెయ్యగలిగినపుడే ఆ నాటకానికి, ఆ ప్రయోగానికి గుర్తింపు, మనుగడ ఉంటుంది అలా కానపుడు కొత్తగా పుట్టే ప్రతి ప్రయోగానికి (ఎక్స్‌పెరిమెంట్) అదే తొలి ప్రదర్శన, అదే తుది ప్రదర్శన

అయ్యే ప్రమాదం ఉంది నిజానికి తెలుగు రంగస్థలంమీద ప్రదర్శితమైన పాశ్చాత్య ధోరణిగల నాటకాలలో అత్యధిక శాతం ఈ అగ్నిపరీక్షకు బలి అయిపోయినవే. నేలవిడిచి సాముచెయడం సముచితం కాదుగదా?

వేంకటేశ్వరరావు దర్శకత్వం వహించిన ప్రతి నాటకంలోనూ తెలుగుతనం ఉట్టిపడుతూ ఉండటం ప్రముఖంగా గుర్తుంచుకోవలసిన అంశం

నాటకరంగంలో ఒక కొత్త ప్రయోగం అనగానె రంగస్థలం మీద కళ్ళు చెదిరిపోయేటట్టు రంగాలంకరణ చెయ్యడమో, రంగస్థలంమీద లెవెల్స్ నిర్మించడమో లైటింగుతో విన్యాసాలు చేయించడమో, విదేశీ సరుకును తెచ్చి కొత్త లేబుల్ తగిలించి మసి బూసి మారేడుకాయలా చూపించడమో కాదు ఇప్పుడున్న ప్రదర్శనా రీతులకు భిన్నంగా కొత్త తనం చూపుతూ ప్రదర్శనలో విలక్షణత చూపే ఏ నూతనాంశమైనా ప్రయోగమే అలాంటి ప్రయోగం చేసిన వారిలో శ్రీ పామర్తి సుబ్బారావు అగ్రగామి పాత్ర పోషణలో మనస్తత్వం ముమ్మూర్తులా ప్రతిఫలించేటట్టు చేయటమే ఆ ప్రయోగం ప్రదర్శన చూసిన తరాత ఆ పాత్ర సామాజికుల గుండెల్లో ఇమిడిపోతుంది మనోవీథిలో అనుక్షణం సంచరిస్తూనే ఉంటుంది ఆ నాటకం ఆ పాత్రలు, ఆ సన్నివేశాలు మనసులో శాశ్వతంగా మెదులుతూనే ఉంటాయి ఆ ప్రదర్శనా ప్రభావంవల్ల అయితే దీనికి ప్రదర్శనా పటిమ ఒక్కటే కారణం అని చెప్పడం అన్యాయం రచనలోకూడా ఒక మెరుపు లేకపోతే ఇసుక తిన్నెల మీద సుందరభవన నిర్మాణం సాధ్యం కాదనే విషయం కూడా జ్ఞాపకం ఉంచుకొవాలి కొత్త ప్రయోగం చేసే ఏ దర్శకుడైనా రచన విషయంలో, తన లక్ష్య సాధనకోసం, ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటాడు

ప్రాయోగిక రంగస్థలి గురించి ప్రస్తావిస్తూ ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ గారు ఈ విధంగా వివరించారు

"ప్రాయోగిక రంగస్థలి పరిధిలోకి వస్తున్న ఈ ధోరణులన్నింటికీ తమదే అయిన ఒక ప్రత్యేకవ్యక్తిత్వం ఉంది, తత్త్వం ఉంది రచనా దృక్కోణం ఉంది ఒక్క మాటలో చెప్పాలంటే వీటి ప్రత్యేకతల్ని ప్రదర్శన శిల్పంపై ఎంత

ఆధారపడతాయో రచనశిల్పంపై కూడా అంతే ఆధారపడ్డాయి రచనా శిల్పం ఆధారంగానే ప్రదర్శనా శిల్పం రూపొందించబడుతుంది చాలా బలహీనమైన రూపానికి అలంకారాల భారం ఎంత మోపినా అది రూపాన్ని ప్రకాశింపచేయదు సరికదా, మరింత కుంగిపోయేలా చేస్తుంది రంగస్థలం మానసిక భాషలో మొదట రచనలో మాట్లాడుతుంది తర్వాత దృశ్యభాషలో ప్రదర్శనలో మాట్లాడుతుంది"[8] అన్నారు

నాటకరచన నిస్సారంగా ఉంటే ఎంత ప్రతిభగల దర్శకుడైనా ఆనాటకాన్ని రక్తికట్టించడం కష్టం అందువల్లనే పామర్తి సుబ్బారావుగారు దర్శకత్వం వహించి ప్రదర్శించిన నాటక నాటికల రచనా శిల్పంమీద దృష్టి సారించారు శ్రీ వేలూరి శివరామశాస్త్రి రచించిన 'సుల్తానీ' అనే రేడియో నాటికను తీసుకొని అచ్చమైన, అందమైన దృశ్యనాటికగా మల్చుకున్నారు ఆసాంతం తెలంగాణా మాండలికంలో ఆనాటికను తిరగదోడి రాశారు తెలంగాణా మాండలికంలో భాషలో మొదటిసారిగా నాటిక రావడం ఒక ఎక్స్‌పిరిమెంట్ కాగా, తెలంగాణా ప్రాంతంలో ప్రజల వేషభాషలు, సాంప్రదాయాలు, అలవాట్లు మొదలైన అన్ని అంశాలను బాగా అధ్యయనం చేసి, స్వయంగా పరిశీలించి, ఆ నాటికలో పొందుపరచటం కూడా ఆ ప్రయత్నంలో అంతర్భాగం అవుతుంది 'సుల్తానీ' లో అన్ని పాత్రలను సజీవ పాత్రలుగా మలచి ఆ నాటకాన్ని ఒక కళాఖండంగా మార్చారు పామర్తి ఒక పాత్ర మనస్తత్వాన్ని నిండుగా ఆవిష్కరించటానికి ఆ పాత్రను ఎంతవరకు సాగదీయాలో, ఎక్కడ కుదించాలో, ఆ పాత్ర మనస్తత్వం ప్రేక్షకులను పట్టుకునేలాగ ఎలాంటి దృశ్యాలను కల్పిస్తే సాధ్యమవుతుందో అనే రహస్యాలను శ్రీ పామర్తికి కరతలామలకం అందుకే మనస్తత్వాన్ని చిత్రించే నాటకాలకు ఆయన ఆద్యుడు అయ్యాడు

1942 సం॥లో స్థాపించబడి ఇప్పటికీ కొనసాగుతున్న శ్రీ ప్రభాకర నాట్యమండలి ద్వారా శ్రీ పామర్తి ఎన్నో ప్రయోజనాత్మకమైన నాటక నాటికలను ప్రదర్శింపజేశారు. ఆంధ్రనాటక కళాపరిషత్ పోటీలలో 'ఎవరు దొంగ', 'సుల్తానీ', 'చావకూడదు'

నాటికలను ప్రదర్శించి ఉత్తమ ప్రదర్శనకు బహుమతులు పొందారు ఆరు స్త్రీ పాత్రలతో కూడిన 'చావకూడదు' నాటికను ప్రదర్శించడానికి ఎంతో సాహసం కావాలి అన్నీ స్త్రీ పాత్రలతో నాటికను ప్రదర్శించటం కూడా పామర్తివారు నాటకరంగంలో చేసిన ఒక నూతన ప్రయోగంగా పరిగణించవలసి వస్తుంది 'చావకూడదు' నాటిక ప్రదర్శనకు ముందురోజు అనివార్యకారణాలచేత ఒక స్త్రీ పాత్రధారిణి రాలేకపోతే అప్పటికప్పుడు తన శ్రీమతికి తర్ఫీదు యిచ్చి 'చావకూడదు' నాటికను నిర్విఘ్నంగా నడిపించిన సాహసి శ్రీ పామర్తి పల్లె జీవితంలో పండిన అనుభవంతో పామర్తి 'పల్లె పడుచు' నాటకంలో పోషించిన 'గంగులు' పాత్ర ఆయన నటనావైదుష్యానికి అద్దం పడుతుంది ప్రకృతి పరిశీలనా శక్తి, మనస్తత్వ పరిశోధనా దక్షత వంటి లక్షణాలను పుణికి పుచ్చుకున్న మహానటుడాయన ఏ 'ఇజమ్స్' కు కట్టుబడకుండా తనదైన శైలిలో నాటక ప్రదర్శనలో వినూత్న ప్రయోగాలు చేసిన కళాభిజ్ఞుడు, ఉత్తమ దర్శకుడు శ్రీ పామర్తి సుబ్బారావు

తెలుగు నాటకరంగంలో విదేశీ నాటక పద్ధతులను, ముఖ్యంగా నాటకశైలులను (థియేటర్ స్టయిల్స్) తొలిసారిగా ప్రవేశపెట్టిన ఘనత శ్రీ ఎ ఆర్ కృష్ణకు దక్కుతుంది

"1967 లో ఎ ఆర్ కృష్ణ ఆస్కార్ వైల్డ్ నాటకం 'ఐడియల్ హజ్బెండ్'ను 'ఆదర్శమూర్తి' గా అనుసరించి నాట్య విద్యాలయం తరపున విస్తృతంగా ప్రయోగించాడు ఎ ఆర్ కృష్ణదే మరో అనుసరణ 'సంరక్షకుడు.' ఇది హెరాల్డ్ పింటర్ అనిబద్ధ రూపకం, 'కేర్‌టేకర్' కి స్వేచ్ఛానుసరణ మనిషిభావ పటిమలోని అస్పష్టతకు, అనిబద్ధతకూ సంకల్పంలోని బలహీనతకూ, సందేహానికి అద్దంపట్టే యీ నాటకం తెలుగు నాటకప్రయోగంలో ఓ కొత్త దృక్కోణాన్ని ప్రవేశపెట్టింది'

"ఎ ఆర్ కృష్ణ దర్శకత్వం వహించిన 'మాలపల్లి' వాస్తవిక పద్ధతిలో ప్రదర్శనా విధానాన్ని రూపొందిస్తూనే, ప్రతీకాత్మక పద్ధతుల్ని కూడా జోడించింది నాటక ప్రదర్శనకు అనువుగా ఉండడానికే కాక నాటక కథాగమనానికి ఒక 'బిగి' ని కూర్చిపెట్టు విధానం సైమల్టేనియస్ స్టేజింగ్ ఏకకాలంలో భిన్న సమతలాలమీద

కూర్చిన పలురంగ స్థల వేదికలమీద జరిగే ప్రదర్శన ఎ ఆర్ కృష్ణ 'మాలపల్లి' ప్రదర్శన విధానాన్ని తెలుగులో వాడుకొన్న ఏకైక ప్రయోగం కూడా - హైదరాబాదులోని ఆంధ్రేతర నాటకరంగం ఇప ఇటువంటి ప్రయోగాలు పెద్దఎత్తున జరుగుతున్నాయి "హోటల్ థియేటర్లో సాగిన ఎ ఆర్ కృష్ణగారి 'మాలపల్లి' నాటకం తెలుగు నాటకంలో నూతన ప్రయోగమని చెప్పొచ్చు పదిపన్నెండు సంఘటనల్ని చూపిస్తుంది ఇప్పటికే ఈ నాటకం 100 ప్రదర్శనలు పూర్తిచేయడం గమనించదగ్గది"[11]

శ్రీ ఎ ఆర్ కృష్ణ అబ్సర్డ్ థియేటర్ (అనిబద్ధనాటకం) ఎపిక్ థియేటర్ (ఐతిహాసిక నాటకరంగం) వంటి పాశ్చాత్య నాటకరీతుల్ని తెలుగు నాటకరంగానికి పరిచయం చేయడమేకాక, దేశీయ నాటక ప్రక్రియలు అయిన యక్షగానం వంటి కళా రూపాల పునరుద్ధరణకు పాటుపడ్డారు క్రీ శ 1684 1712 సంవత్సరాల నడుమ తంజావూరును పరిపాలించిన మహారాష్ట్ర రాజులలో ఒకడైన శహాజీ ఇరవైరెండు యక్షగాన ప్రాయరచనలు చేసినట్టు తెలుస్తున్నది క్రీ శ 1704 ప్రాంతంలో రచించిన 'సతిదాన శూరము' అనే యక్షగానాన్ని వెలికితీసి ఎ ఆర్ కృష్ణగారు తన నేతృత్వంలో ప్రదర్శించారు ఆ యక్షగానంలో పాతవాసనలు లేకుండా ఆధునీకరించి ప్రదర్శించారు

'మహావిష్ణువు యొక్క మహోత్సవము సేవింపవలసి యొక్క మాతంగస్త్రీరాగ, ఆమెను జూచి యొక బ్రాహ్మణుడు మోహించును ఆ బ్రాహ్మణునకు ఆమె భర్త దానిని ధారవోయగా, అతడు యధార్థ స్వరూపమునెరిగి మాయదొలగి సరియైన మార్గమునకు వచ్చుట యిందభివర్ణింపబడినది"[12] - ఇది సతిదానశూర యక్షగాన యితివృత్తం

ఆంధ్రప్రదేశ్ నాటకరంగానికి నటులుగా, దర్శకులుగా ఉత్తమసేవలు అందించిన మహనీయులలో చాట్ల శ్రీరాములు గారు ప్రథమ శ్రేణికి చెందినవారు ఇతర దేశాలలో తిరిగి పాశ్చాత్య నాటక విధానాలను అధ్యయనం చేసి వాటిని తెలుగులో ప్రవేశపెట్టిన కళాభిజ్ఞులు

శ్రీ చాట్ల శ్రీరాములు ప్రయోగాల పుట్ట ఏ నాటకాన్ని అయినా కొత్త పంధాలో ప్రదర్శించాలన్న తపన, పట్టుదల ఆయనలో మెండుగా ఉన్నాయి శ్రీరాములు గారి పేరు వినగానే కళాభిమానులకు మున్ముందు జ్ఞాపకం వచ్చే నాటకం 'మరో మహోంజోదారో' (రచన యస్ ఆర్ నంది)

"ధారంటన్ వైల్డర్ అనే అమెరికన్ రచయిత 'అవర్ టౌన్' అనే నాటకంలో కొత్త శిల్పం ప్రవేశపెట్టాడు రంగస్థలంమీద సామగ్రి లేకపోయినా ఉన్నట్టు ఊహించుకుని నటులు, నటించడం, నాటకం మధ్యలో నటులు ఫ్రీజ్ అయిపోవడం మొదలైన టెక్నిక్స్ ఇందులో ఉన్నయ్ ఈ నాటక ప్రభావం ఎన్ ఆర్ నంది రాసిన 'మరో మహోంజోదారో' నాటకం మీద బాగా వుంది ఈ టెక్నిక్‌లను వాడుకుని మంచి నేటివిటీ వున్న కథతో నాటకం నడిపాడు రచయిత జర్మన్ నాటక రచయిత, ప్రయోక్త బ్రెఖ్ట్ చెప్పిన ఎలియనేషన్ సిద్ధాంతం కూడా ఈ నాటకంలో ప్రొఫెసర్ పాత్రలో వాడుకున్నట్లు కనిపిస్తుంది అధునిక నాటకరంగంలో ఈ నాటకాన్ని దిగ్విజయంగా ప్రయోగించాడు దర్శకుడు శ్రీ చాట్ల శ్రీరాములు ఆ తర్వాత ఇదే పద్ధతిలో చాలా నాటకాలు, నాటికలు వచ్చినయ్ తాజీ, దారితప్పిన ఆకలి మొదలైనవి'[13]

కాగా యిక్కొడొక ముఖ్యవిషయం గమనించవలసి ఉంది ఎన్ ఆర్ నంది గారి 'మరో మహొంజొదారో' నాటకంలో ధారన్‌టన్ వైల్డర్, బ్రెఖ్టల టెక్నిక్‌లను, సిద్ధాంతాలను మాత్రమే పరిగ్రహించడటం జరిగింది కాని 'మరోమహొంజొదారో' పూర్తిగా స్వతంత్ర నాటకమే!

నాటకం వేళ్లు తెలుగునేలలో ఉన్నందువల్లనే తెలుగు ప్రేక్షకులకు ఆ నాటకం ఆదర్శప్రాయమైంది పాశ్చాత్య సిద్ధాంతాలను పులుముకొన్న ఏ నాటకమూ ప్రజాదరణ పొందలేదనేది ఒక చేదునిజం ఈ మాట ప్రాయోగిక రంగస్థలికి ప్రధానంగా వర్తిస్తుంది

పాశ్చాత్య నాటక సిద్ధాంతాలను తెలుగువారికి పరిచయం చేసే కృషిలో ఒక భాగంగా శ్రీరాములుగారు, యండమూరి వీరేంద్రనాథ్, గొల్లపూడి మారుతీరావు,

డి ప్రభాకర్ గారల చేత కొన్ని నాటకాలు రాయించి తన దర్శకత్వంలో విజయవంతంగా ప్రదర్శింపజేశారు

"యూజినీ ఐనెస్కో 'ది ఛైర్స్' ఆధారంగా యండమూరి వీరేంద్రనాథ్ 'నిశ్శబ్దం నీకూ నాకూ మధ్య' అనే నాటకం రాశారు తెలుగు వాతావరణానికి యీ 'అస్పష్టత' అందడం కొంచెం కష్టమైంది అయితే అంతకు చాలా సంవత్సరాలముందు రాజమండ్రి లలితకళానికేతన్‌లో ప్రత్యేక నాటికగా ప్రదర్శించడం కోసం మారుతీరావు రాసిన నాటిక 'కాలం వెనక్కు తిరిగింది' యీ 'ఛైర్స్' కారణంగా ప్రభావితమైందే మారుతీరావు యీ నాటికలోని సంఘర్షణని తెనిగీకరించడంలో కృతకృత్యుడయాడు" [14]

పీటర్ షాఫర్ రచన 'బ్లాక్ కామెడీ'ని శ్రీ యండమూరి 'డామిట్ కథ అడ్డం తిరిగింది!' పేరుతో అనువదించగా ఆ నాటకాన్ని శ్రీ చాట్ల దర్శకత్వంతో ప్రదర్శింజేశారు మనిషిలోని 'చీకటి'ని ప్రేక్షకుడికి చూపించడానికి రంగస్థలంపై 'వెలుగు' కావాలి చీకటిని వెలుగుగా - వెలుగును చీకటిగా భావించి నటులు నటించగలగడం ఈ నాటకంలో క్లిష్టమైన ప్రయోగం ఈ నాటకాన్ని ప్రదర్శించటంలో రంగోద్దీపనలో మెళకువలు పాటించి అనన్య సామాన్య ప్రతిభను చూపారు శ్రీ చాట్ల

శ్రీరాములుగారి దర్శకత్వంలో ప్రదర్శితమైన మరొక ప్రయోగాత్మకమైన నాటకం 'లావొక్కింతయులేదు' ఇది బ్రెఖ్ట్ నాటకం ఎక్సెప్షన్ అండ్ ద రూల్ కి అనుసరణ రచయిత శ్రీ డి ప్రభాకర్ ఈ నాటకం ద్వారా 'తాదాత్మ్యవిచ్ఛిత్తి' వాదం ఆంధ్రదేశానికి అందించబడింది

విద్యానగర్ కల్చరల్ ఎసోసియేషన్ వారు చిరంజీవి (ఆకాశవాణి) ప్రోద్బలంతో తెలుగులోకి తీసుకువచ్చిన రష్యన్ నాటకం 'ది లాస్ట్ అప్పాయింట్‌మెంట్' తెలుగులోకి కీ శే. ఆకెళ్ల 'సత్యకామేష్టి' పేరుతో అనుసరణ చేశాడు వాస్తవిక వాదంలో రాయబడ్డ యీ నాటకంలో వాస్తవికానికి విరుద్ధమైన పాత్రను సృష్టించాడు రచయిత నిజజీవితంలో యిటువంటి వ్యక్తి వుండకపోతే వుండితీరాలి అని

ప్రతిపాదిస్తాడు యీ మూలంలో రష్యన్ నాటకకర్త "మనిషిలో మంచి మొగ్గతొడగాలి ప్రేమవెల్లి విరియాలి సేవాధర్మం అంటు కట్టాలి"[16] అని ప్రవచిస్తుందీ నాటకం

శ్రీ గొల్లపూడి మారుతీరావు రచించిన 'లావాలో ఎర్రగులాబీ' ఒక ప్రయోగాత్మక నాటకం చాట్ల శ్రీరాములు గారి దర్శకత్వంలో ఈ నాటకం మొదటిసారిగ ప్రదర్శించబడింది " మనిషి కదలికల్ని ఒకచోటనుండి మరొకచోటికి నడుస్తూ కాక ఒక ఇన్‌వాలీడ్స్' వీల్ ఛైర్‌లో కదిలే ఏర్పాటుచేసి ఒక పాత్రలో ఉన్న భావోద్రేకాన్ని వీల్ ఛైర్ మూమెంట్ ద్వారా చూపించడం"[16] ఈ నాటక ప్రదర్శనలోని కొత్త ప్రయోగం

చాట్ల శ్రీరాములుగారు నాటకరంగంలో ఎన్నో వినూత్న ప్రయోగాలు చేసి నాటకరంగ వికాసానికి ఎనలేని సేవచేశారు, చేస్తున్నారు

శామ్యూల్ బెకెట్ (వైటింగ్ ఫర్ గోడాట్) అనే నాటకాన్ని 'గోడో కోసం నిరీక్షణ' అన్న పేరుతో అనువదించారు యం ఎన్ శర్మగారు ఇదే తెలుగులో వెలువడిన మొదటి అనిబద్ధనాటకం (అబ్సర్డ్ ప్లే) గ్రీకు భాషలో సోఫోక్లిస్ రాసిన 'ఈడిపస్ ద కింగ్' నాటకాన్ని 'రాజా ఈడిపస్'గా అనువదించారు గ్రీకు సంప్రదాయ పద్ధతుల్ని దృష్టిలో ఉంచుకుని ప్రయోగించిన ఈ నాటకం 2,500 సంవత్సరాల నాటి గ్రీకు ప్రయోగ పద్ధతిని గీటురాయిగా నిలిచింది 1983లో హైదరాబాద్ కోటీ, ఉమెన్స్ కాలేజి ఆవరణలో ఆర్కిటెక్చర్‌ని ఉపయోగించుకుని ఆరుబయట మూడురోజులపాటు వరుసగా యిది విజయవంతంగా ప్రదర్శింపబడింది

శర్మగారు అభివ్యక్తీకరణ (ఎక్స్‌ప్రెషన్స్) ధోరణిలో 'నరజాతి చరిత్ర' అనే నాటకాన్ని వ్రాసి, స్వీయదర్శకత్వంలో ఉస్మానియా విశ్వవిద్యాలయ నాటకశాఖ విద్యార్థులచేత ప్రదర్శింపజేశారు

దరిమిలా ఈ నాటకం పేరు 'దొరా నీ సావు మూడింది' గా మార్చారు జానపద కళాప్రక్రియల్లో ఒకటైన పంబకథను ఈ నాటకంలో రచయిత ఉపయోగించారు

శ్రీ కె చిరంజీవి రాసిన 'నీలిదీపాలు' నాటకంలో కూడా ఇటువంటి ప్రక్రియ వాడుకున్నారు ఈ నాటకంలో బుర్రకధ ద్వారా ఎలియనేషన్ ఎఫెక్టును సాధించారు

' జానపద నాటకశైలీ విధానాన్ని తమ అధునాతన నాటకాలకు అనువుగా మార్చుకొన్న కొందరు రచయితలూ దర్శకులూ వున్నారు దేశిరాజు హనుమంతరావు 'రుద్రవీణ'లో (రచన-వీరేంద్రనాధ్) దీని సార్థకత సూచించారు అత్తిలి కృష్ణారావు (రచన-దర్శకుడు) 'తూర్పురేఖలు'లో దీని విస్తృతిని నిర్వచించాడు చాట్ల శ్రీరాములు 'త్రిజాకీయమదర్శనం'లో (రచయిత-అబ్బూరి గోపాలకృష్ణ) దీని వైవిధ్యాన్ని ప్రదర్శించాడు. హరనాధరావు (దర్శకుడు-రచయిత) తమ 'యక్షగానం' లో దీని అంతర్యాన్ని వ్యక్తీకరించాడు నాగభూషణ శర్మ 'నరజాతిచరిత్ర'లోను, 'కాయితంపులి'లోను దీనికి పరిపుష్టత సాధించాడు అయితే యీ శైలిలో యింకా పటిష్టమైన ప్రయోగాలు జరగడానికి ఎంతైనా అవకాశం వుంది" [17]

మూకాభినయ పద్ధతిని కూడా ఈ రోజుల్లో మన దర్శకులు విరివిగా నాటకాల్లో వాడుతున్నారు 'మైమ్' (మూకాభినయం)ను మొదట ప్రచారంలోకి తెచ్చిన ఘనత గిడుతూరి సూర్యం గారికి దక్కుతుంది 'శాంతి', మానవుడు చిరంజీవి' వంటి మూకాభినయ నాటికలను వ్యాప్తిలోకి తెచ్చింది గిడుతూరి సూర్యంగారే ఇప్పుడు 'మైమ్', నాటకాల్లో విస్తృతంగా వాడబడుతూంది అత్యాధునిక నాటక రంగంలో 'మైమ్' విధానాన్ని ప్రచారంలోకి తెస్తున్నవారిలో శశిమోహన్ (కోహినూర్) తల్లావఝుల సుందరం(సైలెన్స్ ప్లీజ్) పేర్కొనదగినవారు

ఈ దశాబ్దపు ప్రదర్శనాశైలుల్లో కొత్తగా ఆవిర్భవించిన నాటక ప్రక్రియ ఆధునిక వీధి నాటకం దేశీయ జానపద కళారూపాల్లో ఒకటిగా అనాదిగా వస్తున్న వీథి నాటకానికి ఈ ఆధునిక వీథినాటకం స్వరూప స్వభావాలో భిన్నమైంది

"ప్రయోగాల పుట్టిల్లు అయిన ఆంధ్ర విశ్వవిద్యాలయం నాటక విభాగం వారు 1974లో శ్రీ అత్తిలి కృష్ణారావు వ్రాసిన 'యుగసంధ్య' నాటికను విశాఖపట్నం వీధుల్లో ప్రదర్శించడంతో ఆధునిక వీథినాటకరంగం ఆవిర్భావానికి నాంది

జరిగింది ఆ విధానం ఎంతో విజయవంతం కావడంతో శ్రీ అత్తిలి నేతృత్వంలో శ్రీ పరుచూరి వెంకటేశ్వరరావు వ్రాసిన 'దారితప్పిన ఆకలి' నాటికను వీథినాటికగా ప్రదర్శించారు "[18] అప్పటినుంచి ఆధునిక వీథినాటికల జోరు ప్రారంభమైంది వీధినాటకాలను చేపట్టి ఆ ప్రక్రియను ప్రాచుర్యంలోకి తెచ్చిన వారిలో తనికెళ్లభరణి, తల్లావఝుల సుందరం, ట జె రామనాథం, బి బాబూరావు, పి పూర్ణచంద్రరావు ప్రభృతులు ముఖ్యులు

ఆధునిక వీధినాటకాలను గురించి తరువాతి అధ్యాయంలో పరిశీలించడమైనది

నాటకప్రగతిని అంచనా వెయ్యాలన్నా, నాటక రంగంలో వినూత్న ప్రయోగాలు చేస్తున్న దర్శకుల ప్రతిభావ్యుత్పత్తుల వైశిష్ట్యాన్ని అవగాహన చేసుకోవాలన్నా, రాష్ట్రంలో పలు ప్రాంతాలో పరిషత్తు పోటీలలో ప్రదర్శితమవుతున్న నాటక నాటికలే ఆధారభూతమవుతున్నాయి

పరిషత్తు వేదికల మీద కాక, విడిగా ప్రదర్శించబడే నాటకాల సంఖ్య నానాటికీ పరిమితమైపోతున్న ఈ రోజుల్లో, నూతనాంశాల పరిశీలనకు గీటురాళ్లు పరిషత్తు వేదికలే అన్న విషయం స్పష్టమవుతున్నది

## పరిషత్తు నాటకాలు - నూతన ప్రయోగాలు

కనుక పరిషత్తు నాటకాలను ప్రమాణంగా తీసుకుని దర్శకులు చేసిన నూతన ప్రయోగాలను ఇక్కడ క్రోడీకరించడం జరుగుతుంది

ఈ దశాబ్దంలో (1980 - 90 సం లలో) వివిధ పరిషత్తుల్లో 188 నాటక, నాటికలు పోటీలకు ఎంపిక కాబడి ప్రదర్శితమైనవి కాగా, ప్రతి పరిషత్తు ప్రాథమిక పరిశీలకులకు వివిధ సమాజాలవారు సుమారు వ్యూటినీకి ప్రదర్శించారు

కనుక ఈ దశాబ్దిలో కనీసం 80 మంది దర్శకులు తెలుగు నాటకరంగాన్ని తమ కొత్త ప్రయోగాలతో సుసంపన్నం చేశారని చెప్పవచ్చు పోటీలలో ఎన్నిక

కావాలంటే అసాధారణ ప్రజ్ఞ కనబరచవలసి వుంటుంది అందుకోసం ప్రతి దర్శకుడు ప్రత్యేకమైన మార్గాలను అన్వేషించి, నూతన ప్రయోగాలలో ప్రదర్శనకు కొత్త అందాలుదిద్ది తన ప్రత్యేకతను స్థాపించుకోవాలని ఆశిస్తాడు. ప్రయత్నిస్తాడు అలా కొత్తపుంతలు తొక్కి ఒక వరవడికి మార్గ దర్శకులైన వారి కృషిని ఇక్కడ ప్రస్తావించడం జరుగుతూంది

19వ శతాబ్దంలో పాశ్చాత్య నాటకరంగంలోని వాస్తవికతావాదం మన తెలుగు నాటకరంగాన్ని ప్రభావితం చేసింది 1930 సం లో బళ్లారి రాఘవతో ప్రారంభించిన 'తప్పెవరిది' నాటకం మొదలుకొని ఈనాటి 'హిమాగ్ని' నాటిక వరకు తెలుగు దర్శకుడు వాస్తవికశైలికే పట్టం కట్టాడు 80 మంది దర్శకులలో 60 మంది దర్శకులు వాస్తవికతాశైలిలో నాటకాలను ప్రదర్శిస్తే, 20 మంది దర్శకులు మాత్రం నూతన ప్రయోగాలతో (న్యూ ఎక్స్‌పిరిమెంట్స్) నాటకాలను ప్రదర్శించి నాటకరంగాన్ని ప్రభావితం చేశారు

దశాబ్దానికి ముందు కాలంలోనే సర్వశ్రీ అబ్బూరి రామకృష్ణారావు, ఎ ఆర్ కృష్ణ, మంత్రి శ్రీనివాసరావు, కె వెంకేశ్వరరావు, జె వి. రమణమూర్తి, డి రాజేశ్వరరావు, దేశిరాజు జగన్నాధరావు, గరికపాటి రాజారావు, కోడూరి అచ్చయ్య చౌదరి, చాట్ల శ్రీరాములు, కె సూర్యనారాయణ మూర్తి, టి శివరామకృష్ణారావు, యస్.కె అంజనేయులు, డా క్షీరసాటి గంగాధరరావు, బి భానుప్రకాశ్ వంటి ఉద్దండులు దర్శకత్వంలో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పిన ఉత్తమ దర్శకులుగా లబ్ధ ప్రతిష్ఠులు వీరందరూ నాటక రంగంలో నూతన ప్రయోగాలు చేసిన నిష్ణాతులే! వీరిలో కొందరు ఈనాటికీ.. దర్శకత్వం చేస్తూనే ఉన్నారు అయితే ప్రత్యేకంగా 1980- 90 మధ్యకాలంలో వచ్చిన ప్రయోగాలనే పరిశీలించవలసివస్తే ఈ క్రింది విధానాలు ప్రస్ఫుటంగా అగుపిస్తాయి

1 తెలుగు నాటకంలో సాముదాయక నటనను (ఎన్‌సంబుల్డ్ ఏక్టింగ్) ప్రవేశపెట్టిన దర్శకులు పిల్లా సన్యాసిరావు, జరుగుల రామారావు, ధవళ సత్యం, టి జె. రామనాధం, డి యస్ ఎన్. మూర్తి గారలు

2 మనస్తత్వ నటనకు ప్రాధాన్యత ఇచ్చిన దర్శకులు ఇసుకపల్లి మోహనరావు, టి శివరామకృష్ణారావు, కె సూర్యనారాయణమూర్తి, కె శ్రీహరిమూర్తి, దేశిరాజు హనుమంతరావు, యస్ కె ఆంజనేయులు, భాస్కరచంద్ర, పామర్తి మొదలైనవారు

3 సంగీతాన్ని ఒక భాషలా ప్రయోగించి ప్రయోజనం చేకూర్చిన దర్శకులు అత్తిలి కృష్ణారావు, ధవళ సత్యం, ఎల్ సత్యానంద్, కె వెంకటేశ్వరరావు

4 ప్రహసన ధోరణి పున సృష్టించి, నాటకానికి ఒక వేగాన్ని కల్పించిన దర్శకులు టి శివరామకృష్ణారావు, టి సుందరం, చంద్రశేఖరరావు, పి టి మాధవ్ ప్రభృతులు

5 తెలుగు నాటకరంగంలో శారీరకాభినయం (ఫిజికల్ థియేటర్) ను ఉధృతంగా ఉపయోగించి ప్రేక్షకులను సంభ్రమాశ్చర్యంలో ముంచిన దర్శకులు కె కె ఎల్ స్వామి, ఎల్ సత్యానందం, తల్లావఝుల సుందరం, ఎ ఎస్ గోపాలకృష్ణ మొదలగువారు

6 తెలుగు నాటకరంగంలో "ఫ్రీజ్" కు చక్కని ప్రయోజనాన్ని కల్పించిన దర్శకులు చీకోటి వినోద్ కుమార్, డి 'యస్ ఎన్ మూర్తి, భాస్కర్ శివాల్కర్, విద్యాసాగర్ తదితరులు

7 నాటకరంగంలో 'ప్రతీకవాదం' ప్రయోగించిన దర్శకులు మిశ్రో, దేశిరాజు హనుమంతరావు, చాట్ల శ్రీరాములు, టి శివరామకృష్ణ, తల్లావఝుల సుందరం ప్రభృతులు

8 అనిబద్ధవాదాన్ని ప్రయోగించిన దర్శకులు ఎ ఆర్ కృష్ణ, దేశిరాజు హనుమంతరావు, మొదలగువారు

9 తెలుగులో 'ఐతిహాసికనాటకశైలి' (ఎపిక్‌థియేటర్) ప్రయోగించినవారు జి ఉదయభాను, ప్రసాదమూర్తి, చాట్ల శ్రీరాములు, భాస్కర్ శివాల్కర్

10 తెలుగు నాటకంలో సృజనాత్మక ప్రక్రియలను ప్రయోగించి, నూతన జిమ్మిక్కులతో విజయవంతంగా ప్రదర్శించిన దర్శకులు బి భానుప్రకాశ్, జి యస్ ఆర్ కె శాస్త్రి, మిశ్రో, నాయుడు గో పి కె మందుల, కె జి ఆర్ గాంధి, భాస్కరచంద్ర, జరుగుల రామారావు, నందిరాజు సుబ్బారావు, నెమలికంటి, కె యస్ టి. శాయి, కృష్ణచైతన్య మొదలైనవారు

11. ఎజిట్‌ప్రోప్ (ఉద్యమప్రచార) పద్ధతిలో, డాక్యుమెంటరీ విధానంలో ప్రయోగించిన దర్శకులు ఈ శైలిని గతంలో గరికపాటి రాజారావు, రక్తకన్నీరు నాగభూషణం ప్రయోగించారు వర్తమానంలో టి జె రామనాధం, పసుపులేటి పూర్ణచంద్రరావు, తల్లావఝుల సుందరం, టి. శివరామకృష్ణారావు, ధవళ సత్యం, డి.యస్.యన్ మూర్తి, ఉదయభాను, భాస్కర్ శివాల్కర్, దేశిరాజు హనుమంతరావు ప్రభృతులు ముఖ్యులు

12. తెలుగునాటకంలో సాంకేతిక ప్రజ్ఞను ఎక్కువగా ప్రదర్శించిన దర్శకులు యస్ కె మిశ్రో, శాంతారామ్, శ్రీహరిమూర్తి, జి ఉదయభాను, దేశిరాజు హనుమంతరావు, దశికరామ్ మొదలగువారు

13. అటు రంగోద్దీపన (లైటింగ్)లోను, అటు దృశ్యపరికల్పన (సీనిక్ డిజైన్)లోను సవ్యసాచిత్వం నెరపిన సాంకేతిక ప్రజ్ఞ కల దర్శకులు టి శివరామకృష్ణారావు, డా.ఎస్ రామారావు, అబ్బూరి గోపాలకృష్ణ, జి ఉదయభాను, ఎల్ సత్యానంద్, అడవి శంకరరావు, దశికరామ్, చాట్ల శ్రీరాములు, కె శ్రీహరిమూర్తి, గారలు. వస్తువుతోపాటు, రూపానికి కూడా ప్రాధాన్యతనిచ్చి ప్రదర్శనలల్లో అఖిల భారత స్థాయిలో బహుమతులు సంపాదించిపెట్టారు

ఈ విధంగా ఎందరో మహానుభావులు సాగించిన, సాగిస్తున్న కృషి ఫలితంగా సమకాలీన నాటకరంగం నవనవోన్మేషంగా ప్రగతిపథంలో ముందుకు సాగిపోతూ ఉంది

# 1980 - 1990 దశాబ్ది దర్శకులు

శ్రీయుతులు

1 చాట్ల శ్రీరాములు (హైదరాబాద్)

2. ఎ మోహనరావు (హైదరాబాద్)

3 దేశిరాజు హనుమంతరావు (హైదరాబాద్)

4 డి యస్ ఎన్ మూర్తి (హైదరాబాద్)

5 డి రాజేశ్వరరావు (హైదరాబాద్)

6 కె యస్.ఎన్ మూర్తి (హైదరాబాద్)

7 కె శ్రీహరిమూర్తి (హైదరాబాద్)

8 తాళ్లూరు శివరామకృష్ణారావు (హైదరాబాద్)

9 టి జే రామనాధం (ధవళేశ్వరం)

10 అబ్బూరి గోపాలకృష్ణ (విశాఖపట్టణం)

11 రావి వెంకటచలం (జంషెడ్‌పూర్)

12 యమ్ వి యస్ హరనాధరావు (ఒంగోలు)

13 భానుప్రకాశ్ (హైదరాబాద్)

14 జరుగుల రామారావు (యడ్లపాడు)

15 భాస్కర శివాల్కర్ (హైదరాబాద్)

16 కె. మందులు (విశాఖపట్టణం)

17. విద్యాసాగర్ (హైదరాబాద్)

18 బివి చంద్రశేఖర్ (నరసరావుపేట)

19. జె సిద్ధప్పనాయుడు. (హైదరాబాద్)

20 కొత్తూర్తి భాస్కరరావు (విశాఖపట్టణం)

21 కె కె యల్ స్వామి (గరివిడి - శ్రీరాంనగర్)

22 బి పి ప్రసాద్ (హైదరాబాద్)

23 నెమలికంటి (రామచంద్రపురం, హైదరాబాద్)

24. మిశ్రో (విశాఖపట్టణం)

25 పిళ్లా సన్యాసిరావు. (విశాఖపట్టణం)

26 ఎల్. సత్యానంద్ (విశాఖపట్టణం)

27. జవ్వాది రామారావు. (నిడదవోలు)

28. అయ్యల సోమయాజుల గోపాలకృష్ణ

29. తల్లావఝుల సుందరం (హైదరాబాద్)

30. ఇసుకపల్లి మోహనరావు (ఒంగోలు)

31 యం సంజీవి (విజయవాడ)

32 కె యస్.టి శాయి (బాపట్ల)

33 తాతాజీ. (సామర్లకోట)

34. ధవళ సత్యం (తాడేపల్లిగూడెం)

35. దీన్‌బద్రు (హైదరాబాద్)

36 పి వి యస్.యన్ పాత్రో (హైదరాబాద్)

37. యం.జి ప్రసాద్ (హైదరాబాద్)

38. అమరేంద్ర. (హైదరాబాద్)

39. చీకోటి వినోద్‌కుమార్ (హైదరాబాద్)

40 వి యస్ కామేశ్వరరావు (హైదరాబాద్)

41 కృష్ణచైతన్య (విశాఖపట్టణం)

42. నిమ్మకాయల. (విశాఖపట్టణం)

43 సి హెచ్ కబీరుదాస్. (విజయవాడ)

44 కొల్లా రాధాకృష్ణ (చిలకలూరిపేట)

45 జలకం రాధాకృష్ణయ్య (చిత్తూరు)

46 బాలచందర్ (అనంతపురం)

47 ఆర్.వి. రమణరావు (సామర్లకోట)

48. సయ్యద్ హమ్మద్ (కర్నూలు)

49 పి వీ భవానీ ప్రసాద్ (కర్నూలు)

50 యస్ కృష్ణకుమార్ (రాజంపేట)

51 రాంకుమార్ (బి హెచ్ ఇ.ఎల్, హైదరాబాద్)

52 జి యస్ ఆర్ కె శాస్త్రి (హైదరాబాద్)

53 బంగారురాజు (విశాఖపట్టణం)

54 జే యస్ రాజశేఖర్ (ఒంగోలు)

55 నాయుడుగోపి(పెదకాకాని)

56 కె బలదేవ్ సింగ్ (కర్నూలు)

57 కె మధుబాబు (విజయవాడ)

58 డా పి వేణు (గూడూరు)

59 కంచర్ల సూర్యప్రకాశరావు (శ్రీకాకుళం)

60 గంటా సత్యనారాయణ (విజయనగరం)

61 పి రాజకుమార్ (విజయనగరం)

62. కురుమెళ్ల శంకరరావు (విజయవాడ)

63 యం. ప్రసాదమూర్తి (రాజమండ్రి)

64 టి.వీ. మణికుమార్ (ధవళేశ్వరం)

65 నుసుముకోటి శివ (గుంటూరు)

66 కావూరి సత్యనారాయణ (గుంటూరు)

67 నానిబాబు. (విశాఖపట్టణం)

68 అనంతహృదయరాజ్ (విజయవాడ)

69 అర్జా సూర్యప్రకాశరావు (విజయవాడ)

70 టి మురళీకృష్ణ (విజయనగరం)

71 వేముల మోహనరావు (ఒంగోలు)

72 సి యస్. నాథన్ (కాకినాడ)

73 వరికూటి శివప్రసాద్ (గుంటూరు)

74. వై యస్. కృష్ణేశ్వరరావు (నిడుబ్రోలు)

75 ఎం.సి దాసు (విజయవాడ)

76 శిఖరం సాంబశివరావు (హైదరాబాద్)

77 భాస్కరచంద్ర (విజయవాడ)

78 నాంపల్లి మధుబాబు (వరంగల్)

79. నండూరి భీమశంకరం (విశాఖపట్టణం)

80 యం ఏ ఖాదర్ (నెల్లూరు)

81 కొండవలస లక్ష్మణరావు (విశాఖపట్టణం)

82 జి ఉదయభాను (హైదరాబాద్)

83 ఉప్పులూరి సుబ్బరాయ శర్మ (హైదరాబాద్)

84 శాయన్న (నిజామాబాద్)

85 బి. వేణుగోపాల్ (వెంకటగిరి)

86 చంద్రయ్య (నెల్లూరు)

87. కె వెంకటేశ్వరరావు (విశాఖపట్టణం)

88 మల్లాది శివన్నారాయణ (చిలకలూరిపేట)

89. గద్దే సత్యనారాయణ (మర్చూరు)

90 శ్రీరాముల సత్యనారాయణ (కరీంనగర్)

91 తిరుమలయ్య (వరంగల్)

92 రాజిరెడ్డి (వరంగల్)

93 నూతులపాటి సాంబయ్య (సత్తెనపల్లి)

94 డి సోమేశ్వరరావు (హైదరాబాద్)

95 పి టి మాధవ్ (విశాఖపట్టణం)

96 ఇ రాజ్‌కుమార్ (చిలకలూరిపేట)

97 అన్నమనేని ప్రసాద్ (ఒంగోలు)

98 కే వీ ప్రసాద్ (నరసరావుపేట)

99 శ్రీ కంరా హనుమంతరావు (హైదరాబాద్)

100 ఏ శివరామరెడ్డి (నూతక్కి)

101 పి దాస్ (పాలకొల్లు)

102. డా॥ పి బ్రహ్మానందరావు (విజయవాడ)

103 ఏ వి మల్లేశ్వరరావు (కావలి)

104 వి బి కె శర్మ (వకోటివారిపాలెం)

105 రమణప్రభు (హైదరాబాద్)

106 ఎస్ వి ఆర్ చిన్నీ (తణుకు)

107 ఆర్ భరద్వాజ (కొత్తపట్నం)

108 రావూజీ (విశాఖపట్టణం)

109 విగ్రహాల రామారావు (హైదరాబాద్)

110. పరివాడ శ్యాంప్రసాద్ ( విజయనగరం)

# ఎనిమిదవ ప్రకరణం

## ఆధునిక వీధి నాటికలు

నాటక రచనా విధానంలో ఒక కొత్తమలుపు, ఒక వినూత్నప్రక్రియ ఆధునిక వీధి నాటకం 1974 సంవత్సరంలోనే ఈ ఆధునిక వీధినాటకం ఆవిర్భవించినప్పటికీ ఆ ప్రక్రియకు ప్రాచుర్యం లభించింది ఈ దశాబ్దిలోనే - అంటే 1980-90 మధ్యకాలంలోనే

వీధి నాటకం అనే కళారూపం ఆంధ్రదేశంలో ఇదివరకు లేనిదికాదు ప్రాచీన జానపద కళారూపాల్లో వీధి నాటకం అత్యంత ప్రజాదరణ పొందిన కళారూపం

వీధి నాటకానికి ముందు 'కొరవంజి' అనే అతిప్రాచీన జానపద కళారూపం జానపదులను అలరిస్తూ ఉండేది ఆంధ్ర, కన్నడ, తమిళదేశాలలోని ఆటవికుల జాతికి కురవలనిపేరు వీరినే కొరవ, కురవ, గొరవ, గొరగ అనే పేర్లతో కూడా పిలుస్తుంటారు అంజె అంటే చిందు అని అర్థం కొరవ జాతివారి అంజె కాబట్టి ఆ నాట్యప్రక్రియకు 'కొరవంజి' అని పేరొచ్చింది కిరాతార్జునీయం, నరసింహస్వామి చెంచులక్ష్ముల కథ వంటివి ఈ కొరవంజులలో కథావస్తువులుగా ఉండేవి ఈ కొరవంజులలో గేయభాగం తక్కువగాను, నృత్యభాగం ఎక్కువగానూ ఉండేది

## యక్షగానం

సుమారు 12 వ శతాబ్దం నుంచీ యక్షగానం అనే మరొక కళారూపం జనపదంలోకి అడుగుపెట్టింది జక్కులు లేక యక్షులు అనబడే కొండజాతివారు కొరవంజి అనే కళారూపానికి ఆకర్షితులై దాని ప్రభావంతో 'జక్కుల పాట' లేదా 'యక్షగానం' అనే మరొక కళారూపాన్ని తమదైన బాణీలో రూపొందించుకున్నారు జక్కులు గానప్రియులు కావడం వల్లనేమో వారి 'యక్షగానం' లో నృత్యానికంటే గానానికి అధిక ప్రాధాన్యమిచ్చారు

'కొరవంజి' లో వస్తువు ప్రకృతిదేవతలకు, స్థలపురాణాలకు, వీరులకు సంబంధించినది కాగా, 'యక్షగానం' లో వస్తువు పౌరాణిక కథలకు రాజుల కథలకు సంబంధించింది ఈ యక్షగానాలను ఉత్సవ సందర్భాలలో ప్రదర్శించడమే గాక రాజసభల్లోను, శైవక్షేత్రాలలోను, వైష్ణవక్షేత్రాలలోను ప్రదర్శించేవారని తెలుస్తోంది యక్షగానాలలో ఏలలు, జోలలు, సువ్వాలలు, రతులు, ధవళాలు, చందమామసుద్దులు, విరాళిపదాలు, తుమ్మెదపదాలు, గొబ్బిపదాలు, కోవెలపదాలు, చిలుక పదాలు, అల్లోనేరేళ్లు అంతర్భాగమై ఉండేవి కాలక్రమేణా ఈ 'యక్షగానాలు' పామరుల చేతుల నుంచి రాజాస్థానాలకు ప్రాకాయి 15వ శతాబ్దం నాటికి యక్షగానాలకు పండితాదరణ లభించింది తంజావూరు, మధుర నాయకుల కాలంలో యక్షగానాలకు కావ్యగౌరవం లభించింది 17,18 శతాబ్దాలలో యక్షగానాలు తామరతంపరగా వర్ధిల్లడమే కాక పరిపక్వ దశకు వచ్చాయి

తంజావూరు నాయక రాజులలో నాల్గవవాడైన విజయరాఘవ నాయకుడు (క్రీ శ 1633-73) కాలంలో ఆంధ్రవాఙ్మయం ముఖ్యంగా యక్షగానం మూడుపూవులు ఆరుకాయలుగా వర్ధిల్లింది ఇతడు కవిపండిత పోషకుడే కాక స్వయంగా కవి 29 యక్షగానాలను రచించారు కాళీయ మర్దనం, ప్రహ్లాద చరిత్ర, పూతనా హరణము, విప్రనారాయణ చరిత్ర, రఘునాథాభ్యుదయం అనే యక్షగానాలు మాత్రం ప్రస్తుతం లభ్యమౌతున్నాయి వివిధ కవులు రాసిన యక్షగానాలు వందల సంఖ్యలో వెలువడినాయి సంగీత వాగ్గేయకారుడైన త్యాగరాజు భక్తిభరితాలైన పెక్కు కీర్తనలే కాకుండా 'ప్రహ్లాద విజయము', నౌకా విజయము' అనే రెండు యక్షగానాలను కూడా రచించారు విజయరాఘవుని కొలువునలరించిన విదుషీమణులలో రంగాజమ్మ అగ్రగణ్య ఈమె రచించిన మన్నారు దాస విలాసము' ప్రసిద్ధికెక్కిన యక్షగానం

తంజావూరు నాయకరాజుల తర్వాత మహారాష్ట్ర రాజుల పరిపాలన తంజావూరిలో స్థిరపడి క్రీ శ 1675 మొదలు 1855 వరకు సాగింది ఈ కాలంలో

11 మంది మహారాష్ట్రరాజులు పరిపాలించారు ఆ మహారాష్ట్ర రాజులలో ప్రాతః స్మరణీయుడు శహాజీ క్రీ శ 1684-1712 సంవత్సరాల నడుమ తంజావూరును పరిపాలించాడు విజయరాఘవునివలె ఇతడు సాహితీ ప్రియుడు, నాట్యకళాకోవిదుడు అని ప్రతీతి ఇతడు 'సతీదానశూరము' మొదలైన 22 యక్షగానాలను రచించినట్టు తెలుస్తున్నది

తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయంలో కొన్నివందల యక్షగానాల తాళపత్ర గ్రంథప్రతులు ఇప్పటికీ లభ్యమవుతున్నాయి.[1] యక్షగానాలను నాయకరాజుల కాలంలోను, మహారాష్ట్రుల కాలంలోనూ ప్రబంధాలనీ, మహానాటకాలనీ, నాటకాలనీ పిలిచేవారు కవులు

కాలక్రమేణా యక్షగానం రెండుపాయలుగా చీలి ఒకటి వీథినాటకంగాను మరొకటి కూచిపూడి భాగవతంగాను రూపం ధరించాయి యక్షగానం నుంచి ఇవి రెండూ ఉద్భవించే నాటికి యక్షగానంలో గానప్రాధాన్యం, నాటకీయప్రాధాన్యం హెచ్చి, నృత్య ప్రాధాన్యం తగ్గింది. పద్య, గద్య, గేయాత్మకాలై నాటకీయతను కూడా సంతరించుకోవడం గమనిస్తే నేటినాటకానికి ప్రాతిపదిక యక్షగానమే అని ఊహించడానికి అవకాశం ఉంది

"తోలుబొమ్మలు, యక్షగానము, వీథి నాటకము, భాగవతములు - ఈ నాలుగు కళారీతులు సామాన్య ప్రజల్లో నృత్య సంగీతములు ద్వారా మన దేశ చరిత్ర, మతము, పురాణేతిహాసములు, సాంఘిక వ్యవస్థ ప్రచారము చేయుటకు ప్రాచీనులచే రూపొందించబడిన కళారూపములు వీనిని ప్రజాకళలుగా పేర్కొనవచ్చును ఇందు తోలుబొమ్మలాటకు యక్షగానమునకు చాలా దగ్గర సంబంధము కలదు ఇందు ప్రయోగింపబడిన ఛందోరీతులు, గానపద్ధతి, ఆటతీరు, తాళములు నడిపే విధము యించుమించు ఒకటిగా చెప్పవచ్చును"[2] అని పేర్కొన్నారు ప్రసిద్ధ నాట్యాచార్యులు డా నటరాజరామకృష్ణ

యక్షగానం నుంచి క్రమపరిణామం చెంది వీథినాటకం ఆవిర్భవించిన తీరు ఈ విధంగా ఉంది.

ప్రారంభదశలో యక్షగానం కేవలం కథాగానంగా ఉండేది అంటే నేటి హరికథరూపంలో ఉండేది పూర్వోక్తమైనట్లుగా యక్షులు లేక జక్కులు అనేవారు ఆ యక్షగానం ప్రదర్శించేవారు జక్కులపురంధ్రి తంబుర చేతబట్టుకుని మీటుతూ ఆ నాదంలో తన కంఠం చేర్చిపాడుతూ కథాగానం చేసేది ఆమె ఒక్కటే వివిధ పాత్రలను పోషిస్తూ హావభావాలను ప్రకటిస్తూ నర్తనమాడేది స్త్రీ పురుషులను ఒక్కరే పోషించటంవల్ల ఒక్కొక్కసారి ప్రదర్శన రక్తికట్టకపోయే అవకాశం ఉంది కనుక స్త్రీ పురుష పాత్రల్ని వేరువేరుగా పోషించడానికి వీలుగా యక్షుడు, యక్షిణి యిద్దరూ కలిసి ఆడుతూ పాడుతూ కథ నడిపే విధానం ఏర్పడింది ఆ తర్వాత కథను మరింత రక్తిమంతం చేయడానికై కథననుసరించి అందలి పాత్రలనన్నింటిని ప్రవేశపెట్టడం ప్రారంభమైంది పాత్రలు పెరగడంతో ప్రతి పాత్రకు తగినట్టుగా ఆట, పాట, మాటలు రూపుదిద్దుకున్నాయి బహుపాత్రలు ప్రవేశించిన తర్వాత ఆయా పాత్రలకు తగిన వేషధారణ అవసరమైంది ఈ హంగులన్నీ ఒక్కొక్కటిగా ఏర్పడిన తర్వాత ద్విపాత్ర నర్తనరీతి కాలక్రమేణా మరుగునపడి, సంస్కృత నాటకాలలో నటి, సూత్రధారుడు లాగా ఈ దేశీయ నృత్యకేళికలో సింగి, సింగడు అనే రెండు ప్రత్యేక పాత్రలు మిగిలాయి. అసలు కథ ప్రారంభం కాక ముందు ఈ సింగీసింగడు పాత్రలు రంగస్థలంమీదికి వచ్చి నాటకక్రమాన్ని వివరించడమే గాక తమ చతురోక్తులతో ఆకర్షించి ఆనాటి ప్రదర్శనకు పూర్వరంగాన్ని, వాతావరణాన్ని సిద్ధం చేసేవారు

ఈ మార్పుల వల్ల కథారచన పద్ధతిలోనూ, గానపద్ధతిలోనూ మార్పులు వచ్చాయి గద్య సంభాషణలకు ప్రాముఖ్యత పెరుగుతూ వచ్చింది వర్ణనాత్మకమైన ఆటపద్ధతి రచనకు మారుగా, పాత్రలతో కూడిన నాటకశైలి పెంపొందింది ఈ విధంగా ఒక ప్రత్యేక పద్ధతిగా రూపొందిన కళారీతి కాలక్రమేణా వీధి నాటకంగా ప్రచారంలోకి వచ్చింది

## వీధి నాటకం

వీధుల్లో ప్రదర్శితం అయ్యే నాట్యరూపం కనుక దీనికి వీధినాటకం అనే

పేరొచ్చింది గ్రామీణ ప్రాంతాలలో వీథి చావడి మిదనో, ఎత్తయిన అరుగుమీదనో, ఏ శ్రీమంతుని ఇంటిముంగిట్లోనే వీధినాటకాన్ని ప్రదర్శిస్తూవుంటారు చుట్టూ ఎలాంటి తెరలుండెవికావు కనుక వీథినాటకాన్ని నాలుగు వైపుల నుంచి సామాజికులు చూసి ఆనందించేవారు వీథి భాగవతులు కూడా అన్ని వైపులకు తిరుగుతూ ఆటాపాటా ప్రదర్శించేవారు సాత్త్వికాభినయం వంటి సున్నిత భావప్రకటన దూరంలో వుండే వారికి కనిపించదు కనుక వారికి అర్థమయ్యేవిధంగా గొంతుపెంచి భావవ్యక్తీకరణ చేసేవారు

ప్రదర్శన ముందు సింగిసింగడు ప్రవేశించి ప్రేక్షకుల్ని హాస్యోక్తులతో అలరించేవారు అటుపిమ్మట పాత్రధారులు ప్రేక్షకులలోనుంచి రంగస్థలం మీదికి వచ్చేవారు అలాగే నిష్క్రమించేవారు ప్రదర్శన రాత్రి పదింటికి మొదలై తెల్లవారు ఝాము ఐదుగంటల వరకు సాగేది నూనె కాగడాల వెలుగులోనే వీథినాటకం నడిచేది. నటులు ముఖాలంకరణకు అర్దళం, మణిశిల, బొగ్గుపొడి, సింధూరం ఉపయోగించేవారు గడ్డాలకు నారపీచు వాడేవారు వీధి నాటకం ముఖ్యంగా గ్రామీణులకు వినోదసాధనం కనుక వీథి నాటకరచన గ్రామీణుల అవగాహన స్థాయికి అనుగుణంగా ఉండేది భరతముని రాసిన 'నాట్యశాస్త్రం' లోని దశవిధ రూపకాలలో 'వీథి' ఒకటి

"ఇందు ఒకే అంకము ఉండును ఇది ఏకాహార్యము లేదా ద్వ్యాహార్యము కావచ్చును (ఒకే పాత్రచే కాని, ఇరువురు పాత్రలచే గాని ప్రయుక్తము కావలెను). ఇందు రసములన్నియు ఉండును అధమ - ఉత్తమ - మధ్యమ ప్రకృతులు మువ్వురును ఇందుందురు మరియు ఇందు త్రయోదశాంగములుండును ఇతివృత్తము, కల్పితము"[3] అని వీథి లక్షణాలను పేర్కొన్నారు

16వ శతాబ్దంలో తాయికొండ నాటకసమాజంలో ఒక స్త్రీ పాత్రను స్త్రీయే ధరించినట్లు తెలుస్తూవుంది. తాయికొండ నాటకసమాజం - యక్షగాన సమాజమని ఊహించటానికి అవకాశంలేదనీ, అది వీథినాటకమే అయివుంటుందనీ యస్వీ జోగారావుగారు, తమ యక్షగాన వాఙ్మయంలో తెలియజేశారు

"పురాతన కాలంనుంచీ ప్రజాసామాన్యం అభిమానాన్ని చూరగొన్న నాటకాలు ముఖ్యంగా దేశీనాటక సంప్రదాయాలు, చాలవరకు శివకవుల ఆధ్వర్యంలోనే వర్ధిల్లాయి కారణం శైవమతం విజృంభించిన రోజుల్లో శైవమత సంప్రదాయాలను ప్రజాసామాన్యానికి విశదపరచడానికి అనేక విధాలయిన ప్రచార సాధనాలను ఉపయోగించేవారు. శివకవులే అటువంటి రూపకాలను వ్రాయడము, వారే వాటిని వ్యాప్తిలోకి తేవడం వల్ల దేశి సంప్రదాయపు కళాఖండాలన్నీ శైవమతస్థుల సొమ్మని చెప్పవచ్చు"[4] అని వివరించారు 'జానపద కళారూపాలు' అనే గ్రంథంలో డా మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు

## వీధిభాగవతం - భామాకలాపం

జానపదకళగా వుండిన వీధినాటకం కాలక్రమేణా కొన్ని శాస్త్రీయ ఆభరణాలను అలంకరించుకొంది కళాకారుడు, మారుతున్న అభిరుచులకు అనుగుణంగా ప్రదర్శనలో కొంత పాండితీప్రతిభ చూపించవలసిన అవసరం ఏర్పడింది ఆ అవసరాన్ని తీర్చినవాడే సిద్ధేంద్రయోగి వీధి నాటక ప్రదర్శన రీతుల్లో వినూత్న ధోరణులు ప్రవేశపెట్టాడు కొన్ని శాస్త్రీయ పద్ధతులతో నృత్యానికి ప్రాధాన్యమిస్తూ వీధి భాగవతం లేదా భామా కలాపానికి అంకురార్పణ చేశారు

ఆంధ్రదేశంలో కలాపముల గురించి వివరిస్తూ "కలాపములు ప్రత్యేక ప్రబంధ రచనలు కలాపమనగా వేదవాక్కని అర్థం నృత్యము, నృత్తము, అభినయము ప్రదర్శించుటకు అనువైనట్టి సంగీత రచనలు కలాపములు. ఇందు ఒకే పాత్ర అభినయమందు, నృత్యమందు, గానమందు తనకు గల పాండితీ ప్రతిభ ప్రదర్శించుటకు వీలైన రీతిని రచనలు చేయబడివుండును ఈ కలాపములన్నింటిలో ప్రాచీనమైనట్టిది, ఇతర భాషలలోని రచనలకు మూలమైనట్టిది జయదేవకవి 'గీతగోవిందం' గా పేర్కొనవచ్చును. ఇతర కలాపరచయిత లందరూ ఈ కావ్యాన్నే ఆధారముగా చేసుకొని తమ రచనలు చేసినట్టు చెప్పవచ్చును. పాత్రపోషణకు కావలసిన గీతములు, పాటలన్నియు జయదేవకవి పద్ధతినే అనుసరించి యుండును ముఖ్యముగా ఆంధ్రదేశంలో

విశేష ప్రచారము నొందిన 'భామా కలాపం', గీతగోవిందం' కథలు నడిచినతీరు ఒకే రీతిలో వుండును"[5] అని పేర్కొన్నారు డా నటరాజ రామకృష్ణగారు

ఆంధ్రలో ప్రచారంలోవున్న కలాప పద్ధతికి చెందిన రచనలు శ్రీ కృష్ణ లీలాతరంగిణి, గొల్ల కలాపం, రాధామాధవం, చోడిగాని కథ, సుంకర కొండని కథ, వాలింతవేష కథ, దాదినమ్మ - ఇవన్నీ యించుమించు కలాప పద్ధతిలో ప్రదర్శితమవుతున్నాయి

సుప్రసిద్ధమైన 'భామాకలాపం' కూచిపూడి భాగవతుల సొత్తు కూచిపూడి నాట్యానికి అంతర్జాతీయ కీర్తి సంపాదించి పెట్టిన వారు వీరే

కూచిపూడి భాగవతం లేదా భామాకలాపం సత్యభామా శ్రీ కృష్ణుల కథ ఒక చిన్న సంఘటనపై సత్య మీద అలిగి కోపంతో వెళ్లిపోయిన శ్రీ కృష్ణుని మరలా తన వైపు ప్రసన్నుడిగా చేసుకోవడానికై చెలికత్తెను అతని వద్దకు రాయబారం పంపుతుంది సత్యభామ అలిగి వెళ్లిన స్వామిని మరల తనవద్దకు రప్పించకొనే లోపల సత్యభామ అష్టవిధ నాయికల స్థితిగతులను అనుభవిస్తుంది భామాకలాపం సామాన్యంగా మగవాళ్లే అభినయించటం పరిపాటి ఇటీవలి కాలంలో స్త్రీలు కూడా భామాకలాపంలో పాల్గొంటున్నారు

వీధి నాటకం వలె వీధి భాగవతం కూడా వీథుల్లో ప్రదర్శించబడే కళారూపమే అయినా దీనికి ఒక ప్రత్యేకత ఉంది ప్రేక్షకులకు అభిముఖంగా ఒక తెర ఉంటుంది. ఇద్దరు ఆ తెరను చెరొకవైపు పట్టుకొని ఉంటారు ముఖ్యపాత్రలు తెరవెనక నిలబడి నృత్యం చేస్తూ సభాసదులకు కనిపిస్తారు ప్రదర్శనకు ముందు సూత్రధారుడు ప్రవేశించి నాంది వచనాలు పలికి, కథాక్రమాన్ని వివరిస్తాడు కలాపంలో హాస్యపాత్రను మాధవి అని పిలుస్తారు. సత్యభామతో ఉన్నపుడు మాధవిగాను, శ్రీ కృష్ణుడుతో ఉన్నపుడు మాధవుడుగానూ వ్యవహరిస్తుంది ఈ పాత్ర

చోడిగాడు, సింగి, సింగడు వంటి పాత్రలే మనకు తోలుబొమ్మలాటలో జుట్టు పోలిగాడు, కేతిగాడు, గందోళిగాడు, బంగారక్క రూపంలో సాక్షాత్కరిస్తుంటారు

ఈ పాత్రలకు భాగవతకథకు సంబంధం ఉండదు హాస్యరసపోషణకు, సంఘువిమర్శలకు ఈ పాత్రలే ఆధారంగా వుంటాయి

కలాపంలో భామజడకు ఒక విశిష్టత వుంది ఆ జడ సామాన్యమైంది కాదు విశ్వకర్మ సృష్టించినట్టిది భామ తెరపై జడవేయటం సభలో పండితులెవరైనా ఉంటే తనతో శాస్త్రచర్చ చేయవచ్చునని సవాలు చేయడమే! పండితులతో చర్చలో భామ ఓడిన పక్షంలో ఆ జడను సభలో కత్తిరించివేయడం ఆచారం భామకు అంతకంటె అగౌరవము వేరొకటి ఉండదు కనుకనే కళాకారులు శాస్త్రసంప్రదాయాన్ని గురుముఖంగా అభ్యసించి ప్రావీణ్యం గడించి సంసిద్ధులుగా ఉంటారు

సుశిక్షితులైన భాగవత నర్తకుల చేతుల్లో 'భామాకలాపం' జగజ్జేగీయ మానంగా వెలిగిపోతూ ఉన్నత ప్రమాణాలను నెలకొల్పుతూ ఉంది

## ఆధునిక వీధి నాటకం

ఆధునిక వీధి నాటకాన్ని కొన్ని జానపద కళా రూపాల్లో ఒకటిగా వ్యాప్తిచెందిన 'వీధి నాటకానికి' భిన్నమైన కళా ప్రక్రియగా చెప్పుకోవాలి వీధిలో ప్రదర్శించబడటం అనే అంశం ఒక్క దానిలోనే ఈ రెండు ప్రక్రియలకు సామ్యం ఉంది ప్రజలవద్దకు నాటకాన్ని తీసుకెళ్లే లక్ష్యానికి కార్యరూపమే ఈ ఆధునిక వీధినాటకం

రాజకీయ, ఆర్థిక, సామాజిక సమస్యల పట్ల సామాన్య ప్రజలకు చైతన్యస్ఫూర్తి కలిగించే యత్నంలో కళాకారులు తమ శరీరావయవాలను ఉపకరణాలుగా చేసుకొని వీధుల్లో ప్రదర్శించే సరికొత్త నాటకకళారూపమే ఆధునిక వీధి నాటకం శరీర భాగాలను భావ వ్యక్తీకరణలకు వాడుకోవడం వల్ల దీనిని 'బాడి థియేటర్' అని కూడా పిలుస్తారు

జానపద కళారూపమైన వీధినాటకానికి, ఆధునిక వీధినాటకానికి భేదసాదృశ్యాలను ఈ క్రింది విధంగా క్రోడీకరించడమైనది

## సాంప్రదాయ వీధి నాటకం

1 వీధిలో ప్రదర్శించబడుతుంది అయితే ఎత్తయిన వేదికగాని, గ్రామ చావడిగాని రంగస్థలంగా ఉంటుంది

2 నాలుగు వైపుల కూర్చొని ప్రేక్షకులు ప్రదర్శన తిలకించవచ్చు కొన్ని వేళల ఒక తెర మాత్రం కట్టి నాటకం ప్రదర్శించటం జరుగుతుంది అలాంటప్పుడు ప్రేక్షకులు మూడువైపులా కూర్చొని ప్రదర్శన చూస్తారు

3 ప్రేక్షకులతో ప్రత్యేక సంబంధం ఉంటుంది

4 వస్తువు పౌరాణిక గాధలకు సంబంధించిందిగా ఉంటుంది

5 వినోదం, ధర్మ ప్రబోధం, కళాత్మకత యీ ప్రదర్శనకు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు

6 కథ, సంఘటనలు, పాత్రపోషణ,రసపోషణ ఉంటాయి

7 నాటక రచనలో వస్తు ఐక్యం ఉంటుంది

8 పాత్రోచితమైన వేషధారణ, ఆహార్యం, సంగీతం ఉంటాయి

9 పాత్రలకు ప్రాధాన్యం ఉంటుంది

10 పాత్రలకు పేర్లుంటాయి

11 వృత్తి కళాకారులు ప్రదర్శిస్తారు

12 నాట్యధర్మి ప్రయుక్తమవుతుంది

13 రంగస్థల పరికరాలు పరిమితంగా ఉపయోగించబడతాయి (కుర్చీ, కత్తి మొ )

14 ఎపిక్ థియేటర్‌కు దగ్గరగా ఉంటుంది (ఉదా ఎలినేషన్, 'తాదాత్మ్య విచ్ఛేదనం' సంగీతం, రంగస్థలంమీదే వాద్యపరికరాలు ఉంచి ప్రేక్షకులు గుర్తుచేయడం, సూత్రధారుడి వ్యాఖ్యానం ద్వారా ఎలియనేషన్ సాధించటం వంటివి )

15 ఒకటవ నాటకరంగం (ఫస్ట్ థియేటర్) పరిధిలోకి వస్తుంది

16 రసానుభూతికి ప్రధమస్థానం

17 ప్రేక్షకుడు తాను మరొకరి నాటకాన్ని చూస్తున్నాననే స్పృహలో ఉంటాడు

18 ప్రేక్షకుడు కేవలం ప్రేక్షకుడుగానే ఉంటాడు

19 పాత్రకి, ప్రేక్షకుడికి మధ్య అంతరం ఉంది

20 ఆనందం పరమావధి

**ఆధునిక వీథి నాటకం**

1 నాలుగు వీథులు కలిసి కూడలిగాని, మైదానం గాని, ఎక్కడ ఖాళీ స్థలమున్నా అదే రంగస్థలం ఎత్తయిన రంగస్థలం అవసరం లేదు

2 ఎలాంటి తెరలు వుండవు ప్రేక్షకులు నటులచుట్టూ కూర్చొని నాటకం చూస్తారు

3 కళాకారులు ప్రేక్షకులతో కలిసిపోతారు ప్రవేశ నిష్క్రమణలు ప్రేక్షకులలోనుంచే

4 రాజకీయ, సామాజిక సమస్యలు ఇతివృత్తాలుగా ఉంటాయి ఒక్కొక్కసారి స్థానిక సమస్యలుకూడా చోటుచేసుకోవడం కద్దు

5 సామాజిక న్యాయం, ప్రజా చైతన్యం ఈ ప్రదర్శన లక్ష్యం

6 నిర్దిష్టమైన కథగాని, పాత్రలుగాని ఉండవు సమస్యల విశదీకరణ, వాటిపై వ్యాఖ్యానాలు ఉంటాయి

7 వస్తువైవిధ్యం ప్రధానంగా ఉంటుంది (ఉదా అవినీతి, లంచగొండితనం, నిరుద్యోగం, అన్యాయం, దోపిడి, దౌర్జన్యం - ఇలా ఎన్నో సమస్యలు ఒక్కనాటకంలోనే ఉంటాయి ఇది సాధారణ లక్షణంకాగా, కొన్నివేళల ఒక్క సమస్యతోనే నాటకం ఉండటమూ జరుగుతుంది ఉదా పెద్దబాల శిక్ష

విద్యా సమస్య), సారాసంహారం (త్రాగుడు సమస్య)

8 ఆహార్యం, వేషధారణ లేదు బృందగానం ఉంటుంది

9 సమస్యలకు ప్రాధాన్యం ఉంటుది

10 పాత్రలకు పేర్లుండవు ఉపాధ్యాయుడు, నౌకరు, విద్యార్థి, డాక్టరు, రాజకీయ నాయకుడు, ఈవిధంగా ఉంటాయి లేదా 1,2,3,4,5 అనే సంఖ్యలతో పాత్రలు వ్యవహరిస్తాయి

11 ఔత్సాహికులు పాల్గొంటారు

12 లోకధర్మిని ఆశ్రయిస్తుంది

13 ప్రదర్శనలో మానవ పరికరాలే (హ్యూమన్ ప్రాప్స్) ఉపయుక్తమవుతాయి అందుకే దీనిని బాడీ థియేటర్ అనికూడా అంటారు

14 ఎక్స్‌ప్రెషనిస్టు (అభివ్యక్తి) నాటకానికి దగ్గరగా ఉంటుంది (ఉదా పాత్రధారులందరూ ఒక సమూహానికి ప్రతినిధిగా ఉండటం పాత్రధారులకు పేర్లు లేకపోవడం - వంటి కొన్ని లక్షణాలు)

15 మూడవ నాటకరంగం (థర్డ్ థియేటర్) పరిధిలోకి వస్తుంది

16 బావజాలానికి (ఐడియాలజీస్) సంబంధించిన అనుభూతికి ప్రధమ స్థానం

17 ప్రేక్షకుడు తాను తన నాటకాన్ని చూస్తున్నాననే చైతన్యంలో ఉంటాడు

18 ప్రేక్షకుడు తానొక పాత్రధారిగా నిమగ్నత (ఇన్‌వాల్వ్‌మెంట్) పొందుతాడు

19 పాత్రకు ప్రేక్షకుడికి ఉన్నదూరం వీధినాటకంలో చెరిగిపోతుంది

20 ఆలోచన ఊపిరి

ఈ వీధి నాటక తత్వాన్ని వివరిస్తూ ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు శ్రీ అద్దేపల్లి రామమోహనరావు "దోపిడి తత్వం పెరిగేకొద్దీ తప్పనిసరిగా ప్రతిఘటనకూడా పెరుగుతుంది ప్రజల్ని దోపిడీ వ్యవస్థ ప్రతిఘటనకు సిద్ధం చెయ్యాలనేది

ప్రధాన లక్ష్యమైంది ఈ లక్ష్యంలోంచి బయలుదేరింది వీధి నాటకం (స్ట్రీట్ ప్లే) సామాజిక సమస్యలగూర్చి ప్రజల్లో, ముఖ్యంగా పీడితవర్గాల్లో, కార్మిక కర్షకుల్లో, అవగాహన కలిగించడం, భూస్వామ్య వ్యాపార నాగరికతతో పోరాడ్డానికి ప్రజల్ని ఉత్తేజితుల్ని చెయ్యడం కళాకారుడి కర్తవ్యం అయింది ప్రగతివాదులైన రచయితలంతా ఆ భావాలకు నిబద్ధులయ్యారు (కమిటెడ్) వారి భావాల ఫలితమే విధి నాటకం ఇది వీధి నాటకానికి నేపధ్యంగా నిలిచిన తత్త్వం"[6]

## వీధి నాటకం ఒక సాంఘికావసరం:

నెసిసిటీ ఈజ్ ది మదర్ ఆఫ్ ఇన్వెన్షన్ అన్నారు పెద్దలు ఇది వీధి నాటక ప్రక్రియ ఆవిర్భావానికి ముమ్మూర్తులా వర్తిస్తుంది సాంఘికావసరం వీధి నాటకాన్ని తోడుగా తెచ్చుకుంది కళా జగత్తులో మూడవ నాటకరంగం (థర్డ్ థియేటర్)గా వ్యాప్తిలోకి వచ్చింది

జానపద కళారూపాలైన యక్షగానం, సంప్రదాయ వీధినాటకం మొదలైనవన్నీ మొదటి నాటకరంగం (ఫస్ట్ థియేటర్) పరిధిలోకి వస్తాయి వీధినాటకానికి ఒక తెరమాత్రం ఉంటుంది మూడువైపుల ప్రేక్షకులు కూర్చొని ప్రదర్శన తిలకిస్తారు పురాణ సంబంధి కథలకే వీధినాటక ప్రదర్శన పరిమితం వినోదం, ధర్మ ప్రబోధం వీధినాటక ప్రదర్శన లక్ష్యం సాంఘిక సమస్యలకు అందునా సమకాలీన సమస్యలకు ఆ ప్రదర్శనలో తావులేదు

ఇక రెండవ నాటకరంగం (సెకండ్ థియేటర్) - అంటే నేడు సర్వత్రా అనుసరించబడుతున్న - మూడు తెరలు, అభిముఖంగా ప్రేక్షకులతోకూడిన నాటక ప్రదర్శనా విధానం దీనినే ప్రొసీనియమ్ థియేటర్ అని పిలుస్తారు రెండవ నాటకరంగం, మూడవ నాటకరంగం రెండూనూ సాంఘిక ప్రయోజనంకోసం ప్రజల సమస్యలను ఆవిష్కరించటం కోసం పాటుపడుతున్నవే ఒకదానికొకటి పోటీకాదు ఈ అంశాన్ని సుప్రసిద్ధ వీధినాటక ప్రయోక్త, దర్శకుడు, రచయిత అయిన సఫ్దర్ హాష్మీ "రైట్ టు పెర్ఫార్మ్" అనే పుస్తకంలో ఇలా వివరించారు

"This brings us to the unfortunate tendency to project street theatre as a rebellion against the proscenium theatre, or as standing in opposition to it This absolutely erroneous notion has been created by adherents of both kinds of theatre On the one hand, some exponents of street Theatre have tried to counterpoise it against proscenium theatre, dubbing the latter as a bourgeois, decadent and contructing genre, condemning it as a theatre of irrelavance, of airy - fairy philosophy, of frivolity, and including thereafter, that a genuine peoples' theatre is impossible on the proscenium stage, on the other hand a large number of proscenium wallahs have consistently refused even to accept street Theatre as a valid form of dramatic art In our view it is absurd to speak of a controdiction between proscenium and street Theatres Both belong equally to the people "[7]

వీధినాటకాన్ని కొత్తరూపం దాల్చిన 'ఉద్యమ ప్రచార నాటక రంగం (ఎజిట్ - ప్రోప్ ధియేటర్) అంటున్నారు కొందరు రాజకీయ రంగు పులుముకున్న 'ప్రతిఘటన నాటకరంగం' (ప్రొటెస్ట్ ధియేటర్ ఆఫ్ పొలిటికల్ నేచర్) అంటున్నారు మరికొందరు ఎవరు ఏ పేరుతో పిలిచినా ప్రచారం దాని ఊపిరి

"సామాజికత వాస్తవికత దాని శరీరం ప్రజా చైతన్యమే ప్రధాన రసం దోపిడీ దారుల్ని ప్రతిఘటించడం ఈనాటి సమస్య గనుక దాని సమగ్ర సిద్ధాంతపునాది సామ్యవాదంలో ఉందిగనుక, సామ్యవాదపరమైన ఉద్యమాలకీ, యితర ప్రతిఘటనోద్యమాలకీ వీధినాటకం అత్యంత ప్రయోజనకరంగా ఉంది నాటకాలన్నీ అవగాహన ప్రధానంగా సాగుతాయి "[8]

నేటి సమాజంలో వీధినాటకం నిర్వహిస్తున్న పాత్ర ప్రాధాన్యం గురించి ప్రత్యేకంగా పరిశీలించవలసిన అంశం ఒకటుంది

ఒకచోట పదిమంది కలసి ఏదైనా వినోద ప్రదర్శన చేసి ఆనందించే సందర్భాలు మృగ్యమైపోతున్నాయి సమిష్టిగా అందరితో ఆనందం పంచుకోవడంపోయి, వ్యక్తిగా తానొక్కడే ఏకాంతంగా ఏ టీ వి చూస్తునో, వీడియో చూస్తూనో కాలక్షేపం చేస్తూ సమాజ జీవితానికి దూరంగా జరిగిపోతున్నాడు మనిషి సమాజ వికాసానికి

గొడ్డలిపెట్టువంటిది యీ పరిణామం ఇక్కడే వీధినాటకం అవసరమైంది ప్రజలను సమీకరించి ఒకచోటికి చేర్చేబదులుగా ప్రజలదగ్గరకు నాటకాన్ని తీసుకువెళ్లి వారిని ఆనందపరుస్తోంది సమకాలీన సమస్యలపట్ల అవగాహనకు మార్గం చూపిస్తుంది వీధినాటకం ఈపని ప్రొసీనియమ్ థియేటర్‌కు కష్టసాధ్యమవుతుంది

రాజకీయ రంగంలోకానీ, ఆర్థిక రంగంలోకానీ, సాంఘిక రంగంలోకానీ, ఏదైనా భయంకర సమస్య ఉత్పన్నమై సమాజంలో అలజడి, ఆందోళన కల్గిస్తున్నపుడు అలాంటి సమస్యను తీసుకొని, దాని పూర్వాపరాలను తెలుసుకుని, సమాజంమీద దానిప్రభావాన్ని అంచనాకట్టి, రాబోయే ప్రమాదంనుంచి ప్రజలను కాపాడాలని కళాకారులు ఆరాటపడటం సహజం ప్రజలను చైతన్యవంతుల్ని చెయ్యాలంటే రంగస్థలంమీద ఒక నాటకమో, నాటికో ప్రదర్శింపజేయాలి అందుకు ఒక రచయితచేత నాటకం రాయించాలి ఆ నాటకాన్ని నటీనటులు కొన్నిరోజులు రిహార్సల్స్ చెయ్యాలి ఎన్నో వ్యయప్రయాసలకు తట్టుకుని ఆ నాటకాన్ని ప్రదర్శించాలి నాటకానికి ప్రేక్షకులు వస్తారని నమ్మకంలేదు ఒక రంగస్థలంమీద వేసే నాటకానికి మారుమూల గ్రామాలనుంచి ప్రజలురారు సరికదా, ఆ పట్టణ పౌరులే రారు అంతఖర్చుపెట్టి, అంత శ్రమపడినా ఆ కళాకారులు ఆశించిన లక్ష్యం నెరవేరదు

ఈ పరిస్థితి వీధినాటకాలలో లేదు దానికి రంగస్థలం అక్కర్లేదు తెరలు, మైకులు, రంగపరికరాలు, మేకప్‌సామాగ్రి యిత్యాది హంగులు అవసరంలేదు నాటకానికి స్క్రిప్టు అనివార్యంకాదు స్క్రిప్టు లేకుండానే కొన్ని గంటల వ్యవధిలో నాటకం ప్రదర్శించగల సౌలభ్యం వీధినాటకంలో ఉంది నాలుగు రోడ్లు కలిసే కూడలిలోనో, పార్కులోనో, బస్టాండులోనో ప్రజలు ఎక్కడుంటే అక్కడకు తీసుకెళ్లి వీధినాటకాన్ని ప్రదర్శిస్తారు కళాకారులు

ధరలు పెరుగుదల, అధికారుల్లో లంచగొండితనం, రైతుల ఆకలిచావులు, కార్మికుల కష్టాలు, మంత్రుల అవినీతి, ఆశ్రిత పక్షపాతం, పోలీసు జులుం,

ప్రభుత్వ కార్యాలయాల్లో సామాన్యులుపడేపాట్లు - ఒక్క సమస్యేమిటి ఏ సమస్య అయినా వీధినాటకానికి దాసోహం అనవలసిందే

ఇంత సౌలభ్యం ఉండటంచేతనే వీధినాటకానికి ప్రాముఖ్యం పెరిగింది ప్రాచుర్యం లభించింది ఏ సమస్యనైనా అతితక్కు వ్యవధిలో ప్రజల ముందుకు తీసుకుని వెళ్ళి, దాని కష్టనష్టాలను గురించి విడమర్చి చెప్పి కర్తవ్యబోధ చేయగల శక్తిమంతమైన ఆయుధం కనుకనే 'వీధినాటకం' అనే ఈ కళాప్రక్రియకు అనతికాలంలోనే ప్రజలనుంచి అత్యంత ఆదరణ లభించింది.

## వీథినాటక ఆవిర్భావం - మొదటి దశ

ప్రపంచ రంగస్థలంపైన తొలిసారిగా 1917లో వీధి నాటకం ప్రభవించింది రష్యాలో విప్లవం విజయవంతం అయిన వెంటనే అక్టోబర్ విప్లవం మొదటి వార్షికోత్సవంలో మయికోవిస్కీ రాసిన 'మిష్టరీ బౌఫే' అనే నాటకం నగరంలోని నాలుగురోడ్ల కూడలిలో వేలమంది ప్రజలముందు ప్రదర్శించబడింది అనంతరం ఈ వీధినాటక ప్రక్రియను అనేక దేశాలు చేపట్టాయి ముఖ్యంగా కార్మికోద్యమానికి బాసటగా ఆ కళారూపాన్ని వాడుకున్నారు కళాకారులు

భారత దేశంలో ఇండియన్ పిపుల్స్ థియేటర్ ఎసోసియేషన్ (ఐ పి టి ఏ) వారిచేత సామ్రాజ్యవాద వ్యతిరేకంగా ప్రజల్ని సంఘటితపరచడానికి ప్రారంభించబడింది ప్రపంచంలో అన్నిచోట్లా ఉద్యమానికి అనుకూలంగా వీధినాటకం వ్యాప్తి చెందింది

ఐ పి టి ఏ సంస్థ ఆధ్వర్యంలో వీధినాటకాలద్వారా ప్రజా ఉద్యమాలకు అండగా నిలిచిప్రోత్సహించడం కొన్నాళ్లు కొనసాగింది కొంతమంది కళాకారులు ఐ పి టి ఏ నుంచి విడిపోయి 1979లో స్వతంత్రంగా 'జననాట్యమంచ్' అనే సంస్థను స్థాపించుకున్నారు ఈ సమాజం సఫ్దర్ హాష్మీ నిర్వహణలో నడచింది పదేళ్లకాలంలో జననాట్యమంచ్ నాటకాలకు ప్రజలనుంచి ఆదరణ లభించింది ఇతర రాష్ట్రాల కళాకారులుకూడా జననాట్యమంచ్ ప్రదర్శించిన నాటకాలను

ప్రాంతీయ భాషల్లోకి అనువదించుకుని ప్రదర్శిస్తూ వీధి నాటకోద్యమానికి కొత్త ఊపిరి పోశారు

భారతదేశంలో వీధినాటక విస్తృతికి మూలస్తంభాలుగానిలిచి విశేష కృషిసల్పిన వారిలో శ్రీ బాదల్ సర్కార్, శ్రీ సఫ్దర్ హష్మి ప్రధమ గణ్యులు 1989 జనవరి 1వ తేదీన ఢిల్లీ సమీపంలో 'హల్లాబోల్' అనే వీధి నాటకాన్ని ప్రదర్శిస్తున్న సమయంలో కొందరు రాజకీయ గూండాలు సఫ్దర్ హష్మిని హత్యచేయటం ఒక విషాద సంఘటన హష్మి మరణంతో వీధినాటకాన్ని అంతం చెయాలన్న దుండగుల ఆశ నిరాశ అయింది హష్మి మరణంతో విధినాటకోద్యమం కార్చిచ్చులా దేశమంతా వ్యాపించింది వీధినాటకం మరింత వ్యాప్తిచెంది బలం పుంజుకుంది

## ఆంధ్రప్రదేశ్‌లో వీధినాటకం

అనేక జానపద కళారూపాలను తన అక్కున చెప్పుకుని కాపాడి పెంచి పోషించిన ఆంధ్ర ప్రజా నాట్యమండలి బాదల్‌సర్కార్, హష్మిల ప్రయోగాలకు ఎంతొ ముందుగా అంటే 1943లోనె ఆంధ్రదేశంలో వీధినాటకాన్ని ప్రదర్శించిన సంఘటన కలకాలం గుర్తు పెట్టుకొవలసిన అంశం

1943 జనవరి ప్రాంతాల్లో అఖిల భారత కమ్యూనిష్టు పార్టీ మహాసభ బొంబాయిలో జరిగింది ఆ సందర్భంలొనె అఖిల భారత ప్రజా నాట్యమండలి మహాసభ అఖిల భారత అభ్యుదయ రచయితల మహాసభ ఆవిర్భవించాయి కొన్ని రాష్ట్రాలనుంచి వైజ్ఞానిక దళాలు వచ్చాయి ఆంధ్ర వైజ్ఞానిక దళంకూడా కొన్ని మన ప్రాచీన జానపద కళారూపాలను ఆ సందర్భంలో ప్రదర్శించింది అందరి ప్రశంసలను అందుకుంది ఆ ప్రదర్శనల్లో ప్రధమ బహుమతిని అందుకుంది అఖిల భారత స్థాయిలో ఎన్నికైన ఆంధ్ర దళాన్ని ఆనాటి బొంబాయి ఆంధ్ర మహాసభవారు ఘనంగా సన్మానించి పెద్ద రజిత పాత్రను బహుమతిగా ఇచ్చారు

బొంబాయి వెళ్లిన దళం కొత్త ఉత్సాహంతో తిరిగి వచ్చింది ఆ స్ఫూర్తితో ఆంధ్ర ప్రజా నాట్యమండలి అక్కడక్కడా వైజ్ఞానిక శిక్షణా శిబిరాలను నడిపింది

ఆ శిబిరాలలో రాజకీయాలతోపాటు ప్రాచీన కళారూపాల పునరుద్ధరణ కూడాజరిగింది ప్రతి జిల్లాలోనూ వైజ్ఞానిక దళాలు ఏర్పడి బుర్రకథ, కోయవేషం, చెంచులు ఫకర్లు, దేవరపెట్టె జేగంట ఇత్యాది కళారూపాలతోపాటు వీధినాటకాన్నికూడా ప్రప్రధమంగా వెలుగులోకి తెచ్చాయి

1943లో విజయవాడలో జరిగిన మహాసభలలో జరిగిన సాంస్కృతిక ప్రదర్శనల్లో "ఒకభాగంగా హిట్లరు వీధి నాటకం కూచిపూడి కళాకారులు శిక్షణలో అద్భుతంగా తయారుచేయబడింది ఈ వీధినాటకంలో హిట్లరుగా మిక్కిలినేని, ముస్సోలినిగా చదలవాడ, టోజోగా కేశవరావు పాత్రలు ధరించేవారు సూత్రధారులుగా వీధినాటక రచయిత కోగంటి, కోసూరు పున్నయ్య నిర్వహించేవారు ఈ వీధినాటకంలో కూచిపూడి శాస్త్రీయమైన అడుగులనే నృత్యం చేసేవారు

హిట్లరుగా మిక్కిలినేని అధిక ప్రశంసలందుకున్నారు ఆ రోజుల్లో అందరూ హిట్లరనే పిలిచేవారు పతాక సన్నివేశంలో డాక్టరు రాజారావు ఎర్ర సైనికుడుగా సుత్తీ కొడవలి పట్టి ప్రళయతాండవ నృత్యం చేస్తూ హిట్లరును రంగస్థలమంతా కలియతిప్పి అలసిపోయేటట్లుచేసి చివరికి కొడవలితో మెడను లాగి సుత్తితో మోది హతమార్చే సన్నివేశం - అతి భయంకరంగా ముగిసేది ఈ ప్రదర్శన విజయవాడ గాంధీనగరం జింఖానా గ్రౌండ్స్‌లో కొన్నివేల మంది సమక్షంలో ప్రదర్శించబడి ప్రశంసలను అందుకుంది'అని ఒక వ్యాసంలో వివరించారు

'సిమ్లా భాగవతం' అనే పేరుతో మరొక వీధి నాటకాన్ని కూడా ప్రజా నాట్య మండలివారు ప్రదర్శించినట్లు తెలుస్తోంది అటుపిమ్మట వీధినాటకాలు ప్రజా నాట్య మండలివారిచేగాని, యితర ఏ కళా సంస్థలచేగాని ప్రదర్శించబడినట్లు దాఖలాలు లేవు ఆంధ్ర ప్రజానాట్యమండలి కార్యక్రమాలపై ప్రభుత్వం ఆంక్షలు విధించడం కొన్ని నాటకాలను నిషేధించడం, ప్రజా నాట్య మండలి కళాకారులను నిర్బంధించటం వంటి చర్యలవల్ల, మరికొన్ని రాజకీయ కారణాలవల్ల ప్రజా నాట్య మండలి కార్యకలాపాలు క్రమంగా సన్నగిల్లిపోయాయి స్వాతంత్ర్యానంతరం ప్రజా నాట్య మండలి సాంస్కృతిక రంగంలో ప్రధమ

స్థానాన్ని కోల్పోతూ నామమాత్రంగా నిలిచి ఉంది అయితే, నాటకోద్యమంలోనూ, జానపద కళారూపాల పునరుద్ధరణలోనూ ప్రజానాట్యమండలి నిర్వహించిన అనితర సాధ్యమైన కృషి చరిత్రపుటల్లో పదిలంగా ఉంటుందనేది సత్యం!

## రెండవ దశ

వీథినాటకానికి 1974లో రెండవ దశ ప్రారంభమైంది ఆంధ్రదేశంలో బాదల్ సర్కార్ ప్రభావంతో వీధినాటక ప్రయోగాన్ని ప్రారంభించిన వారిలో ప్రధములు శ్రీ అత్తిలి కృష్ణారావు బాదల్ సర్కార్ రాసిన 'మిచ్చిల్' అనే నాటకాన్ని 'ఊరేగింపు' పేరుతో వీధినాటకంగా తెలుగులోకి అనువదించారు శ్రీమతి అత్తిలి పద్మావతిగారు ఈ నాటకాన్ని అత్తిలి కృష్ణారావుగారు 1979లో నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా ఢిల్లీవారితో ఆంధ్రా యూనివర్శిటీ విద్యార్థుల్ని కలిపి యం కె రైనా దర్శకత్వంలో విశాఖపట్నంలో ప్రదర్శించారు ఈ ప్రదర్శనతో ఆంధ్ర దేశంలో వీథినాటక ప్రక్రియకు ఒక రూపం, ఒక గుర్తింపు వచ్చింది జంతర్ మంతర్ మామూళ్లు, టామీ - టామీ అనే నాటికలను కూడా, రచించి ప్రదర్శింప చేశారు ఆ విధంగా అత్తిలి కృష్ణారావుగారు తెలుగు దేశంలో ప్రాణప్రతిష్ఠ చేసి వీధి నాటకానికి నాంది పలికారు

కృష్ణారావుగారి కృషి ఫలించింది వారు చూపిన మార్గంలో వివిధ రచయితల ద్వారా కొత్త వీధి నాటికలు వెలుగులోకి వచ్చాయి

వీథినాటకాలను ప్రారంభించినవారు కృష్ణారావుగారే అయినా వీథి నాటకానికి విశేష ప్రచారం తెచ్చిపెట్టిన ఘనత శ్రీ తనికెళ్ల భరణికి దక్కుతుంది శ్రీ తనికెళ్ల రచించిన 'గోగ్రహణం' వీధినాటిక ఆంధ్ర దేశంలో వందలాది ప్రదర్శనలకు నోచుకుంది దీనికి ప్రభుత్వం యిచ్చిన సహకారం కూడా ఒక కారణం కావచ్చు భరణి రాసిన 'కొక్కురోకో' నాటిక కూడా విశేష ప్రజాదరణ పొందింది శ్రీ ఆకెళ్ల సత్యనారాయణ మూర్తి రచించిన 'పెద్ద బాలశిక్ష' వీధినాటిక ఉద్యమ స్ఫూర్తితో విస్తృతంగా ప్రదర్శించబడింది

క్రమంగా అనేక సమాజాలను, కళాకారులను రచయితలను, దర్శకులను ఆకర్షించసాగింది వీధినాటకం జననాట్యమండలి, వంగపండు ప్రసాదరావు రచించిన భూమి భాగోతం' వీధినాటకాన్ని మరికొన్ని నాటకాలను ప్రదర్శించింది అరుణోదయ సాంస్కృతిక సంస్థ అప్పుల భారతం మొదలైన వీధినాటకాలను ప్రదర్శించింది జన సాహితి పక్షాన 'జనవాహిని కదిలింది' అనే నాటకం విరివిరిగా ప్రదర్శితమైంది

వీధినాటక ప్రదర్శనలో పసుపులేటి పూర్ణచంద్రరావు గారిది ఒక నూతన పంథా ప్రజలను ఎదుర్కొనే ఏదో ఒక సమస్యను తీసుకుని నాటకం ప్రదర్శించడం కాకుండా, బాధితుల్నే పాత్రధారుల్నిచేసి సమస్య ఉన్నచోటనే నాటకాన్ని ప్రదర్శించడం ఆ నూతన విధానం

ఆగస్టో బోల్ రూపొందించిన థియేటర్ ఆఫ్ ది అప్రెస్స్‌డ్' నాటక విధానాన్ని తనదైన పద్ధతిలో శ్రీ పసుపులేటి పూర్ణచంద్రరావు ఏర్పరచుకున్నారు పూర్ణచంద్రరావుగారి నాటక ప్రదర్శనా విధానాన్ని గురించి శ్రీమతి జయప్రభ 'నాలుగోగోడ' అనే పుస్తకంలో ఈ విధంగా క్రోడీకరించారు

1 ఒక ప్రాంతాన్ని ఎన్నుకుని అక్కడికి వెళ్లి అక్కడ సమస్యల్ని క్షుణ్ణంగా పరిశీలించి, ఆ సమస్యలకి గురౌతున్న జనంతో వివరంగా మాట్లాడి వాళ్ల కథలనీ బాధలనీ వినడం

2 అలా విషయాన్ని ఆకళింపు చేసుకున్నాక, ఆ సమస్యనే విషయంగా తీసుకుని, అక్కడ ఆ సమస్యతో బాధలు పడే జనం ఎవరైతే ఉన్నారో వాళ్లనే నటులుగా ఎంచుకోవటం

3 అలా ఎంచుకున్న నటులతో నిర్విరామంగా పదిహేను ఇరవై రోజులపాటు శిక్షణకోసం వర్క్‌షాపు నడిపి, ఆ సాధన పూర్తయిన తర్వాత నాటకాన్ని ప్రదర్శించటం

4. పూర్ణచంద్రరావు తలపెట్టిన నాటకం ముందుగా రాతపూర్వకంగా ఉండదు

రచయితా, దర్శకుడు తానే అయి తానెన్నుకున్న నటులతోనే నాటకాన్ని ప్రదర్శననీ ఏకకాలంలోనే పూర్తి చేస్తారు పూర్ణచంద్రరావు

'మన్నెంలో', 'పిపీలికం','పిపీలికం', మనిషి' అనే నాటకాలు పూర్ణచంద్రరావు ఎథ్నిక్ ఆర్ట్స్ సెంటర్ ద్వారా ప్రదర్శించిన నాటకాలలో పేర్కొనదగినవి

## మూడవ దశ

1989లో సఫ్దర్ హష్మీ దారుణ హత్యోదంతం యావద్భారత కళారంగాన్ని కలచివేసింది దేశమంతా ఆ హత్యాకాండపై నిరసన వెల్లువ పెల్లుబికింది వీధినాటకం ఎంత శక్తిమంతమైంది కాకపోతే వీధినాటకప్రదర్శనను సఫ్దర్ హష్మీని అంతంచేసి 'హల్లాబోల్' నాటకాన్ని ఆపవలసి వచ్చిందో సామాన్య ప్రజానీకానికి కూడా ఆ సంఘటనతో తేటతెల్లమైంది

తత్ఫలితంగా దేశంలో అన్ని మూలలా వీధినాటక ప్రదర్శనలు ప్రారంభమయ్యాయి ఆంధ్రప్రదేశ్‌లో ప్రజా నాట్యమండలికి నూతనోత్తేజాన్ని ఇచ్చింది 'హల్లాబోల్' వీధి నాటకం ప్రజానాట్యమండలి కార్యకలాపాలు ఉధృతమయ్యాయి సామాజికావసరాలకి తగినట్టుగా వీధినాటకాలు రూపుదాల్చాయి ఎందరో ఔత్సాహిక కళాకారులు, దర్శకులు, రచయితలు రంగప్రవేశం చేశారు

వీధినాటకాలను ఎవరికి తోచినట్లు వారు ప్రదర్శించటంకాకుండా, కొంత శాస్త్రీయ అవగాహనను, సిద్ధాంతపరమైన విజ్ఞానాన్ని ప్రోదిచేసేందుకు వీలుగా ప్రజా నాట్యమండలి వీధినాటకశిక్షణా శిబిరాలను నిర్వహించి ఔత్సాహికులకు స్ఫూర్తినిచ్చింది అటువంటి శిక్షణా శిబిరాలు మొదటిసారిగా 1989 మార్చి నెలలో ఉయ్యూరులోను, కర్నూలులోనూ విజయవంతంగా నిర్వహించబడినాయి జిల్లా స్థాయిలోను శిక్షణాశిబిరాలను నిర్వహిస్తోంది ప్రజా నాట్యమండలి

అంతేకాకుండా సఫ్దర్ హష్మీ జన్మదినమైన ఏప్రిల్ 12వ తేదీ జాతీయ వీధినాటక దినోత్సవంగా పరిగణింపబడుతూ, ఆరోజు రాష్ట్రవ్యాప్తంగా

వీధినాటకాలను ప్రదర్శించి సఫ్దర్ హష్మీ స్మృతికి నివాళులర్పించడం ఒక సంప్రదాయంగా మారింది

ఆంధ్ర ప్రజా నాట్యమండలికి ఈనాడు వివిధ రూపాల్ని ప్రదర్శించే దళాలు వెయ్యికిపైగా ఉన్నాయి వందల వీధినాటక దళాలు ఉన్నాయి

వీధి నాటికలు ప్రజాతంత్ర ఉద్యమాల అవసరాలు తీర్చాలనే క్రమంలో ఉద్భవించినవి కనుక, వాటిని రచించడంలోనూ, ప్రదర్శించడంలోనూ ఈ క్రింది జాగ్రత్తలు తీసుకొంటున్నారు

1 ఎక్కువమంది తమ శ్రమఫలితం ఎలా దోచుకోబడుతుందో తెలియని శ్రమజీవులు, గ్రామీణులే అధికం కాబట్టి ప్రజల జీవనాన్ని, ఆలోచనల్ని, అనుభవాల్ని, అనుభూతుల్ని, ఆచారాల్ని, సాంప్రదాయాల్ని, సంస్కృతిని దృష్టిలో ఉంచుకుని వీధినాటకం తయారు చేసుకోవాలి

2 రచన గ్రామీణుల అవగాహనాస్థాయికి అనుగుణంగా, సరళంగా, సూటిగా ఉండాలి

3 వివిధ స్థాయిల్లో అన్ని దళాలు ప్రదర్శించడానికి అనువుగా, నేర్చుకోవడానికి వీలుగా నాటిక ఉండాలి

4 వీలైనన్ని ఎక్కువ ప్రదర్శనలు యివ్వాలి కాబట్టి కళాకారులు ఎక్కువగా అలసిపోయే ఫ్రేమ్స్ ఉండకూడదు

5 ఒకరిద్దరు ప్రతిభగల కళాకారులపైనే ఆధారపడితే చాలా సందర్భాల్లో ఆనాటిక ఎక్కువ ప్రదర్శనలు నోచుకోకపోవడం జరుగుతుంది కనుక అటుయిటుగా అందరికి సమప్రాధాన్యత యిచ్చి రాలేకపోయినవారి పాత్రలు మిగిలినవారు పోషించే అవకాశం కల్పించాలి

6 నాటికలోని సంభాషణలు ఆయా ప్రాంతానికి అనువైన భాషలోకి మార్చుకునే వీలుండాలి

ప్రజా నాట్యమండలి ఆధ్వర్యంలో ప్రతి ఏటా నిర్వహించబడుతున్న వీధినాటకోత్సవాలవల్ల ఎన్నో కొత్త నాటికలు వెలుగులోకి వచ్చాయి ఆటబొమ్మలు, ఆగిపోని నాటిక, ఎలిమెంటరీ స్కూలు, మన చరిత్ర, అద్దం, కురుక్షేత్రం, గారడి, స్వయంవరం, రైతు, గొర్రెలు తిరగబడతాయ్ మొదలైనవి ప్రజానాట్యమండలి కీర్తిని యినుమడింపజేసిన వీధినాటకాలలో పేర్కొనదగినవి

## ఆగిపోని నాటిక

సఫ్దర్ హష్మి మెమోరియల్ ట్రస్ట్, న్యూఢిల్లీవారు రూపొందించిన వీధినాటిక 'ఆగిపోని నాటిక'

భారతదేశంలో విభిన్న భాషల్లో అనేక నాటక బృందాలు ఒకే రోజున వేలాదిగా ప్రదర్శించిన ఏకైక నాటిక 'ఆగిపోని నాటిక' ప్రజా కళాకారుడు సఫ్దర్ హష్మీకి భారత కళాజగతి సమర్పించిన అపూర్వ నివాళి ఇది భావ ప్రకటనా స్వేచ్ఛపై జరుగుతున్న దాడిని అత్యంత వ్యంగ్యాత్మకంగా చిత్రిస్తూ సహమత్ రూపొందించిన నాటిక 1990 జనవరి 2వ తేదీన సహమత్ పిలుపునందుకుని ఆంధ్రప్రదేశ్ నాట్యమండలి దళాలు రాష్ట్ర వ్యాప్తంగా ప్రదర్శనలిచ్చి హష్మీకి కళాంజలు లర్పించడం గర్వకారణం

ఒక రాజుగారికి తీవ్రమైన తలనొప్పి వస్తుంది సంగీతం వినడం వల్ల శిరోవేదన వచ్చిందనే కోపంతో ఆ రాజ్యంలో ఎవరూ పాటలు పాడకూడదనీ, రాజాజ్ఞ ధిక్కరించిన వారికి శిరచ్ఛేదం దండన అనీ ఆజ్ఞజారీ చేస్తాడు ఆ ఆజ్ఞను అమలు పరిచే రాజుగారి ఉద్యోగుల్లో అవినీతి పెరుగుతుందే తప్ప రాజ్యంలో పాటలు ఆగవు చివరికి రాజు చెవుల్లో కూడా సంగీతం ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది ప్రజలలో తిరుగుబాటు వస్తుంది రాజు, అతని పరివారమూ పరారు చిత్తగిస్తారు ఈ చిన్నకథ నేపథ్యంగా తీసుకొని ప్రజాస్వామ్యంలో భావప్రకటనా స్వేచ్ఛ గుత్తాధిపత్యంతోను, గూండాల చేతుల్లోనూ ఎలా చిత్రవధ చెయ్యబడుతుందో వివరించడమేగాక భావ ప్రకటనా స్వేచ్ఛను అణచివేయాలనుకోవడం అజ్ఞానమనీ, ప్రజాశక్తిముందు ఆ అణచివేత చర్యలు ఓటమిని చవిచూడకతప్పవని కూడా

వ్యక్తంచేశారు

సఫ్దర్‌హష్మీ 'హల్లాబోల్' నాటిక చివరి దృశ్యంలో మొదలైన ఈ 'ఆగిపోని నాటిక' ప్రజా శక్తికి ఎదురు నిలిచే శక్తి మరేదీ లేదనే 'ఆత్మవిశ్వాసం' ప్రకటిస్తూ అంతమవుతుంది ఈ లఘు వీధినాటిక 'నాటక్‌జారీ హై' అనే హిందీ నాటికకు అనువాదం తెలుగుసేత శ్రీమతి దేవి ఒక ప్రజా కళాకారుని దివ్య స్మృతికి నివాళులర్పిస్తూ యిటువంటి నాటికను దేశమంతా ఒకేరోజుప్రదర్శించడం భారత నాటక చరిత్రలో ఇదే ప్రథమం కావచ్చు

## ఎలిమెంటరీ స్కూలు

అత్యంత శ్రద్ధతో పిల్లల భవిష్యత్తుకు పునాదులు వేయవలసిన ప్రాథమిక విద్యను ప్రభుత్వం ఎంత నిర్లక్ష్యం చేస్తుందో కళ్లకు కట్టినట్లు చూపే వ్యంగ్య నాటిక 'ఎలిమెంటరీ స్కూలు' రచన ఓ వేంకట రమణ

పల్లెటూళ్లలో ప్రాథమిక పాఠశాలల తీరు ఎలా వుంటుందో ఆ పరిస్థితులకు ఒక నిలువుటద్దం ఈ నాటిక ఆరు నెలలైనా జీతాలకు నోచుకోని బడిపంతుళ్లు చెట్టుకింద బడి, చెట్లమీదినుంచి తరచూ రెట్టలు వేసే పక్షుల విన్యాసం, బడికి అటువైపు బహిర్భూమి, యిటువైపు శ్మశానవాటిక, బడి దగ్గర చీట్లపేక ఆడే ఆకతాయిలు, ఎడ్డెం అంటే తెడ్డెం అనే విద్యార్థులు, కనీసం ప్రాథమిక పాఠశాలనైనా పట్టించుకోని గ్రామపెద్దల ఉదాసీనత। వెరసి 'ఎలిమెంటరీ స్కూలు' వీధినాటిక దేశంలో సంఘంలో పెచ్చుపెరిగిపోతున్న ఘోరాలకు, నేరాలకు క్రమశిక్షణా రాహిత్యానికి పునాది ఎక్కడుందో ఈ ఎలిమెంటరీ స్కూలు' గుర్తు చేస్తుంది నేటి విద్యావ్యవస్థ స్వరూపాన్నిదైన్యస్థితిని ఎంతో సమగ్రంగా, సూటిగా వివరించగలిగింది ఈ నాటిక అతిశయోక్తి అనిపించే అంశం ఈ వీధినాటికలో ఒక్కటైనా లేదంటే అతిశయోక్తి కాదు

ఎలిమెంటరీ స్కూలంటే పిల్లలకు ఆటవిడుపు స్థలం అని భావించే వ్యక్తులకు, బాధ్యత మరచిన విద్యావేత్తలకు కనువిప్పు కలిగిస్తుంది ఈ వీధి నాటిక

## ఆటబొమ్మలు

ఈ నాటిక రచన శ్రీయుతులు భాషా, వలి, వెంగయ్య గార్లు, 'ఆటబొమ్మలు' వీధినాటిక ప్రక్రియలో వినూత్న ప్రయోగం పాలకుల అవినీతి, ప్రజల గతి, అభద్రతా స్థితిని ఇది బహిర్గతం చేస్తుంది 1989 సెప్టెంబర్ కర్నూల్ జిల్లాలో సహమత్ నిర్వహించిన అఖిల భారత వీధి నాటకోత్సవాల్లో శ్రీ టి జె రామనాథం ద్వారా మెరుగులు దిద్దుకొని వివిధ రాష్ట్రాల కళాకారులను ఉత్తేజపరిచింది

ఆటబొమ్మలు అమ్ముకునే వ్యక్తి, అక్కడ పోగైన జనానికి రకరకాల బొమ్మలు చూపిస్తాడు అవి మాట్లాడగల బొమ్మలని చెప్పడంతో వాటికి కీయిచ్చి ఆడించమని జనం కోరుతారు అలాగే అతను రకరకాల బొమ్మలకు ప్రాణంపోసి ఆడిస్తాడు బొమ్మలు మనుషులై మాట్లాడుతూ వారివారి నిజస్వరూపాలను బయటపెడ్తాయి వారి ప్రవర్తనలో వర్తమాన రాజకీయ వాతావరణం, రాజకీయ నాయకుల కుటిలత్వం, వంచనాశిల్పం యిత్యాది దుర్గుణాలు బయటపడతాయి చివరికి ఒక ప్రేక్షకుడు లేచి ముందుకొచ్చి, "ఆపవయ్యా బొమ్మలాయనా! ప్రజలకొక న్యాయం ప్రభువులకొక న్యాయం - ఇదెక్కడి న్యాయమయ్యా? వద్దు ఈ కేతిగాడు బంగారక్కలాంటి తోలుబొమ్మలరాజ్యం వద్దు అవినీతి, కులమత కొట్లాటలు, దోపిడీలేని రాజ్యంకోసం రండి పోరాడండి " అనిపిలుపు నివ్వడంతో నాటిక ముగుస్తుంది లోక సభ, అసెంబ్లీ ఎన్నికల్లోవామపక్ష, ప్రజాతంత్ర అభ్యర్థుల విజయానికి ఒక ప్రచార సాధనంగా ఈ 'ఆటబొమ్మలు' వీథినాటకాన్ని విస్తృతంగా ప్రదర్శించినట్టు తెలుస్తోంది

## రైతు

'ఇండియా లివ్స్ ఇన్ విలేజెస్' అన్నారు గాంధీజీ 'పల్లెటూళ్లే దేశానికి పట్టుగొమ్మలు', 'దేశానికి వెన్నెముక రైతు' అని కృషీవలుణ్ణి కొండమీద కూచోబెట్టిపొగడ్తల వర్షం కురిపించారు పెద్దలు మనది వ్యవసాయం పైన ఆధారపడిన దేశం అందుచేత రైతే దెశానికి అన్నదాత అయినా మన దేశంలో

అన్ని కష్టాలు రైతువే

సగటు రైతు కలలు, ఆశలు, బాధలు, కన్నీళ్లు పట్టించుకునే నాధుడు కరువయ్యాడు ఈ దోపిడీ వ్యవస్థలో పెట్టుబడి దారీ, భూస్వామ్య వర్గ ప్రయోజనాల మధ్య ఓ సామాన్య రైతు నలిగిపోతూ తనకు తెలియకుండానే తాను వ్యవసాయ కూలీగా దిగజారి పోతున్న దైన్యావస్థను శ్రీ దేవేంద్ర రచించిన 'రైతు' వీధినాటకం సువ్యక్తం చేస్తుంది ఈ నాటిక శ్రీ టి జె రామనాధంగారి దర్శకత్వంలోనూ, శ్రీ కె శాంతారావుగారి దర్శకత్వంలోనూ వందలాదిగా ప్రదర్శించబడి ప్రశంసలు పొందింది

ఒక నాటకబృందం అన్ని హంగులతో రంభారహస్యం అనే నాటకాన్ని ప్రజలముందు ప్రదర్శించబోతుండగా ఒక రైతు ముందుకొచ్చి శృంగార రసం రంగరించి గుమ్మరించడం కాదు మీకు చేవవుంటే నామీద - నాబోటి సామాన్య రైతుమీద నాటకం వేయండి అని సవాలు విసురుతాడు ఆ మాటలు చాలెంజిగా తీసుకొని ఆ నాటక బృందం 'రైతు' నాటకం అప్పటికప్పుడు మొదలుపెట్టి రైతులు పడే కష్టాలను, సమస్యలను, దోపిడీ వ్యవస్థకు వారెలా బలి అయిపోతున్నదీ అద్దంలోని ప్రతిబింబంలాగ చూపిస్తారు మార్కెట్లో దగా, బ్యాంకుల్లో అవినీతి, ఎరువుల కొట్లో మోసం, షావుకారు దుర్మార్గం, దళారీల దురాశ, గిట్టుబాటుకాని ధర - ముందు దగా, వెనక దగా, కుడియెడమల దగా దగా - ఇదే గ్రామీణ రైతు విషాద జీవితం

చివరి ఘట్టంలో పెట్టుబడిదారుడు, భూస్వామి అనే మాటలు ఈ నాటిక అంతరార్థాన్ని, ఆత్మను వెల్లడిస్తాయి

పెట్టు బజారుకు ఎప్పుడైనా వెళ్లావా?

రైతు వెళ్లాను

పెట్టు నువ్వడిగిన ధరకే సరుకులిచ్చేశారా?

రైతు కాదు వాళ్లు చెప్పిన ధరకే కొన్నాను

పెట్టు ఎందుకని?

రైతు సరకువాడిదే ధరకూడా వాడు నిర్ణయించిందే. అందుకు

భూస్వామి మరి ఈ పంట నీదికాదా? దానికి ధర నువ్వు చెప్పలేవా?

రైతు మేము అమ్మే విత్తనాల ధర నీవు నిర్ణయించవు మేమే నిర్ణయిస్తాము మేము అమ్మే మందులు మేము నిర్ణయించిన ధరకే నువ్వు కొనాలి

భూస్వా ఎరువులు మందులు మేము నిర్ణయించిన ధరకే నీవు కొనాలి

పెట్టు మా ఇష్టమొచ్చిన లాభాలు వేసుకొని అమ్ముకుంటాము

భూస్వా తెల్లారి లేచిందగ్గర్నుంచి నిద్రపోయేదాకా నువ్వు కొనే ప్రతి సరుకు ధర మేము నిర్ణయించేదే, చచ్చినట్లు కొనితీరాలి

పెట్టు కాని నువ్వు పండించిన పంట, అదే నువ్వు కొనే రక్తమాంసాలు కఠోర శోషలోంచి ఉద్భవించిన నీ కష్టార్జితం

భూస్వా (నవ్వి) అదికూడా మాకు నచ్చిన ధరకే నువ్వు అమ్మాలి

జివిత పర్యంతమూ కన్నీళ్లు తాగి బతికిన రైతుకు అన్యాయం, అవినీతి, అమానుషత్వం కోరల్లో చిక్కుకుని, అప్పుల ఊబిలో చిక్కుకుని విలవిలలాడుతూ, కొంపా గోడూ, తన సర్వస్వం పోగొట్టుకుని ఉన్మత్తుడుగా మారి అరణ్యరోదన చేస్తూ వుండటంతో వీధినాటిక ముగుస్తుంది

## ఇంకా తెల్లారలే

రచన శ్రీ జి జనార్ధనరెడ్డి నేటివరకు నూరు - నూటయాభై ప్రదర్శనలవరకు మండల స్థాయినుండి జాతీయ స్థాయిదాకా యిచ్చామని రచయిత స్వగతంలో తెలియజేశారు దీనిని ఎ పి ఎన్ టి సంస్థ ప్రోత్సహించింది

దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా ఆ స్వాతంత్ర్యం యొక్క ఫలితాలు సామాన్యుడికి అందనంతవరకు స్వాతంత్ర్యం రాలేదని అనుకోవడంలో తప్పులేదనీ, యింకా

తెల్లవారలేదనీ ఆ చీకట్లు విడిపోలేదని సామాన్యుడు భావిస్తున్నాడని, ఎప్పుడు తెల్లవారుతుందోనని ఇంకా ఎదురు చూస్తూనే ఉన్నాడని విశదం చేశారు రచయిత

ఇందులో పాత్రల పేర్లు లేవు. 1వ, 2వ, 3వ అంటూ సంఖ్యలతోనే వ్యవహరిస్తారు

ఈ నాటికకు ప్రజల పోరాటాలనేపథ్యం ఉంది ఒక్కొక్కదాని వెనక చారిత్రక సంఘటనలున్నాయి వాటిని ఒక క్రమ పద్ధతిలో పేర్చి కళారూపాన్నివ్వడమే రచయిత చేసిన పని

ఆయన కేవలం పదిహేను సంవత్సరాల లోపు పిల్లల్ని తీసుకుని ప్రదర్శనలో ప్రయోగాలు చేస్తున్నారు ఇది స్ట్రీట్ ప్లే ప్రదర్శనలో కూడా అపూర్వ ప్రయోగం

'ఇంకా తెల్లారలే' స్ట్రీట్ ప్లే ముగింపు ఒక బలమైన ఆచరణాత్మక సందేశం వందల సంవత్సరాలు దోపిడి చరిత్ర విశ్లేషణ చేసిన బానిస తన బిడ్డలకు కేవలం విషాద వారసత్వాన్నే ఇస్తున్నాడా? లేదు 'పోరు బైలెల్లినాది నను సాగనంపు' అని అడుగుతున్న కొడుకును 'ఎల్లిరా వో కొడుకా పోరు బైలెల్లినాది యెల్లరా వో కొడుకా' అని సాగనంపుతున్నాడు

"తమ తాత ముత్తాతల తరంనుంచి నెత్తురు చెమటలు, నెత్తురు నెత్తురుగానే నేలలో చిందించి భూస్వాముల గరిసెల్లోకి తమ ప్రాణాన్ని ఎత్తి ఇచ్చిన తండ్రులు తమ కొడుకుల రక్త త్యాగాలను వొడిసి పట్టుకోవడానికి వొంటిమీద పంచెలు పరిచారు అవి పై పంచెలు కావు పంచ ప్రాణాలు, పేగు బంధాలు అందుకు పోరులో కలిసిపోతున్న కొడుకును చూస్తూ తండ్రి వీడ్కోలు చెప్తాడు 'కొడుకు పోరుబాటలో కల్సినందుకు బాధపడుతున్నావా తాతా!' అని అడిగితే లేదు బిడ్డ, నేను చెయ్యలేని పని నా కొడుకు జేత్తున్నందుకు నాకు సంబరంగనే ఉన్నది కాని కొడుకు మల్ల కండ్లబడ్తడో లేదోనని బాధకూడా వున్నది బిడ్డ' అంటాడు విప్లవ సాహిత్యంలో మానవానుబంధాలకు, సరళరేఖలాంటి ముగింపులే వుంటాయని వస్తున్న విమర్శలకు ఒక మానవీయ సమాధానంగా వుంది ఈ దృశ్యం

# మహానగరం

ప్రసిద్ధ రంగస్థల నటుడు, దర్శకుడు అయిన శ్రీ డి యస్ యన్ మూర్తి రాసిన వీథినాటకం 'మహానగరం', మొదటి ప్రదర్శనలోనే భేష్ అనిపించుకుంది

మొదటిసారిగా హైదరాబాదు నగరానికి వచ్చే ఓ సామాన్యుడు రైలుదిగి ప్లాట్‌ఫారమ్ మీద అడుగుపెట్టిన క్షణంనుంచీ గమ్యస్థానం చేరుకునేలోగా అతడు పడేపాట్లు ఈ నాటికలో అతి సహజంగా చిత్రించబడ్డాయి ప్రతి సన్నివేశంలోనూ ఎంత హాస్యం ఉందో అంత లోతైన విమర్శకూడా ఉంది ఈ వీధినాటికలో విద్యానగర్ కాలనీకి వెళ్లాలని చెబితే విజయనగర్ కాలనీకి తీసుకెళ్లి ప్రయాణీకుడితో పోట్లాటకు దిగే రిక్షావాలా మనస్తత్త్వం, బెదిరించే ధోరణి, అతనితో లాలూచిపడి ప్రయాణీకుణ్ణి మందలించే పోలీసు తత్త్వం, బస్సుల్లో కండక్టర్ల దురుసుతనం, నిర్లక్ష్యం వంటి నిత్య సత్యాలను ఏమాత్రం అతిశయోక్తులు లేకుండా, సున్నితంగా సన్నివేశాలతో పొదిగి ఆకర్షణీయంగా చెప్పడంలో కృతకృత్యులయ్యారు నాటకర్త

నగరానికి కొత్తగా వచ్చిన ఒక వ్యక్తి ఆదారిన పోతున్న ఒక పెద్దమనిషితో "అయ్యా! బస్సు స్టాప్ ఇదేనా?" అని అడిగితే, అతనిచ్చే సమాధానం ఇది "అవునండి బస్‌స్టాప్ ఇదేగాని, బస్సు ఇక్కడే ఆగుతుందని గ్యారంటీ లేదు ఈ బస్టాపుకి ఆరఫర్లాంగు అటుగాని అర ఫర్లాంగు ఇటుగాని ఎక్కడైనా ఆగొచ్చు" అంటాడు ఈ అనుభవం నగరవాసులకి కొత్తకాదు ఇలాంటి చెణుకులెన్నో ఉన్నాయి ఈ నాటికలో అక్కడక్కడా సందర్భానుసారంగా వాడిన మూకాభినయం ఈ వీధినాటికకు ప్రత్యేక ఆకర్షణ తెచ్చిపెట్టింది కొన్ని వీధినాటికలలో తప్పెట్లు మోత, నినాదాలు, అరుపులు వంటి హంగామా మోతాదుకు మించిపోయి కృతకంగా అనిపిస్తుంది అలాంటి వాటికి 'మహానగరం' దూరంగా ఉంటూ చెప్పదలచుకున్న సందేశాన్ని లేదా విషయాన్ని సూటిగా ఆడంబరం లేకుండా హుందాగా చెప్పగలిగింది

# టామీ - టామీ - టామీ

శ్రీ అత్తిలి కృష్ణ రాసిన 'టామీ - టామీ - టామీ' హాస్య ప్రధానమైన వీధినాటిక వస్తువు చిన్నదే అయినా దీనిలో వ్యంగ్యం ఆలోచింపజేస్తుంది

ఆరోజు మామూళ్లు కళ్ళజూడ లేకపోయినందుకు హెడ్డు గంగరాజు చిరచిరలాడుతున్నాడు పైపెచ్చు సిక్స్ నాట్ ఫోర్ అంతోయింతో వసూలుచేసుకున్నాడని బీటు కానిస్టేబుల్ చెప్పగా విని మరీ అగ్గిబుగ్గి అయిపోయాడు ఇంతలో కుక్కకరిచిందంటూ ఓ కుర్రాడు ఏడుస్తూ వచ్చాడు కుక్కను పట్టి తెప్పించాడు హెడ్డు కుక్కకోసం దాని ఆసామి వెతుక్కుంటూ రాకపోడు అతని ద్వారా లక్ష్మీప్రసన్నం కాకపోదు అని ఆశ పీడిస్తోంది అతని మనసుని కుక్క యజమానిగా మూడు, నాలుగు పేర్లు వినిపించాయి ఎవడైతేనేం కొంతైనా వసూలు కాకపోదని అతని ధీమా కుక్క కరచిన కుర్రాడు వెళ్లిపోతుంటే ఆపుచేశాడు వాడొచ్చి సాక్ష్యం చెప్పాలట! ఈ ఫార్సు జరుగుతుండగా పోలీసు ఆఫీసరుగారి ప్యూనొచ్చి ఆకుక్క తన యాజమానిదని చెప్పి తీసుకుపోయాడు అన్ని విధాల నష్టంవచ్చినట్టు అనవసరంగా తిట్టడం, కేకలెయ్యడం ప్రారంభించాడు అంతసేపూ ఓర్పుతో అన్నీ సహిస్తున్న ఆ కుర్రాడు ఇక తట్టుకోలేక పిచ్చికుక్కలాగ హెడ్డుగారిని కరిచేసి పారిపోయాడు అంతటితో కధ కంచికి, హెడ్డు గంగరాజు అమెరికన్ ఆస్పత్రికి ప్రయాణం కట్టారు

ఈ నాటికలో 'పోలీసు భాష' అనే మసాలా ఉన్నా మోతాదు మించకుండా జాగ్రత్తపడ్డారు రచయిత శ్రీ అత్తిలి

కళ్లముందు కన్పించే సమస్యను గాలికి వదిలేసి, తమ స్వార్థప్రయోజనం కోసం ఆరాటపడే అధికారులమనస్తత్వానికి అద్దం పడుతుంది ఈ నాటిక ఆద్యంతమూ నవ్వించే ఈ వీధినాటికలో పోలీసు మనస్తత్త్వంమీద, ప్రవర్తనమీద అనేక విసుర్లున్నాయి అమాయకుల్ని, భయపడేవారిని పోలీసులు దుర్భాషలాడటం, వాళ్లు చెప్పేది వినకపోగా తాము చెప్పిందే వేదం అన్నట్లు ప్రవర్తించడం వంటి లక్షణాలను ఈ నాటికలో స్పష్టంగా చూడవచ్చు

# యుగ సంధ్య

ఆంధ్ర విశ్వ విద్యాలయ నాటక విభాగంవారు 1974 లో శ్రీ అత్తిలి కృష్ణారావు రాసిన 'యుగసంధ్య' నాటికను విశాఖపట్నం వీథుల్లో ప్రదర్శించడంతో ఆధునిక వీధినాటక రంగావిర్భావానికి నాంది జరిగింది ఆ విధానం ఎంతో విజయవంతం కావడంతో ఆంధ్రనాటకరంగంలో మరెన్నో వీథినాటికలు వెలుగుచూడటానిక వీలు కల్గించింది ఆ ప్రదర్శనం

ఒక యుగంలో జరిగే మోసాలు, ఘోరాలు, పాపాలకు మరో యుగం చరమగీతి పాడుతుంది కొత్తదనానికి బాటలు వేస్తుంది ఆ యుగసంధిలో బతకాలంటే బాధలు తప్పవు "బాధలకు బతుకేడ్చినా, ఆకలి ఏడ్చినా మనల్ని చూసి జాలిపడేదెవ్వరు? నీకు నేను నాకు నీలాంటివాడు మరొకడు సేదదీర్చాలితప్ప మనపై వాడెవడూ మనకేసి రాడు మనల్ని చూడలేడు మనబతుకుల్ని మార్చలేడు తల్లీతండ్రి, తమ్ముడూ, చెల్లెలు, అందర్నీ దొంగలుగా మార్చాలని చేస్తున్న ఈ కాలం యుగసంధ్య కాదా? కాలే కడుపుల్ని, మండే గుండెల్ని కార్చే కన్నీటిని ఆపలేని ఈ కాలం అంధకార సంధియుగం కాదా? దిక్కులేని దీనుల్ని దొంగలుగా, తమపాలిటి శత్రువులుగా చేసే ఈ పరిస్థితుల్లో ఏ నవశక్తి ఈ స్థితికి మంచిని కలిగిస్తుంది? ఏ మహాతల్లి తన అమృత హస్తాలతో మనల్ని లేపనెత్తుతుంది?''[9] అంటూ సత్యానికి ప్రతినిధియైన సత్యం పాత్ర నేలకు ఒరిగిపోతుంది

సమాజంలో జరిగే మోసాలు, పాపాలు ఎల్లకాలం అలాగే సాగవనీ, బాధితులు ఎప్పుడూ బాధితులుగానే ఉంటూ పల్లకీ మోస్తూ ఉండరనీ, తిరగబడి తమ హక్కుల్ని కాపాడుకుంటారని, ఆరోజు ఎంతో దూరంలో లేదనే ఆశాభావాన్ని ప్రకటిస్తుందీ నాటిక ఈ నాటికలోని వస్తువు దృష్ట్యా ఇది వీధినాటికగా కాక రంగస్థల నాటికగా ప్రదర్శిస్తే ఇందులోని ప్రాసస్త్యము మరింత స్పష్టంగా అభివ్యక్తం కావడమే కాక సందేశాన్ని సూటిగా అందించగలుగుతుందని విశ్వసించవచ్చు

# ఊరేగింపు

శ్రీమతి అత్తిలి పద్మావతి కృష్ణ రచించిన 'ఊరేగింపు' వీధినాటిక బాదల్ సర్కార్ రాసిన 'జులుస్' లేదా 'మిఛిల్' అనే బెంగాలీ నాటికకు స్వేచ్ఛానుసరణ

"యం కె రైనా విశాఖపట్టణంలోని శిక్షణాశిబిరంలో ఈ విధానంతో 'ఊరేగింపు' నాటికను ప్రదర్శించటంతో నాటకరంగంలో నూతన అధ్యాయం ప్రారంభమైంది అనంతరం విశాఖపట్టణానికి సోమయాజుల గోపాలకృష్ణ మరింత ప్రతిభతో నాటికకు దర్శకత్వం వహించి సుమారు 60 ప్రదర్శనలు ఇచ్చి వీధినాటక రంగ ఉద్యమానికి మంచి స్ఫూర్తినిచ్చారు"

సామాజిక, రాజకీయ సమస్యలపై తరచూ ఎన్నో ఉద్యమాలు సాగుతూ ఉంటాయి సమస్యల పరిష్కారంకోసం ఊరేగింపులు, హర్తాళ్లు జరపటం నిత్యజీవితంలో మన కళ్లకు కనిపించే దృశ్యాలే! కాని ఈ ఊరేగింపులు సమిష్టి ప్రయోజనాల సాధనకోసం కాక, వైయక్తిక ప్రయోజనాలకోసమే సాగుతున్నట్టు వాటి ఫలితాలు ఋజువు చేస్తాయి పదవి పోగొట్టుకున్న రాజకీయ నాయకుడు ఏదో ఒక ప్రజా సమస్యను ఊతంగా తీసుకుని ప్రజలను పురికొల్పి, వారిని రెచ్చగొట్టి ఉద్యమం లేవదీస్తాడు ఊరేగింపులు, హర్తాళ్లు, సమ్మెలు చేయిస్తాడు అందులో నష్టపోయేది, ప్రాణాలు కోల్పోయేది సామాన్య ప్రజలే! అయినా నాయకులకు అదేం పట్టదు తమ స్వార్థ ప్రయోజనాలమీదే వారి దృష్టి కొన్ని సందర్భాలలో ఊరేగింపు ఎందుకు జరుగుతున్నదో అందులో పాల్గొంటున్నవారికే తెలియదు తమ గమ్యమేమిటో తెలియకుండానే బలిపశువులైపోతున్నారు అమాయక ప్రజలు ఈ పరిస్థితులు మారాలని ప్రజలలో చైతన్యం రావాలని ఉద్బోధిస్తుంది 'ఊరేగింపు' నాటిక

ఈ నాటిక ఆబ్‌స్ట్రాక్ట్ గా ఉంటుంది సన్నివేశాలలో సంక్లిష్టత మెండుగా ఉంది సామాన్య ప్రేక్షకుని అవగాహనాశక్తికి అందనంతగా అన్వయ కాఠిన్యం గోచరిస్తుంది మూకాభినయం, ప్రతీక ధోరణిలో నడిచే సన్నివేశాలు, పాత్రల ప్రవర్తన 'ఇది ఒక

కొత్త ప్రయోగం' అనే అంశాన్నే ఎక్కువ గుర్తు చేస్తాయేగాని సమస్యలవైపు ప్రజల దృష్టిని మరలింపలేవని స్పష్టం చేస్తాయి

## దారితప్పిన ఆకలి.

శ్రీ పరుచూరి వెంకటేశ్వరరావు రచించిన 'దారితప్పిన ఆకలి' మొదట్లో రంగస్థల నాటికే అయినా, దాన్ని వీధి నాటికగా మలచుకొని ప్రదర్శిస్తున్నారు నేటి నాటక సమాజాలవారు

ప్రతి మనిషిలోను వస్తుత కొంతైనా మంచితనం, ఉన్నత భావాలు ఉంటాయి వాటికి బద్ధుడై ఉండాలనే అనుకుంటాడు కాని అతనికి ఎదురయ్యే సమస్యలు, ముఖ్యంగా ఆకలి అతనిలోని మానవత్వాన్ని హరించివేస్తూ స్వార్థపరుడిగా తయారుచేస్తాయి మధ్యతరగతి మనిషిని మధ్యతరగతి దోచుకోవడమేకాదు, కింది తరగతివాణ్ణి కింది తరగతివాడే దోచుకునే పరిస్థితి నెలకొని ఉంది దానికి కారణం ఆకలి ఈ ఆకలిని అడ్డుపెట్టుకుని ఉద్యమాలకు ప్రాణం పోస్తున్నారు నాయకులు వారి మాటల మాయాజాలంలో పడి విద్యావంతులుకూడా మోసపోతున్నారు ఐకమత్యాన్ని గంగలో కలిపి స్వార్థంవైపు పరుగుతీస్తున్నారు క్రమంగా ఆకలి మనుషుల్ని దారితప్పిస్తున్నదనీ ఈ పరిస్థితినుంచి మనుషులు ముఖ్యంగా యువతరం మేలుకోవాలని ప్రబోధిస్తుంది 'దారితప్పిన ఆకలి' నాటిక

## పెద్ద బాలశిక్ష

నేటి విద్యా వ్యవస్థపై సంధించిన అస్త్రం ఆకెళ్ల సత్యనారాయణ మూర్తిగారి 'పెద్దబాల శిక్ష' వీధినాటిక

డొనేషన్ చెల్లించి సీటు సంపాదించటంతో మొదలయ్యే స్కూలు చదువు ఒక్కొక్క దశలో ఎన్ని మలుపులు తిరుగుతుందో, హాస్యరసస్ఫోరకంగా ఈ నాటికలో వివరించబడింది

ధనార్జనయే తమ ప్రధాన లక్ష్యంగా భావించి వ్యాపారధోరణిలో నడపబడే ప్రైవేట్ స్కూళ్లు, జీతం తీసుకోవడమే తమ పరమావధిగా తలచే అధ్యాపకులు, ఏదోవిధంగా సర్టిఫికెట్లు తెచ్చుకోవడమే తమ లక్ష్యం అనుకునే విద్యార్థులు, పరీక్షా ఫలితాలు ప్రకటించటంలో అవకతవకలు జరిగి విద్యార్థుల జీవితాలు నాశనమవుతున్నా విద్యావిధానంలో ఉన్న లోపాలను చక్కదిద్దుకోని విద్యాధికారులు-ఈ నాటికలో ప్రాతినిధ్యం వహించే అంశాలు విద్యార్థుల విశృంఖలత్వం, క్రమశిక్షణారాహిత్యం ఉపాధ్యాయుల అశ్రద్ధ, బాధ్యతారాహిత్యం, విద్యను కేవలం వ్యాపారంగా చేసే వ్యక్తుల స్వార్థ పరత్వం, తల్లిదండ్రుల నిస్సహాయస్థితి। ఇలా ఎన్నో అంశాలను గుదిగుచ్చి చూపిస్తుంది 'పెద్దబాలశిక్ష' నాటిక విద్యారంగంలోని లోపాలను, అవాంఛనీయ ధోరణులను నిశితంగా నిర్భయంగా వెల్లడిస్తూనే ఈ దుస్థితినుంచి విద్యారంగాన్ని, విద్యార్థి లోకాన్ని కాపాడమని సందేశం అందించారు నాటకకర్త శ్రీ ఆకెళ్ల

ఈ నాటిక రంగస్థల నాటిక గానే ఎక్కువసార్లు ప్రదర్శించబడింది అనేక పరిషత్తుల్లో ఉత్తమ ప్రదర్శనకు బహుమతులు అందుకొన్నది

విద్యావ్యవస్థలోని లోపాలను వేలెత్తి చూపుతూ, విద్యావిధానంలో సమూలంగా మార్పులు రావలసిన ఆవశ్యకతను గుర్తుచేసే వీథినాటికలను సరస్వతీ నమస్తుభ్యం' అనే పేరుతో శ్రీ గోళ్ళపాటి నాగేశ్వరరావు, 'ధర్మాగ్రహం' పేరుతో శ్రీకంఠా హనుమంతరావు రచించారు 'సరస్వతీ నమస్తుభ్యం' నాటికలో వీధినాటక విధానం, ప్రొసీనియం థియేటర్ పద్ధతుల సమ్మేళనం ఉంది

## గోగ్రహణం

వీథినాటక ప్రక్రియకు అత్యధిక ప్రచారం చేకూర్చినవారిలో శ్రీ తనికెళ్ల భరణి పేర్కొనదగినవారు వీరు రచించిన 'గోగ్రహణం' వీథినాటిక వందలసార్లు ఆంధ్రదేశంలో ప్రదర్శించబడింది

"యుగాలు గడిచినా తరాలు మారినా పురుషాధిక్యత ఉక్కుపాదాల క్రింద

నలిగే గుండెలవిసేలా ఆర్తనాదాలు చేస్తున్న అబలల వేదన అరణ్య రోదనగానే మిగిలిపోతున్నది స్త్రీ సమస్యలపై ఎన్నో రచనలు వచ్చాయి హృదయపు పొరలను చీల్చుకుంటూ వెళ్లి ఇంతఘాటుగా చెప్పిన రచన మరొకటి లేదు శతాబ్దాల తరబడి స్త్రీని పురుషాధిపత్యంలో బానిసగనే ఉంచుకున్నారేగాని ఆమెకు కూడా వ్యక్తిత్వం, స్వాతంత్ర్యం ఉంటాయని మరిచిపోతారు ప్రస్తుత సమాజంలో స్త్రీ ఎటువంటి సమస్యలను ఎదుర్కొంటుందో విప్పి చెప్పే ప్రయత్నాన్ని ఈ నాటిక చేసింది. శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా స్త్రి ఎలా నలిగిపోతుందీ బొమ్మలు గీసినట్లు అద్భుతంగా చెప్పారు" [10]

సూత్రధారుడు "అసలు ఆడదంటే ఎవరు నాయనా?" అని అడిగిన ప్రశ్నకు యువకులు ఇచ్చే ఈ క్రింది సమాధానాలలో స్త్రీ అంటే సమాజంలో ఎలాంటి అసమర్థమైన పదార్థంగా ముద్రవేశారో తెలుస్తుంది

"ప్రేమిస్తే ప్రేయసి!"

"మొగుడొదిలేస్తే బజారుది"

"మొగుడు చస్తే విధవ"

"పొద్దు పొడిచినప్పటినుంచి పొద్దుగూకేదాకా ఎద్దులా పని చేయాలి"

"మంత్రిలా సలహాలివ్వచ్చుగాని ఆఖరి నిర్ణయం మాత్రం మగమహారాజుదే'

"కొంపకొచ్చేసరికి తల్లిలా పిండాకూడు వండిపెట్టాలి"

"పగలు పనిమనిషిలా వున్నా పక్కమీదికి వచ్చేసరికి పండులా ఉండాలి"

"చూడటానికి రూపాయల సంచిలా ఉండాలి"

"మగపినుగు ఎన్ని తప్పులు చేసినా క్షమించవలెను"

"ఇవన్నీ తూచా తప్పకుండా ఆచరిస్తే బొందితోనే స్వర్గానికి వెళుతుంది

"లేకపోతే మేమే పంపిస్తాం"

ఈ నాటిక చివరలో సూత్రధారుని పలుకుల్లో కావ్యార్థాన్ని ఆవిష్కరిస్తూ స్త్రీ లోకానికి కర్తవ్యబోధ చేశారు నాటికాకర్త శ్రీ భరణి

"ఇదే న్యాయం ఆటవిక న్యాయం ఈ జనారణ్యంలో బలవంతమైన జంతువు బలహీనమైనదాన్ని బలితీసుకుంటుంది అయినా స్వేచ్ఛ ఒకరు పారేస్తే తీసుకునే ముష్టికాదు మీకీ దుస్థితికి కారణం ఏమిటో తెలుసా? మీ అందం, మీ అమాయకత్వం, మీ మంచితనం, మీ సహనం, మీ క్షమ - అయినా గోమాత కన్నీటిని చూసి కరిగిపోయే పులులెక్కడ ఉన్నాయి తల్లీ! ఇక్కడ బ్రతకాలంటే ఆడది పులై బ్రతకాలి ఆడది అబల కాదు, అతి బల పరాశక్తి సృష్టికారిణి కాదు లయకారిణి కూడా మమ్మల్ని క్షమించకు తల్లీ! మమ్మల్ని క్షమించకు మా కల్లబొల్లి కబుర్లనీ, మా కుహనా ఆదర్శాలని, నీకు స్వేచ్ఛనిషేధించిన మా ధర్మ శాస్త్రాలనీ, నీకే మాత్రం చేయూతనివ్వలేని మా జాతి నపుంసకత్వాన్ని క్షమించకు, క్షమించకు"[11]

శ్రీ భరణి రచించిన 'కొక్కొరొకో' నిరుద్యోగ సమస్య తీవ్రతను అభివ్యక్తంచేసే శక్తిమంతమైననాటిక ఇది కేవలం రెండు పాత్రలతోనే నడిచే నాటిక ఇద్దరు నటులు సామాజికుల ఉత్కంఠను, ఆసక్తిని ఒక గంటసేపు నిలబెట్టడానికి ఎంత నటనా సామర్థ్యం కావాలో ఈ నాటికను ప్రదర్శించేవారికి అనుభవైకవేద్యమౌతుంది ప్రదర్శనా సౌలభ్యానికి 'కొక్కరోకో' వొక మచ్చుతునక

శ్రీ భరణి రాసిన 'గొయ్యి' నాటిక కూడా ప్రజాదరణ పొందిన నాటికలలో ఒకటి మనిషిలోని నైతిక స్థాయిని పెంపొందించే రచన ఇది జన్మలో ఎప్పుడూ ఎవరికీ ఉపకారం చేయని మనస్తత్వం ఉన్నవారు పరులనుంచి అలాంటి ఉపకారాన్ని కానీ సహాయాన్ని కానీ అర్థించటం వ్యర్థం అని ప్రబోధిస్తుంది 'గొయ్యి' నాటిక

## హల్లాబోల్

ప్రముఖ ప్రజాకళాకారుడు, కవి, రచయిత, గాయకుడు అయిన సఫ్దర్ హష్మీ రచించిన 'హల్లాబోల్' అనే వీధినాటిక కార్మికులను పేద మధ్యతరగతి ప్రజలను

సాంఘికంగానూ, రాజకీయంగానూ చైతన్య పరచి సంఘటితపరచాలన్న ధ్యేయంతో రాయబడింది హిందీ మూలాన్ని శ్రీమతి చాగంటి తులసి, శ్రీ ఎ జి యతిరాజులు గార్లు తెలుగులోనికి అనువాదం చేశారు

అన్ని వీథినాటికల్లో సామాన్య లక్షణంగా కనిపించే నినాదాలు, పాటలు, విమర్శనాస్త్రాలు, ఛలోక్తులు 'హల్లా బోల్' నాటికలోనూ ఉన్నాయి కార్మికులను చైతన్యపరచేందుకు వీథిలో నాటక ప్రదర్శన జరుగుతూ ఉంటుంది గ్రామస్థులు చుట్టూ గుమిగూడి ఆసక్తిగా చూస్తూ ఆనందిస్తూ ఉంటారు ఆ సమయంలో అక్కడికొచ్చిన పోలీసు జవాను నినాదాలతో విప్లవ నాటకం ఆడటానికి వీల్లేదని అభ్యంతరం లేవదీస్తాడు కావాలనుకుంటే ప్రేమ-ప్రణయం నాటకం ఆడుకోమంటాడు అలాగేనని నటబృందం కథమార్చి ప్రేయసి - ప్రియుల సంభాషణా ఘట్టం మొదలుపెడతారు జీతాలు చాలకపోవడం, కనీసం వెయ్యి రూపాయలు జీతం రాందే పెళ్లి సాధ్యం కాదనీ కనీస వేతనం సాధించాలని, సంఘర్షణను మరింత ఉధృతం చెయ్యాలని ప్రేమికుల జంట అనుకోవడం, ఆ దృశ్యాలు చూసి పోలీసు కానిస్టేబుల్ మళ్లీ అభ్యంతరం చెప్తాడు నటబృందం కథ మార్చి నాటకం ప్రదర్శిస్తూన్నా సి ఐ టి యు ప్రచారం కొనసాగిస్తూనే ఉంటారు వాళ్లతో విసిగిపోయిన కానిస్టేబుల్ కోపం పట్టలేక "నాకు తెలుసురా భడవా! మీరు జెండాల్లేకుండా కూడా కూలివాళ్లని రెచ్చగొట్టగలరని' చాలు! ఇహ నేనేం వినదలచుకోలేదు ఇక్కణ్ణుంచి పోండి" అని హుంకరిస్తాడు (పుట 19)

చివరకు విప్లవ నినాదాలు లేకుండా యాజమాన్యానికి అనుకూలమైన నాటకం వేస్తామని మాటిస్తారు నాటక సమాజంవాళ్లు కానీ ఈ సారి మరింత విజృంభించి తాము అనుకున్న పద్ధతిలోనే ప్రదర్శన పూర్తి చేస్తారు

ఈ నాటిక ప్రధాన లక్ష్యం ప్రచారమే గనుక ఆమేరకు 'హల్లా బోల్' విజయం సాధించినట్టే అనుకోవచ్చు ఆంధ్ర ప్రజా నాట్యమండలి వారు యీ నాటికను చేపట్టి వందలాది ప్రదర్శనలిచ్చారు ఈ నాటికను ఎక్కడ ప్రదర్శించినా స్థానిక సమస్యలను కూడా చేర్చి జనరంజకంగా ప్రదర్శిస్తున్నారని తెలుస్తుంది

# పోలీసు చరిత్ర

ప్రజాస్వామ్యంలో ప్రజల సంక్షేమంకొసం ప్రభుత్వం ఎన్నో చట్టాలు చేస్తుంది ఎన్నో నియమాలను, నిబంధనలను రూపొందిస్తుంది చట్టవ్యతిరేకంగా వ్యవహరించిన వారిని, నిబంధనలను అతిక్రమించిన వారిని పట్టుకుని న్యాయస్థానం ముందు నిలబెట్టి వారిని శిక్షింపచేయడం పోలీసు శాఖ కర్తవ్యం అంతే కాదు నేరాలు జరగకుండా ముందు జాగ్రత్తలు తీసుకుని శాంతి భద్రతలను పరిరక్షించడం కూడా పోలీసు శాఖ బాధ్యతల్లో అంతర్భాగమే

ప్రజల ధన, మాన, ప్రాణాలను కంటికిరెప్పలా చూసుకొవడం మాట దేవుడెరుగు, కంచే చేను మేస్తుంటే ప్రజలు ఎవరితో చెప్పుకోవాలి? పోలీసు శాఖలో కొంతమంది నిజాయితీపరులు, కర్తవ్యతాపరాయణులు ఉండొచ్చు కాని వారి నోరు నొక్కేసి వారి ప్రయత్నాన్ని నీరుగార్చే ప్రబలశక్తుల ప్రభావంతో జరగవలసిన మేలు, సహకారం ప్రజలకు, ముఖ్యంగా పేదవారికి అందకుండా పోతున్నది పోలీసు శాఖలో అలసత్వం, నిర్లక్ష్యం, నిష్క్రియాపరత్వం, బలవంతులకు వత్తాసు పలకడం వంటి దుర్లక్షణాల విశృంఖలత్వం కనిపిస్తోంది - ఈ అంశాలను వివరించడమే 'పోలీసు చరిత్ర' నాటిక ప్రధానోద్దేశం ఈ వీధి నాటికను రచించింది కూడా సఫ్దర్ హష్మి అనువాదకులు శ్రీమతి చాగంటి తులసి, శ్రీ ఎ జి యతిరాజులు గార్లు

అయిదు దృశ్యాలున్న ఈ నాటికలో అయిదు సంఘటనలు జరుగుతాయి పట్టపగలు ఒక పౌరుణ్ణి అడ్డగించి, ఉన్నది దోచుకుని అతడిని చంపేసి పారిపోతారు ముగ్గురు గూండాలు ఎదురొచ్చిన పోలీసులను కొట్టి పరారు అవుతారు

శవ పరిశోధన చేసిన పోలీసులు ముక్త కంఠంతో "రాత్రి హనుమాన్ పేటలోని రామాలయం వీథిలో ఒక శవం పడి ఉంది గుర్తు పట్టడానికి వీలుగా ఆ శవం ఇరవైనాలుగు గంటలసేపు స్టేషన్‌లో వుంచబడుతుంది నేరస్థులను పట్టుకునే ప్రయత్నం జరుగుతోంది" (పుట 38) అంటూ శవాన్ని తీసుకుని అక్కడినుంచి వెళ్లిపోతారు

రెండవ దృశ్యంలో యాజమాన్యం కార్మికుల మధ్య సంఘర్షణ జరుగుతుంది పారిశ్రామిక శాంతిని పరిరక్షించడం పోలీసుల కర్తవ్యం కనుక కార్మికులపై తుపాకులు పేలుస్తారు దౌర్జన్యానికి తలపడ్డ కార్మిక సంఘం గూండాలను అదుపు చేసేందుకు పోలీసులు కాల్పులు జరపవలసి వచ్చింది'' అని ప్రకటిస్తారు (పుట 39)

మూడవ దృశ్యంలో ముగ్గురు రౌడీలు ఓ కాలేజి అమ్మాయి వెంటబడి ఆమె శీలాన్ని దోచుకుంటారు అక్కడికి వచ్చిన పోలీసులు ఆమె చుట్టూ చేరుతారు పోలీసుల ప్రకటన విన్పిస్తుంది

"నిన్నరాత్రి పట్టణంలో ఒక అధ్వాన్నమైన వీధిలో ఒక యువతి రోడ్డు ప్రక్క అపస్మారక స్థితిలో పడి ఉంది ఆ యువతి దుండగులచే చెరచబడిందని అనుమానించబడుతుంది ఆమె ఆస్పత్రిలో చేర్చబడింది దర్యాప్తు కొనసాగుతోంది' ' అని (పుట 40)

"దొంగలు, దోపిడీదార్లు, మోసగాళ్లనుంచి పట్టణ ప్రజలను కాపాడడం పోలీసుల కర్తవ్యం పర్మిట్, లైసెన్సు లేకుండా వ్యాపారం చేసేవాళ్లనుంచి వినియోగదారులను రక్షించడం, తిరుగుబోతులూ, కొంపాగోడూ లేనివాళ్లూ, అనుమానాస్పద వ్యక్తులపై ఓ కన్నువేసి వుంచడం కూడా పోలీసుల పనే'' (పుట 41) అని ప్రకటించిన పోలీసులు, పాతబట్టలకు స్టీలు సామానులు అమ్మే ఒక స్త్రీని స్టేషన్‌కి తీసుకెళ్లి అత్యాచారం చేస్తారు!

"పోలీసు వారి విధినిర్వహణలో జోక్యం చేసుకోకండి! చట్టాన్ని మీ చేతుల్లోకి తీసుకోకండి!' అని ప్రకటిస్తారు చట్టాన్ని తమ చేతుల్లోకి తీసుకున్న పోలీసులు!

అత్యాచారానికి గురి అయిన కాలేజి అమ్మాయి, స్టీలు సామాన్ల అమ్మాయి కోర్టుకెక్కుతారు 'ఐదవ దృశ్యంలో'

"అవసరమైన రుజువులు లేనందువల్ల ఈ కేసును ఇక్కడితో రద్దు చేస్తున్నాను' ' అని ఒక్క కలం పోటుతో కేసుకు కర్మకాండ జరిపించేశారు కోర్టులో న్యాయమూర్తి

ఈ నాటికలో సంభాషణలు పాలు తక్కువ, దృశ్యం పాలెక్కువ నిత్య జీవితంలో సామాన్య ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలను ఆవిష్కరించడమే యీ వీధినాటిక ధ్యేయం కనుక రసనిష్పత్తి కోసం సాహిత్య విలువల కోసం గాలించడటం వృథా ప్రయాస అవుతుంది

## కైలాసంలో కోర్టు

శ్రీ బి బాబూరావు రచించిన 'కైలాసంలో కోర్టు' అనే నాటిక తొలత 'అన్యాయం' అనే పేరుతో రంగస్థలనాటికగా రాయబడింది అటుతర్వాత వీధినాటికగా మార్చబడింది

త్రిలోక సంచారి అయిన నారదుడు భూలోకంలో విశేషాలు తెలుసుకోవడానికి దివి నుండి భువికి దిగొచ్చి ఒక సామాన్యుణ్ణి కలుసుకుంటాడు

సామాన్యుడు ఒక నిరుద్యోగి డిగ్రీ చేత పట్టుకుని ఆరేళ్లుగా ఉద్యోగ ప్రయత్నం చేస్తున్నా ఫలితం లేదు పస్తులతో చెలిమి చేస్తుంటాడు 'అంత పనికి రాని చదువు ఎందుకు చదువుకున్నావు' అనే ప్రశ్నకు 'చదువుకున్న తర్వాత కదా మనం చదివిన చదువు ఎందుకూ పనికిరాదని తెలిసేది' అని ఎదురు ప్రశ్న వేస్తాడు సామాన్యుడు "ఈ దేశంలో మనిషి బ్రతకడమే పెద్ద సమస్యలా ఉంది ప్రతి వస్తువు కరువే మనిషికి రావలసిన ఏ నిత్య జీవితావసర వస్తువు దొరకదు ప్రతిదానికి క్యూలే పంచదారకి క్యూ, కిరసనాయిల్‌కి క్యూ, ఆఖరికి మంచినీళ్లకు కూడా క్యూలే మనిషి జీవితం సగం క్యూలకే సరిపోతుంది" (పుట 7) అని వివరిస్తాడు పాలకులు తమ స్వార్థాన్ని చూసుకొంటూ ప్రజల గోడు పట్టించుకోవడం లేదని విన్నవిస్తాడు అంతేకాదు "స్వామీ తమరే కలుగజేసుకొని యీ దేశాన్ని పట్టి పీడిస్తున్న లంచగొండితనాన్ని, బంధుప్రీతిని, జరుగుతున్న అన్యాయాల్ని అక్రమాల్ని అరికట్టండి" అని నారదుడిని ప్రార్థిస్తాడు సామాన్యుడు

"ఇలాంటి చిక్కు సమస్యలకు పరిష్కారమేమిటని ఆదిదేవుడైన శంకరుని దగ్గరకు వెళ్లి అడుగుదాం" అని మానవుడిని వెంటపెట్టుకొని కైలాసానికి వెళ్తాడు నారదుడు

వాళ్లు చెప్పిందంతా సావకాశంగా విని శంకరుడు విస్తుపోతాడు పూర్వం భూలోకంలో ఏ ఒకరిద్దరో దుర్మార్గులుంటే వారికోసం ఒక అవతారం ఎత్తితే సమస్య పరిష్కారమైపోయేది ఇప్పుడు దుర్మార్గుల సంఖ్య అసంఖ్యాకంగా పెరిగింది కనుక ఆరుకోట్ల ప్రజలకోసం ఆరుకోట్ల అవతారాలు ఎత్తడం దుస్సాధ్యం అంటూ తన అశక్తతను వెల్లడించాడు శంకరుడు

భూలోకంలో సమస్యల మూలం తెలుసుకోవడానికై భూలోకవాసుల్ని కొందరిని పిలిపించి విచారణ సాగిస్తాడు శంకరుడు తాను రోజురోజుకూ వస్తువులు ధరలు పెంచి విక్రయించడానికి కారణం అధికారులేననీ వాళ్లకు అడుగడుగునా లంచాలు యివ్వడం కోసం ధరల పెంచక తప్పడంలేదనీ, అందువల్ల ఇందులో తన తప్పేమీ లేదని సంజాయిషి చెప్పుకున్నాడు చిల్లర దుకాణం చలమయ్య ఆఫీసర్‌ను ప్రశ్నిస్తే అతనిచ్చిన సమాధానం ఇది

'నేను అధికారిగా నాకు నేను రాలేదు ఆ పదవిని నేను డబ్బు పెట్టి కొనుక్కున్నాను స్కూలులో సీటు డబ్బుబెట్టి కొంటున్నాను నాకు కావలసిన పదవి డబ్బుపెట్టి కొనుకున్నాను ఈ దేశం గురించి నేనెందుకు పట్టించుకోవాలి? నేను ఖర్చుపెట్టిన డబ్బు వడ్డీతో సహా రాబట్టుకోవడం తప్పేంలేదే? అని ఎదురు ప్రశ్న వేస్తాడు

పాలకుల ప్రతినిధిగా మంత్రిగారిని పిలిపించి విచారిస్తారు ఓటుకు పది రూపాయలిచ్చి తాను ఎన్నికల్లో గెలిచాడని ఆ డబ్బు రాబట్టుకొడానికై తాను వ్యాపారస్థుల వద్ద నుంచి, పారిశ్రామికవేత్తల నుంచీ, ప్రజల నుంచీ డబ్బు పిండుకోవడంలో తప్పులేదని కుండబద్దలు కొట్టి చెప్పేస్తాడు మంత్రిమహాశయుడు

ఇవన్నీ వింటున్న శివుడికి మతిపోయినట్టయింది ఇంత తెలివిమీరిపోయిన మానవుల్ని కైలాసంలో మరింతసేపు ఉంచితే అసలుకే మోసం వస్తుందని భయపడ్డాడు శంకరుడు

"ఈ మానవులు వీళ్ల సమస్యలు తీర్చడం ఎవరివల్లా కాదు అక్కడ మానవులు డబ్బుకు అమ్ముడు పోకుండా సరయిన వాళ్లను ఎన్నుకోనంత కాలం

భారతదేశాన్ని యిలాంటి అసమర్థులే పరిపాలిస్తు ఉంటారు ఆ విషయంలో మానవులకు ఏ రకంగానూ సహాయం చెయ్యలేము బుద్ధిపొరపాటున మిమ్మల్ని ఈ లోకానికి రప్పించినందుకు మమ్మల్ని క్షమించండి వెళ్లిరండి' అని వారిని భూలోకానికి పంపించేస్తారు నారద శంకరులు

నేటి సామాజిక, రాజకీయ, నైతిక పరిస్థితుల్ని వ్యంగ్యంగా చిత్రించిన ఈ నాటిక ప్రదర్శనాపరంగా రాణించింది అనేక నాటక సమాజాలు 'కైలాసంలో కోర్టు' ను రంగస్థల నాటికగాను, వీథి నాటికగానూ ప్రదర్శించాయి

నిరుద్యోగ సమస్య గురించి శ్రీ టి జె రామనాథంగారు 'నిరుద్యోగ సమస్య' అనే నాటికను రాశారు అక్షరాస్యత ప్రాముఖ్యాన్ని గూర్చి 'అక్షరభిక్ష' అనే నాటికను డాక్టర్ తంబుగారు, వివిధ ప్రభుత్వ శాఖల్లో విస్తరించి, విలయ తాండవం చేస్తున్న లంచగొండితనం గురించి అత్తిలి కృష్ణారావుగారు, 'జంతర్ మంతర్ మామూళ్లు' అనే నాటికను, పెన్షన్ కోసం కటకటలాడి చివరికి ప్రాణాలు కోల్పోయిన బడిపంతులు విషాదగాథను తెలిపే 'రుద్రవీణ' నాటికను శ్రీ యండమూరి వీరేంద్రనాథ్, రోజురోజుకు పెరుగుతూ సామాన్య జనాన్ని భయభ్రాంతుల్ని చేస్తున్న ధరల భయంకర పరిస్థితిని గురించి 'ధరలు బాబోయ్ ధరలు' అనే నాటికను శ్రీ ఉదయకుమార్ సోనీ, మత్తుపానీయాలు బడుగు వర్గాలను చిన్నాభిన్నం చేస్తున్న విషమ పరిస్థితిని గూర్చి 'సారాసంహారం' అనే నాటికను డా కందిమళ్ల సాంబశివరావు ప్రభృతులు రచించారు

ఆంధ్ర ప్రజానాట్యమండలి, జన నాట్యమండలి బృందాలు వీథినాటక ప్రక్రియను చేపట్టి సమాజ సమస్యలపై నాటికలు రాయించి జనచైతన్యం కోసం, ఉద్యమ స్ఫూర్తితో వీథినాటకాలు ప్రదర్శిస్తున్నారు

కానీ, వీథి నాటకాలకు తెలుగు దేశంలో రావలసినంత ప్రాచుర్యం రాలేదు ప్రజలవద్దకు నాటకాలను తీసుకుపోవాలనే వారి ధ్యేయం గొప్పదే అయినా ప్రజలనుంచి ప్రోత్సాహం లభించడం లేదు వీధి నాటికలలో నినాదాలు, ప్రచారతత్వం అధికంగా కన్పిస్తుంది నినాదాల చాటున సందేశం

మాటుమణిగిపోతుంది లేదా బలహీనంగా విన్పిస్తుంది వీథినాటకాల భవిష్యత్తు సందేహాస్పదమే అనుకోవలసివస్తుంది

1990 తర్వాత వీథినాటకాల ఉధృతి బాగా క్షీణించింది ఒకటి రెండు చోట్ల ప్రజానాట్యమండలి వంటి సంస్థలు ఏర్పాటు చేసే వీధినాటకోత్సవాల కోసం ముస్తాబై వచ్చే నాటికలు లేదా వీథినాటక పరిషత్తులలో పాల్గొనడానికి సమాయత్తమయ్యే నాటికలు మినహా ప్రస్తుతం వీథినాటకాలు విస్తృతంగా ప్రదర్శింపబడటం లేదు అంటే ఏ ఆశయ సాధన కోసం వీధి నాటకాలు ఆవిర్భవించాయో ఆ లక్ష్యం వైపు సాగిపోవడం లేదు ప్రధానాశయం కుంటుపడి ప్రస్తుతం కేవలం వీథి నాటకాలు కూడా నాటకోత్సవాలకు ఆయా సంస్థల వార్షికోత్సవాలకు పరిమితమైపోతున్నాయి ఇది అభిలషణీయ మైన పరిణామం కాదు ప్రజల వద్దకు నాటకాన్ని తీసుకుపోయే కళాప్రక్రియ, ప్రజలనుంచి దూరంగా జరిగిపోతూవుండటం నాటక కళాభిలాషులను కలవరపరుస్తుంది ఈ దుస్థితిని అధిగమించి వీథి నాటకం నవనవోన్మేషంగా చైతన్యస్ఫూర్తితో ముందుకు నడిచే మంచి రోజులు రావాలని కళాప్రపంచం ఎదురు చూస్తోంది

# ఆధునిక వీధి నాటికలు

| నాటిక పేరు | రచయిత |
|---|---|
| 1 యుగ సంధ్య | అత్తిలి కృష్ణారావు |
| 2 దారితప్పిన ఆకలి | పరుచూరి వేంకటేశ్వరరావు |
| 3 టామీ టామీ టామీ | అత్తిలి కృష్ణారావు |
| 4 ఉరేగింపు | అత్తిలి పద్మావతీ కృష్ణ |
| 5 పెద్ద బాలశిక్ష | ఆకెళ్ళ సత్యనారాయణ మూర్తి |
| 6 మంది రాజ్యం | ఆకెళ్ళ సత్యనారాయణ మూర్తి |
| 7 గోగ్రహణం | తనికెళ్ళ భరణి |
| 8 గొయ్యి | తనికెళ్ళ భరణి |
| 9 కొక్కరకో | తనికెళ్ళ భరణి |
| 10 అక్షర భిక్ష | డాక్టర్ తంబు |
| 11 హల్లా బొల్ | సఫ్దర్ హష్మీ అనువాదం-చాగంటి తులసి,ఎ జి యతిరాజులు |
| 12 పోలీసు చరిత్ర | సఫ్దర్ హష్మీ అనువాదం-చాగంటి తులసి,ఎ జి యతిరాజులు |
| 13 నేటి చదువులు | టి జె రామనాధం |
| 14 నిరుద్యోగ సమస్య | టి జె రామనాధం |
| 15 కురుక్షేత్రం | దేవేంద్ర,పట్టాభి |
| 16 ఆటబొమ్మలు | వలి,భాషా,వెంగయ్య |
| 17 అద్దం | దేవేంద్ర |
| 18 రైతు | దేవేంద్ర |
| 19 గొంగెత్తి నినదించు | (హల్లా బొల్) అనువాదం పట్టాభి |
| 20 బాకా | శాంతారామ్ |
| 21 కవిగారి కనువిప్పు | సాంబిరెడ్డి |
| 22 అంతం కాదిది ఆరంభం | టి జె రామనాధం |
| 23 కైలాసంలో కోర్టు | బి బాబురావు |

| | |
|---|---|
| 24 ఆకలి చావులు | వంశీ |
| 25 గొయ్యి | తనికెళ్ళ భరణి |
| 26 కుక్కల్ని కరచిన కుందేళ్ళ | బొల్లిముంతల సాంబశివరావు |
| 27 జనవాహిని కదిలింది | డి యస్ యన్ మూర్తి |
| 28 మహా నగరం | డి యస్ యన్ మూర్తి |
| 29 విద్య | జి జనార్దన రెడ్డి |
| 30 రాజకీయ కబడ్డీ | జి జనార్ధన రెడ్డి |
| 31 రైట్ | పి నరసింహరావు |
| 32 రుద్రవీణ | యండమూరి వీరేంద్రనాథ్ |
| 33 ధరలు బాబోయ్ ధరలు | ఉదయకుమార్ సోనీ |
| 34 మన చరిత్ర | టి జె రామనాథం,కె శాంతారావు,దేవీ |
| 35 రైలు బండి | నడిమింటి నరసింగరావు |
| 36 సారాసంహారం | డా కందిమళ్ళ సాంబశివరావు |
| 37 పంట-పంట | జె ఎన్ |
| 38 టడ | జె ఎన్ |
| 39 శబ్దం శబ్దం శబ్దం | దివికుమార్-ఉదయ్ |
| 40 చీమ కుట్టింది | ప్రజానాట్యమండలి |
| 41 అప్పా?అమ్మకమా? | ప్రజానాట్యమండలి |
| 42 కరువు బతుకులు | అరుణోదయ |
| 43 ఇంకా తెల్లారలె | జి జనార్దన రెడ్డి |
| 44 విముక్తి | జి జనార్దన రెడ్డి |
| 45 పిన్నీసు-పల్లికాయ | జి జనార్ధన రెడ్డి |
| 46 ఏప్రిల్ ఫస్టు | జి జనార్ధన రెడ్డి |
| 47 ఆగిపోని నాటిక | సహమత్ |
| 48 ఎలిమెంటరీ స్కూల్ | ఓ వేంకట రమణ |
| 49.గారడి | జగ్గరాజు |
| 50 గొర్రెలు తిరగబడ్డాయ్ | దేవేంద్ర |
| 51 స్వయంవరం | దేవేంద్ర |

# తొమ్మిదవ ప్రకరణం

## నాటక పరిషత్తులు - ప్రయోగాలు

ఈనాడు తెలుగు నాటకం, ఉప్పెనలా వచ్చిపడుతున్న చలనచిత్రాల ప్రభావానికి, టి వీ ల ధాటికి పడిపోకుండా నిటారుగా నిలబడి వుందంటే, దానికి- అంకితభావంతో నిస్వార్థంగా కళాసేవ చేసే త్యాగమూర్తుల నిర్మాణాత్మక కృషి కొంత కారణమైతే, వ్యయప్రయాసలకోర్చి రాష్ట్రవ్యాప్తంగా నిర్వహించబడుతున్న నాటక పరిషత్తులు యిస్తున్న తోడ్పాటు ప్రధాన కారణం

సామాజికులు నాటకంపై శీతకన్ను వేసి నిరాదరిస్తున్న ఈపరిస్థితులలో, నాటక పరిషత్తులు కూడా కనుమరుగైతే కళారంగం కాంతివిహీనం కావడం తథ్యం పరిషత్తులు నిర్వహిస్తున్న పాత్ర గురించి తక్కువ అంచనా వేస్తూ చులకనగా మాట్లాడే వాళ్ళుంటారు ఆది వాళ్ళ యథార్థ దృష్టి లోపాన్ని, ఆవగాహనా రాహిత్యాన్ని వెల్లడిస్తూందే తప్ప ప్రత్యామ్నాయాన్ని సూచించే తత్వం కాదనవచ్చు

నాటక కళోపాసకులలోని అజ్ఞాత శక్తిని, ప్రతిభా వ్యుత్పత్తుల్ని వెలికి తెచ్చి వికసింపచేయడంలోను, ప్రోత్సహించడంలోనూ పరిషత్తుల సేవ అనుపమానమైనది

ఏ రంగంలోనైనా పోటీవల్ల వాసిలో మార్పులు రావడం జరుగుతుంది వ్యాపారస్థులు పోటీపడితే నాణ్యతగల వస్తువు తక్కువ ధరకు దొరికే అవకాశాలుంటాయి కళాకారులు పోటీపడితే ఉత్తమ కళ బహిర్గతమవుతుంది వారిలో ఆత్మవిశ్వాసం పెరుగుతుంది ఆత్మస్థైర్యం గట్టిపడుతుంది 'స్పర్థయా వర్థతే విద్య' కదా!

నాటకపోటీలు నిర్వహించడం అనే సంప్రదాయం ఆధునిక కాలంలో ప్రారంభమైనప్పటికీ ఆ ఆచారం ఇతర దేశాలలో ప్రాచీన కాలంలోనే అమలులో ఉండేదని తెలుస్తూంది

గ్రీసు దేశంలో ఆనాటి మిగిలిన అన్ని రంగాలలో మాదిరిగానే డయొనిసస్ ఉత్సవ నాటకాల్లో కూడా పోటీలు వుండేవి ముగ్గురు నాటకకర్తలు ఒక్కొక్కరు ఒక్కొక్క రొజున మూడ వెరువేరు నాటకాలను కాని, ఒకే కధకు సంబంధించి, క్రమబద్ధంగా వ్రాయబడ్డ మూడు నాటకాలు కాని (వీటిని ట్రిలజి' అంటారు) ప్రదర్శించాలి దాని తర్వాత ఒక సాటిర్ నాటకం ఉండాలి మూడు రోజులపాటు జరిగే ఈ పోటిలు అనంతరం - నాల్గవరోజున - ఆ నాటకకర్తలకు మొదటి, రెండవ, మూడవ బహుమతులను యిచ్చే వారు న్యాయనిర్ణేతలు ఈ బహుమతులు ధనరూపంలో కాక, గౌరవ పురస్కారాలుగా మాత్రమే వుండేవి ఈ పోటీల్లో "న్యాయనిర్ణయం చెయ్యడానికి పదిమంది న్యాయనిర్ణేతలను ఎన్నుకొనే వారు "[1] అని వివరించారు డా మొదలి నాగభూషణ శర్మగారు

ప్రసిద్ధ గ్రీకు నాటకకర్తలైన ఎస్కిలస్ (క్రీ పూ 525 - 456), సాఫోక్లిస్ (496 -406), యురిపిడిస్ (క్రీ పూ 480 - 406) అప్పటి నాటక పోటీలలో పాల్గొని గౌరవపురస్కారాలను అందుకున్నారని తెలుస్తుంది

తెలుగు దేశంలో 1914 నాటినుంచే నాటక పోటీలు ఆరంభమైనట్టు తెలుస్తోంది శ్రీ కె వెంకట రామయ్య అనే పుస్తకాల వ్యాపారస్థుడు తొలిసారిగ 1914లో ధర్మవరం వారి చిత్రనళీయం నాటక ప్రదర్శన పోటీలు నిర్వహించారు 1915 లో బందరులో ఇచ్ఛాపురపుయజ్ఞన్న శాస్త్రి గారి రసపుత్ర విజయం నాటకానికి పోటీలు నిర్వహించారు మరుసటి సంవత్సరం బందరులోనే వడ్డాదివారి 'వేణీ సంహారం' నాటక పోటీలు జరిగాయి 1916 లో శ్రీ పురాణం సూరిశాస్త్రి ఆంధ్రనాటక నామావళి సంస్థకు అధ్యక్షులై రెండు సంవత్సరాల పాటు నాటకపరిషత్తు అనే పేర పోటీలు జరిపారు 1917 లో గుంటూరులో సత్యహరిశ్చంద్ర పాత్ర ధారణలో అఖండఖ్యాతి గాంచిన హరిప్రసాదరావు న్యాయ నిర్ణేతల్లో ఒకరుగా బలిజేపల్లి వారి 'సత్యహరిశ్చంద్ర పోటీలు నిర్వహించారు 1923 జనవరిలో మల్లాది కవిరాజుగారి నాయకత్వంలో మిత్రులందరూ కలసి గంజాం మండల ఆంధ్రనాటక కళాపరిషత్తు అనే పేరుతో నాటకపోటీలను పోలాకీ అనే గ్రామంలో జరిపారు[2] అని నాటక పోటీల పూర్వచరిత్రను తమ సిద్ధాంత వ్యాసంలో పేర్కొన్నారు

డా కందిమళ్ల సాంబశివరావుగారు

ఈ విధంగా నాటకపోటీల ప్రాముఖ్యాన్ని, ఆవశ్యకతను ఆనాడే పెద్దలు గుర్తించి ఆ బాటలో కొంతవరకు కృషిచేసినప్పటికీ, నాటక పోటీలను క్రమబద్ధంచేసి ఆ విధానాన్ని వ్యవస్థీకరించే ప్రయత్నం చేయలేదు 1929 నాటికి గాని ఈ కార్యం తుదిరూపం దాల్చలేదు

## ఆంధ్రనాటక కళాపరిషత్తు స్థాపన

శ్రీ విశ్వనాధ కవిరాజు, శ్రీ వనారస గోవిందరావు, శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్య గారల సంకల్పబలంతోను, కృషితోను 19 6 1929 తేదీన ఆంధ్రనాటక కళాపరిషత్తు వెలుగులోకి వచ్చింది

తెనాలిలో జరిగిన పరిషత్ సభలకు శ్రీ విశ్వనాధ కవిరాజుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు మూడు రోజులపాటు జరిగిన ఈ మొదటి పరిషత్ సభకు చిన పూర్ణయ్య పంతులుగారు, దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు వరుసగా అధ్యక్షత వహించి సభా కార్యక్రమాలను నిర్వహించారు పరిషత్ సభలలో నాటకరంగానికి సంబంధించిన అనేక విషయాలపై చర్చలు జరిపారు వీటివలన సత్వర ఫలితాలు ఏమీ లేకపోయినప్పటికీ భవిష్యత్తులో నాటక కళాభివృద్ధికై చేయవలసిన పనులకు, నిర్మాణాత్మకమైన ,పధకాలకు అంకురార్పణ జరిగింది ఆ సభలోనే!

అప్పటినుంచీ పరిషత్ సభలు మద్రాసు, గుడివాడ, బందరు, విజయవాడ, తెనాలి ఇలా ఒక్కొక్క సంవత్సరము ఒక్కోచోట జరుగుతూ వచ్చాయి పరిషత్తు సభలలో పగటిపూట నాటక చర్చలతో సాగిపోయి రాత్రిపూట పసందైన నాటక ప్రదర్శనలు జరిగేవి ఆ నాటకాల స్థాయి, ఆ నటుల క్రమశిక్షణ, సమిష్టికృషి అందరికీ ఆదర్శప్రాయంగా ఉండేవి

ఏది ఏమైనప్పటికీ, 1944వ సంవత్సరంలో ఆంధ్రనాటక కళాపరిషత్తును కొందరు పెద్దలు పునర్వ్యవస్థీకరించే వరకు అంతగా చెప్పుకోదగిన కృషికాని, అభివృద్ధికానీ జరగలేదు

శ్రీయుతులు రాజా రంగయ్యప్పారావు గారు, యర్రోజు మాధవాచార్యులుగారు, కాజ వేంకట్రామయ్యగారు, ప్రసాదరావు గారు, దుక్కిపాటి మధుసూదన రావు గారు, పసల సూర్యచంద్రరావు గారూ ఇంకా మరికొందరు పెద్దలు కలసి పరిషత్ నిర్వహణభారాన్ని వహించి, పరిషత్తుకు ఒక నియమావళిని ఏర్పరచి, ప్రణాళికను సిద్ధంచేశారు అప్పటి నుంచీ పరిషత్ కార్యక్రమాలు నిర్విఘ్నంగా, ద్విగుణీకృతోత్సాహంతో కొనసాగుతూ వచ్చాయి ప్రతియేటా నాటక పోటీలు జరపడం ఒక ముఖ్యకార్యక్రమంగా చేపట్టడంతో ఆ నిర్ణయం ఆంధ్ర దేశంలో నాటక సంఘాలలో అపూర్వ చైతన్యాన్ని కలిగించింది పరిషత్తు నాటక పోటీలకు రూపొందించిన నియమావళి ఈ విధంగా ఉంది

1 సాంఘిక నాటక, నాటికలను మాత్రమే ప్రదర్శించాలి

2 ఏ సమాజానికి ఇష్టమైన నాటక, నాటికలను ఆ సమాజం ప్రదర్శించవచ్చు

3 స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలి

4 అయిదు సంవత్సరాలక్రితం ప్రకటితమైన నాటకాలు, నాటికలు పోటీకి పనికిరావు

5 ఒకసారి పరిషత్తు పోటీలలో ప్రదర్శించబడిన నాటకం, నాటిక తిరిగి పరిషత్తు పోటీలలో ప్రదర్శించడానికి వీలులేదు

6 ఒక నాటకంలో గాని, నాటికలోగాని వేషం వేసినవారు ఇంకొక నాటకంలోగాని, నాటికలోగాని వేషం వేయరాదు ఒక నాటకంలో మాత్రం వేయవచ్చు

పై నిబంధనలు ఆదునిక సాంఘిక నాటకాల రచన, ప్రదర్శనల స్వరూప స్వభావాలలో అపూర్వమైన మార్పులు తెస్తాయనీ, అవే నాటకరంగాన్ని శాసించి ముందుకు నడిపిస్తాయనీ ఆనాటి పరిషత్ పెద్దలు కూడ ఊహించలేదు

సంగీత ప్రధానమైన 'పౌరాణిక నాటకాలు' మాత్రమే నాటకాలనీ, సాంఘిక నాటకాలను చిన్నచూపు చూసేవారికి సాంఘిక నాటకం సత్తా ఏమిటో చూపించే అవకాశం కలిగింది సమకాలీన సమస్యలను ప్రతిబింబించే నాటకాలవల్ల సంఘానికి ఉపకారం జరుగుతుందనే భావన బలపడిపోయింది అయిదు సంవత్సరాల క్రితం రాసిన నాటక, నాటికలు పోటీలకు పనికిరావన్న నిబంధన

వల్ల కొత్త నాటకాలను వ్రాయించుకోవలసిన ఆవశ్యకత ఏర్పడింది  ఇది పరోక్షంగా నాటకకర్తలకు నూతనోత్తేజాన్ని ప్రోత్సాహాన్ని యిచ్చింది  సమకాలీన సమస్యలను తీసుకొని కొత్త ధోరణిలో నాటక రచన ప్రారంభించారు  ఒక నాటకం కంటే మించిన గుణం తమ నాటకాల్లో ఉండాలనే దృక్పధంతో నిత్యనూతనత్వం కోసం అన్వేషిస్తూ ఆకర్షణీయమైన నాటక సృష్టి చేయడంలో పోటీ పడ్డారు రచయితలు  శ్రీయుతులు కొండముది గోపాలరాయ శర్మ, ఆచార్య ఆత్రేయ, బెల్లంకొండ రామదాసు, అవసరాల సూర్యారావు, పినిశెట్టి శ్రీరామమూర్తి, యన్ ఆర్ నంది, భమిడిపాటి రాధాకృష్ణ, డి వి నరసరాజు, కొడాలి గోపాలరావు, దాసం గోపాలకృష్ణ వంటి నాటకకర్తలు ఈ పోటీలద్వారా వెలుగులోకి వచ్చినవారే

అలాగే ఎందరో నటీనటులకు పట్టుగొమ్మగా తోడ్పడింది  ఈ పరిషత్తు శ్రీయుతులు ఎన్ టి రామారావు, రామశర్మ, రమణమూర్తి, చలం, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, పెరుమాళ్లు, చదలవాడ కుటుంబరావు, వల్లం నరసింహారావు, జగ్గయ్య, కె వి యస్ శర్మ, కె వెంకటేశ్వరరావు, రావి కొండలరావు, పామర్తి సుబ్బారావు, తిలకం, శ్యామల ప్రభృతుల భవిష్యత్తుకు బంగారు బాటలు వేసింది ఈ పరిషత్తు

ఎదురీత, ఎన్ జి ఓ , మాభూమి, నాటకం, కాళరాత్రి, పునర్జన్మ, పంజరం, చిల్లరకొట్టు చిట్టెమ్మ, కీర్తిశేషులు, మొదలైన ఉత్తమ ప్రమాణాలుగల నాటకాలు, తుఫాన్, ఎవరుదొంగ, ప్రగతి, ప్రార్ధన, దిష్టిబొమ్మలు, బంగారు సంకెళ్లు, వెంకన్న కాపురం, సుల్తానీ, చీకటితెరలు, జ్వలితజ్వాల, కళ్లు వంటి నాటికలకు తొలివేదికయై ఉత్తమ కళాసృష్టికి కాణాచిగా వెలుగొందింది ఈ నాటక పరిషత్తు

స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలన్న నిబంధన వల్ల స్త్రీలు నాటకరంగంలోకి ప్రవేశించి, నాటకాన్ని తమ వృత్తిగా స్వీకరించి మనుగడ సాగించగల వాతావరణం ఏర్పడింది  ఈ విధంగా బళ్లారి రాఘవగారి నినాదం పరిషత్తు ద్వారా కార్యరూపం ధరించిందన్నమాట

"అలాగే నాటక ప్రదర్శనా రీతుల్లో కూడా కొత్తకొత్త ప్రయోగాలకు అవకాశం

దొరికింది ఉత్తమ ప్రదర్శనకు పోటీలలో ఒక బహుమతి యివ్వడం ద్వారా సమిష్టి ప్రదర్శనలో రంగాలంకరణకు లైటింగ్, సౌండ్ విషయాలకు దీనివలన ప్రాముఖ్యం వచ్చింది నటులందరి సమిష్టి కృషే నాటక విజయానికి కారణంగాని, ఏదో ఒకరో ఇద్దరో నటులవల్ల కాదని నిర్ధారణ అయింది "[3]

ఆంధ్రనాటక కళాపరిషత్తు సాధించిన ముఖ్య విజయాలను గురించి విమర్శకులు శ్రీ రమణానంద్ గారు ఒక వ్యాసంలో యిలా క్రోడీకరించారు

1 ఏకనటనిష్ఠమైన నాటక సమాజవ్యవస్థ నుంచి సమిష్టి సహకారం ఆలంబనగా ఉండే సిసలైన నాటక వ్యవస్థను రూపొందించింది

2 సాంఘిక నాటకాలు నాటకాలే కాదని త్రోసిరాజనే రోజుల్లో నాటకానికి సాంఘిక ప్రయోజనం ఉండితీరాలని, కేవలం వినోదం దాని ధ్యేయం కాదని చాటి చెప్పి, తన పోటీల ద్వారా ఆ విషయాన్ని నిరూపించింది

3 పద్యనాటకాల్లోని రాగధాటికి తట్టుకోలేక ఒదిగి తప్పుకుపోతున్న గద్య నాటకాల వెన్ను చరిచి, మీరే నాయకులని, భవితవ్యం మీదేనని అభయహస్తమిచ్చింది

4 వృత్తినటులు కిరాయిదార్ల చేతుల్లో కీలుబొమ్మలై, ఆ కిరాయిదార్ల నాటక కళను డబ్బు కోసం బజార్లో పణంగా పెడుతుంటే దానికొక నాటకోద్యమాన్ని ప్రారంభించి తిరిగి నాటక కళను సరైన పంథాలో నడిపించింది

5 నాటక పోటీలను సుష్టు అయిన వాతావరణంలో క్రమబద్ధంగా నిర్వహించి ఎందరో నటీనటులను, దర్శకులను, రచయితలను వెలుగులోకి తెచ్చింది

సంక్షిప్తంగా చెప్పాలంటే, ఈనాటి సాంఘిక నాటకోద్యమం ఘనతంతా ఆంధ్రనాటక కళాపరిషత్తువలన వచ్చిందన్న విషయాన్ని మరచిపోరాదు "[4]

ఆంధ్రనాటక కళాపరిషత్తు పోటీలు కలిగించిన ప్రేరణతో అక్కడక్కడా నాటక పరిషత్తులు ప్రారంభమయ్యాయి నర్సాపూర్, రాజమండ్రి, గొల్లప్రోలు, గూడూరు, నెల్లూరు, తిరుపతి పట్టణాలలో నాటక పోటీలు రాష్ట్రస్థాయిలో నిర్వహించసాగాయి దరిమిలా ప్రొద్దుటూరు, కావలి పట్టణాలో కూడా నాటక పోటీలు మొదలైనాయి ఈనాడు నాటక పోటీలు నిర్వహిస్తున్న కళా సంస్థలు మన రాష్ట్రంలో రెండు

వందలకు పైగా ఉన్నాయి (చూడు అనుబంధం) అయితే ఇవన్నీ ప్రతి ఏటా నిరాఘాటంగా నడుస్తున్నాయని చెప్పలేం ఏభై సంస్థలు మాత్రం క్రమబద్ధంగా నాటకపోటలు నిర్వహిస్తున్నాయి

1990 నుంచే నాటక పరిషత్తుల నిర్వహణలోను, ప్రగతిలోను గణనీయమైన మార్పులు వచ్చాయి 1993 నుండి 1996 వరకు నాటక పోటిలు నిర్వహించిన సంస్థల వివరాలను ఈ క్రింద పొందుపరచడమైనది

| సంవత్సరము | పోటీలు నిర్వహించిన సంస్థల సంఖ్య |
|---|---|
| 1993 | 68 |
| 1994 | 54 |
| 1995 | 53 |
| 1996 | 54 |

జిల్లాలవారీగా చూస్తే 11 పరిషత్తులు గుంటూరు జిల్లాలో జరిగాయి ద్వితీయ స్థానం హైదరాబాదు, నెల్లూరు జిల్లాలు (6+6) కాగా, తృతీయ స్థానం కృష్ణా జిల్లాకు దక్కుతుంది

మే నెలలో 9 పరిషత్తులు, ఫిబ్రవరి, మార్చి, జూన్, జులై, డిసెంబరు నెలలో 6 పరిషత్తులు జరిగాయి నాటిక పోటీలు జరిపే పరిషత్తులు సంఖ్యే ఎక్కువ నాటక ప్రదర్శనలు జరిపే పరిషత్తులు అరడజనుకు మించి లేవు

| | |
|---|---|
| నాటికలు నిర్వహించే పరిషత్తులు | 46 |
| కేవలం నాటకపోటలు మాత్రమే నిర్వహించే పరిషత్తు | 1 |
| నాటక నాటికల పోటీలు నిర్వహించే పరిషత్తులు | 5 |
| నగరాలలో | 13 |
| పట్టణాలలో | 24 |
| గ్రామాలలో | 170 |

1990 ప్రాంతాలనుంచీ నాటక పరిషత్తు నిర్వాహకులు నాటక రచయితలకు, కళాకారులకు, కళాభిమానులకు ప్రోత్సాహానిచ్చే మరొక సత్కార్యం ప్రారంభించారు యువకళావాహిని, అప్పాజోస్యుల - విష్ణుభోట్ల ఫౌండేషన్ వంటి సంస్థలు నాటక

పోటీలను నిర్వహించడమే గాక పోటీలలో పాల్గొన్న నాటక నాటికలను పరిషత్ తరఫున ప్రచురించి అందరికీ ఆ నాటక సాహిత్యాన్ని అందుబాటులోకి తెస్తున్నారు నాటక నాటికల ప్రచురణ లాభదాయకం కాదని ప్రచురణ కర్తలు నాటక సాహిత్యాన్ని అచ్చువెయ్యడానికి వెనుకంజవేస్తున్న ఈ రోజుల్లో పరిషత్తులు నాటకాలను ప్రచురించే మహత్కార్యాన్ని చేపట్టడం బహుధా ప్రశంసనీయం

ఇంతే కాక నాటక సంస్థలు కూడా తాము ప్రదర్శించిన కొత్త నాటకాలను నాటికలను సమాజం తరపున తామే ప్రచురించి పుస్తకాలను కళారంగానికి అందుబాటులోకి తేవడం కూడా ఇప్పుడు జరుగుతూవుంది గంగోత్రి - పెదకాకాని నాటకసంస్థవారు ఇటీవల ఒక నాటక సంపుటిని, నాటికల సంకలనాన్ని ప్రచురించి ఒక నూతన సంప్రదాయానికి మార్గదర్శకులయ్యారు వీరు చూపిన బాటలో మరికొన్ని కళాసంస్థలు పయనిస్తాయని ఆశించవచ్చును

నాటక రచయితకు పారితోషికంకూడా యిచ్చి ప్రోత్సాహించడం మరింత సంతోషదాయకమైన, విషయం రాష్ట్రంలోని వివిధ పరిషత్తులు ఒక సమాఖ్యగా ఏర్పడి ఆర్థిక భారంతో కూడిన యిటువంటి కార్యాలను ఉమ్మడిగా నిర్వహించ గలిగితే కళాజగత్తుకు మరెన్నో లాభాలు చేకూరే అవకాశం ఉంది

పరిషత్తుల నిర్వహణ చాల కష్టతరమైన కార్యం ఒక యజ్ఞంలాంటిది కళా హృదయం, పట్టుదల వుంటేనే చాలదు చాలినంత ఆర్థికబలం వుంటే తప్ప పరిషత్తు పోటీలు జరపడం సాహసం అవుతుంది

ఈ పరిషత్తులు వారివారి ఆర్థికస్తోమతను బట్టి కొందరు మూడు రోజులు, కొందరు అయిదు రోజులు, మరి కొందరు వారం రోజుల వరకు నిర్వహిస్తున్నారు నాటక పరిషత్తులలో సాధారణంగా యిచ్చే బహుమతులు ఇలా వుంటున్నాయి

1 ఉత్తమ ప్రదర్శన, 2 ద్వితీయ ప్రదర్శన, 3 తృతీయ ప్రదర్శన, 4 ఉత్తమ నటుడు 5 ఉత్తమ నటి, 6 ఉత్తమ హాస్య నటుడు, 7 ఉత్తమ ప్రతినాయకుడు (విలన్), 8 ఉత్తమ కేరెక్టర్ ఏక్టర్, 9 ఉత్తమ రచయిత, 10 ఉత్తమ దర్శకత్వం, 11 ఉత్తమ రంగాలంకరణ

ఇవి కాక ప్రత్యేక బహుమతులు కూడా యిస్తుంటారు బహుమతులు

సాధారణంగా రోలింగు షీల్డులుగాను, వ్యక్తిగత కప్పులు గాను యిస్తుంటారు తరువాతి కాలంలో బహుమతుల విషయంలో కొన్ని మార్పులొచ్చాయి రోలింగ్ షీల్డుల స్థానే శాశ్వత షీల్డులు, వ్యక్తిగత బహుమతులే గాక నగదు బహుమతులు యిచ్చే సంప్రదాయం స్థిరపడింది

ప్రస్తుత కాలంలో ఉత్తమ నాటకానికి పదివేల రూపాయలు,ఉత్తమ నాటికకు ఎనిమిదివేల రూపాయలు నగదు బహుమతులిచ్చే పరిషత్తులు కూడా ఉన్నాయి ఉదా గూడూరు సంస్కృతీ సమ్మేళనం ఉత్తమ రచయితకుకూడా వేయిన్నూట పదహార్లు నగదు చెల్లిస్తున్నారు అంతేకాకుండా పరిషత్తులో ప్రదర్శించబడే ప్రతి నాటకానికి, నాటికకు (బహుమతితో ప్రమేయం లేకుండా) మూడు వేలు, రెండు వేలు ప్రోత్సాహక బహుమతి (సబ్సిడీ) ఇస్తున్నారు అనేకవ్యయ ప్రయాసల కోర్చి, దూరప్రాంతాల నుంచి వచ్చే సమాజాలకు ఆ నగదు బహుమతులు కొంత భారాన్ని తగ్గించి వూరట కల్గిస్తున్నాయి

ఈనాడు ఒక కొత్త నాటకం లేదా నాటిక వెలుగు చూస్తున్నదంటే ఈ పరిషత్తులే కారణం, తెలుగు నాటకం చచ్చిపోకుండా కాపాడుతున్నవి నాటక పరిషత్తులేనని చెప్పడానికి సంకోచించనక్కర్లేదు ఇప్పటికే చలనచిత్రాలు, టి వి ల ధాటికి తట్టుకోలేక నాటకరంగం చిక్కి శల్యమైంది నాటక పరిషత్తులు కూడా అదృశ్యమైతే తెలుగు నాటకానికి నూకలు చెల్లినట్టేనని అనుకోవలసి వస్తుంది ఈ ప్రమాదం రాకుండా నాటక రంగాన్ని పరిరక్షించుకో వలసిన బాధ్యత మన అందరిమీదా ఉంది,

## గుణ నిర్ణేతల పాత్ర

నాటక పోటీలలో పాల్గొనడానికి దేశంలో అన్ని ప్రాంతాల నుంచీ ఎన్నో వ్యయప్రయాసలకోర్చి అనేక సమాజాలు వస్తాయి ప్రతి కళాకారుడు తమ నాటకానికి ప్రథమ బహుమతి వస్తుందని ఆశిస్తాడు అలా ఆశపడటంలో తప్పులేదు ప్రతి కళాకారుడిలో అలాంటి జిగీష వుండటం సహజమే ప్రవాసాంధ్రులు కూడ ఎంతో దూరం నుంచి పరిషత్ పోటీలకు వస్తుంటారు

అటువంటప్పుడు నాటక పోటీలలో సరి అయిన నిర్ణయం జరగకపోతే నిరాశపడతారు అది పరిషత్తు ప్రతిష్టకు కూడ భంగం కలిగిస్తుంది కనుక పరిషత్ నిర్వాహకులు, అనుభవజ్ఞులు, సమర్థులు అయిన వారినే గుణ నిర్ణేతలుగా పెట్టుకోవాలి

పరిషత్తు నిర్వహణలో జరిగే పొరపాట్లను, లోటుపాట్లను సవరించుకోవడానికి వీలుగా ఆదర్శప్రాయమైన, ఆచరణ సాధ్యమైన కొన్ని మార్గదర్శక సూత్రాలను రూపొందించుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది దీనివల్ల ఒక్కో పరిషత్తులో ఒక్కో గుణ నిర్ణయ పద్ధతి లేకుండా, ఆమోదయోగ్యమైన సార్వజనీనమైన పద్ధతి అమలు పరచడానికి వీలవుతుంది

ఈ మేరకు ఇదివరకే కొంత కృషి జరిగింది హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలలో నాటక పోటీలు నిర్వహించే వివిధ సంస్థల ప్రతినిధులు, నాటకాభిమానులు కళాకారులు, నాటకకర్తలు, దర్శకులు, విమర్శకులు 1978 లో కీ శే కొర్రపాటి గంగాధరరావు గారి అధ్యక్షతన సమావేశమై, నాటక పోటీలకు సంబంధించిన వివిధ అంశాలను కూలంకషంగా చర్చించారు వారు నిర్ణయించిన న్యాయ నిర్ణయ సూత్రాలు అందరికీ ఆమోదయోగ్యంగా ఉండటమేకాక, పరిషత్తు నిర్వాహణకు కూడా యివి మార్గదర్శకాలుగా ఉపకరిస్తాయనే వుద్దేశంతో ఆ సూత్రాలను ఇక్కడ పొందుపరచడమైనది

**I. న్యాయ నిర్ణేతల అర్హతలు**

1 నాటక ప్రదర్శనలోని అన్ని రంగాల్లో విస్తృతమైన పరిజ్ఞానం వుండి దర్శకత్వం, నటన, రచన, నాటక విమర్శ వీటన్నింటిలోను సుమారు పదేళ్ల అనుభవం కలిగి వుండాలి

2 అలాకాని పక్షంలో పై నాల్గింటిలో ఏ మూడింటిలో నైనా నిష్ణాతులై వుండాలి ఇలా కూడా లేని పక్షంలో దర్శకత్వం, నటన ఏ ఒక్కదానిలో అయినా విస్తృత పరిజ్ఞానంగల రచయిత లేదా విమర్శకుడు అయివుండవచ్చు ఈ చిట్టచివరి నియమం అత్యవసర పరిస్థితిలో గాని అమలు పరచకూడదు

3 తెలుగు నాటక సాహిత్యంలో మంచి పరిచయం వుండి నాటక ప్రదర్శనను విశ్లేషించగల స్తోమత కలిగివుండాలి

4 సాంకేతికమైన ఈ లక్షణాలతో పాటు వ్యామోహాలకు, బంధుప్రీతికి, పలుకుబడులకు లొంగని వ్యక్తిత్వం, సచ్ఛీలత కలిగివుండాలి

5 న్యాయనిర్ణేతలుగా వ్యవహరించేవారు సంబంధిత పోటిలలో పాల్గొనే నాటక ప్రదర్శనలతో ప్రత్యక్షంగా గాని, పరోక్షంగా గాని, ఎట్టి సంబంధం కలిగి వుండరాదు

**2. న్యాయ నిర్ణేతల సంఖ్య**

1 న్యాయ నిర్ణేతలు నాటకాలకు, నాటికలకు వేర్వేరుగా ఉండాలి

2 ప్రతిపోటీలోను కనీసం ముగ్గురు న్యాయ నిర్ణేతలు న్యాయనిర్ణయం చేయాలి

3 న్యాయ నిర్ణేతలు ముగ్గురికిమించివున్నపుడు బేసి సంఖ్యలో వుండాలి

**3. న్యాయ నిర్ణయం విదానం**

1, న్యాయ నిర్ణేత ప్రతి ప్రదర్శనానంతరం అన్ని అంశాలపైనా తన నిర్ణయాన్ని నిర్ణీత నమూనాలో మార్కుల రూపంలో వ్యక్తపరచాలి వానిని వెంటనే సీలు చేసి నిర్వాహకులకు అందజేయాలి

2 ఒక రోజు జరిగిన ప్రదర్శనకు సంబంధించి న్యాయ నిర్ణేతలు యిచ్చిన మార్కుల కాగితాలను సీలుచేసిన కవర్ల నుండి తీసి ఆనాటి ప్రదర్శనలు కాగానే అన్ని అంశాలపై ప్లేవైజ్‌గా మొత్తం చేసి విడిగా ఒక నమూనా పత్రంలో రాసి సీలు చేసి ఆ రోజే నిర్వాహకులకు అందజేయాలి

3 పోటీ అనంతరం ఇలా ఏ రోజు సీలు చేసిన పత్రాలలోని మొత్తం మార్కులను ఆ రోజు కూడా వాటి ఆధారంగా ఆయా అంశాలను బహుమతులు నిర్ణయించాలి

4 రెండు అంశాలపై మార్కులు సమంగా వచ్చినపుడు మాత్రమే నిర్ణేతలు మార్కులను పున పరిశీలించి ఒక నిర్ణయానికి రావాలి

5 అలా రాని పక్షంలో ముగ్గురు నిర్ణేతలలో యిద్దరి ఆమోదం పొందిన

నిర్ణయాన్ని ఖాయపరచాలి

6 నిర్ణీతమైన రిమార్కుల కాలంలో ఏ పాత్ర ఏ బహుమతికి అర్హుడో(ముఖ్యంగా విలన్, హాస్య పాత్రలు) అనే విషయాన్ని న్యాయనిర్ణేతలు తమ పత్రంలో పేర్కొనాలి

**4. న్యాయ నిర్ణయంలో గమనించవలసిన అంశాలు**

1 నటన ఎ) పాత్ర ఔచిత్యం, నటుని రూపం, ఆహార్యం

బి) అంగిక, సాత్విక, వాచిక అభినయాలు

సి) సమయ పాలన

2 సృజనాత్మకత, ఏకాగ్రత, సమయస్ఫూర్తి, తోటి నటులతో సహకారం, మొత్తం ప్రదర్శనకు ఆ నటుడు యిచ్చిన దోహదం

**5. ప్రదర్శన**

ఎ) నటునకు యిచ్చిన మార్కుల సగటును ప్రదర్శనలో నటనా భాగానికి చేర్చాలి

బి) రంగాలంకరణ, లైటింగ్, సంగీతం, స్పెషల్ ఎఫెక్టు ఇవన్నీ దృశ్యాత్మకంగా రంగస్థలంపై చూపించాలనే నియమం లేదు దర్శకుడు, నటులు, ఆయా సన్నివేశ స్థలాన్ని సంఘటనలను సూచించే వాతావరణాన్ని వారి వారి భావుకతతో ప్రదర్శించినప్పుడు కూడా వాటిని స్పెషల్ ఎఫెక్ట్సుగా న్యాయ నిర్ణేతలు స్వీకరించాలి

సి) నాటక రచన

డి) దర్శకత్వం

ఇ) ప్రదర్శన రక్తి

**6. దర్శకత్వం**

ఎ) ప్రయోగశైలి విధానం

బి) రంగాలంకరణ, ఆహార్యం, రంగోద్దీపనం

సి) నటన

డి) పతాక సన్నివేశం, సన్నివేశాల నిర్వహణ

ఇ) ప్రయోగవిశిష్టత

**7. రచన**

ఎ) రచనోద్దేశం

బి) ఇతివృత్త నిర్మాణం

సి) నాటకశైలి

డి) కథాగమనం

ఇ) పాత్రచిత్రణ

ఎఫ్) సంభాషణలు

జి) సన్నివేశకల్పన

హెచ్) సమీకరణ

ఐ) లక్ష్యసాధన

**8. ప్రదర్శన విలువల నిర్ణయం**

న్యాయ నిర్ణేతలు ప్రదర్శన విలువలను నిర్ణయించేటప్పుడు మార్కులు యీ క్రింది విధంగా యివ్వాలి

| | |
|---|---|
| నటన | 40 |
| దర్శకత్వం | 20 |
| రంగోద్దీపన, స్పెషల్ ఎఫెక్ట్స్ రంగాలంకరణ | 20 |
| నాటక రచన | 10 |
| ప్రదర్శన శక్తి | 10 |

**9. నటన**

| | |
|---|---|
| పాత్ర ఔచిత్యం, నటుని రూపం, ఆహార్యం | 10 |
| ఆంగిక, సాత్విక, వాచికాభినయాలు | 50 |
| సమయస్ఫూర్తి, ఏకాగ్రత, సృజనాత్మకత | 30 |
| మొత్తం ప్రదర్శనకు ఆ నటుని సహకారం, సమయపాలన | 10 |

## ప్రదర్శన, దర్శకత్వం బహుమతి నిర్ణయ పత్రం

| క్రమ సంఖ్య | విషయము | మొత్తం మార్కులు | న్యాయనిర్ణేత ఇచ్చిన మార్కులు | మొత్తం ఇచ్చిన మార్కులు | సగటు | న్యాయనిర్ణేతల అభిప్రాయం |
|---|---|---|---|---|---|---|
| 1 | నటన | 40 | | | | |
| 2 | ధర్శకత్వం | 20 | | | | |
| 3 | రంగాలంకరణ | 20 | | | | |
| 4 | రచన | 10 | | | | |
| 5 | ప్రదర్శనానుభూతి | 10 | | | | |

## ప్రదర్శన బహుమతి

| క్రమ సంఖ్య | విషయము | మొత్తం మార్కులు | కేటాయించిన మార్కులు | న్యాయాధికారి అభిప్రాయం |
|---|---|---|---|---|
| 1 | నటన | 40 | | |
| 2 | దర్శకత్వం | 20 | | |
| 3 | రంగాలంకరణ, రంగోద్దీపన, ప్రత్యేకమైన ఎఫెక్టు | 20 | | |
| 4 | రచన | 10 | | |
| 5 | మొత్తం ప్రదర్శనానుభూతి | 10 | | |

ప్రదర్శన చూసి మార్కులు వేసి న్యాయనిర్ణయం చేసే విధానం చాలా చోట్ల బెడిసికొట్టింది నిర్ణయం (జడ్జిమెంటు) సక్రమంగా లేదని కళాకారులు అసంతృప్తి ప్రకటించిన సందర్భాలు అనేకం ఉన్నాయి గుణాత్మకంగా మార్కులు వెయ్యడానికి తగిన కొలబద్దలు న్యాయనిర్ణేతల దగ్గర లేవు వారి అవగాహన స్థాయి, పరిజ్ఞానం, సంస్కారం, అభిరుచులనుబట్టి మార్కులు వేసి ప్రధమ, ద్వితీయ, తృతీయ బహుమతులను, వ్యక్తిగత బహుమతులను నిర్ణయించడమే గాని, ఆనిర్ణయాలవెనక నిర్దుష్టమైన సిద్ధాంతాలుగాని, మార్గదర్శక సూత్రాలుగాని

వారికిలేవు కారణం నాటక ప్రదర్శన అనుభూతి ప్రధానమైనది కావడమే ఒకరి అభినయంచూసి ఒక న్యాయ నిర్ణేత 30 మార్కులు వేస్తే, అదేనటనకు వేరొక జడ్జి స్పందించకపోవచ్చు అది వారివారి మానసిక ప్రవృత్తిలో వున్న భేదం కనుక మార్కుల పద్ధతికి సర్వత్రా విముఖత బయలుదేరింది అందువల్ల ప్రస్తుతం మార్కులు వేసే విధానానికి న్యాయ నిర్ణేతలు నూటికి తొంభై మంది స్వస్తి చెప్పడం జరిగింది ప్రదర్శనవల్ల కలిగే అనుభూతి ఆధారంగానే గుణనిర్ణయం చేస్తున్నారిప్పుడు ఇది చాలవరకు ఫలప్రదమైనట్లే లెక్క

"జడ్జిమెంటు యిచ్చేశాక కొందరు జడ్జిలు అనుమానాలకు సమాధానాలిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టాలి ఇది మంచి పద్ధతే కాని అలాంటి సమయాలలో అందరూ అడగబోయేది ఒకే ప్రశ్న - "ఫలానా వాడి కెందుకిచ్చావు, మా నాటకానికి ఎందుకివ్వలేదు, మా తప్పులేమిటి." అక్కడ్నుంచి వాళ్లు చేసిన తప్పుల లిస్టు చదవటం మొదలెట్టాల్సివస్తుంది కళాకారులు బహుమతి పొందిన నాటకంలో తప్పుల్ని వేటినైనా ఎత్తిచూపిస్తే యిక అంతటితో సరి ఆ చర్చా కార్యక్రమం సిగపట్లకు దిగుతుంది ఇందులోవున్న పెద్దలోపం ఏమిటంటే, అనుమానాలు, ఆన్సర్లు, అన్నికూడా దోషపరిశీలనవైపే సాగుతాయి దీన్నే నెగిటివ్ ఎప్రోచ్ అంటారు నాటకంలో మంచి చెడ్డల్ని గురించి చర్చించినప్పుడు యీ బాధవుత్పన్నం అవదు కాగా అన్ని నాటకాలలో గుణదోషాలు ముందే చెప్పేస్తే ఆ తర్వాత జరగబోయే చర్చకు ప్రాతిపదిక ఏర్పడి ఆరోగ్యవంతంగా సాగే అవకాశాలున్నాయి " అని గుణనిర్ణయంలో నూతనమైన ఒక ప్రతిపాదన చేశారు ప్రసిద్ధనాటక కర్త, విమర్శకులు అయిన శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుగారు

ప్రతిపాదన చేయడమేకాదు దాన్ని ఆచరణలోపెట్టి చూపించారు కూడా వారు అనుసరించిన విధానాన్ని ఈవిధంగా వివరించారు

"1 ఈ పద్ధతి ప్రకారం జడ్జీలలో ఒకరైనా, అందరి అభిప్రాయాలను ఒకచోట చేర్చి ప్రతి నాటకంలోని మంచిచెడ్డలు చర్చిస్తూ ఒక సమీక్షగా రాయగల నేర్పు కలిగి ఉండాలి అలా రాసిన ఆ రెవ్యూను జడ్జిమెంటు యిచ్చేముందు జడ్జీలలో ఒకరు చదువుతారు ఆ రివ్యూలో అంశాలకు, ఆ తర్వాత

ప్రకటించిన జడ్జిమెంటుకు సంబంధం వుందోలేదో కళాకారులు, ప్రేక్షకులు పరిశీలిస్తారు

2 జడ్జీలంతాకూడా నాటకాలు చూచేముందో చూశాకో, అవకాశాన్నిబట్టి, రెవ్యూ రాసేముందుగా, అన్ని నాటకాల ప్రతులను విధిగా చదవాలి అందువల్ల 'ఫస్ట్‌యింప్రెషన్'కు జడ్జీలు లోబడిపోయే ప్రమాదం తప్పుతుంది అంతంత మాత్రం రచనను ప్రదర్శకులు తమ ప్రతిభవల్ల బాగా చేశారో లేక ప్రతిభావంతమైన నాటకాన్ని పాడుచేశారో తెలుస్తుంది ఆలోచనా సరళికి పదును పెట్టుంది మంచి రచన ఏదో మంచి ప్రదర్శన ఏదో, స్పష్టంగా తెల్సుకోటానికి వీలవుతుంది ఇలా నాటకాల ప్రతుల్ని ఏ జడ్జిలు యిప్పుడు చదువుతున్నట్లు కన్పించదు

3 చూడబోయే నాటకాలలో ఎక్కడో అక్కడ, ఏ కాస్తన్నా మంచిదొరుకుతుందన్న ఆశతో కూర్చోవాలి "ఈ నాటకంలో చూసేదేముందిలే" అన్న భావంతో కూర్చోకూడదు "నాటకరంగం దిగజారిపోతున్నది, "ఇప్పుడొచ్చే నాటకాలన్నీ చెత్తవి" అన్న అభిప్రాయంలో వున్నవాళ్లు యిందుకు పనికిరారు

4 నాటకంలోని బొక్కల్ని (లోపాల్ని) వెతికి రాయటమే కాకుండా, మంచిని కూడా గ్రహించి, అనుభవించి, వాటికి కూడా నోట్సు రాయాలి ప్రదర్శనానంతరం ఎప్పటికప్పుడు విధిగా తన అనుభూతుల్ని రికార్డు చేయాలి

5 ఆరోజు ప్రదర్శనలు కాగానే, ఆ రాత్రో లేకపోతే మరుసటి రోజో జడ్జీలంతా కల్సి వారివారి అభిప్రాయాలను, అనుభూతులను, జడ్జిమెంటు దృష్ట్యాకాక, కేవలం చర్చాపరంగా, విమర్శనాపరంగా మాట్లాడుకోవాలి

6 అభిప్రాయ భేదాలొస్తే ఆ భేదాన్ని రెవ్యూలో స్పష్టంగా చెప్పటానికి అందరు జడ్జీలు అంగీకరించాలి

7 అలా చర్చలయ్యాక అందరి అభిప్రాయాలను నోటుచేసుకొన్న ఒకరో, యిద్దరో లేక అందరో కల్సి ఆ నాటకంమీద రెవ్యూను తయారుచేస్తారు ఈ పద్ధతి ప్రకారం చేసిన అన్ని నాటకాలకీ రెవ్యూ తయారయ్యాక తర్వాత

నాటక ప్రదర్శనలను చూడాలి

8 అలా పరిషత్తులో ప్రదర్శించిన నాటకాలన్నిటికి రివ్యూలు ఎప్పటికప్పుడు అయిపోతాయి ఏ నాటకం మంచిదని జడ్జిమెంటు చేసేముందు అవసరమైతే రివ్యూ ఒకసారిచదువుకోవచ్చు కాని రాసిన రివ్యూను అవసరార్థం మార్చకూడదు

9 చివరన యిచ్చే జడ్జిమెంటు ఈ రివ్యూలో అంతర్లీనంగా వుండే మంచిచెడ్డలను ప్రతిబింబించేదిగా ఉండాలి ఉంటుంది కూడా "[5]

1994లో గూడూరులో సంస్కృతీ సమ్మేళనం నాటకపోటీలలో శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావుగారితో కో-జడ్జిగా పనిచేసిన ప్రసిద్ధ నాటక విమర్శకులు శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి - మల్లికార్జునరావుగార్లు ఆనాటి సభలో జడ్జిమెంటుకు ముందు నాటకాలపై గుణదోష పరిశీలనచేస్తూ చదివిన 'సమీక్ష' కళాకారుల ప్రశంసలు పొందిందనీ, సామాజికులనుంచీ, పరిషత్ నిర్వాహకులనుంచి కూడా మంచి స్పందన లభించిందని ధ్రువపరిచారు

మల్లికార్జునరావుగారు సూచించిన విధానం అభిలాషణీయమే కాని ప్రదర్శనల గురించి గుణదోషాలను పరిశీలించి సమీక్ష రాయగలిగిన జడ్జీలు అన్నిచోట్లా దొరకడం దుర్లభం అదొక్కటే ఈ పద్ధతిని అమలు పరచటంలో వున్న పెద్ద చిక్కు

కాగా, నాటక పరిషత్తులు నిర్వహించే పోటీల వల్ల కొన్ని నష్టాలుకూడా లేకపోలేదు కళాకారులమధ్య అనవసరంగా పోటీదృక్పథం పెరిగి ఐక్యత, సయోధ్యలకు భంగం వాటిల్లుతున్నదనీ, లక్ష్యశుద్ధి వక్రిస్తున్నదనీ, సమాజాలలో చీలికలు పెరిగిపోతున్నాయనీ విమర్శలు తరచూ వినవస్తున్నాయి వీటిలో వాస్తవం వున్నా పరిషత్తులవల్ల జరుగుతున్న మేలును, లాభాలను దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఇవి అంతగా పరిగణనలోకి తీసుకోదగిన అంశాలుకావు

పరిషత్తుల్లో ప్రదర్శించబడే నాటకాలు పరిషత్తులకు అవసరమయ్యే 'మసాలా' తో మూసనాటకాలుగా తయారౌతున్నాయనే విమర్శ కూడా వుంది 1960-70 ప్రాంతాలలో పరిషత్ పోటీలలో ప్రదర్శితమైన నాటకాలలో ఈ ధోరణి

రూపుకట్టినమాట వాస్తవమే అయినా 1980 నుంచీ వస్తున్న నాటకాలను పరిశీలిస్తే పోటీ నాటకాలకు ఆ దోషాన్ని అంటగట్టడం సబబు కాదేమో అనిపిస్తుంది ఉదా, ఓ బూతునాటకం', 'అమృత వర్షిణి', వృత్త విశ్లేషణం వంటి నాటకాలను దీనికి ఉదాహరణలుగా పేర్కొనవచ్చును

పరిషత్తుల కోసం రాస్తున్న నాటకాలలో నాటికలలోను అనంత వైవిధ్యం కనబడుతూంది దిగజారుడు తత్వం ఏమాత్రం దృగ్గోచరం కాకపోగా ఉన్నత ప్రమాణాలు గల నాటకాలు నిర్మించబడుతున్నాయనీ, నాటక రచన ప్రగతి పథంలో సాగిపోతున్నదని నిస్సంకోచంగా చెప్పవచ్చు

## గుణనిర్ణేతలుగా వ్యవహరిస్తున్న కళావేత్తలు

శ్రీయుతులు

1 కొత్తుర్తి భాస్కరరావు (విశాఖపట్టణం)
2 చాట్ల శ్రీరాములు (హైదరాబాద్)
3 డి రాజేశ్వరరావు (హైదరాబాద్)
4 టి శివరామకృష్ణారావు (హైదరాబాద్)
5 కప్పగంతుల మల్లికార్జునరావు (హైదరాబాద్)
6 జవ్వాది రామారావు (నిడదవోలు)
7 కె శ్రీహరిమూర్తి (హైదరాబాద్)
8 ఇ ఆర్ డి రాములు (విజయవాడ)
9 కారుమూరి సీతారామయ్య (పర్చూరు)
10 అత్తిలి కృష్ణారావు (విశాఖపట్టణం)
11 ఎస్ కె ఆంజనేయులు (హైదరాబాద్)
12 డి వి రమణమూర్తి (హైదరాబాద్)
13 డి యస్ యన్ మూర్తి (హైదరాబాద్)
14 యం బి కె వి ప్రసాదరావు (హైదరాబాద్)
15 గండవరం సుబ్బరామిరెడ్డి (హైదరాబాద్)

16 పోలవరపు అబ్బులు (తణుకు)

17 పంతం ఉమామహేశ్వరరావు (గెద్దనాపల్లి)

18 రావూజీ (విశాఖపట్టణం)

19 ఎన్ రవీంద్రారెడ్డి (హైదరాబాద్)

20 సి రామలింగశాస్త్రి (హైదరాబాద్)

21 డా వై దామోదరం (వెంకటగిరి)

22 ఎ శివరామరెడ్డి (నూతక్కి)

23 నెమలికంటి (బి హెచ్ ఇ ఎల్, హైదరాబాద్)

24 రాంకుమార్ (బి హెచ్ ఇ ఎల్. హైదరాబాద్)

25 యస్ సూర్యప్రకాశరావు (విజయనగరం)

26 జగన్నాధరావు (హైదరాబాద్)

27 కె కె యల్ స్వామి (గరివిడి శ్రీరాంనగర్)

28 రాళ్లబండి శ్రీనివాస్ (ప్రొద్దుటూరు)

29 జీడిగుంట రామచంద్రమూర్తి (హైదరాబాద్)

30 నరసింహాచార్యులు (వరంగల్)

31 రాజా తాతయ్య (పాలకొల్లు)

32 బి టి ఆర్ త్రినాధరాజు (భీమవరం)

33 పి నాగేశ్వరరావు (భీమవరం)

34 డి సోమేశ్వరరావు (హైదరాబాద్)

35 ఎల్ వి క్రిష్ణారెడ్డి (కావలి)

36 ఎస్ వి సుబ్బారెడ్డి (కావలి)

37 యానాదిరెడ్డి (నెల్లూరు)

38 చంద్రశేఖర్ (నెల్లూరు)

39 అప్పయ్యశాస్త్రి (నెల్లూరు)

40 బీరం మస్తాన్‌రావు (హైదరాబాద్)

41 కోసన రాము (మంచిర్యాల)

42 వేమునగంటి వాసుదేవరావు (విజయవాడ)

43 సరస్వతుల నారాయణ (విశాఖపట్టణం)

44 ఏ లక్ష్మి (విశాఖపట్టణం)

45 వి రామనారాయణ (విశాఖపట్టణం)

46 దశికరామమ్మ(హైదరాబాద్)

47 సుంకర కొటెశ్వరరావు (నరసరావుపేట)

48 పూండ్ల బుచ్చయ్య చౌదరి (తాతపూడి)

49 ఇందుపల్లి రాజకుమార్ (చిలకలూరిపేట)

50 పసుపులేటి వెంకటేశ్వర్లు (కావలి)

51 ఎన్ ఆర్ నంది (హైదరాబాద్)

52 కోకా సంజీవరావు (విజయవాడ)

53 విన్నకోట విజయరాం (విజయవాడ)

54 సి హెచ్ కబీరుదాస్ (విజయవాడ)

55 యం లింగారెడ్డి (ప్రొద్దుటూరు)

56 పి బి వీరాచారి (రాజమండ్రి)

57 తోలేటి (విజయనగరం)

58 కంచుమర్తి శ్రీరాములు (రాజమండ్రి)

59 కె కె నాయుడు (కాకినాడ)

60 రాధాకృష్ణమూర్తి (హైదరాబాద్)

61 యం రవీంద్రబాబు (సత్తెనపల్లి)

62 మాదాసు నాగేశ్వరరావు (సత్తెనపల్లి)

63 వరికూటి శివప్రసాద్ (గుంటూరు)

64 ఎం బి రామారావు (వరంగల్)

65 కర్రి రంగారావు (కాకినాడ)

66 సి యస్ మూర్తి (కాకినాడ)

67 బి రాజబాబు (కాకినాడ)

68 నక్కా వెంకటేశ్వరరావు (కాకినాడ)

69 ర్యాలి సీతారామయ్య (బరంపురం)

70 బి విజయకుమార్ (బరంపురం)

71 యం జి. ప్రసాద్ (హైదరాబాద్)

72 తల్లా వరుుల సుందరం (హైదరాబాద్)

73 కె జి ఆర్ గాంధీ (విశాఖ పట్టణం)

74 బొమ్మిడి నారాయణరావు (భీమవరం)

75 ఇసుకపల్లి మోహనరావు (ఒంగోలు)

76 డా పి వేణు (గూడూరు)

77 బి కాశీశంకర్ (విశాఖపట్టణం)

78 డా జె యస్ యస్ రాజు (మునగపాక)

79 బుద్ధకాశీ (మునగపాక)

80 కర్రి కొటేశ్వరరావు (మునగపాక)

81 పి ఎల్ నారాయణ (మదరాసు)

82 డా ఎం ఎల్ గురప్పచౌదరి (హైదరాబాద్)

83 యస్ మునిసుందరం (తిరుపతి)

84 నాగం లక్ష్మణరావు (హైదరాబాద్)

85 కె యస్ టి సాయి (బాపట్ల)

86 భానుప్రకాష్ (హైదరాబాద్)

87 ఏ శివరామశాస్త్రి (ప్రొద్దుటూరు)

88 పి వి రావు (గుంటూరు)

89 డా వాసిరెడ్డి నారాయణరావు (హైదరాబాద్)

90 కె యస్ ఎన్ మూర్తి (హైదరాబాద్)

91 ధవళ సత్యం (చెన్నైయ్)

92 మల్లాది శివ (చిలకలూరిపేట)

93 జక్కంపూడి సీతారామారావు (చిలకలూరిపేట)

94 కందిమళ్ల సాంబశివరావు (చిలకలూరిపేట)
95 బయ్యవరపు వెంకటేశ్వరరావు (గుంటూరు)
96 అంతటి నరసింహం (హైదరాబాద్)
97 వంకాయల సత్యనారాయణమూర్తి (విశాఖపట్టణం)
98 జె సిద్ధప్పనాయుడు (హైదరాబాద్)
99 దేవదాస్ కనకాల (హైదరాబాద్)
100 లక్ష్మీ కనకాల (హైదరాబాద్)
101 నండూరి భీమశంకరం (విశాఖపట్టణం)
102 విజయప్రకాష్ (హైదరాబాద్)
103 పి శేషగిరిబాబు (హైదరాబాద్)
104 కె జి రాంప్రసాద్ (బి హెచ్ ఇ ఎల్, హైదరాబాద్)
105 గరిమెళ్ల రామ్మూర్తి (హైదరాబాద్)
106 గ్రిద్దలూరు గోపాలరావు (నెల్లూరు)
107 నాదెళ్ల పురుషోత్తమశాస్త్రి (మచిలీపట్టణం)
108 స్వర్ణ రాజ హనుమంతరావు (మచిలీపట్టణం)
109 పాండురంగారావు (విజయవాడ)
110 అదృష్టదీపక్ (రామచంద్రపురం)
111 కె అమరలింగేశ్వరరావు (రామవరం)
112 డా॥ టి వి నారాయణరెడ్డి (రాజమండ్రి)
113 డి వి రాము (గుంటూరు)
114 వాసిరెడ్డి సుబ్బారావు (సత్తెనపల్లి)
115 టి ఆర్ అడబాల (హైదరాబాద్)
116 మద్దూరి విజయలక్ష్మి (హైదరాబాద్)
117 టి సీతాలత (కంకిపాడు)
118 వాసిరెడ్డి సీతాదేవి (హైదరాబాద్)
119 గింజువల్లి సుశీల (చిలకలూరి పేట)

## ఆంధ్ర ప్రదేశ్‌లో నాటక పోటీలు నిర్వహించే కళా సంస్థలు

**అనంతపురం జిల్లా**

లలిత కళా సమితి - అనంతపురం

**కడప జిల్లా**

ప్రొద్దుటూరు నాటక కళా పరిషత్ - ప్రొద్దుటూరు

రాయల నాటక కళా పరిషత్ - ప్రొద్దుటూరు

**కర్నూల్ జిల్లా**

కళా సమితి - గుంతకల్

ప్రభాకర నాటక కళా సమితి - గుంతకల్

**కృష్ణా జిల్లా**

ఆంధ్ర నాటక కళా పరిషత్ -గుడివాడ

ఆఫిసర్స్ క్లబ్ - గన్నవరం

కె యస్ ఆర్ మూర్తి కళాపరిషత్ - విజయవాడ

జి యస్ ఆర్ మూర్తి మెమోరియల్ - విజయవాడ

గణేష్ నాటక కళా సమితి - బందరు

నగరపాలక సంస్థ యువజనోత్సవాలు - విజయవాడ

రైల్వే ఇన్‌స్టిట్యూట్ - విజయవాడ

వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయ పోటీలు - విజయవాడ

వంగవీటి రంగా స్మారక కళాపరిషత్తు - విజయవాడ

విజయలక్ష్మి ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ - నందలూరు (కడప జిల్లా)

సుమధుర కళా నికేతన్ - విజయవాడ

జీవిత భీమా ఉద్యోగుల లలిత కళా సమితి - మచిలీపట్నం

కె వి ఆర్ నట సమాఖ్య - విజయవాడ

సుత్తి వీరభద్రరావు నాటక కళా పరిషత్ - విజయవాడ

లలిత కళా సమితి - పామర్రు

గాంధీ క్షేత్ర కళా పరిషత్ - అవనిగడ్డ

కళా సమితి - తిరువూరు

**గుంటూరు జిల్లా**

ఆళ్ళ కృష్ణారావు మెమోరియల్ నాటక కళా పరిషత్ - గుంటూరు

అనవేమా క్లబ్ - గుంటూరు

అద్దంకి కళా సాగర్ - అద్దంకి

ఆంధ్ర విజ్ఞాన సమితి - గుంటూరు

ఇందిరా గాంధీ నాటక కళాపరిషత్ - గుంటూరు

ఆలపాటి వెంకట్రామయ్య స్మారక కళా పరిషత్ - యడపల్లి

ఉషోదయ కళా పరిషత్ - సత్తెనపల్లి

కళా సదస్సు - చిలకలూరిపేట

కళ్యాణం రఘురామయ్య నాటక కళా పరిషత్ - బాపట్ల

కక్కెర వెంకట సుబ్బయ్య స్మారక కళా పరిషత్ - చిలకలూరిపేట

కమలనాధుడు కళాపరిషత్ - చిలకలూరిపేట

టి కృష్ణ కళా పరిషత్ - చిలకలూరిపేట

కర్షక కళా సమితి - గణేష్‌వారిపాలెం

కళాంజలి - చిలకలూరిపేట

కొన ప్రభాకరరావు కళా పరిషత్ - బాపట్ల

చెన్నకేశవ నాటక పరిషత్ - మాచర్ల

చైతన్య నిలయం - పొన్నూరు

జేసిస్ నాటకోత్సవాలు - గుంటూరు

తెలుగుదేశం నాటక కళా పరిషత్ - చిలకలూరిపేట

దొడ్డపనేని ఇందిర కళా పరిషత్ - తెనాలి

నన్నపనేని కళా పరిషత్ - తెనాలి

నవయుః.త - మాచర్ల

నటరాజ కళా సమితి - చీరాల

దేవాంగపురి నాటక కళా పరిషత్ - చీరాల

నరసారావుపేట నాటక కళా పరిషత్తు - నరసారావుపేట

ప్రగతి కళా పరిషత్ - సత్తెనపల్లి

పెనుగొండ సైనిక కళా పరిషత్ - పెనుగొండ

పురపాలక సంఘం - తెనాలి

బళ్లారి రాఘవ నాటక కళా పరిషత్తు - బాపట్ల

మల్లయలింగం స్మారక నాటక పరిషత్తు - గుంటూరు

ఎల్ వి ఆర్ సన్స్ క్లబ్ నాటక పరిషత్తు - గుంటూరు

గుంటూరు కళా పరిషత్ - గుంటూరు

స్నేహ సమాఖ్య - ఇంకొల్లు

రంగస్థలి - నరసరావుపేట

రాధాస్మారక కళా పరిషత్తు - తెనాలి

రసమయి - తెనాలి

రసమయి - పిడుగురాళ్ల

లక్ష్మీ చెన్న కేశవ కళా పరిషత్ - మాచర్ల

లలిత కళా సమితి - వేటపాలెం (ప్రకాశం)

విశ్వశాంతి కళా నికేతన్ - వినుకొండ

శ్రీరాధా రామ్మోహనరావు స్మారక కళా పరిషత్ - నర్సాపురం

శ్రీ చెన్నకేశవ కళా కేంద్రం - మాచర్ల

ఆలపాటి వెంకట్రామయ్య స్మారక పోటీలు - తెనాలి

శ్రీశ్రీ ఆర్ట్స్ అకాడమీ - టంగుటూరు (ప్రకాశం)

సాహితీ కళా నికేతన్ - గుంటూరు

యస్ వి ఆర్ కళా పరిషత్ - గుంటూరు

సి ఆర్ క్లబ్ నాటక కళా పరిషత్ - చిలకలూరిపేట

సింగరాజు నాగభూషణం నాటక పరిషత్తు - బాపట్ల

షైనీ నాటక కళా పరిషత్ - పెనుగొండ

హరిప్రసాదరాయ స్మారక సంఘం - గుంటూరు

కళావాహిని - మురికిపూడి

కందిమళ్ల కమలనాధుడు కళా పరిషత్ - మురికిపూడి

కాకతీయ కళాపరిషత్, నాగబైరువారిపాలెం

**చిత్తూరు జిల్లా**

మదనపల్లి నాటక కళాపరిషత్ - మదనపల్లి

లలిత కళా సమితి - సత్యవేడు

శ్రీ వెంకటేశ్వర నాటక పరిషత్తు - తిరుపతి

**ప్రకాశం జిల్లా**

టి కృష్ణ చైతన్య వేదిక - ఒంగోలు

మోదుకూరి జాన్సన్ కళా పరిషత్ - ఒంగోలు

నటరాజు కళా పరిషత్ - ఒంగోలు

స్పోర్ట్స్ క్లబ్ కళా పరిషత్ - వీరన్నపాళెం

**నెల్లూరు జిల్లా**

కాళిదాసు కళా రాధన సమితి - కావలి

కళా రాధన సమితి - బుచ్చిరెడ్డిపాళెం

కళా రవళి - బుచ్చిరెడ్డి పాళెం

నెఫ్జా - నెల్లూరు

నట సమాఖ్య - వెంకటగిరి

సంస్కృతి సమ్మేళనం - గూడూరు

షార్ రిక్రియేషన్ క్లబ్ - శ్రీహరికోట

యూత్ కల్చరల్ క్లబ్ - రావూరు

**తూర్పు గోదావరి జిల్లా**

అజాద్ ఆర్మీ నాటక కళా పరిషత్ - దివిలి

యంగ్ మెన్స్ హ్యాపీ క్లబ్ - కాకినాడ

కల్చరల్ ఆర్ట్స్ - కాకినాడ
జ్యోతుల కళా పరిషత్ - ఇర్రిపాక
గరికపాటి రాజారావు కళా పరిషత్ - రాజమండ్రి
నవ్య కళా నికేతన్ - రాజమండ్రి
పంతం పద్మనాభం నాటక కళా పరిషత్ - గెద్దనాపల్లి
ముదునూరి రామన్న కళా పరిషత్ - రాజమండ్రి
లలిత కళా నికేతన్ - రాజమండ్రి
విశ్వశాంతి ఆర్ట్స్ - గాజువాక
స్నేహలతా కళా పరిషత్ - పిఠాపురం
కొప్పరపు సుబ్బారావు నాటక కళా పరిషత్, గొల్లప్రోలు
సౌజన్య ఆర్ట్స్ - కాకినాడ
సకల కళా సమాఖ్య - సామర్లకోట
సత్యనారాయణస్వామి దేవస్థానం వారి నాటకోత్సవాలు - అన్నవరం
రామయోగి నాటక కళా పరిషత్ - తాతిపూడి
గురజాడ కళా సమితి - ధవళేశ్వరం

**పశ్చిమ గోదావరి జిల్లా**

అరుణోదయ కళా పరిషత్ - భీమవరం
అల్లూరి సీతారామరాజు నాటక కళా పరిషత్ - భీమవరం
తెలుగు దర్బారు - ఏలూరు
యువజన సంఘం - భీమవరం
సోషల్ క్లబ్ అసోసియేషన్ - తణుకు
కళాంజలి - పాలకొల్లు
పాలకొల్లు సంగీత నాటక అకాడమీ - పాలకొల్లు
మహాత్మాగాంధీ మైత్రీబృందం - పాలకొల్లు
లలిత కళాంజలి - పాలకొల్లు
వీవర్స్ కాలనీ కళా పరిషత్ - పాలకొల్లు
క్షీరపురి నాటక అకాడమీ - పాలకొల్లు

**విశాఖపట్నం జిల్లా**

కోరమండల్ రిక్రియేషన్ క్లబ్ - విశాఖపట్టణం

కనకమహాలక్ష్మి నాటకోత్సవాలు - విశాఖపట్టణం

చైతన్య కళా భారతి (బి హెచ్ పి వి , విశాఖపట్టణం)

రిక్రియేషన్ క్లబ్ - విశాఖపట్టణం

గౌరీ శంకర నాటక కళా పరిషత్ – ఫిరంగిపురం

నాట్యభారతి - విశాఖపట్టణం

సాగరి (పోర్ట్ ట్రస్ట్) - విశాఖపట్టణం

హిందూస్థాన్ షిప్‌యార్డ్ రిక్రియేషన్ క్లబ్ - విశాఖపట్టణం

షిప్‌యార్డ్ నాటకోత్సవాలు - విశాఖపట్టణం

**విజయనగరం జిల్లా**

రాఘవ నాటక కళా పరిషత్ – విజయనగరం

విజయరామ నాటక అకాడమీ – విజయనగరం

**శ్రీకాకుళం జిల్లా**

కళాంజలి నాటికల పోటీలు – శ్రీకాకుళం

**వరంగల్ జిల్లా**

భారతీయ నాటక కళాపరిషత్, వరదన్నపేట, చైతన్య కళాభారతి, తొర్రూరు

**మహబూబ్‌నగర్ జిల్లా**

గ్రామ వెలుగు నాట్య మండలి – రేపాల

భరత్ సింగ్ కళా పరిషత్ – అచ్చంపేట

బళ్లారి రాఘవ కళా పరిషత్ – అచ్చంపేట

**నిజామాబాద్**

నగర నట సమాఖ్య – నిజామాబాద్

**అదిలాబాద్**

యువ కళా కేంద్రం – మంచిర్యాల

**ఖమ్మం జిల్లా**

జంగిల్ క్లబ్, చర్ల

నటరాజ కళా పరిషత్ - ఖమ్మం

ఖమ్మం కళా పరిషత్ - ఖమ్మం

దోనేపూడి వెంకటేశ్వర్రావు కళా పరిషత్ - ఖమ్మం

**నల్గొండ జిల్లా**

భారత ఆహార సంస్థ నాటక పోటీలు - నల్గొండ

యాదగిరి లక్ష్మీ నరసింహస్వామి కళా పరిషత్ - యాదగిరిగుట్ట

**హైదరాబాద్ జిల్లా**

ఆంధ్ర ప్రదేశ్ సచివాలయ సాంస్కృతిక సంఘం - హైదరాబాద్

ఆంధ్ర లలిత కళా సమితి - సికింద్రాబాద్

ఆంధ్ర ప్రదేశ్ నాట్య సంఘం - హైదరాబాద్

అగ్రో ఇండస్ట్రీస్ నాటక పోటీలు - హైదరాబాద్

ఇ సి ఐ ఎల్ - హైదరాబాద్

ఐ డి పి ఎల్ - హైదరాబాద్

ఏ జి ఆఫీసు నాటక పోటీలు - హైదరాబాద్

డా॥ అక్కినేని నాగేశ్వరరావు నాటక కళా పరిషత్ - హైదరాబాద్

కిన్నెర ఆర్ట్స్ - హైదరాబాద్

కళా రాజ్యం - హైదరాబాద్

త్యాగరాయగాన సభ నాటక పోటీలు - హైదరాబాద్

తెలుగు విశ్వవిద్యాలయం - హైదరాబాద్

నీహారిక - హైదరాబాద్

బి హెచ్ ఇ ఎల్ కమ్యూనిటీ సెంటర్ - రామచంద్రపురం

విజ్ఞాన కళా కేంద్రం - హైదరాబాద్

శ్రీ కళా నికేతన్ - హైదరాబాద్
హెచ్ ఎమ్ టి - హైదరాబాద్
హెచ్ సి ఎల్ నాటిక పోటిలు - హైదరాబాద్
మహతీ కళా స్రవంతి - హైదరాబాద్
సి యస్ ఆర్ కళామందిరం - హైదరాబాద్
ఫిల్మ్‌నగర్ కల్చరల్ సెంటర్ - హైదరాబాద్

**రాష్ట్రేతర ప్రాంతాలలో నాటక పోటీలు నిర్వహించే సంస్థలు**

బ్రహ్మపుర నాటక కళా పరిషత్ - బరంపురం
ఆంధ్ర అసోసియేషన్ - రూర్కెలా
ఆంధ్ర అసోసియేషన్ - అలహాబాద్
వెంకటేశ్వర నాటక కళా పరిషత్ - మద్రాసు
ఆంధ్ర కళా సమితి - బళ్లారి
ఆంధ్ర కల్చరల్ అసోసియేషన్ - భిలాయ్
అఖిల భారత బహు భాషా పోటీలు
(ఉత్కళ్ యువ సాంస్కృతిక సంఘం) - కటక్
జయలక్ష్మి ఆర్ట్స్ - బరంపురం
ప్రవాసాంధ్ర నాటక కళా పరిషత్ - ఖర్గపూర్
మద్రాస్ సోషల్ అండ్ కల్చరల్ క్లబ్ - మద్రాసు
మహాలక్ష్మి క్లబ్ - మద్రాసు
రాయగడ కళా పరిషత్ - రాయగడ
యస్ కె పి డి స్కూల్ పరిషత్ - మద్రాసు
కళాసాగర్ - మద్రాసు
చెన్నపురి ఆంధ్ర మహాసభ - మద్రాసు
తెలుగు ఫిలిమ్ జర్నలిస్టు అసోసియేషన్ - మద్రాసు
ప్రవాసాంధ్ర నాటక కళా పరిషత్ - భిలాయ్
శ్రీ సీతారామ నాటక కళా పరిషత్ - భిలాయ్

# ఉపసంహారం

కారుమబ్బును అంటిపెట్టుకుని కాంతిరేఖ పరీవృతమై ఉంటుందని ఆంగ్లేయుల సామెత అంటే ప్రతి నిరాశ వెనుక ఆశ అంతర్భాగమై ఉంటుందనీ, నిరాశా చీకట్లను చీల్చుకొంటూ మినుకు మినుకుమనే ఆశాదీపాలు వెన్నుతట్టి ప్రోత్సహిస్తాయని భావం

చెలియలికట్టదాటి, మహోధృతంగా ముందుకు చొచ్చుకుని వస్తున్న టి వి , సినిమాలనే సముద్రపు కెరటాల ధాటికి, అతలాకుతలమై, నాటకరంగం సంక్షోభంలోపడి తల్లడిల్లుతున్నమాట నిజమే అయినా, నాటకరంగం ఆత్మవిశ్వాసాన్ని కోల్పోలేదని ఈ దశాబ్ది పరిణామాలు రుజువు చేస్తున్నాయి

తెలుగు నాటకరంగం గాలిని మూటగట్టుకుని దానిమీద ప్రయాణం చేయటం లేదు అందువల్లనే పాశ్చాత్యనాటకరీతుల్ని ఎంతగా కౌగలించుకుని ప్రయోగాలు చేసినా, భారతీయ సంస్కృతికి సరిపడని సంగతులతో రాజీపడలేక, ఎప్పటికప్పుడు జాగ్రత్తపడుతూ తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోగలిగింది తెలుగు నాటకరంగం అలాగని కొత్తదనాన్ని ఆహ్వానించక పోలేదు ఎక్కడ మంచి ఉన్నా మన నాటకరంగం స్వీకరించింది "కొత్తదయిన ప్రతీదీ అనుసరణ యోగ్యం కాదు పాతది ప్రతిదీ పరిత్యాజమూ కాదు" అనే సూక్తిని పాటించింది

"నూతన విషయ చింతనతో, ప్రక్రియతో ఈనాటి తెలుగు నాటకరంగం ముందుకు పోతున్నది సామాజిక స్పృహ సరోవరమే వీరికి ఊతకొలను అయింది సంప్రదాయం, ఆధునికత్వం అనే రెండు వ్యవస్థల మధ్య సంశయగ్రస్తరుజా మనస్తత్వం నుండి నేటి సాంఘిక రచయిత బయటపడి ప్రగతిశీల పథంపై ఆధునిక యుగ సంకేతాన్ని ఎగురవేస్తూ, సమస్త మానవాళి మధ్య సమైక్యతను ఆశించే ఉదార భావంతో రంగస్థలాన్ని శోభావంతం చేస్తుండటం హర్షదాయకం"[1] అన్నారు డాక్టరు పి వి రమణ

1960 - 70 ప్రాంతాలలో ఆంధ్ర దేశంలో సుమారు ఐదువేల ఔత్సాహిక నాటక సమాజాలు ఉండేవి పదివేలకు పైబడి రంగస్థల నటులు నాటక

రంగానికి సేవలు అందించేవారు 1970 నుంచీ ఆ పరిస్థితి మారుతూ వచ్చింది ఔత్సాహిక సమాజాల సంఖ్య క్షీణించింది ఒకప్పుడు – అంటే కె వి గోపాలస్వామి ఆంధ్రా యూనివర్శిటీ రిజిస్ట్రారుగా ఉన్నకాలంలో ఆయన ఇచ్చిన ప్రోత్సాహంతో, స్ఫూర్తితో తెలుగునాట "నాటక రంగం" మూడు పూవులు ఆరు కాయలుగా వర్ధిల్లింది క్రమంగా కళాశాలల్లో సాంస్కృతికోత్సవాల సందడి తగ్గుముహం చూపింది వార్షికోత్సవాల్లో సహితం నాటకాలు వెయ్యడం అంతంత మాత్రంగా ఉంది ఇతరత్రా క్రీడలకు లభిస్తున్న ప్రోత్సాహం సాంస్కృతిక కార్యక్రమాలకు లభ్యం కావడం లేదు 'కాలేజి నాటక రంగం' నాటక కళకు వెన్నెముక అని గుర్తించిన ఏకైక వ్యక్తి గోపాల స్వామి గారే ఆయన తర్వాత కాలేజి నాటకరంగంపై దృష్టి నిలిపిన వారు లేరనడం సాహసమే అయినా – అది ఒక చేదు నిజం గ్రాస్ రూటు లెవల్లో కృషి లోపం ఉన్నప్పుడు దాని ఫలితాలు ఏవిధంగా ఉంటాయో నేటి నాటక రంగ పరిస్థితులు గుర్తు చేస్తున్నాయి

కళాశాల పరిధి నుంచి నాటకం నిష్క్రమించడానికి ప్రధానకారణం బ్రతుకు భయం నేటి యువతరాన్ని భయపెడుతున్న నిరుద్యోగ సమస్య విలయతాండవాన్ని కళ్లతో చూస్తున్న విద్యార్థి లోకం, హాబీగానైనా నాటకకళను చేపట్టడంలేదు నాటకాన్ని నమ్ముకుని మనుగడ సాగించడం సాధ్యం కాదన్నవారి నమ్మకాన్ని వమ్ముచేసి, ఆత్మవిశ్వాసం కలిగించగల ఆధారం కనపడటం లేదు వృత్తి నాటక సమాజాలు విరివిగా ఏర్పడి, సొంతకాళ్లమీద నిలబడి జీవిక సాగించగల పరిస్థితులు రానంతవరకు కాలేజినాటకరంగ పునర్నిర్మాణం ఇప్పట్లో సాధ్యంకాదేమో అనిపిస్తుంది

అయితే, నిరాశనువెన్నంటి ఆశ ఉంటుందన్నట్టుగానే 'కాలేజి నాటకరంగం' లో కలిగిన విఘాతాన్ని "ఉద్యోగరంగం" పూరించింది ఈ రోజుల్లో నాటకరంగాన్ని సంపన్నవంతంచేస్తున్న వారిలో ఉద్యోగులే అధిక శాతం అన్నది గమనించదగిన విషయం. ప్రభుత్వ కార్యాలయాలలోను, ప్రైవేటు సంస్థలలోను ఉద్యోగం చేస్తున్నవారు ఔత్సాహిక నాటక సమాజాలను స్థాపించి, నాటకాలు వేస్తూ నాటకరంగపురోభివృద్ధికి ఎనలేని సేవచేస్తున్నారు తమ సంపాదనలోనే కొంతభాగం

నాటకకళకోసం వెచ్చిస్తూ నాటకకళారాధన చేస్తున్నారు 1980-90 దశకంలో వచ్చిన మార్పుల్లో 'ఉద్యోగుల నాటకరంగ' ఆవిర్భావం ప్రధానంగా పేర్కొనదగిన పరిణామం ప్రస్తుతం మన రాష్ట్రంలో ఇంచుమించు వెయ్యి నాటక సమాజాలు నాటక సేవలో నిమగ్నమై ఉన్నాయి వీటిలో కనీసం అయిదు వందల సంస్థలు ఒక నిర్ణీత కార్యక్రమాన్ని చేపట్టి క్రియాత్మకంగా ముందుకు సాగుతున్నాయని చెప్పొచ్చు వీటికి ప్రభుత్వ సహాయం లేకపోయినా స్వయం పోషకంగా నడుస్తున్నాయనే చెప్పాలి రచయితలచేత కొత్త నాటకాలను రాయించే బాధ్యత కూడా ఈ సమాజాలే వహిస్తున్నాయి

కోడూరు అచ్చయ్య, డా రాజారావుగార్ల చేతుల్లో తీర్చిదిద్దబడిన 'ప్రజానాట్యమండలి' కె వెంకటేశ్వరరావుగారి నేతృత్వంలో రూపు రేఖలు దిద్దుకున్న 'ర స న ' సమాఖ్య 'నవ్యకళామండలి' దేశిరాజు జగన్నాధరావుగారి నిర్దేశకత్వంలో కొనసాగిన 'రైల్వేడ్రమెటిక్ క్లబ్', అయితా బలరామయ్యగారి సారథ్యంలో నడచిన 'జయరాం స్మారక కళా సమితి' జె ఎల్ నరసింహారావు, చాట్ల శ్రీరాములుగార్ల దేశికత్వంతో ప్రసిద్ధికెక్కిన 'విద్యానగర్ కల్చరల్ అసోసియేషన్' జె వి రమణమూర్తిగారి 'నటరాజ కళాసమితి' పామర్తి సుబ్బారావుగారి 'శ్రీ ప్రభాకర నాట్యమండలి' వంటి ప్రసిద్ధ నాటకసంస్థలతో పోల్చదగిన, అటువంటి స్థాయిగల నాటక సమాజాలకు, నిర్వాహకులకు ఈనాడు కూడా కొదవలేదు నిరుత్సాహ మేఘాలను ఛేదించుకొంటూ ముందుకు సాగుతున్న నేటి నాటక ప్రయోక్తలను ఎంతైనా అభినందించవలసి ఉంది

రాష్ట్ర వ్యాప్తంగా ఉన్న నాటక సమాజాలలో కె కె యల్ స్వామి ఆధ్వర్యంలో నడుస్తున్న షేకర్ కల్చరల్ అసోసియేషన్, యస్ కె మిశ్రోగారి 'బహురూప నటసమాఖ్య' టి జె రామనాథంగారి 'గురజాడ కళామందిర్', జవ్వాది రామారావుగారి 'రాఘవకళానిలయం', పామర్తి సుబ్బారావుగారి శ్రీ ప్రభాకరనాట్యమండలి', నాయుడు గోపిగారి 'గంగోత్రి', కె యన్ టి సాయిగారి 'కె యన్ టి సాయి ఆర్ట్ థియేటర్స్', తల్లావఝుల సుందరంగారి 'మురళీకళా నిలయం' వంటి కళాసంస్థలు నిర్మాణాత్మకంగా కృషి చేస్తున్నాయి

శ్రీయుతులు చాట్ల శ్రీరాములు, డా మొదలి నాగభూషణశర్మ, కొత్తుర్తి భాస్కరరావు, దేశిరాజు హనుమంతరావు, డి యస్ ఎన్ మూర్తి, డి రాజేశ్వరరావు, కె యన్ ఎన్ మూర్తి, శ్రీ హరిమూర్తి, తాళ్లూరి శివరావుకృష్ణారావు, ట జె రామనాధం అత్తిలి గోపాలకృష్ణ, భానుప్రకాశ్, జె సిద్ధప్పనాయుడు, మిశ్రో, తల్లావఝుల సుందరం, కె యస్ టి సాయి, పి యస్ నాధం, జలకం రాధాకృష్ణయ్య, జవ్వాది రామారావు వంటి నిష్ణాతులైన దర్శకుల పర్యవేక్షణలో ఉన్నత ప్రమాణాలు గల నాటక నాటికలు ప్రయోగింపబడుతూ నాటకరంగంలో వెలుగులు విరజిమ్ముతూ ఉన్నాయి

అలాగే - ఎందరో నటులు తమ నటనాకౌశలంతో కళారంగాన్ని తేజోవంతం చేస్తున్నారు ఈ దశాబ్దిలో మునుపటి కంటె నటీమణులు సంఖ్య పెరిగినా చాలినంతగా లేరు

గూడూరు సావిత్రి, వి కృష్ణవేణి, బి విజయలక్ష్మి, నాగమణి, గుమ్మడి విమలకుమారి, వై సరోజ, రత్నకుమారి, చిత్రాల జానకి, విజయశ్రీ, మద్దిల సరోజిని, కె ఇందిరాదేవి, యస్ సుజాత, ఎమ్ జగదీశ్వరీ, కె విజయలక్ష్మి, ఆలపాటి లక్ష్మి, గుంటూరు లక్ష్మి, ఎ శకుంతల వంటి ఉన్నతశ్రేణి కళాకారిణులు నాటకరంగాన్ని దీప్తిమంతం చేస్తున్నారు

రచయితలు, ప్రయోక్తలు, దర్శకులు, నటీనటులు, సాంకేతిక నిపుణులు చేస్తున్నకృషిని అనుసంధానం చెసే ప్రతినిధులుగా నేటి నాటక కళాపరిషత్తులు బృహత్తరమైన బాధ్యత నిర్వర్తిస్తున్నాయి

రాష్ట్రవ్యాప్తంగా నాటకపోటీలు నిర్వహించే సంస్థలు రెండు వందలుపైగా ఉన్నా, యాభై సంస్థలు మాత్రం నిర్ణీతకాలంలో క్రమం తప్పకుండా నాటకపోటీలు నిర్వహిస్తున్నాయి వాటిలో ప్రధానంగా పేర్కొన దగిన సంస్థలు సంస్కృతీ సమ్మేళనం (గూడూరు),లలితకళా సమితి (సికిందరాబాద్), కాళిదాస కళారాధన సమితి (కావలి), కోన ప్రభాకరరావు కళాపరిషత్తు (బాపట్ల), చెన్న మల్లేశ్వర కళాపరిషత్ (అమలాపురం), పంతం పద్మనాభ నాటక కళాపరిషత్ (గెద్దనాపల్లి), బి హెచ్ ఇ ఎల్ (రామచంద్రాపురం), అప్పాజోస్యుల - విష్ణుభాట్ల ఫౌండేషన్

నాటకపోటీలు (విశాఖపట్నం), డా అక్కినేని నాగేశ్వరరావు కళాపరిషత్ (హైదరాబాద్), పరుచూరి రఘుబాబు స్మారక నాటక పరిషత్తు (హైదరాబాద్), భారతీయనాటక కళాసమితి (వరదన్నపేట, వరంగల్ జిల్లా) సంస్థలు నాటకపోటీలను రాష్ట్రస్థాయిలో ఉన్నత ప్రమాణాలతో నిర్వహిస్తూవుండటం ముదావహం గతంలోవలె కాకుండా ఇప్పుడు ప్రతినాటక పరిషత్‌లోనూ ప్రదర్శింపబడే ప్రతి నాటకానికి రెండువేల నుంచి మూడువేలవరకు ప్రోత్సాహక బహుమతులు ఇవ్వడంవల్ల నాటక ప్రదర్శనకు నాటకసంఘాలకు అయ్యే ఖర్చులో మూడువంతులు పరిషత్తులు భరిస్తున్నాయి ఇది ఔత్సాహిక సంఘాలకు ఎంతో ఊరట కల్గిస్తున్నది

రాష్ట్రంలో నలుమూలల ఉన్న కొన్ని, కళాసంస్థలు, నాటక కళాభివృద్ధికై అంకితభావంతో కృషిచేసిన కళాకారులను, రచయితలను, దర్శకులను గుర్తించి వారిని సన్మానిస్తూ ప్రోత్సాహిస్తున్నాయి ఈ కార్యం ప్రభుత్వపరంగా కూడా జరుగుతూ ఉంది

రాష్ట్రంలో కొన్నిచోట్ల నెలవారీ కార్యక్రమంగా నాటకాలు ప్రదర్శించబడుతున్నాయి విశాఖపట్నంలో రావూజీగారు 'అమ్మ' సంస్థ ఆధ్వర్యంలో ప్రతినెలా ఒకనాటకాన్ని ప్రదర్శింపజేస్తూ సామాజికుల్లో నాటకాభిరుచికి దోహదం చేస్తున్నారు హైదరాబాద్‌లో రసరంజని సంస్థవారు నిత్యనాటక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు శ్రీ జె వి సోమయాజులు, శ్రీ గరిమెళ్ల రామమూర్తి, శ్రీ చాట్ల శ్రీరాములు ప్రభృతులు ఈ బృహత్తర కార్యాన్ని నిర్వహిస్తూ ఇతర సంస్థలకు మార్గదర్శకులు అవుతున్నారు సౌజన్య ఆర్ట్స్ (కాకినాడ) వారు, కల్పనా కళానికేతన్ (నరసరావుపేట) వారుకూడా నెలవారీ నాటక కార్యక్రమాలను నిర్వహిస్తూ కళారంగానికి యితోధికసేవ చేస్తున్నారు

ప్రతిమనిషికి పుట్టుకతో సంక్రమించే లక్షణాలలో 'నటన' అనేది ఒకటి సామాన్యుడు నటనాంశాన్ని నిత్యజీవితంలో అవసరార్థం వాడుకుంటూనే ఉంటాడు అది నటన అని తనకు తెలియకపోయినా అన్‌కాన్షియస్‌గా నటిస్తూనే ఉంటాడు కాని కళాకారుడు 'నటన' ను కళారూపంలో కాన్షియస్‌గానే

అభివ్యక్తంచేస్తాడు

నటశిక్షణ లేకుండానే కళాకారులు నాటకాలు వేస్తున్నారు జనరంజకంగా కూడా వేస్తున్నారు, అలాంటప్పుడు కళాకారులకు నటశిక్షణ అవసరమా? అని ప్రశ్నించవచ్చుకొందరు

శాస్త్రీయ పరిజ్ఞానం లేకపోయినా కళలు వృద్ధి చెందుతాయి అందుకు సందేహంలేదు శాస్త్రీయ సంగీతంలో శిక్షణ పొందకపోయినా, సాధనచెయ్యకపోయినా, కమ్మని కంఠస్వరం ఉన్నగాయకులు పాటలు పాటి సామాన్యుల మెప్పు పొందుతున్నారు అనుభవం, సాధన - యీ రెండింటి ఆధారంతో పాటలు పాడి శ్రోతల అభిమానాన్ని చూరగొనగల సమర్థతగల గాయకుల సంగీత సంప్రదాయాలను, అందులోని మెళకువలను కూడా ఆకళించుకోగలిగితే, దానివల్ల యింకా తమ కంఠానికి మెరుగులుదిద్దుకుని ఆత్మవిశ్వాసంతో ముందుకు పోవడానికి, సభలను రంజింపచేయటానికి అవకాశాలు మెండుగావుంటాయి

ఏనాడో మనపూర్వులు స్వరాలను క్రమబద్ధంచేసి, పరిధులేర్పరచి, ఆరోహణ అవరోహణల ప్రాముఖ్యాన్ని వివరించి, శ్రుతిలయాదులను, తాళ గతులను సూత్రీకరించి శాస్త్ర బద్ధం చేశారుగనుకనే, ఈనాడు మనం మన పూర్వీకులు ఏర్పరచిన పునాదుల మీద ఎన్నో దివ్యహర్మ్యాలను నిర్మించుకుంటున్నాం సంగీత ప్రపంచంలో భారతదేశానికి ఒక విశిష్ట స్థానాన్ని సంపాదించుకోగలిగాం వీటన్నిటికి మూలాధారం ఆనాటి సంగీత గ్రంధాలేకదా?

ఆ విధంగానే, ఒక వ్యక్తి రంగస్థలానికి చెందిన వివిధ శాఖల గురించి గ్రంధాలను చదవకపోయినా, రంగస్థలంపై ప్రతిభావంతంగా నటించి 'శభాష్' అనిపించుకోగలడు నాట్యశాస్త్రాన్నిబట్టీపట్టకపోయినా, చతుర్విధాభినయాలను గూర్చి వినకపోయినా పదినాటకాలలో నటించి, వంద నాటకాలు చూసి ఒక వ్యక్తి ప్రజ్ఞావంతుడైన దర్శకుడుగా పేరు తెచ్చుకోవచ్చు ఇది సాధ్యమే! కాని, స్వానుభవంతో మంచినటుడు కాగలిగిన వ్యక్తి, శాస్త్రీయ గ్రంధాలను కూడా అధ్యయనంచేసి నటనా రీతుల్లో శిక్షణ పొందితే బంగారానికి తావి అబ్బినట్టు మరింత రాణించడానికి

అవకాశాలుంటాయి కదా?

శాస్త్రీయ గ్రంథాలలో రాసినవన్నీ అన్ని కాలాలకు స్వీకార యోగ్యంగా ఉంటాయని, ఉండాలని నియమంలేదు, కాలానుగుణంగా చేర్పులు మార్పులు చేసుకోవచ్చు - అందువల్ల ప్రతి కళాకారుడు నటనలో శిక్షణ, సిద్ధాంతపరమైన పరిజ్ఞానం పొందవలసిన ఆవశ్యకత ఎంతో ఉంది

ఈ అవసరాన్ని గుర్తించిన గోపాలస్వామిగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో మొట్టమొదిసారిగా నాటకవిభాగానికి (థియేటర్ ఆర్ట్స్ డిపార్ట్‌మెంటు) శ్రీకారంచుట్టారు శ్రీ కె వెంకటేశ్వరరావు, శ్రీ మంత్రి శ్రీనివాసరావు, శ్రీ చాట్ల శ్రీరాములు వంటి ఉద్దండులకు ఆ శాఖను అప్పగించి నట శిక్షణకు మార్గం సుగమంచేశారు శ్రీ గోపాల స్వామి చూపిన మార్గంలో ఉస్మానియా విశ్వవిద్యాలయంలోను, తెలుగు విశ్వవిద్యాలయంలోను, కేంద్రీయ విశ్వవిద్యాలయంలోను రంగస్థల శాఖలు రూపుదిద్దుకున్నాయి

అంతేకాదు ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ పేరుతో ప్రైవేటు వ్యక్తుల యాజమాన్యంలో కొన్ని సంస్థలు ఏర్పడి రంగస్థల అభిరుచిగల ఔత్సాహికులకు సిద్ధాంతపరిజ్ఞానంతోపాటు నటనలో శిక్షణ కూడా ఇస్తున్నాయి

ఆంధ్ర ప్రదేశ్‌లో నాటక శిక్షణాలయాలు ఏర్పడటంలో నటన, దర్శకత్వంతోపాటు రంగపరికల్పన, రంగోద్దీపన, వేషధారణ వంటి సాంకేతిక నైపుణ్యం, అవసరమైన శాస్త్ర పరిజ్ఞానం సముపార్జించుకునే సదుపాయం అందుబాటులోకి వచ్చింది ఇది శుభపరిణామం!

ఇక రచయితల విషయానికి వస్తే - నూరు మందికిపైగా నాటక కర్తలు తెలుగు నాటక రంగంలో ఔత్సాహిక సమాజాలకు ఊపిరిపోస్తున్నారు

శ్రీయుతులు పాటిబండ్ల ఆనందరావు, వి యస్ కామేశ్వరరావు, జలదంకి సుధాకర్, యం సంజీవి, కె కె యల్ స్వామి, నుసుము నాగభూషణం, యస్వీ సుబ్బారెడ్డి, పల్లేటి లక్ష్మీకులశేఖర్, పి టి మాధవ్, విరియాల లక్ష్మీపతి, శశిమోహన్, అరిశెట్టి శివన్నారాయణ, కంచర్ల సూర్యప్రకాశరావు, ఏ భాస్కరచంద్ర, డి వి రమణమూర్తి, మార్గశీర్ష, కావూరి సత్యనారాయణ, శంకరమంచి పార్థసారధి

ప్రభృతులు ఈ దశాబ్దిలో (1980 - 90) విరివిగా నాటక నాటికలు రాసి నాటక సాహిత్యాన్ని సుసంపన్నంచేశారు

నాటకరంగంలో పేరుప్రఖ్యాతులు గడించిన నాటక కర్తలు సినిమారంగానికి వలసపోవడం ఆచార్య ఆత్రేయగారి తరం నుంచి ఒక సంప్రదాయంలాగ సాగుతూనే ఉంది ఇందులో ఆ నాటకకర్తల తప్పేమి లేదు నాటకరచనను తన జీవనోపాధిగా చేసుకుని రచయిత బ్రతకగలిగిన పరిస్థితులు వచ్చేవరకు నాటకరచయిత సినిమారంగానికి వలసపోవడం జరుగుతూనే ఉంటుంది ఇది అనివార్యం అనుభవజ్ఞులైన నాటకకర్తలు అటు వెళ్లిపోతుంటే, కొత్తతరం రచయితలు ఆ వెలితిని భర్తీ చేస్తుంటారు అదే యిప్పుడు జరుగుతూ ఉంది సినిమాలోకానికి వెళ్లిన నాటకకర్తను ఖర్చుక్రింద వ్రాసుకోవడమే! "తమిళనాడులో, మహారాష్ట్రలో, బెంగాల్‌లోవలే మనకూ సినీరంగ నటులతో, దర్శకులతో కూడా కలిపి ప్రత్యామ్నాయంగా స్థిరమైన వృత్తి నాటకరంగం ఏర్పడితే, వాళ్లకన్నా మంచి నాటకాలే మన రచయితలు,ప్రయోక్తలు, నటీనటులు, సమకూర్చగలరు"[2] అని ఒక మధ్యేమార్గాన్ని సూచిస్తున్నారు ప్రసిద్ధ సాహిత్య విమర్శకులు డి రామలింగంగారు

## ముగింపు

ఈ దశాబ్దిలో నాటక పరిషత్తులు నటీనటులకు, రచయితలకు, దర్శకులకు అండగానిలిచి ప్రోత్సహిస్తూ అనితరసాధ్యమైన సేవలు అందిస్తున్నాయి మనకు ప్రతిభావంతులైన దర్శకులున్నారు సమాజంనుంచి స్ఫూర్తినిపొంది సమాజాభివృద్ధి కోసం అమూల్యమైన రచనలు చేసే ఉత్తమ రచయితలు ఉన్నారు తమ నటనావైదుష్యంతో ప్రేక్షకలోకాన్ని రంజింపచేయగల అగ్రశ్రేణికి చెందిన నటీనటులున్నారు ఏ దృష్టికోణం నుంచి చూసినా తెలుగునాటకం ఏ ఇతర భాషల్లోని నాటకాలకు తీసిపోని ఎత్తులోనే ఉంది

ఎటొచ్చీ తెలుగు నాటకాలు ఇతర భాషల్లోకి అనువాదం కాకపోవడంచేత మననాటకం ఆంధ్ర రాష్ట్రం ఎల్లలు దాటిపోవడంలేదు ఈ విషయంలో

ప్రభుత్వం శ్రద్ధాశక్తులు చూపవలసి ఉంది వైయక్తిక ప్రయత్నాలవల్ల సాధించగల కార్యంకాదది

తెలుగు నాటకరంగంయొక్క ప్రగతిని ఒక దశాబ్దంతో విలువ కట్టడం సాధ్యం కాకపోయినా, అత్యంత వేగంగా మార్పులుచెందుతున్న సమాజ స్వరూపం తదనుగుణంగా నాటక రంగాన్ని ఎంత ప్రభావితం చేసిందో తెలుసుకునే ప్రయత్నమే యీ పరిశోధన పరమార్థం - 1980 సంవత్సరానికి పూర్వనుండి ప్రయోగ నాటకరంగం, రంగస్థలంలో సాధించిన మార్పులు, 1990 నాటికి తమ అస్తిత్వాన్ని కోల్పోయాయి తిరిగి, వాస్తవికతా శైలి నాటకాలకే పట్టంగట్టారు ప్రేక్షకులు పాశ్చాత్య నాటకాల ప్రభావంతో, ఎరువు తెచ్చుకున్న తెలుగు నాటక శైలులను ఏ కొద్ది మంది పండితులో హర్షించినా సామాన్య జనం, వీటిని తిరస్కరించారు - కనుక నూతన నాటక ప్రయోగాలు కేవలం విశ్వవిద్యాలయ రంగస్థలాలకు మాత్రమే పరిమితమయ్యాయి కాగా యితర భారతీయ భాషలలోని రంగస్థలం భారతీయత పేరిట, జానపద శైలిని, సంప్రదాయ నాటక శైలిని, సంస్కృత నాటకానువాదాలను, వారి వారి విదేశీయత అనే ముద్ర వలన సాధించే ఉత్కంఠను క్యాష్ చేసుకుని "క్రొత్తొక వింత" అన్న ప్రయోజనాన్ని సాధించారు - వారికి సమస్యాత్మక నాటకాలు పాతబడిపోగా, యక్షగానాలు, జానపదగాథలు మిశ్రమం చేసిన ఆధునిక నాటకాలు గొప్ప నాటకాలుగా చెలామణీ కాసాగాయి - రూపంలో తప్ప భావంలో ఏమాత్రం నవ్యత లేని యీ నాటకాలుకూడా కొంతకాలానికి జనామోదం పొందలేకపోయాయి పైగా పట్టణవాసులు పల్లెటూరివారి నేటివిటీని ప్రదర్శించలేక, కృతకమైన, అసహజమైన నాట్యరీతుల్ని అనుకరించబోయి సంపూర్ణత్వం సాధించలేక, పరిమిత సామర్థ్యాన్ని ప్రదర్శించారు గనుకనే రాజా ఈడిపస్, ఆంటిగని పాపులారిటీకి నోచుకోలేదు

ఐతే, ఆధునిక వీథినాటకాలు మాత్రం, దానికి భిన్నంగా, ప్రజామోదం పొందాయి పల్లెటూరు, పట్నం భేదం లేకుండా పరిష్కారమార్గం సూచించడానికి, అన్యాయాన్ని ఎదిరించడానికి, కళాకారులు ఉత్సాహంతో ప్రదర్శించారు ప్రజల్లో స్పందన రాబట్టారు పోతే వినోదంపాలు తక్కువ అయిన కారణంగా, యీ

నాటకాలు - వ్యతిరేక భావాలున్న ప్రజల్ని దూరం చేసుకుని, భావ సారూప్యత గల ప్రజలనే ఆకర్షించుతున్నాయి తెలుగు నాటకరంగానికి సంబంధించినంతవరకూ పరిషత్తు నాటకరంగమే కళాకారులకూ, నాటక రంగానికి ఊపిరి పోస్తున్నది వృత్తినాటకరంగం దాదాపు కనుమరుగైపోయింది - అదృష్టవశాత్తూ, సాంప్రదాయ నాటక రంగానికి, స్పాన్సరర్స్ లభించగా యువరక్తంతోపాటు పాండిత్యం కలబోసిన అమెచ్యూర్లు అయినా ప్రొఫెషనల్ దృష్టితో నాటకాన్ని ప్రదర్శిస్తున్న పద్యనాటక కళాకారులకు ఇటీవల గొప్ప ఆదరణ లభిస్తోంది - ఇదొక శుభ పరిణామం

గాలివాటంలాగానో, హాబీలాగానో, లేక తమ బంధుమిత్రులు మాత్రమే హర్షించే ప్యాసెంజర్ల వలన నాటకరంగానికి ఉపయోగం లేదు - కృషితోను, కమిట్‌మెంట్‌తోను నాలుగు కాలాలపాటు కళను అభ్యసించి, ప్రయోగించే త్యాగమూర్తులవల్లనే నాటకానికి ఉపయోగం - వారిని ఆకర్షించి, ప్రోత్సహించి, యితర మాధ్యమాలకి వలసపోకుండా నిగ్రహించి, నాటకరంగాన్ని బ్రతికించాల్సిన బాధ్యత గల ఒక సమాజం అవసరం!

వ్యాపార దృష్టితో లాభనష్టాలను బేరీజువేసే ప్రభుత్వ దృక్పథంలో మార్పు వచ్చి, కళల పట్ల సేవాదృక్పథం అలవరచుకోవాల్సిన నైతిక బాధ్యతను తెలియబరచే అవసరం కళాకారులదే - వాళ్లు పూనుకుంటే తప్ప నాటకరంగం బ్రతికి బట్టకట్టదు - అంతవరకు మంచి తెలుగు నాటకాలు లేవంటూనే, బంగళా, మహారాష్ట్ర నాటకాలకి బ్రహ్మరథంపట్టే ధోరణ (కొందరిది) నుండి మన నాటక రంగాన్ని రక్షించుకుందాం

ఈ దశాబ్దిలో వచ్చిన నాటకసాహిత్యం యావత్తు, అద్భుతం, అమోఘం అని చెప్పలేం తెలుగు భాషలో వచ్చిన నాటక వాఙ్మయంలో సాహిత్యపు విలువలు, ప్రదర్శనానుకూలత, పండితపామరులను రంజింపచేయగల చేవగల నాటకాలు, నాటికలు చాలా ఉన్నాయని మాత్రం గట్టిగా చెప్పవచ్చు - ఇదే ఈ సిద్ధాంతవ్యాసం ఉద్దేశం కూడా

నాటకరంగం ఎన్నో అడ్డంకులను, కష్టాలను ఎదుర్కొంటూ ముందుకు

సాగుతోంది  కారణాలు ఏవైనా, మనసున్న ప్రేక్షకులు కరువైపోతున్నారు నాటకం చూద్దామనే రసార్ద్ర హృదయం కరువైపోతున్నప్పుడు ఎంతమంచి నాటకమైనా బ్రతికి బట్టకట్టడం కష్టం దీనికి ప్రేక్షకుల ఆదరణ కావాలి ఉత్సాహమె పెట్టుబడిగా, సామాజికుల ఆనందమే తమ రాబడిగా తృప్తిపడుతూ నాటకరచన చేస్తున్న రచయితలకు, కళాకారులకు, దర్శకులకు, సాంకేతిక నిపుణులకు సామాజికుల ప్రోత్సాహం కొరవడితే నాటకరంగం నిర్వీర్యం అవుతుంది కనుక మన కళాసంపదను మనకోసం, భావితరాలకోసం పదిలపరచుకోవడం మన బాధ్యత  నాటకోద్యమానికి మన వంతు సహకారాన్ని అందించటం నేటి మన తక్షణ కర్తవ్యం

# ఉపయుక్త గ్రంథ మాలిక

అప్పారావు గురజాడ కన్యాశుల్కం (నాటకం) జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, 1983

అప్పారావు, పి యస్ ఆర్ తెలుగు నాటక వికాసము, నాట్యమాలా ప్రచురణలు, హైదరాబాదు 1967

--నాట్య శాస్త్రము, నాట్యమాలా ప్రచురణలు, హైదరాబాదు, 1983

-- ధర్మవరం రామకృష్ణమాచార్యులు, సాహిత్య అకాడమీ, ఢిల్లీ, 1989

ఆంజనేయులు యస్ కె రాధికా స్వాంతం (నాటిక), ఆంధ్రప్రభ, 1987

ఆచార్, పి వి ఆంధ్రలో నాటకం - నాటక రంగం, ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ, 1965

ఆచార్య ఆత్రేయ రాం - రహీమ్ (నాటకం), ఆత్రేయ నాటక సాహిత్యం, డా కొంగర జగ్గయ్య (సం) మనస్విని చారిటబుల్ ట్రస్టు, మద్రాసు, 1990

ఆనందరావు, పాటిబండ్ల కాదు సుమా కల (నాటకం), గంగోత్రి, పెదకాకాని, 1996

--నిషిద్ధాక్షరి (నాటకం), తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1987

ఉదయ్, టి (సంపా) కరువు బతుకులు (వీధినాటకం) అరుణోదయ, నల్లగొండ, 1996

కాత్యాయనీ విద్మహే "పితృస్వామ్య మాయాజాలంపై సమరం" (వ్యాసం), ఇండియా టుడే, వార్షిక సంచిక, 1995

కామేశ్వరరావు వి యస్ నత్వం శోచితు మర్హసి (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ

-- ఈ మంటలార్పండి (నాటకం), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ

-- తీర్పు (నాటిక) శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1982

కాశీ విశ్వనాథం జీవన సంధ్య (నాటిక), యువ కళావాహిని, చిలకలగూడ, హైదరాబాదు, 1995

-- రాముడు లేని రాజ్యంలో (నాటకం), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1981
కుమార్, డి వి శబ్దం (వీథినాటకం) అరుణోదయ ప్రచురణ, విజయవాడ, 1992
కృష్ణ, వి సి నడుస్తున్న చరిత్ర (నాటిక), బిందుపబ్లికేషన్స్, 15/102, బృందావనం, నెల్లూరు
కృష్ణారావు, అత్తిలి జంతర్‌మంతర్ మామూళ్లు (వీథి నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1986
--టామీ టామీ టామీ (నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1984
కోటేశ్వరరావు, సుకమంచి నరకం మరెక్కడో లేదు (నాటిక), 1984
గణేష్ పాత్రో ఆగండి కొంచం ఆలోచించండి (నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1981
గోపాలస్వామి, కె వి ప్రసిద్ధ నాటికలు (సంకలనం), కుబేరా ఎంటర్ ప్రైజెస్, మద్రాసు, 1957
చంద్రశేఖర్, శిష్ట్లా చిచ్చు (నాటకం) శ్రీరామ్ బుక్ డిపో, విజయవాడ, 1989
చిరంజీవి, కె నీలిదీపాలు (నాటకం) అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1984
జనార్ధనరెడ్డి, జి ఇంకా తెల్లారలె (వీథినాటిక), ఆం ప్ర టీచర్స్ ఫెడరేషన్, వరంగల్, 1994
జయప్రభ నాలుగో గోడ, తెలుగులో ఆధునిక నాటకం, చరిత ప్రచురణలు, హైదరాబాదు, 1992
జోగి సోమయాజి, గంటి (సంపా) యక్షగానాలు (ఆరు సంపుటములు) ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, వాల్తేరు, 1955
డీన్‌బద్రూ ఆ ఉదయం ఎప్పుడో (నాటిక), శ్రీరామా బుక్ డిపో, విజయవాడ-2, 1982
నంది, యన్ ఆర్ మరో మొహెంజోదారో (నాటకం), నవోదయ పబ్లిషర్స్,

విజయవాడ, 1970

నటరాజ రామకృష్ణ తూర్పు భాగవతము (వ్యాసం), నాట్యకళ, సెప్టెంబర్, 1973

--ఆంధ్రులు - నాట్యకళ నర్తనమురళీ గ్రంధమాల, హైదరాబాదు

నరసింహారావు, కె యల్ క్రనీడలు (నాటకం), ఆంధ్ర బుక్ హౌస్, హైదరాబాదు, 1956

నరసంహారావు, యిక్కుర్తి పిడికిలి (నాటిక), మిత్ర సమితి ప్రక్కిలంక

నాగభూషణ శర్మ, మొదలి లోచన (రంగస్థల వ్యాస సంకలనం), యం యస్ శర్మ షష్ట్యబ్ది స్ఫూర్తి మహోత్సవ నిర్వాహక సమాఖ్య, హైదరాబాదు, 1955

--ఆచార్య ఆత్రేయ, తెలుగు నాటకరంగం, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు

-- నూరేళ్ల తెలుగు నాటక రంగం (వ్యాస సంకలనం), ఆంధ్రప్రదెశ్ సంగీత నాటక అకాడమీ, 1980

-- రాజా ఈడిపస్, గ్రీకు నాటకానికి తెనుగు అనువాదం, శరత్ అండ్ ఆనంద్ ప్రచురణలు హైదరాబాదు

నాగభూషణం, నుసుము కాలజ్ఞానం (నాటిక), యువ కళా వాహిని, హైదరాబాదు, 1995

నారాయణరావు, కాళ్లకూరి వరవిక్రయం (నాటకం), జయంతీ పబ్లికేషన్స్, విజయవాడ, 1988

పద్మావతీదేవి, అత్తిలి ఊరేగింపు (నాటిక) అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1982

-- సంధ్యా - ఛాయ (నాటకం) అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1982

పోతన్న, వి హరిజనాభ్యుదయం - తెలుగు నాటకం, తేజో ప్రచరణలు ఇం నెం 98, హౌసింగ్ బోర్డు కాలనీ, కర్నూలు, 1994

బాబూరావు, బి మధ్యతరగతి కధ (నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1980

-- కైలాసంలో కోర్టు (నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1982

భాషా, వలి, వెంకయ్య ఆటబొమ్మలు (వీథినాటిక), ప్రజాశక్తి బుక్ హౌస్, విజయవాడ-2

బుచ్చిబాబు ఆత్మవంచన (నాటకం), శ్రీరామ బుక్ హౌస్, విజయవాడ, 1951

భరణి, తనికెళ్ల గోగ్రహణం (నాటిక), శ్రీరామ బుక్ హౌస్, విజయవాడ, 1987

--గొయ్యి (నాటిక), అమృతవాణి - ధర్మవిజయం ప్రచురణ సికిందరాబాదు

భాస్కరచంద్ర, ఏ హిమాగ్ని (నాటిక), యువకళావాహిని ప్రచురణ, చిలకలగూడ, సికిందరాబాదు, 1996

-- కొయ్యగుర్రం (నాటిక), అప్పాజోస్యుల - విష్ణుభొట్ల ఫౌండేషన్ ప్రచురణ, సహృదయ సాహితి, బాపట్ల, 1997

భీమరాజు, డి మొక్కు (నాటిక), యువకళావాహిని ప్రచురణ, సికిందరాబాదు, 1995

భీమన్న, బోయి రాగవాసిష్ఠం (నాటకం - ప్రస్తావన), సంస్కృతీ సంవర్ధన సమితి, మల్లేపల్లి, హైదరాబాదు,1959

మధుసూదన్, వనం తెలుగు ఏకాంకిక వికాసం, శరత్ ప్రచురణలు, వరంగల్లు, 1988

మల్లికార్జునరావు, కప్పగంతుల నాటక సమీక్ష, క గా కా కౌ ప్రచురణలు, రాజమండ్రి-3, 1979

--వ్యాసమాలిక, క గా కా కౌ ప్రచురణలు, రాజమండ్రి-3, 1988

--ఆశయా బద్ధతే లోకే (నాటిక), కప్పగంతుల మల్లికార్జునరావు నాటికల సంపుటి, క గా కా కౌ ప్రచురణలు, హైదరాబాదు, 1995

సాలెగూడు (నాటిక), కప్పగంతుల వల్లికార్జునరావు నాటికల సంపుటి, క గా కా కౌ ప్రచురణలు, హైదరాబాదు

మారుతీరావు, గొల్లపూడి లావాలో ఎర్రగులాబీ (నాటకం) అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1975

మారెళ్ల ఏడవకండేడవకండి (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1987

మూర్తి, డి ఎస్ ఎన్ తెలుగు నాటక ప్రయోగాలు (వ్యాసం), సాక్షి (వ్యాస

సంకలనం) (సం) శ్రీ ఎన్ తారక రామారావు, శ్రీ కళానికేతన్, హైదరాబాదు, 1994
యువరాజ్, పెందుర్తి నాగులు తిరిగేకోనలో (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1990
రమణమూర్తి, డి వి వంటమనిషి కావాలి (నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1990
రమణమూర్తి, బి వి పసుపుబొట్టు పేరంటానికి (నాటకం), తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1987
రమణ, పి వి తెలుగు సాంఘిక నాటకం - ప్రభావం, డా పి వి రమణ, బయ్యారం, 1993
రమణానంద్ ఆంధ్ర నాటక కళాపరిషత్తు (వ్యాసం), నాట్యకళ, తెలుగు నాటక రంగ శతజయంతి ప్రత్యేక సంచిక, 1980
రమణారెడ్డి, కె వి అండ్ పి వేణు రాజీవం (నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1973
రాజమన్నారు, పాకాల వెంకట రాజమన్నారు నాటికలు, దేశి కవితా మండలి, విజయవాడ, 1988
--మనోరమ (నాటకం) దేశి కవితా మండలి, విజయవాడ, 1959
రాజారావు, దోనేపూడి న్యాయం నెగ్గింది (నాటకం), సాహిత్య నవసంధా గుట్టలబజారు, ఖమ్మం, 1980
రామదాసు, బెల్లంకొండ పునర్జన్మ (నాటకం), ఆదర్శ గ్రంధమండలి, విజయవాడ, 1956
రామమోహనరావు, అద్దేపల్లి స్త్రీ వాద కవిత్వం - ఒక పరిశీలన, ప్రజా రచయితల సమాఖ్య, హైదరాబాదు, 1992
రాధాకృష్ణమూర్తి, మిక్కిలినేని ఆంధ్ర నాటక రంగ చరిత్ర, రేణుకా గ్రంధమాల, మద్రాసు, 1969
--జానపద కళారూపాలు, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1995
రామచంద్రారెడ్డి, రాచమల్లు సారస్వత వివేచన, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1996

రామచంద్ లిఫ్ట్ (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1989

రామలింగం, డి గడచిన దశాబ్దిలో - తెలుగు నాటకం - నాటిక (వ్యాసం), సాహిత్యోపన్యాసములు - 14, ఆం ప్ర సాహిత్య అకాడమీ హైదరాబాదు 1977

రామన్నపంతులు, విన్నకొట నటశిక్షణ, విన్నకోట పబ్లికేషన్స్, విజయవాడ, 1980

రామారావు, చింతాడ నరబలి (నాటిక), చింతాడ రామారావు, గండ్రేడు గ్రామం పొందూరు మండలం, శ్రీకాకుళం జిల్లా, 1990

రావు, సి యస్ ఊరుమ్మడి బతుకులు (నాటిక), ఆదర్శ గ్రంధమండలి, విజయవాడ, 1981

రావు, యస్ ఏ హరిత (నాటిక), యువకళా వాహిని ప్రచురణ, హైదరాబాదు, 1995

లక్ష్మీపతి, విరియాల పంచమవేదం (నాటకం), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1986

లక్ష్మీనరసింహం, చిలకమర్తి స్వీయ చరిత్ర

లక్ష్మీనరసయ్య, జి శివమెత్తిన శంభూకుని శిరస్సు (వ్యాసం), ఇండియా టుడే, వార్షిక సాహిత్య సంచిక, 1995

లక్ష్మీకులశేఖర్, పల్లేటి తపస్సు (నాటిక), తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు, 1987

విశ్వనాథ శాస్త్రి, రాచకొండ పరిష్కృతి (నాటకం) పద్మప్రియ ప్రచురణలు, విశాఖపట్నం, 1984

వీరేంద్రనాథ్, యండమూరి రుద్రవీణ (నాటిక), దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ, 1990

వీరేశలింగం, కందుకూరి స్వీయచరిత్ర, హితకారిణి సమాజం, రాజమండ్రి

వేంకటావధాని, దివాకర్ల ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, దివాకర్ల 18/4, హైదరాబాదు, 1971

వెంకటేశ్వరరావు, పరుచూరి సమాధి కడుతున్నాం - చందాలివ్వండి (నాటకం) సుమన ప్రచురణలు, హైదరాబాదు

వెంకటేశ్వరరావు, నార్ల ప్రారబ్ధం (నాటిక), ప్రసిద్ధ నాటికల సంకలనం,కుబేరా ఎంటర్ ప్రయిజెస్ మద్రాసు, 1957

శశిమోహన్, జి కోహినూర్ (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1989

--ఫర్ సేల్ (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1989

శాయి, కె యస్ టి సుమతి (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1986

- పరమపదం (నాటకం), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ-2

-సర్పజాతి (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ-2

శివ ప్రసాద్, వల్లూరి శ్రీముఖ వ్యాఘ్రం (నాటిక), గంగోత్రి, పెదకాకాని, 1995

శివన్నారాయణ, అరిశెట్టి పుణ్యఫలం (నాటిక) యువకళా వాహిని, హైదరాబాదు, 1994

శ్రీరామ్, ఎల్ బి గజేంద్ర మోక్షం (నాటిక), శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1989

శ్రీరాములు, చాట్ల ప్రదర్శన రీతులలో నూరేళ్లలో వచ్చిన మార్పులు (వ్యాసం), నూరేళ్ల తెలుగు నాటక రంగం, సం మొదలి నాగభూషణ శర్మ

- తెలుగు నాటక రంగంపై పాశ్చాత్య నాటక రంగ ప్రభావం (వ్యాసం), పరుచూరి రఘుబాబు స్మారక ప్రత్యేక సంచిక, 1995

శ్రీనివాస చక్రవర్తి ఆంధ్ర నాటక దర్శిని, జయంతి పబ్లికేషన్స్, విజయవాడ,1965

సంజీవి యం కదలిక (నాటిక) శ్రీరామ బుక్ డిపో, విజయవాడ, 1980

--అయ్యో(వ)ధ్య (నాటిక), యువకళావాహిని, హైదరాబాదు, 1996

సంజీవ్‌దేవ్ సత్యం-శివం-సుందరం (నాటికకు ముందు మాట), దేశీబుక్ హౌస్, హైదరాబాదు, 1980

సత్యనారాయణ శాస్త్రి, మధునాపంతుల ఆంధ్ర రచయితలు, అద్దేపల్లి అండ్ కో, రాజమహేంద్రవరం, 1950

సత్యనారాయణరావు, యండమూరి ఉష కిరణాలు, ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ, 1960

సత్యనారాయణ, కావూరి ముఖచిత్రం(నాటిక), యువకళా వాహిని, హైదరాబాదు, 1995

-- రివర్స్ మార్చ్ (నాటిక), యువ కళావాహిని, హైదరాబాదు, 1995

-- శ్వేతపత్రం (నాటిక), గంగోత్రి, పెదకాకాని, 1996

సత్యనారాయణ మూర్తి, ఆకెళ్ల పెద్దబాలశిక్ష (వీధినాటిక), ధర్మవిజయం ప్రచురణ, సికింద్రాబాదు, 1982

-- అమ్మ (నాటిక), యువకళావాహిని, హైదరాబాదు, 1996

సత్యనాథన్, పంతం నవ్వండి ఇది విషాదం (నాటకం), గంగోత్రి పెదకాకాని, 1996

సఫ్దర్ హష్మి హల్లాబోల్ (వీధినాటిక), ప్రజాశక్తి బుక్‌హౌస్, విజయవాడ-2, 1989

- పోలీసు చరిత్ర (వీధినాటిక), ప్రజాశక్తి బుక్‌హౌస్, విజయవాడ 1989

సాంబశివరావు, కందిమళ్ల తెలుగు నాటకరంగం - నూతన ధోరణులు ప్రయోగాలు, కాకతీయ ప్రచురణ, చిలకలూరిపేట, 1995

సుధాకర్ జలదంకి గాలిగోపురం (నాటిక), యువ కళావాహిని ప్రచురణ, సికింద్రాబాదు, 1995

-- హలాల్ (నాటిక), యువకళావాహిని ప్రచురణ, సికింద్రాబాదు, 1996

సుబ్బరామిరెడ్డి, గండవరం ఆధునిక తెలుగు నాటకం (రెండు భాగాలు) ప్రవీణ్ పబ్లికేషన్స్, బౌద్ధనగర్, సికింద్రాబాద్, 1987

-- మూడు ప్రసిద్ధ నాటకాలు, నవోదయ బుక్‌హౌస్ కాచిగుడ, హైదరాబాదు, 1995

-- ఆగండి నేనూ వస్తున్నా! (నాటిక), అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1980

-- అబద్ధాల ఊబిలో (నాటిక), యువ కళావాహిని ప్రచురణ, సికింద్రాబాదు, 1985

సుబ్బారెడ్డి, యస్ వి ప్రార్థన (నాటిక), యువ కళావాహిని ప్రచురణ, సికింద్రాబాదు, 1996

సూర్యప్రకాశరావు, కంచర్ల భేతాళ ప్రశ్న (నాటిక), యువ కళావాహిని ప్రచురణ, సికింద్రాబాదు, 1996

# అనుబంధం - 1

## ఈ దశాబ్దిలో (1980-90) వెలువడిన

## నాటకాలు - నాటికల జాబితా

## ఈ దశాబ్దిలో వెలువడిన నాటకాలు - నాటికలు

| | | |
|---|---|---|
| 1 | అసమర్థుని డైరీ | కె యస్ టి శాయి |
| 2 | అదాలత్ | అనంత్ హృదయరాజ్ |
| 3 | అరణ్యపర్వం | వాగ్దేవి |
| 4 | అం అః (నాటకం) | అనంత్ హృదయరాజ్ |
| 5 | అబద్ధాల ఊబిలో | గండవరం సుబ్బరామిరెడ్డి |
| 6 | అన్యాయం | బాబు |
| 7 | అంతా ఒక్కటే | బి సూర్యారావు |
| 8 | అయో (వ) ధ్య | సంజీవి |
| 9 | అహల్య (నాటకం) | మల్లెల శ్రీనివాసరావు |
| 10 | అసంపూర్ణ శిల్పాలు (నాటకం) | పాటిబండ్ల ఆనందరావు |
| 11 | అమ్మ | ఆకెళ్ల |
| 12 | అమృతవర్షిణి (నాటకం) | మార్గశీర్ష |
| 13 | 'ఆర్' | జె శశిమోహన్ |
| 14 | ఆగండి కొంచెం ఆలోచించండి | గణేష్ పాత్రో |
| 15 | ఆ ఉదయం ఎప్పుడో | డీన్ బద్రూ |
| 16 | ఆత్మహత్య | డి వి నరసరాజు |
| 17 | ఆ పొద్దు పొడవాల | డీన్ బద్రూ |
| 18 | ఆగండి నేనూ వస్తున్నా | గండవరం సుబ్బరామిరెడ్డి |
| 19 | ఇది తప్పంటారా? | వై సుందరరావు |
| 20 | ఇదేనా పరిష్కారం? | యస్ మునిసుందరం |
| 21 | ఇదే (నా) దారి | చందన పూర్ణచంద్రరావు |
| 22 | ఈ చరిత్ర ఏ సిరాతో ? (నాటకం) | సంజీవి |
| 23 | ఈ మంటలార్పండి (నాటకం) | వి యస్ కామేశ్వరరావు |
| 24 | ఉరి శిక్షకాదు (నాటకం) | డీన్ బద్రు |

| | | |
|---|---|---|
| 25 | ఊరేగింపు | అత్తిలి పద్మావతీ దేవి |
| 26 | ఎవ్వనిచే జనించు | దివాకరబాబు |
| 27 | ఎవరు గొప్ప ? | ఆర్ కె నారాయణబాబు |
| 28 | ఏ వెలుగులకీ ప్రస్థానం ? | యస్ మునిసుందరం |
| 29 | ఏక్ దిన్ కా గరీబ్ | వల్లూరి శివప్రసాద్ |
| 30 | ఏడవకండేడవకండి | మారెళ్ల |
| 31 | ఒంటెద్దుబండి | ఎల్ బి శ్రీరామ్ |
| 32 | ఓ బూతునాటకం (నాటకం) | ఇసుకపల్లి మోహనరావు |
| 33 | ఒంటికాలి పరుగు | జలదంకి సుధాకర్ |
| 34 | ఓ చీకటి రాత్రి | జంధ్యాల |
| 35 | ఓటు భిక్షాందేహి | కె వి యన్ డి ప్రసాద్ |
| 36 | కనరు వినరు మూర్ఖులు | కొత్తపల్లి బంగార్రాజు |
| 37 | కదలిక | యం సంజీవి |
| 38 | కనువిప్పు | బాబు |
| 39 | క్రాంతి | శశిమోహన్ |
| 40 | కలహాల కాపురం | సుకమంచి కోటేశ్వరరావు |
| 41 | కృష్ణపక్షం (నాటకం) | బి ఆర్ రంగారెడ్డి |
| 42 | కాలధర్మం | రాజ్ |
| 43 | కనకపు సింహాసనమున | మహమ్మద్ నఫీజుద్దీన్ |
| 44 | కరిమింగిన వెలగపండు (నాటకం) | కె కె యల్ స్వామి |
| 45 | కాదుసుమా కల (నాటకం) | పాటిబండ్ల ఆనందరావు |
| 46 | కాలజ్ఞానం | నుసుము నాగభూషణం |
| 47 | కాలకూటం (నాటకం) | డి భాస్కర్ |
| 48 | కైలాసంలో కోర్టు | బాబు |
| 49 | క్యూ | ధవళ సన్యాసిరావు |
| 50 | క్విట్ ఇండియా (నాటకం) | సుమ |

| | | |
|---|---|---|
| 51 | కొత్త కిరణం (నాటకం) | దివ్యప్రభాకర్ |
| 52 | కుక్క | యండమూరి వీరేంద్రనాథ్ |
| 53 | కోహినూర్ | శశిమోహన్ |
| 54 | కుందేటికొమ్ము | దివాకరబాబు |
| 55 | కొడుకు పుట్టాల | గణేశ్ పాత్రో |
| 56 | కుడికాలు వెట్టమ్మా (నాటకం) | మార్గశీర్ష |
| 57 | కోమా | నుసుము నాగభూషణం |
| 58 | గజేంద్రమోక్షం | ఎల్ బి శ్రీరామ్ |
| 59 | గగన పుష్పం | పి ఆంజనేయులు |
| 60 | గార్ధభాండం | తనికెళ్ల భరణి |
| 61 | గాలిగోపురం | జలదంకి సుధాకర్ |
| 62 | గాంధీ టుడే (నాటకం) | పి ఎస్ నాధన్ |
| 63 | గురుదక్షిణ | బి ఆర్ రంగారెడ్డి |
| 64 | గోగ్రహణం | తనికెళ్ల భరణి |
| 65 | గొయ్యి | తనికెళ్ల భరణి |
| 66 | చట్టంగుప్పెట్లో సామాన్యుడు | పి వి రావ్ |
| 67 | చరమాంకం | బి పి ప్రసాదరావు |
| 68 | చరమాంకం (నాటకం) | యన్ తారకరామారావు |
| 69 | చల్ చల్ గుఱ్ఱం | తనికెళ్ల భరణి |
| 70 | జంటస్వరాలు | దివ్యప్రభాకర్ |
| 71 | జలతరంగిణి (నాటకం) | యండమూరి వీరేంద్రనాథ్ |
| 72 | జంతర్ మంతర్ మ్యామూళ్లు | అత్తిలి కృష్ణారావు |
| 73 | జోగు జాతర (నాటకం) | అత్తిలి కృష్ణారావు |
| 74 | జాతిస్మరామి (నాటకం) | యస్ వి సుబ్బారెడ్డి |
| 75 | జీవన సంధ్య | కాశీవిశ్వనాధ్ |
| 76 | జీవన సూత్రం | కె కె యల్ స్వామి |

| | | |
|---|---|---|
| 77 | టెలిఫోన్ | బాబు |
| 78 | ట్రీట్‌మెంట్ | ఎస్ ఏ రావు |
| 79 | డాక్టర్ త్రిశంకం | ఆలూరి |
| 80 | డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్ (నాటకం) | ఇసుకపల్లి మోహనరావు |
| 81 | తపస్సు | పల్లేటి లక్ష్మీ కులశేఖర్ |
| 82 | తిమిరం | జోస్యభట్ల గున్నేశ్వరరావు |
| 83 | త్రి ఇన్ వన్ | పూసల వెంకటేశ్వరరావు |
| 84 | త్రినేత్రం (నాటకం) | దివ్య ప్రభాకర్ |
| 85 | తేనెటీగలు పగబడ్తాయ్ | కె కె యల్ స్వామి |
| 86 | తులసీ తీర్థం | అప్పలాచార్య |
| 87 | తీర్పు | వి యస్ కామేశ్వరరావు |
| 88 | తర్జని | ఇసుకపల్లి మోహనరావు |
| 89 | తూర్పురేఖలు (నాటకం) | అత్తిలి కృష్ణ |
| 90 | త్రివర్ణ పతాకం (నాటకం) | జలదంకి సుధాకర్ |
| 91 | త్రివేణి | గణేశ్ పాత్రో |
| 92 | ధర్మయజ్ఞం | బీనీడు కృష్ణయ్య |
| 93 | దర్పణం | పాటిబండ్ల ఆనందరావు |
| 94 | దగాపడిన చెల్లెలు | అత్తిలి కృష్ణ |
| 95 | దావాగ్ని | పల్లేటి లక్ష్మీ కులశేఖర్ |
| 96 | దేశానికో తండ్రి కానుక | జి శ్రీనివాస్ |
| 97 | దిష్టి బొమ్మలు (నాటకం) | యన్ యన్ నారాయణ |
| 98 | దేశం ప్రమాదంలో ఉంది | వెందుర్తి మాస్టర్జీ |
| 99 | ది డెవిల్స్ | పి వి రావు |
| 100 | ది రూట్ | పి బి కె శర్మ |
| 101 | ధర్మాగ్రహం | శ్రీకంఠా హనుమంతరావు |
| 102 | దేవాలయంమీద బొమ్మలు (నాటకం) | దాడి వీరభద్రరావు |

| | | |
|---|---|---|
| 103 | దేశం నీ సర్వస్వం | యస్ మునిసుందరం |
| 104 | దొరా! నీ సావు మూడింది | డా॥ యమ్ నాగభూషణశర్మ |
| 105 | నవశంఖారావం (నాటకం) | కె యస్ టి శాయి |
| 106 | నరకం మరెక్కడో లేదు | సుకమంచి కోటేశ్వరరావు |
| 107 | నాగులు తిరిగే కోనలో | వెందుర్తి యువరాజ్ |
| 108 | నల్లకోటు నవ్వింది | పి టి మాధవ్ |
| 109 | నత్వం శోచితు మర్హసి | వి యస్ కామేశ్వరరావు |
| 110 | నవ్వండి - ఇది విషాదం | పంతం సత్యనాధన్ |
| 111 | నీతి చంద్రిక (నాటకం) | పాడిబండ్ల ఆనందరావు |
| 112 | నడుస్తున్న చరిత్ర | వి సి కృష్ణ |
| 113 | నరబలి | చింతాడ రామారావు |
| 114 | నిజం చెప్పకు (నాటకం) | సహదేవ్ |
| 115 | న్యాయం నవ్వింది (నాటకం) | జి యస్ రామారావు |
| 116 | నిత్య శంకితుడు | గండవరం సుబ్బరామిరెడ్డి |
| 117 | నీలినీడలు (నాటకం) | ఈమని కోటేశ్వరరావు |
| 118 | నీకన్నా పశువు నయం | కొత్తపల్లి బంగార్రాజు |
| 119 | నూకాలమ్మ | బాబు |
| 120 | నిషిద్ధాక్షరి (నాటకం) | పాటిబండ్ల ఆనందరావు |
| 121 | న్యాయం నెగ్గింది (నాటకం) | దోనేపూడి రాజారావు |
| 122 | నీలిదీపాలు | కె చిరంజీవి |
| 123 | నైవేద్యం | యమ్ వి యస్ హరనాధరావు |
| 124 | నిర్మానుష్యం | విశ్వనాధ గణపతిరావు |
| 125 | పంచమవేదం (నాటకం) | విరియాల లక్ష్మీపతి |
| 126 | పంకజం చచ్చిపోయింది | యర్రగుంట్ల సూర్యమూర్తి |
| 127 | పసుపు బొట్టు - పేరంటానికి (నాటకం) | బి వి రమణమూర్తి |
| 128 | పురుషార్థం (నాటకం) | ఇసుకపల్లి మోహనరావు |

| | | |
|---|---|---|
| 129 | పెద్దబాలశిక్ష | ఆకెళ్ల |
| 130 | పుష్పకవిమానం | బి వి యస్ శాస్త్రి |
| 131 | పుణ్యఫలం | అరిశెట్టి శివన్నారాయణ |
| 132 | పరిష్కారం | వి మస్తాన్‌రావు |
| 133 | పులిస్వారి | ద్విభాష్యం రాజేశ్వరరావు |
| 134 | పితృదేవోభవ | అంకం లింగమూర్తి |
| 135 | పిచ్చికుక్క | జె యస్ రాజశేఖర్ |
| 136 | పునరపి | జె యస్ రాజశేఖర్ |
| 137 | పొగమంచు (నాటకం) | జలదంకి సుధాకర్ |
| 138 | పులి మళ్లీవస్తుందా ? (నాటకం) | శ్రీశైలమూర్తి |
| 139 | ప్రభాత భేరి (నాటకం) | ముడుంబై పురుషోత్తమాచారి |
| 140 | పక్షులు | యస్ మునిసుందరం |
| 141 | పక్షి | పేడాడ పరమేశ్వరరావు |
| 142 | ఫర్ సేల్ | శశిమోహన్ |
| 143 | ఫిఫ్టీ ఫిఫ్టీ (నాటకం) | నక్కా వెంకటేశ్వరరావు |
| 144 | ప్రార్థన | యస్ వి సుబ్బారెడ్డి |
| 145 | బాధ్యత | డా॥ బ్రహ్మానందరావు |
| 146 | భరత వాక్యం (నాటకం) | కె జి వేణు |
| 147 | బ్రహ్మచారి కొడుకు | అరిశెట్టి శివన్నారాయణ |
| 148 | భగవద్గీత (నాటకం) | కె జి వేణు |
| 149 | భోగి మంటలు (నాటకం) | కె యస్ టి శాయి |
| 150 | భూమి భాగోతం | వంగపండు ప్రసాదరావు |
| 151 | భేతాళ ప్రశ్న | కంచర్ల సూర్యప్రకాశరావు |
| 152 | బకాసుర (నాటకం) | ఎన్ తారక రామారావు |
| 153 | బొమ్మలాట | నడిమింటి నరసింగరావు |
| 154 | మధ్యంలో మానవుడు | ఆర్ సి హెచ్ రాజు |

| | | |
|---|---|---|
| 155 | మహానగరం | డి ఎస్ ఎన్ మూర్తి |
| 156 | మార్తోభవ (నాటకం) | తాళ్లూరు శివరామకృష్ణారావు |
| 157 | మధ్యతరగతి కథ | బాబు |
| 158 | మాకు శాంతికావాలి | శశిమోహన్ |
| 159 | మంచితనం మరోసారి చచ్చింది | శశిమోహన్ |
| 160 | మృగ మైదానం | వీరపల్లి వీణావాణి |
| 161 | మేధసూయ యాగం | డా॥ బి కోటయ్య |
| 162 | మేరేజ్ డే | బాబు |
| 163 | మరో ప్రేమ కావ్యం | జరుగుల రామారావు |
| 164 | మరుభూమిలో మల్లెపూలు | బి కళాసాగర్ |
| 165 | మాయామృగం | ఎ భాస్కరచంద్ర |
| 166 | మరణమంజీరం | వీరపల్లి వీణావాణి |
| 167 | మాతాస్సమస్త జగతాం | బత్తుల రామకృష్ణ |
| 168 | ముఖచిత్రం | కావూరి సత్యనారాయణ |
| 169 | మానస సరోవరం (నాటకం) | పాటిబండ్ల ఆనందరావు |
| 170 | మొక్కు | డి భీమరాజు |
| 171 | ముద్దొస్తున్నావోయ్ గోపాలం (నాటకం) | నందిరాజు సుబ్బారావు |
| 172 | ముద్రారాక్షసం | కందిమళ్ల సాంబశివరావు |
| 173 | మేడిపండు | శాంతిబాబు |
| 174 | మనమతం వందే మాతరం | వేగి సూర్యనారాయణ |
| 175 | మన్మధుడు మళ్లీ పుట్టాడు | డా॥ యమ్ నాగభూషణ శర్మ |
| 176 | మనిషికీ మనిషికీ మధ్య (నాటకం) | బత్తుల రామకృష్ణ |
| 177 | యద్భవిష్యం | వల్లూరి శివప్రసాద్ |
| 178 | యోగనిద్ర | శ్రీకంఠ హనుమంతరావు |
| 179 | రాధికా స్వాంతము | ఎన్ కె ఆంజనేయులు |
| 180 | రాజా ఈడిపస్ (నాటకం) | డా॥ యమ్ నాగభూషణశర్మ |

| | | |
|---|---|---|
| 181 | రుద్రవీణ | యండమూరి వీరేంద్రనాథ్ |
| 182 | రాయి | యస్ యం వి గోపాలరాజు |
| 183 | రోజూ చస్తున్న మనిషి | ఎల్లాప్రగడ కృష్ణేశ్వరరావు |
| 184 | రాజసూయ యాగం (నాటకం) | దాడి వీరభద్రరావు |
| 185 | రివర్స్ మార్చ్ | కావూరి సత్యనారాయణ |
| 186 | రసరాజ్యం (నాటకం) | దివాకరబాబు |
| 187 | లక్ష్మీకోసం | డీన్ బద్రు |
| 188 | లిఫ్ట్ | కె రామచందర్ |
| 189 | లజ్జ | నుసుము నాగభూషణం |
| 190 | లహరి (నాటకం) | బత్తుల రామకృష్ణ |
| 191 | వంటమనిషి కావాలి | డి వి రమణమూర్తి |
| 192 | విషవృక్షం | వరికూటి శివప్రసాద్ |
| 193 | వీధినాటకం | ఎన్ తారకరామారావు |
| 194 | వెలుగొచ్చింది | రత్నగిరి |
| 195 | వర్ణమేధం | కత్తుల రామమోహనరావు |
| 196 | వృత్తవిశ్లేషణం (నాటకం) | జి వెంకటరావు |
| 197 | వృద్ధానాం బాల్య చాపల్యం (నాటకం) | నక్కా వెంకటేశ్వరరావు |
| 198 | విషాద భారతంలో మరో ఆడపడుచు | గంజి రామారావు |
| 199 | వారం వారం | పావని |
| 200 | వేటకుక్కలు | దివ్యప్రభాకర్ |
| 201 | శవోహం | శరత్ చంద్రారెడ్డి |
| 202 | శమీవహ్ని | మారెళ్ల - సుంకర కోటేశ్వరరావు |
| 203 | శుభస్య శీఘ్రం | ఆలూరి |
| 204 | శ్వేతపత్రం (నాటకం) | మార్గశీర్ష |
| 205 | శ్వేతపత్రం | కావూరి సత్యనారాయణ |
| 206 | శ్వేతపావురం | ఎ వి మల్లేశ్వరరావు |

| | | |
|---|---|---|
| 207 | శ్రీముఖ వ్యాఘ్రం | వల్లూరిశివప్రసాద్ |
| 108 | శ్రీమతి ! అహా నీమతి ! | వీరభద్రరావు పమ్మి |
| 209 | సహారా (నాటకం) | పాటిబండ్ల ఆనందరావు |
| 210 | సత్యం-శివం-సుందరం | ఒ వి యస్ శర్మ |
| 211 | సుమతి | కె యస్ టి శాయి |
| 212 | సర్పజాతి | కె యస్ టి శాయి |
| 213 | సహనం చచ్చిపోతే | బైనబోయిన |
| 214 | సాలెగూడు | బాలగంగాధర్ తిలక్ |
| 215 | సర్పయాగం | వి యస్ కామేశ్వరరావు |
| 216 | సిరికేళి (నాటకం) | పట్నాయక్ |
| 217 | సుందరి - సుందరుడు | అత్తిలి కృష్ణ |
| 218 | సూర్యుడు ఉదయించాడు | జయశ్రీ రామారావు |
| 219 | సాక్ష్యం | టి బి డి మధుసూదనరావు |
| 220 | సొంతకూడు | ఆర్ వి యస్ రామస్వామి |
| 221 | సంధ్యా-ఛాయ (నాటకం) | అత్తిలి పద్మావతి కృష్ణ |
| 222 | సుందరి - సుబ్బారావు | బాబు |
| 223 | సరస్వతీ నమస్తుభ్యం | గోళ్లపాటి నాగేశ్వరరావు |
| 224 | సావిత్రి సవాల్ | ద్విభాష్యం రాజేశ్వరరావు |
| 225 | స్తన్యం | జె యస్ రాజశేఖర్ |
| 226 | సందిగ్ధ సమరం | వీరపల్లి వీణావాణి |
| 227 | సమాజానికో ప్రశ్న | పి టి మాధవ్ |
| 228 | స్వర్ణ కంకణం | రుద్రమూర్తి |
| 229 | సైలెన్స్ ప్లీజ్ | శంకరమంచి ప్రార్థసారధి |
| 230 | సుఖీభవ | అరిశెట్టి శివన్నారాయణ |
| 231 | స్త్రీమేధం | బీసీడు కృష్ణయ్య |
| 232 | సైంధవులున్నారు జాగ్రత్త | పిన్నమనేని పాములయ్య |

| | | |
|---|---|---|
| 233 | సమిధ | జలదంకి సుధాకర్ |
| 234 | సాంప్రదాయమా! నీకిది న్యాయమా | నాగశ్రీ |
| 235 | సారాంశం | తోట తిరుపతిరావు |
| 236 | హలాల్ | జలదంకి సుధాకర్ |
| 237 | హరేరామ్ ! | వి యస్ కామేశ్వరరావు |
| 238 | హెచ్చరిక (నాటకం) | దివ్యప్రభాకర్ |
| 239 | హూష్‌కాకి | ఎల్ బి శ్రీరామ్ |
| 240 | హూ ఆర్ యు | అరిశెట్టి శివన్నారాయణ |
| 241 | హిమాగ్ని | ఏ భాస్కరచంద్ర |
| 242 | హరిత | యస్ ఎ రావు |
| 243 | హళ్లికి హళ్లి | శంకరమంచి పార్థసారధి |
| 244 | హరిజనాగ్రహారం (నాటకం) | వేమవరపు సుబ్బారావు |
| 245 | హేంగ్ హిమ్ టిల్ డెత్ | టి మురళీ కృష్ణ |
| 246 | క్షమయా ధరిత్రి | భవానీ ప్రసాద్ |
| 247 | కాంచన మృగం | వి బి కె శర్మ |
| 248 | అపిలుపేనా కోరిక | భవానీ ప్రసాద్ |
| 249 | స్మృతి ప్రతీక | యస్ కె ఆంజనేయులు |
| 250 | క్షణికం | డి వి రమణమూర్తి |
| 251 | వెళ్లిపోకే చిన్నమ్మ | పి టి మాధవ్ |
| 252 | మయాస్త్రం | కంచర్ల సూర్యప్రకాశరావు |
| 253 | అమీబా | భాస్కరచన్ద్ర |
| 254 | వైతరణి | ఏ వి మల్లేశ్వరరావు |
| 255 | నేషనల్ హైవే | జె యస్ రాజశేఖర్ |
| 256 | మనుధర్మం | యం సంజీవి |
| 257 | హింసధ్వని | వల్లూరి శివప్రసాద్ |
| 258 | పుంగిడీగవ్వ | పి వెంకటేశ్వర్ |
| 259 | రేపటి శత్రువు | ఆకెళ్ల |

# ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని ప్రసిద్ధ నాటక సమాజాలు

| | |
|---|---|
| 1 విజయ కళా భారతి | హిందూపురం |
| 2 రవీ అండ్ రవీ ఆర్ట్స్ అసోసియేషన్ | గుంతకల్ |
| 3 యువ క్రియేషన్ కల్చరల్స్ | అనంతపురం |
| 4 ఆర్ట్స్‌కో | అనంతపురం |
| 5 కళాస్వరూప సమాఖ్య | తిరుపతి |
| 6 పుత్తూరు స్పోర్ట్ అండ్ కల్చరల్ అసోసియేషన్ | పుత్తూరు |
| 7 కళాప్రియ | తిరుపతి |
| 8 మేఘనా ఆర్ట్స్ | పీలేరు |
| 9 నటసమాఖ్య | చిత్తూరు |
| 10 శ్రీ కళానికేతన్ | పలమనేరు |
| 11 కళాస్వరూప సమాఖ్య | తిరుపతి |
| 12 చైతన్య ఆర్ట్స్ క్లబ్ | పెద్దతిప్ప సముద్రం |
| 13 శ్రీ కళాభారతి యువజన సంఘం | ఐరాల, చిత్తూరు జిల్లా |
| 14 కళాంజలి | కళింగపట్నం,శ్రీకాకుళం జిల్లా |
| 15 కళాచైతన్యం | బొబ్బిలి |
| 16 శాంతి ఆర్ట్స్ అసోసియేషన్ | రాజాం, శ్రీకాకుళం జిల్లా |
| 17 జైకిసాన్ ఆర్ట్స్ | ఆర్ భైరవపురం, శ్రీకాకుళం జిల్లా |
| 18 ప్రజామిత్ర సాంస్కృతిక విభాగం | శ్రీకాకుళం |
| 19 ఫేకర్ కల్చరల్ అసోసియేషన్ | గరివిడి, శ్రీరాంనగర్ |
| 20 ఆర్ట్స్‌కో | విజయనగరం |
| 21 కింగ్ ఆర్ట్స్ | విజయనగరం |
| 22 స్రవంతి ఆర్ట్స్ | పార్వతీపురం |
| 23 రవిశంకర్ కల్చరల్ అసోసియేషన్ | బొబ్బిలి, విజయనగరం జిల్లా |
| 24 అభినయ ఆర్ట్స్ | చోడవరం, విశాఖపట్నం జిల్లా |
| 25 స్పందన ఆర్ట్ థియేటర్స్ | సత్తినగర్, విశాఖపట్నం |

| | | |
|---|---|---|
| 26 | మెడికల్ కల్చరల్ స్పోర్ట్స్ అసోసియేషన్ | విశాఖపట్నం |
| 28 | బి హెచ్ పి వి కమ్యూనిటీ సెంటర్ | విశాఖపట్నం |
| 29 | మోడరన్ థియేటర్స్ | శ్రీనగర్, విశాఖపట్నం |
| 30 | జ్ఞానజ్యోతి కల్చరల్ అసోసియేషన్ | విశాఖపట్నం |
| 31 | కళాభినయ | విశాఖపట్నం |
| 32 | విశాఖస్టీల్స్ కల్చరల్ అసోసియేషన్ | విశాఖపట్నం |
| 33 | ఆర్ట్స్ కాంగ్రెస్ | విశాఖపట్నం |
| 34 | జయ కళానికేతన్ | విశాఖపట్నం |
| 35 | ఆర్ కె ప్రొడక్షన్స్ | అక్కయ్యపాలెం, విశాఖపట్నం |
| 36 | నటీనటసమాఖ్య | విశాఖపట్నం |
| 37 | శ్రీ కళావాణి | మద్రిపాలెం, విశాఖపట్నం |
| 38 | శ్రీ వేమన నాటక సమాఖ్య | వెలమపేట, విశాఖపట్నం |
| 39 | ప్రశాంతి ఆర్ట్స్ | గాంధీగ్రాం, విశాఖపట్నం |
| 40 | ఫైన్ ఆర్ట్స్ | విశాఖపట్నం |
| 41 | న్యూ ఆర్ట్స్ | విశాఖపట్నం |
| 42 | బహురూప నటసమాఖ్య | విశాఖపట్నం |
| 43 | శ్రీ కళానికేతన్ | విశాఖపట్నం |
| 44 | కళాజ్యోత్స్న | విశాఖపట్నం |
| 45 | విశాఖ స్టీల్ రిక్రియేషన్ క్లబ్ | విశాఖపట్నం |
| 46 | భారతయాన | విశాఖపట్నం |
| 47 | కార్మిక నటసమాఖ్య | గాంధీగ్రాం, విశాఖపట్నం |
| 48 | నటరాజ కళాసమితి | దొండపర్తి, విశాఖపట్నం |
| 49 | త్రివేణి అసోసియేషన్ | చినవాల్తేరు, విశాఖపట్నం |
| 50 | కె వి ఆర్ నాట్యసమాఖ్య | అనకాపల్లి, విశాఖపట్నం |
| 51 | మునిసిపల్ కార్పొరేషన్ కల్చరల్ అసోసియేషన్ | విశాఖపట్నం |
| 52 | సృజనా ఆర్ట్స్ | విశాఖపట్నం |

| | | |
|---|---|---|
| 53 | ప్రజానాట్యమండలి | విశాఖపట్నం |
| 54 | ఆంధ్రప్రదేశ్ నాట్యమండలి | శ్రీహరిపురం, విశాఖపట్నం |
| 55 | జ్యోతిర్మయి | విజయవాడ |
| 56 | ప్రజానాట్యమండలి | విజయవాడ |
| 57 | రఘురాం కల్చరల్ అసోసియేషన్ | విజయవాడ |
| 58 | రెప్కా | విజయవాడ |
| 59 | గురజాడ కళినికేతన్ | విజయవాడ |
| 60 | ఆర్ట్స్ కో | విజయవాడ |
| 61 | సముద్రాల కళానికేతన్ | విజయవాడ |
| 62 | ఆర్తనాధం ఆర్ట్స్ | పటమట, విజయవాడ |
| 63 | అమితేరు ఆర్ట్ అకాడమీ | కొత్తపేట, విజయవాడ |
| 64 | వినోదిని | విజయవాడ |
| 65 | సత్య కళానికేతన్ | విజయవాడ |
| 66 | గురజాడ కళామందిర్ | గుడివాడ |
| 67 | అభినేత్రి | విజయవాడ |
| 68 | అనంత హృదయరాజ్ జనశ్రేణి | పటమట, విజయవాడ |
| 69 | అరవింద ఆర్ట్స్ థియేటర్స్ | ముత్యాలంపాడు, విజయవాడ |
| 70 | కళాచైతన్య | సత్యనారాయణపురం, విజయవాడ |
| 71 | ర స న సమాఖ్య | బందరు రోడ్, విజయవాడ |
| 72 | ఆర్టిస్ట్ అసోసియేషన్ | విజయవాడ |
| 73 | శక్తి ఆర్ట్స్ | గొల్లపూడి, విజయవాడ |
| 74 | నాట్యమిత్ర | మొగల్రాజుపురం, విజయవాడ |
| 75 | కళాతరంగం | గాంధీనగర్, విజయవాడ |
| 76 | హరితా ఆర్ట్స్ థియేటర్ | ఈదర, కృష్ణా జిల్లా |
| 77 | శ్రీ మాతృశ్రీ కళాయూనిట్ | బాలాజీపేట, విజయవాడ |
| 78 | గురజాడ కళామందిర్ | ఇంచిపేట, విజయవాడ |
| 79 | చైతన్య కళాస్రవంతి | జగ్గయ్యపేట |

| | |
|---|---|
| 80 అమిచ్యూర్ ఆర్ట్స్ అకాడమీ | కొత్తపేట, విజయవాడ |
| 81 శ్రామిక ఆర్ట్స్ | మిధిలానగర్, విజయవాడ |
| 82 విశ్వసాహితి | వినుకొండ, గుంటూరు జిల్లా |
| 83 వేమన ఆర్ట్స్ థియేటర్ | గుంటూరు |
| 84 నవ్యకళాప్రవంతి | నెహ్రూనగర్, గుంటూరు |
| 85 రవిరాజా పినిశెట్టి కల్చరల్ అసోసియేషన్ | నరసారావుపేట |
| 86 సంయుక్తా రిక్రియేషన్స్ | నెహ్రూనగర్, గుంటూరు |
| 87 శ్రీ సాయి ఆర్ట్స్ | నందివెలుగు, గుంటూరు జిల్లా |
| 88 జనచైతన్య క్రియేషన్స్ | పత్తిపాడు |
| 89 శ్రీ కట్టా నాగేశ్వరరావు మెమోరియల్ కల్చరల్ అసోసియేషన్ | మంగళగిరి |
| 90 నెచ్చలి | భారత్ పేట, గుంటూరు |
| 91 కృషీ ఆర్ట్స్ | చేబ్రోలు |
| 92 నవయువ | చిలకలూరిపేట |
| 93 రసమయి | కొటిపాడు - 522 616 |
| 94 నటరాజ ఆర్ట్స్ అకాడమీ | బాపట్ల, గుంటూరు జిల్లా |
| 95 గణేష్ ఆర్ట్ థియేటర్ | గుంటూరు |
| 96 మనోరంజనీ ఆర్ట్స్ | పొన్నూరు - 522 123 |
| 97 ఆర్ట్స్ కొ | గుంటూరు |
| 98 విశ్వకళామందిర్ | అరండల్‌పేట, గుంటూరు |
| 99 అభినందన ఆర్ట్స్ | నరసరావుపేట |
| 100 అభినయ డ్రమటిక్స్ | బాపట్ల |
| 101 సాగరి | చిలకలూరిపేట |
| 102 కళాప్రియ | పాతుటూరు - 522 549 |
| 103 గంగోత్రి | పెదకాకాని - 522 509 |
| 104 కల్పనా కళానికేతన్ | నరసరావుపేట |

| | | |
|---|---|---|
| 105 | నవరస నాట్య సమాఖ్య | నరసరావుపేట |
| 106 | మానవత | ఎడ్లపాడు |
| 107 | విశ్వకళాభారతి | కొలకలూరు - 522 307 |
| 108 | రసఝురి | పొన్నూరు |
| 109 | ప్రగతి కళామండలి | సత్తెనపల్లి |
| 110 | దొడ్డపనేని ఇందిరా మెమోరియల్ కళాపరిషత్ | రామలింగేశ్వర పేట, తెనాలి |
| 111 | మమత | ఎడ్లపాడు - 522 233 |
| 112 | శ్రీ కృష్ణా ఆర్ట్ థియేటర్స్ | గుంటూరు |
| 113 | విశ్వకళామందిర్ | అరండల్‌పేట, గుంటూరు |
| 114 | మైత్రీ ఆర్ట్స్ | రేపల్లె, గుంటూరు జిల్లా |
| 115 | భానోదయ ఆర్ట్స్ | నరసాయపాలెం, గుంటూరు జిల్లా |
| 116 | శ్రీ శిరిడీ కళానిలయం | నరసరావుపేట |
| 117 | ఆర్ట్స్ కో | పొన్నూరు |
| 118 | గోపీకృష్ణ నాట్యమండలి | నూతలపాడు, గుంటూరు జిల్లా |
| 119 | స్నేహలత | చిలకలూరిపేట |
| 120 | నటరాజ కళానికేతన్ | సత్తెనపల్లి |
| 121 | కె యస్ టి సాయి ఆర్ట్స్ | బాపట్ల |
| 122 | ఉషోదయ కళాపరిషత్ | సత్తెనపల్లి |
| 123 | ఎస్ జె యస్ మిత్రమండలి | ఒంగోలు |
| 124 | జయా ఆర్ట్స్ | వలేటివారిపాలెం, ప్రకాశం జిల్లా |
| 125 | జ్యోతి ఆర్ట్ థియేటర్స్ | చీరాల - 523 165 |
| 126 | కందుకూరి కళానికేతన్ | కందుకూరు - 522 105 |
| 127 | చైతన్య కళాస్రవంతి నాటకసమాజం | సాయినగర్, కందుకూరు |
| 128 | కళావని | నాగులపాలెం, ప్రకాశం జిల్లా |
| 129 | అభినయ కళాసమితి | ఒంగోలు |
| 130 | సృజన ఆర్ట్స్ | ఒంగోలు |

| | | |
|---|---|---|
| 131 | సావిత్రీ కళాపరిషత్ | కొత్తపట్నం, ప్రకాశం జిల్లా |
| 132 | నేతాజీ నాట్యకళామండలి | కందుకూరు |
| 133 | కళాంజలి | పరుచూరు, ప్రకాశం జిల్లా |
| 134 | నవజ్యోతి ఆర్ట్స్ | కావలి, నెల్లూరు జిల్లా |
| 135 | విజేత | మూలపేట, నెల్లూరు |
| 136 | రమాలలిత కళానికేతన్ | సోమశిల, నెల్లూరు జిల్లా |
| 137 | నాట్యసమాఖ్య | వెంకటగిరి, నెల్లూరు జిల్లా |
| 138 | అభ్యుదయ కళాసమితి | పొదలకూరు, నెల్లూరు జిల్లా |
| 139 | తెలుగు అభ్యుదయ సాంస్కృతిక సమాఖ్య | నెల్లూరు |
| 140 | చైతన్య ఆర్ట్స్ ఎకాడమీ | స్టోన్‌హౌస్ పేట |
| 141 | కామాక్షి కళానికేతన్ | నెల్లూరు |
| 142 | కేతా మెమోరియల్ ట్రస్టు | నెల్లూరు |
| 143 | ఆర్ట్స్ కో | నెల్లూరు |
| 144 | శ్రీ శివప్రియా ఆర్ట్స్ | లక్ష్మీనగర్, నెల్లూరు |
| 145 | కాదంబరి | నెల్లూరు |
| 146 | శ్రీ మూలస్థానేశ్వర ఆర్ట్స్ | మూలాపేట, నెల్లూరు |
| 147 | జయరాం స్మారక కళాసమితి | గూడూరు, నెల్లూరు జిల్లా |
| 148 | ఆంధ్రాభ్యుదయ నాట్యమండలి | గూడూరు, నెల్లూరు జిల్లా |
| 149 | యంగ్ ఆర్టిస్టు అసోసియేషన్ | చాకలివీధి, నెల్లూరు |
| 150 | జనరంజని | యానాం, తూ॥గో॥జిల్లా |
| 151 | సత్యమణి నాట్య కళాసమితి | గొల్లపాలెం, తూ॥గో॥ జిల్లా |
| 152 | కందుకూరి కళాసమితి | ధవళేశ్వరం |
| 153 | పి అండ్ టి కల్చరల్ అసోసియేషన్ | కాకినాడ |
| 154 | అభ్యుదయ కళాసమితి అసోసియేషన్ | వీరవరపు పేట, తుని |
| 155 | పంతం థియేటర్స్ | గెద్దనాపల్లి - 533 341 |
| 156 | రవీంద్రభారతి కల్చరల్ అకాడమీ | కాకినాడ |
| 157 | టి టి జె ఆర్ట్స్ | సామర్లకోట |

| | | |
|---|---|---|
| 158 | కళావాణి | రాజమండ్రి |
| 159 | తాతాజీ సాంస్కృతిక సమాఖ్య | అమలాపురం |
| 160 | శ్రీ వీరభద్ర కళాసమితి | అంబాజీపేట |
| 161 | స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా కల్చరల్ క్లబ్ | కాకినాడ |
| 162 | కళావని | అమలాపురం |
| 163 | కళాతరంగణి | రాజమండ్రి |
| 164 | ఆర్ వి ఆర్ ప్రొడక్షన్స్ | సామర్లకోట |
| 165 | ద ఫ్రెండ్స్ యూనియన్ కల్చరల్ డ్రమటిక్ అసోసియేషన్ | తణుకు, ప॥ గో॥ జిల్లా |
| 166 | ధవళ సత్యం కళామిత్రమండలి | తాడేపల్లిగూడెం |
| 167 | శివగోపాల్ ఆర్ట్ థియేటర్స్ | ఏలూరు-534 002 |
| 168 | దాసరి కల్చరల్ యూనిట్ | పాలకొల్లు - 534 260 |
| 169 | చిలకమర్తి ఆర్ట్స్ | కొయ్యలగూడెం |
| 170 | రాఘవ కళానిలయం | నిడదవోలు - 534 301 |
| 171 | ఆదుర్తి ఫిల్మ్ ఇన్స్టిట్యూట్ | తాడేపల్లిగూడెం |
| 172 | నటరాజ ఆర్ట్ థియేటర్స్ | ఏలూరు |
| 173 | విజయసాయి ఆర్ట్ థియేటర్స్ | ఏలూరు |
| 174 | ప్రియదర్శిని | ఏలూరు |
| 175 | రాఘవ కళానిలయం | అద్దేపల్లివారి సత్రం, పాలకొల్లు |
| 176 | శ్రీ సాయి గణేశ్ యూత్ కల్చర్ అసోసియేషన్, | శ్రీశైలం, కర్నూలు జిల్లా |
| 177 | రవాణా కళావాహిని | కర్నూలు |
| 178 | లలిత కళాసమితి | కర్నూలు |
| 179 | శ్రీ వీరభద్రేశ్వర కళాపరిషత్ | దూబగుంట, కర్నూలు జిల్లా |
| 180 | శృతి కళానికేతన్ | సంగారెడ్డి, మెదక్ జిల్లా |
| 181 | నగర నటసమాఖ్య | నిజామాబాద్ |
| 182 | వెంకటేశ్వర నాటక కళాసమితి | కొరుట్ల, కరీంనగర్ జిల్లా |
| 183 | చైతన్య కళాసమితి | కరీంనగర్ - 505 001 |
| 184 | మానవతా కల్చరల్ అసోసియేషన్ | హుజూరాబాద్ |

| | |
|---|---|
| 185 చైతన్య భారతి | కరీంనగర్ - 505 210 |
| 186 మయూరి ఆర్ట్స్ | వరంగల్ - 506 002 |
| 187 లలిత కళాస్రవంతి | హనుమకొండ, వరంగల్ |
| 188 ఖమ్మం క్రియేటివ్స్ | ఖమ్మం - 507 223 |
| 189 స్నేహ కళాసమితి | తిరుమలగిరి - 508 223 |
| 190 రెడ్‌స్టార్ యూత్ కల్చరల్ అసోసియేషన్ | తాటిపాముల, నల్లగొండ |
| 191 జనచైతన్య యువసంఘం | భువనగిరి - 508 116 |
| 192 హెచ్ ఏ ఎల్ వెల్‌ఫేర్ మేనేజింగ్ కమిటీ | హెచ్ ఏ ఎల్ పోస్టు, హైదరాబాదు |
| 193 శ్రీ నటరాజ డ్రమెటిక్ ఆర్ట్స్ | బేగంపేట, హైదరాబాదు |
| 194 మంజీరా కళాసదనం | కూకట్‌పల్లి, హైదరాబాదు |
| 195 మహతి కళా సమితి | లాల్ దర్వాజ, హైదరాబాదు |
| 196 వంశీనిరంజన్ కళాకేంద్ర | మౌలాలి, హైదరాబాదు |
| 197 ఆదర్శ కళాభారతి | వనస్థలిపురం, హైదరాబాదు |
| 198 శ్రీ నికేతన్ | సరూర్‌నగర్, హైదరాబాదు |
| 199 ఆర్ట్స్ కో | హైదరాబాదు |
| 200 ప్రతిభా ఆర్ట్స్ | పూల్‌బాగ్, హైదరాబాదు |
| 201 విజయ కళాసమితి | హైదరాబాదు |
| 202 ఆంధ్రప్రదేశ్ నాటక కళాసమితి | జియాగుడా, హైదరాబాదు |
| 203 ఊర్వశీ కల్చరల్ అసోసియేషన్ | వివేక్‌నగర్, హైదరాబాదు |
| 204 న్యూవేవ్ థియేటర్ | సికింద్రాబాదు - 500 524 |
| 205 శ్రీ కళానికేతన్ | పద్మశాలీ కాలనీ, హైదరాబాదు |
| 206 పి ఆర్ థియేటర్స్ | దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాదు |
| 207 సూర్యా ఆర్ట్స్ అసోసియేషన్ | మౌలాలి, హైదరాబాదు |
| 208 సునయన | కొత్తపేట, హైదరాబాదు |
| 209 శ్రీకంఠ ఆర్ట్స్ | హైదరాబాదు |
| 210 ఆదర్శ యువ భారతి | నల్లకుంట హైదరాబాదు |
| 211 శ్రీ గణేశ్ నికేతన్ | [illegible] హైదరాబాదు |

| | | |
|---|---|---|
| 212 | శ్రీ ప్రణవాలయ ఆర్ట్స్ | ముషీరాబాద్, సికింద్రాబాద్ |
| 213 | శ్రీ లలిత కళామందిర్ | రామచంద్రాపురం, హైదరాబాదు |
| 214 | ఎ పి పంజాబ్‌నేషనల్ బ్యాంక్ కల్చరల్ సబ్ కమిటి | ముషరాబాద్, సికింద్రాబాదు |
| 215 | నాట్యాంజలి | నల్లకుంట, హైదరాబాదు |
| 216 | మురళీ కళానిలయం | తార్నాక, సికింద్రాబాదు |
| 217 | నవరంజని | పార్సీగుట్ట, హైదరాబాదు |
| 218 | శాంతి కల్చరల్ అసోసియేషన్ | నవీన్ నగర్, హైదరాబాదు |
| 219 | కళ్యాణి కళానికేతన్ | సంతోష్‌నగర్, హైదరాబాదు |
| 220 | చైతన్య నాట్యమండలి | చిలకలగూడ, సికింద్రాబాదు |
| 221 | కళారంజిత | నల్లకుంట, హైదరాబాదు |
| 222 | నౌబత్‌పహాడ్ యూత్ అసోసియేషన్ | హైదరాబాదు - 500 004 |
| 223 | యన్ ఎఫ్ సి కల్చరల్ అసోసియేషన్ | విద్యానగర్, హైదరాబాదు |
| 224 | విద్యానగర్ కల్చరల్ అసోసియేషన్ | విద్యానగర్, హైదరాబాదు |
| 225 | నవ్య కళాసమితి | చిక్కడపల్లి, హైదరాబాదు |
| 226 | శ్రీశయన సాంస్కృతిక కళా సంఘం | శ్రీకాకుళం |
| 227 | సూర్యకళా ప్రొడక్షన్స్ | విజయనగరం |
| 228 | పీపుల్స్ థియేటర్ | లక్ష్మీనగర్, విశాఖపట్నం |
| 229 | వనజా ఆర్ట్స్ | చినవాల్తేరు, విశాఖపట్నం |
| 230 | అబినయ | ఒంగోలు |
| 231 | కళానికేతన్ | వీరన్నపాలెం |
| 232 | కళాజ్యోతి లలిత కళానిలయం | వేములవాడ |
| 233 | అక్షర క్రియేటివ్ థియేటర్స్ | విద్యానగర్, హైదరాబాదు |
| 234 | విజేతా ఆర్ట్స్ | రాజంపేట |
| 235 | ఆప్కో ఎంప్లాయిస్ కల్చరల్ అసోసియేషన్ | వరంగల్ |
| 236 | అభ్యుదయ కళాసమితి | ఒంగోలు |

# ప్రవాసాంధ్ర నాటక సమాజాలు

| | | |
|---|---|---|
| 1 | సరస నవరస | న్యూఢిల్లీ |
| 2 | ఆంధ్ర సాంస్కృతిక యువమంచ్ | భిలాయ్ - 490 001 |
| 3 | జైపూర్ కళాపరిషత్ | జైపూర్ - 764 001 |
| 4 | ప్రవాసాంధ్ర నాట్యమండలి | భిలాయ్ |
| 5 | అనురాగాలయ | మద్రాసు |
| 6 | ఆదర్శ కళామండలి | మద్రాసు |
| 7 | యువతేజం | మద్రాసు |
| 8 | ఫ్రండ్స్ కల్చరల్ అసోసియేషన్ | మద్రాసు |
| 9 | మయూర కళాసంఘం | బళ్లారి - 583 101 |
| 10 | కళాతరంగిణి | బెంగుళూరు |
| 11 | బి హెచ్ ఇ ఎల్ ఆంధ్ర మహాసభ | బెంగుళూరు |
| 12 | చక్రవర్తి ఆర్ట్స్ | బరంపురం (ఒరిస్సా) |
| 13 | ఆంధ్ర అసోసియేషన్ | జంషెడ్‌పూర్ - 931 005 |
| 14 | ది ఆంధ్ర డ్రమటిక్ అండ్ లిటరరీ సొసైటీ | జంషెడ్‌పూర్ - 931 0005 |
| 15 | ది ఆంధ్రక్లబ్ | గొలిమూరి, జంషెడ్‌పూర్ |
| 16 | ఆంధ్ర కళాసమితి | టాటానగర్, జంషెడ్‌పూర్ |
| 17 | దక్షిణ భారత నాట్యసమాఖ్య | న్యూఢిల్లీ |
| 18 | ది బొంబాయి ఆంధ్ర మహాసభ | బొంబాయి |
| 19 | స్వతంత్ర నాట్యమండలి | కాపువీధి, బరంపురం - 2 |
| 20 | కర్నాటక కల్చరల్ అసోసియేషన్ | బెంగుళూరు |
| 21 | చలన సమితి | జంషెడ్‌పూర్ |

# ప్రసిద్ధ నాటక రచయితలు

## శ్రీ యన్. ఆర్. నంది

'మరో మొహెంజొదారో' నాటకకర్తగా నాటకలోకానికి చిరపరిచితులు నాటక ప్రయోగంలో 'ఫ్రీజ్' అనే పద్ధతిని ప్రవేశపెట్టింది వీరే యన్ ఆర్ నంది గారి నాటకాలు ప్రేక్షకులను, పరితలను ఆలోచింపచేస్తాయి 'మరో మొహెంజొదారో' మేదావి వర్గాన్ని విశేషంగా ఆకర్షించింది ఈ నాటకం అనేక బారతీయ బాషల్లోకి అనువదింపబడి ఔత్తరాహుల ప్రశంసలను కూడా విరివిగా పొందంది నాటక పోటీలలో ఈ నాటకం ఆంద్రదేశంలో అనేకచోట్ల విజయ డంకా మోగించింది నందిగారి 'అరణి' నాటకం కూడా కళారంగంలో విశేష ప్రాచుర్యం పొందింది

పుణ్యస్థలి, చావకూడదు, వానవెలిసింది మొదలైనవి శ్రీనందిగారి ప్రసిద్ధ నాటికలు నందిగారు సినిమా రచయిత, ప్రముఖ నవలా రచయిత కూడ

## శ్రీ ఇక్కుర్తి నరసింహారావు

స్వస్థలం పశ్చిమ గోదావరి జిల్లా, కొవ్వూరు తాలూకా ప్రక్కిలంక గ్రామం కష్టజీవుల ఆర్తనాదాలు వీరి కలానికి ప్రేరణ బొమ్మలాట, ప్రేమ, ఎడారిలో మల్లెపువ్వు, నవ్వేందుకురండి, బ్రహ్మచారి, సర్వేజనా సుఖినోబవంతు, పిడికిలి మున్నగు నాటికలను రచించారు

## శ్రీ యన్. తారకరామారావు

జననం 1939 ఆగష్టు స్వస్థలం గుంటూరు జిల్లా నెమలికల్లు గ్రామం ప్రముఖ కదా నవలా రచయిత, నాటకకర్త వీరు రచించిన నాటక నాటికలు సుమారు ముప్పయి వరకూ ఉన్నాయి 'ఆంద్రజ్యోతి' వారపత్రిక నిర్వహించిన పోటీలో వీరి 'సప్తపది' నాటకానికి ప్రదమ బహుమతి లభించింది రామారావుగారి శరణం గచ్చామి నాటకం రాష్ట్రంలో విస్తృతంగా ప్రదర్శించబడింది

ప్రసిద్ధ రచనలు శరణంగచ్చామి, కురుక్షేత్రం, సప్తపది, ప్రమద, ఆత్మసాక్షి, మహాప్రస్థానం (నాటకాలు) వరుడు కావాలి, వీధినాటకం, షరామామూలే, ఇదీలోకం మొదలైన నాటికలు 1987 లో వీరు రచించిన 'చరమాంకం' నాటకానికి రాష్ట్రప్రభుత్వం

వారి అవార్డు లభించింది

ఇటీవల వీరు రచించిన 'బకాసుర' 'జనమేజయం' నాటకాలు జనరంజకంగా ప్రదర్శింపబడి మెదాపి వర్గాన్ని విశేషంగా ఆకర్షించాయి

## శ్రీ ఆవుల శ్రీనివాసరావు

జననం 7-5-1931 స్వస్థలం నెల్లూరు 1950 నుంచీ గూడూరులో ఉంటున్నారు వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు కళాభిమాని గూడూరు 'సంస్కృతీ సమ్మేళనం' స్థాపక సభ్యుడు ఈ సంస్థ 1954నుంచీ రాష్ట్రస్థాయిలో నాటక పోటీలు నిర్వహిస్తున్నది శ్రీనివాసరావు మంచి నటులు తనకున్న రంగస్థలానుభవంతో మొదటిసారిగా 'ఉలిపికట్టె' అనే హాస్య నాటికను రచించారు ఈ నాటికకు 1965 లో ఆంధ్ర నాటక కళాపరిషత్తు (హైదరాబాదు) పోటీలలో ప్రదమ బహుమతి లభించింది వీరు రచించిన ప్రతిష్ఠ, స్కైలాబ్ నాటికలు కూడా ప్రజాదరణ పొందాయి శ్రీనివాసరావుగారికి గూడూరులో అనేక సాంస్కృతిక సంస్థలతో సన్నిహిత సంబంధం ఉంది ఔత్సాహిక కళాకారుల కృషికి చేదోడువాదోడుగా ఉంటూ వారిని ప్రోత్సహిస్తూ నాటక కళాభివృద్ధికి ఇతోదికంగా తోడ్పడుతున్నారు

## శ్రీ కె.వి. రమణారెడ్డి

నెల్లూరు జిల్లా, కొవ్వూరు తాలూకా రేబాలలో 26-3-1928 తేదీన జన్మించారు అభ్యుదయ కవి ప్రసిద్ధ విమర్శకులు విశ్వోదయ కళాశాల (కావలి) లో ఉపన్యాసకులుగా పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు విద్యార్థి దశనుంచీ రాజకీయ రంగంలో ప్రముఖపాత్ర నిర్వహించేవారు 'అడవి' 'అంగారవల్లరి' 'భువనఘోష' గేయ సంపుటాలు ప్రచురించబడినాయి కవికోకిల దువ్వూరి రామిరెడ్డి "జీవితం - డైరీలు" పరిష్కరించి ప్రకటించారు 'అభ్యుదయ' పత్రిక సంపాదకవర్గ సభ్యులు విప్లవరచయితల సంఘకార్యదర్శిగా పనిచేశారు 'అక్షయతూణీరం' శీర్షికన విశాలాంధ్రపత్రికలో అసంఖ్యాకంగా సాహితీమూల్యం గల వ్యాసాలు ప్రకటితమైనవి

రమణారెడ్డి గారు నాటక ప్రక్రియను కూడా చేపట్టి డా వేణుతో కలిసి 'రాజీవం' అనే నాటికను రచించారు ప్రయోగాత్మక నాటికగా రాష్ట్రస్థాయిలో గుర్తింపుపొందింది రాజీవం వీరి 'పద్మవ్యూహం' 'ఎండమావులు' నాటికలు కూడా నాటక కళాబిలాషుల ప్రశంసలను చూరగొన్నాయి 1998 మే నెలలో విజయవాడలో

## శ్రీ యం. సంజీవి

నివాసం విజయవాడ నాటకరచయిత, నటుడు, దర్శకుడు, సమాధానం కావాలి, కదలిక, ఈ చరిత్ర ఏసిరాతో మొదలైనవి వీరి ప్రసిద్ధ నాటకాలు

నాటికలు నీరుపోయ్, కదలిక, అయో(వ) ద్య, మనుదర్మం మొదలైనవి వీరి రచనల్లో విప్లవ ధోరణి కన్పిస్తుంది

## శ్రీ వల్లూరు శివప్రసాద్

కదా రచయితగా, నవలా రచయితగా సుప్రసిద్ధులైన శ్రీ వల్లూరు శివప్రసాద్ 1970 ప్రాంతాల్లో నాటక రచయితగా కూడా కలంపట్టి వెలుగులోకి వచ్చారు వీరిని నాటక రచయితగా వెలుగులోకి తెచ్చిన ఘనత శ్రీ నాయుడుగోపి గారి 'గంగోత్రి, నాటక సమాజానికి దక్కుతుంది

శ్రీ శివప్రసాద్ తొలిసారిగ రాసిన 'డాక్టర్ పరాంకుశం' హాస్యనాటిక అనేక ప్రదర్శనలతో ప్రజాదరణ పొందింది శివప్రసాద్ కలంనుండి వెలువడిన 'యద్భవిష్యం' శ్రీముఖవ్యాఘ్రం, ఏక్‌దిన్ కాగరీబ్, శ్రీ చక్రం,హింసధ్వని మొదలైన నాటికలు గంగోత్రి - పెదకాకాని వారిచే అంధ్రప్రదేశ్‌లో అనేక రాష్ట్రస్థాయి నాటక పోటీలలో జనరంజకంగా ప్రదర్శింపబడి బహుమతులందుకొన్నాయి ఉత్తమ రచనకు కూడా వీరి నాటికలకు అనేక పరిషత్తులలో బహుమతులు లభించాయి

తెనాలి మండలం కొలకలూరు గ్రామంలో ఆగష్టు 27, 1965 లో జన్మించిన శ్రీ శివప్రసాద్ బి యస్సీ వరకు చదివారు నాన్ మెడికల్ అసిస్టెంటుగా ప్రభుత్వోద్యోగం చేస్తున్నారు శ్రీ శివప్రసాద్ కలంనుంచి యింకా మరెన్నో మంచి నాటకాలు నాటికాలు రావలసి ఉంది

## శ్రీ పంతం సత్యనాధన్

వీరి స్వస్థలం కిర్లంపూడి మండలం, గెద్దనాపల్లి రోడ్డు రవాణా సంస్థలో ఉద్యోగం నటుడుగా, దర్శకుడుగా కళారంగంలో కృషిచేస్తున్న శ్రీ సత్యనాధన్ నాటకరచయితగా

కూడా పరివర్తన చెందారు ఇప్పటికీ వీరి కలం నుంచి భూమిక, గాండీటుడే అనే నాటకాలు, నవ్వండీ! ఇదివిషాదం, జో అచ్యుతానంద, ఎకె 47 అనే నాటికలు వెలువడ్డాయి 'నవ్వండి ఇదివిషాదం' నాటిక విశేష ప్రజాదరణపొంది, ప్రశంసలందుకొంది మనస్తత్వ విశ్లేషణతో కూడుకున్న ఈ నాటిక నాటక రంగంలో విలక్షణమైంది అరుదైనది కూడా

## శ్రీ ఆకెళ్ళ

'ఆకెళ్ళ' గా ప్రసిద్ధులైన వీరి పూర్తి పేరు ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ స్వస్థలం కాకినాడ విద్యార్థి దశనుండే నటుడిగా జీవితం ఆరంభించి పలు నాటక పరిషత్తులలో నటనకు దర్శకత్వానికి బహుమతులు పొందారు

కథకుడిగా, నవలా రచయితగా, సినీరచయితగా, సాంస్కృతిక, సాహితీ రంగాలకు సుపరిచితులు

వీరు రచించిన భవదీయం, అమ్మ, రేపటి శత్రువు వివిద పరిషత్తుల్లో రచన, ఉత్తమ నటుడు, నటిలాంటి అనేక బహుమతులు అందుకున్నాయి

వీరు రాసిన కాకి ఎంగిలి, ఆకాశంలో సగం మొదలైన నాటకాలు కూడా విశేష ప్రజాదరణ పొందాయి

## శ్రీ అరిశెట్టి శివన్నారాయణ

గుంటూరుజిల్లా, తెనాలి మండలం, నందివెలుగు గ్రామంలో 1952, అక్టోబర్, 22వ తేదీన జన్మించిన శ్రీ అరిశెట్టి శివన్నారాయణ 1970 నుండీ రచనా వ్యాసంగాన్ని కొనసాగిస్తున్నారు సుమారు 20 నాటకాలు, నాటికలు ఇప్పటి దాకా వెలువరించారు దాదాపు అన్ని నాటక నాటికలు వివిధ నాటక పరిషత్ పోటీలలో ప్రదర్శింపబడి ప్రశంసలందుకున్నాయి

ప్రొహిబిట్, నోర్మూయ్, పుణ్యఫలం, సుఖీభవ, బ్రహ్మచారికొడుకు, జోహార్, ఋణశేషం, బ్లాక్ అండ్ వైట్, దేవుళ్లాట, నాకో తండ్రి కావాలి, పంచముఖం, హూ ఆర్ యు' చెప్పేవాడికి? కొత్తపారం, గంగాజలం మొదలైన నాటికలు శివన్నారాయణ గారి నాటక సాహిత్యంలో కొన్ని

## శ్రీ గూడూరు విశ్వనాధ శాస్త్రి

స్వస్థలం గుంటూరు జిల్లా యాజలి గ్రామం వీరు రచించిన 'వీలునామా' నాటిక రాష్ట్రంలో వివిద నాటక పరిషత్తుల్లో విరివిగా ప్రదర్శించబడి ప్రశంసలందుకొంది విశ్వనాధ శాస్త్రి గారి కలం నుంచి మరెన్నో మంచి నాటికలు వెలుగుచూడాలి

## శ్రీ బోనం బాబూరావు

శ్రీ బాబూరావు ఎలమంచిలి మండలం, బూరగపల్లిలో 1938 జూలై 15 తేదీన జన్మించారు మండల పరిషత్ అభివృద్ధి అధికారిగా పనిచేసి 1996 లో పదవీ విరమణ చేశారు పాలకొల్లులో స్థిర నివాసం ఏర్పరచుకున్నారు 1957 లో నాటకరంగంలో ప్రవేశించిన శ్రీ బాబూరావు యిప్పటికి సుమారు 60 నాటక, నాటికలు ప్రదర్శించి బహుళ ప్రశంసలు అందుకున్నారు అల్లూరి సీతారామరాజు, జ్వలితజ్వాల, వీర పాండ్య కట్ట బ్రహ్మన, స్త్రీ, సన్నజాజులు మొదలైన నాటికలు, కులంలేని పిల్ల, అంకితం వలయం, మహానటుడు, ఇన్‌స్పెక్టర్ జనరల్, తపస్సు, బంగారులేడి మొదలైన నాటకాలు వీరిని ఉత్తమ నటునిగా తీర్చిదిద్దాయి కాగా బాబూరావుగారు నాటక కర్తగా కూడా పేరు తెచ్చుకున్నారు ఇంద్రధనుస్సు', వసంతం వచ్చింది, సుప్రభాతం, ఇదోరామాయణం, లేచిందిమహిళాలోకం, ఆమని, జననీజన్మ భూమిశ్చ మొదలైన నాటికలు వీరికెంతో పేరు తెచ్చిపెట్టాయి

## శ్రీ ఆదివిష్ణు

శ్రీ ఆదివిష్ణుగారి పూర్తిపేరు ఆదివిష్ణు విఘ్నేశ్వరరావు జననం 10-9-1940 విద్యాభ్యాసం బందరు కళాశాలలో బి కాం పట్టభద్రులు కొంతకాలం 'ఆంధ్రప్రభ'లో పనిచేశారు కధారచయితగా, నవలా రచయితగా ప్రధానంగా హాస్యనాటిక రచయితగా సాహితీలోకానికి పరిచితులు వీరు రచించిన 'మనిషి-మిధ్య' నవలకు ప్రధమ బహుమతి లభించింది కొన్ని చలన చిత్రాలకు సంభాషణలు కూడా రాశారు వీరి రచనలు ఆంధ్రేతర భాషలలోకి అనువాదం పొందాయి ఆదివిష్ణు గారు ప్రస్తుతం హైదరాబాద్‌లో ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థలో పౌరసంబంధాల అధికారిగా పనిచేస్తున్నారు

శ్రీ ఆదివిష్ణు ఆంధ్రనాటకరంగానికి ఒక అరడజను నాటకాలను, డజన్ నాటికలను

అందించారు వీరికి హాస్య రచయిత అనే ముద్రపడింది నిజానికి ఆది విష్ణుగారి రచనలన్నీ హాస్య రచనలు కావు 'ఇది ఆత్మహత్య' 'సిద్దార్ద' 'ఆశ్రయం' హాస్యప్రదానమైన నాటకాలు కావు వాటిలో కదావస్తువు బరువుగా, గంబీరంగా ఉంటుంది నాటికలలో కూడా 'మంచుతెర' 'చూడు చూడు నీడలు' 'అరకురాణీ' హాస్య నాటికలక్రిందికి రావు ఆదివిష్ణుగారికి పేరు తెచ్చినవి నాటకాలకంటే నాటికలే అని చెప్పడం సమంజసం

మంచుతెర, వాంటెడ్ ఫాదర్స్, అతిధి దేవుళ్లొస్తున్నారు, నదింగ్ బట్‌ట్రూత్, వందనోటు, ఎంతెంత దూరం, వాళ్లిద్దరితో వీళ్ళు ముగ్గురు మొదలైనవి ఆదివిష్ణు నాటకాపరంపరలో కొన్ని వీరి తాజానాటిక 'మగవారి మాయలు'

కరుణ హాస్యరసపోషణలో సిద్ధహస్తుడు ఆదివిష్ణు. అట్లని ప్రతి నాటకంలోను కరుణారసాన్ని చొప్పిద్దామని కాని, హాస్యపాత్రలను లాక్కొద్దామని గాని ఆరాటంలేదు దేనిలో ఏది ముఖ్యమో అంతవరకే వాడుకుంటారు దీనికి వీరి రచనలన్నీ ఉదాహరణలే! ఈ ఔచిత్యాన్ని గుర్తించడంలోనే ఉంది ఆదివిష్ణు నాటక శిల్ప రహస్యం

## శ్రీ డీన్‌బద్రూ

అసలుపేరు శ్రీ బద్రుద్దీన్ జననం 1940 లో తూ గో జిల్లా పందలపాక గ్రామలో రామవరం హైస్కూలులోను, విశాఖ పట్నం ఎ వి ఎన్ కళాశాలలోనూ చదువుకున్నారు బాల్యదశ నుంచీ నాటకాలంటే ప్రాణం 1964 లో ఆంధ్రా యూనివర్శిటీ నుంచి ఎక్టింగ్ డిప్లొమో పొందారు కీ శే కె వెంకటేశ్వరరావు గారి శిక్షణలో తన శక్తి సామర్థ్యాలకు పదునుపెట్టుకున్నారు 1965 నుంచీ నాటక రచనకు పూనుకున్నారు సుమారు 15 నాటికలు 5 నాటకాలు వ్రాశారు అన్నీ ప్రయోగాత్మక రచనలే అనేక పరిషత్తుల్లో ఉత్తమ రచనకు బహుమతులు అందుకున్నారు వీరి ప్రసిద్ధ రచనలు, 'ఉరి' శిక్ష కాదు (నాటకం) తాజీ, తాళి, పులీమేకలొస్తున్నాయి జాగ్రత్త, చైతన్య తరంగం, ఆ ఉదయమెప్పుడో (నాటికలు) డీన్‌బద్రూ గారి ప్రస్తుత నివాసం హైదరాబాదు

## శ్రీ పాటిబండ్ల ఆనందరావు

ఔత్సహిక నాటక రంగానికి ఉత్తమ శ్రేణి నాటకాలను, నాటికలను అందించిన నాటక రచయితలలో శ్రీ పాటిబండ్ల ఆనందరావు ప్రథమశ్రేణిలో గణింపదగినవారు

'నిషిద్ధాక్షరి' నాటక రచయితగా తొలిసారిగ వెలుగులోకి వచ్చిన ఆనందరావు

'సహారా', నీతిచంద్రిక, మానససరోవరం, కాదుసుమాకల మొదలైన నాటకాలతో ఆంధ్ర నాటకరంగానికి సుపరిచితులయ్యారు వీరి నాటకాలు, నాటికలు ప్రదర్శించబడని రంగస్థలం ఉండదేమో! ప్రేక్షకుల నాడి పసిగట్టిన ప్రవీణుడు బాష, శైలి, సన్నివేశ కల్పన, కదనం, సంబాషణాపటిమ సమపాళ్లలొ కలబోసుకున్న నాటకశిల్పి పాటిబండ్ల వారి 'సహారా' నాటకం, దర్పణం నాటికలు ప్రతీకాత్మక దొరణిలో సాగుతూ సామాజికుల మేదస్సుకు పదును పెడ్తాయి, పరీక్ష పెడతాయి ఆ రెండు రచనలు ఆనందరావుగారి కల్పనా చమత్కృతికి, సృజనాత్మకశక్తికి, ప్రతిబకు నిదర్శనాలు వీరి నాటకాలు పండితపామరుల ప్రశంసలకు పాత్రమయ్యాయి అనేక పరిషత్తులలో వీరి నాటకాలకు, నాటికలకు ఇతర బహుమతులతోపాటు ఉత్తమ రచన బహుమతులు కూడా పుష్కలంగా లభించాయి ఆనందరావుగారి నాటకాలను శ్రీ నాయుడు గోపీ దర్శకత్వంలో 'గంగోత్రి' నాటక సమాజంవారు విరివిగా ప్రదర్శించి రచయితకు ఎనలేని కీర్తి ప్రతిష్టలను ఆర్జించిపెట్టారు పాటిబండ్లవారి నాటకాలతో 'గంగోత్రి' ఉన్నత శిఖరాలను అందుకొన్నదో లేక 'గంగోత్రి' ద్వారా పాటిబండ్ల కీర్తి ఇనుమడించిందో స్పష్టంగా చెప్పడం కష్టం

శ్రీ ఆనందరావు ఆటబొమ్మ, నన్నుసంకెళ్లుతెంచుకోనివ్వండి, అందరూ మహానుబావులే, ఈ రెమ్మలకు వసంతం ఎప్పుడు? మొదలైన కొన్ని రేడియో నాటకాలను కూడా రచించారు సినిమా రచయితగా రంబ-రాంబాబు మొదలైన చలన చిత్రాలకు సంబాషణలు రాశారు ఆనందరావుగారి ప్రతిబను గుర్తించి తెలుగు విజ్ఞాన పీఠం 1986 లో ఉత్తమ రచయిత అవార్డునిచ్చి సత్కరించింది 1989 లో మద్రాసు కళాసాగర్ వారు కూడా నిషిద్ధాక్షరి నాటకానికి అవార్డునిచ్చి వీరిని సన్మానించారు 1997-98 సం॥లో అమెరికన్ తెలుగు అసోసియేషన్ వారు నిర్వహించిన అంతర్జాతీయ తెలుగు నాటక రచన పోటీలలో ఆనందరావు రచించిన 'పడమటిగాలి' నాటకానికి ప్రథమ బహుమతి లభించింది

శ్రీ ఆనందరావు 1951, మార్చి 21వ తేదీన ప్రకాశం జిల్లాలోని మల్లవరప్పాడు గ్రామంలో జన్మించారు వృత్తిరీత్యా ఒంగోలులో ఉపాధ్యాయులుగా కొనసాగుతున్నారు

## శ్రీనక్కా వెంకటేశ్వరరావు

స్వస్థలం కాకినాడ యంగ్‌మెన్స్ హేపీక్లబ్, (కాకినాడ) సభ్యుడు ఫిఫ్టీ - ఫిఫ్టీ,

ఇదో హెచ్చరిక, రోడ్డు మీద బొమ్మ, చేజ్, సిరిమువ్వ, వృద్ధానాం బాలచాపల్యం నక్కా వెంకటేశ్వరరావు గారి ప్రసిద్ధ రచనలు మూడు దశాబ్దాలుగా నాటక రంగానికి ఎనలేని సేవచేసిన వెంటేశ్వరరావు 1998 లో స్వర్గస్థులయ్యారు

## శ్రీ కావూరి సత్యనారాయణ

కుందేటి కొమ్ము, ఆత్మవత్సర్వ భూతాని వంటి సాంఘిక నాటికలలోను, కొన్ని పౌరాణిక నాటకాలలోను విభిన్న పాత్రలు ధరించి అభినయానికి మెరుగులు దిద్దుకొని నటుడుగా, దర్శకుడుగా నిలదొక్కుకున్న అనుభవంతో శ్రీ కావూరి సత్యనారాయణ రచనారంగంలోకి అడుగుపెట్టి అందులో కూడా సమప్రతిభను చాటుకున్నారు

వీరు రచించిన కుబుసంవీడింది, శ్వేతపత్రం, ముఖచిత్రం, రివర్స్‌మార్చ్ నాటికలు ఆంధ్రప్రదేశ్‌లో దాదాపు అన్ని పరిషత్తులలోనూ దిగ్విజయంగా ప్రదర్శింపబడి రచయితగా **కీర్తిప్రతిష్ఠలు** తెచ్చిపెట్టాయి ఉత్తమప్రదర్శనకు, దర్శకత్వానికి, రచనకు వీరి నాటికలు బహుమతులు పొందాయి సమకాలీన సమస్యల్ని కథావస్తువుగా తీసుకొని రచనలు చేయటం, వాటిని జనరంజకంగా తీర్చిదిద్దటం వీరి ప్రత్యేకత

1954లో రేపల్లె తాలూకా కావూరు గ్రామంలో జన్మించిన శ్రీ సత్యనారాయణ బి కాం వరకు చదివి సంగం డైరీలో ఉద్యోగం చేస్తూ ప్రస్తుతం గుంటూరులో ఉంటున్నారు భవిష్యత్తులో వీరి కలం నుంచి ఎన్నో మంచి నాటకాలను ఆశించవచ్చు

## శ్రీ నుసుము నాగభూషణం

'కాలజ్ఞానం' నాటికా రచయితగా వీరు ప్రసిద్ధులు పరిషత్ పోటీలలో ఉత్తమ రచయితగా తన రచనలకు బహుమతులు పొందటంతో పాటు ఉత్తమ నటుడుగానూ ఎన్నో బహుముతులు పొందారు ఆకాశవాణి జాతీయ స్థాయిలో నిర్వహించిన నాటకోత్సవాలలో వీరు వ్రాసిన 'రైలు ప్రయాణం' ఉత్తమ ద్వితీయ నాటకంగా బహుమతి పొందింది

శ్రీ నాగభూషణం కలం నుంచి కొత్తకలం, కాలజ్ఞానం, కోమ్మా'లజ్జ అనే నాటికలు, కడలితరంగం నాటకం వెలువడినాయి

శ్రీ నాగభూషణం ఆగస్టు 15, 1956 లో జన్మించారు స్వస్థలం పెదకాకాని మండలం అనుమర్లపూడి

# డాక్టర్ పి.వి. రమణ

జననం 15 ఆగష్టు 1939 సికింద్రాబాదులో ఎం ఎ పట్టభద్రులు 1956 నుండి డా పి వి రమణగారికి నాటకరంగంతో సన్నిహిత సంబంధం ఉంది నటుడుగా, దర్శకుడుగా, 1965 నుండి నాటక రచయితగా, విమర్శకుడిగా సుప్రసిద్ధులు తెలుగు నాటకరంగంపై అవిశ్రాంతంగా పరిశోదన సాగిస్తున్న నిరంతరాధ్యయన శీలి ప్రాచ్య పాశ్చాత్య నాటకరీతుల మీద సాదికారంగా మాట్లాడగల ప్రజ్ఞాశాలి తెలుగు - పాశ్చాత్య నాటకదోరణులపై తులనాత్మక పరిశీలన చేసి అనేక వ్యాసాలు, గ్రందాలు రాసిన, మేదావి వర్గానికి చెందిన ప్రదమ శ్రేణి విమర్శకులు "తెలుగు సాంఘిక నాటకం - పాశ్చాత్య నాటకప్రభావం" అన్న అంశం మీద కూలంకష పరిశోదన చేసి సమర్పించిన సిద్దాంత వ్యాసానికి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారి డాక్టరేట్ లబించింది ప్రపంచనాటకరంగం, ద్రవిడ నాటక రచనలు - సారూప్యాలు, వస్తు వైవిద్యం, అనే అంశాలమీద ప్రస్తుతం విస్తృత పరిశోధనలు సాగిస్తున్నారు అతిత్వరలోనె అవిగ్రంథ రూపంలో కళాభిమానుల, సాహితీ ప్రియుల కరకమలాలను అలంకరింపబోతున్నాయి

డా రమణగారు వృత్తిరీత్యా అద్యాపకులు తెలుగు విశ్వవిద్యాలయ రంగస్థలకళల శాఖలో రీడర్‌గా పనిచేసి స్వచ్ఛంద పదవీవిరమణ చేసి, ప్రస్తుతం హైదరాబాదు లోనే ఉంటూ విశ్రాంతి తీసుకొంటూ - కాదుకాదు - నాటకరంగానికి పూర్తిగా అంకితమై రోజుకి 25 గంటలు పరిశోధనా రంగంలో నిమగ్నులై ఉన్నారు వీరికి రంగస్థలం మినహా మరో వ్యాపకం లేదు రమణగారితో ఎవరైనా ఒక గంట మాట్లాడితే యాభైతొమ్మిది నిమిషాలు నాటకరంగం గురించే ప్రసంగిస్తారు!

రమణగారిని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 91-92 లో ఉత్తమ అద్యాపక స్టేట్ అవార్డునిచ్చి సన్మానించింది ఎన్నో కళాసంస్థలు సన్మానించి రమణగారి పట్ల తమకు గల ఆత్మీయతా బావాన్ని వెల్లడించాయి 'నాటకశిరోమణి' "నాటకరంగ కరదీపిక" వంటి బిరుదులతో తమ హర్షాన్ని, గౌరవబావాన్ని ప్రకటించాయి తెలుగు విశ్వవిద్యాలయంనుండి 1993లో ఉత్తమ నాటక రచయితప్రతిబా అవార్డును స్వీకరించారు డా రమణ తెలుగు నాటకంపై వివిద ఆకాశవాణి కేంద్రాల నుండి శతాదిక ప్రసంగాలు చేశారు రాష్ట్ర, జాతీయ స్థాయి సదస్సుల్లో ముఖ్యవక్తగా పాల్గొని

తెలుగు నాటక వైభవాన్ని గూర్చి చాటి చెప్పారు

నాటక కర్తగా డా పి వి రమణ వస్తువైవిధ్యం గల ఆరు నాటకాలను, ఐదు నాటికలను రచించారు అప్పి,ఆకు రాలిన వసంతం, వెంటాడే నీడలు, దేవతలెత్తిన పడగ, చలిచీమలు, మృత్యునీడ, మహస్సు (నాటకాలు) మానవతకూ నిండాయి నూరేళ్ళు, న్యాయమే గెలుస్తుంది, ధర్మదేవత, పగ (నాటికలు).డా రమణగారి నాటక నాటికలన్నీ రంగస్థలం మీద ప్రదర్శింపబడి బహుళ జనాదరణ పొందాయి

డా రమణగారి కథలు కొన్ని ఇతర భాషల్లోకి అనువాదం పొంది ప్రశంసలందుకున్నాయి వీరి ఒక కథాసంకలనాన్ని మైసూరు విశ్వవిద్యాలయం వారు యం ఏ పాఠ్యగ్రంథంగా నిర్ణయించడం గర్వించదగిన విషయం

## శ్రీ యస్. మునిసుందరం

చిత్తూరు జిల్లాలో నాటకరంగ వికాసానికి అవిరళ కృషి చేసిన నాటకరంగ ప్రముఖులలో యస్ మునిసుందరంగారు ఎన్నదగినవారు కవిగా, నాటకరచయితగా, ప్రయోక్తగా, సాంస్కృతిక సంఘ నిర్వాహకులుగా లబ్ధ ప్రతిష్టులు వీరు సుమారు 25 నాటక నాటికలను నాటకరంగానికి అందించారు 'అహంబ్రహ్మ' వంటి ప్రతీకాత్మక నాటిక నుంచీ 'ఇచ్చుట సన్మానములు చేయబడును' వంటి హాస్య ప్రదాన నాటిక వరకూ, 'దేశం నీ సర్వస్వం' వంటి చారిత్రక నాటకం నుంచీ 'వరూధినీ గాంధర్వం' వంటి కాల్పనిక నాటిక వరకు విస్తరించి వుంది మునిసుందరంగారి నాటక సాహిత్యం 'ఏ వెలుగులకీ ప్రస్థానం?' వంటి నాటికను చూసినపుడు సామాజికుడు గంభీర బావాంబర వీదిలో ఎలా విహరిస్తాడో, 'పక్షులు' వంటి నాటికను చూస్తున్నప్పుడు పొట్టచెక్క లయ్యేట్టు హాయిగా నవ్వుతూ హాస్యాంబుధిలో మునకలేస్తాడు అలా కరుణ హాస్యరసాలను కలబోసుకున్న కలం మునిసుందరం గారిది సంభాషణల్లో క్లుప్తత, సూటిదనం వీరి రచనా వైశిష్ట్యాన్ని చాటి చెప్పే లక్షణాలు

వీరి ప్రసిద్ధ రచనలు 'సింగారం', 'అహంబ్రహ్మ', 'పక్షులు', 'ఇచ్చట సన్మానాలు చేయబడును', 'నిజంకాటేసింది', 'నింగీనేలా', 'ఊరు మేల్కొంది', 'ఇదే నా పరిష్కారం' (నాటికలు) 'దేశం నీ సర్వస్వం', 'ఏ వెలుగులకీ ప్రస్థానం' (నాటకాలు)

శ్రీ మునిసుందరం గారి స్వస్థలం చిత్తూరు తిరుపతి ప్రభుత్వకళాశాలలో ప్రిన్సిపల్‌గా పనిచేసి పదవీవిరమణ చేశారు కాని నాటకరంగానికి దూరం కాలేదు

## శ్రీ ఎ. భాస్కర చంద్ర

స్వస్థలం కృష్ణాజిల్లా, గుడివాడ ప్రస్తుత నివాసం విజయవాడ ఆంధ్రబ్యాంకు ఉద్యోగిగా మనుగడ సాగిస్తున్నారు కధారచయితగా, నవలారచయితగా సాహితీ రంగంలో పేరు తెచ్చుకొన్న శ్రీ ఎ బాస్కరచంద్ర 'నాలుగోకోతి' నాటికారచనతో నాటకరంగలో ప్రవేశించి, అనతికాలంలోనే నాటకరచయితగా గుర్తింపు పొందగలిగారు దరిమిలా 'మాయామృగం', 'హిమాగ్ని', 'కాకి బంగారం', 'పిపీలికం', 'కొయ్యగుఱ్ఱం' మొదలైన నాటికలతో నాటకరంగంలో బలమైన ఇతివృత్తం చుట్టూ అకట్టుకునే సన్నివేశాలను కూర్చి, హేతుబద్ధమైన సంబాషణలతో సామాజికుల మస్తిష్కంలో ఆలోచనలు రేపే విలక్షణ నాటక శిల్పం బాస్కరచంద్రగారిది స్త్రీ వాదాన్ని ఒక వినూత్న దృష్టికోణం నుంచి నాటకరచనలో అభివ్యక్తం చేసిన మొదటి రచయిత భాస్కరచంద్రే కావడం గమనార్హం బవిష్యత్తులో యింకా మరెన్నో మంచి నాటకాలు భాస్కరచంద్ర కలం నుంచి వెలువడాలని కళాభిమానులు ఎదురు చూస్తున్నారు

## శ్రీ డి.వి. రమణమూర్తి

హాస్యరచన అన్నిటికంటే కష్టతరమైంది కనుకనే ఏ బాషలోనైనా హాస్యరచయితల సంఖ్య తక్కువగా ఉంటుంది మనకున్న హాస్య రచయితలలో శ్రీ డి వి రమణమూర్తి గారు గణనీయులు గృహసంబంధిత హాస్యోత్పత్తిలో వీరు సిద్ధహస్తులు అంతేకాదు కరుణ రసపూరితమైన నాటికలను రచించటంలోనూ వీరికి ప్రవీణ్యం ఉంది వీరు రచించిన వశీకరణం, ఉత్తరం, వంటమనిషి కావాలి నాటికలు వీరిలోని హాస్య రచనా చమత్కృతికి ఉదాహరణలుకాగా, లీల, కళ్ళజోడు, క్షణికం వంటి నాటకాలు కరుణరసప్లావితాలు కావడం రమణమూర్తిగారిరచనాపాటవాన్ని, బహుముఖ ప్రజ్ఞను వెల్లడిస్తాయి మాటల కూర్పులో పొందిక, చమత్కారం, సంక్షిప్తత, సున్నిత హాస్యం ప్రేక్షకులకు గిలిగింతలు పెడతాయి

శ్రీ డి వి రమణమూర్తిగారు 23 8 1930 తేదీన విజయనగరంలో జన్మించారు కొంతకాలం ఉపాధ్యాయ వృత్తిలో ఉండి 1955లో దక్షిణ మధ్య రైల్వే ఉద్యోగంలో చేరారు కొన్నాళ్ళు కలకత్తాలో ఉద్యోగం చేసి హైదరాబాదుకు బదిలీ అయ్యారు అప్పటినుంచీ తన రచనావ్యాసంగాన్ని విస్తృతం చేశారు రేడియో, టి వి లకు అనేక నాటకాలు నాటికలు రాసి ప్రశంసలు అందుకున్నారు

# శ్రీ అరుణాబాబూరావు

తెలుగు నాటకరంగంతో ఏ కొద్ది పరిచయం ఉన్న వారైనా 'అరుణా పబ్లిషింగ్ హౌస్' పేరు విని వుంటారు దాని అధినేత శ్రీ బాబూరావు ఆయనే అరుణా బాబూరావు

పేరున్న నాటక రచయితల పుస్తకాలనే కాక, పేరులేని కొత్త రచయితలకు కూడా తన స్నేహహస్తాన్ని అందించి, వారి రచనలను ప్రచురించి వారిని వెలుగులోనికి తెచ్చి, తెలుగు నాటక వికాసానికి పరోక్షంగా తోడ్పడుతున్న కళాసేవకుడు, సహృదయుడు శ్రీ బాబూరావు స్వస్థలం విజయవాడ

1960లో రంగప్రవేశం చేసిన శ్రీ బాబూరావు నటుడుగా నటలోకానికి సుపరిచితుడు హాస్యరసపోషణలో మెలకువలు గ్రహించి ప్రత్యేకతను సంతరించుకున్న మేటినటుడు ప్రెసిడెంటు పట్టయ్య, వాన వెలిసింది, మండువాలోగిలి, ఇదెమిటి, మళ్ళీ మదుమాసం, పుణ్యస్థలి వంటి నాటక నాటికలలో పాత్ర దారణ చేసి పరిషత్తు పోటీలలో ఉత్తమ నటుడు, హాస్య నటుడు, క్యారెక్టర్ ఏక్టర్ బహుమతులు పొందారు కొన్ని నాటకాల్లో బాబూరావు ధరించిన పాత్రలవైఖరి గమనిస్తే వాటిని బాబూరావుగారి కోసమే రచయిత సృష్టించాడా అనిపిస్తుంది

1975 ప్రాంతలో 'బాబు' పేరుతో నాటక రచనకు కూడా పూనుకుని విజయం సాదించారు అప్పటినుంచీ సుమారు 15 నాటికలను రచించారు 'మారేజ్‌డే' వంటి ఆషామాషీ నాటికనుంచి, పేగులు కదిలించే 'మధ్యతరగతి కద' వంటి కరుణ రసాత్మక నాటిక వరకూ వైవిద్యం గల రచనలు చేశారు వీరి రచనలలో సుందరి-సుబ్బారావు, టెలిఫోన్ అన్ని తరగతుల వారినీ అలరించే చక్కని హాస్యనాటికలు కనువిప్పు, మధ్యతరగతి కథ, అన్యాయం, సాహిత్యదృష్ట్యా, ప్రదర్శనాదృష్ట్యా ఉన్నత ప్రమాణాలు గల నాటికలు హాస్యనాటికలలో సరియైన తావులో కఠోర సత్యాలను సమ్మిళితం చేసి పంచదార అద్దిన చేదుమాత్రలను ప్రేక్షకుల చేత తినిపించడంలో శ్రీ బాబూరావు దిట్ట

ఇటీవల బాబూరావుగారు వీదినాటకాలపై దృష్టి సారించి ఆ శాఖలో కృషి చేస్తున్నారు వీరు రచించిన 'కైలాసంలో కోర్టు' వీధినాటిక విస్తృతంగా ప్రదర్శింపబడి పండిత పామరుల చేత విశేషంగా ప్రశంసించబడింది బాబూరావుగారి కళాసేవను

# నాటక రచయితలు



డా॥ పి.వి. రమణ



శ్రీ ఎన్. తారక రామారావు



శ్రీ అరుణా బాబూరావు

గుర్తించి ఎన్నో కళాసంస్థలు సన్మానించాయి సన్మానాలకు పొంగిపోని శ్రీ బాబూరావు ఈ నాటికీ తన పనిని తాను చేసుకుపోతూ నాటకరంగ పురోభివృద్ధికి నిరంతరం పాటుపడుతూ క్రియాశీలిగా జీవితాన్ని సార్థకం చేసుకొంటున్నారు

## శ్రీ ఇసుకపల్లి మోహనరావు

నాటకపోటీలలో దిగ్విజయం సాధించిన నాటకాలను రచించిన ఆధునిక నాటక కర్తలలో శ్రీ ఇసుకపల్లి మోహనరావు పేర్కొన దగినవారు వీరు రచించిన 'ఓ బూతు నాటకం', 'డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్', 'తర్జని', 'పురుషార్థం' విజయయాత్ర చేసి ప్రేక్షకుల మన్ననలను పొందిన నాటకాలు

యౌవనోద్రేకంలో యువతీయువకులు పరస్పరాకర్షణకు లోనైతే సంఘం స్త్రీ వైపే వేలెత్తి చూపుతుంది కానీ పురుషుణ్ని వొదిలేస్తుంది సాంఘిక న్యాయం, నీతి స్త్రీ, పురుషుల పట్ల సమంగా వర్తింప చేయాలని, స్త్రీని మాత్రం నిందించే పాక్షిక ధోరణికి స్వస్తి చెప్పాలని ప్రబోధించే నాటకం ' ఓ బూతు నాటకం' (1978) ఈ నాటకంలో సంభాషణలు తర్కబద్ధంగా ఉండటం ప్రత్యేకంగా పేర్కొనదగిన గుణం 'తర్జని' (1984) స్త్రీ సమస్య ప్రదానంగా చిత్రించబడిన నాటకం 1985లో 'పురుషార్థం' అనే మరొక నాటకాన్ని కూడా రచించారు రాజకీయ వ్యాపారులు పదవి కోసం ఎంతకైనా దిగజారుతారనీ, అధికారంలో వున్న మంత్రుల వ్యక్తిగత జీవితాలలోకి కూడా చొరబడి, వాళ్ళని బ్లాక్‌మెయిల్ చేసి బెదిరించి ఎలాగైనా తమపని చక్కబెట్టుకుంటారని వివరించారు నాటకం మంచి సస్పెన్సుతో నడుస్తుంది రంగస్థలంమీద మూడు హోటల్ గదుల్లో ఏకకాలంలో సంఘటనలు జరగడం ఈ నాటకంలో ఒక ప్రత్యేకత నటనా సామర్థ్యం చూపడానికి ప్రతి నటుడికీ ఈ నాటకంలో ఎక్కువ అవకాశం ఉంది

మోహనరావుగారి నాటకాలలో సంఘటనలు నెమ్మదిగా సాగుతూ ఉంటాయి కాని ప్రేక్షకుల ఆసక్తిని, ఏకాగ్రతను పట్టినిలిపే అంశాలను ఆయా సన్నివేశాలలో జోడించడం వల్ల ఎక్కడా విసుగు పుట్టడానికి తావుండదు స్వయంగా నటుడు కావడం వల్ల ప్రేక్షకులను రంజింప చేసే కిటుకులు మోహనరావుగారికి బాగా తెలుసు ప్రదర్శన విషయంలో ఇసుకనుంచి తైలం తియ్యగల సామర్థ్యం ఉంది మోహనరావుగారి నాటకాలలో మరొక విశేషగుణం ఉంది నాటకంలో పాత్రధారులందరికీ సమప్రాధాన్యం ఉంటుంది One man show ఉండదు అందుచేత సమిష్టికృషి అనే మాటకు సార్థకత వీరి నాటకాలలో, వీరి బృందం యిచ్చే ప్రదర్శనాలలో కన్పిస్తుంది సాధారణంగా

ఒక రచయిత వ్రాసే నాటకాలలో ఒక నాటకంలో ఉన్న పాత్రలలో కొన్నింటి చాయలైనా అతని ఇతర నాటకాలలో కన్పిస్తూ వుంటాయి కానీ ఈ రచయిత నాటకాలలో ఒక దానిలో కన్పించిన పాత్రలు మరొక దానిలో ఉండవు అన్నీ విలక్షణంగా, విభిన్నంగా ఉంటాయి వీరి నాటకాలన్నీ 'సీరియస్' గా వుండటంచేత హాస్యరసానికి ప్రాధాన్యం వుండదు ప్రదర్శన స్థాయి ఉన్నంతగా సాహిత్యపు విలువలు లేకపోవడం వల్ల కాలపరీక్షకు నిలిచే నాటకాలెన్ని అనే ప్రశ్న ఉదయిస్తుంది ఈ ప్రశ్నకు కాలమేతీర్పు చెప్పాలి మోహనరావుగారు 'గేమ్' అనే ఒక ప్రతీక నాటకాన్ని కూడా రచించారు 'ఆలిండియా సివిల్ సర్వీసెస్ కాంపిటిషన్స్' లో ఉత్తమ రచనకు బహుమతి లభించింది

శ్రీ మోహనరావుగారు ప్రస్తుతం ఒంగోలులో లోకల్ ఫండ్ 'ఆడిట్' శాఖలో పనిచేస్తున్నారు ఇటీవల సినిమా రంగంలో ప్రవేశించి సంభాషణల రచయితగా కొనసాగుతున్నారు

## శ్రీ గన్నిశెట్టి వెంకటేశ్వరరావు

ఆంధ్రనాటక సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన వారిలో శ్రీ గన్నిశెట్టి వెంకటేశ్వరరావు పేర్కొనదగినవారు

1955 ప్రాంతం నుంచీ నాటక రచన ప్రారంభించి వైవిధ్యంగల సుమారు 5 నాటకాలను, 15 నాటికలను అమెచ్యూర్ నాటక సంఘాలకు సమర్పించారు ప్రదర్శనార్హత గల రచనలే అన్నీ వీరి నాటకాలలో 'శారద', 'భలేపెళ్ళి', నాటికలలో 'చీకటితెరలు', 'ఏమి జీవితాలు' ఉత్తమ రచనలుగా పేరు తెచ్చుకున్నాయి

శారద, భలేపెళ్ళి రెండూ వివాహానికి సంబంధించిన ఇతివృత్తం గలవి అయినా మొదటిది విషాదాంతం, రెండవది పూర్తిగా హాస్యనాటకం ప్రేమించిన వ్యక్తిని వివాహం చేసుకోవటానికి పెద్దలు తిరస్కరించడంతో నాయిక ఆత్మహత్యతో తన సమస్యను పరిష్కరించుకొంటుంది 'శారద' (1962) నాటకంలో ఈ నాటకం అనేక నాటక పోటీలలో ప్రదర్శించబడి బహుమతులు అందుకొంది కరుణ రసాత్మకాలైన నాటకాలకు అధిక ప్రాధాన్యం లభించిన 1960-70 ప్రాంతాలలోనే 'శారద' సృష్టి జరిగింది ఒక్కొక్క కాలంలో ప్రేక్షకుల అభిరుచులను అవగాహన చేసుకోవడానికి కొన్ని నాటకాలను ఉదాహరణగా తీసుకోవచ్చు ఆర్థిక సాంఘిక పరిస్థితుల మార్పులవల్ల

మనిషి ప్రవర్తనలోను మనఃప్రవృత్తిలోను మార్పులొస్తాయని వ్యక్తం చేసే నాటకం 'మారిన మనిషి' 1956లో వెలువడింది ఇదే వెంకటేశ్వరరావు గారి తొలిరచన కూడా

శ్రీ గన్నిశెట్టి నాటికలలో ఎక్కువ భాగం హాస్యనాటికలే! సరళ సుందరమైన శైలి పొట్టి పొట్టి మాటలతో సంభాషణ సాగిపోతూ నటకులకు హుషారు పుట్టిస్తూ వుంటుంది బరువైన సన్నివేశాలలో సైతం తేలికైన పదాలను వాడుతూంటారు

పిచ్చిరాజు ఇంటర్వ్యూ (1962) అనే నాటికలో - హాస్పిటల్ నుంచి తప్పించుకుని వచ్చిన ఒక పిచ్చివాడు సరాసరిఒక ఆఫీసులో దూరి ఇంటర్‌వ్యూ చేస్తాడు చివరకు అతని బండారం బయట పడుతుంది

బ్రతికినంత కాలం తల్లిని ఆదరించని కొడుకులు ఆమె చనిపోగానే నగల కోసం కాట్ల కుక్కల్లాగ పోట్లాడటం 'మాతృదేవోభవ' (1962) నాటికలో హృదయంగమంగా చిత్రించారు రచయిత హాస్యంతో పాటు సందేశం కూడా వున్న ఈ నాటిక రసజ్ఞుల మెప్పు పొందింది శశికళ అనే రచయిత్రికి సన్మాన సన్నాహాలు చేస్తున్న యువకులు శశికళ మగవాడనే చేదునిజాన్ని తెలుసుకుని భంగపాటు పడటం 'శశికళ' నాటికలో కథావస్తువు రేపునాటకం పెట్టుకొని నటులు అనవసరంగా గొడవలు పడి నాటిక ప్రదర్శనానికి మంగళం పాడటం ' నాటకం రేపనగా' (1961) అనే నాటికలోని ఇతివృత్తం

చీకటితెరలు (1963) తెలుగు నాటక రంగంలో శ్రీ గన్నిశెట్టి వెంకటేశ్వరరావుకు సుస్థిర స్థానం కల్పించిన కమనీయ దృశ్యకావ్యం తనను మనసారా ప్రేమించే భర్త స్ఫోటకం వల్ల అంధుడుగా, కురూపిగా మారిపోవడంతో, నవయౌవనంలో వున్న భార్య అతనికి ద్రోహం తలపెడుతుంది స్నేహితుడైన మురళితో లేచి పోవడానికి సిద్ధమవుతుంది

"ఈనాడు ఆయనవల్ల ఏ విధంగానూ సుఖపడలేను ఆ రూపం ఆ వికృత రూపం తలుచుకుంటేనే వళ్ళు జలదరిస్తుంది అందుకే ప్రతిక్షణం ఆయన్నుంచి తప్పించుకు తిరుగుతున్నాను" అని మురళితో బాహాటంగా చెప్పుకునే స్థితికి వచ్చింది నిర్మల మనఃప్రవృత్తి

అంధుడైనా యివన్నీ గ్రహించుకోలేని అజ్ఞానికాడు శంకర్ పతాక సన్నివేశానికి ముందు నిర్మలతో సానునయంగా అంటాడు "నీ తప్పేమీ లేదు నిర్మలా! నా కోసం

నీ బ్రతుకును బలెట్టుకోమని కోరేటంత స్వార్థపరుణ్ణిగాను నీవేం కోరుతున్నావో నాకు తెలుసు నీ ఆనందానికి నేనెప్పుడూ అడ్డురాను రేపే నేనిక్కడ్నుంచి వెళ్ళిపోతున్నాను నిర్మలా ఒక్క సత్యం మాత్రం చెప్పక తప్పదు నిర్మలా! జీవితం మాత్రం నవలలా, సినిమాలా హాయిగా వుంటుందనుకోవటం తప్పు మెరిసేదంతా బంగారం కాదు మేడి పళ్ళు చాలా వుంటయ్! త్యాగ బుద్ధి త్యాగం చేసే శక్తి మనుషులందరిలో వుండటం చాల కష్టం. జాగ్రత్త నా బ్రతుకెలాగూ మంట కలిసింది నీవైనా సుఖంగా వుంటేనే నాకు కొంతైనా మనశ్శాంతి "

మురళి నిర్మలతో లేచిపోవడానికి నిరాకరిస్తాడు శంకర్ ఆత్మహత్య చేసుకొంటాడు నిర్మల జీవితాన్ని కూడా చీకటి తెరలు కప్పేస్తాయి

పాత్రల మానసిక సంఘర్షణను కొండను అద్దంలో చూపించినట్టుగా హుందాగా, గంభీరంగా చూపించగలిగారు రచయిత. 1963లో ఆంధ్రనాటక కళాపరిషత్ పోటీలలో ఉత్తమ బహుమతి అందుకున్నది లగాయితు ఈ నాటికను వందలాది సమాజాలు ప్రదర్శించి రచయితకు పేరు ప్రఖ్యాతులు ఆర్జించి పెట్టాయి

శ్రీ గన్నిశెట్టి ఇతర రచనలు - తానొకటి తలిస్తే (1961), పిట్టపోరు (1962), ఏమి జీవితాలు(1959) పరిశోధన మొదలైనవి

శ్రీ వెంకటేశ్వరరావు గారి స్వగ్రామం గుంటూరు జిల్లాలో అత్తోట నాటక సాహిత్యానికే జీవితాన్ని అంకితం చేసిన కళామయజీవి శ్రీ గన్నిశెట్టి

## శ్రీ యమ్.వి.యస్. హరనాథరావు

'జగన్నాథ రథచక్రాలు', 'క్షీరసాగర మధనం' నాటక కర్తగా శ్రీ హరనాధరావు ఆంధ్రనాటక రంగానికి పరిచితులు సొంత ట్రూపుతో తమ నాటకాలను ఆంధ్రదేశంలో పలుప్రాంతాలలో ప్రదర్శించి, బహుమతులు గెలుచుకుని ఉత్తమ నటుడుగా, ఉత్తమ రచయితగాపేరు ప్రఖ్యాతులు సంపాదించారు.

కులమతాల అడ్డుగోడలు కూలిపోతున్న ఈ రోజుల్లో ఇంకా బ్రాహ్మణ్యాన్ని పట్టుకువ్రేలాడే సాంప్రదాయబద్ధులు, పూర్వాచారపరాయణులు ఉన్నారు అలాంటివారికి అడుగడుగునా ఎదురుదెబ్బలే తప్ప జీవితం సజావుగా సాగడానికి ఆస్కారం లేదు - కాలాన్ని అనుసరించి జీవనవిధానంలో మార్పులు చేసుకోవడం అవసరం అలా జీవితంలో రాజీపడలేని వారి జీవితాలు విషాదాంతాలవుతాయి - క్షీరసాగర మధనంలో

ఇతివృత్తం ఇది

సంప్రదాయాలను గురించి, కులం కట్టుబాట్లను గురించి అడుగడుగునా పాత్రలచేత సుదీర్ఘ చర్చలు జరపకుండా రచయిత ఎంతో నేర్పుగా బలమైన సన్నివేశాలతో సారాంశాన్ని అందించారు నాటకాన్ని రసాత్మక కళాఖండంగా రూపొందించారు **అయితే జీవితంతో** రాజీపడలేని వారికి చావడమే శరణ్యమా! అనేప్రశ్నకు తావిస్తుంది ఈ నాటకం నాటకంలో చెప్పిందంతా ముగింపులో గాలికి కొట్టుకుపోయినట్టు అన్పిస్తుంది

1977-82 ప్రాంతాలలో ఆంధ్ర నాటకరంగంలో అపూర్వ సంచలనం కల్గించిన నాటకాలలో 'క్షీరసాగరమథనం' ఒక సజీవ దృశ్యకావ్యం ఈ నాటకానికి 1982 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి బహుమతి లభించింది వీరు రచించిన 'బూచి' నాటకం అంతగా ప్రజాదరణ పొందలేదు మనిషిలోని అవిశ్వాసం, దుర్బలత్వం మనిషిని బూచిలా భయపెట్టి వేధిస్తాయని చిత్రించారు రచయిత 'బూచి' నాటకంలో

జనారణ్యం, లేడీపంజా అనే నాటకాలను 'అంతంకాదిది ఆరంభం' అనే నాటికను కూడా శ్రీహరినాధరావు రచించారు.

ప్రాచీన కళారూపమైన 'యక్షగానం' వృత్తిగా స్వీకరించి ఆరాధించే కళాకారుల స్థితిగతులు ఎంత దయనీయంగా ఉన్నాయో 'యక్షగానం' నాటికలో హృదయంగమంగా చిత్రించారు రచయిత కళాత్మకంగా ఉన్న ఈ నాటికలో సంఘటనలు చాలా స్వల్పం పైగా ఒక్క పాత్రమీదనే ప్రధానంగా కథ నడుస్తుంది

శ్రీహరనాధరావుగారి స్వస్థలం ఒంగోలు ఇటీవలి కాలంలో ప్రకాశంజిల్లాలోనాటక కళాభివృద్ధికి తోడ్పడిన వారిలో శ్రీహరనాధరావు పేర్కొనతగినవారు.

శ్రీహరనాధరావు ప్రస్తుతం సినిమా రచయితగా చిత్రాలకు సంభాషణలు వ్రాస్తూ మద్రాసులో ఉంటున్నారు

## శ్రీ సుకమంచి కోటేశ్వరరావు

"పుట్టుకచే గుక్కెడు పాలకు, పిడికెడు మెతుకులకు కూడా నోచుకోని దీనులకు' ' 'మా సమాధులే మీ పునాదులు' అనే నాటికను అంకితం చేశారు శ్రీ సుకమంచి కోటేశ్వరరావు రచయిత కలం ఏ గమ్యం వైపు సాగిపోతుందో, రచనాలక్ష్యం అర్థం

చేసుకోవడానికి ఆ ఒక్క వాక్యం చాలు

సమకాలీన సమాజంలో పేదవాడి సమస్యలేమిటి? అవి ఏ రూపంలో ఉంటున్నాయి? వాళ్ళెందుకలా ఉంటున్నారు? దానికి బాధ్యులెవరు? ఆ సమస్యలనుంచి వారికి విముక్తి లేదా? అభ్యున్నతిని అంకెల్లో చూపించే దొరతనం వారు ఈ బ్రతుకులను చూసి ఏమంటారు? తాత, తండ్రి, మనవడు-బ్రతుకులు అన్నీ ఒక్కతీరులోనే ఉంటే ఇక 'అభ్యుదయం' అనే మాటకు అర్థమేమిటి? ఇలాంటి ప్రశ్నలు, ఆలోచనలు మొదలవుతాయి ఆ నాటిక చూసిన తర్వాత

కూటికి లేనివాడి మీద ప్రతిఒక్కడూ ఒంటికాలిమీద లేచేవాడే అనే లోకసత్యానికి 'మా సమాధులే మీ పునాదులు' (1977) నాటికలో ప్రతి సన్నివేశమూ దృష్టాంతంగా చూపవచ్చు. సహజమైన సన్నివేశాలు, సజీవ పాత్రలు, పాత్రోచిత భాష నిండైన నాటకీయత, అన్నిటికంటే కండపుష్టిగల కథావస్తువు-ఇవన్నీ ఈ నాటికను ఉత్తమ నాటికగా మార్చిన మూలధాతువులు ఈ నాటికలో ఒక పాత్రచేత రచయిత ఇలా అనిపించారు

"ఏటుందిబావూ వొట్టుకురానానికి? శొశానంనాంటి సంసారంయిది కూడ్నేక పిల్లలు దేవుల్లాడిపోతన్నరు గుండె పొట్టోటి రిచ్చానాగడం మానీసినాను సంసారం యీదనేక మనోయాదితోటి మంచం బట్టీసిందది పరుసుకోనానికేటి పక్కా, కప్పుకోనానికేటి సింకి దుప్పటా? గిన్నుందా, సెంబుందా! మట్టిదాకల్తోటి మసిబట్టుకు పోతున్న ముట్టి బతుకులు బావూమాయి" ఇంతకంటే దారిద్ర్యానికి చివరి హద్దు ఇంకేముంది?

1977 లో రచించబడిన ఈ నాటకానికి అవనిగడ్డ, పాలకొల్లు, గరివిడి, భీమవరం మొదలైన నాటక పరిషత్తులలో ఉత్తమ ప్రదర్శనకు బహుమతులు లభించాయి

శ్రీ కోటేశ్వరరావు రచించిన 'నరకం మరెక్కడో లేదు' (1984) నాటికలో ప్రభుత్వ ఆసుపత్రుల్లో పేదవాళ్ళ పట్ల డాక్టర్లు, నర్సులు, చూపే నిర్లక్ష్యం, కొన్ని సందర్భాలలో వారు ప్రదర్శించే అమానుష వైఖరి ఏ ప్రమాణంలో విస్తరించి ఉందో మనసుకు హత్తుకునేలా వివరించారు ఈ నాటికలో సంవాదకౌశలం అంతగా చెప్పుకోతగింది కాకపోయినా కథనంలో సంఘటనలే అధిక ప్రధాన్యం వహించిన కారణంగా ప్రదర్శనాపరంగా బాగా రక్తి కట్టడానికి మెండుగా అవకాశాలున్నాయి ఈ నాటికలో అయితే ఈ నాటిక ప్రదర్శనకు హస్పిటల్ సెట్ అనివార్యమవుతుంది రెండు స్త్రీ పాత్రలున్న ఈ నాటికను ప్రదర్శించడానికి ఆర్థిక పుష్టిగల ఔత్సాహిక

సమాజాలకే సాధ్యమవుతుందేమో! 1984 లో ఆంధ్ర లలితా కళా సమితి (హైదరాబాదు) 17వ వార్షికోత్సవ పోటీలలో 'నరకం మరెక్కడో లేదు' నాటికకు ఉత్తమ ప్రదర్శన బహుమతి లభించింది నిరుద్యోగ సమస్యపై ఈ రచయిత వ్రాసిన మొదటి నాటిక 'గమ్యం' (1975) కూడా ప్రదర్శనాపరంగా విజయం సాధించిన నాటిక 'ఉరి' కూడా పేర్కొనదగిన మంచి నాటిక ఇలా కోటేశ్వరరావుగారి నాటికలన్నీ సామాజిక స్పృహతో రాసిన సందేశాత్మక రచనలే పాఠకులను, ప్రేక్షకులను ఆలోచింపచేస్తాయి

శ్రీ సుకమంచి కోటేశ్వరరావు గారి స్వస్థలం విజయవాడ యమ్ ఏ పట్టభద్రులు 1974 నుంచీ నాటక రచన ప్రారంభించారు తాను చెప్పదలచుకున్న విషయాన్ని తన రచనలో స్పష్టంగా, సూటిగా, నిర్భయంగా చెప్పగల సమర్థులు ఇటీవల వీరు రచించిన 'కలహాలకాపురం' రాష్ట్రంలోని వివిధ పరిషత్తులలో విజయ కేతనం ఎగురవేసింది

## శ్రీ తాళ్ళూరి శివరామకృష్ణారావు

1929 లో కృష్ణజిల్లా, కొత్తగుంటపాలెంలో జన్మించారు దక్షిణమధ్యరైల్వే సికింద్రాబాద్ మండలంలో సహాయ మెకానికల్ ఇంజనీర్‌గా పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు 1954 లో 'బంగారు సంకెళ్ళు' నాటికకు దర్శకత్వం వహించడంతో నాటకరంగ ప్రవేశం చేశారు మొదటి ప్రయత్నంలోనే నాటక పోటీలలో ఉత్తమ ప్రదర్శనకు, దర్శకత్వానికి బహుమతులు పొందారు నాటక రంగంలో ఆనాడు మోపిన పాదం నేటికీ వెనక్కి తీసుకోలేదు కొన్ని వందల నాటకాలకు దర్శకత్వం వహించి ఎంతో మంది నటీనటులకు శిక్షణ యిచ్చారు సగటు నాటకాన్నయినా తమ దర్శకత్వపు ప్రతిభతో దీప్తివంతంగా మార్చగల అసాధారణ ప్రజ్ఞాశాలి ప్రాచ్య, పాశ్చాత్య నాటక రీతుల పట్ల స్పష్టమైన అవగాహన గల కళాభిజ్ఞుడు ధియేటర్ స్టైల్స్ గురించి సాధికారంగా వివరించగల మేధావి

శివరామకృష్ణగారు ఇటీవల కాలంలో నాటక కర్తగా కూడా పేరు ప్రఖ్యాతులు గడించారు వీరు రచించిన 'మార్తోభవ' నాటకం ఉత్తమ రచనకు, ప్రదర్శనకు, దర్శకత్వానికి ఇప్పటికే చాల పరిషత్తుల్లో బహుమతులు గెల్చుకొని ప్రేక్షకుల ప్రశంసలు అందుకొంది

శ్రీ శివరామకృష్ణారావుగారు అనేక నాటక పరిషత్ పోటీలకు గుణనిర్ణేతగా

వ్యవహరించారు హైదరాబాద్‌లో యువకళావాహిని 'నాటకరత్న' అవార్డుతోను, శ్రీ కళానికేతన్ వారు 'జాలూరి వీరేశలింగం కల్చరల్ అవార్డు' తోను వీరిని ఘనంగా సత్కరించారు వీరు హైదరాబాద్‌లో స్థిర నివాసం ఏర్పరచుకొని నాటకరంగానికి ఇతోధిక సేవ చేస్తున్నారు ఉస్మానియా, తెలుగు, కేంద్రీయ విశ్వవిద్యాలయ రంగస్థల కళల శాఖలలో అతిధేయ అధ్యాపకులుగా కూడా తమ సేవలు అందిస్తున్నారు

## శ్రీ శంకరమంచి పార్ధసారథి

నివాసం హైదరాబాదు. అకౌంటెంట్ జనరల్ ఆఫీసులో ఉద్యోగం శ్రీ పార్థసారధి హాస్యరచనలో సిద్ధహస్తులు వీరిప్రసిద్ధ రచనలు పూజకు వేళాయెరా, హాళ్ళికి,హాళ్ళి, సైలెన్స్ ప్లీజ్ (నాటికలు) ప్రస్తుతం సినిమాలకు సంభాషణలు రాస్తున్నారు

## శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు

స్వస్థలం ఒంగోలు దగ్గర కారుమంచి గ్రామం, రాజమండ్రి ప్రభుత్వ డిగ్రీ కళాశాలలో చరిత్రోపన్యాసకులుగా పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు ప్రసిద్ధ కదా, నవలా రచయిత వ్యాసకర్త, నాటకకర్త, సుమారు 30 నవలలు 300 కథలు రచించారు. మూడు కథాసంపుటాలు వెలువడ్డాయి మల్లికార్జురావు గారు 1960 ప్రాంతాలలో అనేక పరిషత్ పోటీలలో పాల్గొన్నారు. వీరు సుమారు 25 నాటకాలను, నాటికలను రచించారు వీరి ప్రసిద్ధ రచనలు నీలినీడలు, యాచకులు, సప్తపది, మారనిమనిషి, దూరపు కొండలు, రధచక్రాలు (నాటకాలు) సాలెగూడు, ఉద్ధారకులు, పరిష్కృతి, జ్వాల, క్షంతవ్యులు, నూట పదహారు, చరిత్రహీనులు, మబ్బు వీడింది, శిక్ష, ఆశయాబద్ధతే లోకే (నాటికలు) వీరు నాటకరంగం మీద వ్రాసిన 'నాటక సమీక్ష' 'వ్యాసమాలిక' అనేక వ్యాసాలు నాటక విమర్శకులుగా వీరికి గుర్తింపు తెచ్చాయి. 1997-98 సం॥లో అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ఆటా) వారు నిర్వహించిన అంతర్జాతీయ తెలుగు నాటక రచనల పోటీకి వీరు గుణనిర్ణేతలుగా వ్యవహరించారు

## శ్రీ పి.టి. మాధవ్

నివాసం విశాఖపట్నం. వృత్తిరీత్యాన్యాయవాది ప్రవృత్తి నటన, రచనా వ్యాసంగం, దర్శకత్వం వీరి ప్రసిద్ధ రచనలు నన్ను బోనెక్కించండి, వెళ్లి పోకేచిన్నమ్మ, నల్లకోటు నవ్వింది, సమాజానికో ప్రశ్న మొద॥ నాటికలు, శ్రీ మాధవ్ స్వీకరించే కథావస్తువులన్నీ

న్యాయ వ్యవస్థకు సంబంధించినవి కావడం గమనార్హం న్యాయశాస్త్రంలో ఉన్న లొసుగులు ప్రజలమీద ఎలాంటి ప్రభావాన్ని చూపుతున్నాయో వివరించే ప్రయత్నం చేస్తారు అందువల్ల వీరి రచనా తత్వానికి ఒక ప్రత్యేకత ఉందని చెప్పాలి

## శ్రీ సహదేవ్

నివాసం హైదరాబాద్ దక్షిణమధ్యరైల్వేలో ఉద్యోగం చేస్తున్నారు వీరి ప్రసిద్ధ నాటకం 'నిజంచెప్పకు' ఈ నాటకం ఔత్సాహిక సమాజాల చేత విస్తృతంగా ప్రదర్శింపబడి ప్రశంసింపబడింది

## శ్రీ గ్రిద్దలూరు గోపాలరావు

నటుడు, దర్శకుడు, రచయిత నాలుగు దశాబ్దాలుగా నాటక రంగానికి సేవ చేస్తున్నారు నెల్లూరు జిల్లా చల్లాయిపాళెం గ్రామంలో 1927 లో జన్మించారు

రెవిన్యూశాఖలో తహశీల్దారుగా తనవృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తూనే అనేక నాటికలు, కవితలు, కథలు, చిత్రసమీక్షలు వ్రాశారు నెల్లూరులో 'విశ్వభారతి కళామందిర్' స్థాపకులు కొన్ని నాటకపరిషత్తు పోటీలకు గుణనిర్ణేతగా వ్యవహరించారు నెల్లూరు నుండి వెలువడుతున్న ప్రసిద్ధవార పత్రిక 'జమీన్‌రైతు' లో వీరి చిత్ర సమీక్షలకు ప్రత్యేక ప్రాముఖ్యం ఉంది

వీరి ప్రసిద్ధ రచనలు బంగారు భూమి (నాటకం), సరిహద్దు సమరం, స్త్రీ, ధర్మయుద్ధం, ఎండమావులు (నాటికలు) రవీంద్రుని సాక్రిఫైస్ ను 'బలిదానం' పేరుతో అనువదించారు ఈ నాటిక దూరదర్శన్‌లో కూడా ప్రసారమైంది గోపాలరావుగారు పదవీ విరమణ చేసి ప్రస్తుతం విశ్రాంతిగా కాలం గడుపుతున్నారు

## శ్రీ బి.ఆర్. రంగారెడ్డి

స్వస్థలం కడపజిల్లా, కొసినేపల్లి ఉద్యోగరీత్యా విజయవాడలో నివాసం, నటుడు, నాటకకర్త పల్లకి, జీవన సంధ్య, కృష్ణపక్షం (నాటకాలు)రేపటి మనిషి, పొగ, అరుంధతి మొదలైన నాటికలు రాశారు అనేక నాటికలు రేడియోలో ప్రసారమయ్యాయి. రంగారెడ్డి గారి నాటకాలలో సంభాషణలు సహజత్వానికి దగ్గరగా, సరళంగా, అర్థవంతంగా ఉంటాయి. ప్రేక్షకుల చప్పట్లకోసం నాటకంలోని

పాత్రల స్వభావాన్ని బలిపెట్టే ధోరణికి వీరు విముఖులు వీరు స్వర్గస్థులయ్యారు

## శ్రీ కె.యస్.టి. శాయి

రచయిత, దర్శకుడు, సమాజ నిర్వాహకుడు, విమర్శకుడు, సహృదయుడు - అందరినీ కలసికట్టుగా ఒక్కరిలో చూడాలంటే, అది కె యస్ టి శాయి అనే మహావ్యక్తిలో మాత్రమే చూడగలం అన్నిటినీ తనలో ఇముడ్చుకొన్న పరిపూర్ణ కళాకారుడు శ్రీ శాయి, ఎంతటి ప్రతిభావ్వితుడో, అంత వినమ్రుడు నాటక రచయితగా బహుమతులు అందుకోని నాటక పరిషత్తు లేదు తాకని శిఖరం లేదు

కొంపల్లి కాశీ అన్నపూర్ణ, ఆదినారాయణ దంపతులకు 1936 డిశంబరు 6వ తేదీన శాయి జన్మించారు బాపట్ల బోర్డు హైస్కూలులోను, చీరాల వి ఆర్ యస్ కళాశాలలోను విద్యాభ్యాసం బి ఏ పట్టభద్రులు బాపట్ల ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాలలో మేనేజర్‌గా ఉద్యోగం చేసి 1994 లో పదవీ విరమణ చేశారు కీ శే అన్నవరపు శివయ్యగారి ప్రోత్సాహంతో 1949 సం॥లో 'రామదాసు' నాటకంలో రఘురాముని పాత్ర ద్వారా తొలిసారిగా రంగప్రవేశం చేశారు కీ శే మాచిరాజు బాలగంగాధరశర్మ, డా॥ కొణ్ణపాటి గంగాధరరావు గార్లను శ్రీ శాయి తన గురువులుగా పేర్కొంటారు ఉత్తమ నటుడుగా కీ శే కె వెంకటేశ్వరరావు, ఉత్తమోత్తమ దర్శకుడుగా కీ శే డా॥ గరికపాటి రాజారావు, మహారచయితగా కీ శే ఆచార్య ఆత్రేయ వీరికి ఆదర్శప్రాయులు

నాటకరంగానికి సంబంధించిన వివిధ శాఖలలో 45 సం॥లు విశేషానుభవం గడించిన కారణంగా నాటక రక్తికి కావలసిన, అనుసరించవలసిన పద్ధతులు, ప్రేక్షకుల నాడి, వీరికి కరతలామలకం సాంప్రదాయ సనాతన ప్రక్రియను ఆధునిక విధానాలతో మిళితం చేసి ఉత్తమ ఫలితాలు సాధించారు. దానికి కురుక్షేత్రం, బొబ్బిలి యుద్ధం, సమ్రాట్ రావణ, గయోపాఖ్యానం, సత్యహరిశ్చంద్ర, ప్రతాపరుద్రీయం మొదలైన నాటకాలే నిదర్శనాలు

శ్రీ శాయి ఆంధ్ర, ప్రవాసాంధ్రలలో యిప్పటికి 5,000 ప్రదర్శనలలో పాల్గొన్నారు నాటకాలు నాటికలు రచించటం, నటించటం, నూతన రచనలు చదవటం, ప్రదర్శనలు చూడటం, ఆధునిక ప్రయోగాలను గురించి అధ్యయనం చేయటం, యువతకు నటశిక్షణ గరపటం వీరి నిత్యకృత్యాలు తెలుగునాట తెలుగు నాటకరంగం సజీవంగా

నవనవోన్మేషంగా వర్ధిల్లుతూ ఉండాలని శ్రీ శాయి తపన, తపస్సు. శిష్యప్రశిష్యగణం వందలు దాటి వేలకుఏనాడో చేరింది వారందరూ శాయిని గురువుగా గౌరవిస్తున్నా తానుమాత్రం వారిని స్నేహితులుగానే అభిమానిస్తారు కళాకారుడు నిత్యపరిశోధకుడు, నిరంతర విద్యార్థి అని కె యస్ టి శాయి భావన

శ్రీ శాయి నాటక రచనలో సిద్ధహస్తులు వీరు 10 నాటికలు, 15 నాటకాలను రచించారు నాటికలలో కలిపురుషుడు, అసమర్థునిడైరీ, సుమతి, సర్పజాతి - నాటకాలలో సంఘం చెక్కినశిల్పం, భోగిమంటలు, మహనీయులు, గాజుపెంకులు విశేష ప్రజాదరణ పొందాయి

నటుడుగా అటు సాంప్రదాయనాటకాలలోను ఇటు సాంఘిక నాటకాలలోను అనితర సాధ్యమైన నటనా కౌశల్యాన్ని ప్రదర్శించి తాను ధరించిన పాత్రలకు వన్నె తెచ్చారు వాటిని సజీవ పాత్రలుగా ప్రేక్షకుల ముందు సాక్షాత్కరింపజేశారు ప్రతాపరుద్రీయంలో వల్లీఖాన్, బొబ్బిలి యుద్ధంలో బుస్సీ, ఆర్యచాణక్యలో రాక్షసమంత్రి, పాండవోద్యోగంలో దుర్యోధనుడు, జై భవానిలో శివాజీ మొదలైన భూమికలు ధరించి బహుళ జనాదరణ పొందారు అలాగే సాంఘిక నాటకాలలో కూడా సమప్రతిభతో తన నటనావైదుష్యంతో సామాజికులచే ప్రశంసలు అందుకున్నారు కన్యాశుల్కంలో గిరీశం, ఎన్ జి ఓ లో రంగనాథం, ఈనాడులో రహీం భయంలో మేనేజర్, ప్రగతిలో పిచ్చివాడు, అన్నా-చెల్లెలులో పిచ్చయ్య తాత, కమలలో కన్నబాబు, బంగారు సంకెళ్లలో రంగనాథం, నిజంలో సార్వభౌమరావు, సిద్ధార్థలో సత్యం, సంఘం చెక్కిన శిల్పంలో ధర్మయ్య, మహనీయులులో శేఖరం, సర్పజాతిలో పరశురాం - ఇలా చెప్పకుంటూ పోతే ఎన్ని విభిన్న పాత్రలో! ఎంత కష్టతరమైన పాత్రలో!! భిన్న మనఃప్రవృత్తులు, స్వభావాలుగల ఈ పాత్రలను సమర్థవంతంగా పోషించి నెగ్గుకురావడం అంటే సగటు నటుడికి సాధ్యమయ్యేపని కాదు! ఒక మహానటుడికే అది సాధ్యం వందలాది పరిషత్తు పోటీలలో పాల్గొని ఉత్తమ రచనకు, ఉత్తమనటనకు, దర్శకత్వానికి పొందిన బహుమతులు వందల సంఖ్యలో ఉన్నాయి

కె యస్ టి శాయి గారి కళా సేవను గుర్తించి ఆంధ్ర, ఆంధ్రేతర ప్రాంతాలలో కళాసంస్థలు ఘనంగా సన్మానించాయి ఎవరు సన్మానం చేశారని అనుకోవడం కన్నా ఎవరు సన్మానం చెయ్యలేదు? అని ప్రశ్నించుకుంటే మంచిదేమో!

శాయి గారిని ప్రతిష్ఠాత్మకమైన అవార్డులు, రివార్డులు వరించాయి శ్రీ శాయి 50

పరిషత్తులకు గుణనిర్ణేతగా వ్యవహరించారు అందులోకొన్ని ఆంధ్ర నాటక కళాపరిషత్, వెంకటేశ్వర నాటక కళాపరిషత్తు, తిరుపతి, సంస్కృతీ సమ్మేళనం - జియస్ ఆర్‌మూర్తి నాటక కళాపరిషత్తు। విజయవాడ, కళావాణి - నాగులపాలెం మొదలైనవి 1953 సం॥లో బాపట్లలో ఫైన్ ఆర్ట్సు థియేటర్స్,శ్రీ వెంకట్రామనాట్యమండలి (1963) బాపట్ల తాలూకా రంగస్థల కళాకారుల సమాఖ్య మొదలైన సంస్థలకు మూలపురుషుడు శ్రీ శాయిగారే। ఆ సంస్థలు ఈ నాటికీ వర్ధిల్లుతూనే ఉన్నాయి

రంగస్థల చరిత్ర గూర్చి పరిశోధన జరుపుతున్న విద్యార్థులకు కావలసిన విషయాలు చెప్పి సాయపడటం, ఔత్సాహిక నటులకు నటశిక్షణ గరపుతూ వారిని ప్రోత్సహిస్తూ ఆలంబనగా ఉండటం - ఇదే శ్రీ శాయి గారి యిప్పటి వ్యాపకం - వ్యాసంగం కళాకారుడి ఆఖరి శ్వాస వరకు నోరూ చెయ్యి ఊర్కోదు కదా!? కె యస్ టి శాయి గారి సేవలు కళారంగానికి యిప్పుడూ ఎప్పుడూ అవసరమే।

## శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి

స్వస్థలం నెల్లూరు జిల్లా, గూడూరు పట్టణం జననం 1-7-1937 తల్లిదండ్రులు జానకమ్మ-బలరామిరెడ్డి విద్యాభ్యాసం గూడూరు బోర్డు హైస్కూలులోను, నెల్లూరు వి ఆర్ కళాశాలలోను సాగింది బి ఏ పట్టభద్రులు

శ్రీ సుబ్బరామిరెడ్డి విద్యార్థి దశలో ఉన్నప్పుడే అంటే తన 15వ ఏట, 'మమత' అనే నాటికను వ్రాసి హైస్కూలు వార్షికోత్సవంలో ప్రదర్శింపచేశారు కాలేజి దశలోకూడా 'పెండ్లిచూపులు' 'నిరుద్యోగులు' 'వెలుగుబాట' నాటికలను రాసి సాంస్కృతికోత్సవాలలో జనరంజకంగా ప్రదర్శింపజేసి ప్రశంసలందుకున్నారు

1954 నుంచీ రెడ్డిగారికి నాటకరంగంతో సన్నిహిత సంబంధం ఉంది మిత్రులను కూడగట్టుకొని గూడూరులో 'సంస్కృతీ సమ్మేళనం' సంస్థను స్థాపించారు అలాగే 1958 ప్రాంతాలలో 'శ్రీ కాళిదాసు కళానికేతన్' కళాసంస్థను ప్రారంభించారు ఆ రెండు సంస్థలు నేటివరకు రాష్ట్రస్థాయి నాటక పోటీలను, సంగీత పోటీలను ప్రతీ ఏటా నిర్వహిస్తూనే ఉన్నాయి

1962 నుంచి ఉద్యోగ రీత్యా హైదరాబాదులో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్‌లో సహాయ కార్యదర్శిగా పనిచేసి 1995 లో పదవీ విరమణ చేశారు తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తిస్తూనే రచనా వ్యాసంగం కొనసాగించారు

# నాటక రచయితలు



శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు



శ్రీ డా॥ బి.వి. రమణమూర్తి
(మార్గ-శీర్ష)



శ్రీ ఎ. భాస్కరచన్ద్ర



శ్రీ మారెళ్ళ

పన్నెండు రంగస్థల నాటికలు, మూడు నాటకాలను రచించారు 'మనఊరు' 'శిఖరం కూలింది' అనే నాటకాలు, ఆగండి నేనూ వస్తున్నా, పెండ్లి చూపులు, నిత్యశంకితుడు, బంగారుమెట్లు, నోరుజారితే, ఇల్లుకావాలి మొదలైన నాటికలు రంగస్థలంమీద ప్రదర్శించబడి ప్రజామోదంపొందాయి రేడియోనాటికలు వందకుపైగా ప్రసారమయ్యాయి 'శిఖరం కూలింది' 'నీరుపల్లమెరుగు', వెంటాడేనీడలు, చీమలు పెట్టినపుట్టలు, తరం-అంతరం, మానధనులు మొదలైన నాటకాలు శ్రోతల అభిమానాన్ని విశేషంగా చూరగొన్నవాటిలో పేర్కొనదగినవి ముప్ఫయికి పైగా నాటికలు దూరదర్శన్‌లో కూడా ప్రసారమయ్యాయి

ఇవన్నీ ఒక ఎత్తుకాగా, పరిశోధనా రంగంలో శ్రీ సుబ్బరామిరెడ్డి గారు చేసిన కృషి గణనీయమైంది తెలుగు నాటక రంగం పై పరిశోధనచేసి 'ఆధునిక తెలుగు నాటకం' పేరుతో రెండు సంపుటాలు ప్రచురించారు సాహిత్య విశ్లేషణతో కూడిన 'మూడు ప్రసిద్ధ నాటకాలు' అనే పేరుతో మరొక పుస్తకాన్ని కూడా వెలువరించారు ఇంతేకాక ద గ్లిమ్ప్సెస్‌ఆఫ్ తెలుగు డ్రామా' అనే పేరుతో ఆంగ్లంలో కూడా ఒక గ్రందాన్ని ప్రచురించారు. ప్రస్తుతం 'ద ల్యూమెనరీస్ ఆఫ్ తెలుగు స్టేజ్' అనే పుస్తకం రాస్తున్నారు తెలుగులో 'నాటకవిజ్ఞాన సర్వస్వం' అయిదు సంపుటాలుగా తయారు చేసే ప్రయత్నంలో నిమగ్నమై ఉన్నారు

శ్రీ సుబ్బరామిరెడ్డి అనేక రాష్ట్రస్థాయి నాటక పోటీలకు గుణనిర్ణేతలుగా వ్యవహరించారు 1997-98 సం॥లో అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ఆటా) వారు నిర్వహించిన అంతర్జాతీయ తెలుగు నాటక రచనా పోటీలకు జడ్జీలలో ఒకరుగా వ్యవహరించారు

నాలుగు దశాబ్దాలుగా శ్రీ సుబ్బరామిరెడ్డి తెలుగు నాటక రంగ వికాసానికి నిశ్శబ్దంగా చేస్తున్న బృహత్కృషికి కళారంగం ఎంతగానో ఋణపడి ఉంది

## శ్రీ మారెళ్ళ

స్వస్థలం నెల్లూరు జిల్లా, గూడూరు, వృత్తిరీత్యా చిత్రకారులు శ్రీహరికోట రాకెట్ కేంద్రంలో పనిచేసి 1998 లో స్వచ్ఛంద ఉద్యోగ విరమణ చేశారు ప్రస్తుతం గూడూరులో స్థిరనివాసం ఏర్పరచుకొన్నారు శ్రీ మారెళ్ళ నిబద్ధత ఉన్న నాటక రచయిత ముక్కుకు సూటిగా పోయేతత్వం సమకాలీన సమాజిక

సమస్యలు, బడుగు వర్గాల బాధలు - గాథలు శ్రీమారెళ్ళ కలాన్ని నడిపిస్తాయి చేదునిజాలసమాహారం మారెళ్ళ రచనలు

తొలి రచననుంచీ ఎన్నడూ ఆషామాషీగా చేసిన రచన కానరాదు శ్రీ మారెళ్ళ ఆలోచనలో స్పష్టత కనిపిస్తుంది

మెరమెచ్చుల కోసమో, ఒక వర్గం వారిని తృప్తి పరచడం కోసమో, ఒక వర్గం బాధపడుతుందనే సంశయగ్రస్త మనస్తత్వంతోనో రాజీపడే తత్త్వం కాదతనిది

అందమైన పదబంధాలతో, భాషా చమత్కృతితో, నాటక శిల్పం అనే ముసుగు తొడుక్కుని సామాజికులచేత పంచదార అద్దిన చేదు గుళికల్ని తినిపించడం మారెళ్ళ నైజం కాదు చేదునిజాన్ని నిర్భయంగా బాహాటంగా (కుండబద్దలు కొట్టి) చెప్పడమే అతని అలవాటు ఇలాంటి intellectual honesty (నిజాయితీ) ఆయన కలానికుంది కవితాపరంగా సొగసుగా చెప్పాలన్న ప్రయత్నం ఆయన ఎన్నడూ చేసిన మొక్కట్లు లేవు

వ్యక్తిగత జీవితంలోగాని, ఉద్యోగ ధర్మాన్ని పాటించేటప్పుడుగాని రాజీధోరణి అవలంబించిన ఆనవాళ్ళు లేవు

ఉన్నత శ్రేణి నటుడైన కీ శే అయితా బలరామయ్యగారి శిక్షణలో నటుడుగాను, నాటక రచయితగాను తయారు కావడానికి పునాదులు ఏర్పడ్డాయి

Quick popularity కోసం ఏదంటే అదిరాసి ప్రభుత్వదృష్టిని ఆకర్షించి, వారి చేత పురస్కారాలు అందుకోవాలన్న తపన ఏకోశానా లేదు

నాటికలు పరిషత్తులకోసం వ్రాయడు కాని పరిషత్తుల్లో ప్రదర్శించబడి అసంఖ్యాకంగా బహుమతులందుకున్నాయి మారెళ్ళ నాటికలు అంతేకాని పరిషత్తులకోసం నాటికలను మలచడం అతని స్వభావానికి విరుద్ధమైన పని

1980 నుంచీ రచనా వ్యాసంగానికి పూనుకున్న ఈ రచయితలో క్రమవికాసం కన్పిస్తుంది తొలిరచనల్లో కొంత అపరిపక్వత కనిపించినా మలి రచనల్లో ఆలోచనా పరిధి విస్తృతమైన కారణంగా పరిణతి కన్పిస్తుంది రచనా ప్రస్థానం ఆరోహణా క్రమంలో సాగినట్లు అర్థమౌతుంది

సుదీర్ఘ సంభాషణలుండవు, ఉపన్యాసాలు అసలే ఉండవు తీసుకున్న ఇతివృత్తాన్ని

సంఘటనా పరంగా చెప్పడం మారెళ్ళ పద్ధతి ఒక సమస్యను గూర్చి వ్యక్తుల (ఆ పాత్రల) ద్వారా వ్యక్తీకరించడం, ఆ సమస్యను ఎదుర్కోవడానికి ఆ వ్యక్తులు చేసిన ప్రయత్నాన్ని చూపడం. సాఫల్యమో వైఫల్యమో చివరన దృశ్యరూపంగా వివరించడం తప్ప పనిగట్టుకుని ఒక పాత్ర చేత సంఘాన్ని, ప్రభుత్వాన్ని వ్యవస్థను దుయ్యబట్టి నాటికకు భరతవాక్యం పలకడం అనే మామూలు ధోరణి (routine system) కి పూర్తిగా భిన్నం మారెళ్ళ రచనా విధానం సంఘటనలు త్వరత్వరగా సాగిపోతుండంచేత విసుగుపుట్టడానికి ఆస్కారంలేదు

హాస్యరసాన్ని నాటికలో వొలికించాలన్న ప్రయత్నంలో హాస్యపాత్రను చొప్పించడం, అతనిచేత అవాకులు చవాకులు అసందర్భంగా పలికించడంవంటి చౌకబారు ట్రిక్కులకు దూరంగా ఉంటాడు ఈ రచయిత అలాగని వీరి నాటికల్లో హాస్యమే ఉండదని కాదు అవసరమైనచోట హాస్యానికి స్థానం యిచ్చి ప్రదర్శనను పండించిన సందర్భాలు లేకపోలేదు ఈ హాస్యం అతికించినట్టుగాను, తెచ్చిపెట్టుకున్నట్లుగానూ ఉండక సన్నివేశంలో మిళితమైన సహజంగావుండి నవ్వుతెప్పిస్తుంది

శ్రీ మారెళ్ళ నాటికలను మూడు తరగతులుగా విభజించవచ్చు 1 స్త్రీ సమస్యాత్మకాలు ఏడవకండేడవకండి, సతి, శమీవహ్ని యీవర్గానికి చెందిన నాటికలు 2 వర్గపోరాటం,బలవంతులు బలహీనులపై దాడిచేసే ఉదంతాలను చిత్రించే నాటికలు ఘర్షణ, నేనుసైతం, రాబందుల రెక్కలచప్పుడు నాటికలు ఈ కోవకు చెందుతాయి. 3 వివిధ సమస్యలు (ముఖ్యంగా కుల వ్యవస్థ - మూఢవిశ్వాసాలను ఖండించే తరహావి) మనోడు, దేవుళ్ళఆగ్రహం, ఇంకానా యీ తరగతికి చెందిన నాటికలు

'ఘర్షణ' సుంకర స్మారక నాటిక రచనల పోటీలో ప్రథమ బహుమతి పొందిన నాటిక మారెళ్లగారి నాటికలన్నీ రాష్ట్ర, జాతీయ స్థాయి నాటిక పోటీలలో ఉత్తమ రచన, ప్రదర్శన, ఇతర బహుమతులు గెల్చుకున్న నాటికలు కావడం గమనార్హం

## శ్రీ ఆకెళ్ళ శివప్రసాద్

స్వస్థలం హైదరాబాదు దక్షిణ మధ్య రైల్వేలో ఉద్యోగం శ్రీ ఆకెళ్ళ రచించిన 'నరవాహనం' నాటకం రసఝరి (నిడుబ్రోలు) సంస్థ నిర్వహించిన నాటకరచన పోటీలో ప్రథమ బహుమతి పొందిన దరిమిలా శ్రీ నాయుడు గోపీ యీ నాటకాన్ని చేపట్టి వివిధ నాటక పరిషత్తుల్లో జనరంజకంగా ప్రదర్శించి ప్రాచుర్యంలోనికి తెచ్చారు

## శ్రీ జలదంకి సుధాకర్

స్వస్థలం కావలి ప్రస్తుత నివాసం హైదరాబాదు ఔత్సాహిక నాటక రంగానికి శ్రీ జలదంకి సుధాకర్ మూడు నాటకాలను 5 నాటికలను అందించారు ఈ నాటకాలు, నాటికలు రాష్ట్రంలోని వివిధ పరిషత్తు పోటీలలో శ్రీ భానుప్రకాష్ దర్శకత్వంలో హెచ్ ఎ ఎల్ వెల్‌ఫేర్ మేనేజింగ్ కమిటీ సంస్థవారిచే ప్రదర్శింపబడ్డాయి ఉత్తమ రచన, దర్శకత్వం, ఉత్తమ ప్రదర్శన మొదలైన బహుమతులెన్నో యీ నాటిక నాటికలకు లభించాయి

శ్రీ జలదంకి సుధాకర్ నాటకసాహిత్యంలో త్రివర్ణ పతాకం (నాటకం) ఒంటికాలి పరుగు, గాలిగోపురం, హలాల్ నాటికలు సుప్రసిద్ధాలు

## శ్రీ వరికూటి శివప్రసాద్

స్వస్థలం గుంటూరు శ్రీ శివప్రసాద్ నటుడు, దర్శకుడు రచయిత వీరి ప్రసిద్ధ నాటికలు విషవృక్షం, కల్పవృక్షం, చిటారు కొమ్మన మిఠాయి పొట్లం ఈ నాటికలను రచించి, తానే దర్శకత్వం వహించారు వీరి కలం హాస్యరసం చిలికించడంలో పదును తేలింది

## శ్రీ పి. వెంకటేశ్వర్

నివాసం హైదరాబాదు దక్షిణ మధ్య రైల్వేలో ఉద్యోగం వీరు రచించిన "పుంగిడీ గవ్వ' ' హాస్యనాటిక మంచిపేరు తెచ్చింది ఈ నాటిక అనేక పరిషత్తు పోటీలలో ప్రదర్శితమై ప్రజామోదం పొందింది

## శ్రీ పమ్మి వీరభద్రరావు

నివాసం హైదరాబాదు ఎ.జి ఆఫీసులో ఉద్యోగం వీరు రచించిన "అహా! శ్రీమతీ నీమతి" హాస్యప్రధానమైన నాటకం రంగస్థలంమీద జనరంజకంగా ప్రదర్శింపబడటమే కాక రేడియోలోనూ, టి వి లోను ప్రసారం చేయబడింది

## శ్రీ శరత్ చంద్రారెడ్డి

నివాసం హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థలో పనిచేస్తున్నారు వీరు రచించిన 'శవోహం,' గూట్లో రూపాయి' హాస్యనాటికలు రంగస్థలం మీద పలుమార్లు ప్రదర్శింపబడి సామాజికులను అలరించాయి అప్పా జోస్యుల విష్ణుభోట్ల ఫౌండేషన్ (అమెరికా) వారు నిర్వహించిన నాటిక రచన పోటీలలో శవోహంకు తృతీయ బహుమతి లభించింది చక్కటి సంభాషణలు రాయగల సామర్థ్యం ఉన్నా శ్రీ శరత్ చంద్రారెడ్డి బరువైన ఇతివృత్తాల జోలికి పోవడం లేదు రచనా విధానంలో మరికొంత మార్పులు రావలసిన అవసరం ఉంది

## శ్రీ తనికెళ్ళ భరణి

నివాసం హైదరాబాద్ నటుడు, దర్శకుడు, రచయిత, సినిమా రచయితగా, నటుడుగా సుప్రసిద్ధులు, గోగ్రహణం, కొక్కొరకో, గార్దభాండం, చల్‌చల్ గుర్రం గొయ్యి మొదలైనవి వీరి ప్రసిద్ధ నాటికలు, వీధి నాటికలను ప్రాచుర్యంలోకి తెచ్చిన వారిలో శ్రీ తనికెళ్ళభరణి గణనీయులు

## శ్రీ పి.బి.కె. శర్మ

నివాసం ప్రకాశం జిల్లా, కందుకూరి మండలం, వలేటివారిపాళెం "దిరూట్" 'కాంచన మృగం' వీరి ప్రసిద్ధ నాటికలు

## శ్రీ కంచర్ల సూర్యప్రకాశరావు

ప్రస్తుత నివాసం శ్రీకాకుళం ఆంధ్రప్రదేశ్ రవాణాశాఖలో ఉద్యోగం. భేతాళప్రశ్న (నాటిక), మయాసృష్టి (నాటకం) సూర్యప్రకాశరావు గారి ప్రసిద్ధ రచనలు భేతాళ ప్రశ్న (నాటిక) బహుళజనాదరణ పొందింది

## శ్రీ కె.కె.ఎల్. స్వామి

స్వస్థలం గరివిడి, శ్రీరాంనగర్ శ్రీ స్వామి నటుడు, దర్శకుడు, రచయిత కరిమింగిన వెలగపండు, తేనె టీగలుపగబడతాయి, జీవసూత్రం వీరి ప్రసిద్ధ నాటికలు ఫేకర్ కల్చరల్ అసోసియేషన్ (గరివిడి) వారు యీ నాటికలను ఆంధ్రప్రదేశ్‌లోని

అన్ని నాటక పరిషత్ పోటీలలోనూ కె కె ఎల్ స్వామి గారి దర్శకత్వంలో ప్రదర్శించి బహుమతులు పొందారు శ్రీ స్వామి పాల్గొనని నాటక పరిషత్తు ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడా లేదనవచ్చు గిరిజనుల కష్టాలకు అద్దంపడతాయి వీరి నాటికలు

## శ్రీ శ్రీకంఠాహనుమంతరావు

నివాసం హైదరాబాదు దక్షిణ మధ్యరైల్వే అర్థగణాంక శాఖలో పనిచేస్తున్నారు శ్రీ హనుమంతరావు నటుడు, రచయిత, దర్శకుడు కూడా వీరు సుమారు 15 నాటికల్ను,ఒక నాటకం రచించారు అన్ని నాటికలూ ఔత్సాహిక సమాజాలచే వివిధ నాటకపరిషత్తులలో ప్రదర్శింపబడి ప్రశంసలందుకొన్నాయి యోగనిద్ర, వ్యవస్థమారాలి, మరోప్రస్థానం, అల్లుడొచ్చాడు, కన్నీటి శిల్పం, అమరప్రేమ, ధర్మాగ్రహం వీరి ప్రసిద్ధ నాటికలు

## శ్రీ ఎల్.బి. శ్రీరామ్

నివాసం హైదరాబాద్ ప్రస్తుతం సినిమా రచయితగా చలన చిత్రాలకు సంభాషణలు రాస్తున్నారు పంచతంత్రం, ఒంటెద్దుబండి (నాటకాలు) గజేంద్రమోక్షం, కోమా (నాటికలు) వీరిప్రసిద్ధ రచనలు శ్రీ దేశిరాజు హనుమంతరావుగారి దర్శకత్వంలో వీరి నాటక నాటికలు ప్రదర్శితమై ప్రాచుర్యం పొందాయి ఒంటెద్దుబండి నాటకం శ్రీయు సుబ్బరాయశర్మగారి దర్శకత్వంలో జనరంజకంగా ప్రదర్శింపబడి అసంఖ్యాకంగా బహుమతులందుకొంది

## శ్రీ ఎ.వి. మల్లేశ్వరరావు

నివాసం కావలి వైతరణి, శ్వేత పావురం గిజిగాడి గూడు వీరి ప్రసిద్ధ నాటికలు అన్ని నాటికలు వివిధ నాటక పరిషత్ పోటీలలో ప్రదర్శింపబడి బహుమతులు అందుకొన్నాయి

## డా॥ కందిమళ్ళ సాంబశివరావు

నివాసం చిలకలూరిపేట, నటుడు, రచయిత వృత్తిరీత్యా లెక్చరర్ సారా సంహారం, ఉప్పుకప్పురంబు, ముద్రారాక్షసం వీరి ప్రసిద్ధ నాటకాలు అప్పాజోస్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్ (అమెరికా) వారు నిర్వహించిన నాటిక రచన పోటీలో డా॥ కందిమళ్ళ సాంబశివరావు రచించిన 'ముద్రారాక్షసం' నాటికకు ప్రథమ బహుమతి

లభించింది డా॥ సాంబశివరావు "తెలుగు నాటకరంగం - నూతన ధోరణులు, ప్రయోగాలు" అన్న అంశంపై పరిశోధనచేసి నాగార్జున విశ్వవిద్యాలయం వారిచే డాక్టరేట్ పట్టా పొందారు నాటక రంగంపై వివిధ పత్రికలలో సాహితీమూల్యాంకన వ్యాసాలు ప్రకటించారు 'కాకతీయ కళాపరిషత్' పేరుతొ నాగభైరువారిపాళంలో నాటక పరిషత్ క్రమం తప్పకుండా సాంబశివరావు గారి నేతృత్వంలో సాగుతోంది

## శ్రీ బత్తుల రామకృష్ణ

స్వస్థలం కాకినాడ ప్రస్తుత నివాసం హైదరాబాదు లహరి, మనిషికీ మనిషికీ మధ్య వీరి ప్రసిద్ధ నాటకాలు, మాతాస్సమస్త జగతాం నాటిక, మనిషికీ మనిషికీ మధ్య నాటకం,అనేకనాటక పరిషత్తుపోటీలలో ప్రదర్శింపబడి బహుమతులు అందుకొన్నాయి మా తాస్సమస్త జగతాం సాహిత్య విలువగల నాటిక

## శ్రీ బి.పి. ప్రసాద్

నివాసం హైదరాబాద్ తపాలాశాఖలో ఉద్యోగం చరమాంకం వీరి ప్రసిద్ధ నాటకం శ్రీ ప్రసాద్ నటుడు, దర్శకుడు రచయిత అనేక రేడియో, టి వి కార్యక్రమాలలో కూడా పాల్గొన్నారు

## శ్రీ ద్విభాష్యం రాజేశ్వరరావు

నివాసం విశాఖపట్నం సావిత్రి సవాల్, పులి స్వారి వీరి ప్రసిద్ధ నాటికలు ఈ రెండు నాటికలు ఔత్సాహిక సమాజాల చేత విరివిగా ప్రదర్శింపబడి రచయిత కీర్తిని యినుమడింపజేశాయి

## శ్రీ చిట్టా శంకర్

నివాసం ప్రస్తుతం సికింద్రాబద్ బి హెచ్ ఇ ఎల్ ఆర్ అండ్ డి శాఖలో ఆఫీసర్‌గా పని చేస్తున్నారు 1985 ప్రాంతంలో నటుడుగా 'బాగుబాగు' నాటికలో రంగప్రవేశం చేసిన శ్రీ శంకర్ దర్శకుడుగాను, రచయితగానూ అంచెలంచెలుగా ఎదుగుతూ వచ్చారు ఆరణి, ఫణి, భయం, నాటకం, నిజం వంటి ఉత్తమ శ్రేణి నాటకాలలో ప్రముఖ పాత్రలు ధరించి నటుడిగా గుర్తింపు పొందారు ఇప్పటికి సుమారు 200 లకు పైగా రంగస్థల ప్రదర్శనల్లో విభిన్న పాత్రలు ధరించి వ్యక్తి గాను సమిష్టిగానూ నాటక రంగ పురోభివృద్ధికి తనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూ కళాసేవ

చేస్తున్నారు. 'పావని' కలం పేరుతో కొన్ని నాటకాలను యితర భాషలనుంచి అనువాదం చేసి ప్రదర్శించారు వీరు అనువదించిన నాటకాలలో సుజీ, సంత్యాలి, వారం - వారం, పాపంఉరితీస్తారుకాబోలు, పెద్దలకుమాత్రమే మొదలైన నాటకాలు రంగస్థలం మీద రాణించిన వాటిలో ముఖ్యమైనవి టి వి నటుడిగా అనేక సీరియల్స్‌లో నటించారు ఇప్పటికీ రంగస్థల నాటకాలకే అధిక ప్రాధాన్యమిస్తూ కళాసేవ చేస్తున్నారు

## శ్రీ శేషుబాబు

శ్రీ పీసపాటి శేషుబాబుగారు 1932 లో పశ్చిమగోదావరిజిల్లా మంచిలిలో జన్మించారు స్వయంగా నటులు కావటం వల్ల నాటక రచయితగా ప్రదర్శనార్హతగల నాటకాలు రాయడానికి సౌలభ్యం ఏర్పడింది తెలంగాణా ప్రాంతంలో నాటకకళకు అంతగా ప్రోత్సాహంలేని రోజుల్లో రంగస్థల వికాసం కోసం ఎంతో శ్రమించారు దక్షిణ మధ్య రైల్వే గణాంక శాఖలో ఉద్యోగం చేసి పదవీవిరమణ చేశారు వీరు సుమారు 10 నాటకాలను నాటికలను రంగస్థలంకోసం రచించారు చీకటి వెలుగులు, శేషప్రశ్న (నాటకాలు) మేరేజస్‌ఆర్ మేడిన్ హెవెన్, శ్వేతగులాబి (నాటికలు) వీరి ప్రసిద్ధ రచనలు వీరు రచించిన పెక్కు నాటికలు రేడియోలోనూ, టి వి లోనూ ప్రసారమయ్యాయి

## శ్రీ వి.యస్. కామేశ్వరరావు

స్వస్థలం ప్రకాశం జిల్లా, ఒంగోలు, వృత్తిరీత్యా ఉపాధ్యాయులు నటుడు, రచయిత, దర్శకుడు, నటుడుగా రాణించిన పిదప కలంపట్టి నాటక రచనకు పూనుకున్నారు ఉత్తమ నటనకు, రచనకు నాటక పోటీలలో ఎన్నో బహుమతులు గెల్చుకున్నారు

కధకంచికి, సర్పయాగం, తీర్పు సత్వంశోచితుమర్హసి మొదలైన నాటికలు, ఈ మంటలార్పండి నాటకం వీరి కలం నుండి ఊపిరి పోసుకున్నాయి కామేశ్వరరావుగారి నాటికలన్నీ కరుణ రస ప్లావితాలు, రంగస్థలం మీద విజయకేతనాన్ని ఎగురవేసినవి

## శ్రీ గొట్టిముక్కల నాగేశ్వరరావు

నివాసం నెల్లూరు జిల్లా, వింజమూరు మండలం, మాధవనగర్ గ్రామంలో "ఊబి" నాటిక రచయితగా వీరు మొదటిసారిగా వెలుగులోకి వచ్చారు దరిమిలా సుమారు 12 నాటక నాటికలు రచించారు గ్రామీణ రైతు జీవితంలోని ఒడిదుడుకులను,

## నాటక రచయితలు



శ్రీ పాటిబండ్ల ఆనందరావు



శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి



శ్రీ యస్.కె. ఆంజనేయులు



శ్రీ డి.వి. రమణమూర్తి

పల్లె ప్రాంతాల్లో బడుగు వర్గాల భూస్వామ్య వర్గాల క్రౌర్యానికీ. నియంతృత్వపు పోకడకు తట్టుకోలేకవారు ఎలా విలవిలలాడి పోతున్నారో ఆవైనాన్ని కళ్ళకు కట్టినట్టు చిత్రిస్తారు గొట్టిముక్కలవారు. తమ నాటకాలలో నాటిక రచనలో పల్లె వాతావరణం, తెలుగు తనపు నుడికారం ఇంపుసొంపులు, జాతీయాలు పుష్కలంగా ఉంటాయి పాత్ర చిత్రణ తెలుగువారి జీవన విధానానికి అతి సన్నిహితంగా ఉంటుంది కల్లా కపటం ఎరుగని గ్రామీణుల హాస్యం సామాజికులను కట్టి పడవేస్తూ సెలయేరులా సాగిపోతుంది సన్నివేశాల కూర్పులో శ్రీ నాగేశ్వరరావు నేర్పరి సంగీతానికి తగిన ప్రాధాన్యం యివ్వడం నాగేశ్వరరావుగారి నాటక రచనలోని ఒక ప్రత్యేకత 'ఊబి', 'న్యాయవేలం' (నాటికలు) ఊరికోరుద్రమ్మ (నాటకం) వీరి ప్రసిద్ధ రచనలు శ్రీ నాగేశ్వరరావు కొన్ని సినిమాలకు స్క్రిప్టు రాశారు కూడా.

## శ్రీ యస్.కె. ఆంజనేయులు

1925 సం॥ ఏప్రియల్ 8న ఏలూరులో జననం 1930 నుండి విద్యార్థి దశలో "నాటకరంగ అవగాహన" అభిమాన విద్యగా సాగిస్తూ, స్వగ్రామం గుడివాడలో జరిగిన నాటి ప్రఖ్యాత నటీనటుల విఖ్యాత నాటకాలు అనేకం-అనేకసార్లు చూచిన అదృష్టంతో బాటు బొమ్మలూరులోని "ఆంధ్ర గంధర్వ మెమోరియల్ నాట్యమండలి వారి "కృష్ణలీలలు" నాటకంలో ఉద్ధవుడు" పాత్రతో రంగప్రవేశం చేశారు

1945 లో హైదరాబాదు ఆర్టీసీలో ఉద్యోగపర్వం ప్రారంభం 1952 లో సికింద్రాబాదులో శ్రీ విశృతీ నాట్యమండలిని స్థాపించి పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటక/నాటికలు ఎన్నో ప్రదర్శించి, నటిస్తూ దర్శకత్వ బాధ్యతలు స్వీకరించి విజయవంతంగా నిర్వహించారు

1954 లో హైదరాబాదు రాష్ట్ర సంగీత నాటక అకాడమీలో సభ్యత్వం 1956 లో హైదరాబాదు నాట్య సంఘ కార్యవర్గ సభ్యులుగానూ నాట్యరంగ సేవకు పూనుకున్నారు

1967 లో ఆర్టీసి యాజమాన్యం రెండు Advance increments తో ప్రోత్సహించడమేగాక గుంటూరులో ఘనంగా సన్మానించారు అదే సందర్భంలో పదోన్నతిని కూడా కల్పించి గౌరవించింది

1969 లో ఆర్టీసి సంస్థలోని మహిళా ఉద్యోగినులకోసం పురుష పాత్రలు లేని నాటికలు వ్రాసి ప్రదర్శింపజేశారు. మరోవంక A.I.R లో కార్మికకార్యక్రమాలకు నాటికలు వ్రాసి ఆర్టీసి కార్మికుల చేత విజయవంతంగా ప్రసారం గావించారు 1983

లో ఉద్యోగ విరమణానంతరం, నాటక కళకే అంకితమై నాటక రచనా వ్యాసాంగం చేపట్టి, విరివిగా నాటక రచన సాగించారు

1987 లో ఆంధ్రజ్యోతి వారపత్రిక దీపావళి సందర్భంగా నిర్వహించిన నాటిక రచనా పోటీలలో వీరి నాటిక "రాధికాస్వాంతనము" ప్రథమ బహుమతి పొంది ధారావాహికంగా ప్రచురించబడి రంగస్థలనాటికగానూ దూరదర్శన్‌లోనూ ప్రదర్శించబడింది

1991 లో పరుచూరి రఘుబాబు స్మారక అఖిలభారత నాటక/నాటికల పోటీలకు ప్రాథమిక పరిశీలకునిగా పలుప్రాంతాల పర్యటించి తదుపరి సాగిన నాటిక పోటీలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించి తదాదిగా ఆ బాధ్యతను నిర్వహిస్తున్నారు

1992 లో చిన్న మొత్తాల పొదుపు సంస్థ నిర్వహించిన పొదుపు ముఖ్యాంశంగా గల కథావస్తువులో "స్వాగతం చిమొపాప" నాటికకు రచనాపోటీలలో ద్వితీయ బహుమతి అందుకున్నారు అదే సంవత్సరం నవంబరు 22 నుండి 29 వరకు వారం రోజులపాటు హైదరాబాదు "రవీంద్ర భారతి" లో జరిగిన అఖిలభారత బ్యాంకు ఉద్యోగుల బహుభాషా నాటిక పోటీలకు ముఖ్యన్యాయ నిర్ణేతగా వ్యవహరించి నిష్పాక్షిక న్యాయనిర్ణేతగా బహుధా ప్రశంసలు పొందారు

సికింద్రాబాదు యువ కళావాహిని వారి ఆధ్వర్యంలో అక్కినేని నాగేశ్వరరావు నాటక కళాపరిషత్‌కూ, అమరావతి బాలల నాటకోత్సవాలకూ గౌరవ సలహాదారుగా వ్యవహరిస్తున్నారు

శ్రీ దుర్గాప్రసాద్జీ షరాఫ్ కల్చరల్ అసోసియేషన్ వారు ఆంధ్ర ప్రదేశ్ విజయనగరం జిల్లా శ్రీరాంనగర్ (గరివిడి) లో 1-10-97 నుండి 12-10-97 వరకు 12 రోజులపాటు నిర్వహించిన 14 భాషలలో 36 నాటికలు పాల్గొన్న ప్రథమ అఖిల భారత బహుభాషా నాటికలకే గాక - ఆ కళోత్సవాలు సాగిన ప్రతిరాత్రి నాటక కార్యక్రమానంతరం జరిపిన Campfire పోటీలకూ, ముఖ్యమైన మూడు రోజులలో పగటిపూట సాగిన Theatre seminar పోటీలకూ, 7వ రోజు సాయంత్రం 4 గంటలనుండి, దేశం నలుమూలల నుండి విచ్చేసిన నాటకసమాజాలు వారివారి రాష్ట్ర జానపద సాంప్రదాయ నృత్యాలతోనూ విభిన్న కళారీతులతోనూ, మేళతాళాలతో గరివిడి పురవీథులలో ఊరేగింపుగా సాగిన కళాజాతర, Theatre, March కూ న్యాయనిర్ణేత పంచకంలో ఒకరుగా వ్యవహరించి సన్మాన సత్కారాలు అందుకున్నారు

విశాఖపట్టణం సాహితీ సేవా సమితి ట్రస్ట్ వారి పంచమ వార్షిక కళోత్సవాల సందర్భంగా నిర్వహించిన తెలుగు నాటక రచనా పోటీలలో వీరి 'స్మృతి ప్రతీక'' నాటిక తృతీయ స్థానంలో నిలవగా 28-12-97 విశాఖ పట్టణం, కళాభారతిలో కూరెళ్ళ సోమేశ్వర సాహితీ అవార్డు 1997 అందుకొని ఘన సన్మానం పొందారు

హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయ జానపద కళారూప శిక్షణ శాఖ వారు వీరిని రంగస్థల విశిష్ట వ్యక్తి పురస్కారంతో గౌరవించారు

75 వసంతాలు వృద్ధాప్యంలో కూడా కళాసేవలో అలుపెరుగని వ్యక్తిగా పలు ప్రాంతాలలో జరుగు నాటక పోటీలకు న్యాయనిర్ణేతగా అహ్వానింపబడుతూ ఆ బాధ్యతను విజయవంతంగా నిర్వహిస్తూ వుంటారు

## శ్రీ మార్గశీర్ష

అసలుపేరు శ్రీ బి వి రమణమూర్తి నివాసం అమలాపురం యస్ కె బి ఆర్ కళాశాలలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు 1985 నుంచి నాటక రచయితగా వెలుగులోకి వచ్చారు వీరు రచించిన 'పసుపు బొట్టు పేరంటానికి' అనే నాటకానికి తెలుగు విశ్వవిద్యాలయం నిర్వహించిన నాటక రచన పోటీలలో ప్రథమ బహుమతి లభించింది ఈ నాటకం వివిధ నాటక సంస్థలచేత విస్తృతంగా ప్రదర్శించబడి ప్రజాదరణ పొందింది వీరు రచించిన కుడికాలు పెట్టమ్మా అమృత వర్షిణి, శ్వేత పత్రం, సింధూరం, నీలిరాగం, నాటకాలు కూడా సామాజికుల ప్రశంసలు అందుకున్నాయి మార్గశీర్షగారి నాటకాలన్నీ స్త్రీ సమస్యాత్మకాలు కావడం విశేషం! వీరి నాటకాలలో భాష, శైలి, నుడికారం, జాతీయాలు సంభాషణల్లో అందంగా భాసిస్తాయి, తెలుగుతనం అన్ని రచనల్లోనూ ప్రస్ఫుటమౌతుంది తెలుగు నాటక రంగానికి విలువైన నాటకాలను అందించిన మంచి రచయితలలో శ్రీ మార్గశీర్ష గణనీయులు

## శ్రీ యస్.ఏ. రావు

ప్రస్తుత నివాసం హైదరాబాద్ తంతితపాల శాఖలో ఉద్యోగం వీరు ఔత్సాహిక నాటక రంగానికి సుమారు అరడజన్ నాటికలను అందించారు 1987 లో ఆంధ్రజ్యోతి (వార) పత్రిక నిర్వహించిన నాటిక రచన పోటీలలో శ్రీ యస్ ఏ రావు రచించిన 'చెలగాటం' అన్న నాటికకు ప్రథమ బహుమతి లభించింది కానీ యీ నాటికను

ఎక్కడా ప్రదర్శించిన దాఖలాలు లేవు శ్రీ ఎస్ ఏ రావు రచించిన నాటికలలో 'హరిత' , ట్రీట్‌మెంట్ నాటికలు బహుళజనాదరణ పొందినవి. అన్నీ స్త్రీ పాత్రలుగల 'ఇంటిలో పోరు-పీఠిలో హోరు' నాటిక కూడా రచయిత ఖ్యాతి యినుమడింపజేసింది

## శ్రీశైలమూర్తి

నివాసం హైదరాబాద్ ప్రస్తుతం చలన చిత్రాలకు సంభాషణలు వ్రాస్తున్నారు వీరు నాటక రచయితగా 1997 లో వెలుగులోకి వచ్చారు వీరు రచించిన 'పులి మళ్ళీ వస్తుందా?' 'ఐ పి యం' అనే రెండు నాటకాలు విస్తృతంగా ప్రదర్శింపబడి రచయితకు కీర్తిప్రతిష్ఠలు ఆర్జించి పెట్టాయి

## శ్రీ యమ్. దివాకరబాబు

ప్రస్తుత నివాసం హైదరాబాదు సినిమా రచయితగా చలన చిత్రాలకు స్క్రిప్టు రాస్తున్నారు 1970-80 దశకంలో శ్రీ దివాకరబాబు నాటికలు ఆంధ్రప్రదేశ్‌లో ముమ్మరంగా ప్రదర్శితమైనాయి కుందేటి కొమ్ము, ఎవ్వనిచేజనించు, పుటుక్కు జరజర డుబుక్కుమే వీరి ప్రసిద్ధ నాటికలు నేటికీ యివి ఔత్సాహిక సమాజాలచేత ఆదరింపబడుతూనే ఉన్నాయి

## శ్రీ వీరపల్లి వీణావాణి

అసలుపేరు శ్రీ వి ఆంజనేయులు నివాసం నెల్లూరు జిల్లా, కావలి పట్టణం, జవహార్ కాలేజిలో ఉపన్యాసకులుగా పనిచేస్తున్నారు వీరు ఒక నాటకం, ఎనిమిది నాటికలు రచించారు సందిగ్ధ సమరం, పృథ్వీసూక్తం, మృగమైదానం, సాలభంజిక వీరి ప్రసిద్ధ నాటికలు ప్రజాదరణ పొందాయి మరణమంజీరం, సమ్మోహనాస్త్రం, పితృవనం వీరి కలంనుంచి వెలువడిన నాటికలే

## శ్రీ గోళ్ళపాటి నాగేశ్వరరావు

నివాసం గుంటూరుజిల్లా సత్తెనపల్లి వృత్తిరీత్యా న్యాయవాది వీరు రచించిన 'సరస్వతీ సమస్తుభ్యం' వీరికి మంచి పేరు తెచ్చింది

## శ్రీ జె.యస్. రాజశేఖర్

నివాసం ప్రకాశం జిల్లా ఒంగోలు వీరి కలం నుంచి పునరపి, స్తన్యం, నేషనల్

హైవే పిచ్చికుక్క మొదలైన నాటికలు వెలువడ్డాయి పునరపి అత్యంత ప్రజాదరణ పొంది శ్రీ రాజశేఖర్‌ను నాటక రచయితగా వెలుగులోకి తెచ్చింది

## శ్రీ యస్వీ సుబ్బారెడ్డి

స్వస్థలం నెల్లూరు జిల్లా, కావలి, న్యాయవాదిగా పనిచేస్తున్నారు. వీరి ప్రసిద్ధ నాటికలు . జాతిస్మరామి, ప్రార్థన జాతిస్మరామి దాదాపు అన్ని పరిషత్తుల్లోనూ ప్రదర్శింపబడి బహుమతులందుకొంది

## శ్రీ పల్లేటి లక్ష్మీ కులశేఖర్

నివాసం కడప 'తపస్సు నాటక రచయితగా వీరు ప్రసిద్ధులు తపస్సు పండిత పామరులచే ప్రశంసించబడిన ఉత్తమప్రమాణాలు గల నాటకం తెలుగు విశ్వవిద్యాలయం 1987 లో నిర్వహించిన నాటక రచన పోటీలో తపస్సు నాటకం బహుమతి పొందింది తపస్సు నాటకాన్ని నాటికగా కూడా ప్రదర్శిస్తున్నారు. లక్ష్మీ కులశేఖర్ గారు దావాగ్ని మొదలైన మరికొన్ని సాంఘిక నాటికలను రచించారు అంతేకాక పంచవటి, శ్రీరామపాదుకలు మొదలైన పౌరాణిక నాటకాలను కూడా రచించారు పౌరాణిక పాత్రల స్వభావాన్ని సరికొత్త కోణంలో పరిశీలించడం యీ నాటకాల్లోని ప్రత్యేకత

## శ్రీ అత్తిలి కృష్ణారావు

నివాసం విశాఖపట్నం. ఆంధ్రవిశ్వవిద్యాలయం రంగస్థల శాఖలో ఆచార్యులుగా పనిచేశారు ఆంధ్రప్రదేశ్‌లో ఆధునిక వీధి నాటక ప్రదర్శనలకు ఆద్యులు వీరు అత్తిలి కృష్ణారావు గారు రచించిన టామిటామిటామి, జంతర్‌మంతర్ మామూళ్ళు (నాటికలు) యుగసంధ్య, జోగుజాతర, తూరుపు రేఖలు (నాటకాలు) వీరి ప్రసిద్ధ రచనలు

## శ్రీమతి అత్తిలి పద్మావతీ కృష్ణ

నివాసం విశాఖపట్నం "ఊరేగింపు" (ఆధునిక వీధినాటిక) "సంధ్యా-ఛాయ' ' (నాటకం) శ్రీమతి అత్తిలి పద్మావతీ కృష్ణగారి ప్రసిద్ధ రచనలు.'సంధ్యా-ఛాయ' నాటకం ఔత్సాహిక నాటక రంగంలో సంచలనం కలిగించిన ఉత్తమ దృశ్యకావ్యం తెలుగులో సాంఘిక నాటకం వ్రాసిన ప్రథమ రచయిత్రి పద్మావతి గారే!

# ప్రసిద్ధ రంగస్థల కళాకారులు

## శ్రీ జె. సిద్ధప్పనాయుడు

పాతకొత్తల మేలి కలయిక 'నట ప్రసిద్ధ' సిద్ధప్పనాయుడుగారు సంప్రదాయ నాటకాలలో అఖండ ఖ్యాతినార్జించిన నట వతంసులు ఉన్నారు అలాగే సాంఘిక నాటకాలలో మహా నటులనిపించుకొని చిరయశస్సుని గడించిన కళాకారులున్నారు కాని ఆ రెండు శాఖలలోను సమ ప్రతిభను చూపి రంగ స్థలం మీద రాణించిన వారి సంఖ్య చాలా స్వల్పం సంప్రదాయ, సాంఘిక నాటకాలు రెండింటినీ సమానంగా ఆదరించి, ఆయా నాటకాలలో పాత్రపోషణచేసి, పాతతరంవారినీ కొత్త తరం వారినీ కూడా మెప్పించిన మేటి నటులలో శ్రీ జె సిద్ధప్పనాయుడుగారు అగ్రగణ్యులు

చిన్నతనంలో తన గ్రామంలో అప్పుడప్పుడు ప్రదర్శింపబడే తోలు బొమ్మలాటలూ, వీధి నాటకాలు చూడటంతో చిగురించిన కళాభిరుచి, కోలాటం చెక్క భజనలో స్వయంగా తాను పాల్గొనడంతో వృద్ధి పొంది, గుబ్బి వీరన్న, సురభి నాటక సమాజాలు ఆడిన నాటకాలతో మొగ్గతొడిగి, పన్నెండవ ఏట భక్త రామదాసుగా రంగస్థలంమీదికి ఎక్కడంతో వికసించి ఫలసిద్ధి పొందింది అప్పటినుంచీ కొన్ని వందల నాటకాలలో విభిన్న పాత్రలు ధరించి నటనలో పరిణతి పొందారు

నాటక కళారాధనయే జీవిత పరమావధిగా ఎంచి, నిత్యం నాటకం అనే గాలితో బ్రతికే సుశిక్షితుడైన నటసైనికుడు, కళాజీవి శ్రీ సిద్ధప్పనాయుడు స్వస్థలం చిత్తూరు జిల్లా మదనపల్లి 1923 డిసెంబరు 7వ తేదీన బి కె పల్లెలో జన్మించారు

విద్యార్థిగా ఉన్నప్పుడు అగ్రశ్రేణి క్రీడాకారుడుగా పేరు పొందారు 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొని 17సార్లు అరెస్టు అయ్యాడు అప్పుడు మైనర్ గనుక జైల్లో వెయ్యకుండా అడవిలోకి తీసుకెళ్లి వదిలేవారు పోలీసులు

1946లో ఉద్యోగంలో చేరారు 1953 నుంచీ సచివాలయంలో జరిగిన ప్రతి సాంస్కృతిక కార్యక్రమంతోనూ వీరికి ప్రత్యక్ష సంబంధం ఉంది రాష్ట్ర స్థాయిలోను, అఖిల భారత స్థాయిలోను ఉత్తమనటుడుగా, ఉత్తమ దర్శకుడుగాను అనేక బహుమతులు పొందారు సచివాలయ సాంస్కృతిక సంఘంలో దర్శకుడుగా అనేక సంవత్సరాలు ప్రశంసనీయంగా కృషి చేశారు ప్రతాపరుద్రీయం, అలెగ్జాండర్, వసంతసేన, వేమన, శాకుంతలం, శ్రీ కృష్ణరాయబారం, నాయకురాలు, చాణక్య చంద్రగుప్త, మాలపల్లి, తరంగాలు, గాలివాన, కప్పలు, లేపాక్షి, పదవులు-పెదవులు, బొబ్బిలి యుద్ధం మొదలైన చేవగల నాటకాలకు దర్శకత్వం వహించడమేగాక వాటిలో ప్రధాన భూమికలు ధరించి, ఆ నాటకాలకు, పాత్రలకు న్యాయం చేకూర్చిన ప్రజ్ఞావంతుడు రచనకు మెరుగులుదిద్దే దర్శకత్వం నాయుడుగారిది

ఆలిండియా సివిల్ సర్వీసెస్ నాటక పోటీలలో వరుసగా మూడుసార్లు ఉత్తమనటుడుగా వచ్చిన ఘనత శ్రీ నాయుడుగారికే దక్కింది జాతీయ స్థాయిలో ఉత్తమ దర్శకుడుగా పెక్కుసార్లు ఎన్నిక అయ్యారు శ్రీ సిద్ధప్ప నాయుడు సారథ్యంలో పాల్గొన్న నాటకాలకు మూడుసార్లు ఉత్తమ ప్రదర్శన బహుమతి లభించడం అసాధారణ విషయమనీ, నాటక చరిత్రలో ఇది ఒక రికార్డ్‌అని చెప్పవచ్చు నాయుడుగారు మలేషియాలో జరిగిన ప్రపంచ తెలుగు మహా సభలలో కళా ప్రతినిధిగా పాల్గొన్నారు వీరి కళా సేవను గుర్తించి తెలుగు విశ్వవిద్యాలయం, శ్రీ కళా నికేతన్, కళాసాగర్, యువ కళావాహిని వంటి పెక్కు కళా సంస్థలు ఘనంగా సన్మానించాయి

శ్రీ సిద్ధప్పనాయుడు నిష్కపట హృదయుడు, అజాత శత్రువు, అందరితోను తలలో నాలుకగా మెలిగే స్నేహశీలి ఎంత ప్రతిభావంతుడో అంతటి వినయసంపన్నుడు 75 సంవత్సరాల వయస్సులో కూడా జంట నగరాలలో జరిగే నాటక ప్రదర్శనలకు తొలి ప్రేక్షకుడు ఈయనే! ముగ్గు బుట్టలాంటి తల, తెల్లగా మెరిసిపోయే గండు మీసాలు, స్వచ్ఛతకు మారు పేరైన పసిపాప బోసినవ్వును తలపింపజేస్తూ నిత్యం పెదవులపైగుబాళించే మంచితనపు

దరహాసంతో, పల్లెటూరి మోతుబరి రైతు తీరులో, జంటనగరాల నాటకశాలలలో ఎవరైనా మీకు తటస్థపడితే - ఆ వ్యక్తి ఎవరో కాదు - సిద్ధప్పనాయుడుగారే!

## శ్రీపామర్తి సుబ్బారావు

ఒక మనిషిలోని ఔన్నత్యానికి ప్రతిభ ఒక్కటే గీటురాయి కాదు బలమైన వ్యక్తిత్వం అతనికి తోడైనప్పుడే ఆ ప్రతిభ ద్విగుణీకృతమై, నవనవోన్మేషంగా రాణిస్తుంది కాంతులు విరజిమ్ముతుంది అలా ప్రతిభ, వ్యక్తిత్వము కలబోసుకున్న విశిష్ట వ్యక్తి శ్రీ పామర్తి సుబ్బారావుగారు. నిజాయితీ, క్రమశిక్షణ, ఆత్మ విశ్వాసం, పట్టుదల, చేస్తున్న పనిపట్ల అంకితభావమూ - ఇటువంటి పాతకాలపు లక్షణాలకు, చర్యలకు ప్రతినిధి శ్రీ సుబ్బారావు వృద్ధాప్యం మీదపడి నాలుగడుగులు నడవలేని అశక్తులుగాఉన్నా,తన ఆరోగ్యాన్ని గురించి ఆయన ఆలోచించరు అయ్యో రంగస్థలం ఎక్కే అవకాశం లేకపోయెనే, చుట్టుప్రక్కల ఊళ్ళలో వేసే కొత్త నాటకాలను చూసే అదృష్టం లేకపోయెనే అనేదే ఆయన చింత! కల్లాకపటం లేకుండా సూటిగా మాట్లాడటంతప్ప ఆత్మస్తుతి పరనిందలతో పొద్దుబుచ్చడం ఆయనకు అలవాటు లేనిపని తన చేతుల్లో తయారైన ఎందరో నటులు ఎంతో ఎత్తుకి ఎదిగిపోయి ఉచ్చదశలో ఉంటే, వారి అభివృద్ధినీ, ప్రగతిని చూసి పొంగిపోతాడే తప్ప, వాళ్ళు తనకు ప్రత్యుపకారం చెయ్యలేదనే అసంతృప్తి కాని, ఆవేదనకాని పామర్తిగారికెన్నడూ లేదు ప్రతి ఫలాపేక్షలేని నిస్వార్థ కళా సేవకుడు, అమృత హృదయుడు, ఒక మహా మనీషి, శ్రీ పామర్తి సుబ్బారావు

శ్రీ పామర్తి జన్మస్థలం గుడివాడ చదువు సంధ్యలు అక్కడే. గుడివాడ మునిసిపల్ ఆఫీసులో ఉద్యోగంచేసి, పదవీ విరమణ చేశారు బాల్య దశ నుంచీ పెద్దలు వేసే నాటక ప్రదర్శనలను విరివిగా చూసిన ఫలితంగా నాటక కళ మీద ప్రత్యేకాభిమానం కలిగింది పదహారవ ఏట రంగస్థల ప్రవేశం చేశారు స్వాతంత్ర్యోద్యమం ముమ్మరంగా సాగుతున్న కాలంలో "నేను సైతం సమిధనొక్కటి' ' అన్నట్టు స్నేహితుల్ని కూడగట్టుకొని 1938 సం॥లో 'తెలుగుతల్లి" నాటకం వేశారు గుడివాడలోనే కాక రాష్ట్రం నలుమూలలా ఆ నాటకాన్ని ప్రదర్శించి

ఎనలేని కీర్తినార్జించారు శ్రీ పామర్తి హరిశ్చంద్ర, చంద్రగుప్త, బొబ్బిలియుద్ధం, మహాకవి కాళిదాసు, రంగూన్‌రౌడీ, ప్రేమలీలవంటి పద్య నాటకాలను రసిక జన హృదయాహ్లాదకరంగా ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలు పొందారు సుబ్బారావుగారు 1942లో స్థాపించిన శ్రీ ప్రభాకరనాట్యమండలి 55 సంవత్సరాలు గడచినా చెక్కుచెదరకుండా పామర్తివారి కార్యదక్షతకు, దీక్షకు, వజ్ర సంకల్పానికి, అకుంఠిత సేవాతత్పరతకు సాక్షీభూతంగా ఈ నాటికీ నిలిచి ఉంది

పినిశెట్టి శ్రీరామమూర్తిగారి 'పల్లెపడుచు' నాటకాన్ని శ్రీపామర్తి ఆంధ్ర దేశంలో విస్తృతంగా ప్రదర్శించి పినిశెట్టిగారి కీర్తిని ఇనుమడింపచేశారు

1948 సం॥లో ఆంధ్ర నాటక కళాపరిషత్ నాటక పోటీలలో ఆత్రేయగారి 'ఎవరుదొంగ' నాటికను ప్రదర్శించి ఉత్తమ ప్రదర్శనకు బహుమతి గెల్చుకున్నారు ఆ రోజుల్లో ఆంధ్ర నాటక కళాపరిషత్ పోటీలలో ప్రదర్శనకు ఒక నాటకం లేదా నాటిక ఎంపిక కావడమే గొప్ప విషయం ఆ పోటీలో గెలుపొందడం అంటే హిమాలయ శిఖరం ఎక్కినట్టే! ఆత్రేయగారి 'చావకూడదు' నాటికలో అన్నీ స్త్రీ పాత్రలే ఉన్నా, సాహసించి ఆ నాటికను ఆం నా.క పరిషత్తులో ప్రదర్శించి ఉత్తమనటి, ఉత్తమద్వితీయ ప్రదర్శన బహుమతులు అందుకున్నారు పామర్తి వారి ప్రతిభకు, సాహసానికి ఎంతో ఆశ్చర్యపోతూ డా గరికపాటి రాజారావుగారు ప్రశంసల వర్షంకురిపించారు ఈ నాటక నాటికలన్నీ ఒక ఎత్తుకాగా సుబ్బారావుగారు తయారుచేసి, అత్యద్భుతంగా ప్రదర్శించిన 'సుల్తానీ' నాటిక ఒక ఎత్తు వేలూరి శివరామశాస్త్రిగారి 'సుల్తానీ' నాటిక రేడియోలో ప్రసారమైనప్పుడు అదివిని, ఆ కథా వస్తువుపట్ల ఆకర్షితుడై కవిగారి ఆమోదంతో ఆ రేడియో నాటికను రంగస్థలనాటికగా ఎన్నో చేర్పులు మార్పులతో శక్తిమంతంగా తీర్చిదిద్దారు తెలంగాణా యాసతో వచ్చిన మొట్టమొదటి నాటిక ఇదే కావడం గమనార్హం. (రెండవ నాటిక యండమూరివారి 'కుక్క') 1962లో గుడివాడలో జరిగిన ఆం.నా క పరిషత్ నాటక పోటీలలో 'సుల్తానీ' ఘన విజయాన్ని సాధించింది ఉత్తమ ప్రదర్శన, ఉత్తమ నటుడు, ఉత్తమ నటి, ఉత్తమ దర్శకుడు బహుమతులు 'సుల్తానీ'కే దక్కాయి సుల్తానీతో శ్రీ పామర్తికి మహానటుడనే ముద్ర పడిపోయింది

అప్పటినుంచీ 'సుల్తానీ' అంటే పామర్తి సుబ్బారావుగారి పేరే రసజ్ఞుల స్మృతి పథంలో నిలిచిపోయింది నాటక రంగంలో 'సుల్తానీ' ఒక మైలురాయిగా పరిగణించవచ్చు అప్పుడు 'సుల్తానీ' పాత్ర ధరించిన శ్రీమతి పుష్పకుమారి నేడు చలన చిత్రాలలో తారగా రాణిస్తూ ఉంది 'సుల్తానీ' లో నటించిన శ్రీ కైకాల సత్యనారాయణ చిత్రసీమలో అత్యున్నత స్థాయి నటుడుగా వెలుగొందుతూ ఉండటం అందరికీ తెలిసిందే ప్రసిద్ధ గేయ రచయిత శ్రీ జాలాది కూడా ప్రభాకర నాట్య మండలి నుంచి ఎదిగినవారే!

శ్రీ పామర్తి సుబ్బారావుగారి సేవలు చిరస్మరణీయాలు ఆంధ్ర నాటక రంగం ఆయనకు తీర్చలేనంతగా ఋణపడి ఉంది

## శ్రీ నాయుడు గోపి

పూర్తి పేరు నాయుడు గోపాలరావు ఆంధ్ర ప్రదేశ్‌లో మన ముఖ్యమంత్రి పేరు తెలియని వారుంటారేమోగాని, ఆంధ్ర నాటక రంగంలో నాయుడు గోపీని ఎరుగనివారుండరు అంటే అతిశయోక్తికాదు అంకిత భావంతో నిత్యం నటరాజు సేవలో నిమగ్నమైన కళా తపస్వికి పర్యాయపదం నాయుడుగోపి కళా సాగరంలో చిన్న పడవమీద పయనిస్తున్నా, ఉత్తుంగ తరంగాల ధాటిని తట్టుకొని, ఆశించిన గమ్యంవైపు అచంచల విశ్వాసంతో నిర్భయంగా, నిరాఘాటంగా, మొక్కవోని మహా ధైర్యంతో, పట్టువీడని కఠోర దీక్షతో ముందుకు సాగే నిరంతర నావికుడు నాయుడుగోపి గెలుపు ఓటములు లెక్క చెయ్యడు పొగడ్తలకు పొంగిపోడు తెగడ్తలకు కుంగిపోడు అది అతని నైజం నాటక కళపట్ల ఇంతటి నిష్ఠ, శ్రద్ధాశక్తులు ఉన్నాయి గనకనే 1975లో నట జీవితం ప్రారంభించిన గోపి యిప్పటికీ 600 నాటక ప్రదర్శనలివ్వగలిగారు ఉత్తమ నటుడుగా 180 బహుమతులు, ఉత్తమ దర్శకుడుగా 40 బహుమతులు పొందడం అనూహ్యం, అపూర్వం.

నాటక పరిషత్తులో నాయుడుగోపీ నాటిక లేదా నాటకం ఉందంటే వివిధ రంగాల్లోని ప్రముఖులు సయితం పనిగట్టుకొని థియేటర్లో ప్రత్యక్షమౌతారు

ప్రదర్శన చూస్తున్నంతసేపూ రసవాహినిలో లీనమై అవ్యక్తానుభూతి పొంది సంతృప్తులౌతారు

1953 మార్చి 17వ తేదీన గుంటూరు జిల్లా పెదకాకాని గ్రామంలో జన్మించిననాయుడుగోపీ పుట్టిన గడ్డకు పేరు తెచ్చారు పెదకాకాని పేరు వినగానే నాయుడుగోపీ జ్ఞాపకం వస్తాడనటం అతిశయోక్తి కాదు ప్రముఖ నటుడు, దర్శకుడు, రచయిత శ్రీ కె యస్ టి శాయి గారి దగ్గర నటనలో ఓనమాలు దిద్దుకున్నారు ఆ తర్వాత 1980లో 'శాస్త్రీయం'గుంటూరు, స్పందన ఒంగోలు, వేమనా ఆర్ట్స్ గుంటూరు, మొదలైన నాటక సమాజాలలో ఎన్నో వేషాలువేస్తూ నటుడుగా అంచెలంచెలుగా ఎదుగుతూ వచ్చారు తాను యీ స్థాయికి రావటానికి ముఖ్యకారకులు గురు తుల్యులు జి యస్ ఆర్ కె శాస్త్రి గారని చెప్పడం గోపీ వినయ సంపన్నతకు, ఉత్తమ సంస్కారానికి దర్పణం 1980 జనవరి మొదటివారంలో మిత్రులతో కలిసి 'గంగోత్రి' అనే నాటక సమాజాన్ని స్థాపించి, దానిద్వారా వందల సంఖ్యలో నాటక ప్రదర్శనాలిచ్చి ఆంధ్ర ప్రేక్షక హృదయ పీఠంలో శాశ్వత స్థానం సంపాదించుకున్నారు

నాయుడుగోపీ నట ప్రస్థానంలో ఎన్ని విజయాలో, ఎన్ని అవార్డులో, ఎన్ని సన్మానాలో, ఎన్ని సత్కారాలో! ఇన్ని సాధించానన్న గర్వంకాని, అహంభావంకాని నాయుడుగోపీలో ఏ మాత్రం కనబడదు గంగోత్రి ప్రదర్శించిన 'డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్, తర్జని, నీతి చంద్రిక, కాదు సుమాకల, నిషిద్ధాక్షరి, మానససరోవరం, నరవాహనంవంటి నాటకాలు, శ్వేతపత్రం, నవ్వండి ఇది విషాదం, దర్పణం, దహతిమమమానసం, యద్భవిష్యం, దంతవేదాంతం, శ్రీముఖ వ్యాఘ్రం, హింసధ్వని మొదలైన నాటికలు ప్రేక్షక లోకాన్ని ఎంతగానో ఆకట్టుకొన్నాయి

1983లో 'ఆంధ్ర నాటక కళా పరిషత్' లో ఒకేసారి నాటకంలోనూ, నాటికలోనూ ఉత్తమనటుడుగా రెండు బహుమతులు పొందడం, ప్రగతి కళా పరిషత్తు, సత్తెనపల్లివారు నిర్వహించిన పోటీలలో వరుసగా 1992, 93, 94

సంవత్సరాలలో ఉత్తమనటుడుగా రావడం, కాకతీయ కళాపరిషత్, నాగభైరువారి పాలెం వారిచే 'విశిష్టనటుడు' గా బంగారు పతాకం పొందడం, పరుచూరి రఘుబాబు స్మారక నాటక నాటకోత్సవాలలో 1993,94 సం॥లలో వరుసగా ఉత్తమ నటుడుగా బహుమతి, 1982లో కళా సాగర్, మద్రాసు అవార్డు, వంశీ బర్కిలీ అవార్డు, విజయవాడ నగర పాలక సంస్థ అవార్డు - ఇలా పేర్కొంటూపోతే వందకు మించిపోతుంది పట్టిక

ఔత్సాహిక సమాజాలవారికి, భవిష్యత్ తరాల రచయితలకు, నటులకు, విమర్శకులకు అందుబాటులో వుండేలా 'గంగోత్రి' ప్రదర్శించిన వివిధ నాటకాలు, నాటికలు కలిపి నాటికా సంకలనంపాటిబండ్ల ఆనందరావు నాటక సంపుటాలుగా ప్రచురించారు నాటక సమాజంవారు పుస్తక ప్రచురణను చేపట్టి మార్గదర్శకులు కావడం హర్షించదగిన విషయం

నాయుడుగోపీ మిస్టర్ బ్రహ్మానందం, హిమబిందు, అంతా నిజమే చెబుతా, శాంతి నివాసం మొదలైన చలన చిత్రాలలో కూడా నటించారు. రేడియో, టి వి , సినిమాల విషయం ఎలా వున్నా, నాటకాన్ని ఒక పవిత్ర యజ్ఞంగా భావించి అహర్నిశలు నట రాజు సేవకు అంకితమైన కళా తపస్వి నాయుడుగోపీ

## జీవన శ్రీ

అసలు పేరు యమ్ ఎ ఖాదర్ జననం 1929 నవంబరు 6వ తేదీ స్వస్థలం నెల్లూరు జిల్లా, గూడూరు విద్యార్థి దశ నుంచీ నాటకాలంటే ప్రాణం స్వాతంత్ర్యోద్యమ కాలంలో పెద్దలు వేసే ప్రచార నాటకాలలో పాత్రలు ధరించేవారు శ్రీ ఖాదర్ నటుడు, దర్శకుడు, రచయిత నెల్లూరులో యంగ్ ఆర్టిస్టు అసోసియేషన్ స్థాపించి అనేక సాంఘిక నాటకాలు నాటికలు ప్రదర్శించారు కొరివి దెయ్యం, వింతవైఖరి, పరిషత్ పోటీదారులు, నీ బ్రతుకెంత!, దేవాంగ పిల్లలు, రౌడీ మల్లన్న అనే ఆరు హాస్య నాటికలను రచించారు వీరి శిక్షణలో అనేక మంది మంచి నటులు తయారయ్యారు జీవన శ్రీగారి కళా సేవకు గుర్తింపుగా నెల్లూరు పౌరులు 1982 లో ఘన సన్మానం చేసి, కృతజ్ఞత వెల్లడించారు

# నాటక రచయితలు



శ్రీ ఆవుల శ్రీనివాసరావు



శ్రీ జీవన శ్రీ (యం.ఏ. ఖాదర్)



శ్రీ గ్రిద్దలూరు గోపాల రావు



శ్రీ పులుగుండ్ల రామకృష్ణయ్య

ఇప్పటికీ వీరు ఔత్సాహిక కళాకారులకు తగిన సలహాలనిస్తూ ప్రోత్సహిస్తూ కళా సేవలోనే నిమగ్నమై వున్నారు

## డా. వేణు

డాక్టర్ పి వేణు నెల్లూరు జిల్లా వెంకటగిరి టౌన్‌లో జన్మించారు స్థానిక ఆర్ వి యమ్ హైస్కూల్‌లో విద్యాభ్యాసం వృత్తిరీత్యా డాక్టరు ప్రవృత్తి రీత్యా నటుడు

చిన్ననాటి నుంచీ నాటకాలంటే ప్రాణం ఆత్రేయ వంటి ఉద్దండులైన నటులు, రచయితలు, కళాభిమానులు కలిసి వెంకటగిరి అమెచ్యూర్ అసోసియేషన్ స్థాపించి ఉన్నత శ్రేణికి చెందిన నాటక ప్రదర్శనాలతో వెంకటగిరికి పేరు ప్రతిష్ఠలు తెచ్చిన కాలంలో వారి నాటకాలు చూడటం, వారితో కలిసి తిరగటంవల్ల వారి సాహచర్యంతో వేణుగారిలో నాటక కళమీద ప్రత్యేక అభిమానం ఏర్పడింది ఆ నాటి నుంచీ నాటకాలే ఊపిరిగా చేసుకొని, జీవితంలోని ఆటుపోటులకు తట్టుకొంటూ నాటక కళకే జీవితాన్ని అంకితంచేసిన కళా జీవి శ్రీ వేణు సమర్థుడైన నటుడు, ప్రయోక్త, ప్రతిభావంతుడైన రచయిత

నిరాశా ప్రొడక్షన్ నెం 1, దిష్టిబొమ్మలు, చీకటి దొంగలు, వంశవృక్షం, నటరాజ్ అనే నాటికలను రచించారు దిష్టిబొమ్మలు నాటికకు 1955లో ఆంధ్ర నాటక కళా పరిషత్తు, హైదరాబాదులో జరిగిన సందర్భంలో ఉత్తమ ప్రదర్శనకు బహుమతి లభించింది శ్రీ వేణు ఉత్తమ నటుడుగా కూడా బహుమతి పొందారు అభ్యుదయ కవి, ప్రసిద్ధ విమర్శకులు శ్రీ కె వి రమణారెడ్డిగారితో కలిసి 'రాజీవం' అనే నాటిక, అన్నపూర్ణ నాటకం రచించారు రవీంద్రనాధ్ రాగూర్ 'కాబూలీవాలా' ను ప్రదర్శనాయోగ్యంగా నాటకీకరించారు

నిరంతరం సమాజాన్ని పట్టి పీడిస్తున్న సమస్యలను కథా వస్తువులుగా తీసుకుని, ఉపన్యాసాల జోలికి పోకుండా, సన్నివేశాలతో, సున్నిత సునిశిత హాస్యంతో, శక్తిమంతమైనసంభాషణా పటిమతో ప్రేక్షకులను మంత్రముగ్ధులుగా

చేయగల రచనా చాతుర్యం వేణుగారిలో ఉంది ప్రతి నాటకంలో ఏదో ప్రత్యేకత ఉండాలనే లక్ష్యంతో రచనలు చేసే నిత్య నూతన పంథా వీరిది

## శ్రీ బి.భాను ప్రకాష్

ఔత్సాహిక నాటక రంగానికి గత నలభై ఏండ్లుగా అవిశ్రాంతంగా కృషిచేస్తున్న నాటక కృషీవలుడు శ్రీ భాను ప్రకాష్ నటుడుగా, దర్శకుడుగా ప్రేక్షక లోకానికి ఆయన చిరపరిచితుడు ప్రస్తుత నివాసం హైదరాబాద్ విద్యార్థి దశలో 1950 సం॥ 'తారుమారు' నాటకంతో రంగ ప్రవేశం చేసి అప్పటినుంచీ కొన్ని వందల నాటకాలలో నాటికలలో విభిన్న పాత్రలు పోషించి వినుతికెక్కారు విశ్రుతి సికింద్రాబాద్ వారి నాటకాలలో శ్రీ యస్ కె ఆంజనేయులుగారి దర్శకత్వంలో 'రాగరాగిణీ' 'న్యాయం' 'ఆపద్బాంధవులు' మొదలైన నాటకాలలో నటించి పేరు తెచ్చుకున్నారు 1963లో హైదరాబాదులో 'కళారాధన' సంస్థను స్థాపించి ఆర్ వి యస్ రామస్వామిగారి 'గాలివాన' మొదలు దాదాపు రామస్వామి నాటకాలన్నీ స్వీయ దర్శకత్వంలో ప్రదర్శించారు శ్రీ రామస్వామిగారి రచనలను వెలుగులోకి తెచ్చిన ఘనత శ్రీ భాను ప్రకాశ్ గారికే దక్కుతుంది హెచ్ ఏ ఎల్ లో ఉద్యోగంలో చేరి అక్కడకూడా ఒక సాంస్కృతిక సంఘాన్ని స్థాపించి, ఒంటికాలి పరుగు, హలాల్, గాలి గోపురం, త్రివర్ణ పతాకం వంటి నాటికలను, నాటకాలను ప్రదర్శించి హెచ్ ఏ ఎల్ సంస్థకూ, రచయితకు కూడా ఖ్యాతిని ఆర్జించిపెట్టారు

శ్రీ భాను ప్రకాష్‌గారు కొన్ని సినిమాల్లో కూడా ప్రముఖ పాత్రలు ధరించారు టి వి లోనూ, రేడియోలో 'ఎ' గ్రేడ్ ఆర్టిస్టు వీరిని రాష్ట్రంలో అనేక సంస్థలు సన్మానించాయి అవార్డులిచ్చి ప్రోత్సహించాయి అందరికి అభిమాన పాత్రుడుగా వ్యవహరించే భాను ప్రకాష్ వస్తుత సౌమ్యుడు సహనటులను ఎంతో గౌరవించే వినయశీలి

## శ్రీ వై.వి.యస్.ఎన్.పాత్రో

నాటక రంగంపట్ల నిబద్ధత గల నటుడుగా, దర్శకుడుగా అకుంఠిత దీక్షతో గత మూడు దశాబ్దాలుగా కళా సేవలో జీవితాన్ని సార్థకం చేసుకొంటున్న

## నాటకరంగ ప్రముఖులు



శ్రీ బి. భానుప్రకాశ్



శ్రీ రావూజీ



శ్రీ బి. అమరేంద్ర



శ్రీ వై.వి.యస్‌యన్. పాత్రో

కళామయ జీవి శ్రీ వై వి యస్ ఎన్ పాత్రో 1940లో శ్రీకాకుళం జిల్లా, పాలకొండ గ్రామంలో జన్మించిన పాత్రో బాల్య జీవితం పూల పాన్పులా సాగలేదు ఇంటర్మీడియట్ చదువుతుండగా తండ్రిగారు మరణించడంతో కుటుంబ భారం మీదపడి చదువుకి స్వస్తి చెప్పాల్సి వచ్చింది జీవన పోరాటంలో నలిగిపోతూ ఎలాగో ఒక ఉద్యోగంలో చేరాడు అదే ఆ కుటుంబానికి జీవనాధారమైంది

చిన్నప్పటినుంచీ అప్పుడప్పుడూ చూస్తున్న నాటక ప్రదర్శనలు పాత్రోలో నాటకాభిలాషను రగిల్చాయి పదో ఏట ఆడవేషాలతో నాటక రంగ ప్రవేశం చేయడం ఆ నాటకాల ప్రభావమే హైస్కూలు నాటక పోటీలలో ఉత్తమ నటుడుగా బహుమతిగెల్చుకోవడం నట జీవితానికి నాంది పలికింది అప్పటినుంచీ వెనుదిరిగి చూడలేదు నటుడుగా ఒక్కొక్క మెట్టూ ఎక్కుతూ ఎన్నో నాటకాలలో పాల్గొన్నారు దైవ శాసనం, కీర్తి శేషులు, ఇదేమిటి, మరోభారతం, సంఘం చెక్కిన శిల్పం, నాలుగోముడి, పట్టాలు తప్పినబండి, ఛైర్మన్, దొంగవీరుడు, చిల్లరకొట్టు చిట్టెమ్మ, కామాయణం, స్త్రీ, రాగ శోభిత, సామ్రాట్ అశోక మొదలైన నాటకాలలో ప్రముఖ పాత్రలు ధరించడమేకాక వాటికి దర్శకత్వ బాధ్యతలు కూడా చేపట్టారు అలాగే వార ఫలితాలు, అపశృతులు, వాపస్, అంతాయింతే, ఛీ ఛీ, పండగొచ్చింది, అతిథి దేవుళ్ళొస్తున్నారు, ఎల్ల, తులసి తీర్థం, మంచంమీద మనిషి, నీ బ్రతుకెంత, చరిత్ర, పన్నీటిజల్లు, అబద్ధాల ఊబిలో మొదలైన నాటికలలో కూడా విభిన్న పాత్రలు ధరించి సామాజికుల మనోసీమలో తన స్థానాన్ని పదిలపరచుకున్నారు ఇప్పటివరకూ సుమారు 400 వరకూ ప్రదర్శనలివ్వడం జరిగింది వాటిలో 160 దాకా దర్శకత్వం వహించినవి ఉంటాయి వివిధ పరిషత్తుల్లో ఉత్తమనటుడు, విలన్, హాస్యనటుడు, దర్శకత్వం బహుమతులు 30దాకా ఉన్నాయి టి వి , రేడియో, అమృతవాణీల కార్యక్రమాలలో అనేకసార్లు పాల్గొన్నారు రెండు డాక్యుమెంటరీ చిత్రాలకు, 15 టి వి చిత్రాలకు దర్శకత్వం వహించి నటించడం జరిగింది

జీవిక కోసం గవర్నమెంట్ టెక్స్ట్ బుక్ ప్రెస్‌లో పనిచేస్తున్నా నాటకం తప్ప మరో వ్యాపకం లేదు పాత్రోగారికి,

# శ్రీ బి.అమరేంద్ర

స్వస్థలం హైదరాబాదు జననం 8, ఆగష్టు,1952 శ్రీ అమరేంద్ర 17వ ఏట నుంచీ అంటే 1969 ప్రాంతంలో నాటక రంగ ప్రవేశం చేసి హైదరాబాదులో 'ఆదర్శ యువభారతి' పేరుతో ఒక సాంస్కృతిక సంఘాన్ని స్థాపించారు అప్పటి నుండి నటుడుగా, దర్శకుడుగా, సమాజ నిర్వాహకుడుగా కళామతల్లి సేవలో నిమగ్నులై రంగస్థల పురోభివృద్ధికి అహరహం శ్రమిస్తున్నారు ఇప్పటివరకు 134 నాటక నాటికలను స్వీయ దర్శకత్వంలో ప్రదర్శించారు ఆ నాటకాలన్నిట్లోనూ విభిన్న పాత్రలు ధరించి ప్రజామోదం పొందడమేకాక, వివిధ నాటక పరిషత్ పోటీలలో సువర్ణ పతకంతో సహా ఉత్తమ దర్శకత్వానికి 224 బహుమతులు పొందారు ఉత్తమ నటుడుగా 158 బహుమతులు, ఉత్తమ కేరెక్టర్ ఏక్టర్‌గా 84 బహుమతులు, ఉత్తమ విలన్‌గా 81, బహుమతులు అందుకొన్న ప్రతిభాశాలి 1977లో 'కళాజగతి' ద్వారా విశిష్ట నటుడుగా పురస్కారం అందుకొన్నారు అమరేంద్రగారు 1998 నాటికి 1600 ప్రదర్శనలలో పాల్గొనడం అసాధారణ విషయం ఇటీవల వీరు దర్శకత్వం వహించిన 'దొరా నీ సావు మూడింది', ' ఐ పి యమ్ ' నాటకాలు కళాభిజ్ఞుల ప్రశంసలు పొందటం అందరికీ తెలిసినదే

శ్రీ అమరేంద్ర రేడియోలో 'ఏ' గ్రేడు ఆర్టిస్టుగా 1972 నుంచీ కొనసాగుతున్నారు సుమారు 400 రేడియో కార్యక్రమాలలో పాల్గొన్నారు టి వి ఆర్టిస్టుగా క్రాంతి పథం (86 వారాల సీరియల్) కోటీశ్వరుడి కూతురు, వడ్ల గింజలో బియ్యపుగింజ మిస్టరీ మొదలైన సీరియల్స్‌లో ప్రముఖ పాత్రలు ధరించారు ఇప్పటివరకు 42 టి వి. నాటకాలలో వైవిధ్యంగల పాత్రలు పోషించారు ఇంతేగాక తూర్పులో పడమర, మిస్టరీ, భక్త కవి పోతన, జీ టి వి హిందీ సీరియల్ నజియా మున్నగు టి.వి. సీరియల్స్‌కు సహాయ దర్శకత్వం వహించారు టి వి కార్యక్రమాలు ఆకర్షణ ఎంత బలీయంగా ఉన్నా నాటక రంగానికే ప్రథమ స్థానం యివ్వడం శ్రీ అమరేంద్రలో ఉన్న ప్రత్యేక లక్షణం

# శ్రీ జలకం రాధయ్య

శ్రీ రాధయ్య తిరుపతికి సమీపంలో ఉన్న తిరుచానూరు గ్రామంలో 1940 ఆగష్టు 24వ తేదీన జన్మించారు బి ఏ వరకు చదివారు లోకల్ ఫండ్ ఆడిట్ డిపార్టుమెంటులో జిల్లా ఇన్‌స్పెక్టరుగా పనిచేసి 1998లో ఉద్యోగ విరమణ చేశారు ప్రాథమికవిద్య దశలోనే అయిదేళ్ల వయస్సులో తెలుగు వాచకంలోని 'పెంకె సాక్షి' అనే చిరు నాటికలో దండధరం పాత్ర వెయ్యడంతో నాటక రంగ ప్రవేశం చేశారు అప్పటినుంచీ వయస్సుతో పాటు శ్రీ జలకం రాధయ్యలో నాటకాభిలాష అంచెలంచెలుగా వృద్ధి చెందుతూ వచ్చింది స్థానికంగా ఉన్న 'ఆర్ట్ క్రియేటర్స్ అసోసియేషన్' వారితో స్నేహం చేసి పరిషత్ పోటీలలో పాల్గొనే అవకాశం కల్పించుకున్నారు ఎక్కడ నాటక పోటీలు జరిపినా ఆ సమాజం పాల్గొనేది జలకం రాధయ్యగారికి అప్పటినుంచీ ప్రతి పరిషత్తులోనూ ఏదో బహుమతి రావడం జరిగేది పెద్దలనుంచి ఆశీస్సులు, ప్రోత్సాహం లభించాయి ప్రారంభ దశలో గురువుగారైన శ్రీ జి శ్రీనివాసులుగారి అండదండలతో, శిక్షణతో అభినయంలోని మెళకువలను ఆకళింపు చేసుకున్నారు శ్రీ రాధయ్య 1960 నుంచీ శ్రీ బాలాజీ కళా నికేతన్ - తిరుపతి వారి సమాజంలో సభ్యుడుగా ఉంటూ నాటక పరిషత్తుల్లో విరివిగా పాల్గొన్నారు ఆంధ్ర నాటక కళా పరిషత్ - ఏలూరులో జరిగిన పోటీలలో లేపాక్షి నాటకంలో శిల్పి పాత్ర ధరించి ఉత్తమ నటుడు బహుమతి పొందారు ఉద్యోగరీత్యా తిరుపతి, కాళహస్తి, చిత్తూరు, మదనపల్లి ప్రాంతాలలో పనిచేసినపుడు అక్కడి సమాజాలతో స్నేహ సంబంధాలు ఏర్పరచుకొని 'సంఘం చెక్కిన శిల్పం' ఆగండి కొంచెం ఆలోచించండి' 'క్రీనీడలు' , 'బంగారు సంకెళ్ళు' మొదలైన పెక్కు నాటకాలు నాటికలను విస్తృతంగా ప్రదర్శించి ఎనలేని కీర్తి ప్రతిష్ఠల్ని ఆర్జించారు దక్షతగల దర్శకుడు క్రమశిక్షణతో నటీనటులకు శిక్షణ యిచ్చి వారిలోని నటనా సామర్థ్యానికి మెరుగులు పెట్టి వెలుగులోకి తెచ్చారు ఇప్పటికీ నాటక రంగానికి ఏదో చెయ్యాలన్న తపనతో కొట్టు మిట్టాడుతున్న నిత్య కళారాధకుడు శ్రీ రాధయ్య

# శ్రీ రావూజీ

అసలు పేరు శ్రీ కోట అప్పారావు  అందరూ ఆప్యాయంగా పిలిచే పేరు, ప్రాచుర్యంలో ఉన్నపేరు "రావూజీ" మాడుగుల గ్రామంలో రావూజీ 1938 నవంబర్ 7వ తేదీన జన్మించారు  బాల్య జీవితం, చదువు సంధ్యలు మాడుగుల గ్రామంలోనే సాగాయి  42 సంవత్సరాలు షిప్పింగ్ సర్వీసు చేసి ప్రస్తుతం "అమ్మ షిప్పింగ్" అధినేతగా విశాఖపట్నంలో ఉంటున్నారు  నటుడుగా, దర్శకుడుగా, ప్రయోక్తగా, కార్యకర్తగా నాటకరంగానికి గత నాలుగు దశాబ్దాలుగా సేవలు అందిస్తూ కళాభ్యున్నతికి నిర్మాణాత్మకంగా తోడ్పడుతున్నారు రావూజీ

1994 నుంచి నేటి వరకు స్వయంగా నటించి, దర్శకత్వం వహించి, నిర్వహణ బాధ్యతలు కూడా చేపట్టి జనరంజకంగా ప్రదర్శించిన నాటకాలలో మనోరమ, దొరికితే దొంగలు, అరణి, మరో మొహెంజొదారో, తరంగాలు నాటకాలు పేర్కొనదగినవి  అలాగే ఆడది, ఇండియాటుడే, డిటెక్టివ్, దొంగ, వారఫలితాలు, అపశృతులు, ఇంటి దొంగలు, వాన వెలిసింది, మనిషి చావకూడదు, పుణ్యస్థలి, కింకర్తవ్యం, వయసు ఆరాటం-మనసు పోరాటం మొదలైనవి, వీరి నటనా జీవితానికి వన్నె తెచ్చిన నాటికలు

ఆకాశవాణిలో పాల్గొన్న నాటకాలు అసంఖ్యాకం  సంసారం, పొగరుబోతు, మాపల్లెలోగోపాలుడు, ప్రతి ఘటన, అడవి దివిటీలు, లాల్‌సలామ్ మొదలైన చలన చిత్రాలలో కూడా ప్రముఖ పాత్రలు ధరించారు  అంతేకాదు సినిమా నిర్మాతగా 'సుధాబిందువులు' నిర్మించి చేతులు కాల్చుకొన్న సందర్భంకూడా లేకపోలేదు

రావూజీ నాటక రచయిత కూడా "మనోరమ" నాటకాన్ని కింకర్తవ్యం, వయసు-మనసు నాటికలను రాశారు "సుధాబిందువులు" సినిమా రచయిత కూడా రావూజీయే  రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో జరిగే నాటక పరిషత్తుల్లో గుణ నిర్ణేతగా చాలాసార్లు వ్యవహరించారు

# నాటకరంగ ప్రముఖులు



కళాతపస్వి శ్రీ పామర్తి సుబ్బారావు



శ్రీ టి.ఆర్. అడబాల



కళా జీ.వి. ప్రసాదరావు



శ్రీ యు. సుబ్బరాయశర్మ

ఇవన్నీ ఒక ఎత్తుకాగా శ్రీ రావూజీ 1993 నుంచీ నిర్వహిస్తున్న నెలవారి నాటక ప్రదర్శనలు ఒక ఎత్తు కార్యక్రమాలను యిప్పటివరకూ ఎలాంటి అంతరాయం లేకుండా ప్రతి నెలా మొదటి శుక్రవారం జరుపుతూ రావడం కళారంగం గర్వించదగిన ఒక మహాకార్యం ఇటువంటి కార్యక్రమాలు ఆంధ్రప్రదేశ్‌లో మరెక్కడా నిర్విఘ్నంగా జరపటంలేదని ఘంటాపదంగా చెప్పవచ్చు ఈ మహాయజ్ఞాన్ని నిర్వహిస్తూ కళాకారులను రచయితలను, సాంకేతిక నిపుణులను, విమర్శకులను ప్రోత్సహిస్తున్న శ్రీ రావూజీకి కళాజగతి నీరాజనాలర్పిస్తోంది అప్పాజోస్యుల విష్ణుభట్ల ఫౌండేషన్ (అమెరికా) వారు విశాఖపట్నం, విజయవాడ, తిరుపతి, రాజమండ్రి నగరాలలో పెద్దఎత్తున నిర్వహించిన నాటక పరిషత్తులకు 1995 నుండి 1998 వరకు శ్రీ రావూజీ కన్వీనర్‌గా వ్యవహరించి కళాకారుల ప్రశంసలందుకున్నారు.

## శ్రీ ఉప్పులూరి సుబ్బరాయశర్మ

1947 సం॥లో విజయవాడలో జన్మించారు బి కామ్ వరకు చదువుకున్నారు హైస్కూలు చదువుతున్న రోజుల్లోనే రంగస్థల ప్రవేశం చేశారు ఈ నాటికి ఉత్తమశ్రేణి నటుడుగా ఎదిగి ఔత్సాహిక నటులకు స్ఫూర్తినిస్తున్నారు వీరు ప్రదర్శించిన నాటకాలలో 'ఒంటెద్దుబండి' 'కనకపుష్యరాగం' 'వర్థంతి', నాటికల్లో 'గులాబీ ముళ్లు-గులకరాళ్ళు, 'కుక్క' 'నిశ్శబ్దం నీకూనాకూ మధ్య' 'హూష్‌కాకి' సుప్రసిద్ధాలు ముఖ్యంగా "'ఒంటెద్దుబండి' నాటకం సుబ్బరాయశర్మ ప్రదర్శిస్తేనే బాగుంటుంది ఇతరులకు అది సాధ్యంకాదు" అన్నంత ఉన్నతస్థాయిలో ప్రదర్శన సాగుతుంది సుబ్బరాయశర్మ గారు ఎన్నో పరిషత్తులలో ఉత్తమ నటుడుగా, దర్శకుడిగా బహుమతులందుకున్నారు 'గోగ్రహణం' ఢిల్లీలో ప్రదర్శించి రసజ్ఞుల ప్రశంసలూ, బహుమతులూ అందుకొన్న ప్రజ్ఞాశాలి 1986-89 వరకు వరుసగా మద్రాసు కళాసాగర్ వారు నిర్వహించిన నాటక పోటీలలో ఏకైక ఉత్తమనటుడిగా ఎన్నిక కావడం, కమలహాసన్ చేతులమీదుగా బహుమతి అందుకోవడం శర్మగారి నటజీవితంలో ఒక మధురస్మృతిగా మిగిలిపోయింది

సుబ్బరాయశర్మగారు చాలా టి.వి సీరియల్స్‌లో ప్రముఖ పాత్రలు ధరించారు
కొన్ని సినిమాలలో కూడా మంచి పాత్రలు పోషించి ప్రేక్షకలోకాన్ని అలరించారు

## శ్రీ యస్.కె. మిశ్రో

పూర్తిపేరు శ్రీ సుశీల్ కుమార్ మిశ్రో. సరోజనీదేవి మిశ్రో, శశిభూషణ మిశ్రో దంపతులకు 1945 జనవరి 4వ తేదీన శ్రీ యస్ కె మిశ్రో జన్మించారు. బి.కామ్ వరకు చదువుకున్నారు. నటన, దర్శకత్వంలో, రంగస్థలశాఖలో,డి టి ఏ డిప్లొమా పొందారు పోర్టులో సీనియర్ అసిస్టెంట్‌గా ఉద్యోగం

మిశ్రోగారు 1960లో రంగస్థల ప్రవేశం చేశారు 1965లో 'నవ్యభారతి కళామందిర్' పేరిట సమాజం స్థాపించి స్వీయదర్శకత్వంలో నాటకాలు తయారుచేసి పరిషత్తుల్లో పాల్గొన్నారు 1968 లో 'రసమయ నట సమాఖ్య' పేరిట సమాజం నడిపి అనేక పరిషత్తుల్లో పాల్గొని ఉత్తమ ప్రదర్శనలిచ్చి ప్రశంసలూ బహుమతులూ అందుకొన్నారు వీరి గురువుగారు కీ శే కె వెంకటేశ్వరరావుగారు 1970వ సం॥లో ధియేటర్ ఆర్ట్సులో చేరి దర్వకత్వ శాఖలోను, నటనలోను నాలుగేళ్ళు తర్ఫీదు పొందారు మిశ్రో 1970 లో ఢిల్లీలో 26 దేశాలు పాల్గొన్న కామన్‌వెల్త్ యూత్ ఫెస్టివల్‌లో 'పావలా' నాటిక ప్రదర్శించి ప్రశంసలందుకున్నారు 1972 సం॥లో ఢిల్లీలో పూసా నేషనల్ ఇనిస్టిట్యూట్‌వారు నిర్వహించిన బహుభాషా నాటకోత్సవాలలో పద్నాలుగు భాషల్లో నాటికలు ప్రదర్శించబడగా మిశ్రోగారి సమాజం ప్రదర్శించిన త్రివేణికి ఉత్తమ ప్రదర్శన, అందులో మిశ్రో వేసిన 'నేస్తలింగం' పాత్రకు 'ఉత్తమ నటుడు బహుమతులు లభించాయి మిశ్రోగారి దర్శకత్వంలో వీలునామా, చెరపకురా చెడేవు, రక్తదానం, అన్నాచెల్లెళ్ళు, అసుర సంధ్య,అరణి, వేటకుక్కలు, మళ్ళీ మధుమాసం, హెచ్చరిక. భలేపెళ్ళి, ఈనాడు, కనకపుష్యరాగం, ఋత్విక్ మొదలైన నాటకాలు మనోజ్ఞంగా ప్రదర్శింపబడి రసజ్ఞుల మెప్పు పొందాయి అలాగే తెరచిరాజు, దొరికితేనేదొంగ, కాలధర్మం, కొడుకుపుట్టాల, పావలా, లాభం, ధర, తెరచిరాజు, ఎంతెంతదూరం, భజంత్రీలు, నిర్మానుష్యం, తుఫాను, బెత్తం మనిషి, ధర్మసూక్ష్మం, విషాదం, చెప్పుకింద పూలు,

# నాటకరంగ ప్రముఖులు



శ్రీ కదిమళ్ళ సాంబశివరావు



శ్రీ కావ్యశ్రీ



శ్రీ కె. శ్రీహరి మూర్తి



శ్రీ కె. యస్.టి. సాయి

వంశవృక్షం, యజ్ఞం, నేనూ మనిషినే, కాలక్షేపం మొ॥ నాటికలు రసస్ఫోరకంగా ప్రదర్శింపబడి ప్రేక్షకులను అలరించాయి మిశ్రో కీర్తిని యినుమడింపజేశాయి

మిశ్రోగారు కలంపట్టి ప్రేమజీవులు, ద్రౌపది, పితృదేవోభవ నాటకాలను, ఆలోచించండి నాటికను, కొన్ని గేయాలను కూడా రచించారు

అనేక పరిషత్తుల్లో ఉత్తమ నటనకు, దర్శకత్వానికి బహుమతులందుకొన్న మిశ్రోగారిని కళాసంస్థలెన్నో సన్మానించాయి 1986లో కళాసాగర్ అవార్డు, 1991 లో డా గరిక పాటి రాజారావు అవార్డు, 1995 లో కళాజగతి అవార్డు, 1996 లో నంది అవార్డు యింకా ఎన్నో ఎన్నో అవార్డులు మిశ్రోగారిని వరించాయి

సినిమా నటుడుగా 1973 లో 'నీడలేని ఆడది' చిత్రంలో నటించింది మొదలు సుమారు 40 చిత్రల్లో విభిన్న పాత్రలు ధరించారు మరో చరిత్ర, అందమైన అనుభవం, మాంగల్యానికి మరోముడి, శృతిలయలు, స్వయంకృషి, సిరివెన్నెల, అయినవాళ్ళు, చిన్నబ్బాయి, శ్రీవారికి ప్రేమలేఖ, స్వాతికిరణం ముఖ్యమైనవి

డిటెక్టివ్ సుబ్బారావు ఉరఫ్ డిసౌజా, మల్లాది రామకృష్ణశాస్త్రి కథలు, భరాగో కథలు, వండర్‌బాయ్ మొ॥ టి వి సీరియల్స్‌లో నటించారు రేడియోలో 'ఏ' గ్రేడ్ ఆర్టిస్టుగా ఎన్నో నాటకాల్లో పాల్గొన్నారు వాటిలో 'కంచికి చేరని కథ' అతడుఅడివిని జయించాడు' నాటికలకు ప్రత్యేక ప్రశంసలొచ్చాయి 1982 లో 'బెస్ట్ వాయిస్ ఆఫ్ ది ఇయర్' బహుమతి లభించింది ఇలా చెప్పుకుంటూ పోతే మరెన్నో విజయ పరంపరలు! సినిమాలలో విరివిగా నటిస్తున్నా, టి వి కార్యక్రమాల్లో పాల్గొంటున్నా మిశ్రోగారిచ్చే ప్రథమతాంబూలం నాటక రంగానికే అన్న విషయం వారు వేసే ప్రతి అడుగూ సాక్ష్యమిస్తుంది

## శ్రీ కె. శ్రీహరి మూర్తి

1951 లో "యన్ జి.ఓ" నాటక ప్రదర్శనలో రంగ ప్రవేశం చేశారు నాలుగు దశాబ్దాలకు పైబడి నాటక రంగంలో విశేష కృషి సల్పుతున్న శ్రీ కె శ్రీహరి మూర్తిగారు 'జగమెరిగిన బ్రాహ్మణుడు' 67 సంవత్సరాల వయస్సులోకూడా

నాటకాలు వేస్తున్న నిత్యయౌవనుడు నటుడిగా, దర్శకుడిగా, రచయితగా, ప్రయోక్తగా, నాటక పోటీల నిర్వాహకుడిగా, రంగోద్దీపన నిపుణుడుగా, గుణనిర్ణేతగా, సాంస్కృతికరంగ జర్నలిస్టుగా రంగస్థలశాఖలన్నింటిలోనూ కూలంకష అనుభవమూ, ప్రావీణ్యము ఉన్న బహుముఖ ప్రజ్ఞాశాలి

నటుడుగా సుమారు 2000 ప్రదర్శనల్లో పాల్గొన్నారు ఆనాటకాలకు దర్శకులువీరే. 1961 నుంచి రాష్ట్రవ్యాప్తంగా జరిగిన అనేకానేక పోటీలలో నటనకు, దర్శకత్వానికి వివిధ ఉత్తమ బహుమతులు లభించాయి. 1984 లో ఆంధ్ర నాటక కళాపరిషత్తులో 'సంధ్యా-ఛాయ' నాటక ప్రదర్శనకు ఉత్తమ దర్శకుడు, ప్రదర్శన తదితర బహుమతులు గెల్చుకున్నారు 1980 నుంచి 'సంధ్యాఛాయ' నాటక ప్రదర్శనకు దర్శకత్వం వహించి ప్రధాన పాత్ర పోషించి, రాష్ట్రవ్యాప్తంగానూ, రాష్ట్రేతర ప్రాంతాలలోనూ ఇప్పటివరకు 135 ప్రదర్శనలిచ్చి గత మూడు దశాబ్దాలలో తెలుగు నాటకరంగ చరిత్రలో ఒక రికార్డు సృష్టించారు 1998 ఆగస్టు 18వ తేదీన రావు గోపాలరావు స్మారక పోటీల్లో పాల్గొని ఉత్తమ బహుమతులు అందుకొన్నారు

రచయితగా 1963, 1965 సం॥లలో మొదటిసారిగా రచించిన 'సాహసులు' 'శరణార్థి' నాటకాలు ఉత్తమ రచన, ఉత్తమ దర్శకత్వం మొదలైన బహుమతులు గెల్చుకొన్నాయి నిర్వాహకుడుగా లాలగూడ రైల్వేఇన్స్టిట్యూట్ తరఫున, ఇండియన్ నేషనల్ థియేటర్ తరఫున హైదరాబాద్‌లో ఆరుసార్లు రాష్ట్రస్థాయి నాటక పోటీలు నిర్వహించటం జరిగింది దీనిలో ఎంపికైన నాటక ప్రదర్శనలకు రంగస్థల పరికల్పన బాధ్యత నిర్వాహకులే నిర్వర్తించటం ఒక ప్రత్యేకత.

రంగోద్దీపన నిపుణుడుగా-ఆంధ్రా యూనివర్శిటీ నాటక విభాగానికి 1972 నుండి మూడేళ్లపాటు ఆతిథేయరంగోద్దీపన నిపుణుడిగాను, ఆంధ్రప్రదేశ్ నాటక సంస్థ, నటశిక్షణాలయంలో ఒక సంవత్సరం, ఉస్మానియా యూనివర్శిటీ నాటక విభాగంలో ఒక సంవత్సరం పనిచేశారు

ఆలిండియా బ్యాంకు తరఫున హైదరాబాద్‌లో నిర్వహించిన వివిధ భాషల

# నాటకరంగ ప్రముఖులు



శ్రీ తాళ్ళూరి శివరామ కృష్ణారావు



శ్రీ అయ్యదేవర పురుషోత్తమ రావు



శ్రీ జవ్వాది రామారావు



శ్రీ పెళ్లేటి రాజారాం రెడ్డి

నాటక పోటీలకు, భిలాయ్‌లో నిర్వహించిన వివిధ భాషాపోటీలలోనే కాక రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో నిర్వహించిన నాటక పోటీలకు న్యాయనిర్ణేతగా వ్యవహరించారు

శ్రీహరిమూర్తి గారి కళాసేవను గుర్తించి రాష్ట్రంలో అనేక కళా సంస్థలు వీరిని సముచితంగా సన్మానించాయి 'సంధ్యాఛాయ' శతప్రదర్శన సందర్భంగా వంశీ ఇంటర్నేషనల్ సంస్థ వారిచే బళ్ళారి రాఘవ పురస్కారం, ప్రముఖ సంస్థ యువకళావాహిని వారి రంగస్థల పురస్కారములలో కె వెంకటేశ్వరరావు స్మారక అవార్డు, ఆంధ్రనాటక వజ్రోత్సవాలలో దర్శకుడిగా సన్మానం, పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారిచే 1998లో విశిష్ట నటుడుగా 'డా పైడిపాటి లక్ష్మయ్య అవార్డు, యివిగాక సంధ్యాఛాయ నాటక ప్రదర్శనల్లో వివిధ సంస్థలు జరిపిన అనేకానేక సత్కారాలు అందుకొన్నారు ఇప్పటికీ నాటక కళాసేవలోనే జీవితాన్ని సార్థకం చేసుకొంటున్నారు శ్రీ శ్రీహరి మూర్తిగారు

## శ్రీ జవ్వాది రామారావు

శ్రీమతి ఆదెమ్మ శ్రీ హనుమయ్య దంపతులకు 1941 సం॥లో శ్రీ జవ్వాది రామారావు ప॥ గో॥ జిల్లా అత్తిలి గ్రామంలో జన్మించారు నిడదవోలులో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు అచ్చమైన తెలుగుతనాన్ని వొంటినిండా పులుముకొన్న తెలుగువాడు కలుపుగోలు తనం అతనిసొత్తు కపటం, కల్మషం అంటని వ్యక్తి ఒకసారి పరిచయమైతే ఆప్తమిత్రుడైపోతాడు ఎంతోకాలంగా స్నేహం ఉన్నట్టు అనుభూతి కలుగుతుంది గోడకు కొట్టిన బంతిలాగ ప్రత్యుత్తరం రాసే అలవాటు జవ్వాది నుంచే నేర్చుకోవాలి

చాలా చిన్న వయస్సులోనే 'రంగస్థల ప్రవేశం చేసిన శ్రీ రామారావుకు నాటక రంగమే ఊపిరి. పతిత, ప్రశ్న, కళ్ళు, నూట పదహారు మొ॥ నాటికలు, మాట తప్పకు, కరుణించని దేవతలు మొ॥ నాటకాలు వీరి దర్శకత్వంలో అద్భుతంగా రాణించాయి తమిళనాడు, పశ్చిమబెంగాల్, మధ్యప్రదేశ్ మొదలగు చోట్ల నాటకాలు ప్రదర్శించి తెలుగు కేతనాన్ని ఎగురవేశాడు 1960లో రాఘవ

కళానిలయం' అనే సంస్థను స్థాపించారు వార్షికోత్సవాల సందర్భంగా విశిష్ట కళాకారులను సన్మానిస్తున్నారు నిడదవోలులో 'కోడూరి అచ్చయ్య కళామందిరం' నిర్మించి 1972 లో శ్రీ సి నాగభూషణ గారిచేత ప్రారంభోత్సవం చేయించారు

శ్రీ జవ్వాది కళాసేవను గుర్తించి లెక్కలేనన్ని కళాసంస్థలు ఆయనను ఘనంగా సన్మానించాయి మద్రాసు తెలుగు అకాడమీ వారు 'గరికపాటి రాజారావు అవార్డు శ్రీ జవ్వాది కిచ్చి సత్కరించారు హైదరాబాద్, శ్రీ కళానికేతన్ వారి 'జూలూరి వీరేశలింగం కల్చరల్ అవార్డు', యువ కళావాహిని వారి 'బళ్ళారి రాఘవ' చిలకలూరిపేట సాంస్కృతిక సంఘంవారి ' రంగస్థల కృషీవలుడు' అవార్డు శ్రీ జవ్వాదిని వరించాయి. అపరిచితులు సహితం జవ్వాదిని గుర్తు పట్టడం చాలా తేలిక "పెద్ధఎత్తున జరిగే నాటక పరిషత్తుల్లోనూ, నాటకోత్సవాలలోను, ఎక్కడైనా ఓ గుంపు కనిపించి, అందులోంచి పకపకమని నవ్వులు వినిపిస్తే, ఆ నవ్వుల్ని నవ్వే వ్యక్తే జవ్వాది"

## శ్రీ కొత్తుర్తి భాస్కరరావు

శ్రీ భాస్కరరావు 1930 జూన్ 14వ తేదీన జన్మించారు. ఆంధ్రాయూనివర్శిటీలో బి ఏ , నాటకవిభాగం నుంచి దర్శకత్వంలో డిప్లొమో పొందారు నాటక విభాగంలో మొదటి బ్యాచ్‌లో ప్రథమశ్రేణిలో ప్రథములుగా రావడం విశేషం రైల్వేలో సూపరింటెండెంట్‌గా పనిచేసి 1968 లో ఉద్యోగ విరమణ చేశారు ఉద్యోగంలో ఉన్నప్పుడు, ఉద్యోగానంతరము కూడా నాటకరంగంతో విడదీయలేని అనుబంధం ఏర్పడింది

నాటక కళలో వీరు గడించిన అగణిత శాస్త్రీయ, సైద్ధాంతిక సంపద వీరి నట జీవితాన్ని ప్రకాశవంతంగా తీర్చిదిద్దడమే కాక, సహచరులకు శిష్యులకు కూడా అది వరప్రసాదమైంది

శ్రీ భాస్కరరావు ఎనిమిదవ ఏట 'కృష్ణలీలలు" నాటకంలో బలరాముని వేషం వెయ్యడంతో రంగస్థల ప్రవేశం చేశారు 1984 నుంచి నాటక కళాభ్యున్నతి తన

## నాటకరంగ ప్రముఖులు



కీ॥శే॥ రేబాల రమణ



శ్రీ నాయుడు గోపి



"కళామిత్ర" శ్రీ అడివి శంకరరావు

జీవితధ్యేయంగా ఉద్యమ స్ఫూర్తితో కృషి చెయ్యనారంభించారు అప్పటినుంచీ వందలాది నాటక ప్రదర్శనలలో పాల్గొన్నారు పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలకు సమప్రాధాన్యమిస్తూ ముందుకు సాగారు 'చంద్రగుప్త'లో చంద్రగుప్తుడుగా, 'ఖిల్జీరాజ్యపతనం'లో ఖిజీర్‌ఖాన్‌గా పాత్రపోషణచేసి ప్రజామోదం పొందగలిగారు భయం, కప్పలు, కులంలేని పిల్ల, పల్లె పడుచు, దైవ శాసనం, మాటతప్పకు, పాండవుల మెట్ట మొదలైన ప్రసిద్ధ నాటకాలలో ప్రధాన భూమికలు నిర్వహించి బహుమతులు, ప్రేక్షకుల ప్రశంసలూ అందుకున్నారు 1948 నుంచీ దర్శకత్వం వహిస్తున్న భాస్కరరావుగారి ప్రతిభా వ్యుత్పత్తులకు గీటురాళ్ళు ఆనాటకాలు ఒరిస్సాలో ఆంధ్ర నాట్యకళామండలినీ, ఖర్గపూర్ (పశ్చిమ బెంగాల్) లో ఆంధ్ర అమెచ్యూర్స్ సంఘాన్నీ వీరు స్థాపించి తెలుగు నాటక వైభవానికి ఆప్రాంతాలలో హారతులు పట్టారు. విశాఖపట్నంలో రంగస్థల కార్యక్రమాలలో క్రియాశీలక పాత్ర వహించి రంగస్థలాభివృద్ధికి ఎంతగానో తోడ్పడ్డారు విశాఖపట్నం, కాకినాడ, పెద్దాపురం తదితర పట్టణాలలో నటశిక్షణ తరగతులు నిర్వహించి ఔత్సాహికులకు శాస్త్రీయ పద్ధతుల మీద అవగాహన కలిగించి వేదికలపై ఉపన్యాసాలు యివ్వడమేగాక వివిధ పత్రికలలో అమూల్యమైన వ్యాసాలు రాసి కళారంగానికి మౌలికమైన విజ్ఞాన సంపదను అందించారు

శ్రీ భాస్కరరావు నాటక రచయితకూడా రూపకం, శ్రీ త్యాగరాజస్వామి, నాట్యావతరణం వీరి కలం నుండి వెలువడినవే. నాట్యావతరణాన్ని యక్షగాన పద్ధతిలో రూపొందించారు శ్రీ భాస్కరరావు వాద్యసంగీతంలో కూడా నిపుణులు గయోపాఖ్యానం, హరిశ్చంద్ర, కృష్ణరాయబారం, కనకతార, వెన్నెల, అర్ధాంగి, సినిమాగర్ల్, వంటి పద్యనాటకాలకు హార్మోనిస్టుగా సహకారాన్ని అందించారు

గుణ నిర్ణేతగా అనేక నాటక పరిషత్తులలో పాల్గొన్నారు వీరి బహుముఖ కళాసేవలను గుర్తించి 1995 లో తెలుగు విశ్వవిద్యాలయం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖవారు అవార్డునిచ్చి సత్కరించారు విశాఖ జిల్లా కలెక్టరు నుంచి కళానీరాజనపురస్కారం, డి ఎన్.ఆర్ కల్చరల్ ఎకాడమీ నుంచి 'విశాఖరత్న'

పురస్కారం కూడా శ్రీ భాస్కరరావుకు లభించింది

ప్రస్తుతం ఆంధ్రాయూనివర్శిటీ, థియేటర్ ఆర్ట్స్ బోర్డు ఆఫ్ స్టడీస్ సభ్యుడుగాను, ఆంధ్ర నాటక కళాపరిషత్ గౌరవ సభ్యుడిగాను శ్రీ భాస్కరరావు గారు యిప్పటికీ తమ సేవలు అందిస్తూ నాటక రంగానికి యథోచితంగా తోడ్పడుతున్నారు

## "కళామిత్ర" అడివి శంకరరావు

శ్రీ అడివి వేంకట చలపతిరావు, శ్రీమతి కాశీ విశాలాక్షి అన్నపూర్ణ దంపతులకు విజయవాడలో జన్మించారు 1968 సం।లో నాటక రంగంలో ప్రవేశించి, కె యస్ శాస్త్రిగారి దగ్గర మేకప్‌లో ఓనమాలు దిద్దుకుని, ఆసక్తిచేత - అనేక ప్రముఖ మేకప్ కళాకారుల దగ్గర ఆహార్య రంగంలో మెళకువలు నేర్చుకుని నాటకరంగంలో తనకంటూ ఒక ప్రత్యేక శైలిని ఏర్పరచుకుని సహజత్వాన్ని, నాటకీయతను మేళవించి "ముఖపత్ర రచన" చేస్తూ - అనేక నాటక పరిషత్‌లలో అసంఖ్యాకంగా "ఉత్తమ ఆహార్యం" బహుమతులు పొందారు "కళామిత్ర" అడివిశంకరరావు - 1991 లో ఆంధ్ర లలిత కళాసమితి (రైల్ కళారంగ్) సికింద్రాబాద్ వారు నిర్వహించిన పరిషత్‌లో - ఒకే సంవత్సరం ఒకే పరిషత్‌లో - ఒకనాటకానికి ఒక నాటికకు 2 ఉత్తమ ఆహార్య బహుమతులు పొందడం- రాష్ట్రంలో ఇంతవరకు ఏ మేకప్ కళాకారుడు సాధించలేనంత విజయంగా గౌరవించబడ్డారు

నాటక రంగంలో రంగస్థల అలంకరణ, నిర్వహణలోనూ, నటనలోనూ గల విశేషానుభవం చేత రచన, దర్శకత్వ విభాగాల్లోనూ అనుభవజ్ఞానం సంపాదించారు

అనేక పరిషత్‌లకు 15 సార్లకుపైగా "ప్రాథమిక పరిశీలకుడు" గా తన అనుభవం, సునిశిత పరిశీలనతో అనేక ఉత్తమ నాటకనాటికల్ని ఎన్నికచేసి వెలుగులోకి తెచ్చారు "న్యాయనిర్ణేత" గా ఆహ్వానింపబడినా - కళాకారులకు దూరమవడం ఇష్టంలేక సున్నితంగా తిరస్కరించారు రాష్ట్రంలో, రాష్ట్రేతర ప్రాంతాల్లో జరిగే అనేక నాటక పరిషత్‌లకు సమాజాలకు మధ్య వారధిగా, సారధిగా న్యాయమార్గంలో వ్యవహరిస్తున్నారు

అనేక నాటక పరిషత్‌లను నిర్వహించి విశేషానుభవం గడించారు

ఒక్క "న్యాయనిర్ణయం" విషయంలో తప్ప మిగతా అన్ని విషయాల్లోనూ పరిషత్‌లకు తన సహాయ సహకారాల్ని సలహాలను అందిస్తున్నారు

ఔత్సాహిక సాంఘిక నాటక రంగంలో రచయితలు, దర్శకులు, నటీనటులు, సాంకేతిక వర్గం, సమాజాలు, పరిషత్‌లు మొదలైన చిరునామాల్ని వివరాల్ని సేకరించివుంచి అడిగిన వారందరికీ అందించి సహకరిస్తున్నారు

"Encyclopaedia of Telugu Social Theatre" అని నాటకరంగ పెద్దలచే ఆశీర్వదించబడ్డారు నాటక రంగంలో ఎవరూ నిర్వహించని విధంగా తన వృత్తిని నిర్వహించుకుంటూనే - అన్ని పరిషత్‌ల వివరాలను రికార్డు చేసి "రికార్డ్" పొందారు

అనేక పరిషత్‌లచేత, సాంస్కృతిక సంస్థలచేత అసంఖ్యాకంగా గౌరవాలు, సన్మానాలు పొందారు 1991లో విజయవాడ మూర్తి మెమోరియల్ పరిషత్ వారిచే "కళామిత్ర" బిరుదు పొంది ఆబిరుదుకు న్యాయం చేకూరుస్తున్నారు 1994 లో మిత్రుల సహకారంతో "ఆంధ్ర ప్రదేశ్ ఔత్సాహిక రంగస్థల కళాకారుల సమాఖ్య" ను స్థాపించి వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శిగా కొనసాగుతున్నారు

రాష్ట్రంలో అన్నిజిల్లాల్లోని అనేక నాటక పరిషత్‌లకు సమాజాలకు, కళాకారుడిగా మిత్రుడుగా, మేకప్ కళాకారుడిగా తన సహకారం అందిస్తున్నారు నాటక రంగంలో అందరికీ తన కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నారు పరిమితమైన కుటుంబంలో తన శ్రీమతి లక్ష్మి, చిరంజీవులు హేమమాలిని ప్రేమసాయిలతో ఆనందమయ జీవితాన్ని పొదుపుగా, పొందికగా గడుపుతున్నారు

## శ్రీ యం. ప్రసాదమూర్తి

శ్రీమతి రత్నమ్మ శ్రీ రామన్న దంపతులకు ఏకైక సంతానంగా 1955 జనవరి 14వ తేదీన ప॥ గో॥ జిల్లా కాశీపాడు గ్రామంలో శ్రీ ప్రసాదమూర్తి జన్మించారు స్కూల్ ఫైనల్ వరకూ చదువుకున్నారు ప్రస్తుతం హార్లిక్స్ ఫ్యాక్టరీ అన్నవరప్పాడులో

ఉద్యోగం చేస్తున్నారు వృత్తి ఏమైనా ప్రవృత్తి నాటకరంగమే 1972 లో శ్రీ బి ఇంద్రకుమార్ గారి ప్రోత్సాహంతో 'వరుడు కావాలి' తో నాటక రంగప్రవేశం చేశారు తదాదిగా ఎన్నో నాటక నాటికలలో నటించడమేకాక, వాటికి దర్శకత్వం వహించి ఆ నాటకాలకు ప్రాణం పోశారు. వాటిలో 'నలభై ఆరో నిమిషం' నరకం మరెక్కడో లేదు, సింధూరం, నీలిరాగం, ముద్రారాక్షసం, సతి, అహంబ్రహ్మోస్మి శ్వేతపత్రం మొదలైనవి సుప్రసిద్ధాలు

రాష్ట్ర వ్యాప్తంగా జరిగే అనేక పరిషత్తు పోటీలలో పాల్గొని ఉత్తమ బహుమతులు అందుకున్నారు 1985 లో శ్రీ గౌతమీ అసోసియేషన్, రాజమండ్రి వారిచే మ్యాన్ ఆఫ్ ది ఇయర్ అవార్డు' అందుకున్నారు తాడేపల్లిగూడెంలో చిరుగులాబి పురస్కారం, నర్సీపట్నంలో పసిడిమొగ్గ ప్రతిభాపట్టాభిషేకం 1992 లో తాడేపల్లిగూడెంలో 'కళాతపస్వి 1993 లో కళాంజలి వారి సత్కారం, 1996లో కాకినాడలో ప్రజ్ఞా అవార్డు మొ॥ పొంది ఆధునిక నాటక రంగంలో సముచిత స్థానం సంపాదించుకున్నారు వీరు స్థాపించిన 'కళావాణి' రాజమండ్రిలో 25 ఏళ్ళ సుదీర్ఘ ప్రయాణంలో 1997లో కళావాణి రంగస్థల పురస్కారం పేరిట ఆ సంవత్సరం అనేక ప్రదర్శనలిచ్చి, రికార్డు స్థాపించిన నాటక,నాటికలకు, నటీ, నటులకు, అత్యుత్తమ రచయిత, దర్శకులకు, నాటకరంగ ప్రముఖులకు నాటకఅవార్డులిచ్చి ఘనంగా సత్కరించారు ఆ సందర్భంలో వెలువరించిన కళావాణి "హృదయ విపంచి" 'అభినందన' సంచికలు ఎన్నో వివరాలతో నాటక రంగానికి ఎంతో ఉపయోగకరంగా ఉండటం విశేషం

## ఈ దశాబ్దిలో (1980-1990) ప్రసిద్ధ రంగస్థల నటీమణులు

| | |
|---|---|
| శ్రీమతి కె రాజేశ్వరి | (శ్రీకాకుళం) |
| శ్రీమతి కె విజయలక్ష్మి | (విశాఖపట్టణం) |
| శ్రీమతి యం జగదీశ్వరి | (విశాఖపట్టణం) |
| కుమారి శ్రావ్య | (విశాఖపట్టణం) |

| | |
|---|---|
| శ్రీమతి శ్యామల | (విశాఖపట్టణం) |
| శ్రీమతి రమా కుమారి ధర్మ | (విశాఖపట్టణం) |
| శ్రీమతి ఉమ | (రాజమండ్రి) |
| శ్రీమతి వై సరోజ | (ద్రాక్షారామం) |
| కుమారి శ్రీదేవి | (ఏలూరు) |
| శ్రీమతిపద్మలత | (రాజమండ్రి) |
| శ్రీమతి వాసంతి | (విజయవాడ) |
| కుమారి యస్ సుజాత | (కాకినాడ) |
| శ్రీమతి వై శాంతాదేవి | (రాజమండ్రి) |
| శ్రీమతి టి రాజ్యం | (రాజమండ్రి) |
| చిరంజీవి భానుమతి | (రాజమండ్రి) |
| శ్రీమతి రమణ (సుజాత) | (రాజమండ్రి) |
| శ్రీమతి రజని | (రాజమండ్రి) |
| కుమారి భార్గవి | (మంగళగిరి) |
| శ్రీమతి చంద్రిక | (హైదరాబాదు) |
| శ్రీమతి శ్రీలక్ష్మి | (హైదరాబాదు) |
| శ్రీమతి టి సీతాలత | (బాపట్ల) |
| శ్రీమతి లక్ష్మి కనకాల | (హైదరాబాదు) |
| కుమారి రాజేశ్వరి (కళ్ల | (హైదరాబాదు) |
| శ్రీమతి నాగమణి | (హైదరాబాదు) |

| | |
|---|---|
| శ్రీమతి అలితారాజ్ | (హైదరాబాదు) |
| శ్రీమతి ఆలపాటి లక్ష్మి | (హైదరాబాదు) |
| శ్రీమతి బృంద | (హైదరాబాదు) |
| శ్రీమతి పుష్పకుమారి | (గుడివాడ) |
| కుమారి శ్రీవాణి | (హైదరాబాదు) |
| శ్రీమతి కళ్యాణి | (హైదరాబాదు) |
| కుమారి పద్మప్రియ | (హైదరాబాదు) |
| శ్రీమతి శకుంతల | (హైదరాబాదు) |
| శ్రీమతి ఇందిర | (హైదరాబాదు) |
| శ్రీమత్తి పద్మారెడ్డి | (ఒంగోలు) |
| శ్రీమతి యం రత్నకుమారి | (వెల్లంపల్లి) |
| శ్రీమతి శివజ్యోతి | (విశాఖపట్టణం) |
| శ్రీమతి కె రాజ్యం | (తాడేపల్లి గూడెం) |
| శ్రీమతి పద్మ | (శింగరాయకొండ) |
| కుమారి ప్రభావతి | (నెల్లూరు) |
| శ్రీమతి రమాదేవి | (హైదరాబాదు) |
| శ్రీమతి భానురమ | (చిలకలూరిపేట) |
| శ్రీమతి పద్మావతి | (హైదరాబాదు) |
| కుమారి సుగుణ | (హైదరాబాదు) |
| శ్రీమతి జానకి | (హైదరాబాదు) |

| | |
|---|---|
| శ్రీమతి రత్నసాగర్ | (హైదరాబాదు) |
| శ్రీమతి మాధవి | (నెల్లూరు) |
| శ్రీమతి యస్ కె లక్ష్మి | (గుంటూరు) |
| కుమారి హసీనా | (పుత్తూరు) |
| కుమారి శాయి రమ్య | (ఖమ్మం) |
| కుమారి జయశ్రీ | (హైదరాబాదు) |
| శ్రీమతి హైమవతి | (హైదరాబాదు) |
| శ్రీమతి శోభారాణి | (హైదరాబాదు) |
| శ్రీమతి గూడూరి సావిత్రి | (గూడూరు) |
| శ్రీమతి అరుణ కుమారి | (రాజంపేట) |
| శ్రీమతి వి కృష్ణవేణి | (తెనాలి) |
| శ్రీమతి బి జయలక్ష్మి | (తెనాలి) |
| శ్రీమతి గుమ్మడి విమల కుమారి | (తెనాలి) |
| శ్రీమతి ఏ శకుంతల(తెనాలి) | (హైదరాబాదు) |
| శ్రీమతి యం సరోజని | (శికింద్రాబాదు) |
| శ్రీమతి కృష్ణవేణి | (గూడూరు) |
| శ్రీమతి నిర్మల | (హైదరాబాదు) |
| శ్రీమతి విజయశ్రీ | (హైదరాబాద్) |

# సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| శ్రీ శ్రీనివాసరావు, శ్రీ వెలుగుల బ్రదర్స్ | (ఖుర్దారోడ్) లైటింగ్ |
| శ్రీ ప్రసన్న కుమార్ | (తాడేపల్లి గూడెం) లైటింగ్, సౌండ్ |
| శ్రీ జి సుదర్శన రావు | (రాజమండ్రి)లైటింగ్, సౌండ్ |
| శ్రీ గాంధీ | (రాజమండ్రి) లైటింగ్, సౌండ్ |
| శ్రీ వేపా సత్యనారాయణ | (రాజమండ్రి) సంగీతసారధి |
| శ్రీ కె వి.యస్ మూర్తి | (కాకినాడ) రూపశిల్పి |
| శ్రీ ఏ తమ్మయ్య | (రాజమండ్రి) లైటింగ్స్ సౌండ్ |
| శ్రీ సురేష్ | (రాజమండ్రి) నేపథ్యగానం |
| శ్రీ ఎం సత్యనారాయణ | (రాజమండ్రి) నేపథ్యగానం, గిటార్ వాయిద్యకారుడు |
| శ్రీ ఎస్ గంగాధరరావు (బాబ్జీ) | (రాజమండ్రి) నేపథ్యగానం, గిటార్ వాయిద్యకారుడు |
| శ్రీ ఉస్మాన్ | (రాజమండ్రి) సౌండ్ లైటంగ్ |
| శ్రీ అడవి శంకరరావు | (విజయవాడ) రూపశిల్పి |
| శ్రీ మదన్ - | (గుంటూరు) రూపశిల్పి |
| శ్రీ యం ఆర్ ప్రసాద్ | (రాజమండ్రి) నేపథ్యగానం |
| శ్రీ పోతురాజు | (రాజమండ్రి) తబలా |
| శ్రీ కె చిట్టిబాబు | (రాజమండ్రి) సంగీత కళాకారుడు |
| శ్రీ చిత్తజిల్లు భాస్కరరావు | (కాకినాడ) వైలనిస్టు |
| శ్రీ శాంతరాం - | (రాజమండ్రి) - వేణువు |
| శ్రీ తాడి సత్యనారాయణ | (రాజమండ్రి) క్లారినెట్ |

| | |
|---|---|
| శ్రీ పి రాజు | (విశాఖపట్టణం) - నేపథ్య సంగీత, వాయిద్యకారుడు |
| శ్రీ శ్రీధర్ | (నెల్లూరు - నేపథ్య సంగీత వాయిద్యకారుడు) |
| శ్రీరాజు | (రాజమండ్రి) తబలా |
| శ్రీ కె నాగేశ్వరరావు | (రాజమండ్రి) వయిలెన్ |
| శ్రీ సాగిశ్రీరామచంద్రమూర్తి | (రాజమండ్రి) సౌండ్ అండ్ లైటింగ్ |
| శ్రీ ఆశపు రాము | (రాజమండ్రి) రూపశిల్పి |
| ఎ సత్తిరాజు | (రాజమండ్రి) క్లారినెట్ |
| శ్రీ కె భరణి కుమార్ | (విశాఖపట్టణం) రూపశిల్పి |
| శ్రీ సాగి సుబ్రహ్మణ్యం | (రాజమండ్రి) సౌండ్ లైటింగ్ |
| శ్రీ పి గోవిందరాజులు | (నెల్లూరు) రూపశిల్పి |
| శ్రీ టి ఆర్ అడబాల - | (హైదరాబాదు) రూపశిల్పి |
| శ్రీ కె చిరంజీవి | (విశాఖపట్టణం) రూపశిల్పి |
| శ్రీ జి సత్యానందం | (ప్రత్తిపాడు తూ॥ గో॥ జిల్లా) రూపశిల్పి |
| శ్రీ కె నాగేశ్వరరావు | (ధవళేశ్వరం) వాయినలిస్ట్ |
| శ్రీ గంగాధర్ | (కాకినాడ) రూపశిల్పి |
| శ్రీ వీరాస్వామి | (కాకినాడ) రూపశిల్పి |
| శ్రీ పసుపులేటి సూర్యచంద్ర | (భీమవరం) రూపశిల్పి |
| శ్రీ ఐడాల సన్యాసిరావు | (సికింద్రాబాదు) రూపశిల్పి |
| శ్రీ జడ్చర్ల శ్యాంసుందర్ | (హైదరాబాదు) రూపశిల్పి |
| శ్రీ మల్లాది గోపాలకృష్ణ | (హైదరాబాదు) రూపశిల్పి |
| శ్రీ జి.యస్ ప్రకాశ్ | (బరంపురం) ఆహార్యము రంగాలంకరణ నిపుణులు |
| శ్రీ బంగారు రాజేష్ | (రాజమండ్రి) రూపశిల్పి |

# నాటక రంగ ప్రముఖులు

## శ్రీ సి.హెచ్.నాంచారయ్య

సంప్రదాయ నాటక రంగానికి నటుడుగా, గాయకుడుగా, నాటక సమాజ వ్యవస్థాపకుడుగా, పరిషత్ నిర్వాహకుడుగా, కళాసేవా తత్పరుడుగా బహుముఖులుగా సేవలందిస్తున్న ఆదర్శ కళామూర్తి శ్రీ నాంచారయ్య పౌరాణిక నాటకాలనేగాక సాంఘిక నాటకాలను కూడా సమభావంతో సమాదరించగల కళా హృదయుడు తాను నటుడుగా ఎంత ఎత్తుకి ఎదిగినా, రాష్ట్ర స్థాయిలో ఎంత పేరున్నా, తాను నేర్చింది సింధువులో ఒక బిందువే అని సంభావించే వినయ శీలి శ్రీ నాంచారయ్య

శ్రీ చిలుకోటి శ్రీరాములు, శ్రీమతి రామలక్ష్మి దంపతులకు 1944 సం॥ నవంబర్ 24వ తేదీన శ్రీ నాంచారయ్య జన్మించారు అయినా, పెరిగింది మొవ్వ గ్రామంలో అమ్మమ్మ బసవమ్మగారి సంరక్షణలో మచిలీపట్నం ఆంధ్ర జాతీయ కళాశాలలో బి ఏ , వరకు చదివారు 1962లో శ్రీమతి తెనుగుతల్లిని వివాహం చేసుకున్నారు. ఉద్యోగరీత్యా 1967లో హైదరాబాద్‌కు మకాం మార్చారు ఎ జి ఆఫీసులో సీనియర్ అక్కౌంట్స్ ఆఫీసర్‌గా ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తిస్తూ హైదరాబాదులోనే స్థిర నివాసం ఏర్పరుచుకున్నారు

చిన్ననాటి నుంచీ నాటకాలంటే ప్రాణం అబ్బూరి వర ప్రసాదరావు గారి గ్రామ్‌ఫోన్ రికార్డులు విని, తాను కూడా అలాపాడాలని నాటకాల్లో వేషం వెయ్యాలని తహతహలాడేవారు 1956లో అంటే తన పన్నెండవ ఏట 'గయోపాఖ్యానం' నాటకంలో నారదుడుగా రంగప్రవేశం చేశారు అప్పటి నుంచీ మళ్లీ వెనుదిరిగి చూడలేదు చక్కని రూపం, తియ్యని కంఠం, సామాజికులను మంత్రముగ్ధుల్ని చేయగల అభినయ కౌశలం వీరికి దేవుడిచ్చిన వరాలు

'శ్రీకృష్ణ రాయబారం' లో కృష్ణుడుగా, 'హరిశ్చంద్ర' లో హరిశ్చంద్రుడుగా, 'చింతామణి'లో బిల్వ మంగళుడుగా, 'రామాంజనేయ యుద్ధంలో రాముడుగా,

## నాటకరంగ ప్రముఖులు



శ్రీ చాట్ల శ్రీరాములు



శ్రీ టి.జె. రామనాథం



శ్రీ జె. సిద్ధప్పనాయుడు



శ్రీ సి.హెచ్. నాంచారయ్య

'గయోపాఖ్యానం' లో కృష్ణుడుగా వందలాది ప్రదర్శనల్లో పాల్గొని ప్రశంసలందుకున్నారు 'బొబ్బిలి యుద్ధం' వంటి చారిత్రక నాటకాలలోను 'తెనుగుతల్లి' 'చైర్మన్' వంటి సాంఘిక నాటకాలలోను భూమికాధారణ చేసి రసజ్ఞుల మెప్పు పొందారు

1990 సం॥లో 'మహతీ కళా ప్రవంతి' ని స్థాపించి, ఎన్నో నాటకాలను, నాటక సప్తాహాలను నిర్వహించారు 1994 నుంచీ రాష్ట్ర స్థాయి పద్య నాటక పోటీలు నిర్వహిస్తున్నారు రంగస్థల సౌకర్యాలు. వనరులు లేని సుదూర ప్రాంతాల నాటక సమాజాలకు కూడా పరిషత్ పోటీలలో అవకాశం కల్పించి, ఆయా కళాకారులను ప్రోత్సహించడం మహతీ కళా ప్రవంతి ప్రత్యేకత

నాలుగు దశాబ్దాలుగా నాటక రంగానికి ఎనలేని సేవచేస్తున్న నాంచారయ్యగారిని, రాష్ట్రంలో నలుమూలలవున్న నాటక సంస్థలు ఘనంగా సన్మానించాయి బండారు రామారావు కళా స్రవంతి, (హైదరాబాద్), ఆంధ్ర మహాసభ (ముంబాయి) కళా రాజ్యం (హైదరాబాద్) శ్రీకృష్ణ దేవరాయ కళాసమితి, మైసూరు (తమిళనాడు) సాహితీ మిత్రులు (మచిలీపట్నం) నాంచారయ్యగారిని సన్మానించిన సంస్థలలో కొన్ని 'గాన కళానిధి' 'మధురగాన నట ప్రవీణ' వంటి బిరుదులుకూడా నాంచారయ్యగారిని వరించాయి తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తూనే, నాటక కళకు అకుంఠిత సేవచేస్తున్న శ్రీ నాంచారయ్యగారు బహుధా శ్లాఘనీయులు

## శ్రీ చాట్ల శ్రీరాములు

నాటక రంగంలో నూతన ప్రయోగాలకు మారుపేరు శ్రీ చాట్ల శ్రీరాములుగారు తాను చేపట్టే ప్రతి నాటకంలోనూ ఏదో ప్రత్యేకత ఉండాలన్న తపనే వీరిని విలక్షణ దర్శకునిగా, ప్రయోక్తగా 'ట్రెండ్ సెట్టర్' గా (ఒక వరవడికి ఆద్యుడుగా) మార్చింది చాట్ల శ్రీరాములు గారికి రాష్ట్ర స్థాయిలోనే కాదు, జాతీయ స్థాయిలో గుర్తింపు ఉంది ఇది ఏదో అలవోకగా, గాలివాటంగా వచ్చిపడిన 'విండ్ ఫాల్

వెల్తే కాదు నాలుగున్నర దశాబ్దాల అవిశ్రాంత కృషి ఫలితమే ఆ గుర్తింపు, కీర్తి ప్రతిష్ఠలున్నూ, ఎంతగొప్పనటుడికైనా శాస్త్రీయ దృక్పధమూ, సైద్ధాంతిక నేపథ్యమూ ఉన్నపుడే అతని విద్యకు పరిపూర్ణత్వం సిద్ధిస్తుందని భావిస్తారు శ్రీరాములుగారు కళాకారుడికి తనపనిపట్ల అంకిత భావమూ, శ్రద్ధ, పట్టుదల, ఓర్పు - అన్నిటికి మించి నిరంతర కృషి ఉన్నప్పుడే అతడు ఉన్నత శిఖరాలను అధిరోహించగలడని చాట్లగారి విశ్వాసం తాను నమ్మిన సిద్ధాంతాలను ఆచరణలో పెట్టి సత్ఫలితాలను సాధించారు కనుకనే శ్రీరాములుగారి మాటలు అవశ్యం ఆచరణీయాలవుతున్నాయి

చాట్ల శ్రీరాములుగారు 1931 డిసెంబర్ 5వ తేదీన జన్మించారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో యమ్ ఏ చదివారు 1970 సం॥లో లండన్‌లో బ్రిటీష్ డ్రామాలీగ్‌లో శిక్షణ పొంది సర్టిఫికేట్ కోర్సులో ఉత్తీర్ణులయ్యారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నాటక విభాగంలో దర్శకులుగానూ, ఉస్మానియా విశ్వవిద్యాలయ రంగస్థలకళల శాఖలో దర్శకులుగానూ, హెడ్‌గానూ పనిచేశారు సరోజినీ నాయుడు స్కూల్ ఆఫ్ పెర్ఫార్మింగ్ ఆర్ట్స్, ఫైన్ ఆర్ట్స్ అండ్ కమ్యూనికేషన్, యూనివర్శిటీ ఆఫ్ హైదరాబాద్ విజిటింగ్ ఫేకల్టీ సభ్యులుగా పనిచేశారు ఆంధ్ర ప్రదేశ్ సాంస్కృతిక మండలి సభ్యులు ఆంధ్ర ప్రదేశ్ నాటక అకాడమీ సభ్యులుగాను, ఆంధ్ర, ఉస్మానియా యూనివర్శిటీల బోర్డ్ సంఘ సభ్యులుగాను, టి వి నంది అవార్డ్ కమిటీ (1992) సభ్యులుగాను వ్యవహరించారు నట శిక్షణాచార్యులుగా 17 సంవత్సరాలుగా, తమ సేవలను అందిస్తూ వందలాది ఔత్సాహిక నటులకు శిక్షణ యిచ్చి మార్గదర్శకులయ్యారు హైదరాబాద్‌లో మధు ఫిల్మ్ అండ్ టి వి ఇన్‌స్టిట్యూట్ నట శిక్షణాలయానికి కొన్ని సంవత్సరాలు ప్రిన్సిపాల్‌గా పనిచేశారు

శ్రీరాములుగారు 1950 సం॥లో డా॥ కొర్రపాటి గంగాధరరావుగారి నాటకాలలో వేషం వేసింది మొదలు యిప్పటి వరకు విభిన్న ఇతివృత్తాలుగల నూరు నాటకాలలో పాత్రధారణ చేయడమేగాక వాటికి దర్శకత్వం కూడా వహించి నాటక రంగంలో వెలుగు రేఖలు ప్రసరింపజేశారు యన్ ఆర్ నందిగారి 'మరో

మొహెంజొదారో' ప్రదర్శనలో వినూత్న ప్రయోగాలు చేసి నాటక రంగంలో సంచలనం సృష్టించారు ఈ నాటకం ఆంధ్రప్రదేశ్‌లోనే కాకుండా ఉత్తర దేశంలో కూడా కళాకారులను ఆకట్టుకొంది తత్ఫలితంగా 'మరో మొహెంజొదారో' అనేక భారతీయ భాషల్లోకి అనువాదం పొంది విశేష ప్రాచుర్యం పొందింది 'ఆంటిగని' 'రాజా ఈడిపస్' వంటి గ్రీకు నాటకాలను తెలుగు రంగస్థలంపై ప్రదర్శింపజేసి ప్రజలమన్ననకు పాత్రులయ్యారు శ్రీ చాట్ల యండమూరి వారి 'నిశ్శబ్దం నీకూ నాకూ మధ్య' డి ప్రభాకర్‌గారి 'లావొక్కింతయు లేదు' గొల్లపూడి వారి 'లావాలో ఎర్ర గులాబీ' వంటి నాటకాలను కొత్త పోకడలతో రంగస్థలంమీద స్వీయ దర్శకత్వంతో చేసిన ఘనత చాట్లగారికే దక్కింది

ఆంధ్ర నాటక కళాపరిషత్తులో ఉత్తమనటుడుగా రెండుసార్లు బహుమతినందుకున్నారు ఎన్నో కళా సంస్థలు శ్రీరాములుగారిని సన్మానించాయి ప్రభుత్వపరంగా కూడా అవార్డులు అందుకున్నారు మద్రాసు కళాసాగర్‌చే ప్రతిష్ఠాత్మకమైన 'ఉత్తమ దర్శకుడు' అవార్డు 1972-75, 1978-81 సంవత్సరాలకు లభించటం గర్వకారణమైన విషయం

నాటక రంగంలో దర్శకుడుగా అనుపమానమైన సేవలు అందించినందుకు ఆంధ్ర ప్రదేశ్ నాటక అకాడమీ వారిచే 1982లో శ్రీరాములుగారికి అవార్డుతోపాటు 'కళా ప్రవీణ' బిరుదు కూడా లభించింది అంతే కాదు వంశీ గురజాడ స్వర్ణపతకం, గరిక పాటి రాజారావు స్మారక నాటక రత్న అవార్డు, తెలుగు యూనివర్శిటీ పురస్కారం, మద్రాసు తెలుగు అకాడమీవారి ఉగాది పురస్కారం కూడా లభించాయి

చలన చిత్రాలలో కూడా శ్రీరాములుగారు నటించారు సుడిగుండాలు, స్వప్న, సంగీత, న్యాయం కావాలి, విక్రమ్, అగ్నిపుత్రుడు మొదలైనవి పేర్కొనదగినవి శ్రీయుతులు నాగార్జున అక్కినేని, వెంకటేష్, దాసరి అరుణకుమార్, కుమారి గౌతమి మొదలయిన చలన చిత్ర నటీనటులకు నటశిక్షణ యిచ్చిన ప్రథమ గురువు చాట్ల శ్రీరాములుగారే! శ్రీచాట్ల ఇంగ్లాండ్, ఫ్రాన్స్, ఎఫ్ డి ఆర్., జి డి ఆర్,

హాలెండ్, జెకోస్లోవేకియా, స్విట్జర్లాండ్ పర్యటించి అక్కడి నాటక రంగ పరిస్థితులను అధ్యయనంచేసిన అనుభవం, పరిజ్ఞానం తెలుగు నాటక రంగాన్ని వెలుగుబాటలో నడిపించడానికి వీలు కల్పించింది

శ్రీచాట్ల శ్రీరాములుగారి కళాసేవను గుర్తించి కేంద్ర ప్రభుత్వ సాంస్కృతికశాఖ 1998లో 'ఎమెరిటస్ ఫెలోషిప్'తో సత్కరించడం నాటక కళాభిమానులందరికీ ఆనందాన్ని, సంతృప్తినీ కలిగించింది. వీరికి ఇలాంటివి యింకా ఎన్నో, మరెన్నో రావాలని కళారంగం ఆశిస్తోంది

## శ్రీ టి.ఆర్.అడబాల

నివాసం హైదరాబాద్ రూపశిల్పిగా ప్రసిద్ధులు ఎండిపోయిన చెట్టుని సహితం తన కరస్పర్శతో పచ్చగా మార్చగల మంత్రశక్తి వీరిలో ఉంది నలభై ఏళ్ళకు పైగా మేకప్ ఆర్టిస్టుగా నాటక సమాజాల ఆదరణను, ప్రేక్షకుల అభిమానాన్ని దోచుకున్న స్నేహశీలి రైల్వేలో పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు హాస్య చతురులు ఎప్పుడూ తన చుట్టూ వున్న కళాకారులకు, స్నేహితులకు నవ్వుల పంటపండిస్తూ, తాను నవ్వుతూ అందర్నీ నవ్విస్తూ వుంటారు అడబాల అజాత శత్రువు అనటంలో అతిశయోక్తి ఏమీలేదు

అడబాలగారికి ఆహార్యంలోని మెళుకువలు కరతలామలకం రూపశిల్పాన్ని గురించి సాధికారంగా మాట్లాడగల సత్తా వీరిలో ఉంది శ్రీ అడబాల ఉస్మానియా థియేటర్ ఆర్ట్స్‌లోను, తెలుగు విశ్వవిద్యాలయం రంగస్థల కళల విభాగంలోను, కేంద్రీయ విశ్వవిద్యాలయ నాటక విభాగంలోనూ 'మేకప్'కు సంబంధించిన తరగతులకు 'విజిటింగ్ లెక్చరర్' గా వ్యవహరిస్తున్నారు వీరు ఇటీవల రూపక శిల్పంమీద ప్రామాణిక గ్రంథం రాశారు అది తెలుగు విశ్వవిద్యాలయం వారిచే త్వరలోనే వెలుగు చూడబోతోంది 'ఆహార్యం' మీద తెలుగులో పుస్తకాలు లేని కొరత అడబాలగారి పుస్తకం తీర్చగలదని ఆశించవచ్చు

## శ్రీ శిఖరం సాంబశివరావు

నివాసం హైదరాబాద్ ఆంధ్ర ప్రదేశ్ సచివాలయ రెవిన్యూ శాఖలో సెక్షన్ ఆఫీసర్‌గా పనిచేస్తున్నారు గత రెండు దశాబ్దాలుగా శిఖరం సాంబశివరావుగారు నటుడుగా, దర్శకుడుగా, ప్రయోక్తగా నాటక రంగానికి యితోధికంగా సేవలు అందిస్తున్నారు నాటకాన్ని 'రొటీన్ టైపులో' కాక విలక్షణ రీతిలో అందించాలనే లక్ష్యంతో అవసరానికి మించిన శ్రద్ధాసక్తులు చూపుతూ మంచి 'టీమ్‌వర్క్' తో ప్రదర్శింపజేస్తారు సరిసమానమైన ముఖ్యపాత్రో లేదా దానికి సరిసమానమైన ముఖ్య పాత్రో ధరించాలన్న నియమం లేదు ఎంత చిన్న పాత్రనైనా సహజంగా, ఔచిత్యం చెడకుండా చక్కగా పోషించాలన్న ధ్యేయంతోనే ముందుకు సాగుతారు రిహార్సెల్స్ జరిపేటప్పుడు కూడా సమయపాలన, క్రమశిక్షణ పాటిస్తారు తాను ఆచరిస్తూ యితరుల నుండి కూడా అదే క్రమశిక్షణను ఆశిస్తారు కనుక నాటకాన్ని జనరంజకంగా తీర్చిదిద్దగలుగుతున్నారు శ్రీ శిఖరం సాంబశివరావుగారు సచివాలయ సాంస్కృతిక సంఘం తరపున 'అలెగ్జాండర్' 'పల్నాటియుద్ధం' 'బొబ్బిలియుద్ధం' వంటి చారిత్రక నాటకాలను 'సంధ్యా-ఛాయ' వంటి సాంఘిక నాటకాలను 30 దాకా స్వీయ దర్శకత్వంతో ప్రదర్శింపజేశారు. పాత నాటకాలను కాక, కొత్తగా నాటకాలను రచయిత చేత రాయించి దానికి మెరుగులుదిద్ది జనరంజకంగా ప్రదర్శింపజేసే సాంబశివరావు వంటి కళోపాసకుల సేవలు నేటి ఔత్సాహికరంగానికి ఎంతో అవసరం

## శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు

నివాసం · హైదరాబాద్ బ్యాంకులో పనిచేసి 1996లో ఉద్యోగ విరమణ చేశారు వీరు "శ్రీకృష్ణ రాయబారం" లో విరివిగా కృష్ణపాత్ర ధరించడమూ, బ్యాంక్‌లో పనిచేస్తుండడము వలన వీరిని జంట నగరాలలో కళాకారులు 'బ్యాంక్ కృష్ణుడు' అని కూడా పిలుస్తుంటారు.

శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావు గారు సంప్రదాయ నాటకాభిమాని గత

నాలుగు దశాబ్దాలుగా పౌరాణిక నాటకాలను అసంఖ్యాకంగా ప్రదర్శించారు శ్రీకృష్ణ రాయబారము, తులాభారం, చింతామణి, భక్తతుకారాం, రామదాసు, హరిశ్చంద్ర, ద్రౌపదీ వస్త్రాపహరణం, వసంతసేన మొదలైన నాటకాలలో వీరు ప్రముఖ పాత్రలు నిర్వహించి ప్రజామోదం పొందారు సి యస్ ఆర్ కళామందిరం, విజ్ఞాన దీపిక అనే రెండు కళా సంస్థలకు వీరే రధ సారధులు సి.యస్ ఆర్ కళామందిరం తరపున ప్రతి ఏటా నాటక సప్తాహం నిర్వహించి సామాజికులకు సంప్రదాయ నాటక సౌరభంతో విందు చేస్తున్నారు నిష్ణాతులైన కళాకారులకు, సన్మానాలు చేసి ప్రోత్సహిస్తున్నారు సంప్రదాయ నాటకాలను పునరుద్ధరించే కార్యక్రమాన్ని చేపట్టి వ్యయ ప్రయాసలకోర్చి ముందుకు సాగిపోతున్న కళాయోధుడు, 'నట సారధి' శ్రీ అయ్యదేవర పురుషోత్తమరావుగారు.

## డా॥ కె. వెంకటాచారి

స్వయంగా నటులు, నాటక రచయిత కూడా ప్రస్తుత నివాసం హైదరాబాదు. శ్రీరామభద్ర జూనియర్ కాలేజిలో ఆంధ్రోపన్యాసకులు "కాళ్లకూరి నారాయణరావు రచనలు" అనే అంశంమీద పరిశోధన చేసి సిద్ధాంత వ్యాసం సమర్పించి ఉస్మానియా విశ్వవిద్యాలయం ద్వారా డాక్టరేట్ పట్టా పొందారు కాళ్లకూరి నారాయణరావు రచనల మీద వెలువడిన గ్రంధాలలో వెంకటాచారిగారిదే ప్రామాణిక గ్రంధం అని చెప్పవచ్చు

డా॥ వెంకటాచారి ఉస్మానియా విశ్వవిద్యాలయ నాటక విభాగంలో శిక్షణపొంది డిప్లొమో కూడా తీసుకున్నారు

'సంప్రదాయ నాటక స్రవంతి' అన్న పేరుతో 1977లో ఒక గ్రంధం రచించారు ఇది త్వరలోనే పుస్తక రూపంలో పాఠకుల కరకమలాలను అలంకరించబోతుంది

డా॥ వెంకటాచారి గారు పౌరాణిక నాటకాలలో విరివిగా పాల్గొన్నారు శ్రీకృష్ణరాయబారం, చింతామణి, తులాభారం, ద్రౌపదీ వస్త్రాపహరణం, పద్మవ్యూహం, వరవిక్రయం మొదలైన నాటకాలలో దుర్యోధనుడు,

భవానీశంకరుడు, నారదుడు, కర్ణుడు, సింగరాజు లింగరాజు మొదలైన పాత్రలలో పేరు తెచ్చుకున్నారు ఇప్పటికీ వందకుపైగా నాటక ప్రదర్శనల్లో పాల్గొని తన నటనా వైదుష్యంతో రసజ్ఞుల ఆదరాభిమానాలను చూరగొన్నారు

## శ్రీ దేవరకొండ సుబ్రహ్మణ్యం

1946 ఏప్రిల్ 7వ తేదీన శ్రీ దేవర కొండ సుబ్రహ్మణ్యం విశాఖపట్టణంలో జన్మించారు విశాఖపట్నంలోనే యం ఏ వరకూ విద్యాభ్యాసం చేశారు

1975 సం॥ నుంచీ నాటక రంగంతో సన్నిహిత సంబంధం ఏర్పడింది అప్పట్నుంచీ నేటివరకూ నాటకం ఒక వ్యసనంలా సుబ్రహ్మణ్యంగారిని పెనవేసుకుంది ఉద్యోగరీత్యా ఢిల్లీకి వెళ్లినా నాటకం ఆయనతోనే ప్రయాణం కట్టింది

న్యూఢిల్లీలో దక్షిణ భారత నటీనట సమాఖ్య కార్యదర్శిగా నాలుగేళ్లున్నారు తెలుగు నాటకానికి రాజధానిలో ఒక వేదికను కల్పించాలని తహతహలాడేవారు 'సంధ్యా-ఛాయ' నాటకాన్ని 'చరిత్ర' 'రుద్రవీణ' నాటికలను స్వీయ దర్శకత్వంలో న్యూఢిల్లీలో ప్రదర్శింపజేసి తెలుగువారిని, ఢిల్లీవాసులను కూడా ఆకర్షించారు ఢిల్లీలో మూడుసార్లు నాటకోత్సవాలు నిర్వహించడం, ఢిల్లీ సాంస్కృతిక చరిత్రలో ఒక మరపురాని ఘట్టంగా మిగిలిపోయింది ఢిల్లీలోను విశాఖపట్టణంలోను జరిపిన నాటక సదస్సులో శ్రీ సుబ్రహ్మణ్యంగారు క్రియాశీలక పాత్ర నిర్వహించారు తెలుగు నాటక రంగానికి భారత రాజధాని నగరం నుంచీ చేయూతనందిస్తున్న ప్రముఖుల్లో శ్రీ సుబ్రహ్మణ్యంగారు అగ్రగామి

హిందీలోను, మరాఠీలోను రంగస్థలంపై ప్రాచుర్యం పొందిన నాటకాలను తెలుగు ఔత్సాహిక సమాజాల దృష్టికి తెచ్చి ఆ నాటకాలను తెలుగు ప్రాంతానికి పరిచయం చేస్తున్న వారిలో సుబ్రహ్మణ్యంగారే ప్రథములు

తెలుగులో వీధి నాటకం ఆవిర్భవించడానికి ఆధారభూతమైన 'ఊరేగింపు' (రచన శ్రీమతి అత్తిలి పద్మావతి కృష్ణ) నాటికను, 'సంధ్యా-ఛాయ' నాటికను

అత్తిలి కృష్ణారావుగారి దృష్టికి తెచ్చి పరోక్షంగా వీధి నాటక ప్రాచుర్యానికి తోడ్పడినవారు సుబ్రహ్మణ్యంగారు కావడం తెలుగువారు మరచిపోలేని విషయం

## శ్రీ డి.వి. శేషయ్య

శ్రీ దేగా వెంకట శేషయ్యగారి స్వస్థలం వెంకటగిరి హైస్కూల్లో ఉపాధ్యాయుడుగా పనిచేసి ఉద్యోగ విరమణ చేసి నెల్లూరు జిల్లా గూడూరులో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు

శ్రీ శేషయ్యగారి జీవితాన్ని మూడు దశలుగా విభజిస్తే, స్వాతంత్ర్య సమరయోధుడుగా, సాంఘిక సేవాపరాయణుగా సమాజానికి సేవలు అందించిన దశ మొదటిది జీవిక కోసం అధ్యాపక వృత్తి స్వీకరించి గురువుగా తన బాధ్యతలను నిర్వహించటం రెండవ దశకాగా, కళారాధకుడుగా నాటక రంగానికి సేవ చేసిన దశ మూడవది

విద్యార్థిగా ఉండగానే తెల్లదొరల పెత్తనంమీద తిరుగుబాటు తత్వం అలవడింది తోటి విద్యార్థుల్ని కూడగట్టుకుని పాఠశాల భవనంపై కాంగ్రెస్ జెండా ఎగుర వెయ్యడంవంటి సాహస కృత్యాలు చేసి విద్యాధికారుల దండనకు గురి అయ్యాడు అయినా మొక్కవోని గుండె ధైర్యంతో తాను చెయ్యదలచుకొన్న పని చెయ్యనిదే నిద్రపోని మనస్తత్వం శేషయ్యది తన చర్యలవల్ల వెంకటగిరి రాజావారి ఆగ్రహానికి గురి అయిన సందర్భాలుకూడా లేకపోలేదు గ్రంథాలయాలు అంతగా లేని ఆ రోజుల్లో వెంకటగిరిలో ఓ చిన్న గ్రంథాలయం ప్రజల సహకారంతో ఏర్పరచి బెజవాడ గోపాలరెడ్డిగారిచే ప్రారంభోత్సవం చేయించిన సంఘహితైషి శ్రీ శేషయ్య. కొన్నాళ్లకు వామపక్ష భావాలకు ఆకర్షితుడై కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా పనిచేశారు కమ్యూనిస్టు పార్టీపై ఆంక్షలున్న ఆ రోజుల్లో, పార్టీ కార్యక్రమాలను అతి రహస్యంగా, చాకచక్యంగా నిర్వహించేవారు

స్వాతంత్ర్యానంతరం రాజకీయ జీవితానికి స్వస్తిచెప్పి, టీచర్ ట్రైనింగ్ పాసై, ఉపాధ్యాయుడుగా స్థిరపడ్డారు తాను ఏ గ్రామంలో పనిచేసినా, అది మారుమూల

గ్రామమై విద్యా గంధం లేనిదిగా ఉంటే, అలాంటి గ్రామంలో గ్రామస్థులను సమీకరించి వయోజన విద్యకు ప్రోత్సాహన్నిచ్చేవారు గ్రామస్థుల శ్రమదానంతో, సహకారంతో గ్రంథాలయం స్థాపించేవారు వెంకటగిరి,కందుకూరు, కట్టవపల్లిలలో వీరు స్థాపించిన గ్రంథాలయాలే వీరి కృషికి ప్రత్యక్ష నిదర్శనాలు

1950లో ఉపాధ్యాయుడుగా గూడూరు పట్టణానికి వచ్చి చేరిన తర్వాత శేషయ్యగార్ని సాంస్కృతిక రంగం బాగా ఆకర్షించింది శ్రీయుతులు ఆవుల శ్రీనివాసరావు, గండవరం సుబ్బరామిరెడ్డి, సిద్ధారెడ్డి జనార్ధనరెడ్డి, అల్లూరు రంగారెడ్డి, సి హెచ్ కృష్ణమూర్తిగార్లు స్థాపించిన 'సాహిత్య సమ్మేళనం' సంస్థలో చేరి దాని అభివృద్ధికి ఎంతగానో పాటుపడ్డారు 1954 సం॥ సాహిత్య సమ్మేళనం 'సంస్కృతీ సమ్మేళనం' గా రూపుదాల్చింది రాష్ట్ర స్థాయిలో నాటక పోటీలు నిర్వహించటం మొదలైంది అప్పటినుండి నేటివరకు ఆ సంస్థ నాటక పోటిలు పెద్ద ఎత్తున నిర్వహిస్తున్న విషయం రాష్ట్రంలో కళాకారులందరికీ విదితమే

డి వి శేషయ్యగారు సంస్కృతీ సమ్మేళనానికి మూలస్తంభమై నిలిచారు సంస్కృతీ సమ్మేళనం అంటే డి వి శేషయ్య, డి వి శేషయ్య అంటే సంస్కృతీ సమ్మేళనం అన్నంతగా తాదాత్మ్యం చెందారు

శేషయ్యగారి అకుంఠిత కళా సేవలను గుర్తించి అనేక కళా సంస్థలు వారిని ఘనంగా సన్మానించాయి మద్రాసు కళాసాగర్, వెంకటగిరి నటీనట సమాఖ్య, గూడూరు లయన్స్ క్లబ్, సంస్కృతీ సమ్మేళనం శేషయ్యగారిని సన్మానించిన సంస్థలలో ప్రధానమైనవి

శ్రీ డి వి శేషయ్యవంటి నిస్వార్థ కళారాధకులు మన రాష్ట్రంలో చాలా అరుదుగా కనిపిస్తారు. కళా రంగం శేషయ్యగారికి తీర్చలేనంతగా ఋణపడి ఉంది

## శ్రీ జ్యోతుల నెహ్రూ

ప్రజల మనిషి నిస్వార్థ సేవా పరాయణుడు, సకల కళా జగన్మిత్రుడు శ్రీ జ్యోతుల వెంకట అప్పారావు 1951లో తూ గో జిల్లా ఇర్రిపాకలో శ్రీ నాగేశ్వరరావు,

శ్రీమతి సుబ్బాయమ్మ దంపతులకు జన్మించిన శ్రీ నెహ్రూ, రాజానగరం హైస్కూలులో విద్యాభ్యాసం చేశారు చిన్ననాటి నుంచీ సంఘసేవా కార్యక్రమాలపట్ల ఆసక్తి చూపేవారు నిత్యం ప్రజా సమస్యల పరిష్కారానికి కృషి చేసే సంఘ శ్రేయోభిలాషిగా ప్రజల ఆదరాభిమానాలను దోచుకున్న మానవతావాది 1944లో జగ్గంపేట నియోజక వర్గ ఎం ఎల్ ఏ, గా అత్యధిక మెజారిటీతో ఎన్నికయ్యారు

కళలపట్ల విశేష ప్రేమానురాగాలతో జ్యోతుల కళాపరిషత్ 1995 సం॥లో స్థాపించి నేటివరకు మహోన్నతంగా నాటక పోటీలు నిర్వహిస్తూ నాటక కళను ప్రోత్సహిస్తున్న కళాపోషకులు శ్రీ నెహ్రూ ఇర్రిపాకలో 3 లక్షల వ్యయంతో అరు బయలు రంగస్థలాన్ని నిర్మించడం ఆయనలోని కళాభినివేశానికి తార్కాణం ఇదివరలో "పగటి వేషాలు" శిక్షణ శిబిరాన్ని ప్రోత్సహించిన శ్రీ నెహ్రూ, త్వరలో ఇర్రిపాకలో నట శిక్షణాలయంని కూడా నిర్వహించాలని సంకల్పించి, ఒక శాశ్వత భవనాన్నికూడా నిర్మిస్తుండటం ముదావహం. శ్రీ నెహ్రూవంటి కళాపోషకులే ఈ రాష్ట్రానికి దేశానికి, వన్నె తేగల సమర్థులని, వారి మూర్తిమత్వాన్ని కళాజగతి ఎంతగానో కీర్తిస్తున్నది

## శ్రీ దేశిరాజు హనుమంతరావు

నివాసం హైదరాబాద్ వ్యవసాయ శాఖలో పనిచేసి స్వచ్ఛంద ఉద్యోగ విరమణచేసి ప్రస్తుతం విశ్రాంతిగా కాలం గడుపుతున్నారు

డెబ్బయి, ఎనభై దశకాలలో "దేశిరాజ ప్రభంజనం" తెలుగు నాటక రంగంలో అలజడి రేపింది అంతవరకు ప్రేక్షకులకు అలవాటుపడిన నాటకాలకు పూర్తిగా భిన్నంగా ఉన్న ప్రదర్శనలు కావడమే ఆ సంచలనానికి కారణం ఒక సెట్టుమీదకి బలవంతంగా పాత్రలను ఈడ్చుకొచ్చి నాటకాన్ని నడిపించడానికి అలవాటుపడిన నాటక రచయితలకు, దర్శకులకు దేశిరాజు హనుమంతరావుగారి నాటకాలు కొత్త కోణాన్ని చూపించాయి సన్నివేశాలను ఒక సెట్టుమీదికి కుదించుకునే

# నాటకరంగ ప్రముఖులు



శ్రీ దేశిరాజు హనుమంతరావు



శ్రీ దండా గోపి (చిలకలూరిపేట)



శ్రీ గూడూరు విశ్వనాథం



శ్రీ సుబ్రహ్మణ్యం (ఢిల్లీ)

అసహజ నాటక విధానానికి విముక్తి లభించి, రాజ మార్గం ఏర్పడింది రంగస్థలం రచయితల, దర్శకులపాలిటి ప్రియదర్శిని అయింది స్టేజిమీద ఎన్ని దృశ్యాలైనా (వెన్యూస్) అయినా చూపొచ్చు అరడజన్ నటులతో అరవై పాత్రలైనా పోషించవచ్చు అనే ధీమా కలిగింది దీనికి దేశిరాజు హనుమంతరావుగారి దర్శకత్వంలోని నాటక, నాటికలే దారి చూపాయి యండమూరి వారి 'కుక్క', 'రుద్రవీణ' నాటికలు, శ్రీ దేశిరాజు ప్రదర్శనలో రూపొందించిన తీరు ప్రేక్షకులను ఎంతగానో ఆకట్టుకొంది మనుషులొస్తున్నారు జాగ్రత్త, ఆకలవ్యుడు, ప్రపంచ తంత్రం, తుగ్లక్, సంభవామి యుగేయుగే, పాలిట్రిక్స్ వంటి నాటక నాటికలు హనుమంతరావుగారి చేతిలో కొత్త అందాలు దిద్దుకొని, ఔత్సాహిక కళాకారుల ప్రయత్నాలకు ఆదర్శప్రాయంగా నిలిచాయి ఆ విధంగా హనుమంతరావుగారు "ట్రెండ్ సెట్టర్" అయ్యారు ఒక విధంగా చెప్పాలంటే యండమూరి వీరేంద్రనాధ్‌గారిని నాటక రచయితగా వెలుగులోకి తెచ్చిన ఘనత దేశిరాజుగారికే దక్కుతుంది ఎన్నో వినూత్న ప్రయోగాలు చేసి తెలుగు రంగస్థలి స్థాయి పెంచి, నాటక రంగాన్ని సుసంపన్నం చేసిన శ్రీ దేశిరాజు హనుమంతరావుగారి దర్శకత్వపు ప్రతిభా ముద్రలు కళా రంగంలో శాశ్వతంగా నిలిచి ప్రకాశిస్తూ, భావితరాలకు మార్గం చూపుతూ వుంటాయని నిస్సందేహంగా చెప్పవచ్చు

# అథో జ్ఞాపికలు

## ఒకటవ ప్రకరణం : తెలుగు నాటకం -పుట్టుపూర్వోత్తరాలు

1 డా దివాకర్ల వెంకటావధాని, ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, పుట 163

2 డా పి వి. ఆచార్, ఆంధ్రలో నాటకం – నాటక రంగం, పుట 58-59

## రెండవ ప్రకరణం : వస్తు వైవిధ్యం

1 బ్రిటీష్ ప్రభుత్వంచే నిషేధించబడిన మొదటి తెలుగు నాటకం 'రోషనార' కాగా, రెండవ నాటకం కోలా చలం శ్రీనివాసరావు గారి 'విజయనగర పతనం'

2 డా మిక్కిలినేని రాధా కృష్ణమూర్తి, ఆత్రేయ నాటకాల్లో సమకాలీన సమస్యలు (వ్యాసం) పుట 22 (ఆచార్య ఆత్రేయ తెలుగు నాటక రంగం, తెలుగు విశ్వవిద్యాలయ ప్రచురణ) 1986

3 శ్రీ జలదంకి సుధాకర్, గాలిగోపురం (నాటిక) పుట 130 (యువకళా వాహిని నాటిక పోటీల సంపుటి) 1995

4 పైదే – పుట 147

5 పైదే – పుట 148

6 శ్రీ సంజీవదేవ్, సత్యం – శివం – సుందరం (నాటికకు ముందుమాట) పుట IV

7 శ్రీ గోళ్ళపాటి నాగేశ్వరరావు, సరస్వతీ నమస్తుభ్యం, పుట 135 (యువ కళా వాహిని పోటీ నాటికల సంపుటి) 1995

8, 9 శ్రీ శ్రీకంఠ హనుమంతరావు, ధర్మాగ్రహం, పుట 2,6 (యువ కళా వాహిని పోటీ నాటికల సంపుటి), 1995

10 శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు, సాలెగూడు నాటికల సంపుటి, పుటలు 75, 76 (కా గా కౌ ప్రచురణలు, రాజమండ్రి) 1995

11 పైదే- పుట 69

12 శ్రీ పి టి మాధవ్, నల్ల కోటు నవ్వింది, యువ కళా వాహిని పోటీ నాటికల సంపుటి, 1995

13 పైదే

14 శ్రీ ఆది విష్ణు, సుందరి-సుబ్బారావు నాటికకు వ్రాసిన అభిప్రాయం, బాబు నాటికలు, అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ

15 శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి, దగ్లింప్సెస్ ఆఫ్ తెలుగు డ్రామా, పుట 88, నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్-27, 1995

16 శ్రీ బాల గంగాధర్ తిలక్, సాలెగూడు (నాటిక) పుట 16 (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ) 1980

## మూడవ ప్రకరణం : కుటుంబ వ్యవస్థ

1 ఆచార్య మొదలి నాగభూషణ శర్మ, లోచన (రంగస్థల వ్యాస సంకలనం) పుట 71

## నాలుగవ ప్రకరణం: స్త్రీ వాదం

1 కాత్యాయనీ విద్మహే, పితృస్వామ్య మాయాజాలంపై సమరం (వ్యాసం) ఇండియాటుడే వార్షిక సంచిక (1995) పుట 6

2 శ్రీ కందుకూరి వీరేశలింగం స్వీయచరిత్రము (నాలుగో ప్రకరణం) పుట 184 (విజ్ఞాన చంద్రిక గ్రంధమాల, చింతాద్రి పేట) 1911

3 అదే - పుట 204

4 శ్రీ యండమూరి సత్యనారాయణరావు, ఉషఃకిరణాలు, పుట 257 (ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ) 1960

5 శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి, ఆంధ్ర రచయితలు (ప్రథమభాగం) పుట 88

6 శ్రీ యన్ ఎస్. మూర్తి, ఇనపతెరలు (నాటకానికి పీఠిక) పుట 8

7 శ్రీ ఆకెళ్ళ, అమ్మ (నాటిక) పుటలు 170, 172, యువ కళావాహిని నాటిక పోటీల సంపుటి, 1995

8 శ్రీ మారెళ్ళ, ఏడవకండేడవకండి (నాటిక) పుట 44, శ్రీరామ బుక్ డిపో, విజయవాడ-2, 1987

9 శ్రీ మారెళ్ళ, శమీవహ్ని (నాటిక) పుట 51

10 పైదే - పుట 52

11 డా ముదిగంటి సుజాతారెడ్డి, చారిత్రక సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర, పుటలు 401-402

12 శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, స్త్రీవాద కవిత్వం - ఒక పరిశీలన (వ్యాసం)

13 శ్రీ పి వి రాజమన్నార్, ఏమి మగవాళ్ళు (నాటిక) పుట 16

14 శ్రీ పి వి రాజమన్నార్, ప్రసిద్ధ నాటికలు, పుట 41

15 నవీన్, చలం నేటికీ అవసరమే (వ్యాసం) పుట 20 (ఇండియాటుడే వార్షిక సాహిత్య సంచిక) 1995

16 శ్రీ ఏ భాస్కరచంద్ర, హిమాగ్ని (నాటిక) అక్కినేని నాగేశ్వరరావు పోటీ నాటికల సంపుటి, పుట 382

17 పైదే - పుట 392

18, 19 పైదే - పుట 399

20 శ్రీ యస్ కె ఆంజనేయులు, రాధికా స్వాంతము (నాటిక) ఆంధ్రజ్యోతి దీపావళి సంచిక 1987

21 పైదే - పుట 25

22 పైదే - పుట 30

23 పైదే - పుట 40

24 శ్రీ ఎస్ ఏ రావు, హరిత (నాటిక) పుట 303, యువకళా వాహిని నాటికల సంపుటి, 1995

25 పైదే - పుట 306

26 పైదే - పుట 314

27 పైదే - పుట 314

28 పైదే - పుట 314

29 శ్రీ ఏ భాస్కరచంద్ర, కొయ్యగుర్రం (నాటిక) పుట 272, అప్పాజోస్యుల విష్ణుభొట్ల ఫౌండేషన్ (యు ఎస్ ఏ) నాటికల సంకలనం, 1997

30 పైదే - పుట 287

31 పైదే - పుట 288

## ఐదవ ప్రకరణం - దళిత వాదం

1 డా ముదిగంటి సుజాతారెడ్డి, దళిత వాదం, తెలుగు సాహిత్య చరిత్ర, పుట 414

2 శ్రీ జి లక్ష్మీనరసయ్య, కదం తొక్కుతున్న కింది కులాల కవిత్వం (వ్యాసం) పుట 3, బహుజన సమాజ్ పత్రిక, సెప్టెంబరు-అక్టోబర్, 1996

3 పైదే - పుట 3

4 డా ముదిగంటి సుజాతారెడ్డి, చారిత్రక సామాజిక నేపథ్యంలో తెలుగు సాహిత్య చరిత్ర, పుటలు 414-415

5 శ్రీ జి లక్ష్మీనరసయ్య, శివమెత్తిన శంభూకుని శిరస్సు (వ్యాసం) పుట 14

(ఇండియాటుడే సాహిత్య సంచిక) 1995

6 డా బోయి భీమన్న, రాగవాసిష్ఠం (నాటకం - ప్రస్తావన) సంస్కృతీ సంవర్ధన సమితి, మల్లేపల్లి, హైదరాబాద్, 1959

7 శ్రీ ఆవుల సాంబశివరావు, త్రిపురనేని రామస్వామి ఎ హెరాల్డ్ ఆఫ్ ఫిలాసాఫికల్ రినైజాన్స్, పుట 179, తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్, 1989

8 శ్రీ జి లక్ష్మీనరసయ్య, శివమెత్తిన శంభూకుని శిరస్సు (వ్యాసం) పుట 18 (ఇండియాటుడే వార్షిక సాహిత్య సంచిక) 1995

9 శ్రీ యిక్కుర్తి నరసింహారావు, పిడికిలి (నాటిక) పుటలు 21, 22, 38 (మిత్ర సమితి, ప్రక్కిలంక, కొవ్వూరు తా॥, ప గో జిల్లా) 1979

10 శ్రీ సి యస్ రావు, ఊరుమ్మడి బతుకులు (నాటిక) పుట1 (ఆదర్శ గ్రంథమండలి - విజయవాడ-2) 1981 (మూడవ ముద్రణ)

11 డా మొదలి నాగభూషణ శర్మ, నీలిదీపాలు (నాటకానికి పీఠిక) అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ, 1984

## ఆరవ ప్రకరణం - విదేశీ ప్రభావం

1 డా పోణంగి శ్రీరామ అప్పారావు "ధర్మవరం రామకృష్ణమాచార్యులు" పుటలు 16-17 (సాహిత్య అకాడమీ, రవీంద్ర భవన్, 35 ఫిరోజ్‌షా రోడ్, న్యూఢిల్లీ) 1989

2 పైదే - పుట 18

3 పైదే - పుట 77

4 శ్రీ చాట్ల శ్రీరాములు "తెలుగు నాటకరంగంపై పాశ్చాత్య నాటక రంగ ప్రభావం' ' (వ్యాసం) పరుచూరి రఘుబాబు స్మారక ప్రత్యేక సంచిక, 1995

5 పైదే

6 శ్రీ గండవరం సుబ్బరామిరెడ్డి, ఆధునిక తెలుగు నాటకం, (రెండవ సంపుటం) పుట 244, ప్రవీణ్ పబ్లికేషన్స్ బౌద్ధనగర్, సికిందరాబాద్) 1991

7 డా కందిమళ్ల సాంబశివరావు, తెలుగు నాటక రంగం - నూతన ధోరణులు, ప్రయోగాలు, పుట 219 (విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్) 1995

8 డా పి వి రమణ, పాశ్చాత్య సాంఘిక నాటకం-ప్రభావం, పుట 204, (డా పి వి రమణ, బయ్యారం-500721, ఖమ్మం జిల్లా) 1993

9 గండవరం సుబ్బరామిరెడ్డి, ఆధునిక తెలుగు నాటకం (రెండవభాగం) పుట 249 (ప్రవీణ్ పబ్లికేషన్స్, బౌద్ధనగర్, సికిందరాబాద్-61) 1991

## ఏడవ ప్రకరణం

1 డా. మొదలి నాగభూషణ శర్మ, లోచన (రంగస్థల వ్యాస సంకలనం) పుట 35

2 పైదే

3 శ్రీ చాట్ల శ్రీరాములు, నూరేళ్ళ తెలుగు నాటకం (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాద్) 1980

4 శ్రీ రాచకొండ విశ్వనాధశాస్త్రి, నటరాజు కుప్పిలి వెంకటేశ్వరరావు సంస్మరణ సంచిక (బహురూప నటసమాఖ్య, విశాఖపట్నం) 1989

5 డా మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి - అదే సంచిక

6 శ్రీ కె యస్ టి సాయి, కుప్పిలి వెంకటేశ్వరరావు సంస్మరణ సంచిక

7 కాశీ విశ్వనాథ్ (కుప్పిలి వెంకటేశ్వరరావు సంస్మరణ సంచిక)

8 ఆచార్య గంగిశెట్టి లక్ష్మీనారాయణ "నాటక రచన-ప్రాయోగిక రంగస్థలి" (వ్యాసం), సాక్షి - తెలుగు నాటక రంగం, పుట 178

9 శ్రీ చాట్ల శ్రీరాములు, పరుచూరి రఘుబాబు స్మారక సంచిక, 1995

10. డా మొదలి నాగభూషణ శర్మ, లోచన (రంగస్థల వ్యాస సంకలనం) పుట 39

11. శ్రీ డి యస్ ఎన్ మూర్తి, సాక్షి-తెలుగు నాటకరంగం, పుట 86

12 శ్రీ గంటి సోమయాజి, యక్షగానములు (తంజావూరు) సంపుటము 3 పుట 3 (ప్రచురణ ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, 1957)

13 శ్రీ డి యస్ ఎన్ మూర్తి, సాక్షి-తెలుగు నాటకరంగం (వ్యాస సంకలనం) పుట 84

14 శ్రీ చాట్ల శ్రీరాములు, పరుచూరి రఘుబాబు స్మారక ప్రత్యేక సంచిక, 1995

15 శ్రీ చాట్ల శ్రీరాములు - అదే సంచిక

16 శ్రీ చాట్ల శ్రీరాములు - అదే సంచిక

17 డా యమ్ ఎన్ శర్మ, లోచన, పుట 39

18 డా కందిమళ్ళ సాంబశివరావు, తెలుగు నాటకరంగం - నూతన ధోరణులు, ప్రయోగాలు - పుట 245

## ఎనిమిదవ ప్రకరణం

1 యక్షగానాల ప్రాశస్త్యాన్ని ఎరిగినన మాన్యులు డా కట్టమంచి రామలింగారెడ్డి గారు (అప్పటి ఆంధ్ర విశ్వకళా పరిషత్ ఉపాధ్యక్షులు) లేఖకులను నియమించి తంజావూరి లైబ్రరీనుంచి తాళపత్ర గ్రంథాలకు పర్యంతములు వ్రాయించి తెప్పించారు 1938లో పని ప్రారంభమైంది డా వాసిరెడ్డి శ్రీ కృష్ణ ఉపాధ్యక్షులుగా ఉండగా 'యక్షగానాల' ను విశ్వవిద్యాలయం తరపున ఆరు సంపుటాలుగా ప్రచురించారు పరిష్కర్త విద్వాన్ గంటి సోమయాజిగారు

2 శ్రీ నటరాజ రామకృష్ణ, తూర్పు భాగవతము (వ్యాసం), నాట్యకళ (సెప్టెంబర్, 1973)

3 డా పి యస్ ఆర్ అప్పారావు, నాట్య శాస్త్రము, పుట 528

4 డా మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, జానపద కళారూపాలు, పుట 181

5 డా నటరాజ రామకృష్ణ, తూర్పుభాగవతము (వ్యాసం) నాట్యకళ, సెప్టెంబర్, 1973

6. శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, వీథినాటకం ఒక అవగాహన (వ్యాసం) యంగ్మెన్స్

ప్లాటినమ్ జూబిలీ ప్రత్యేక సంచిక, 1992

7 సఫ్దర్ హష్మీ, ది రైట్ టు పెర్ఫార్మ్, సహమత్, ఢిల్లీ, 1989, పుట 13

8 శ్రీ అద్దేపల్లి, వీథినాటకం ఒక అవగాహన (ది యంగ్‌మెన్స్ హ్యాపీక్లబ్, కాకినాడ - ప్లాటినమ్ జూబిలీ, ప్రత్యేక సంచిక, 1992)

9 శ్రీ అత్తిలి కృష్ణారావు, యుగసంధ్య (నాటిక) పుట 44

10 డా కందిమళ్ళ సాంబశివరావు, తెలుగు నాటకరంగం -నూతన ధోరణులు - ప్రయోగాలు, పుట 263

11 శ్రీ తనికెళ్ళ భరణి, గోగ్రహణం

## తొమ్మిదవ ప్రకరణం

1 డా యమ్ ఎన్ శర్మ - రాజా ఈడిపస్

నాటకానికి వ్రాసిన ముందుమాట, పుట 12

2 డా కందిమళ్ళ సాంబశివరావు, తెలుగు నాటకరంగం - నూతన ధోరణులు, ప్రయోగాలు, పుట 132

3 శ్రీ రమణానంద్, 'ఆంధ్ర నాటక కళా పరిషత్తు' (వ్యాసం) నాట్యకళ సంచిక (డిసెంబర్, 1980) పుట 72

4 పైదే - పుట 73

5 శ్రీ కప్పగంతుల మల్లికార్జునరావు (నాటక సమీక్ష) పుట 132

## ఉపసంహారం

1 డా పి వి రమణ, నూరేళ్ళ తెలుగు నాటక రంగం, పుట 44

2 శ్రీ డి రామలింగం, సాహిత్యోపన్యాసములు, పుట 37 (ఆంధ్ర సాహిత్య అకాడమీ) 1977

# ముఖ్యపద సూచిక (INDEX)

